

# సమదర్శిని

1929 శుక్ల సంవత్సరాది సంచిక 1930

# మార్షల్ ఆవిరీ యంత్రములు.

## మదరాసులోని స్టాకునుండి సరఫరా చేయబడును.




### మార్షల్ "లంకషైరు" (ఆవిరి) స్టీము బాయిలరు

ఇప్పుడు లభ్యపడగల వానిలోకెల్ల మా ఆవిరి యంత్రములున్ను, బాయిలర్లును మిక్కిలి నమ్మకమైనవిన్ని తృప్తిని గలిగించునవి అయియున్నవి. హిందూదేశములోని అన్ని ప్రాంతములయందును మిక్కిలి విరివిగా ఉపయోగింపబడుచున్నవి. వాని ఉత్కృష్టతలనుగురించి విచారించి తెలిసికొనుట మీకు మిక్కిలి లాభకరము.






మార్షల్ "కే. సీ." తరగతి కాంపౌండు యంత్రము

## మార్షల్ సన్సు అండ్ కంపెనీ, (ఇండియా) లిమిటెడ్.,

—ఇంజనీయర్లు—

నెం. 9 సెకండు లైన్ బీచ్, మదరాసు.

బ్రాంచి ఆఫీసు:—బెజవాడ.

మ్యానేజింగు ఏజంట్లు:—మార్షల్స్ (డైరెక్టర్స్) లిమిటెడ్.

# సమదర్శిని

## రెండవ ఉగాది సంచిక

శుక్ల సంవత్సరము



కీర్తిశేషులైన

శ్రీ రాజా సర్. పానుగంటి రామారాయణము ఎం. ఏ., కే. సి. ఐ. ఈ., వారి

దివ్యస్మరణార్థము ప్రచురము చేయబడినది.

ఇందు

పలువురు ఆంధ్రవిద్వన్మహాజనులచే వ్రాయఁబడిన
మత, సాంఘిక, రాజకీయ, సారస్వతాది నానావిషయిక వ్యాసములును,
ప్రకృతి చిత్రములయొక్కయు, దేశనాయకులయొక్కయు,
ప్రముఖులయొక్కయు చిత్రపటములును గలవు.




మదరాసు.

పత్రికాధిపతి:

శ్రీయుత పింజల సుబ్రహ్మణ్యము శెట్టిగారి

స్వకీయ "సమదర్శిని" ముద్రణాలయమునందు ముద్రింపఁబడి
ప్రకటింపఁబడినది.

| చందాదారులకు | | ఇతరులకు |
|---|---|---|
| వెల రు. 1—0—0 లు. | 1929 – 1930 | వెల రు 1—4—0 లు. |
| పోస్టుఖర్చులు 0-5-0 | | పోస్టుఖర్చులు 0-5-0 |

# విషయసూచిక

---

C. W. V Sharma

# ప్రస్తావన

శ్రీమన్మహాదేవుని యనంతలీలావిలాసమైన విశ్వప్రవృత్తియందు విభవసంవత్సరము గడచి శుక్లవర్షము ప్రవేశించినది. అనంతకాల చక్రగతమైన యీయేటి వృత్తాంతము మానవనాగరకతాభివృద్ధి కెట్లుపకరించినదియు, సింహావలోకన మొనర్చుట ప్రకరణశుద్ధి కాకపోదు.

**ప్రపంచ వీక్షణము.** భూగోళము 30,00,00,00,000 ఏండ్లకు పూర్వమున సృష్టింపబడియుండునని శాస్త్రజ్ఞు లూహించు చున్నారు. సూర్యమండలమునకు మనము కొంచెమించుమించు 9,20,00,000 మైళ్లదూరములోనున్నట్లు తెలియుచున్నది. భూగోళవిస్తీర్ణము 19,05,50,000 చదరపుమైళ్లు. అందు 5,55,00,000 చదరపుమయిళ్లు భూభాగము క్రిందను, 1,40 50,000 చదరపుమయిళ్లు జలభాగముక్రిందను, విభజింపబడియున్నది. భూగోళమునందు బ్రిటిషుసామ్రాజ్యము 1,42,20,000 చతురపుమయిళ్లు విస్తరించియున్నది. అందు భారతవర్ష విస్తీర్ణము 1,80,33,23 చతురపుమయిళ్లు. ఈ భూలోకమందు 1,84,95,00,000 జను లున్నారు. అందు 45,00,94,300 ప్రజలు బ్రిటిషుసామ్రాజ్యమునకును 31,86,42,480 మంది జనులు భరతఖండమునకు జెందియున్నట్టుల లెక్కల వలన విశదపడుచున్నది. భారతీయ విజ్ఞానమును శాస్త్రములరూపమున శ్రబోదిరొునర్చిన మన మహర్షులు జ్యోతిశ్శాస్త్రముద్వారా సకల గ్రహములందును జీవజంతువులు నివసించియుండినట్టుల నిర్ణయించిన మహాసత్యము నేడు పాశ్చాత్యపండితులు నవీన పరిశోధనల మూలమున కుజగోళమునుగూర్చి యొనర్చుచున్న అన్వేషణమందు స్థిరపడిన మన విజ్ఞానముయొక్క పూర్వప్రతిభ యెల్లవారికిని శిరఃకంపమును గూర్చు చున్నది. వాయువార్తలద్వారమున కుజగోళవాసులతో సందేశములనంపుటకు చేయబడుచున్న ప్రయత్నములు చేరువలోనే ఫలోన్ముఖమునకు రాగల వనునాశ యెల్లరి కుదయించుచు మానవనాగరకతాభివృద్ధి యెంతటి శీఘ్రగమనముతో బ్రయాణము చేయుచుండినదియు ప్రతివారికిని స్పష్టముగా రూపింపజేయుచున్నది. శాస్త్ర పరిశోధనయం దింకను మాటలాడుబొమ్మలు మున్నగు నెన్నోయద్భుతముల పాశ్చాత్యపండితులు కనిపెట్టి పామరలోకము నద్భుతసంభ్రమములతో ముంచివేయు చున్నారు.

**ప్రపంచ ప్రవృత్తి.** ఇక రాజ్యాంగవిషయములకు మరలిన ప్రపంచపరిస్థితులు పరమ విషాదమును గలిగించుచున్నవి. పడమటిదేశము లందలి సామ్రాజ్యతత్వవాదు లొనర్చుచున్న రాజకీయార్భాటముల గమనించువారికి చేరువలోనె మరియొక గొప్ప ప్రపంచయుద్ధ మేర్పడకమానదను భీతావహ ముదయింపజేయు చున్నది. అమెరికను సంయుక్త రాష్ట్రముల సభాపతిగనుండిన డాక్టరు విల్సను మహాశయుడు ప్రతిపాదించిన చతుర్దశ మగు పదునాలుగు మహాసూత్రములును నాగరికజాతులచే దుక్కాకాగితముల బుట్టలలోనికి ద్రోయబడి యే దేశమున కాదేశము అన్యదేశముల గబళించుటకు సమరసన్నాహము లొనర్చుచుండుట బహిరంగముగనే గన్పించుచున్నది. ఈ విషమపరిస్థితుల నెదుర్కొనుటకు ప్రపంచరాజ్యములందు మహారాజ్యముగానున్న బ్రిటీషుసామ్రాజ్యమును అపారమైన ద్రవ్యమును సైనిక వ్యయముక్రింద వెచ్చించు చున్నది. గనుక కెల్లాగు ఒడంబడిక నిరర్థకమై శ్మశానవైరాగ్యముగ బరిణమించినను పరోపకారపారాయణు డైన హెర్బర్టుహూవరుగా రమెరికాఖండ సంయుక్తరాష్ట్రముల కధ్యక్షునిగ నెన్నుకొనబడుటచే అమెరికాఖండమునందును ప్రపంచమందు నీయన కృషివలన శాంతిసౌఖ్యములు స్థాపింపబడవచ్చు నను కొండొక ఆశ యుదయించుచున్నది.

**రష్యా వ్యవహారములు.** నిరంకుశవర్తను లగు పరిపాలకుల కృపాణదండనమునుండి ప్రజా సామాన్యమును, ధనికుల దురాశనుండి పేదలును విముక్తినొందుటకు టాల్‌స్టాయిగారును, లెనిన్, ట్రాట్‌స్కీ నాయకులును రష్యా యందు సమిష్టివాద సిద్ధాంతము ననుసరించి సోవియట్టు పరిపాలనమును నెలకొల్పినారు. కొంచెము నిదానముగ యోచించిన ప్రపంచమునుసామ్రాజ్యవాదుల దురాకాంక్షనుండి తప్పించి సంగ్రామ సన్నాహముల రూపుమాపుటకె యీ బోల్షివిక్కు ఉద్యమ మవతరించినట్టుల తలంపవచ్చును. ఐన నది యేమిపాపమోగాని సంగ్రామముల నశింపజేయుటకు స్థాపింపబడిన సోవియట్టు ప్రభుత్వము వారె- కంచెయే చేనుమేసె నన్నసామెతనుబోలి - సంగ్రామ ప్రయత్నముల గావించుచుండుట పరమవిషాదమును కలిగించుచున్నది. రష్యాపరివర్తనము ప్రపంచసృష్టి నాకర్షించుచున్నను విలయరూపమున చిరకాలము నిలువజాల దనుటకు ఇటలీదేశమందు ఫాసిస్టురూపమున ముస్సోలినీగారు వ్యాపింపజేయుచున్న పరివర్తనమే ప్రబల నిదర్శనముగ నున్నది. సోవియట్టు ప్రయోగానుభవములు మర్త్యలోకమును స్వర్గలోకముగ మార్చివేయునను దుర్భ్రమ నిపుడు చాలవరకు నివారించుట శుభసూచనగ దలంపబడవలసియున్నది.

**చీనా సంరంభము.** మానవులకు సర్వావస్థలయందును సమానస్థితి సాధ్యము కాకపోయినను సమానానంద మనుభవించుట సాధ్యము కాదనునంశము చీనా పరివర్తనమునందు స్పష్టపడినది. ప్రపంచవ్యాప్తమయిన స్వాతంత్ర్యాభిలాష ప్రాగ్దేశములందును యెట్లు తలయెత్తుచున్నదియు కీ॥ శే॥ డాక్టరు సన్‌యెటుసేను గారి బోధలవలన విశదపడినది.

**అఫ్ఘనస్థాన కల్లోలము.** ప్రపంచప్రవృత్తి ఆసియాఖండమునందు మరొకవిధముగ నడువజాలదు కద. గనుకనే యిక్కడి వ్యవహారములును శాశ్వతశాంతిస్థాపనవైపునకె మొగ్గరమును జూపుచుండినను ప్రకృతపు వ్యవహారములు మరియొకమార్గమునుబట్టి సాగుచుండె ననుటకు అఫ్ఘను స్థాన కల్లోల మొకనిదర్శనముగ నున్నది. నియ డీదినములయందు సతీసమేతుడై యూరపు ఖండమునం దంతటను పర్యటనమునల్పి రెండవ పీటరువంటివాడని పొగడ్తొందిన అమానుల్లా నేడు రాజ్యచ్యుతిని బొంది నిలువ నీడలేక యల్లాడుచుండుట ఐహికభోగముల యస్థిరత్వమును సూచన చేయుచున్నది. నీళ్లకావిళ్ల మోయువాని కుమారుడు హబీబుల్లా బచ్చాసాకో సంఘసంస్కరణ విముఖులును బూర్వాచార హటవాదులు నైన ముల్లాలయండ బలమున నాఫ్ఘను రారాజుగ బ్రకటించుకొనుటకు యీశ్వరశక్తియె కారణముగ దలంపబడవలసియున్నను మేజరు లారెన్సు మొదలగు గుప్తచారులు పన్నినతంత్రములు బ్రిటీషుప్రతిష్టకు భంగమును కలిగించుచున్నవి. అఫ్ఘనుస్థానము తూర్పుప్రాంతపు రెండవబెల్జియముగ మారి ప్రపంచ సంక్షోభమునకు గారణము కాకుండ త్వరలోనె యీదేశమందు మరల స్థిరమైనప్రభుత్వ మేర్పడుగాక యని శాంతి ప్రియులెల్ల గభిలషించు చున్నారు.

**గ్రేటు బ్రిటను.** కాని గ్రేటుబ్రిటను వ్యవహారముల పరిశీలించిన ఆంగ్ల రాజనీతిజ్ఞులు ప్రపంచశాంతిని రక్షించుటకంటెను స్వీయ సామ్రాజ్యమును పెంపొందించుటకె యెక్కుడు తహతహలజూపుచున్నారనుటకు వలయునన్ని నిదర్శనములు గానవచ్చుచున్నవి. ప్రపంచ జీవనలక్ష్య మిహలోక భోగభాగ్యములుగనే దలంపబడినంతకాల మేదేశమునందుగూడ నిజమైన శాంతి సౌఖ్యము లేర్పడజాలవు. గనుకనే దక్షిణఆఫ్రికా మున్నగు వలసరాజ్యములు నింగ్లాండుతో సమాన ప్రపత్తిని వాంఛించి ఆందోళన సల్పుచున్నవి. సాధారణయెన్నిక లతిసమీపమున జరుగనుండుటచేతను, నిరుద్యోగ సమస్య మూలముగను యింగ్లాండులో కూడ నంతశ్శాంతి గోచరింప కున్నది.

**ఇంగ్లండు పక్షములు,** ప్రకృతపు టోరీమంత్రాంగము నోడించి లిబరలుపక్షమువారి ప్రతిష్టను బునరుద్ధరింప లాయడు జార్జిగారు విశ్వప్రయత్నముల నొనర్చుచున్నారు. రామ్సే మేక్డోనాల్డుగారి నాయకత్వముక్రింద లేబరుపక్షమువారును భూమ్యాకాశముల నేకము చేయుచున్నారు. ఏపక్షమువారు మంత్రాంగమును స్వాధీన మొనర్చుకొందురో సులభముగ నూహించుటకు సాధ్యపడకపోయినను ముఖ్యమంత్రి బాల్డ్విను గారుమాత్రము మరల తమపక్షమే ప్రభుత్వమును స్వీకరించగలదను దృఢవిశ్వాసముతో బనిచేయుచున్నారు. భారత దేశాభివృద్ధిని లక్ష్యమునం దిడుకొని యోచించిన నాంగ్లదేశమునం దేరాజకీయపక్ష మధికారమునకు వచ్చినను హైందవులకు కలుగ గల లాభనష్టములు సమానమే యను నంశమునెమను కమీషను నియామకమువలననే స్పష్టపడినది. ఈ కమీషను యేర్పాటు

ను కన్సర్వేటివులును, లిబరలులును, లేబరులను చేతుల గలిపియుండుట మా చదువరు లెఱుంగుదురు.

**సైమను కమీషను.**

సైమను కమీషనువారి కింగ్లాండునందును సర్వజనామోదము గాన రాకున్నది. ఇండిపెండెంటు లేబరుపక్షమువా రీ విచారణసంఘమువారిని తీవ్రముగ నిరసించు చున్నారు. బ్రిటీషు కమ్యూనిస్టు పార్టీవారు మీరటు కుట్రకేసునం దొకముద్దాయిగ నుండిన షౌకత్ ఉస్మానీ గారిని సైమనుగారికి పోటీగా పార్లమెంటు యెన్నికలను నిలువ బెట్టినారు. మొత్తమున కింగ్లండు యిండియాలలో నెంత తీవ్రతర ప్రతిఘటన మేర్పడినను యిండియన్ స్టాట్యూటరీ కమీషనువారు మాత్రము కేంద్రసంఘముయొక్కయు, రాష్ట్రీయ సంఘములయొక్కయు తోడ్పాటులో నిక్కడి సాత్యమును పరిశీలించినారు. వీరి నివేదిక ఆన 1930 సం॥రము జనవరినెలలో బ్రచురింపబడునని ప్రకటింపబడుచున్నది. సుప్రసిద్ధులైన గా॥ సర్. శంకరన్నాయరుగారి నాయకత్వముక్రింద కేంద్రశాసన సభోపసంఘమువారు లండనునగరములో తమ నివేదికను దయారుచేయు చున్నారు. సర్. పాత్రోగారి యాజమాన్యమున మదరాసుశాసనసభోపసంఘవారు భారతవర్షమునకు రాష్ట్రీయ బాధ్యతను బ్రసాదించితీరవలయునని సైమను సంఘమువారికి బ్రతపరిచినట్లు వార్తలు తెలుపుచు చేయుచున్నవి. బర్మా రాష్ట్రమును హిందూదేశమునుండి వేరుపరచఁగునని ఆ రాష్ట్రీయ చట్టసభోపసంఘమువారు కమీషనువారికి విజ్ఞాపన మొనర్చునట్లు బ్రచురింపబడిన గాలివార్త నిజమగుచో నీ రెండు దేశముల సఖ్యము నభిలషించువారి కాశాభంగము కలుగక మానదు. జాయింటు పార్లమెంటరీ కమిటీవారి విచారణ ముగిసి క్రొత్తచట్టము శాసనరూపమును దాల్చుటకు ఆన 1931 సం॥రము అంత్యభాగమువరకు సాగవచ్చునని అంచనా వేయబడుచున్నది. ప్రత్యేక ప్రాతినిధ్యము నెత్తివేయించ బ్రాహ్మణసంఘాభిమాను లొనర్చు కపట తంత్రములెంతవరకు ఫలోన్ముఖమునకు వచ్చునదియు నప్పుడుగాని స్పష్టపడజాలదు.

**బట్లరు సంఘము.**

స్వదేశ సంస్థానములకును, భారత ప్రభుత్వమునకు నుండవలసిన సంబంధముల విచారించుటకు నియమింపబడిన బట్లరుసంఘమువారి నివేదిక ప్రకటింపబడి అటు సంస్థానాధిపతులకును యిటు భారతప్రజలకు చాల నాశాభంగమును కలిగించుచున్నది. ఈ విషయమునుగూర్చి సంస్థానాధిపతు లికముం దెట్టిచర్య నవలంబించెదరో యిదమిత్థమని చెప్పుటకు వలనుపడకున్నది. కార్యనిర్వాహకసభాయుతుడగు రాజప్రతినిధిగాక యీ నివేదికప్రకార మికముందు సరాసరి రాజ ప్రతినిధియే సంస్థాన వ్యవహారముల పరిష్కరించునట్లు విచారణసంఘముఖమున సూచింపబడియుండుటచే భారతదేశ స్వాతంత్ర్య విషయమున నైగ్లండునకు సంస్థానముల నాల్ టరువలె నడ్డుగ నుంచుటకు సామ్రాజ్యాభిమాను లూహించినట్టుల స్పష్టపడుచున్నది.

**హిందూదేశ విషయములు.**

భావిసంస్కరణములగూర్చి యోచన సల్పుటకు సామ్రాజ్యప్రభుత్వమువారు మన రాజప్రతినిధి ఘనతవహించిన యిర్విను ప్రభువుగారిని యింగ్లాండున కాహ్వానించి యుండుటచే కొలది దినములలో శ్రీవారు లండనునగరమునకు బోనున్నారు. ప్రజారంజకుడనియు, సౌమ్యుడనియు బ్రసిద్ధిగాంచిన మదరాసు రాష్ట్రపుపాలకుడు ఘనతవహించిన ఘోషను ప్రభువుగా రాకాలమందు తాత్కాలికముగ రాజప్రతినిధిగ బని చూచునట్లును శ్రీసార్వభౌము లంగీకరించినారు. శ్రీ ఘోషను ప్రభువుగారి మదరాసుగవర్నరు ఉద్యోగకాలము మగియవచ్చుటచే నా స్థానమునకు డర్బీ ప్రభువుగారి కనిష్టసోదరులు కర్నలు జి. ఎఫ్. స్టాన్లీగారు నియమింపబడుటకును శ్రీ రాజచక్రవర్తిగా రంగీకరించుటయ గాక శ్రీవా రింగ్లాండునుండి యిక్కడికి దయచేసి యుద్యోగమును స్వీకరించు దనుక ప్రకృత కార్యనిర్వాహకసభా ప్రథమసభ్యులైన గా॥ సర్. నార్మన్ మార్షుబ్యాంక్సుగారు ఆక్టింగు గవర్నరుగ పని చూచునట్లు సత్తరువు దయచేయించినారు.

**శ్రీ జార్జి సార్వభౌముల పునరారోగ్యము.**

ఆదర్శ సామ్రాట్టని చెప్పదగిన శ్రీ జార్జిసార్వభౌములవారి కీమధ్య సంభవించిన వ్యాధిబాధ గ్రేటుబ్రిటనునందేగాక సామ్రాజ్యమునందలి యెల్ల భాగములందును ముఖ్యముగా రాజభక్తి తత్పరులైన భారతీయులయందు నమిత సంక్షోభమును కలిగించినది. కాని శ్రీవా రించుక బాధపడినను యీశ్వరానుగ్రహమువలన మరల వారికి ఆరోగ్యము కలుగుటచే భారతీయు లెల్ల పరమేశ్వరుని కనేక ధన్యవాదముల నర్పించు చున్నారు.

గడచిన సంగ్రామమునందు మిత్రమండలివారి సైన్యముల నడిపి విజయమునకు దోడ్పడిన జనరలు ఫోషు సేనానాయకుడు దివంగతుడగుట పరాసు జాతీయులకు మాత్రమేగాక యెల్లదేశములవారికిని తీరని విషాదమును గల్పించు చున్నది. పంజాబు సింహమని ప్రసిద్ధి వడసిన దేశబంధు లాలాలజపతిరాయిగా రకస్మాత్తుగ నసురులవీడుట భారతీయుల దౌర్భాగ్య మనవలయును. జాతీయ అంతర్జాతీయ రాజకీయ సమస్యల కూలంకషముగ నెరిగిన యీ ప్రతిభావంతుని మరణమువలన హిందూదేశము కోలుకోలేనంత నష్టమునకు బాల్పడినది. రాజప్రతినిధిగారి కార్యనిర్వాహక సభయందు న్యాయశాఖాసభ్యులుగ నుండిన ఎస్. ఆర్. దాసుగారి మరణమును, రామనాథపురము, చల్లపల్లి రాజాగార్ల మరణమును, యింకను తక్కుంగల దేశ ప్రముఖుల మరణమును ప్రజలకు ప్రబలతరవిషాదమును కల్పించియుండెననుట నిక్కవము.

**పానగల్లు రాజావారి నిర్యాణము.**

డాక్టరు నాయరు, సర్. త్యాగరాయశెట్టిగార్ల యనంతరమున బ్రాహ్మణేతరన్యాయ పక్షమువారి నాయకులుగ నెన్నుకొనబడి యీపక్షము నత్యంత ప్రతిభాసంపదతో నడపిన శ్రీ రాజా సర్. పానుగంటి రామారాయణముగారి ఆకస్మిక మరణ మీ రాష్ట్రముయొక్క సాముదాయికాభివృద్ధికిని, అశేష బ్రాహ్మణేతర ప్రజాభివృద్ధికిని తీరనినష్టమును గలిగించిన మాట వాస్తవమునకు దూరము కాదు. క్రొత్తసంస్కరణములతో దేశరాజ్యాంగము సంస్కరింపబడనున్న యీ సందిగ్ధసమయమందు వీర స్తమించుట బ్రాహ్మణేతరుల దురదృష్ట మనవలసి యున్నది.

**ప్రశ్న విషయములు.**

మైసూరు రాష్ట్రములోని బెంగళూరు మొదలైన చోటులందు జరిగిన సాంఘిక కల్లోలములు దేశాభిమానబుద్ధి గలవారి కించుక ఆయాసమును గలిగించు చుండినను బార్డోలీ సంరంభమందు సర్దారు వల్లభభాయి పటేలుగారు చూపిన నిగ్రహమును, అసంబ్లీకార్యాలయపు ప్రత్యేకత మొదలైన యంశములందు అసంబ్లీ అధ్యక్షులు గౌరవనీయ వి. జే. పటేలు సాహెబుగారు ప్రదర్శించిన చిత్తస్థయిర్యము నెల్లర యామోదమును బూరగొనుచున్నవి. వంగదేశ విభజనసమయమందు తలయెత్తిన విప్లవోద్యమము మరల క్రొత్తరూపమున బయలు దేరుచున్నట్లు అసంబ్లీయందును, మీరటులోను దొరకిన బాంబులయుదంతము విశదము చేయుచున్నది. ఇట్టి దౌర్జన్యకర వ్యవహారము లంతరించిననాని మనదేశమందు శాంతి సుస్థాపితము కాకపోయినను పరస్పర సోదరులుగ నుండవలసిన ప్రజలే రాజకీయ భేదము ననుసరించియో, మతభేదము ననుసరించియో తమలోదామె వివాదపడి దౌర్జన్యమార్గముల నవలంబించుటకంటెను విషాదకరవిషయమింకొకటి యుండదు.

**కలకత్తా దేశీయమహాసభ.**

ప్రభుత్వ ప్రతిపక్ష నాయకులును, సుప్రసిద్ధ స్వరాజ్య నాయకులునైన పండిత మోతీలాలు నెహ్రూమహాశయుల యధ్యక్షతక్రింద కలకత్తాదేశీయ మహాజనసభ చాల విజయవంతముగ జరగినది. నెహ్రూగా రీపదవికి రెండవమా రెన్నుకొనబడియుండుటచే ప్రజలకు వారిపట్ల గల గౌరవము వ్యక్తమగు చున్నది. వీరి కపూర్వ స్వాగత సత్కారముల నొనర్చి వంగీయులు తమ నాయకులగు దేశబంధు చిత్తరంజనదాసుగారి సహచరులైన నెహ్రూగారికి తా మొనర్పవలసిన గౌరవమును నెరవేర్చినారు. అఖిలపక్ష సభవారిచే నియమింపబడిన నెహ్రూసంఘమువారి రాజ్యాంగ స్వరూపముయొక్క చిత్తు ముసాయిదా నామోదించుట మూలమున కలకత్తాదేశీయ మహాజనసభ ప్రాముఖ్యమును బడయు చున్నది.

**నెహ్రూసంఘ నివేదికాంశములు.**

హిందూదేశమునకు కాలనీలబోలిన సామ్రాజ్యాంతర్గత అధినివేశ ప్రతిపత్తి యుండదగుననియు, సార్వజనిక నియోజనాస్వాతంత్ర్య ముండవలయుననియు, సామంతరాష్ట్రములగూడ భారతప్రభుత్వమందు కలుపవలయుననియు, ప్రత్యేక నియోజకగణము లెత్తివేయబడవలయుననియు, మహమ్మదీయులకు మాత్రము మరి కొంతకాలమువరకు శాసనసభలయందు స్థానములు ప్రత్యేకింపబడవచ్చుననియు నిందుసూచన చేయబడినది. ప్రత్యేక ప్రాతినిధ్యవిషయమున యీ నివేదికాంశములు మహమ్మదీయులను, సిక్కులను కలవరపరచినవి. సర్. మహమ్మదు షాఫీ, నవాబు కర్నల్, సర్. ఉమర్ హయత్ ఖాన్ బహద్దరు తివానాగార్లీ ప్రత్యేక ప్రాతినిధ్య విధాన మింతమాత్రము నెత్తివేయబడరాదని

వాదించుచున్నారు. ఘనతవహించిన ఆగాఖాన్‌గారు నిదే ధోరణిని నెహ్రూ నివేదికాంశముల ప్రతిఘటించుచున్నారు.

**మదరాసు రాజధాని కపటనాటకము.** పండిత జవహరులాలు నెహ్రూ, శ్రీయుత బాబూ సుభాషచంద్రబోసు, బులుసు సాంబమూర్తి ప్రభృతులతోబాటు సంపూర్ణస్వాతంత్ర్యమునకై అమధ్య సింహగర్జనముల వినిపించిన శ్రీమాన్ ఎస్. శ్రీనివాసయ్యంగారును, శ్రీయుత సత్యమూర్తిగారును మంత్రిపదవుల కిపుడాందోళనచేయుచు మద్రాసు రాజధాని కెల్ల కళంకము నాపాదింపజేయుచున్నారు. ఈరాష్ట్ర బ్రాహ్మణేతర మహాజనులందు తలమానిక మని చెప్పదగిన గౌ॥ రాజా సర్. అణ్ణామలై శెట్టిగారు రమారమి నలుబదిరైదులక్షలరూప్యముల దానముచేసి చిదంబరము మీనాక్షి సర్వకళాశాలను నిజనామధేయమున విశ్వకళాపరిషత్తుగ వెలయింపజేసి తమకును, నగరత్తారు సంఘమునకును, యీరాష్ట్రమునకు ననూన గౌరవమును సంపాదించి యుండు టీసందర్భమునందు స్మరింప దగియున్నది.

**ఆశాయుత భవిష్యత్తు.** రాష్ట్రీయబాధ్యత కీ రాష్ట్ర మెంతయు దగియున్నదని మన గవర్నరు ఘనతవహించిన ఘోషను ప్రభువుగారు నాయన ప్రభుత్వమువారును సైమను సంఘమువారికి సలహా నొసంగియున్న కారణమున నీరాష్ట్రమున కిక ముందాశాయుత భవిష్యత్తుండెనని యూహించు టత్యుక్తి కాజాలదు. ఇందులకు బ్రాహ్మణేతరపక్షమువారు గత పది సంవత్సరములనుండియు గావించిన లోకోత్తర ప్రజాసేవయే చాలవరకు కారణము.

బ్రాహ్మణేతర సంఘపక్షమున సైమను కమీషనువారి కర్పింపబడిన రాజ్యాంగసంస్కరణముల సూచన ఆచరణయుక్తమైన కోరికలతో సంతరింపబడి యున్నట్లుల మనీషులు ప్రశంసించుచున్నారు గాన చదువరుల యుపయోగార్థము దాని సారము నిట పొందుపరచుచున్నాము:—

(1) రాజధానీ ప్రభుత్వములు సంపూర్ణముగ బాధ్యతాయుతముగనుండవలెను. అన్నిశాఖలును మంత్రుల యధీనము చేయబడవలయును. కొన్ని యసందర్భములపట్ల గవర్నరులకు వీటో అధికార ముండవచ్చును.

(2) సెంట్రలు గవర్నమెంటు విషయములో సైన్యము నౌకాదళము, విదేశ వ్యవహారములు స్వదేశ సంస్థానములు మొదలగుశాఖలు తప్పతక్కిన శాఖలన్నియు మంత్రులపరముచేసి లెజస్లేటీవు అసంబ్లీకి బాధ్యత కలిగి యుండవలెను. సైన్యము మొదలగు శాఖలవిషయములో ద్వంద్వప్రభుత్వపు చిక్కులేకుండ చేయుటకు వానినిగూర్చిన చర్చ లెజస్లేటీవు అసంబ్లీకి లేకుండ జేయవలెను.

(3) కాని వాని విమర్శ కవకాశమిచ్చుటకై బడ్జెటు సమయమున కౌన్సిలు ఆఫ్ స్టేటుయొక్కయు సంస్థానాధిపతుల ఛేంబరుయొక్కయు జాయంటు సభయందు వానిని నివేదించవలెను. దేశముయొక్క సైనిక రక్షణము బ్రిటీషుయిండి యా ప్రజలకే కాక సంస్థానములకుగూడ ముఖ్యమగుటచే నీ యుభయుల జాయంటు సభయందును చర్చించుట యుపయుక్తము.

(4) సైనిక వ్యయమును నిర్ణయించుట కొక కమీషనును నిర్ణయించవలయును. వారు మొదటి పదిసంవత్సరములలో సైన్యమున కెంతవ్యయము అవసరమో వివరముగ బరిశీలించి నిశ్చయించవలెను.

(5) ఇట్లు నిర్ణయింపబడిన సైనిక వ్యయము పోను మిగిలిన ఆదాయమునంతనెట్లు వినియోగింపవలసినదియు నిర్ణయించు అధికారము అసంబ్లీ కుండవలయును. అవసర సందర్భములలో వీనిపై నధికారము వైస్రాయిగారి కుండవచ్చును.

(6) మహమ్మదీయులకు, దేశీయ క్రైస్తవులకు, జమీందారులకు, వర్తక సంఘములకు గల ప్రత్యేక ప్రాతినిధ్యమును నిలిపియుంచవలెను. మహమ్మదీయులు తమకు బ్రత్యేకప్రాతినిధ్య మవసరము లేదని అంగీకరించునంత వరకు వారికి బ్రత్యేక ప్రాతినిధ్యమును తొలగింపరాదు. కాన 1916 లో లక్నో ఒడంబడిక ప్రకారము వారికి నిర్ణయమైన సీట్లవంతును మార్పజనదు.

(7) నిమ్నజాతుల విషయములో నిప్పుడున్న నామినేషను పద్ధతిని తొలగించి వారంతట వా రెన్నుకొనుపద్ధతి నేర్పాటుచేయవలెను. వారు ప్రస్తుతము సరాసరి యెన్నుకొను స్వాతంత్ర్యమును నిర్వహింపజాలరు. కాబట్టి లేబరు సంఘములవలె నిమ్నజాతులును ప్రత్యేక సంఘముల నెలకొల్పుకొనిన యెడల గవర్నమెంటు వానిని నియోజకవర్గములుగ నంగీకరించి వాని ద్వారా యెన్నుకొనునట్లు చేయుట యుపయుక్తము. శాసనసభ్యస్థానములు నూటికి 10 చొప్పున హీనజాతులకు బ్రత్యేకించి యుంచవలెను.

(8) వైనాటిదాటిన ప్రతిస్త్రీకిని, ప్రతి పురుషునకు ఓటు హక్కుండుట న్యాయమైనను ఆ పద్ధతిని వెంటనే ఆచరణలో బెట్టుట కష్టసాధ్యము. దాని నాదర్శముగనుంచి దానిని జేరుటకు క్రమాగతమైన నిర్ణయములను జేయుచుండవలెను. నియోజకస్థానముల నింకను జిన్నవిగజేసి ఓటర్లకును వారి ప్రతినిధికిని యెక్కువ సంసర్గముండునట్లు చేయవలెను, సింగిల్ కాన్స్టిట్యూయన్సీలనగా ఏబదివేలజనసంఖ్య మించిన ప్రతి మ్యునిసిపాలిటీకిని ఒక్కొక్క ప్రతినిధి నెన్నుకొను హక్కు నియ్యవలెను.

(9) రాజధానీ శాసనసభలయందు మెంబర్లసంఖ్యను 200 వరకు హెచ్చించవలెను.

(10) శాసనసభల యెన్నికలు అయిదుసంవత్సరముల కొకమారు జరగుచుండవలెను.

(11) రాజధానీ ప్రభుత్వములో ఏడుగురు మంత్రు లుండవలెను.

ఈ నివేదికను బలపరచుచు బ్రాహ్మణేతర సంఘపక్షమున మదరాసు కార్పొరేషన్ అధ్యక్షులు శ్రీమాన్ ఏ. రామస్వామిమొదలియారు మిక్కిలి గంభీరముగ సైమనుసంఘమువారిమ్రోల సాక్ష్యము నొసంగి యీ రాజధానియొక్కయు, అన్యరాష్ట్రములయొక్కయు బ్రాహ్మణేతర మహాజనుల యమోఘాశీస్సుల నందుకొనుచున్నారు.

**బ్రాహ్మణేతర గోద్యమము.** శ్రీ పానగల్లు రాజావారు కాలధర్మము నొందినతరువాత కొంతకాలము నుండియు నీ పక్షమునుండి విడువడియున్న శాస్త్రీయపక్షవాదులను, మంత్రిపక్షము వారిని యిందు చేర్చువిషయమున దీని కార్యనిర్వాహక సభాపతి యైన శ్రీయుత పి. టి. రాజన్‌గారు శక్తివంచనలేని కృషి యొనర్చి కొంతవరకు సఫలీకృత మనోరథు లయినారు. నాయక నిర్ణయమును, బ్రాహ్మణులగూడ యీ పక్షమువారి శాసనసభా కక్షియందు జేర్చుకొనువిషయము యిత్యాదులు రాగల బ్రాహ్మణేతర మహాసభాపరిష్కారమునకు వదలివేయబడినవి. సదరు సభను జూలయి మాసమునందు జరిగించుటకు శ్రీ వేంకటగిరి కుమారరాజా సాహెబువారు నెల్లూరున కాహ్వానించి యున్నారు.

**ఆంధ్రదేశము: వివిధవిషయములు.** మహామాన్యులగు శ్రీనివాసశాస్త్రిగారి యనంతరమున దక్షిణ ఆఫ్రికా యేజంటు జనరలుగ సర్. కూర్మా వేంకటరెడ్డినాయడుగారు నియమింపబడుట ఆంధ్ర ప్రతిభను విస్తరింపజేయుచున్నను విశ్వవిద్యాలయ కేంద్రస్థానమున తెలుగువారు విశాల దేశాభిమానమును మరచి ప్రత్యేక మాండలికాభిమానమునె ప్రధానముగ పరస్పరము కలహించుట సంతాపకరముగ నున్నది. బాలనాయకమును బహు నాయకము నాంధ్రదేశ వికాసమున కడ్డుపడుచున్నట్లుల యీ యుదంతమువలనను లోకమునకు మరియొకమారు వెల్లడియగుచున్నది. గాంధీ మహాత్ముని పర్యటన సందర్భమునందైన తెలుగువారెల్ల చేతులు గలుపుట కొంతవరకు సంతృప్తికరముగ నున్నది. హరిశ్చంద్ర, శ్రీరామ, ప్రహ్లాదాదుల ధర్మబలముముందర రాక్షసబలము దమ్మిడీకైనను కొరగాజాలదని మహాత్ముడీ సంచారమునం దాంధ్రులకు స్థిరపరచుట సముచితముగ నున్నది. ఖద్దరు నిధికిని, లజపతిరాయిగారి స్మారకనిధికిని తెలుగువా రుదారముగ మహాత్మునికి విరాళముల నర్పించుచున్నారు. ఈ ద్రవ్య మంతయు నుచితవిధమున వినియోగింపబడునని నమ్మెదము. ఉన్నత నిమ్నకులభేదములగూర్చిన తగవులును. పక్షముల తగవులును ఆంధ్రరాష్ట్రనిర్మాణమునుగూర్చిన ఆందోళనయందైన నంతరించినగాని తెలుగువారికి ప్రత్యేకరాష్ట్రము సిద్ధింపజాలదు. అంతదనుక ఆంధ్రులయభివృద్ధి త్వరితగమనమున సాగజాలదని మనము జ్ఞాపకమునం దుంచుకొనవలసియున్నది.

భారతీయ శాసనసభయందు డాక్టరు సర్. హరిసింగు గౌరుగారును, రా॥ సా॥ హరవిలాస శారదాగారును బ్రవేశపెట్టిన చట్టములు దేశమునం దపూర్వమైన సాంఘికసంస్కరణమునకు దోహద మొనర్చినవి. సర్. మోరోపంతు జోషీగారి యధ్యక్షతను నెలకొల్పబడిన గర్భాదాన వయోనిర్ణయసంఘమువారి యెదుట విచారింపబడిన సాక్ష్య వాఙ్మూలములందు దేశము పూర్వాచారముల నెంతగా గోయుచుండినదియు విశదపడినదికాని పూర్వ నాగరిక పండితులు తమ విముఖభావముల నంత సులభముగ వదలువారు కారు. కాశీలో ఘనతవహించిన శ్రీ దర్భాంగా మహారాజావారి యధ్యక్షతక్రింద అఖిల భారత బ్రాహ్మణ సభను

జరపి యిట్టి సంస్కారణముల నిరసించి తీర్మానముల గావించినారు. దేశము పాడుగు నను సనాతన వర్ణాశ్రమాచారధర్మసభల నెలకొల్పి శాసనసభాస్థానములకు ప్రతినిధులుగ బ్రాహ్మణులె పోటీ చేయవలయుననియు, పూర్వాచార పరాయణు లు తమ వోటుల సంస్కారాభిమానుల కొసగరాదనియు హెచ్చరికల దెలిపినారు. పీఠాధిపతులు నీయాందోళనయందు జోక్యమును గలిగించుకొనుచున్నారు. ఆంధ్ర దేశమందు నిట్టి పూర్వాచారసమర్థనమునకైన యొకానొక సభ త్వరలో సమా వేశము చేయబడు ప్రయత్నములు గావింపబడుచున్నవి. పూర్వాచార పరా యణులయొక్కయు, సంఘ సంస్కరణ పరాయణుల యొక్కయు, యీవాదోప వాదములు సంఘర్షణకు దారిచూపకుండు గాక యని విశ్వసించుచున్నాము.

స్వవిషయము. మేము బ్రచురించిన విభవసంవత్సరాదిసంచిక కాంధ్రమహాజనులు చూపిన యాదర ప్రోత్సాహములే యీ శుక్లసంవత్సరాదిసంచికను బ్రచురించు నట్లును బ్రోద్బలపరచినవి. ఉత్తరముల వ్రాయుటయే తడ వుగ మాకు వ్యాసముల, చిత్రపటముల బంపిన విలేఖక మహాశయులపట్ల మాకుగల కృతజ్ఞత నీసందర్భమునందు స్మరింపకుండజాలము.

గ్రామపునరుద్ధారణకై దేశమంతయు నలమటించుచున్న యీసందిగ్ధసమయ మందు మామిత్రులు గౌరవనీయ వేమవరపు రామదాసుపంతులుగారు గ్రామ

వ్యాసములు పరిశ్రమల కల్పన మను పేరిట నొక యమూల్యవ్యాసమును వ్రాసి మా సంచికకు వన్నెపెట్టుటచే వారి నీసందర్భమున ప్రత్యేకముగా స్మరించుచున్నాము. సమదర్శిని శతకమును రచించిన శ్రీయుత మంగిపూడి వేంకటశర్మ గారిని, పాశ్చాత్య స్త్రీలగూర్చిన వ్యాసమును వ్రాసిన బారిష్టరు లింగం వీరభద్రయ్య చౌదరీగారిని ప్రత్యేకముగా నుగ్గడింపవలసి యున్నది. భారత సందేహముల బ్రచురించిన ఆంధ్రపండితలోకమునం దపూర్వసంచలనమును రేకెత్తించిన పండిత వెంచ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారివలె కవికొండ వేంకట సత్యనారా యణమూర్తిగారిందు రామాయణసందేహములగూర్చిన యొకానొకపరిశోధక వ్యాస మును సంతరించినారు. శ్రీకృష్ణదేవరాయల తనయ మోహనాంగి రచించిన మారీచిపరిణయమందలి కొంతభాగ మని శ్రీయుత సెట్టి లక్ష్మీనరసింహముగా రిందు ముద్రింపించిన కావ్యఖండము వారిచేఁ బూర్వమున శ్రీనాథకృతమని బ్రచు రించిన శృంగార శ్రీనాథము వోలె బూర్వ కవివిరచితముగాక యధునాతన కల్పితముగ ననుమాన ముదయించుటచే నాయంశమును పండిత పరిశీలనమునకు వదలివేయుచున్నాము. మిగిలిన వ్యాసముల గుణాగుణ పరిశీలన మొనర్చుట గ్రంథ విస్తరమునకె కారణమగునని ఆ మంచిచెడ్డల నిర్ణయించు బాధ్యతను పాఠకమహా శయులు విచక్షణకె విడిచిపెట్టుచున్నాము. ఈ సందర్భమున మే మొకమాటను చెప్పకుండ అన్యవిషయమునకు మరలుటకు వీలులేదు: ఇప్పటికె యీసంచిక పూ ర్వముకంటె చాల పెద్దదియగుట ముద్రింపవలయునని అనుకొనిన యెన్నోవ్యా సములను చిత్రపటముల ముద్రించుటకు వీలులేకపోయినది. ఈ కారణమున చాల మంది విలేఖకుల కనివార్యముగ నాశాభంగమును కలిగించియుందుమని తెలుపవిచా రించుచున్నింపవలెనని అట్టివారికి విజ్ఞప్తి యొనర్చుచున్నారము. అమరావతీ స్తూప చిత్రముల నిందు ప్రకటింపజేసి యీసంచికకు శోభదెచ్చిన శిల్పి టి. రామ నారాయణగారిని మే మెంతయు బహూకరించుచున్నాము.

ఈ సంచికను సమ్యక్పరిశోధనగా సంపాదించి సంపుటీకరించుటకు మాకు దోడుపడిన పండిత గానాల రామమూర్తి గారికిని, యితరవిధముల సాయపడిన పి. ఎం. జయగోపాలునాయుడు గారు ప్రభృతి మాపత్రికా కార్యాలయ సంపా దకవర్గమువారికిని, అచ్చుచిత్తు పరిశోధకులకును, యిందు ముద్రితమయిన చాల మంది వ్యాసకర్తలతో మాకు బరిచయము కలుగునట్లొనర్చిన కవితాసమితి కార్య దర్శియు, విశాఖపట్టణము నివాసులునైన శ్రీయుత పుపండా అప్పలస్వామిగా రికిని, మేము కోరుటయేతడవుగ తమపనులనెల్ల మానుకొని బెంగళూరునుండియిక్క డికి దయచేసి అహోరాత్రములు కష్టపడి నిచినిట్లు సర్వాంగసుందరముగ ముద్రింపిం చ దోడుపడిన 'టాగోరు'కంపెనీ యజమానులు శ్రీ.బి.ఎన్.గుప్తగారికిని, చిత్రపట ముల సకాలములో ముద్రించి యిచ్చిన "కాక్స్టన్" ముద్రాయంత్రాధికారులను చెంగల్పట్టు జిల్లాబోర్డు ఉపాధ్యక్షులునైన మం-రా-రా-శ్రీ సి. జయరామ నాయుడు గారికిని, ఇందలి "నవోఢ" యను చిత్రముయొక్క మాతృకను దయ చేసిన శ్రీమాన్ డాక్టరు రంగాచారిగారికిని, మా ప్రయత్నములకు ప్రోత్సాహకులైన తక్కుంగల మిత్రులకును యీ సందర్భమున పురస్కరించుకొని వందనముల దెలుపుచున్నాము.

స్వపక్ష పరపక్ష భేదము లేకుండ అన్నితరగతుల యుద్దేశములు గలలేఖకుల కును సమానావకాశము లుండునట్లు దీనిని యథాశక్తి నెట్లో సిద్ధముచేసి ఆంధ్ర మహాజనుల కర్పించుకొనుచున్నారము. ఇందు పెక్కులు భ్రమ ప్రమాదములు న్నా యుండవచ్చును. ఉదారులగు మహాజను లెల్లవానిని మన్నించి స్వహస్త పర హస్తముల మా ప్రయత్నములకు దోడ్పడి మేమింకను ద్విగుణీకృతోత్సాహము తో సారస్వతసేవయు, దేశసేవయు నొనర్చు విధమున చేయూతనొసంగెదరు గాక యని ప్రార్థించుచు యీ ప్రస్తావన నింతట విరమింప పాఠకమహాశయుల ననుజ్ఞ వేడుచున్నారము.

శుక్ల సంవత్సరము నిజనామమును సార్థకపరచుటకో యన సకలజనులకును విశుద్ధమైన చిత్తశాంతిని ప్రసాదించునట్లు పరాత్పరు డనుగ్రహించు గాక!

సర్వేజనా స్సుఖినోభవంతు

సింజల సుబ్రహ్మణ్యము శెట్టి,

సంస్థాపకుడు.

---



## నవోఢ

శిల్పి: ఆలస్ బక్స్, లాహోరు.

[డాక్టరు ఎస్. రంగాచారి గారి అనుగ్రహమున]

# స్వర్గీయ శ్రీ పానగల్లు రాజా సాహెబుగారి చరిత్ర లేశము.

పండిత గానాల రామమూర్తి గారు.

ఉ॥ నల్లనివాడు, పద్మనయనంబులవాడు, మహాశుగంబులున్ ।
విల్లును దాల్చువాడు, గడువిప్పగువక్షమువాడు, మేలుపై ।
జల్లెడివాడు, నిక్కిన భుజంబులవాడు, యశంబుదిక్కులం ।
జల్లెడువాడు నైన రఘుసత్తము డిచ్చుత మా కభీష్టముల్ ॥

(శ్రీమ దాంధ్ర మహాభాగవతము.)

ఉపక్రమము:—బ్రాహ్మణేతరోద్యమ స్థాపకు లగు డాక్టరు నాయరు గారును, సర్. పిట్టి త్యాగరాయశెట్టి గారును దివంగతు లైనతరువాత దక్షిణ హిందూదేశ ప్రజోద్ధరణసంఘము (ది సౌత్ యిండియన్ లిబరల్ ఫెడరేషన్) న కధ్యక్షులుగను, న్యాయకక్షి (జస్టిస్ పార్టీ) వారి ప్రధాన నాయకులుగను యెన్నుకొనబడి తన యసమాన రాజనీతి ధురీణతచే బ్రాహ్మణేతరపక్షము నత్యంతప్రతిభాసంపదతో నడిపి కీర్తినార్జించి నట్టియు, నూతన సంస్కరణముల యనంతరమున మదరాసు రాష్ట్ర స్థానిక స్వపరిపాలనశాఖా ముఖ్య మంత్రిపదవిని సర్వంకష ప్రజ్ఞతో కొంచె మించు మించు ఆఱుసంవత్సరము లేక ధాటిని నిర్వహించి ప్రజాసేవ యొనర్చుటమూలమున ప్రజల యొక్కయు ప్రభుత్వము వారియొక్కయు గౌరవమునకు పాత్రులై యీ రాష్ట్ర ప్రజాహిత జీవనము నొక మెట్టుపై కెక్కింప పాటుపడి ఖ్యాతి నార్జించినట్టియు శ్రీ రాజా సర్. పానగంటి రామారాయణముగారి జీవిత మీప్రాంతీయ ప్రజలచేతనే గాక యావద్భారతవర్ష బ్రాహ్మణ బ్రాహ్మణేతర జనులచేత నవశ్యము పఠింపబడవలసిన యాదర్శ చరిత్రముగ నుండె ననిచెప్పుట కించుకయు సంశయింప బనిలేదు. కావున అట్టి లోకోత్తర ప్రజానాయకుని యుత్కృష్టజీవనమును సంగ్రహముగ వాచకులకు బరిచయమును గూర్ప యీ స్వల్పావకాశమును పురస్కరించుకొని యుపక్రమించు చున్నాను.

వంశము:—శ్రీ పానగల్లు రాజాసాహెబుగారు జన్మించినది యొకానొక వెలమ సాధారణ జమీందారీ కుటుంబము. అతి ప్రాచీనమును, యశోవిశాలమును గలిగిన యీ వర్గస్థులు అనేకశతాబ్దములనుండియు మదరాసు రాజధానియందలి పలు జమీందారీలకు పరిపాలకులుగా నున్నారు. "వెలమ" శబ్దము సంస్కృతమందలి "వర్మ" శబ్దరూపాంతరముగ దలంపబడుచున్నది. వెలమకులజులు జగన్మిత్రు డగు (సూర్యనారాయణుని) పద్మనాయకుని సంతతివారమనియు, దక్షిణహిందూదేశమున స్థిరనివాస మేర్పరచుకొనిన క్షత్రియులమనియు చెప్పుకొందురు. తమ ప్రకృతపు సాంఘికస్థితిని వా రిట్లు సమర్థించుకొను చున్నారు: చైత్రయాత్రార్థము తమపూర్వులు దక్షిణహిందూదేశమున కరుదెంచిన యవసరమున వారితో వంశపురోహితబ్రాహ్మణులు మిక్కిలి స్వల్పసంఖ్యాకులుగ నరుదెంచిరనియు నీ కారణమున మతసంబంధము లగు నిత్య నైమిత్తిక కర్మాదుల నంతగాపాటించుట కవకాశము లభించియుండలేదనియు, గాన శుభాశుభకార్యములం దునైతము వేదనియమములగాని, పౌరాణికనియమములగాని సరకుచేయక నిరంకుశముగ వర్తించియుండుటచే వారి సంతతివా రిప్పటికి నట్టి స్వేచ్ఛాచారముతోడనే వర్తించు చున్నారనియు జెప్పబడుచున్నది. ఈ సంఘమునందలి నేటి వేదోక్తాచారములు చాలవర కిందు కనుగుణ్యముగనే యుండుట సత్యదూర మైనయంశము కాదు. వారు వేదోక్తాచారముల పాటింపకుండుటకు చారిత్రాత్మక మైన మరియొక కారణమును జెప్పబడుచున్నది. పౌరాణిక యశోవిశాల సంపద్విభ వాతిశయు డగుమహాపద్మనందుడు శూద్రులకును, క్షత్రియులకును అంతర్వివాహ సంబంధము నేర్పాటుచేయ నభిలషించి, క్షత్రియుల నిరాకరణమువలన నుద్రేకితుడైయతడు యసమ చతురంగ బలముతోడ వారిపై దాడి వెడలి యోడించి వారిరాజ్యములనెల్ల వశపరచుకొని వా రాచరించు వేదోక్తాచారముల బలవంతముగ మాన్పించి క్షత్రియత్వమునే వేరులేకుండ జేసినాడట! క్షత్రియుల యాధిక్యమును సహింపజాలనివాడగు యతడును "నందాంతం క్షత్రియకులం" అను సూత్రముల కల్పించుటలో వారి నగౌరవించినట్లుగూడ పారంపరిక గాథలవలన తెలియబడుచున్నది. నందరాజ్యానంతరమున నె మహాపద్ముడు సామ్రాజ్య పట్టభద్రు డగుట యిది అంత విశ్వసనీయమైన గాథగ దలంప వీలు పడకున్నదిగాన దీనిని కట్టుకథ క్రింద జమచేసి త్రోసి రాజనవచ్చును. ఏదియెట్లున్నను దక్షిణప్రాంతమున కరుదెంచి ఆంధ్రమండలములందు స్థిర నివాసమేర్పరచుకొనిన క్షత్రియజాతికి చెందిన తెగవారుగనే వెలమశాఖీయులు గణింపబడవలసియున్నదనుట నిర్వివాదాంశము. వేంకటగిరి, బొబ్బిలి, పిఠాపురము, నూజీడు, భద్రాచలము, కాళహస్తి, జటప్రోలు మున్నగుసంస్థానాధిపతు లెల్లరీ వెలమకుల సంజనితులేయని మాపాఠక మహాశయులు గ్రహింపవలసి యున్నారు.

కుటుంబము:—వరంగల్లు హైందవ తక్త్ (తహత్తునకు) పాలెగాండ్రగు నీ వెలమసంస్థాన కుటుంబపు పూర్వులు దక్షిణమునందలి పానగల్లు పట్టణమున కధీశ్వరులై చాలకాల మాప్రాంతమును బరిపాలించి నట్టుల తెలియవచ్చు చున్నది. వరంగల్లు నందలి హిందూసామ్రాజ్య పతనముతో పాటు పానగల్లు పరిపాలకులును దక్షిణమందలి గుంటూరు మండలమునగల కొమ్మూలపాడు గ్రామమునకు వలస వచ్చి యట నొకకోటను నిర్మించుకొని స్థిరనివాస మేర్పరచు కొనినారు. కాలక్రమమున దద్వంశ్యు లవస్థాంతరములకు లోనై 18 వ శతాబ్దాంతకాలమున తమయాస్తిని చాలవరకు గోలుపోవలసి వచ్చెను. శ్రీ రాజా రామారాయణముగారి ముత్తాత రాజా అంబారాయణముగారు సజీవులైయుండు నపుడు కుటుంబజీవనాధారార్థము కుస్బా, కొమ్మూలపాడు, మొక్కన్నపాలెము అను మూడు గ్రామములు తప్ప మరెట్టిసంస్థానమును లేకుండెను. రాజా అంబారాయణముగారి యనంతరము వారి కుమారరత్నమగు రాజా వేంకట రామారాయణముగారు నెల్లూరుజిల్లాయందును, ఉత్తరఆర్కాటు జిల్లాయందును కొంత భూస్థితిని సంపాదించి చాలకాల మాప్రాంతములందె వసించుచు, తమ వంశీయుల కొమ్మూలపాడునుండి రప్పించి కాళహస్తిలో స్థిరనివాస మేర్పరచుకొనునట్టి వసతిని కలిగించినారు. ఆయన విశాలభావములు గల గొప్ప క్రియాశూరులు. గొప్ప రౌతనుట కొక్కరాత్రి మాత్రపు స్వల్పకాలములో మచిలీబందరునుండి కొమ్మూలపాడునకు వచ్చుటయె సాక్ష్యము. వీరి కుమారులైన రాజా వేంకటరంగా రాయణముగారు అత్యంత విద్యావిజ్ఞాన సంపద్విభవాతిశయులు. ఆంధ్రమునందును సంస్కృతమందుకూడ వీరికి పాండిత్యము మెండు. ఉభయభాషాపండితుల నెంతయు నాదరించి సారస్వతపోషకులను ఖ్యాతినార్జించి యుండిరి. శరీరవ్యాయామ మన్న వారి కాదరాభిమానము లెక్కుడు. పుణ్యభావాదరమును, పాపభీతియు గలిగి దీనజనసమాదరణ పరతంత్రమందు నిరంతరము జోక్యమును గలిగించుకొని ఆప్రాంతములందు నిమ్నపరిస్థితులయం దెంతయు నుండుచుండిన ఏనాది ఎరుకల తెగల ఉద్ధరణకు ప్రశంస నీయముగ పాటుపడినారు. గనుకనే నేటికి గూడ నాపరగణాయందు వీరినామము యెకవిధమున స్మరింపబడు చున్నది. వీరు తమ పూర్వుల సంస్థానము నెంతయు నభివృద్ధిపరచిరి. వీరి జ్యేష్ఠకుమారులను శేషాచలపతి రాయణంగారు కాళహస్తి ప్రాంతమునందు తమ పూర్వుల ప్రాచీన సంస్థానమగు పానగల్లుపేరిట నొకగ్రామమును తమ తండ్రిగారి జీవితకాలమందె నిర్మించి యున్నారు. అది సువర్ణముఖీనదికి పశ్చిమతీరమునందు మంచి సాగుబడిగల గ్రామములమధ్య నున్నది.

జననము—బాల్యము:—వేంకటరాయణముగారి పుత్రశ్రేష్ఠులగు రామారాయణముగారు ఆగ 1866 సం॥నమున జన్మించినారు. ముందువీరి సమాన మగు ప్రజ్ఞావిశేషముల బ్రదర్శింపగల రను నమ్మకము వీరి బాల్యవర్తనమునందే గోచరించించియుండినది. నేటివలె నాదినములయందు జమీందారులు తమ బిడ్డలకు ఆంగ్లవిద్య గరపుటయం దట్టియాసక్తిని జూపించియుండెడివారు కారు. గనుక మిగత జమీందారులవలె రామారాయణముగారి జనకులు శ్రీ వారికాంగ్లవిద్యను నేర్పింపక సంస్కృతాంధ్రములనె బోధింపించుటయు విద్యాభ్యాసమునం దంతేని అభిరుచిగల శ్రీవారు 18 సం॥నముల ప్రాయము వచ్చునరికి ఉభయ

భాషలయందున సమాన పాండిత్యమును గడించినారు. సారస్వత విషయము లందు వీరు చూపుచువచ్చిన ప్రతిభకు దిగ్గజములవంటి పండితులు కూడ నచ్చెరు వందుచుండెడివారు. నాడు వీరికి భారతీయ సాహిత్యమునందు గలయభిమానము కడవరకు నట్టులే యుండినదిగాని యిసుమంతయు మొక్కవోయి యుండలేదు.

ఆంగ్లవిద్య :—చిన్నతనమునుండియు వారికి నైతిక విజ్ఞానము, సుస్థిర మగు స్థైర్యము నలవడియుండెను. అట్టి సందర్భమున వారికి ఆంగ్లవిద్యాపరిచయము గల తమ ప్రాయపువారు కొందఱితోడ పరిచయము చేకూరుటయు ఆంగ్లభాష నభ్య సించవలయునను నభిలాష వారియం దతి బలవత్తరముగ పెంపొందుటచే నెటు లైన నాంగ్లభాషను చదివితీరవలయు నను ఉత్సాహము హెచ్చుపెరిగి తదర్థము తమ్ము చెన్నపట్టణ మంపింపవలసినదిగ తమ జనకులను విన్నవించుకొనినారు. అప్పుడు వారివయస్సు 16 సం॥రములు మాత్రమే. కొన్ని మాస ములవర కింటనే హూణవిద్య నభ్యసించిన తరువాత కొంతమంది మిత్రులును తమ తండ్రిగారికి రామారాయణముగారి యింగ్లీషు విద్యాభ్యాసమును గూర్చిన సూచనను బలపరచుచు ప్రోత్సాహము చేయ వారట్టులేలను 1882 సం॥రము అంత్యభాగమున వీరిని తిరువల్లిక్కేణి హిందూ ఉన్నత పాఠ శాలయందు బ్రవేశింపజేసి వీరి యోగక్షేమముల విచారించుటకు సర్. త్యాగ రాయశెట్టిగారి పరిశీలన క్రింద విడిచిపెట్టినారు. పాఠశాలయం దత్యంత శ్రద్ధా భక్తులతో మెలంగుచుండుటచే రామారాయణముగారు విద్యల బడయుటలో తోడివిద్యార్థుల కందరికన్న మిన్నరై మెలంగుచుండిరి. వీరికి గల యుత్తమ గుణంబులకు మురుదులై యుపాధ్యాయులు రామారాయణముగారి నత్యంత ప్రేమ తో నాదరించుచు వచ్చిరి. ఇట్లచిరకాలముననే యుపాధ్యాయుల యనురాగ మును, సహపాఠుల యభిమానమును జూరగొన్న రామారాయణముగారు తమ యుత్తమ గుణాతిశయములవలన తరగతులయం దతి సులభముగ నగ్రస్థానమును వహించుచు 1887 సం॥ర మునందు ప్రవేశతరగతి (మెట్రిక్యులేషన్)లో నుత్తీర్ణు లై శాస్త్రవిద్య నభ్యసించుటకు 1888 వ సం॥ రమునందు రాజధాని కళాశాల యందు జేరి ప్రొఫెసరుల యనురాగమును శీఘ్రకాలమునందె సంపాదించి సంస్కృతమునె ప్రధానశాఖగా గొని 1893 సం॥ రములో పట్టభద్రతను బడసి అటుపిమ్మట బి. ఎల్., పరీక్షయందు గడతేరి 1896 సం॥ రములో ఎం.ఏ., పరీక్షయందు విజయులైనారు. అప్పటి గవర్నరు ఘనతవహించిన శ్రీ వెన్లాకు ప్రభువుగారీసందర్భమున ప్రభుత్వభవనమునకు శ్రీవారిని రావించి ప్రత్యేకముగా దర్శన మొసగి యెంతయుబహూకరించినారు,

ప్రజాహిత జీవనము.—కళాశాల జేరిననాటినుండియు వీరికి ప్రజాహిత జీవనమునం దాసక్తి అగ్గలమైయున్న కారణమున విద్యాభ్యాసమును ముగించుట తోడనే ప్రజాసేవ బ్రవేశించుటకు మదరాసు విశ్వవిద్యాలయము యొక్క "ఫెల్లో"గా నియమింపబడి ఆ సంస్థకు గొంతమే లొనర్పగలిగిరి. వీలగునంత వరకు సర్వవిధముల విద్యను వ్యాప్తిగావించుటయే తమ ముఖ్యకర్తవ్యముగ దలంచుచుండిన శ్రీ రామారాయణముగారి సలహాల విశ్వకళాపరిషత్తువారంతో మన్ననగ నాదరించుటయగాక తదధికారులు వీరి నాంధ్రభాషకు ప్రధాన పరీక్షకులుగ నియమించి గౌరవించియుండిరి.

స్థానిక సంస్థలతో జోక్యము:—వీ రుత్తరార్కాడు జిల్లాబోర్డునం దాఱు సంవత్సరములు సభ్యత్వమును వహించి, యాప్రాంతమునం దత్యంత శ్రద్ధా ప్రయా సల కోర్చి, విద్యాప్రబోధము నెంతయు ప్రబల మొనర్చిరి. కావున శ్రీపట్టాభియా డైమండు జూబిలీ మహోత్సవసందర్భమున ప్రభుత్వమువారు శ్రీవారి ప్రజా హితసేవ నగ్గడించుచు యోగ్యతాపత్రము నొసంగి అభినందించినారు.

శాసన సభా ప్రవేశము:—మదరాసు రాష్ట్రమందలి జమీందారులును, భూస్వాములును, ఆన 1912 సం॥రమునందు వీరిని రాజప్రతినిధిగారి సామ్రాజ్య శాసననిర్మాణ సభాప్రతినిధిగ నెన్నుకొన 3 సం॥రములపాటాపదవి నత్యంత సమర్థతతో నిర్వహించి ప్రజలయొక్కయు, దొరతనము వారియొక్కయు సన్మా ము నందుకొనినారు. అందు వారు సభ్యత్వమును వహించియుండునపుడు భారత దేశ భూస్వాములవిషయమునను, పారిశ్రామికాశయములు పెంపొందింప బడు టకు గలయవరోధముల గూర్చియు, నోరుమాలి కడుహీనులై యధోగతియందు పరితపించుచున్న పేదలగూర్చియు నిమ్నజాతులగూర్చియు, లోపముల చక్కజేయ శక్తివంచన లేకుండ చాలప్రయాసపడియుండిరి. ప్రతి రాష్ట్రీయప్రభుత్వమందును, నిమ్నజాతుల యభివృద్ధికి ప్రత్యేకోద్యోగులు నియమింపబడవలయునని రామా రాయణముగారు తలంచుచుండెడివారు. కేంద్ర శాసన సభయందు వారుపపా దించిన తీర్మానములనేకము లంగీకరింపబడియుండెను. వారి యుపన్యాసములు చాలవరకు మితవాదధోరణినె యుండినను అభిప్రాయములుమాత్రము సుస్థిరము లైయుండుట వారియుద్దేశముల నెల్లరును గౌరవించెడివారు. సామ్రాజ్య శాసన సభయొక్క ఆన1914-15 సం॥రముల సమావేశమును ముగించుచు రిప్పను ప్రభువుగారి తరువాత ప్రజాసానుభూతియందు దొడ్డవారని ప్రసిద్ధి నార్జించిన అప్పటి రాజప్రతినిధి ఘనతవహించిన శ్రీ హార్డింజి ప్రభువుగారు రామారాయ ణముగారి సమున్నతదేశసేవ నుగ్గడించుచు నిట్లు ప్రశంసించినారు:—

"ప్రజాహితములగు ననేకవిషయములు చర్చింపబడి అతి జాగరూక తతో బరిశీలింపబడెను. సభ్యులాయా విషయములందు సుస్థిర మితవాద ధోరణి తోడ ప్రభుత్వమువారికి పురస్కారాంశముల నెంతయు సహాయపడినందులకు వందనీయులు........ ఈసంవత్సరము గౌ॥ రామారాయణముగారిచే నత్యంత పరిశీలనాపూర్వకముగ నుపపాదింపబడి చర్చింపబడిన కారాగార పరిపాలనాంశ మువలన; కారాగార పరిపాలనపద్ధతిని పరిశోధించుటకొఱకు విచారణసంఘము నేర్పరుప తీర్మానింపబడెను. అట్టి సంఘమువలన నెంతయు మేలు చేకూరునని వేరుగ చెప్ప నవసరము లేదుకదా?"

ఆంధ్రోద్యమము :—ఈ సభాసభ్యత్వమును వహించియున్న దినములయందు వీరు నాయకులయొక్క పరిచయమును సంపాదించుకొనుట కవకాశము కలుగుట యగాక ఆంధ్రరాష్ట్ర నిర్మాణవిషయమున బాటుపడుటకు గూడ వ్యవస్థ యేర్పడినది. సామ్రాజ్య శాసననిర్మాణసభలో వీరు సభ్యత్వమును వహించి యుండినది కొలది సంవత్సరముల స్వల్పకాలమేయయ్యు ఆ తక్కువ యవకాశము నందుగూడ విశ్వవిద్యాలయములందు దేశభాషలకు ప్రాముఖ్య మేర్పడుట కెంతో శ్రమపడి తమ శక్తి సామర్థ్యములు లోకులు గ్రహించునట్లు వర్తించినారు, గనుకనే 1915 సం॥ రములో విశాఖపట్టణమునందు జరగిన తృతీయాంధ్రరాష్ట్రీ యసభకు తెలుగువారు వీరిని సభాపతిగ వరించి స్వాగత మొసగినారు. వీరు రాష్ట్రీయ రిక్రూటుమెంటు బోర్డునందును, అటుపిమ్మట సైనిక సంఘమందును సభ్యతను బడసి సదరుకార్యములం దత్యుత్సాహముతో పాల్గొని యుండిరి. అంతియగాక వారు ప్రచురణసంఘమునందుగూడ సభ్యులుగ నియమింపబడి మన్నింపబడి యుండిరి.

బ్రాహ్మణేతరోద్యమ ప్రవేశము:—నిమ్నజాతుల అభివృద్ధియెడ జూపిన శ్రద్ధయే శ్రీ రామారాయణముగారికి బ్రాహ్మణేతరోద్యమావశ్యకతను బోధ గావించినది. ఆన 1916 సం॥రములో డాక్టరు టి. యం. నాయరు, సర్. పిట్టి త్యాగరాయశెట్టిగారలచే ప్రారంభింపబడిన బ్రాహ్మణేతరోద్యమము వీరి నాకర్షిం చినది. బ్రాహ్మణేతరులు తమ యభివృద్ధి కొరకు పాటుబడవలసిన యవసర మెంతేని గలదని శ్రీ రామారాయణముగారు మనఃపూర్తిగ నమ్మినకారణమున ఆ దినములలో నీ యుద్యమముపట్ల గావింపబడు వ్యతిరేక ప్రచారమును, అందు పాల్గొనినవారికి సంభవించిన పలువిధములగు కష్టములను లక్ష్యముచేయక అబ్రాహ్మణసంఘమువా రనుభవించు బాధల నెంత శ్రమకోర్చియైన నివారింప నగునను దృఢచిత్తముతో నీ యుద్యమునందు చేయిజేసికొని ఆన 1917 సం॥రము లో ప్రథమమున కోయంబత్తూరులో జరగిన మాండలిక సభాధిపత్యమును ధైర్య ముతో స్వీకరించినారు. 1918 సం॥ రమున ఢిల్లీ సామ్రాజ్య మహాసభ కాహ్వా నింపబడిన మదరాసు ప్రతినిధులలో పురయందు వీరొకరు. ఆన 1919 సం॥రమున అఖిలభారత భూస్వాముల సంఘమువారును మదరాసు జమీందారులు తమ పరిస్థితులను పార్లమెంటరీ జాయింటు కమిటీవారి ముందర వ్యక్తపరచుటకు వీరిని తమ ప్రతినిధిగ లండను నగరమున కంపించినారు. రామారాయణము గారిం గ్లండులో నుండునపుడు యుద్ధము విజయవంతముగ ముగిసిన సందర్భమును పుర స్కరించుకొని హిందూదేశ కార్యదర్శి ముఖాంతరమున యావద్భారత భూస్వా ముల సంఘపక్షమున శ్రీ సార్వభౌముని కొఱక యభినందనపత్రమును సమర్పించి యశోవంతులైనారు. జాయింటు పార్లమెంటరీ కమిటీయెదుట వీరొసగియుండిన సాక్ష్యమునందు బ్రాహ్మణేతరుల కెట్టిసంరక్షణ మవసరమో దానినంతను స్పష్టీక రించియుండిరి. దీనివలనకూడ నీ యుద్యమమునకు కొంత బలమేర్పడియుండెననుట సత్యదూరము కాదు.

అమాత్యపదవి :—ఆన 1919 సం॥రమునందు ప్రవేశపెట్టబడిన క్రొత్త సంస్కరణ శాసనమునుబట్టి మదరాసురాష్ట్రమందు జరగిన సాధారణ యెన్నికల యందు బ్రాహ్మణేతరపక్షము విజయమును బడసినది. అందువలన నప్పటి రాష్ట్రపాలకుడు ఘనతవహించిన శ్రీ విల్లింగుడన్ ప్రభువుగా రమాత్యత్రయ నియామకమునుగూర్చి బ్రాహ్మణేతరనాయకులైన సర్. త్యాగరాయశెట్టిగారితో

యోచింప శ్రీ వారు దివాన్ బహదూర్ సుబ్బరాయలు రెడ్డి, సర్ వేంకటరెడ్డినాయుడు గార్ల పేరులతో పాటు వీరినామమును గూడ మంత్రి పదవులకు సూచించిన మీదట వారట్లు నియమింపబడినారు. ఆఱుమాసముల స్వల్పకాలములోనే శ్రీ సుబ్బారాయలురెడ్డిగారు అనారోగ్యకారణమున నుద్యోగమును వదలివేయుటయు రామారాయణము గారటుతరువాత ముఖ్యమంత్రి పదవికి నియమింపబడిన నాటి నుండియు రెండుమారులు ఆ పదవిని వహించి యీ రాష్ట్రమునకును, బ్రాహ్మణేతరులకు నెంతో సాయము నొనర్చియున్నారు. స్థానిక మంత్రిగ వా రుద్యోగమును స్వీకరించుటకు ముందు రాష్ట్రీయ స్థానిక స్వపరిపాలనశాఖా వ్యవహారములు మిక్కిలి తాఱుమాఱై యుండుట సర్వజన విదితము. నాటిపరిస్థితులు ప్రజాసామాన్యమునకు వైద్యసహాయ్యము మున్నగు వివిధాంశములు లోపభూయిష్టములై యుండెడివి. ఇపు డన్నను మారుమూల లందున్న గ్రామములకు సైతము మోటారులలో బోదగు రహదారీ సౌకర్య మేర్పాటు చేయబడినది. పల్లెటూరివారికిని ఆంగ్ల వైద్యుల సాహాయ్యము సులభముగ లభించుచున్నది. అంతియగాక బ్రాహ్మణాగ్రహారములుగ నుండిన స్థానిక సంస్థలందు వీరి పరిపాలనలో బ్రాహ్మణేతర ప్రాబల్య మతిశయించినది. మనదేశమం దనాది నుండియు మతసంరక్షణ మొనర్పగలిగిన దేవాలయములును, మఠములును ధర్మకర్తల దుష్పరిపాలనమున నీతిని గోలుపోయి అంతరించ సిద్ధముగ నుండుటను గమనించి యుత్తమ దైవభక్తి పరులగుటచే తత్సంరక్షణ మొనరించి మతము నుద్ధరించుటకు హిందూమత దేవాల యాదాయ సంస్కరణమును గూర్చిన శాసనమును నిర్మించి దాని పెక్కుయిక్కుములకులోనయ్యు చలించకుండ వీరు కృతార్థులైనారు. ఉన్నతోద్యోగములు భారతీయుల వశ మొనరించుటకు చాలమంది నాయకులు ప్రయత్నించియు జయమును గాంచజాలక పోయినను, శ్రీపానగల్లు రాజా గారు పట్టుదలతో కృషిఁయొనర్చి యిందు కొంతవరకు జయము నార్జింప గలిగినారు. ప్రజారోగ్యము, గ్రామ పునర్నిర్మాణము మున్నగు నంశములందును, ఆయుర్వేద వైద్యమునకు ప్రభుత్వసాయము లభించుట కొనర్చిన పరిశ్రమయందును వీరి సేవ లోక ప్రఖ్యాతి నార్జించియే యున్నది. బ్రాహ్మణేతర మంత్రాంగమునకు చెందిన సర్. ఎ.పి. పాత్రో మహాశయులు ఆంధ్ర విశ్వవిద్యాపీఠ శాసనమును దయారు చేయుటకు చాలవరకు వీరి తోడ్పాటుకూడ నొకానొక ముఖ్యకారణముగనే చేర్కొనవలసి యున్నది. ఆ సంస్థకు వీ రొక లక్షరూప్యములు ధర్మముగ నొసంగి యున్నారు.

దానధర్మములు:—శ్రీ పానగల్లు రాజా గారు కాళహస్తియం దొక సెకండరీ విద్యాలయమును బీదల శరణాలయమును నిర్మించి వాని పరిపాలనాదికమును తమ సోదరులకు వశపరచి యుండుటయ గాక ఆ ప్రాంతమునందు వ్యవసాయమును పరిశ్రమలు నభివృద్ధికి వచ్చున ట్లెంతయు పాటుపడియుండిరి. రైతుబిడ్డల మేలు కొరకచ్చట నొక వ్యవసాయ విద్యాలయమును తదనుబంధముగ నొక భోజనశాలయు సుమారు యిరువది వేల రూప్యముల వెచ్చించి నిర్మింపజేసి వాని స్థిరపోషణకు తమ సంస్థానమందలి కొన్నిగ్రామములగూడ బ్రత్యేకించినారు. అందు సాగులేని కాలమున రైతాంగ ప్రజలకు గృహపరిశ్రమలు బోధింపబడుచున్నవి. హార్డింజి ప్రభువుగారు మదరాసు దయచేసిన సందర్భమును పురస్కరించుకొని వీరు మదరాసు విశ్వ విద్యాలయమువారి కాంధ్రభాషయందు రసాయనిక గ్రంథముల ప్రచురించు నిమిత్తము పదివేల రూప్యముల విరాళము నొసంగుటయగాక రాజకుమార కళాశాలా నిధికి ద్రవిడియన్ భోజనశాలానిధికి చాల ధనమును ధర్మముచేసి యున్నారు. విశ్వబ్రాహ్మణ సంఘమువారు చిక్కవోలుదగ్గర ఉలపల్లిలో జరపిన సభను, తెలగా కులజులు రాజమహేంద్రవరములో జరపిన సభను, మరియు పెక్కువర్ణములవా రాయా ప్రదేశములందు జరపిన సంఘసభల సమారంభ మొనరించి వీరు తమసమదర్శన స్వభావమును లోకమునకు గుణపాత్రపూర్వకముగా బ్రదర్శించినారు. అమరావతిలో జరగిన ద్వితీయ యావద్భారతవర్ష బ్రాహ్మణేతర సభకును వీ రధ్యక్షతను వహించియుండిరి. ఆన 1926 సం॥ రములో శ్రీ సార్వభౌములు వీరికి కే. సి. ఐ. ఇ. అను మహాబిరుదము నొసగి సత్కరించినారు.

ప్రకీర్ణ విషయములు:—గత యెన్నికలయందు తమ పక్షమునకు విజయము చేకూరకపోయినను శ్రీ రాజాసాహెబుగారించుకంతయు ధైర్యచ్యుతిని బొందక చాణక్యునివంటి అద్భుత రాజనీతిని బ్రదర్శించి కక్ష గౌరవమును పెంపొందింపజేసినారు. ఈ కాలపు జమీందారులు ఆటపాటలలో బ్రొద్దులు పుచ్చుట మాని రాజ్యాంగవిషయములలో పాల్గొనుటకు వీరి కృషియే చాలవరకు కారణము. ప్రతిపక్షలకు వీరి పేరన్న సింహస్వప్నముగ నుండెడిది. వీరి తుది దినములయందు మదరాసు రాష్ట్రమును పక్షోక్షముగ నేయనరు పాలించుచున్నారా యనునంతవరకు వీరి గౌరవము విస్తరించినది. సర్. త్యాగరాయశెట్టిగా రన్న వీరికి గౌరవాభిమానములు మెండు. ఉద్యోగపదవియం దున్నపుడును తరువాతనుగూడ తమకు నాయకులును, గురువును త్యాగరాయ శెట్టిగారే యని బహిరంగముగ నుడువుచు నాయకానుసరణమును ఆదర్శపూర్వకముగ ననుచరులకు బోధించుచుండెడివారు.

సమాప్తి:—ఇట్టి ప్రతిభాసంపదగల శ్రీ పానగల్లు రాజాసాహెబుగారకస్మాత్తుగ ది 15-12-28 సం॥రము తేదిని మదరాసు నందు తమ భౌతిక దేహమును విసర్జించినారు. వీరి నిర్యాణమువలన ముఖ్యముగా బ్రాహ్మణేతరోద్యమ ప్రచారమునకు తీరని నష్టము వాటిల్లినట్లు స్థూలదృష్టికి గోచరింపక మానదు. లీలామానుష విగ్రహుడైన శ్రీ కృష్ణపరమాత్మ అర్జునుని కిట్లు బోధించెనని భగవద్గీతలయందు చెప్పబడి యున్నది:—

శ్లో॥ దేహీనిత్యమవధ్యోయం దేహీసర్వస్య భారత
తస్మాత్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి.

[తాత్పర్యము:—ఓ అర్జునా! ఈ దేహము హతమైనను ఆత్మ యెప్పుడును హతముకానిది. అందువలన నీ వీ సమస్త ప్రాణికోటిగూర్చియు దుఃఖింపనర్హము కాదు.]

అను నీవచనమును మనమునం దిడుకొని సూక్ష్మముగా విచారించుచో మరణమనునది కేవల భ్రమప్రచూదమే యని వైరాగ్యబుద్ధివలన మనము ప్రబోధింపబడకమానము. గనుక త్రిమూర్తులవంటి నాయకులు, త్యాగరాయశెట్టి పానగల్లు రాజా గార్లలక్ష్యమును హృదయమునందుంచుకొని వర్తించినయెడల బ్రాహ్మణేతర పక్షమువారికి తొంటికంటె నమితబలము కలుగక మానదు. శ్రీ పానగల్లు రాజావారి యాత్మశక్తి తదనుచరుల ధర్మ సంగ్రామమందు విజయమును ప్రాప్తింపజేయక మానదను నమ్మకముతో శాసనసభల సాధారణ యెన్నికలు జరగనున్న యీ సందిగ్ధసమయమున శ్రీ వారి యాదర్శ జీవనము నింతమాత్రము ప్రస్తావింపబడినది.

# గృహపరిశ్రమల కల్పనము

గౌరవనీయ వేమవరపు రామదాసుపంతులుగారు.

వ్యవసాయమే ముఖ్యవృత్తిగా గల మనదేశమందు, అనేక గృహపరిశ్రమలు అనుశ్రుతముగా వ్యవసాయకులకును తదితరులకునుగూడ జీవనోపాధి కలిగించుచుండెడివి. భరతఖండమున కలిగిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక విపర్యయములచే నీ పరిశ్రమలలో కొన్ని నశించినవి. కొన్ని మిగిలి యున్నవి. వీనిని పునర్జీవింపజేయుటయో, లేక నూతన మార్గముల ననసరించి సంస్కరించుటయో యావశ్యక మని మనవారు కొంతకాలమునుండి ఆందోళనము సలుపుచున్నారు. అయినను ఈ ఆందోళన మంతగా కార్యకారి కాలేదు. స్వదేశపరిశ్రమలచే వస్తుసామగ్రి నుత్పత్తిచేయుట విదేశ యంత్రపరిశ్రమలకు పోటీగా పరిణమించు నను భయముచే మన ప్రభుత్వమువారు మనకు సాయపడుట లేదని కొందఱు తలంచుచున్నారు. ఇది వాస్తవమైనను కావచ్చును. ఆంగ్లదేశమందును, ఈ దేశమందును గల ఐరోపీయపెట్టుబడిదార్లకు మన ప్రభుత్వముమీాద అధికారము లేకపోయినను పలుకుబడి గల దనుట నిస్సందేహము. అందుచే నీదేశీయులకు అవసరమగు సమస్తగృహోపకరణములనే గాక ఆహారపదార్థములను సైతము యంత్రములమీాద చవుకగా తయారుచేసి యీదేశమున విక్రయించినచో తమ దేశవాసులకు నిరుద్యోగ సమస్యయొక్క భయము తొలగుటయే గాక, తమ పెట్టుబడిదార్లకు ధనసంపత్తియు, తమ దేశమునకు ప్రపంచమునందు ఆర్థికబలమును గలుగునని ఆంగ్లేయులు తలంచుటలో ఆశ్చర్యమేమియు లేదు. అయినను వారి యీ ఆర్థికనీతి దూరదృష్టితో కూడికొనియుండలేదని స్వల్పకాలమునుండి అధికారవర్గమువారును, ఆంగ్లవర్తకబృందమును కొంత తడబడుచున్నారు. ఐరోపా మహాసంగ్రామమునందు ఇండియాయొక్క పారిశ్రామిక నిస్సహాయత, వస్తునిర్మాణశక్తివిహీనత, వాణిజ్యపారతంత్ర్యము మొదలగువాని ఫలమును మన ప్రభుత్వమువారుపూర్తిగా అనుభవించి కోట్లకొలది ద్రవ్యమును ఇతరదేశములపరము చేసి యుండిరి. యుద్ధానంతరము వస్తునిర్మాణప్రాముఖ్యముయుద్ధమునకుపూర్వమువలెఆంగ్లదేశమందు కేంద్రీకరించి యుండినస్థితి మాఱిపోయి అమెరికా, జపాను మొదలగు అన్యదేశములచే చాలవఱకు పంచుకొని తీసికొనబడినది. అందుచే మన అశక్తతచే ఆంగ్లేయులుమాత్రమే లాభము పొందుటకు బదులు ఆంగ్లేయులతో పోటీచేయు ఇతరదేశీయులు కూడ లాభమును పొందుచున్నారు. ఇందఱి పోటీమధ్యపడి ఇండియా మరింత నలిగిపోవుచున్నది. ఈస్థితి అధికారవర్గమువారిలో కొంత ఆందోళన గలిగించిన మాట వాస్తవము. మనపరిశ్రమల నొక్కొక్కదాని స్థితిగతులను విచారించి, వాని బలపఱచుమార్గముల నన్వేషించుటకై మూడుసంవత్సరములనుండి టారిఫ్‌బోర్డు (Tariff-Board) ద్వారా గవర్నమెంటువారు చేయుచున్న కృషిచే అనేకరహస్యములు వెల్లడియగుచున్నవి.

ఇది ఇట్లుండ, ఈ యార్థికనీతికి ఫలితముగ ఇండియాదేశమందలి వ్యవసాయస్థితి క్షీణించుచున్నట్లు మనదేశవాసులు గమనించకపోయినను, ఆంగ్లదేశమందును ఈ దేశమందును గొప్ప యంత్రపరిశ్రమలను నడుపుచున్న విదేశీయవర్తకబృందము గ్రహించుచున్నది. సమస్తమునకు మనజీవయాత్రలో విదేశవస్తువులపై నాధారపడియుండిన కర్షకుడు క్రమశః తన వృత్తినైపుణ్యమును, దానిని లాభకరముగా సాగించుకొను ఆర్థికసామర్థ్యమునుగోల్పోయి ఆంగ్లేయుల యంత్రశాలల కాహుతిచేయుటకైనను తగినపంటదినుసులను పండింపలేకున్నాడు. పండించిన సరకైనను ప్రశస్తమైనది కాకపోవుటచే యంత్రములకు పనికిరాకున్నది. ధరయు తే లేకున్నది. లాంకాషయిరు యంత్రమగ్గములకే గాక బొంబాయి అహమదాబాదు కరాచీమగ్గములకుకూడ అమెరికా, ఈజిప్టుదేశములనుండి ప్రత్తియు, మన దేశమునకు జపానునుండి నూలును దిగుమతి కావలసినస్థితి గలిగినది. అన్యదేశములకు పంచదారను ఎగుమతి చేయుచుండినమనదేశము ఇతరదేశములనుండి చాలవఱకు పంచదారను దిగుమతిచేసికొని వాడుకొనుచున్నది. మఱియు గోదుమలు, బియ్యము మన వ్యవసాయకులు పుష్కలముగా పండించి యితరదేశముల కెగుమతి చేయుచుండిరి. ఇప్పుడు అన్యదేశములు మనకంటె చవుకగా ఈ దేశమునకు వానిని దిగుమతిచేయు చున్నారు. గతసంవత్సరములో 1 కోటి రూపాయల బియ్యము విదేశములనుండి యిచ్చట దిగినది. ఈసంవత్సరము కస్టమ్ డ్యూటీసు (Custom-duties) అనగా ఎగుమతి దిగుమతి పన్నులు తగ్గినందుకు కారణము చెప్పుచు క్రొత్త ఆర్థిక మెంబరు సర్ జార్జి షుస్టురుగారు ఒక ఆశ్చర్యకరమగు సంగతి తెల్పిరి. మిడిటరేనియన్ సముద్రప్రాంతదేశములవారు వడ్లు పండించి యిక్కడికి దిగుమతి చేయుచున్నారనియు, అందుచే 7 కోట్ల రూపాయల బియ్యపుసరకు మనదేశములోనుండి ఎగుమతికాక కోస్తాలలో నిల్చిపోయిన దనియు, ఆ కారణమును బట్టి ఎగుమతిపన్ను గవర్నమెంటుకు నష్టము కలిగినదనియు చెప్పియున్నారు. గోదుమలస్థితి యింతకంటె దుర్భరముగనున్నది. లక్షలకొలది టన్నులు అన్యదేశములనుండి దిగుమతి అగుచున్నవి. మన పంటలకు ధరలు తగ్గుచున్నవి. ఇందుచే వ్యవసాయకునికి విదేశవస్తువులు కొను సామర్థ్యముకూడ తగ్గిపోయినది. ఇందుకై ఆంగ్లేయ వర్తకులు తహతహపడుచున్నారు. వారు ఈ సంవత్సరము హైందవకర్షకుని కొనుగోలుశక్తికి (Purchasing power) లెక్క తయారుచేయింపగా, యుద్ధమునకు పూర్వము 1914 సంవత్సరములో మన దేశవాసులు మనిషి ఒకటికి 18 గజముల పీస్‌గుడ్సు అనగా గుడ్డ కొనుచుండె ననియు, ఇప్పుడు 1929 సంవత్సరములో ఒకొక్కడు ఆవరేజిమీాద 10 గజములె కొనుచున్నాడనియు, తేల్పబడినది. ఈ కారణములచే వ్యవసాయస్థితి వృద్ధిచేసి, కర్షకుని ఆర్థికస్థితిబలపరచి అతనికొనుగోలుశక్తిని పెంపొందింపవలయునని ఆంగ్లవర్తకులు గవర్నమెంటువారిని ప్రోత్సాహపరచుచున్నారు. పొదుగుకోసికొని పాలుత్రాగిన సామెతగా, కర్షకుని నిర్ధనునిగా చేసినతరువాత, తమ యంత్రనిర్మితవస్తువితతిని, కొనువాడెవడు? కొన

గల శక్తి గలవా డెవడు? అను బుద్ధి యిప్పటికి వారికి పొడకట్టినది. ఈ ఆందోళనమే వ్యవసాయపు రాయలు కమిషన్‌కు కారణము. ఆ కమిషనువారు వారి రిపోర్టులో వ్యవసాయము బాగుపడవలెనని యు,వ్యవసాయకుని ఆర్థికస్థితి బాగుపడవలెననియు,అందుకై అతని ఆదాయమును వృద్ధిపొందింపగల యితర వృత్తులను అనగా గృహపరిశ్రమలను కల్పింపవలయు ననియు నిరూపించియున్నారు.

ఇట్టి పరిశ్రమలను యిండియను యిండస్ట్రియలు కమిషను వారు రెండు విధములుగా విభజించియున్నారు. ఒకటి కులక్రమాగత కళాకౌశలమును చూపు వృత్తులు (Crafts) వడ్రంగము, కమ్మరము, బంగారు వెండి నగలవృత్తి, దంతపుపని, నగిషీపని మొదలగునవి. ఇట్టి వృత్తులకు అంతగా యంత్రములపోటీ లేదు. ఇవి కులవృత్తులుగానుండి అనుశ్రుతముగా కుటుంబములలోని పిల్లలవల్ల శుశ్రూషచే నేర్చుకొనబడుచుండెను. చిన్నతనములోనే ఇవి అలవడవలయుననుగాని పెద్దవారికి వీనిని చక్కగానేర్పుటకు సాధ్యముగాదని పారిశ్రామిక పండితులు చెప్పుచున్నారు. ఆధునిక అనుభవమువల్ల ఏ కులములోని పిల్లలకైనను చిన్నతనములోనే చక్కని శిక్ష కలుగజేసినచో నిట్టి వృత్తికౌశలము సులభముగా నలవడు నని యిండస్ట్రియలు స్కూళ్లు నడపు నుపాధ్యాయులు తెలుపుచున్నారు. ఈ వృత్తులను తగిన పారిశ్రామిక విద్యాలయముల ద్వారా అభివృద్ధిజేయుటకు మంచిప్రయత్నములు జరుగవలయును. రాష్ట్రములందు ఈ పారిశ్రామికశాఖను పరిపాలించు మంత్రులు ఇందువిషయములో కొంత కృషిచేసి దేశమునకు మేలు చేయవలయునని ప్రయత్నించినమాట వాస్తవము. రాజకీయవాద ప్రతివాదములలో మన కీ పారిశ్రామికకృషిని గుఱించి విమర్శించుటకు కాలము లేకపోవుటచే ఆ ప్రయత్నము లంతగా వెల్లడి కాలేదు. చెన్నరాష్ట్రములో కూడ మంత్రులు 1921 సంవత్సరమునుండియు కొంత కృషి సలిపియే యున్నారు. అయినను రెండు కారణములచే ఈ ప్రయత్నములు అంతగా ఫలవంతములు కాలేదు. మొన్నటివఱకు మెస్టను అవార్డు అమలులోనుండు అభివృద్ధిశాఖలకు ద్రవ్యసహాయము కలుగకపోవుటచే యిండస్ట్రియలు పాఠశాలలు విజృంభింపజేయ వీలు గలుగలేదు. రెండవకారణము ప్రజల అజ్ఞానము, పారిశ్రామికవిషయములందు, రాజకీయములందు లగ్నమనస్కులైనవారి నిస్పృహ నిరాదరణసహా నాయకులైన రాజకీయ నేతలు (leaders) ఈ విషయములవంకకు దృష్టి మరలించువఱకు వీనిగతి యిట్లే యుండును. ప్రజలలో ప్రబోధము, దేశనాయకుల పట్టుదల వీని అభివృద్ధికి అత్యావశ్యకములు. చేతినూలు పరిశ్రమ,ఒక్క గాంధిమహాత్ముని ప్రబోధముచే ఎంతవఱకు వ్యాపింప గలిగినది? మహాత్ముని అనుసరించి నాయకు లీ విషయమునందు శ్రద్ధవహించియుండనిచో ఎట్టి అభివృద్ధియు సాధ్యము కాకుండెడిది. ఇండస్ట్రియలు కమిషనువారి విభాగమునుబట్టి రెండవతరగతి వృత్తులను గృహపరిశ్రమ లనదగును. వీనిని జయప్రదముగా నడుపుటకు కావలసినది కులక్రమాగతకళాకౌశలము కాదు. వీనికి వలయు కౌశలము సులభలభ్యము, కొద్ది శిక్షణతో నలవడునది. కళాకౌశలముకంటె వాణిజ్యపరిస్థితుల పరిజ్ఞానము, మంచి పనిముట్ల నుపయోగించుటకు వలయు ద్రవ్యోపపత్తి, సామగ్రిని కొనువారి మనస్సుల నాకర్షించు నమోనాలను తయారుచేయుటకు కావలసిన ప్రపంచజ్ఞానము, తయారుచేసిన వస్తువులను విక్రయించుటకు గల వ్యవహారదక్షత మొదలగునవి అవసరములు. ఇట్టి పరిశ్రమలలో చేతినేత (Hand weaving) అగ్రస్థానమును వహించుచున్నది. చేతినేత పరిశ్రమ మిల్లుపరిశ్రమతో పోటీచేయజాల దను నభిప్రాయము పెక్కండ్రకు గలదు. అది కేవలము పొరపాటని గవర్నమెంటు ప్రచురించిన రిపోర్టులవలననే స్పష్టమగుచున్నది. చేతి నేతగాడు సులభముగా ధనార్జనమునందు మిల్లు పనివానితో పోటీచేయగలడని స్పష్టముగా నిరూపింపబడినది. ఈ పరిశ్రమను పునరుజ్జీవింపజేయుటకు ముఖ్యకారణము బంగాళా రాష్ట్రవిభాగ ఆందోళనము. అప్పటినుండి మనదేశములో తయారు అయిన బట్టలనే కట్టవలయు ననువారి సంఖ్య మిక్కిలి వృద్ధిగాంచిన మాట వాస్తవము.విదేశపునూలుతో నేసినను, స్వదేశపునూలుతో నేసినను, చేతిమగ్గములమీద తయారు అయిన బట్టకు 1907-1908 సంవత్సరము మొదలు ఎక్కువ ప్రోత్సాహము కల్పింపబడినది. నేడు ఇండియాలో వాడబడి బట్టలో పూర్తిగా మూడవవంతు చేతిమగ్గములమీద తయారగుచున్నది. మూడవవంతు యిండియాదేశములోనే మిల్లులమీద తయారు అగుచున్నది. తక్కినమూడవవంతే విదేశములనుండి దిగుమతి అగుచున్నది. ఈ గృహపరిశ్రమను వృద్ధిపొందించుటకు అత్యంతమైన అవకాశముకలదు. కేవలము చేతితో వడికిన నూలు ఈ మగ్గములకు చాలకపోయినను,మంచిదిగా తగినంత దొరకకపోయినను యిండియాలో వడుకుమిల్లుల (Spinning Mills) మీద తయారుచేయబడును. మిల్లునూలుతో ఈ చేతిమగ్గములు సులభముగా మనకు కావలసిన బట్టనంతయు నేయగల వనుటకు సందేహము లేదు. అనేకమంది నేతగాండ్రకు నేతయే పూర్ణవృత్తి. అది గాక సాలీలలో అనేకులు నేతకు తోడు వ్యవసాయముకూడ వృత్తిగా గలిగియున్నారు. సాలీలు కానివ్యవసాయకులలో ననేకులు నేతవృత్తిని అవలంబించి యున్నారు. కాబట్టి యీచేతి నేత పూర్ణవృత్తిగాను ఖండవృత్తిగాను లక్షలజనలచే అనుసరింపబడుచున్నది. సన్నబట్టలు నేయుటలో చేతిమగ్గము మరమగ్గముకంటె మంచి సాధనము. మిక్కిలి ముతకబట్టలు నేయుటయందును, అట్లే మధ్యతరగతిబట్టలు నేయుటలోను యంత్రములకు కొంత ఎక్కువ చులుకు ఉండిన ఉండునుగాని, అందుగూడ చేతిమగ్గపు నేతగాండ్రు మరమగ్గముల పోటీకి నిల్చి మరమగ్గములో పనిచేయువారికి లభించిన దినవెచ్చమును సులభముగా సంపాదింపగలరని నిరూపింపబడినవి. ఈపరిశ్రమను అభివృద్ధి చేయుటకు మద్రాసు పారిశ్రామిక డిపార్టుమెంటువారు కొంత మంచికృషియే సల్పియున్నారు.స్థాయినేతపాఠశాలలు(Fixed weaving schools) మూలముగను, సంచారప్రబోధము (Demonstration) మూలముగను అనేకులు శిక్షణమును బొందియున్నారు. 1914 సంవత్సరములో రెండు సంచార ప్రదర్శన పార్టీ లుండెను. 1920-21 లో 5 పార్టీలును, 1921-22 లో 8 పార్టీలును, 1922-23 లో 10 పార్టీలును ఏర్పాటు చేయబడి మరమగ్గము (Fly shuttle loom) మొదలైన మేలుమగ్గముల వాడుక వ్యాప్తి గావింపబడినది. ఈ కృషివలన అదివఱకు నూఱుగజములగుడ్డ నేయుకాలములో 140 మొదలు 200 గజములవఱకు నేయ కౌశలమును సామర్థ్యమును గడించిరి.

షాహుకారులవలనను, వర్తకులవలనను యితరులవలనను ఈ పరిశ్రమకు అనేక అంతరాయములు కల్పింపబడు చున్నవి. తన్నివారణోపాయములను అరసి యీపరిశ్రమను వృద్ధిచేయుట దేశక్షేమము నభిలషించువారి కందఱికిని అవసరము. ఇట్టి సదుపాయములు కలుగజేయుటకు 7 రాష్ట్రములలో కేంద్రసంస్థలు గలవు. (Central Institutes) ఇవి మంచిపని చేయుచున్నవి. వ్యవహార శిక్షణమే గాక, పరిశ్రమశిక్షణముకూడ ఈ సంస్థలద్వారా లభించు చున్నది. నేతపరిశ్రమ కనుబంధములగు కలంకారి, రంగుపనులు కూడ వీని కార్యక్రమమందు ఇముడ్పబడియున్నవి. కొన్ని రాష్ట్రములందు యీ నేతగాండ్ర సరకులను అమ్ముటకు డిపోలు గవర్నమెంటువారివలన నేర్పఱుపబడినవి. పంజాబులో ఇట్టి డిపో 1921 సంవత్సరమునుండి పని చేయును, ఆ నేతగాండ్ర సరకులకు తగిన ధరలను రాబట్టి అమ్ముటలో చాల సహాయము చేసినది. సంయుక్త రాష్ట్రప్రభుత్వమువారు ఈ చేమగ్గముల బట్టను ఇంగ్లాండులో విక్రయించుటకు లండనులోని ఏజంట్లను విక్రయించి యిక్కడ ఒక ఎంపోరియముద్వారా బట్టను పంపుచున్నారు. బట్టలు మంచివని అంగీకరింపబడి అమ్మకమగుచున్నవి. మధ్యరాష్ట్ర ప్రభుత్వమువారిచేతను బీహారురాష్ట్రప్రభుత్వము వారిచేతను, అస్సాముప్రభుత్వమువారిచేతను ఇట్టి డిపోలు ఏర్పాటుచేయబడి బాగుగా పనిచేయు చున్నవి. మన రాజధానిలోగూడ నిట్టి ఏర్పాట్లు చేయుట అత్యవసరము. ఎలెక్షను హడావిడులు అయిన వెనుకనైన పారిశ్రామికమంత్రిగారీ విషయమును గమనించెద రని నమ్మెదను.

మనరాజధానియందె పునరుద్ధారణ చేయదగిన పరిశ్రమలు అనేకములు గలవు. వీనియొక్క వివరములను కనుగొనుట కొరకు సంక్షేపవిచారణ (Preliminery sources of Cottage industries) జరుగుచున్నది. ఈ విచారణయొక్క ఫలితములను దేశాభిమానులందఱును చదివి, చర్చించి, యీ గృహపరిశ్రమల వృద్ధికి తగుకృషి సలుపవలసియున్నది. గ్రామములయొక్క ఆర్థికస్థితి మాటలతోను బాగుపడదు. నిరంతర కృషి సలుపవలసియుండును. ఆర్థిక పరిశ్రామిక విషయములను ఎంతవఱకు నిర్లక్ష్యముగా చూచెదమో అంతవఱకు అభివృద్ధి లేదు. రాజకీయ సంస్థలు ముఖ్యములే. స్వాతంత్ర్యము లేనిది ఏ ప్రయత్నము పూర్తిగా నెఱవేఱదు. అది నిజమే. అట్లని ఆర్థికవిషయములందు మూకీభావముగాని, నిరాదరణగాని చూపరాదు. కొందఱు స్వరాజ్యము లేనిది ఏదియు రాదను సంగతినే ఆధారముచేసికొని నిర్వ్యాపారతకు సమాధానమును కల్పించుకొనుచున్నారు. అట్లుగాక నిర్మాణకార్యక్రమములో ఆర్థిక పారిశ్రామిక విషయములను చేర్చి ఎంత స్వల్పమైనను సరే తగిన కృషి ప్రతివారునుచేసి మాతృభూమిని దాస్య శృంఖలములనుండి విడిపించుటతోపాటు ఇప్పటినుండియు ధనధాన్య సమృద్ధముగా జేయుదురుగాక.

---

# శ్రీ శుక్లవర్షోదయము.

శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారు.

ఉ॥ శ్రీదయితాజ్ఞ వర్తిలు నశేషధరిత్రికి మోద మీయఁగా
నీదగురాక యొప్పు నని నెమ్మనమందున నమ్మి నీదు భ
వ్యోదయముం గుఱించి కదునుల్లము మీఱఁగ స్వాగతం బిడం
గాఁ దగువార మబ్దగణగణ్యమ! శుక్లశుభాభిధానమా!

శా॥ కారుణ్యామృతపూరపూరితకటాక్షశ్రీకశ్రీరాఘవో
దార బ్రహ్మపదారవిందయుగళీధ్యానప్రధానాశయుల్
సారెన్ మించఁగ, రామరాజ్యమటు నీ సంవత్సరంబంతయున్!
మీఱుంగావుతఁ దొంటివర్షముల నెమ్మిన్ సౌఖ్యదత్వంబునన్.

మ॥ కవులున్ బండితులున్ ధనాఢ్యులును రంగద్ధర్మకర్మానుగుల్
మివులన్ మించి; శుభాశుభమ్ములను నెమ్మిన్ గాంచ, కత్యంతదు
ష్టవిధిం గొంపలఁగూల్చి నీచులయి వేషాల్ పైకిఁ జూపించు భ్ర
ష్టవివేకాత్ములు నీదుకాలమున నేలం బాటుగాం ద్రబ్దమా!

శా॥ పూర్వుండౌ విభవాభిధానుఁ డకటా! పుణ్యాభిధం దాల్చియున్
సర్వక్ష్మాంతలదుఃఖ మొప్ప లజపన్నామున్ వాఱిన్ బానగ
ల్లుర్వీశుల్ దిగమ్రింగెఁ; "బేరునకు నెంతో పెద్దయూర్దిబ్బ"యై
గుర్వాపన్నికరంబు మాదృశులకుం గూర్పించె; శుక్లాబ్దమా!

ఉ॥ తెల్లనివర్ణ మెంతయును దీఱును దోసములేక యంచు రా
జిల్లును లోకరీతి; యల చెల్వునఁ దాల్చినవాఁడ వీవు న
త్తెల్లనివన్నె పేరు; నటు తెల్లనికీరితి నెల్లదిక్కులం
దుల్లసిలంగఁ గాంచవలె నొయ్యన; శుక్లసదబ్దరత్నమా!

ఉ॥ పావననామ మూనియును వచ్చెడువారలు వేనవేలు; త
త్పావననామసామ్యముగఁ బావన భావము నూనువారు సం
భావనసేయఁ గొంతగనె పర్వెడివారలు; శుక్లవర్షమా!
నీ వొగి భావపూర్తిని ననింద్యచరిత్రుఁడవై చెలంగుమా.

# కవిత్రయప్రణుతి

నేమాన సూర్యప్రకాశకవిగారు.

---

సీ॥ రాజరాజనరేంద్ర రాజితాస్థాన స
త్కవిసార్వభౌముఁ డై గ్రాలె నెవఁడు
భాసమానోభయభాషావిశేషాతి
శేముషీమహిమంబుఁ జెందె నెవఁడు
వర్ణనీయాహీన వాగనుశాసన
బిరుద మందిన మహాపురుషుఁ డెవఁడు
వ్యాసరచిత భారతామ్నాయ మాంధ్రీక
రింపఁబూనిన కవిశ్రేష్ఠుఁ డెవఁడు
అతని మతిమంతు మధురవాగమృతసార
సతత ముదితాంధ్రలోకుఁ బ్రశస్తకీర్తి
ఘనశరచ్చంద్రచంద్రికాక్రాంతసనుది
గంతరుని నన్నయార్యు నే నభినుతింతు.

సీ॥ ఉరుబుద్ధి నిర్వచనోత్తరరామాయ
ణముఁ గూర్చి యేకవినాథుఁ డలరె
క్రతు వొనరించి సత్కృతి గాంచి క్షితి సోమ
యాజి యై యేకవి తేజ మొందె
భారతామ్నాయంబు పదునేను పర్వంబు
లేకవీంద్రుఁడు రచియించి మించె
కాంచనగర్భసంకాశుఁ డితండంచు శ్రీ
నాథుఁడేకవిశ్రేష్ఠుఁ బొగడె
నతని సతతాతికీర్తిసుధానులేప
దీపిత మహామనోజ్ఞాంధ్రదేశు నతను
ధీశు పేశలఁభాషాఫణీశు సుగుణ
సాంద్రుఁ దిక్కన కవిచంద్రు సన్నుతింతు.

సీ॥ అనవద్యహృద్యవిద్యావిశారదుఁ డయి
యే మహాకవివర్యుఁ డెనక మెసఁగె
పటుభారతారణ్యపర్వశేషంబు పూ
రించి యేసుకవివరేణ్యుఁ డలరె
నధికభక్తివహించి హరివంశము రచించి
యేసత్కవి ధరిత్రి కింపునింపె
పెంపుగా జగము వర్ణింప నేకవిమాళి
శంభుదాసఖ్యాతి సరవిఁగాంచె
నతని నతులిత సత్కీర్తి వితతఫుల్ల
మల్లికా మాలికావళీ మండితాంధ్ర
దేశయోషామణీ కంఠ దేశు శ్రీశు
నెఱ్ఱనకవీశు మతిమంతు నే నుతింతు.

చ॥ ప్రకృతకవిప్రతానము సెబా సన నాంధ్రకవిత్వమార్గద
ర్శకు లయి లక్ష్యలక్షణ విరాజిత పూజిత భవ్యకావ్యముల్
సుకరముగా రచించిన యశోధనులన్ ఘనులన్ ద్రిమూర్తులన్
సకలకళావిశారదుల సత్కవిచంద్రుల సన్నుతించెదన్.

గీ॥ ఎలమి వాణీశమహిమ లక్ష్మీశగరిమ
భూరిసర్వజ్ఞవిస్ఫూర్తిఁ బొంది విబుధ
సేవ్యు లై త్రిమూర్తులఁబోలె చెలువుఁ గనిన
నన్నయను తిక్కనను నెఱ్ఱనను నుతింతు.

---

# త్యాగరాజ నవరత్నమాల

శ్రీమాన్ కరి నారాయణాచార్యులుగారు, ఆంధ్రగీర్వాణసాహిత్య పరిషత్తు.

---

శ్రీరఘురామపాదసరసీరుహభక్తమణీ! సుధీమణీ!
చారుతరాతిమార్దవసుశబ్దసమంచితగేయకారకా!
భూరిభవాంబురాశిగలపూరుషసంతరణక్రియోడుపా!
సారెకు నిన్నుఁ బ్రీతిమెయి సన్నుతిఁ జేసెదఁ ద్యాగరాట్సుధీ!

ఉ॥ అచ్చతెనుంగునందుఁ గడు నాదట జానగు దేశ్యి మీఱఁగా
ముచ్చట మాటఁ గట్టుగతి ముష్కర మై యలరారుబత్తితో
లచ్చినెలంతఁజేనిసయి రంగగు పాటల నెన్నియేని పె
స్మచ్చిక మీఱఁజేసితివి మాయురె! ప్రౌఢవు త్యాగభూవరా!

ఉ॥ క్రొన్ననగుత్తిపిండుతళుకుం దెగనాడు తెడంగు కబ్బపుం
గన్నియమిన్నఁ గన్న యలగాటపు బమ్మెరవంగడంపుఁ బో
తన్నవితాన నీవు మదిఁ దద్దయు బత్తిని గైతలింపుగా
నెన్ననిమీఁదఁ గూర్చితివి వేడుక మీఱఁగఁ ద్యాగరాట్సుధీ!

ఉ॥ ఒక్కెడ మార్దవోక్తులు మఱొక్కెడ దీర్ఘసమాసజాల మిం
కొక్కెడ నర్థగౌరవ మిఁకొక్కెడ మంజులభావయుక్త మై
యెక్కడఁ జూచిన న్మదికి నింపు ఘటించి ముదంబు నిచ్చు నీ
చక్కని కైతలన్ బొగడశక్యమె? మా కిఁకఁ ద్యాగభూవరా!

ఉ॥ మాయురె! నీదుకీర్తనలమాధురిఁ గానఁగలే మొకింతయున్
హాయిని గూర్చుఁ గంపిత మహా! స్ఫురితంబు జళీశె? యూహతం
బా యసమాన మూర్ఛన వహావ్వ! త్రిపుచ్ఛ మి టెన్నశక్యమే!
గాయకసార్వభౌముఁ డన నొగిఁ దగియుంటివి త్యాగరాట్సుధీ!

చ॥ అతితర మాధురీ రస సమంచిత మై విలసిల్లు తావకా
యత రమణీయ గేయ కమలాంతరవర్తి మరందవాహినీ
తత రసపాన సమ్మద మదభ్రమరవ్రజ సామ్యతన్ భవ
త్కృతుల భజింత్రు నానవు లహీనముదంబునఁ ద్యాగభూవరా!

ఉ॥ తావక గీత సంతతి నదభ్ర ముదంబున నభ్యసించి యీ
భూవలయాన గాయకులు భూపసభాస్థలులందు రత్నభూ
షావళి ముఖ్యగౌరవము లందుచు హస్తగతాపవర్గు లై
వావిరి భుక్తిముక్తుల సుభద్రత నుందురు త్యాగరాట్సుధీ!

ఉ॥ అంబుజనాభపాదభజనాదరమోదితమానసుండ వై
తుంబురునారదప్రముఖదుర్జయగానవిశారదుల్వలెం
దంబురఁ జేత మీటుచు ఘనంబుగఁ జిత్తముఁ జక్రిపాదస
క్తం బొనరించి పాడుచును ధన్యుఁడ వైతివి త్యాగభూవరా!

చ॥ ఉరుతరణిప్రకాశ! భవదున్నతభక్తిమహత్త్వసంపదల్
గురుతరముల్ భవద్విమలకోమలగానకళాప్రవీణతల్
వరతరముల్ భవద్విపులభవ్యచరిత్రవిశేషము ల్మనో
హరతరముల్ గణింపఁగఁ గదా నుతు లేటికి? త్యాగరాట్సుధీ!



# బమ్మెర పోతరాజు

శ్రీ ఖాసీం అలీషాగారు.

సీ॥ పసిఁడిమేడ లొసంగు ప్రభువతంసములుండఁ
బూరిండ్లయందునే చేరినావు
రత్నాంబరము లిచ్చు రారాజు లుండంగఁ
గదురుబట్టలఁ గట్టఁ గడఁగినావు
మృష్టాన్నములు గూర్చు మేదినీశ్వరు లుండఁ
ద్రైదంబలినె త్రాగఁ దలఁచినావు
అగ్రహారము లిత్తు మను ధరాధిపు లుండ
దారిద్ర్యభారమే తాల్చినావు
కోరుకుల నంటి నొనగూర్చు ధీరు లుండ
పరులసాయంబు రవ్వంతఁ బడయకుండ
జీవయాత్రను జెల్లించినావు బళిర!
పూతగుణధుర్య! బమ్మెర పోతనార్య!

సీ॥ నిత్యకృత్యమునెల్ల నెఱవేర్చి ప్రత్యూషం
బున భారతీదేవి పూజఁ దీర్చి
కలగంజిదైన అంబలిదైన భుజించి
ములుగఱ్ఱ చేతిలోపల ధరించి
కట్టుమట్టునఁ బండినట్టి యెద్దులఁ ద్రాళ్లఁ
గట్టి మూతులకుఁ జిక్కాలు వెట్టి
కోఁటిలిమెడ్లఁ దోల్కొని పోయి చేనివెం
టను నిల్చి అరకపన్నకము పన్ని
దుక్కులను దున్ని పంటలఁ బెక్కు పండఁ
జేసికొని తగ్గ మనుగడఁ జేసికొన్న
నిన్నువంటి కృషీవలుం డున్నవాఁడె
వినుతసద్గుణసాంద్ర! పోతన కవీంద్ర!

సీ॥ తాటాకుఁ బట్టగాఁ దగు నీ యెడమచేయి
మోటుమేడిని నెట్లు పూనెనయ్య?
పైడిగంటముఁ బట్టఁబడు నీదు కుడిచేయి
ములుగఱ్ఱ నేలాగు మోపెనయ్య?
తడి మడివస్త్రంబు ధరియించు భుజ మహో!
చెలగోల యేమాడ్కి నిలిపెనయ్య?
అరుణాబ్జములఁ బోలనైన నీ చరణముల్
పెల్లరేగిన దుక్కి వెళ్లునయ్య
రేగయెండకుఁ బయిపయిన్ దోఁగుచుండు
చెమటచిత్తడి నొకచేతఁ జెఱుపుకొనుచు
పరుగుపరుగున నెద్దులఁ దఱుముకొనుచు
ఘనత గంటే బుధేంద్ర! పోతనకవీంద్ర.

సీ॥ చిలుకలు గోరువంకలు కోయిలలుగూడఁ
గిలకిల కలరవంబులఁ జెలంగు
కాలతత్త్వం బెఱుంగని వల్లికలుగూడ
జలజలఁ బుష్పవర్షములు గురియు
మొద్దువాఱినయట్టి మోడుమ్రాఁకులుగూడఁ
జిగిరింతలాగునఁ జిగురు వెట్టు
బొ డ్డూడిపోవని పురిటిపాపలుగూడ
వెలయంగ నవ్వుటాటలకు దిగుదు
రది యిది యనంగనేల సర్వాంతరముల
ప్రకృతిజీవంబు గల జీవనికర మెల్ల
పర ముదముఁజెందు నీ భక్తిభావములకు
కవితగుణగణ్యా! పోతనకవివరేణ్యా!

సీ॥ ప్రకృతిశృంగారంబు పరికించి పరికించి
వసతత్త్వభావంబు తఱచి తఱచి
దేశీయభాషలఁ దిలకించి తిలకించి
వేదాంతసారంబు వెదకి వెదకి
కవితారహస్యంబు గాలించి గాలించి
శాస్త్రజాలం బెల్లఁ జదివి చదివి
బహుదేశబుధులతో భాషించి భాషించి
సజ్జనస్నేహంబు సలిపి సలిపి
తలఁప సంస్కృతభాగవతమ్ముఁ దెలుఁగు
రచనఁ గావించియుం బునర్జన్మరహిత
యశుఁడ వై ముక్తికామిని వశుఁడ వైతి
వినుతకవితానివేశ! పోతన కవీశ!

సీ॥ నవనవోన్మేష మార్దవ మాధురీ భాష
భాషకుం దగినట్టి భావపుష్టి
భావపుష్టికిఁ దగ్గ పాండిత్యమును బాండి
తికిఁ దగ్గ సద్రసప్రకరణంబు
రసమునకుం దగ్గ రచనావిధానంబు
రచనకుం దగినట్టి రుచిరశయ్య
శయ్యకుం దగినట్టి చతురలోకోక్తులు
లోకోక్తులకుఁ దగ్గ పాకగరిమ
పాకమునకును దగినట్టి ప్రాస యతులు
ప్రాసయతులకుఁ దగినట్టివైన గణము
లమరి నీ కవితంబు సద్యశముఁ గాంచె
బుధజనవిధేయ! బమ్మెర పోతరాయ!

సీ॥ చీలమండలదాఁకఁ జీరాడి చెన్నారు
జిలుఁగుఁబంగరుజరీచీరఁ గట్టి
కటికిఱాలనుగూడఁ గరఁగించుగానంబుఁ
జిలికించు వీణియఁ జేతఁ బట్టి
కనుదోయినుండియుం దొనికాడు నశ్రువుల్
చేలాంచలంబునఁ జిందఁ గొట్టి
వదనాంబుజమున వెల్వాడు గద్గదస్వర
నినదరోదనము వెన్వెనుకఁ బెట్టి

నన్నుఁ గర్ణాటకుల కమ్మ న్యాయమయ్య
కొడుక ! యను వాణిఁ గాంచి నీ నుడిన నుడులు
గుండియలు గాలములుగదా పండితులకు
సత్యగుణధుర్య పోతనామాత్యవర్య !

సీ॥ నవయౌవనాఢ్య యా కవితాలతాతన్వి
అల్లారుముద్దులఁ గొల్లలాడి
దరహాసచంద్రికాదరముక్తికామినీ
కేళికాగృహమందుఁ గాలు నిలిపి
మునికుమారులయిండ్లముందుఁ గావలిఁ గాయు
ముక్తికామినితోడ ముచ్చటొంది
ప్రకృతి తత్త్వానంద భాసమానాస్య యా
రసవిలాసినికూర్మి రతులఁ దేలి
పండితులలోనఁ గవులలో భక్తులందు
బ్రతికినన్నాళ్లు పేరైన బ్రతుకు బ్రతికి
జన్మ కిల సార్థకత్వంబు సలిపినావు
సుభగగుణచంద్ర ! పోతనసుకవిచంద్ర !

సీ॥ మోటుమానిసినోటిమాటలోపలఁ గూడ
నాటించితివి మేటినూటినూక్తి
తోరంపుఁగ్రూరజంతువులలోపలఁగూడ
నతికించినాఁడ వనన్య ప్రేమ
తల తోఁక లేని బొమ్మలచేతనుం గూడ
బలికించితి మరల్ గొలుపు పలుకు
తొలికాఁపురంపు ముగ్ధలచేతనుం గూడ
నడిపించితివి తత్త్వనాటకంబు
భోగి రాగిగ రాగిని భోగిగాఁగ
తిమ్మి బ్రమ్మిగ బ్రమ్మిని తిమ్మిగాగ
త్రిప్పఁగల వౌర నీ బుద్ధితేటచేత
వినుతభాషానివేశ ! పోతనకవీశ !

సీ॥ సిగపూవులం జుట్టి వగలాండ్రయిండ్లలో
సర్వదా చరియించు జారుఁడైన
కంటఁ గారముఁ గొట్టి యొంటిసొమ్ముల నంటి
పుటుపుటుక్కునఁ ద్రెంచు కుటిలుఁడైన
ఆలమేఁకల గొట్టియల గొంతులం బట్టి
పరపరఁ దెగఁగోయు పాపుఁడైన
మేలుకొంపలు దివాలాలు దీయించి దీ
పము లార్పు దుష్కృతభావుఁడైన
గురువులందు యతీశ్వరవరులయందు
అప్రమాణంబు లొనరించు నధముఁడైన
భక్తిమై నీదుపద్యముల్ పాడినంత
పతితుఁ డౌఁగద పోతిన్నభక్తవర్య !

సీ॥ గుళ్లలో రాచసావిళ్లలోపలఁ గూడ
సూనృతాలాపమే చూపినావు
వీటిలోన శ్మశానవాటిలోపలఁ గూడ
వైరాగ్యతత్త్వమే వలచి నావు
భక్తిలో విషయేచ్ఛ రక్తిలోపలఁ గూడ
సమరసభావమే చాటినావు
కృతులలో నిజదృగాకృతులలోపలఁ గూడ
ముక్తికామినితోడ మురిసినావు
కలనులో జాగ్రదావస్థ కలను లోన
సత్యమార్గానలోకమే సలిపినావు
నిన్నుఁ బోలిన ధీవరుఁ డున్నవాఁడె
రమ్యగుణభోగి ! పోతన రాజయోగి !

సీ॥ మడి దున్నుకొని మనుగడఁ జేసికొన్నట్టి
కవిశిరోరత్న మొక్కండు గలఁడె
లేమిడిం బడికూడఁ గామించి పరులకుం
జెయి సాపఁ బోవని శ్రేష్ఠుఁ డున్నె
సహజపాండిత్యంబు సత్కవిత్వంబును
సాధించినటువంటి సరసుఁ డున్నె
మఱికిసంసారాన మునిఁగియుండియుఁగూడ
గడియలోఁ గడతేరు ఘనుఁడు గలఁడె
మాయలోకానఁ బుట్టి యుపాయ మెఱిఁగి
చేయవలసిన కార్యముల్ చేసి తుదకు
సర్వవిధముల సార్థకజన్ముఁ డైతె
బుధకవి విరాజ బమ్మెరపోతరాజ !

---

## మితమే–హితము

హైదరాబాదు నరసింహాచార్య గారు.

---

ఎక్కువ మెక్కునాతనికి
నేమియు సాపడకుండువానికిన్
ఎక్కువ నిద్రబోతునకు
నెల్లపుడున్ గత నిద్రవానికిన్
ఎక్కువ భావ గర్వునకు
నెక్కువచింతల నందువానికిన్
దక్కనె యోగ మభ్యసన
తత్వము హెూ సమదర్శినీ ! గనన్,

కొందఱు శాస్త్రవాదములఁ
గొందఱు దాంభికభావరూపులన్
గొందఱు సంఘసౌఖ్యములఁ
గొందఱు దాస్యపు గర్వ మత్తతన్
గొంద అసూయ దృష్టులనుఁ
గొందఱు యోగ్య విహీనచిత్తులై
యెందఱొ నిన్నుఁ గానకను
వృక్షికిరారు గదమ్మపత్త్రికా !



కీ. శే. లాలాలజపత్ రాయిగారు.



పండిత మోతీలాల్ నెహ్రూగారు.



పండిత మదనమోహన మాళవ్యగారు.



మహాత్మ గంధిగారు.



శ్రీ సుభాష్ చంద్ర బోస్ గారు.



పండిత జవ్హారీలాల్ నెహ్రూగారు.



సర్. అబ్దుల్ రహీమ్ బహద్దూర్ గారు.



తిరువాన్కూరు మహారాణిగారు (రీజంట్)



మిస్. శారదాబాయ్ నాయుడుగారు.



శ్రీ అరండేల్ సతిగారు.



శ్రీమతి పద్మావతి కనకరత్నం సతిగారు.



చదలవాడ నాగభూషణరావు చౌదరీగారి పితామహి.



శ్రీమతి శారదాబాయ్ గారు, బి. ఏ.



దేవి కమలాక్షి పాండలెగారు.



శ్రీమతి కమలామీనన్ గారు, బి. ఏ.



శ్రీ రామునిసడిగారు.

# సమదర్శి శతకము

శ్రీయుత మంగిపూడి వేంకటశర్మగారు.

సమదర్శి దేవుఁ డొక్కఁడె సమదర్శి యనంగ దేవసముఁడె నిజముగా
సమదర్శి నామధేయమ సమము త్తమము సుమ సర్వ సమసమదర్శీ.

సమదర్శ పేర సద్భావము లేక ధరింపబోవు భావోన్నతి జ
న్మముతోడ గలిగె నీపుణ్యము మంచిది దాని నిలుపుమా సమదర్శీ.

సమదర్శి కెన్నడును స్వార్థముకూడ దనూయ పనికిరాదు పరద్వే
షము తగదు దుర్గుణత్రితయము సు మ్మిది నీవి దెలియుమా సమదర్శీ.

నీయంతరాత్మ చూపిన చాయను నడిచితివయేని సన్మార్గంబుల్
బాయవు న్యాయము విడువవు హాయి గలుగు నీవ నమ్ముమా సమదర్శీ.

బోధించుట నీపని పగ సాధించుట కాదు సర్వసాధనములతో
నీధర్మము నెరవేర్చితివా ధన్యము నీదు జన్మ మవు సమదర్శీ.

బోధ యనగ సుజ్ఞానమె గాథలు నీకేల నీతి గలవారలు నీ
సాధుమతి మెచ్చి పొగడగ మేధానిధివగుచు మెరయుమీ సమదర్శీ.

నీ దేశవిషయ మీశ్వరు నాదేశము విని స్వధర్మ మరసి మహోద్ధా
మాదార్శ్యము జూపి బుధామోదము సద్యశము నొందు మో సమదర్శీ.

ఏయధికారము గోరకు మే యైశ్వర్యమున చిత్తమిడకుము మాయో
పాయముల లోంగబోకు మపాయములకు జంకబోకుమా సమదర్శీ.

పాపము పండెను ధర్మస్థాపనమున కిదియె మంచిసమయము శాంత
వ్యాపారము సాగింపుము ఆ పరమేశ్వరుడె సాయ మగు సమదర్శీ.

కులముల సంగతియును మతముల సంగతి నేడు మరచి పా మ్మివి మన యా
దలలను బుట్టినవే సుమి కలతపడకు వాని దలచి ఘన సమదర్శీ.

కాలప్రవాహమం దివి వాలాయము గలసిపోయి వైషమ్యంబుల్
తూలెడు శుభసమయం బిది మేలయ్యెడు మనకు చూడుమీ సమదర్శీ.

ధర్మములు మారె కుల మత మర్మములా జారె దురభిమానము పేరెన్
నిర్మలము లెట్లు కులములు నిర్మూలముగాక నిలుచునే సమదర్శీ.

మతధర్మంబులలో పరమతసహనమె ముఖ్య మది తమాము నశించెన్
మత మేల చెడక నిలుచును మతిశాలివి నీవు చూడుమా సమదర్శీ.

కులములును వర్ణములు వృత్తులు వర్ధిలుటకును జాతి దుర్జయమై సొం
పలరారుటకును పెద్దలు నెలకొల్పిరి దూరదృష్టినే సమదర్శీ.

ఆ దివ్య నవ్యయుగమున వైదికధర్మంబు సర్వప్రజలకు విధిగా
ఆదర్శమై చెలంగెను భూదేవత లైరి ద్విజు లపుడు సమదర్శీ.

స్వర్గముచేసిరి దేశ మనర్గళవిజ్ఞానలహరు లలరించిరి సం
సర్గము చేసిరి మనతో స్వర్గీయులె వచ్చి యెరుగవా సమదర్శీ.

ఆహా ఆమాహాత్మ్యము లూహింపగవశమె ఆమహోన్నతదశ ఓ
హోహో యనిపించిన దన సాహసమా చెపుమ సర్వసమ సమదర్శీ.

చదువులు సంధ్యలు మాసెను సదమల వర్తనలు సమసె శమదమగుణసం
పద చనిసె బ్రహ్మజాతికి గదిసెను తమసంబు కాలగతి సమదర్శీ.

ఉన్నతగిరి శిఖరమునం దున్ననరుడు పథము దప్పి యొరగిన నిక నే
మున్నది తొలిరూపముతో నెన్నడయిన నిలువనేర్చునే సమదర్శీ.

తొలిమెట్టు మీద గల మీతలపై బడి నోటి కడ్డుదగులుటచేతన్
కలసుకుబడి యన్యోన్యము కలహములకు దిగిరి నిజముగద సమదర్శీ.

విడిముడియన్న నసహ్యంపడి పరముంగోరి వెతలబడు బ్రాహ్మణులే
కడుపే కైలాసం బని మిడికెద రిది విధివిధియె సుమీ సమదర్శీ.

ఆదర్శంబులు విడిచి దురోదరములబోలె పంది మొద్దివి మానం
బీదరదృష్ట దురుద్యోగాదర్శము దాపరించి హా సమదర్శీ.

గతి దప్పి యగ్రవర్ణము పతనంబును జెందెనేడు పాతాళమునన్
యతచిత్తు లరుదయిరి ప్రస్తుత విప్రుల నేమి చెప్పుదును సమదర్శీ.

B

అగ్రంబు తిరిగిపోయిన నగ్రకులం బనుట మిగిలె నను సంబరమో
అగ్రకులం బనుకొనియెద రగ్రకులజు లేమి బ్రతుకయా సమదర్శీ.

అరుదుగనున్న ద్విజన్ములు పరమార్థము మరచి కర్మపరులై దేశం
బరయరు లోకజ్ఞానము బొరయరు మోక్షరతి మూలమున సమదర్శీ.

పరమార్థ దృష్టిగలిగిన పరోపకారమునకన్న బహుసులభం బౌ
పరసాధన మొకటున్నదె కోరవడెగా కెరుక ద్విజులకును సమదర్శీ.

దయయును సత్యము శుచి యధ్యయనము నధ్యాపక జపతపము లహింసా
నియమాదులు గలవాడే స్మయరహిత ద్విజు డనంగ జను సమదర్శీ.

చదువనగా జ్ఞానము సు మ్మది చదివినవారు కొంద రమరవలయు న
భ్యుదయార్థము దేశమునం దిది విను ద్విజులనగ వారలే సమదర్శీ.

ధర్మార్థ కామ మోక్షము లర్మిలి పురుషార్థములు గృహస్థు లకెల్లన్
ధర్మము మోక్షమె కోరిన మర్మజ్ఞుడె సుమ్మి విప్రమణి సమదర్శీ.

ధనమం దధికారమునందును భోగమునందు బ్రాహ్మణుని కాశలు లే
వనఘా పూర్వంబున నాతని భూదేవు డన నొప్పదా సమదర్శీ.

ఉద్యోగమం దపేక్షయె సద్యఃపతనంబు బ్రహ్మజాతికి దెచ్చెన్
ఉద్యోగము మానిన మది సద్యోగమె విధి గడవ వశమె సమదర్శీ.

జ్ఞానము లేని కతముననె హీనాచారములు బలిసె హెచ్చెను దంభం
బీనాటి బ్రాహ్మణుల కభిమానపడిన మాత్ర లాభమా సమదర్శీ.

ఇతరకులంబులవలెనే ప్రతికార్యంబునకు సిద్ధపడుదురు విద్యా
మత పరమార్థము లరయక బ్రతుకుదు రిక పూజ్యు లగుదురా సమదర్శీ.

చదు వెరుగక సుజ్ఞానము నొంద నెరుగక మూర్ఖ డగుచు మోహవివశు డై
బ్రదికెడు నరుండు భూసుర పదభాసుర డనగ నవ్వవా సమదర్శీ.

రాగద్వేషాదులు గలయోగియు బ్రాహ్మణుడుగాడు యోగ్యుల నిందా
భాగుల గావించెడు నుద్యోగులు ద్విజు లెట్టు లగుదురో సమదర్శీ.

తామసగుణంబు విప్రుల కేమియు దగదేగదా యికేలా చెపుమా
తామసులు ద్విజుల మందును నామబ్రాహ్మణులెగారె నా సమదర్శీ.

అందరికన్నను జ్ఞానమునందును లోకోపకారమందును త్యాగం
బందును ముం దడుగిడుచో నందగు ద్విజ నర్చచేయరా సమదర్శీ.

ధనకాంక్ష తగ్గినప్పుడె మనుజుడు పూజ్యుడగు సర్వమార్గంబుల నా
ధనమునకు పాకులాడిన ననఘుడు యోగ్య డన జెల్లునా సమదర్శీ.

ఉద్యమము లెన్నిలేవో యుద్యోగంబనుట కర్థమో యిది యేలా
యుద్యోగాలను జేయుట విద్యాఫల మనునొ చెప్పవే సమదర్శీ.

పూర్వయుగంబున నీగతి నుర్వీసురు లొక్కఁడైన నుండిరె సర్వుల్
సర్వజ్ఞులు సర్వసములు సర్వోత్తము లెన్నగా వశమె సమదర్శీ.

అకపటు లకలంకులు బ్రహ్మకులోత్తంసులను విశ్వమంతా యొకటే
ప్రకటము జగదేవకుటుంబక మని యన్నారు వింటివా సమదర్శీ.

అవురా విధివశమున నిపు డవివేకము హెచ్చి తెలియ రంతియె కానీ
యవనీసురులు స్వదేశం భువనత్రయ మనరె ప్రేమమున సమదర్శీ.

సమదర్శులైరి యెల్లరు దమ సోదరులనుచు మనుల దలచిరి విజ్ఞా
నము బంచిపెట్టి యర్థయసుఖము లందగ నొడుపడిరిగా సమదర్శీ.

ఆదర్శము బ్రాహ్మణపద మా దివ్యపదంబు జేరను నందరు నీ
భేదములు లేవు పూర్వము బీదవడిరె జ్ఞాన మిప్పుడు విను సమదర్శీ.

ఏ కులజాతుండైనను నేకులమున కర్హ దట్టిదే యతనికులం
బీ కీలకమును మరచితి మీ కలిలో తొంటివిధి యిదే సమదర్శీ.

రాజిల్లె భోజన ప్రతిభోజనములు సర్వవర్ణములవారికి నీ
యాజాతి యనక బాంధవ పూజాభాజనులె యైరిపో సమదర్శీ.

బ్రాహ్మణు లబ్రాహ్మణు లబ్రాహ్మణులే బ్రాహ్మణు లయి రానా డీ య
బ్రాహ్మణ బ్రాహ్మణ భేదము బ్రహ్మవిదులు పాటిచేసిరా సమదర్శీ.

ఎక్కువ తక్కువ తేడా లెక్కడ గలవయ్య పారపు లెక్కడివయ్యా
ఒక్కటె యందరు నా డీ తిక్క గతిరి నేడె విధిగతిని సమదర్శీ.

ఒక బ్రాహ్మణులే కా దిక సకలజనులు సకల నీతి సంపన్నులుగా
సకలంకులుగ మనిరి పూర్వకాలమున నీ వెఱుంగవా సమదర్శీ.

చదువులు చెప్పిరి ద్విజులని చదువదనపు నింద లాడ సరసమె మొదలున్
దుద తెరుగవలదె బ్రాహ్మణ పదమున కర్థంబు మరచి బహు సమదర్శీ.

అదిని చదువులు చెప్పగలేదు ద్విజేతరుల కను టతికము సుమ్మా
లేదు నిదర్శన ముండిన నేని చూపమను పందె మిదె సమదర్శీ.

పేరున కె కులము చెప్పెడి కూరిమిలో నెల్లవారు కూడి మెలగు గం
భీరోదార యుగం బది యెకీతిని గపట ముందు నిక సమదర్శీ.

చదివినవారికి సంపద కుదురదు సంపదలు కుదురకొనువారలకున్
చదువులు కుదురవు సుమి చు క్కాదు కీ రెంటికిని జూడవే సమదర్శీ.

ఇవి రెండును గలవారలు భువి నరుదుగ నుందు రిది యిపుడె కనవచ్చున్
వివరించి చూడు శూద్రప్రవరుల లక్ష్యార్థ మెరుకపడు సమదర్శీ.

శూద్రులు చదువగరా దను క్షుద్రాత్మక లిపుడు గలరు కొందరు వారల్
భద్రాత్మక లగుదురె లోక ద్రోహులు గారె నిజముగా సమదర్శీ.

ఏలా శూద్రులకథ తమ స్త్రీలకు జెప్పుదురె మాఢ్య చిత్ర పిశాచం
బాతీల గీలుబొమ్మల పోలిక నాడించుచుండె బో సమదర్శీ.

అది పగచే గాదు సుమా స్వదారపుత్రికలమీద చల ముందునె మా
ఢ్యదశాభూతపిశాచము గదియగ మరబొమ్మ లైరిగద సమదర్శీ.

అన్నికులంబులలో ముసు పున్నారుగదయ్య విద్వదున్నతులు మహో
ద్యున్నతయశులగు కవులు కలోన్నతి లేనయంత నచ్చెనొ సమదర్శీ.

చదువు లొకటె బ్రాహ్మణులవి పదవులు సుద్యోగ భోగ్య భాగ్య పదంబుల్
సదనుల సామ్రాజ్యంబులు తదితరులవి కావె తెలియదో సమదర్శీ.

మను వెవ్వరు బ్రాహ్మణుడో మనుస్మృతులు రచించినట్టి మహనీయమతుల్
మనబుషు లెందరు ద్విజులో గనుపడదే నిజము తేటగా సమదర్శీ.

మన తాతల మార్గంబులు మన తండ్రుల దారి జూచి మన పూర్వికు లి
ట్లనె మనిరని యనుకొనటయె ఘనమగు పొరపాటుమాట గద సమదర్శీ.

అప్పటి శూద్రులలో గల యొప్పిద మీనాటి శూద్ర యువకులలోనన్
చొప్పడ దేమి చెప్పుము చెప్పెడి దేమిక కులాలె చెడె సమదర్శీ.

భోగుల నుద్యోగుల ననురాగంబున గౌరవింతురా ప్రజ లెపుడున్
జోగులనే పూజింతురు త్యాగు లగుటచేతనే గదా సమదర్శీ.

నడుమంతరముగ వచ్చెను గడుపుం గక్కుర్తి విప్రగణ మంతటిలో
చెడిపోయెన్ బ్రాహ్మణగౌరవ మడుగున బడె భరతభూమి హా సమదర్శీ.

సద్యఃఫలితముకొరకై యుద్యోగములందు గలహ ముదయం బయ్యెన్
విద్యార్థికులకు తొలుత నవిద్యామహిమంబు గంటివే సమదర్శీ.

ఏడనో నూటికి నొక డున్నాడో లేడో శ్వవృత్తి నైచ్యమనక య
ల్లాడెడువా డౌను లందరు గూడుం గుడ్డల నెఱుగ రౌకో సమదర్శీ.

ఇది చదువుకొన్న మూఢుల కదవదె నున్నది కదన్న జ్ఞానుల మచురున్
మది దలచుచు సేవకులై బ్రదుకం దొరకొనుట మేలు బళి సమదర్శీ.

ఎవరో కొందరు బ్రాహ్మణబ్రువు లెవరెవ్వరినో మోసపుచ్చిరని ద్విజ
ప్రవరుల ననుమానించుట యవమానించుటలు న్యాయమా సమదర్శీ.

అన్నికులంబులలోపల నున్నారు సుమయ్య కుజను లొండొరులనె పా
లెన్నకొననేల సంఘము నన్నియెడల దిద్దుకొనగ నగు సమదర్శీ.

పసలేని వేషధారుల పసగలిగిన మాఢ్య మోహపరవశులను సాం
పెసలారగ మసలారిచి నసిగా సంఘమును దిద్ద జను సమదర్శీ.

ఆకటా బ్రాహ్మణికం బన వికటంబుగ వెగటుగాగ వేశాళోళ
ప్రకటనముగ మారిన నీ కకవిక కొంచినవి పత్రికలె సమదర్శీ.

అందరు బ్రాహ్మణపదమును బొందగ యోగ్యులటుగాన భూమీసురులన్
నిందించుట తము దామే నిందించుకొను టిది చెల్లునే సమదర్శీ.

కసిదీర నొరుల దిట్టుట పసయగునే తమకులంబు బాగుపరచి పెం
పెసగింప జూడవలయును పాసగింపవలెన్ స్వతంత్రమును సమదర్శీ.

విప్రాదులలో సంస్కారప్రియులను నొక్కకడను రావింపుము భా
వప్రకటన గావింపుము సుప్రీతిగ నొప్పుకొంద్రు సుమి సమదర్శీ.

ఇప్పటి బ్రాహ్మణులందే చొప్పడియున్నారు చిత్తశుద్ధిగ సంఘం
బొప్పిదముగ దిద్దుకొనగ దప్పక ఫలియించు మనమతము సమదర్శీ.

అందరును దొంగ లనుకొన్నం దేవుడె దొంగయగును నమ్మనియెడ సా
మ్యం బమ్మగు ననుసామెత విందువుగద భావ మెరుగవే సమదర్శీ.

పూర్వాచారపరాయణు లోర్వరు మనమాట వారి నొప్పించుట కా
శర్వుడు చాలడు కాల మపూర్వగతిన్ మార్చు సర్వమును సమదర్శీ.

ఏమీ సాధింపగలమొ లేదో చూతము ఫలంబులే లేవయ్యా
యీ కీర్తి బాల్చి దేవునిమీదను భార మిడి పూనుమీ సమదర్శీ.

అగునయ్యా యావేశము తగునయ్యా జాతి కుల మతద్వేషాగ్నుల్
రగులుకొని దేశమంతయు దగులబడెడు నయ్యొ యార్పదగు సమదర్శీ.

కంగారుపడిన గార్యము భంగమగున్ వేగపడిన ఫలితార్థంబుల్
ముంగాల దన్నినట్లగు వెంగలివా నీ వెఱుంగవే సమదర్శీ.

తాలిమి విడువక మనముచు మాలిమితో కృషియొనర్ప మన కనుకూలం
బౌ లేదు నిరాశ కికను తాలిమి మేలిమి యగున్ గదా సమదర్శీ.

తమలోగల సాంఘికభేదములు నిమిత్తములుగాగ దమ శత్రులతో
సములై దేశక్షేమము తమక్షేమము మరువ మంచిదా సమదర్శీ.

పాలకడలి ద్రచ్చునెడన్ హాలాహల ముద్భవించినట్టుల నైష
మ్య ముదయించె స్వరాజ్యాందోళనమున నెరచు టొప్పదో సమదర్శీ.

రతనాలు కొందరికి నలులితలాభము లాదవు కొందరికి స్వాతంత్ర్య
వ్రతము విడదగగు తీవ్రపు యతనా లొనరింపదగు సుమా సమదర్శీ.

ఓడ కపాయము వచ్చిన నోడను గలవార లందరోమగవలదా
ఓడక దేశం బనుపే రోడ కపాయ మిది చూడు మో సమదర్శీ.

చక్కగ వినుమా సంఘపు హక్కులకై పోరవలయు నన్నలతో నా
చక్కనె చక్కని రాజ్యపు హక్కుకు దొరతనము నెదుర నగు సమదర్శీ.

మనకు స్వరాజ్యం బబ్బక మనలో గల కక్ష లెల్ల మానవు సుమ్మా
కనుమా దీని రహస్యము మన రాజ్యోద్యమము బూనుమా సమదర్శీ.

మనసంఘ స్వాతంత్ర్యము గొన మనలో మనము చూచుకొందము స్వేచ్ఛన్
గొనవలె ముందుగ రాజ్యంబున మనమందరము నొక్కమొగి సమదర్శీ.

నెను కడునికవలసిన బ్రాహ్మణులే మునుకొనగ నుండు మార్గొక్కనదగు మీ
రనుమానింపగవలసినపని యేమో విందు జెప్పవా సమదర్శీ.

మనకు స్వరాజ్యము వచ్చిన ననుభవ మబ్రాహ్మణులదె యగు నధికం బౌ
జనసంఖ్య మీది కనుకను వెనుకంజను వేయజను నె విను సమదర్శీ.

రాజులు కొట్లాడియె పరరాజుల పాల్చేసి రెల్లరాజ్యము మన మీ
యోజను బోరాడినచో నీ జగమున మనికి దక్కునే సమదర్శీ.

మనలో బ్రాహ్మణులన్నన్ గదిసిన భయమే గదన్న ఘనకారణ మీ
కద లక్కగేది కథవలె మదిమది నచ్చెరువు నిడుసుమా సమదర్శీ.

ఎందరు గలరో బ్రాహ్మణు లందరు నబ్రాహ్మణులెగదా యిక మీ కీ
కొందల మేల స్వరాజ్యమునందు బలము మీదె యగు గదా సమదర్శీ.

శీలమునే సంపదగా తాలిమినే వ్రతముగాగ దలపోసెడు స
త్యాలాపియె ధర్మప్రతిపాలన కర్హుండు వింటివా సమదర్శీ.

బోధకునకు గల భారము వేధ కయిన లేదు సుమ్మి విధిని సరిగ నా
రాధన చేయవలెన్ జామి సాధకబాధకము లరసి సఖ సమదర్శీ.

అందరివలెనే మనమును తొందరపడరాదు దేశదుర్గతి దప్పిం
పం దెరువు లరయవలె స్వచ్ఛందశ శాంతమున నే పొసగు సమదర్శీ.

దేశాభిమాని యనగా దేశమె దేవుం డటంచు స్థిరతరభక్తిన్
దేశారాధన జేసెడు ధీశాలికి జెల్లు నిజ మిదే సమదర్శీ.

తన మాతృదాస్యము విమోచనమగుటకు దనకు గలుగు సర్వస్వము న
ర్పన మొనరింపకయున్నన్ దన కంతశ్శుద్ధి గలుగునా సమదర్శీ.

నాజన్మభూమిసేవకె నే జన్మించితిని దీని నిత్యశుభముకై
నాజీవన మర్పించుట సాజం బని తలచి మెలగజను సమదర్శీ.

దేశాభ్యుదయము తప్పక యాశించెద మేని తదితరాశలకొరకై
యాశింపబోక సర్వక్లేశములకు సిద్ధపడవలెన్ సమదర్శీ.

దీక్షాబద్ధుడు గావలె కత్తుల జోర ననుచు దేశకల్యాణంపుం
పక్షము బూనెద ననుచును సుక్షముడై వెలయవలయు సుమ సమదర్శీ.

కొందరు బిరుదులకోసము కొందరు పొగడికలకొరకు గొప్పదనముకై
కొందరు నటియింతురు వా రందరు దేశాభిమానులా సమదర్శీ.

నటనల చందంబున నప్పటికప్పటికి తగు వేషభాషల నటనల్
ఘటియించు కపటులందరు నెటులగుదురొ దేశభక్తులిహి సమదర్శీ.

దేశాభిమానమును ధనకోశము నిండించుకొనెడు గురువర్తకమున్
గా శోచ్య మనక చేసెడు నాశకులును దేశభక్తులా సమదర్శీ.

ఎవరైనను మనలను మీ రెవరని ప్రశ్నింతురేని నేమందుము మే
మవివేకుల మందుమ యీ యవనికె బానిసల మందుమా సమదర్శీ.

మనరత్నగర్భ యేరూపున నున్నదొ చూడు మన్నపూర్ణయట యహో
మన జన్మభూమి యేభంగిని భంగ మొందెనో కనెద సమదర్శీ.

మనతల్లి దీనతకు మీమనసు కరుగదాయె నెంతమాత్రము నకటా
మనపాలిటి భగవంతుడు కనికరమే చూపడాయె గద సమదర్శీ.

మనతల్లి మాటుండెను మన కభిమానంబువలదె మానము గలదే
కనుఖగ మృగ కీటకముల కొనరిన స్వేచ్ఛ మన కున్నదో సమదర్శీ.

మనకు స్వరాజ్యము లేదిపు డనఘాత్ములైన విద్వదవతంసులు లే
రనుకూలపు సంస్కారములను జేయ సమర్థులిక గలరె సమదర్శీ.

మన సంప్రదాయములకును మన మతపద్ధతికి దగినమార్గంబుననే
మనసంఘము దిద్దగవలె ననిన స్వరాజ్యం బగత్యమగు సమదర్శీ.

గుండియపై జెయినైచి పరుండి విమర్శించుకొను నరుల కిదె తోచున్
ఖండితముగ జెప్పెద నెట్లుండునొ నీవైన జూడుమో సమదర్శీ.

స్వాతంత్ర్యము వలదనునే భూతలమున నెవ్వడైన బుద్ధిగలుగువా
డేతత్స్వరాజ్యసాధన రీతుల భేదములె గద సరిగ సమదర్శీ.

ఈపాటి భావభేదము నైపగలేనట్టివారు స్వాతంత్ర్యం బే
రూపున సాధింపగలరొ యేపగిది సుఖింతు రరయుమీ సమదర్శీ.

విలువగలకాల మంతఃకలహంబులతోడ నిట్లు గడపితిమేనిన్
ఫలియించునె మనవాంఛలు తలపున దలపోయవలవదా సమదర్శీ.

ఎందునను పోరు నష్టము పొందే లాభ మను సామ్యమును వినమో యీ
సందియము లేల యేకత నొందిన ఫలసిద్ధి నొందమో సమదర్శీ.

ఆదరమును యత్నించిన వాదముగా కార్యసిద్ధి యగు త్వరగా నా
నంద మగు గాన మన స్వచ్ఛందత కందరము గడగ జను సమదర్శీ.

అందరు దేవునిబిడ్డలె అందరు సమభాగులే మహాసౌఖ్యంబుల్
పొందగ నానందింపగ నందరును సమానులే సుమా సమదర్శీ.

అందరిని చదువరులగా నందరినిన్ బ్రాహ్మణులుగ నతిశీఘ్రము చే
యం దలకొనదగు నందరు నిందింపగగూడ దెవరినిన్ సమదర్శీ.

ఈవిధి యంతయు జ్ఞప్తికి దేవలయును నమ్మి నేడు ద్విజులమనకున్
నీవిధి నమ్మెడి శాంతము నీవు విడుతువేని చెడు సుమీ సమదర్శీ.

సిరిజూచియు నధికారము తరిజూచియు తనదు ప్రస్తుత బలోద్ధతి దా
సరిజూచియు బరులను దా సరిగా రా దెన్న డిది నిజము సమదర్శీ.

కలకాలంబును లనవులె నిలువవు సంపద లవేమి నిత్యములయ్యా
జలబుద్బుదచంచలములు కలకాలము మాట నిలుచుగద సమదర్శీ.

భారతభువి బుట్టినావము నరజన్మము నెత్తినాము నత్తలవలెనే
చరియించుచు నున్నారము సరసమె శౌర్యంబొ సాహసమొ సమదర్శీ.

సంపాదించుట శ్రమమా సంపద కకృత్తిపతుల సరగున వచ్చున్
సంపాదింపగరానిది సంపాదింపదగినది యశమె సమదర్శీ.

ఈనీతులు నీ వెరుగవె వీనిని దేశజులకెల్ల వివరింపుము మా
ర్గానన్ నడిపింపుము సమ్మానితయశుడై చెలంగుమా సమదర్శీ.

త్రిజగన్మాన్యులు తిలకును లజపతిరాయలును చిత్తరంజనుడు నా
సుజనులవలె మనవలదా గజవైరులు బ్రతికినట్టుగా సమదర్శీ.

---

# ప్రణయతత్త్వము

అష్టావధాని, వడ్డాది సీతారామాంజనేయులుగారు, కవితాసమితి.

మ॥ సెలయేటుల్ నదిం జేరు, వాహినులు లోగిం జేపట్టు వారాశి, గ
మ్రులసద్దివ్యసమీరణం బొలయు సారస్యైక్య మాధుర్యతా
కలిమిన్, విశ్వనియంతృతన్ జగతి నేకాకిత్వమే లేదు, పొం
దలరున్, గావున నిన్నుం జేరుటకు నేలా నాకు శంకింపఁగన్?

సీ॥ పరికింపుమా! వియద్భాగంబుఁ జుంబించు
ప్రాంచదుత్తుంగ పర్వతచయంబు
అవె తరంగంబు లన్యోన్యసంశ్లేషాను
మోద పయోరాశిఁ బొదలుచుండు
జంటపూవులు పరస్పర మనుజాతుల
క్రియ నుండుఁ దమి నేవగింపు లేక
తులకించు వేయిచేతుల నంశుమంతుఁ డీ
యవనిఁ బరీరంభ మావరించు

గీ॥ చంద్రికావళి ముద్దాడు సలిలరాశి
నిన్ని ముద్దుల మురువు లవన్ని యెన్న
నేమి కొఱయగు? నిప్పు డింపెసగ మెసఁగ
హర్షమున నీవు నన్ను ముద్దాడవేని?

"షెల్లీ"

---

# ప్రబోధము

చిరుమామిళ్ల విజయపార్థసారథిగారు.

ప్రొద్దుపొడిచెను కాలచక్రము
పోవుచున్నది పర్వులెత్తుచు
మేలుకొనుమీ ఆంధ్రపుత్త్రిక
మేలుకొనవయ్యా

వేయికరములు సాచి ప్రాగ్దిశ
వెల్గుచున్నా డరుణకిరణుడు
పేరుపేరున ఎల్లవారిని
పిల్చుచున్నాడు.

శుకపికాదులు చిగురుటాకుల
సుస్వరంబుల పాడుచున్నవి
తొల్లి నిద్రితయశము ; దిక్కుల
మేలుకొల్పంగన్.

ఆంధ్రదేశపు భాగ్యగరిమము
ఆంధ్రవ్యక్తిత్వంపు పోడిమి
విజయనగరము రాజ్మహేంద్రము
వెల్లడించెనుగా.

పల్నాడు బొబ్బిలి రణములందున
ప్రథితవీర్యుల సాహసోన్నతి
చలములేని స్వరాజ్యవ్రతమును
చాటు వేనోళ్లన్.

రాచపుత్త్రుల క్షాత్రతేజము
వెలమబిడ్డల కీర్తిపుంజము
కమ్మవీరుల గణ్యమగటిమి
రెడ్డిరాజుల దొడ్డవిజయము
దేశభక్తిని కార్యదీక్షను
తెల్ల మొనరుచుగా !

మంత్రిమణులగు తిమ్మరుసు, ఉ
న్నాదవేష యుగంధరులు మం
త్రాంగవేత్తలు శూరులంబలె
ధన్యమానవు లేరొకో.

తెలగద పాన్గంటి ప్రభుతను
రాజ్యతంత్ర ప్రవీణయశుడై
తీర్చిదిద్దెను రాజ్యపద్ధతి
తెన్న నారయమీ.

ఆంధ్రవీరాంగనల ధైర్యము
ఆంధ్రవిదుషీమణుల చతురత
తెల్గు గరితల చారుచరితను
తేటపరచెడిని.

రాణి రుద్రమదేవి నాయకు
రాలు మొదలగు వీరవనితల
బుద్ధికుశలత యుద్ధనైపుణి
పొగడదగినవె యౌను ?

ఉల్లమలరగ రచన సల్పిన
మొల్ల గంగాదేవి వేంకమ
మోహనాంగుల మధురకైతలు
మేలుబంతులు నేటికిన్.

కవికుమారులు ప్రణయమధురపు
కావ్యగీతా లల్లుకొంటూ
పదముపదముకు తేనెవాకగ
పాట పాడేరు.

అనుకరిస్తూ వారిత్రోవలె
అందచందాల్ దిద్దుకొంటూ
వారిసృష్టులు, వాటిమూర్తులు
ప్రణుతిసేయుము సోదరా !

యుగయుగాంతమునుండి పావను
లగుచు వెలసిన ఋషివరేణ్యులు
అధ్యాత్మచింతను పాదుకొల్పిరి
ఆర్యహృదయములన్.

వర్ణవ్యవస్థను నిర్ణయించుట
వృత్తిసాంకేతికము కంచును
వేదకాలమునాడె యోగులు
విప్పి చెప్పారు.

అజ్ఞానమే శూద్రత్వ మని
ప్రజ్ఞానమే బ్రహ్మమ్మటంచును
శ్రుతులె ఘోషిల అగ్రజన్మను
శుష్కదాంభిక మేలొకో.

పంచముండని భేద మేలా
అంటరాదని వాద మేలా
సర్వరక్షకు దృష్టిలో జగ
త్సృష్టియంత సమానమే.

అన్నమో శ్రీరామచంద్రా !
అనుచు ఘోగిలెడి దీనజనములు
ఆర్తిపరులై చేయుసొదలను
ఆలకించుట మేలుగా.

రాజయోగుల నీతిసారము
కవుల నుడికారంపు సొంపులు
పుణ్యసాధ్వుల పూతచరితము
సచివశ్రేష్ఠుల చిత్రచర్యలు
వీరపురుషుల శౌర్యకథలును
రేయిపవలును శ్రావ్యరీతిగ
గౌతమీకృష్ణా ప్రవంతులు
కీర్తిచేసెడిని.

సంప్రదాయపు తీరు లెన్నుచు
సాటిదేశాల్ జాడ లరయుచు
నాటి మన భాగ్యోదయమునకు
నడుము గట్టవలెన్.

జాగుసేయకు నిద్రపోనకు
జగతి గల యన్నాళ్లు ఆంధ్ర
ప్రజలతేజము చేవ నిలువగ
పాటుపడుమోయీ !



# పాశ్చాత్య స్త్రీలు

బ్యారిస్టరు లింగం వీరభద్రయ్యచౌదరిగారు బి. ఏ., ఆక్సుఫర్డు.

'మనవారికి పాశ్చాత్య స్త్రీలగురించి చాల దురభిప్రాయము లున్నవి. పశ్చిమదేశములందలి స్త్రీలుమిక్కిలిఅవినీతిపరురాండ్రని, భోగపరాయణలని,దురహంకారలని, మొత్తముమీద భార్యలుగా నుండదగినవారు కారని మనవారి యభిప్రాయము. ఎవనైన పాశ్చాత్య స్త్రీలవిషయమెత్తిన మనము మొదట ననునది వారు వ్యభిచారిణులని. తరువాత భర్తను, ఇతరులను లక్ష్యపెట్టరు, ఇల్లు వాకిలి బట్టించుకొనరు, పిల్లలను బోషింపరు, గాలితనముగా దిరుగుదురు, దేవుడుగాని దయ్యముగాని వారికి లేదు, గయ్యాళులు, కోతిముండలు మొదలైనవి ఏకరువు బెట్టుదుము. ఈ దూషణస పాశ్చాత్య స్త్రీ లెంతమాత్రము నర్హలుగారు. వారిని మనము సరిగా నెరుగకపోవుటచేతను, వారి సంఘపద్ధతులు మనకర్థము గాకపోవుటచేతను, మన యాచారములకును వారి యాచారములకును,మన కట్టుబొట్లకును వారి కట్టుబొట్లకును భేద ముండుటచేతను, మనము యథార్థమును గ్రహింపక వారియం దిట్లు దురభిప్రాయము గలవారమై యున్నాము. అట్టిదురభిప్రాయముల కాధార మెంతమాత్రము లేదని చూపి,పశ్చిమదేశ స్త్రీల నర్థముజేసికొనుట కవకాశము గల్పించుట కీ వ్యాస ముద్దేశింపబడినది.

శ్వేత స్త్రీలవిషయమున మనము పడు మొదటి దురభిప్రాయము వార జాతికి జాతియంతయు వ్యభిచారిణులని, భార్యలు వ్యభిచరించుచున్న భర్తలూరకుందురా యన్న శ్వేతజాతులలో వ్యభిచారము తప్పుగాదట యందుము. "ఇది నాది, నాహక్కు, నాభుక్తము" అను భావము మానవస్వభావమున నున్నది. అన్ని యుగములందును స్త్రీ పురుషుని హక్కుభుక్తములలో మిక్కిలి యుత్కృష్టమైనది. స్త్రీలకు పురుషుడు ధనధాన్యములనేగాక మాన ప్రాణములగూడ నర్పించును. ఆమె నెన్న డితరుల కొప్పగించుట కీయకొనడు. అట్లుచేయుట స్వభావవిరుద్ధము. జ్ఞానసంపాదనజేసి సకలజీవుల లోబరచుకొని రాజ్యముజేయుచున్న మానవునివిషయ మటుంచుడు. జంతుజాలముల గమనించుడు. "మొదవుకడ నున్నవృషభము" ఇంకొక వృషభమును సహించునా? కోతుల తండునకు నాయకుడుగా నున్న మగకోతి, యితరమందనుండిగాని, యింకొకవిధముగా గాని యింకొక కోతి వచ్చి తన యాడకోతులతో గలియ నుంకించి ప్రాణముండువరకు పోరాడదా? చివరకు తనమందను బుట్టిన మగకోతినిగూడ నది పెద్దదైన వెంటనే తనస్త్రీల నెక్కడపహరించునో యనుభయముచే మందనుండి దానిని తరిమివేయును. అట్టి కామ క్రోధ మద మాత్సర్యములకు లోనైన మానవుడు,తనప్రాణముకంటె నెక్కుడైన తన స్త్రీని నితరుల కర్పించుననిగాని, ఇతరపురుషులతో నామె వ్యభిచరించుచున్న జూచి చూడ కుండుననిగాని తలంచుట మిక్కిలి నెట్టితనము.

భర్త కిష్టములేకపోయిన నాగునా! అతనికి దెలియకుండ జాటుమాటున వ్యభిచరింతురు. జాతియంతయు గాకపోయినను ముప్పాతిక మూడు భాగములైనను తప్పక వ్యభిచరింతురని మనవారు వాదింతురు. వ్యభిచరించుటకు గలకారణమేమి? అని మనము విచారించవలసియున్నది. వాండ్ర స్వభావసిద్ధమని చెప్పి సంతోషించుట పొరపాటు. స్వభావసిద్ధముగా వ్యభిచరించు స్త్రీలు ప్రతిజాతియందును గలరు. అట్టివారి సంఖ్య బహుస్వల్పము. వారివిషయము మన కిచ్చట అప్రస్తుతము.మనమిప్పుడు చర్చించుచున్నవిషయము పాశ్చాత్య స్త్రీజాతియంతయు వ్యభిచరించు స్వభావముగలదియా యని.దొంగతనముచేయుటగాని, అసత్యమాడుటగాని, హత్య లొనరించుటగాని ఒక జాతికంతయు స్వభావసిద్ధము కాదో అట్లే వ్యభిచారము జేయుటకూడ నే జాతికి స్వభావసిద్ధము కాదు. చిన్న చిన్న గుంపులు కెగలు తప్ప, ఏజాతియు నొక చెడుకార్యమును జాతీయపద్ధతిగా నవలంబించదు. అట్లవలంబించిన నది నాగరికత గలజాతిగాక పశుత్వదశలో నున్నగుంపగును. పశ్చిమదేశములలో వివాహపద్ధతి చాలవరకు స్వయంవర మని పాఠకులకు దెలిసియే యుండవచ్చును. స్వయంవర మనిన దన కిష్టము లేనివానిని, పరపురుషులతో రమించుట కొరకు కెరగా నుండువానిని వివాహమాడుట గాదని బుద్ధిమంతు లూహించుకొనకపోరు. పశ్చిమదేశములోని యాధునిక స్వయంవరములు ప్రాచీన కాలమునందు జరిగియుండిన కొన్ని స్వయంవరములకంటె జాల నుత్తమమైనవి. ప్రాచీన ఆర్యావర్తమందు కొన్ని స్వయంవరములు పురుషునియందు స్త్రీకి గల్గిన ఆకర్షణ, అనురాగము, ప్రేమలవలన జరిగినవికావు. ఏ ధనుస్సో, ఏమత్స్యయంత్రమో, అప్పటికాలపు స్వయంవరములలో గొన్నిటికైనను గారణములు. తండ్రి యొక పరీక్ష బెట్టెడివాడు. ఆ పరీక్ష గెలిచినవాడు కన్యను గైకొనెడివాడు. ఒకరికంటె నెక్కువా పరీక్షల నుత్తీర్ణలగుటకు శక్తి కల్గినవారుండిన, దెబ్బలాటలు జరిగి తీరెడివి. పరీక్ష లేని స్వయంవరములలోగూడ కన్య నాశించి విఫలమనో రథులైన యుద్ధరులు, వరించబడినవానిపై కయ్యమునకు గాలుదువ్వెడివారు. అంతియేగాక కన్యనుగూడ బలవంతమున నెత్తుకొనిపోయెడివారు. మొత్తముమీద పోరు లేకుండ నా కాలములో స్వయంవరములు జరిగెడివికావు. వరించునది కన్యగాక, పరీక్షకు గుతియైన సాధనము. అట్టి స్వయంవరములకంటె ఆధునిక కాలముల పాశ్చాత్యదేశములందు జరుగుచున్న స్వయంవరములు చాల మెరుగైనవి. ఆ దేశములలో దన కిష్టములేని పురుషుని స్త్రీ చేపట్ట నక్కరలేదు. తన ప్రణయమునకు గుతిగానియువతిని పురుషుడు గ్రహించ నక్కర లేదు. పరస్పరాకర్షణానురాగములు; ఉభయుల ఆశయములు, ఆశలు, ఉద్దేశ్యము లొకటియగుట, ఇవి వారి స్వయంవరకారణములు, దాని పునాదులు. కాబట్టి తన వరునియందు శ్రేయసి విముఖియై పరపురుషులతో గలియు టసంభవము. తాను ప్రేమించి తన బుద్ధిపూర్వకముగా వరించినప్పుడు తన పురుషునికి ద్రోహముగా బరపురుషులతో వ్యభిచరించు భార్యలు జాల తక్కువగా నుందురు. స్వయంవరవివాహములలో భర్తృద్రోహము, వివాహకాలమందు జేయు ప్రమాణములను భంగపరచుట చాల తక్కువ.

అట్లని పాశ్చాత్యదేశములలో వ్యభిచారమే లేదని చెప్పను. ప్రతి జాతులలోను వ్యభిచారమున్నది. అది మానవదౌర్బల్యము. దానినుండి పూర్తిగ తప్పించుకొనుటకు మానవజాతికి శక్తిలేదు. కాని నిజమున కాదేశములందు అంతతనము మనదేశములందుకంటె నెక్కుడని చెప్పుటకు వీలులేదు. పశ్చిమదేశీయుల సాంఘిక ధర్మములు, ఆచారములు వేఱు. స్త్రీ పురుషులు కలసి మెలసి తిరుగుదురు. వివాహిత స్త్రీ యితర పురుషునితో షికారుకు వెళ్లుట, కలసిమెలగుట తప్పు కాదు. కాన నొక స్త్రీ యొకనితో నున్నప్పుడు మామూలుగా జను లామెను చూచుట గల్గును. ఆమె యొకవేళ వ్యభిచరించిన నావిషయము తెలియుట కవకాశమున్నది. ఫలానా పురుషునితో ఫలానా విధముగా ఫలానా స్త్రీ ఫలానాయప్పుడు చెడుగా వర్తించినదని వివరములు తెలియుటకు వీలున్నవి. మనదేశములోనో మనము రహస్యముగ, చాటుమాటున, గుట్టలసందున, జొన్నచేలలో, డొంకల మధ్యను, ఊరిబైట పొదలమాటున, పశువుల చావడిలో, వాములనొల్లలో, ఇక్కడక్కడనగల వీలున్నచోట్లనెల్ల చీకటిరాత్రులందు, జనసంచారము లేనిసమయములందు నీచముగ వ్యభిచరింతురు. రాత్రులలో స్త్రీలు బహిః ప్రదేశములకు వెళ్లినప్పుడు రాక్షసకృత్యముగా బలవంతముగా వారిని చెఱుచు పురుషు లున్నారు, తలచుకొనిన ఘోరము. ఒళ్లు జలదరించును. శుభ్రములేదు, శుచిలేదు, ఇష్టములేదు కష్టములేదు, వట్టి పశుకృత్యము. నీచము. అట్టిదవడి వర్ణించుటకు మాటలులేవు. పాశ్చాత్య స్త్రీ పురుషులు వ్యభిచరించదలచుకొనిన, కటికినేల మోటునకుగాని, కాలకృత్యములు తీర్చుకొను బహిః ప్రదేశోపాయ్యమునకుగాని లోబడరు. అనుకూలమైన తమయిండ్లయందు, భోగముల కాకరములగు హోటలులందు, అంతకు దప్పివచ్చినగాని, కామోద్రేకముచే విచక్షణజ్ఞానహీనులైన సందర్భములందుగాని, చెట్టచివరను రమ్యోద్యానములందైనను, ప్రకృతిసౌందర్యముచే గాంభీర్యమున వనములందైనను, కన్నులపండువుసేయు విశాలమైన పచ్చికబయళ్లందైనను, అనగా సౌఖ్యకరమైన రమణీయప్రదేశములందు, కోర్కలు సంతృప్తినొందునట్లు, శరీరము లానందమయమగునట్లు సంగమింతురు. వ్యభిచారము చాల తప్పేగాని శృంగారముగను, రమ్యముగను, సౌఖ్యకరముగను, ఆనందమయముగను వ్యభిచరించుటలో గొంత యర్థమున్నది. మానవుడు స్త్రీ పురుష సంయోగమువలన గలుగు నత్యధికానందము వాంఛించుట సహజము. సుమార్గమున దానిని సంపాదించుటుత్కృష్టము. అట్లు దొరకకపోవుటచే సుమార్గమున దానిని సంపాదించిన మానవునకు గల సహజలోపములలో నొకదానినిగా నెంచి యతనిని కొంతకు కొంతవరైన క్షమించవచ్చును. కాని దయ్యములవలె పైబడి బహిః ప్రదేశములలో నెత్తికొనిపోవుట, రాక్షసులవలె బలాత్కరించుట, గాడిదలవలె కటికినేలపై బొరలుపంట, దులవలె

ముకికిలో సోలలాడుట మానవస్వభావము నతిసీచదశకు దీసికొనివచ్చుట. విద్య లేకపోవుటచేతను, స్వాతంత్ర్యము తెలియకపోవుటచేతను, మనస్త్రీలు ఇతరుల యొద్ద భీతహృదయలై యుందురు. ఎదిరించి తృణీకరించుట, ఆత్మరక్షణము చేసికొనుట, సాహసము, మనోధైర్యము కలిగియుండుట మన యువతులకు తక్కువ. ఎల్లప్పుడు, శుద్ధాంతములనుండి యితరపురుషులతో కలసి మెలగకపోవుటచేత పురుషులు తమనుచేరిన నొకవిధమైన భయమునకు లోనాదురు. విద్యావిహీనత, శుద్ధాంతములు, అజ్ఞానమును పెంపొందించి వారికి మనోదౌర్బల్యమును కలుగజేసినవి. అందువలన మనస్త్రీలలో చాలమంది, పురుషుడు వచ్చి బలాత్కరించిన నెదిరించక లోబడిపోవుదురు. భర్తను ప్రేమించి పాతివ్రత్యమును ప్రధానముగా నెంచుకొనువారట్లు లోబడక ప్రాణములకైన నాశవదలుకొందురని నాకు తెలియును. కాని జనసామాన్యమున భయములోగూడిన యిటువంటి మనోదుర్బలత్వ ముండుట నిజము. పురుషు డెట్టివాడైనసరే, దుర్మార్గుడైనను, కురూపియైనను, తన నతడు బలాత్కరించిన వ్యభిచారముచేయుటకు జంకని స్త్రీ, ఆ ప్రత్యేక వ్యక్తితో సంగమము, తన కెంతమాత్ర మిష్టము లేకపోయినను, ఎదిరించి పోరాడక తన శరీరము నిచ్చివేయును. ఇచ్చివేయుట గా దతడు తీసికొనుచున్న ప్రతిఘటించు మనోధైర్యము లేక యూరకయుండును. ఈవిధముగ పాశ్చాత్యదేశములందు జరుగదనే చెప్పవచ్చును. ఇదివర కెట్లున్నను, యుద్ధానంతరమునుండియైనను దప్పక స్త్రీ తన కిష్టముగానిది, తాను స్వయముగా నొప్పుకొననిది పురుషునితో సంగమమున కెడమీయదు. ఆమె కిష్టములేనిది పురుషుడొంటిమీదకూడ జేయివేయలేడు. అట్లు వేసిన గట్టిచెంపపెట్టొకటి బహుమతి నొందగలడు. పాశ్చాత్యస్త్రీలు తరతరములనుండి వచ్చినసాంఘికస్వాతంత్ర్యమువలన మనోనిబ్బరము, ధైర్యము కలిగియుందురు. మనకోర్కెలు, వాంఛలు పరిమితమైన హద్దులలో నెల్లప్పుడు స్తిమితముగ బంధింపబడియుండవు. ఒక్కొక్కప్పు డవికొంచెముగానైన చెదరుచుండును. తదేకదీక్షలో నొకరి నొకరు వత్సరములతరబడి కించిత్ చలనమైన లేకుండ ప్రేమించుకొను స్త్రీపురుషు లరుదు. మానవస్వభావమననొకప్పుడైనగొంచెమువాంఛ స్త్రీకిపరపురుషునిమీదపోవచ్చును. కొంత సరసములాడవచ్చును. అతనియెడ నామె సరసవాక్కులు, చిరునగవులు, శృంగారచేష్టలు వెల్లివిరియ జేయవచ్చును. కాని తాను నిజముగావరించనిది, మోహముగలిగియుండనిది, పరపురుషునితో శ్వేతస్త్రీసంయోగమున కొప్పుకొనదు. ఈవిషయమున నింకొకటి చెప్పవలసియున్నది. పాశ్చాత్యదేశములో స్త్రీ పురుషులు కలసిమెలసితిరిగినను వారివారిగృహములలో ఏకాంతమున్నది. ఒకరియింటికి మఱియొకరు నిజమైనపనిలేనిది వెళ్లరు. కబుర్లు చెప్పుటకు, కాలముగడపుటకు. ఏమియు పనిలేదు. కాబట్టి యూరకనేవచ్చితినని చెప్పుట కవకాశములేదు. మనదేశములో కొన్ని సామాన్యగృహములందు మరుగేలేదు. ఇరుగుపొరుగువారువచ్చి చేరుదురు. నిప్పుకనియో మంచినీళ్లకనియో వంకబెట్టుకొనిలోపలికి వెళ్లి పట్టపగలే యింటి స్త్రీలతో వ్యభిచరించువారు గలరు. అట్టిది పశ్చిమదేశములలో జరుగదు.

మన యిండ్లలో, మన గ్రామములలో, మన పట్టణములలో, జరుగు అంకుతనము మట్టమధ్యాహ్నపు పెంటగ్గలో మాడిపోవును. రాత్రులందలి కటికిచీకటిలో కలసిపోవును. పైకి రాదు. చెరువుగట్లమీదను, చెట్ల క్రిందను యువకులు, ఒక్కొక్కప్పుడు పెద్దవయస్సుగలవారు గుసగుసలు పోవచ్చును. ముసిముసినగవులు నవ్వవచ్చును. సాధ్యాలోకనములు చేసికొనవచ్చును. అంతియే. అంతకు పైకిరాదు. పాశ్చాత్యదేశములం దన్నో ఎక్క. దేవ్యభిచారము జరిగినను పైకివచ్చును. అనుమానపడిన భర్త గూఢచారులను బెట్టి అంతులు తీయును. వివాహ విచ్ఛేద కర్మకాండ కోర్టుద్వారా జరిగి ప్రజలకు తెలిసిపోవును. పత్రికలు దేశమంతయు నీ పాపసమాచారముతో నింపివేయును. ఈ విధముగ అంకుతనము బట్టబైలగుటచే నాదేశములలో వ్యభిచారము హెచ్చని మనకు సామాన్యముగా దోచును.

శ్వేతజాతులగూర్చి మనకు మఱొక విపరీతాభిప్రాయ మున్నది. అదేమన, దేశములందు స్త్రీలు వివాహాత్పూర్వమే తమ కన్యాత్వము పోగొట్టుకొందురని. అట్టి యూహ మిక్కిలి అసంమజస మైనది. ఆదేశములందలి యువతులు మిక్కిలి మనోనిబ్బరము గలవారని పైన వ్రాసియున్నాను. వారు తెలివి తక్కువవారు గారు. తమ లాభ నష్టములు బాగుగ గుర్తెతిగినవారు. స్వాభిమానులు, పైగా తను కిష్టమైనవానినే వివాహము జేసికొనవచ్చును. అట్టివారు తమ కన్యాత్వము బోగొట్టుకొందురను టసహ్యకరమైన యసంబద్ధప్రలాపము. ఇతరులతో గాకపోయినను తాము పెండ్లాడబోయెడు పురుషులతో నైన నవి మనవారు వాదించవచ్చును. ఇది నిజముగా మనవారికి వారి వివాహ పద్ధతియందు గల దురభిప్రాయము. తెలియమి. పెక్కు లేనిది రమించుట కొప్పుకొనిన పురుషుని దృష్టిలో దాను తేలికగ్గాయి పోదునని స్త్రీకి దెలియును. మఱియు స్వాభిమానము గల యువతి యమూల్యమైన తన కన్యాత్వమును చేతులార చెడగొట్టుకొనదు. ఈ సందర్భమున మన దేశీయ యువకులలో నొకనికి పాశ్చాత్యదేశమున గలిగినయనుభవ నిం దుదాహరించు చున్నాను. ఆ యువకు డొక శ్వేతయువతిని గలిసికొని యామెస్నేహము సంపాదించినాడు. తన నితడు వివాహము చేసికొనునని యామె తలంచినది. ఇతని కట్టి యుద్దేశ్య మేమియును లేదు. కాని యామెపొందుగవలెనని గోరినాడు. అందుమీద నామె "నీవు విషయతృప్తిని మాత్రమే గోరుదువైన దాని నిచ్చు లంజలు చాలమంది యీ పట్టణమున గలరు. వారియొద్ద కేగుము. అవివాహితను. నా కన్యాత్వము చెడగొట్టి నాజీవితము నంట గలుపనేల యిచ్చగించెదవు? ఇది నీకు తగదు" అని బుద్ధి చెప్పెను. మన యువకుడు సిగ్గుపడి క్షమాపణ గోరుకొనెను.

పాశ్చాత్య స్త్రీలు భర్తను మిక్కిలి యలక్ష్యముగను, అనాదరణతోను జూతురని మనవారి అభిప్రాయము. వారి వివాహములు స్వయంవరములని మనము తెలిసికొని యున్నాము. స్వయముగా వరించి వివాహ మాడుటకు, ప్రేమానురాగములు, చివర కిష్టమైన నుండవలెను గదా? గౌరవము లేకపోయిన, నిర్లక్ష్య మున్న ప్రేమానురాగములగాని, యిష్టముగాని యేర్పడు టసంభవము. మన యాచారవ్యవహారములకును, వారి యాచారవ్యవహారములకును చాల భేదము లున్నవని మనము జ్ఞాపక ముంచుకొనవలెను. పూర్వకాలములో నెట్లున్నను, కొన్ని శతాబ్దములనుండి గాయైన మనము మనస్త్రీలను దక్కువగా జూచు చున్నాము. అన్నివిషయములందును వారు పురుషులకంటె దక్కువవారనియు, నాకారణమున వారు పురుషులవలె గౌరవమును బొంద నర్హులుగారనియు, వారు పురుషులకు లోబడి వారి యడుగుల ఆజ్ఞ భయ భక్తులలో నుండవలెనని మనము దలంచు చున్నాము. మఱియు "భర్తయే దైవము. అతని పాదసేవయే ధర్మము. అతని పాదములు గడిగి యానీరు శిరసుల జల్లుకొనినగాని, యిహమునకు బరమునకు స్త్రీలకు గతి యుండదు" అని మనము బోధించు చున్నాము. నిజమునకు మనము మనస్త్రీల నిప్పుడు గాకపోయినను మొన్నటివరకైన నన్నివిషయములలోను మిక్కిలి హీనముగా జూచినాము. భూతల ప్రపంచమును మనము లోబరుచుకొని సకలవిధములైన జంతుజాలములచే మనము సేవజేయించుకొను చున్నాము. కాని మన సేవవలన నవి ముక్తినొందునని మన మెన్నడు తలంచియుండలేదు. ఉద్బోధన చేసియుండలేదు. ఈ విషయమునైనను మనము మన స్త్రీలను పశుపక్ష్యాదులకంటెకూడ హీనముగా చూచినామని చెప్పవలసి యున్నది. ఇక పాశ్చాత్యులన్నమో వారు తమ భార్యల నిప్పటివలె మొదటినుండియు నన్ని విషయములందును సరిసమానముగ జూడకపోయినను మొత్తముమీద చాల విషయములం దనాదినుండియు గౌరవముగనే జూచియుండినారు. సాంఘిక జీవితములో పాశ్చాత్యస్త్రీ పురుషునికంటె నెక్కుడు మర్యాదను పొందుచున్నది. తా నతనికి జేయు గౌరవముకంటె తా నెక్కుడు గౌరవము స్త్రీ పురుషునియొద్దనుండి పొందుచున్నది. మనవారికి గొప్ప వింతగా దోచునది స్త్రీ వచ్చినప్పుడు పురుషుడు లేచి నిలబడుట. ఇంకొక కుర్చీ లేకపోయిన తన కుర్చీ యిచ్చి తాను నిలబడుట. స్త్రీ కూర్చునియుండగ పురుషుడు వచ్చిన ఆమె లేవకుండుట. అతడు నిలుచునియుండగా తాను కూర్చునియుండియే మాట్లాడుట. ఈ మర్యాదలు, ఈ గౌరవములు, పాశ్చాత్య పురుషులకు వారిస్త్రీలయం దుండెడు పూజ్యభావమును, ఔదార్యబుద్ధిని తెలియజేయు చున్నవి. పురుషు లట్లు స్త్రీల నాదరించుట వారికి భయపడి కాదు, వారి గయ్యాళితనమునకు జంకి కాదు. మనవారనుకొనునట్లు పాశ్చాత్య పురుషులు తమ స్త్రీలకు భయపడి వారి యడుగులకు మడుగు లొత్తరు. గౌరవభావమే వారి యాదరణకు కారణము. దానికి మారుగ పాశ్చాత్య స్త్రీ గూడ భర్తయెడ మిక్కిలి గౌరవాదరములతో వర్తించును. అతని ప్రేమించి యతనికి భోజన మజ్జనాదుల నమర్చి, శయనమున నతని దృప్తిపరచుట మాత్రమే గాక, ఆమె తనభర్తకు సహచారిణిగనుండి అతని కష్టసుఖములలో బాల్గొనును. అతనికి బనులలో దోడ్పడును. సహచారిణియై యాతనికి దోడునీడయై యుండును. అవసరమువచ్చిన సేవజేయును. చివరకు తన ప్రాణమైన నిచ్చి యతని ప్రాణమును గాపాడుటకు సిద్ధపడును. మనదేశమువంటి పరదేశములకు వెళ్లినప్పుడు గాళ్లనక, రప్పలనక, చెట్లనక, పుట్ట లనక, నిర్జనప్రదేశములందు, ఘోరారణ్యములందు తనభర్తకు తోడునీడగును. ధైర్యసాహసములతో నొంటరిగనింటనుండి వలసిన పనుల నెరవేర్పించును, అవసరమువచ్చిన భర్తతో గలిసి కయ్యముచేయుటకు జంకదు. ఆమెకు భర్తయందు మిక్కిలి గాఢమైన భక్తివిశ్వాసములు గలవు.

పాశ్చాత్య స్త్రీ యిల్లువాకిలి బట్టించుకొనదని యింకొక విపరీతాభిప్రాయము మనవారిలో ప్రబలియున్నది. దీని యర్థమేమన, పశ్చిమదేశములలో గృహజీవనమే

లేదని. అది నిజముకాదు. ఆదేశములందలి స్త్రీలు, మన స్త్రీలవలెనే 'సంసారము' జేయుదురు. నిజమున కక్కడి గృహిణులు చేయు వెట్టి చాకిరి, మనవారిలో జాల మంది చేయరు. చేయవలసిన యవసరమును లేదు. అక్కడి సాధారణ గృహిణి ఇల్లు వాకిలి శుభ్రపరచుకొనును; వంటపనులు చేసికొనును; పిల్లలను సవరించుకొనును; బట్టలనుదుకుకొని యిస్త్రీజేసికొనును; బట్టలు కుట్టుకొనును. ఇవన్నియుంగాక, దొడ్డిలో నున్న కోళ్లు, పందేళ్లు మొదలైనవాని పోషణజేయును. ఒక్కొక్కప్పు డింటితోట, కూరగాయల పాదులపనికూడ జూడవలసివచ్చును.— శీతలదేశములగుటచే పాశ్చాత్యదేశములలో నిండ్లను శుభ్రపరచుట మిక్కిలి కష్టమైన పని. మనయిండ్లలోవలె బైపైన నూడ్చి యేపేడనీళ్లో యిన్ని చల్లినజాలదు. సబ్బు, ఒక విధమైన పొడి వేసి మోకాళ్లు కొట్టుకొనిపోవునట్లు బాగుగరుద్ది శుభ్రపరచవలెను. వంటసామానునుగూడ శ్రద్ధతో తోమి కడుగవలెను. భోజనము జేసిన పళ్లెములు మొదలైనవి కడుగుటలో మనకంటె వారెక్కువ శ్రమను దీసికొనవలసియున్నది. పిల్లలసవరణగూడ జాస్తియే. వాండ్రకు నీళ్లుపోయుట, బట్టలుమార్చుట, భోజనమిడుట, నిద్రలుబుచ్చుట మిక్కిలి కష్టమైన పనులు. బట్టలు మార్చుట మిక్కిలి విసుగుబుట్టించుపని. మనగ్రామములలో నిత్యము బట్ట లుదుక చాకలు లున్నారు. అందుచేత మనలో బట్టల నెవరుదుకుకొనరు. పట్టణములలో, గొంతవర కింటివారే యుదుకుకొనవలసివచ్చును గాని, పడమటిదేశములలో వలె విరివిగా నుదుకుకొనవలసిన యవసరముండదు. శీతలదేశములలో నుష్ణదేశముల లోగంటె నెక్కుడుబట్టలు దొడుగుకొనవలసియుండును గదా? ఆకారణమున నాదేశములందు జాకిటిజాస్తిగానుండును. అదియు గాక పిల్లలబట్టలు, తరుచుమార్చుచుందురు. శుభ్రముగా నుదుకుటయేగాక, వానిని జక్కగా నిస్త్రీ చేయుదురు. ప్రతిగృహమున జిన్నచేతి యిస్త్రీపెట్టెలుండును. వానిలో బొగ్గువేయరు. పొయ్యిమీద వేడిజేసి యిస్త్రీతోముదురు. పగిలి పోకుండుటకై గుండీల నుదుకునప్పు డూడదీసి, యిస్త్రీయైన తర్వాత దిరిగి కుట్టుదురు. మఱియు బిల్లల చొక్కాలేమి లమలింగలియేమి, భర్త షర్టులు లోపలికుస్తులేమి, టేబుల్ గుడ్డలు దుప్పటులు మొదలైనవేమి, మిషన్ మీదగాని, చేతితో గాని కుట్టుదురు. ఇవిగాక, సాక్సు మొదలైనవానికి జిరుగు లేర్పడిన వానిని బాగు చేయుదురు. పైగా, గృహము వెనుక ప్రక్కనుగాని, ముందఱిభాగమునగాని, మఱొక ప్రదేశమునగాని, కూరగాయలను, పండ్లను, పుష్పములను బెంచుటయం, దమభర్తల కప్పుడప్పుడు సాయపడుదురు. మఱియు, సాధారణముగ నింటివెనుక దొడ్డిలోం గోళ్లు, పందేళ్లు, తుదకుం బందులనుగూడ బెంచుదురుగాన నీపనికూడ గొంతకు గొంత వారినెత్తిమీదంబడును. ఈభారమంతయు భార్యమోయవలసినది. కొంతమందికి గంపశ్రాద్ధము సంసారమున రవంతైన, తీరుబడియుండదు. ఆక్సఫర్డులో నేనొకగృహిణి నెరుగుదును. ఆమెకు బండ్రెండుగురు సంతానము. ఈపండ్రెండుమంది నామె యీదవలసివచ్చినది. పాపము, నిమిషమైన నామెకు తెరపియుండెడిదికాదు, గొణుగుకొనెడిదికాదు, సణుగుకొనెడిది కాదు. 'నాధర్మము, చేయక తప్పదు. చిరునగవుతోనేచేయుటుత్తమ' మనుకొని యిట్లు మిక్కిలి యుత్సాహముతో నోపికతో పనులజేయుచుండును. ఆమె కెన్న డొకింత విశ్రాంతి కలుగునో భగవంతుని కెఱుక.

శ్వేతవనితలు, తమ పిల్లల బెంచరనునది మఱొక నిందారోపణ. శ్వేత స్త్రీ పురుషులు. దమ పిల్లలవిషయమున శ్రద్ధ వీసికొనునట్లు, వారిని బోషించి, విద్యాబుద్ధులను గఱపి, పెద్దవారిని జేసి, యొక సంసారమునారినిగా జేయునట్లు మనము చేయము. స్త్రీలుకూడ, పురుషులవలెం బిల్లల యభివృద్ధికి, నారోగ్యమునకు, సౌఖ్యమునకు, వారి జీవితము సంతోషప్రదముగ నగుట కెన్నికష్టములైన బడుదురు. త్యాగములైన జేయుదురు. చనుబాలిచ్చి మనలోవలె నొడిలో బెట్టుకొని, జోలపాటలు బాడుచు, నాడించరని మనవా రందురు. దేశ కాల పాత్రలబట్టి పద్ధతులలో గొంతభేదమున్నను, జోలపాటలు పాడి యాడించుటలో మనకు వారికి భేదములేదు. ఇక పాలిచ్చుటలో గొంత వ్యత్యాసమున్నది. మనలోవలె జనుబాలు దీర్ఘకాల మీయరు. అట్లీయకుండుటయే యుత్తమమని వైద్యశాస్త్రజ్ఞులుచెప్పుచున్నారు. తల్లికున్న యారోగ్యమునుబట్టి శక్తినిబట్టి శిశుస్థితిగతులబట్టి పాలిచ్చుకాలము, విధము మారుచుండును. అంతియేకాని, చనుబాలీయగూడదను నభిప్రాయము జనసామాన్యమున లేదు. మనదేశమున నీ విషయమున మఱియు నన్యాయము. ఒక్కొక్కప్పుడు పిల్లవాడు పెరిగి, పెద్దవాడైన గూడ చనుబా లిత్తురు. నా కొకరు చెప్పిరి. పది పండ్రెండేండ్ల పిల్లవాడొకడు, బజారులో నాడుకొనినంతసే పాడుకొని, గుబులు దిరిగినంతనే పరుగు పరుగున వచ్చి తల్లి యెక్కడనున్నను సరే కనియబడి పాలు గుడిచెడివాడట. కుట్టినాడు పెద్దవాడగుటచే దల్లి నిలుచుండి పాలీయవలసివచ్చెడిదట. ఇటువంటి యనాచారములు, అసహ్యములు, పాశ్చాత్యదేశములలో జరుగవు. ప్రభువులు మొదలైన పెద్దవారి కుటుంబములకు జెందిన యువతులలోం గొందఱు శృంగారవతులు పాలిచ్చిన శరీరముయొక్క బిగువు తగ్గిపోవునని భయపడి సౌందర్య రక్షణకై, శిశువు నే దాదిపాలు జేయుటయో కలదుగాని, యట్టి యాచరణ మన పూర్వదేశములకును క్రొత్తకాదు. మనదేశములలోను మహారాజులు, రాజులు మొదలైన ఐశ్వర్యవంతుల యంతఃపురాంగనలును విటుల మనసుల నాకర్షించు భోగలాలలను లగు విలాసినులును, పాశ్చాత్య సుందరీమణుల ప్రోత్సహించుచున్న కారణములచేతనే యనగా దమ యవయవ పుష్టి పోకుండుటకై తమ సౌందర్యలావణ్యములు వసివాడ కుండుటకైయే పూర్తిగా జనుబాలిచ్చుటను జాలకాలమునుండి మానివేసినారు. సౌందర్య రక్షణకై చేయు పద్ధతుల నొక్క ప్రతీచీ యువతులేగాక ప్రాచీనయువతులుగూడ నాచరణలో బెట్టుకొని యున్నారు. ఇక పిల్లల గనువిషయమున - పై జెప్పిన సౌందర్య రక్షణ మొక కారణమైనను నది యంత ముఖ్యమైన కారణము గాదు. శిశుపోషణ భారమైనది. అది తమ సౌఖ్యమున కడ్డమువచ్చునని గాని తఱుచు పిల్లలను గనిన తమ యారోగ్యము చెడునని గాని, భయముండుటయు గలదు. కాని ముఖ్యమైన హేతు వార్థికము. భరించగల సంఖ్యకంటె నెక్కుడుమందిని గనిన వారి నందఱిని దిద్దుటకుం దగిన డబ్బుండవలెను. పుట్టినా రనగనే సంబరము కాదు. వాండ్రకుం బోషణ బాగుగ జరుగవలెను; వారికి మంచి చదువుజెప్పించవలెను; వారు వృద్ధికి వచ్చుటకు, సుఖజీవనము జేయుటకు వసతు లేర్పరచవలెను. వీని కన్నింటికి నార్థిక శక్తి లేకపోయిన, పిల్లల గనుట నసమంజసము. జీవనము సరిగా జరుగదని, కుటుంబములు హెచ్చు గాకుండ జేసికొనువారు మన దేశమందును గలరు. భర్తలు స్వయముగా మందు దీసికొనివచ్చి, భార్యల గర్భముల విచ్ఛిన్నము జేయువిషయము మనలోం గొందఱికైన స్వయముగ దెలిసియుండును. కలిగినగర్భముల జెడగొట్టుకొని, యపాయములపా లగుటకంటె నవి కలుగకుండగనే చూచుకొనుటుత్తమము.

గయ్యాళులని, సామాన్యముగా నెవరిని లక్ష్యపెట్టరని, పైపై తనములకు బైలుదేరుదురని, ఆటపాటలలోం గాలము గడపుదురని, భోగపరాయణులని, శృంగారించుకొని తైతక్కలాడుదురని, మనము శ్వేతసుందరులను దూషింతుము. మన స్త్రీలు, మనశాస్త్రములప్రకారము, నిరంతర మెవరో యొకని సంరక్షణలో నుండవలెను. బాల్యమునం దండ్రి, యౌవనమందు భర్త, భర్త యనంతరము, కొమారునం గుమారు డామెకు సంరక్షకుడు, పోషకుడు. స్వాతంత్ర్య మన్న దామెకే కోశమునను లేదు. ధర్మశాస్త్రములపేర, మనము మనస్త్రీల ననేకవందల సంవత్సరములనుండి భావదాస్యమున నుంచినాము. కాన వారు మనతో ధైర్యముగను, స్వతంత్రముగను మాట్లాడరు. నాలిబిడియము, మూకీభావము, నిస్సహాయత మన కలవాటైపోయినవి. స్వేచ్ఛతో బుట్టి పెరిగి, పురుషులతో, బిన్న పెద్దలతో సరిసమానముగ మాట్లాడి, వ్యవహరించు శ్వేతస్త్రీలను గయ్యాళులని మగరాయళ్లని మనమనుకొందుము. బాగుగం జదువుకొని, తెలివితేటలు, వ్యవహారదక్షత గలిగి, ఇతరసహాయము నపేక్షించకయే కార్యములు జక్కజేసికొను నేర్పు గలిగియున్న పాశ్చాత్య స్త్రీలు చదువుసంధ్యలు లేక, చీకటిబడినతర్వాతం, దోడులేకుండ బైటకుం బోవుటకు భయపడు స్త్రీల నెఱిగియున్న మన కండ్లకు గడుసువాండ్రుగను, పెద్ద పిన్న తారతమ్య మెఱుగనివారుగను గనబడుటలో నాశ్చర్యములేదు. వారి స్త్రీసాంఘికపద్ధతులు వేఱని యిదివరలో, జెప్పియే యున్నాను. వారు తమంతటం దాముగాని, తమ భర్తలతోం గలిసిగాని, బంధువులు స్నేహితులైన యితర స్త్రీ పురుషులతోం గలిసిగాని, బైటికి షికారునకేగుట, యాటలాడుట, నాటకములు, సినిమాలు మొదలైనవి చూచుటకుం బోవుట తప్పుగాదు.— ఎప్పు డింటియొద్దనే పడియుండుటవలన సంతోషముండదు. జీవితము సామాన్యముగ మిక్కిలి నిరుల్లాసప్రదమైనది. దాని నుత్సాహపూరితముగం జేయుట కాటపాట లవసరము. మఱియు, నారోగ్యవతులుగ నుండి భర్తలకుం దోడుపడుటకు, దృఢమైన సంతానమును గని జాతి నుత్తేజవంతముగం జేయుటకు, శరీరవ్యాయామ మవసరము. భర్త వెంటలేదని, మనవారివలె నింటిలో ముడిగి పోవుట మిక్కిలి యవివేకము. మనస్సునకు, బుద్ధికి, శరీరమునకు, సంతోషానందముల నారోగ్యమైశ్వర్యముల నిచ్చు పనులను, సక్రమముగ, నీతికరముగ, ధర్మపు కట్టుబాట్లకు లోబడి యొనరించుట, నాగరికుల లక్షణము. వాని నిరసించువారు కృత్రిమ నాగరికులని చెప్పవలసియున్నది.— దిద్దుకొనుటలోం గాలముగడపు విషయమున — ప్రతిదేశమందును, నేరంగు గలదియైనను, స్త్రీ యలంకారప్రియ. మధ్య ఆఫ్రికాలోని నీగ్రోజాతిస్త్రీలు, మొగమునకు రంగులువేసికొనియో, అలిచిప్పలు గ్రుచ్చి మెడకు తగిలించుకొనియో, తమ జిడ్డుజుట్టులోం గొంగయీకలు బెట్టుకొనియో సంతోషించుచుందురు. మనవాండ్రు మొన్నటివరకుం బచ్చలు పొడిపించుకొనెడువారు. రాగిడి, చంద్రవంకలు, బులాకీలు, ముక్కు వంకరలుపోయినను

గాజులవరుసలు, హారములపంక్తులు, గొలుసులపేటలు, ఉంగరముల జంటలు, వృద్ధి యగుచున్నవి గాని, తగ్గుటలేదు. ఐశ్వర్యవంతులు, కళాకోవిదులు, రసగ్రహణ పారీణులు, నూత్నవస్తురచనాదక్షులునైన పశ్చిమదేశీయులు, తమ దేహసౌష్ఠవమునకు బాటుపడుట, శృంగారించుకొనుట తప్పుకాదు. చక్కని సైనవస్త్ర వేకాలమునను సంతోషము నిచ్చును. స్త్రీని నగలతో నలంకరించి చక్కని గూటవస్తువుచేసి, యాటలాడుకొను మనము, అలంకారప్రియులని, భోగపరాయణులని, పాశ్చాత్యవనుల దూషించుట వివేకము. సంసారమొల్లక, తదేకధ్యానమున 'మోస' కేసి కొని త్రిమ్మరితనముగ దిరుగుట తగును కాని యట్టిదిమగ శ్వేత స్త్రీలు దిరుగుచుండుట హాస్యాస్పదము.

మనకు వారియందుండెడి పైజెప్పఁబడిన దురభిప్రాయములచే వారవినీతిపరులని, మతవిహీనలని మన మభిప్రాయపడుచున్నాము. మొత్తముమీద, మనస్త్రీలకంటె నక్కడి స్త్రీలెక్కుడుగా మతజీవితమునందుఁ బాలుగొనుచుందురని నా యభిప్రాయము. మనవారు యజ్ఞ, యాగ, క్రతువు లిత్యాదులు చేయు యుగములలో స్త్రీలు మతజీవితమున నిండుగఁ బాల్గొనెడివారు. ఆకాల మిప్పుడు పోయినది. వ్రతములని, నోములని, వారములని, యిప్పటికిని కొన్ని మతసంబంధమైన సందర్భములున్నవి గాని, వాని నాచరించుట తక్కువై పోయినది. బ్రాహ్మణగృహములలో గొంతకొంత నవి నిలిచియున్నవి గాని, దేశమందున్న ప్రజాసంఘమున బ్రాహ్మణులసంఖ్య అల్పమగుటచే జాతియంతయుఁ దీసికొనిన మతజీవితమున దేశమునఁ జాల తక్కువయని చెప్పవలసియున్నది. పశ్చిమదేశములలోఁగూడ మతసంబంధమైన కర్మలు, పూర్వముకంటెఁ జాల తక్కువలైపోయినవి గాని, యిప్పటికిని మనదేశములోకంటె నెక్కువయే. వారిలోఁ బ్రతియాదివారము విశ్రాంతిదినము. ఆనాడు మామూలు ఇంటిపనులు దప్ప, సంపాదనకొఱకీతరపనులు జేయఁగూడదు. భగవన్నామసంకీర్తనము, భగవత్ప్రార్థన, భగవంతుని గుఱించి బైబిల్ చదువుట చేయవలసియున్నది. అందఱు నట్లు చేయకపోయినను, కొంత మందియైనఁ జేయుదురు. మఱియు నాదివారములందును, పుణ్యదివసములందును, నాఁడు దేవాలయము నలంకరించుటను స్త్రీలు దోడ్పడుదురు. "చర్చి"లోని మతసంబంధమయిన సంగీతసాధనమును వారు వాయించుదురు. మతవిహీనలని మనచే దూషింపబడుచున్న పశ్చిమదేశములందలి స్త్రీలు, మనము మనదేవాలయములకుఁ బోవుదానికంటె నెక్కుడుగ వారి "చర్చిల"కుఁ బోవుదురు.

ఇంతవరకు వ్రాసినదానినిబట్టి పాశ్చాత్య స్త్రీలంద అవినీతిపరులుగారని మనకుఁ దెలియవచ్చుచున్నది. మొత్తముమీఁద వారిలో విద్య, తెలివితేటలు, ధైర్యము, సాహసము, ఇంగితజ్ఞత ఎక్కుడని మన మొప్పుకొనక తప్పదు. అట్టిమెద ఝూటాకోరు లని చెప్ప నెట్లు? ప్రతిజాతిలోను దుర్మార్గులు, కుత్సితులు, అవినీతిపరులు, పాడునుండ లుండురు. అట్టివారితో మనకుఁ బ్రసక్తిలేదు. ఒకజాతిని గుఱించి, దానిలోనున్న కొలదిమంది నడవడినిబట్టి, "ఇదమిత్థ" మని నిర్ణయింపలేము. శిరోభాగము మొదలుకొని, కాలి బొటన వ్రేలివరకుఁ దూర్పుదేశీయులైన నేఁడు మనదేశములగుఱించి చెడుగులు వ్రాయుటకుఁ జింతింతును. కాని యథార్థమును గప్పిపుచ్చినందువల్ల నష్టమేగాని లాభమేమియు నుండఁబోదు. సామాన్యముగ [illegible] మన తూర్పు దేశీయులకంటె, పడమటి దేశీయ లీకాలమున [illegible] ఋజువర్తనము గలవారు. ఆ ఋజువర్తనము వారి స్త్రీలయందు సహజముగఁ బ్రతిఫలించినది. కాన నమ్మినవారిని గోతిలోఁ బడద్రోయుమి పశ్చిమ యువతులలో నెక్కుడు. పురుషులను గట్టెక్కింప వారు విశ్వప్రయత్నములు చేయుదురు. మఱియు, సేవాభిలాష వారిలో మిక్కిలి యభివృద్ధి బొందినది. మన స్త్రీలు తమ గృహములలో, తమభర్త బిడ్డలకు, నంతకు మించిన, యన్నదమ్ములకు, బంధువులకు సేవచేయుట గలదు. వారన్ననో, పైన జెప్పిన బంధువర్గమునకే గాక యితరులకు, మఱియుఁ బశుపక్ష్యాదులకు గూడ నుపచరింతురు. వారు మిక్కిలి యుత్కృష్టులైన దాదులని మనకుఁ దెలియును. "రెడ్‌క్రాసు" మొదలైన సేవాసంఘములద్వారా వారు చేయు నుపకారము జగత్ప్రసిద్ధము. క్రైమియన్ యుద్ధములో గాయపడిన సైనికుల, గంటికి రెప్పవలెఁ గాచి, వారి కహోరాత్రములు గన్నతల్లికంటె నెక్కుడు ప్రేమతో సేవచేసిన ప్రేమాస్వరూపిణి, కరుణారసభరితహృదయ, యగు నైటింగేలు కన్య చరిత్ర పాశ్చాత్యస్త్రీల సేవోత్కృష్టతను జాటుచున్నది. అంతదూరము పో నక్కరలేదు. కడచిన భయంకర యుద్ధములోఁ దమ ప్రాణములనైన నరకుగొనక, నతి సాహసముతో నోరిమితో నరకబాధల ననుభవించి, గాయములు పడియు, కాళ్లు తెగియు, తలలు సగ మెగిరిపోయియు, మతిభ్రమణము గలిగియు విలపించువా క్రోశించు, మూల్గు, సొమ్మసిలిపోవు వేలకొలది సైనికుల గడిగి, కట్టుకట్టి పరుండబెట్టి, మందు లిచ్చి, యన్నపానీయముల నెప్పటికప్పుడిచ్చి, కంటిమీఁది రెప్పవైన వాళ్ళకు సేవించిన ప్రాశ్చాత్య స్త్రీ రత్నములు వేనవే లుండినారు. వారిలో గొంతమంది గొప్పకుటుంబములకు జెందినవారు. ఐశ్వర్యవంతుల [illegible]యలు, సౌందర్యవతులు, యౌవనవతులు, ఎండకన్నెఱుఁగనివా రుండినారు. సమయము వచ్చినది. తమ సౌందర్యమును, యౌవనమును, భోగలాలసత్వమును బూర్తిగ మఱచిపోయినారు.

ఇంతవరకు వారి గుణములను, నడవడినిగూర్చి వ్రాసితిని. ఇక వారి సౌందర్యమునుగుఱించి విచారించవలసియున్నది. మనవారికి, వారు 'కోతిమూఁతు లని' యభిప్రాయమున్నది. ఈ యభిప్రాయము పై జెప్పిన దురభిప్రాయముల జతిలోఁ జేరునదికాదు. ఒకస్త్రీ యందవిహీనయని మన మనుకొనిన గౌరవహానియేమియు నుండదు. గుణములు మంచివియైన, సౌందర్యరాహిత్య మొకతప్పు కాదు. కాని, స్త్రీని కురూపియని పిల్చు టొకవిధముగా నిందారోపణయనియే నాకు దోఁచుచున్నది. స్త్రీకి చక్కఁదన మొక గొప్పయోగ్యత. నిజమున కామె ప్రాణమని చెప్పినను జెప్పవచ్చును. కాన సౌందర్యము లేదని చెప్పు టామెకు లోటుచెప్పుటయే. యథార్థమునకు, స్త్రీ చక్కనిదిగా నుండవలెనని మనమందఱము గోరుకొందుము. కురూపిని వివాహమాడుటకు మనలో నెవఁడైన ముందంజ వేయఁగలఁడా? అట్టిచో, బొసుసువాని పెండ్లమును వికారపు స్త్రీ యని పిలుచుట వాని నవమానించుటయే యగును. కాబట్టి, నిజమునకు శ్వేత స్త్రీ లందవిహీనలేమో మనము విచారించవలసియున్నది. కాదని నాకు దోఁచుచున్నది. వారు తినుతిండి యారోగ్యకరమైనది; బలమునిచ్చునది; వారు నివసించు గృహములు పరిశుభ్రమైనవి; వారు ధరించు వస్త్రములు శుచియైనవి. తఱుచు బైటికేగి స్వచ్ఛమైనగాలిఁ బీల్తురు. శరీర వ్యాయామమునకనువగు టెన్నిసు, హాకి, గాల్ఫు మొదలైన యాటల నాడుదురు. వివిధ శరీరపరిశ్రమ లాచరింతురు, మఱియు. వారికి జాతీయసంస్థ యగు స్వేచ్ఛ మున్నది. వీని యన్నిటివలన వారి కారోగ్యము పెంపొందును; శరీరసౌష్ఠవ మేర్పడును; ముఖమునకు వర్చస్సు కలుగును. విద్యావతులై, పదివిషయముల గ్రహించి, నూరుమందిని గలిసికొని, వేయిమందిలో దిరుగ నేర్తురు. ఆకారణమున నూత్నజ్ఞతగలిగి, చమత్కారవతులై, మాటలసొంపుతో రసజ్ఞతగలిగి, నిండుజీవితములో మిలమిల లాడిపోవుదురు. తమ శరీరమునెట్లు పోషించుకొనవలెనో, ఏవిధముగ మెరుగులు పెట్టుకొనవలెనో, బట్టల నెట్లు ధరించవలెనో వారికి బాగుగ దెలియును. వీనికి తోడు, పాలు గారు శరీరచ్ఛాయ యున్నది. సౌందర్యవతి శరీరవర్ణము, చిక్కనిపాలలో దేటగులాబిరంగు జల్లిన ట్లుండును. శ్వేతసుందరులు పుష్పించిన మల్లెపొదరిండ్లు, సమ్మోహనవిగ్రహాలు. లావణ్యరాసులు, చమత్కారపుంజములు, రసగ్రహణపారీణలు. నవయౌవనోపేతలు, రసికత్వమునకు బుట్టినిండ్లు. అట్టి నారీరత్నములను, సౌందర్యరాసులను 'కురూపులు, కోతిమూఁతుల' నుట మిక్కిలి యరసికత్వము. అట్లను నరసికులు రతీదేవి కోపానలమునకు గుఱి గాకపోరు.

మనలోఁ జాలమంది పాశ్చాత్య స్త్రీలవంటి గయ్యాళులు తమకు భార్యలుగా లేకపోవుట చాల నదృష్టమనుకొందురు. 'అమ్మయ్యో! అటువంటి ముండలతో నెవరు పడగలరు, మన మదృష్టవంతుల' మనుకొని సంతోషించుదురు. ఈజన్మమున లేరు. సంతోషమే. ముందు ఈజన్మములందుఁగూడ నటువంటి భార్యలు వద్దని మ్రొక్కుకొనువారుగూడ గలరు. అట్టివా రించుక నిదానించి, ముందేజన్మమందైనఁ దాము పాశ్చాత్యదేశములలోఁ బుట్టకుండనుందురేమో యాలోచించుకొనవలసియుండును. ఒకవేళ కర్మము చాలక, శ్వేతమ్లేచ్ఛులుగాఁ బుట్టిన, మనవారిప్పు డాదేశ స్త్రీలవిషయమున ననుకొనినట్లే, వారప్పుడు మనదేశ స్త్రీల విషయమున ననుకొనవలసివచ్చును. అట్టిది యెంత సంతాపకరము!

మనభోగము లెక్కడ తగ్గిపోవునేమో యనియు, మన దర్జా కెక్కడ లోటు వచ్చునేమో యనియు, మన నిరంకుశత్వ మెక్కడ సన్నగిల్లునేమో యనియు భయపడి, భర్తతోఁపాటు సమానహక్కుల గోరు పాశ్చాత్యస్త్రీల నిరసింతుము. ఇప్పటి వరకు భావదాస్యమున, బానిసతనమున నుండి, యిప్పుడిప్పుడే కన్నులఁ దెఱచుచున్న మన స్త్రీలు, భర్తలవలన గౌరవము పొందుచున్న పాశ్చాత్య స్త్రీలనుగుఱించి యేమనుకొందురో మనము తెలిసికొనవలసి యున్నది.

---



బుద్ధ భగవానుని సంసార పరిత్యాగము

శిల్పి: ఉపేంద్రనాథ భట్టాచార్య.



# మల్లికామారుతప్రకరణము

మ-రా-రా-శ్రీ, వడ్డాది సుబ్బరాయకవిగారు.

మ॥ మును షడ్వింశతివత్సపూర్వము యసంపూర్ణంబుగా మల్లికం
దెనుఁగుం జల్పి సరస్వతిం బ్రకటితన్ జేయించితిం బత్రికన్.
వెను కేరేఁ దెలిఁగింత్రు శేష మనుకొంటిం గాని, పూరింప నిం
దనుకం బూనమి నేకవుల్, గడఁగితిం దద్దృశ్యసంపూర్తికిన్.

చ॥ అమవస, మూఁడుగంటలర మైదునిమేషము లౌడు నర్కబిం
బము విభవాశ్వినంబునఁ దమంబు స్పృశింపఁగ, గౌతమీసుతీ
ర్థమునను దానమాడి, శుచితన్ విదియన్ బయికార్తికంబునం
దు మొదలుకొంటి మల్లికఁ దెనుంగొనరింపఁగ నల్తుదంక
ముల్.

క॥ మల్లిక నిజసౌరభమున
నుల్లసిలం జేయు నళుల నొకకాలమునన్ ;
మల్లిక యిది తనసరసత
నెల్లప్పుడు రసికజనులహృది నలరించున్.

సీ॥ వ్రాఁతకాఁడు నిజేచ్ఛ వ్రాయంగలఁడు గాని,
వ్రాసినట్టులు వెండి వ్రాయఁగలఁడె ?
పాటకాఁ డాత్మేచ్ఛఁ బాడంగలఁడు గాని,
పాడినట్టులు వెండి పాడఁగలఁడె ?
నడచువాఁ డిచ్చను నడువంగలఁడు గాని,
నడిచినట్టులు వెండి నడువఁగలఁడె ?
స్రష్టయు స్వేచ్ఛమైఁ జలుపంగలఁడు గాని,
సలిపినట్టులు వెండి సలుపఁగలఁడె ?
స్వకృతియే చేసినటు వెండి జరుపరాదు
పరునిపరభాషలోని యా ప్రకరణంబు
నేను నాభాష నటు రచియింపఁ దరమె ?
పోల్కి యేఁ జూపఁ దెలిఁగింపఁ బూనుకొంటి.

మ॥ నన నే నవ్యము నాంధ్రవాణి కిడఁ గాన్కన్, మల్లికామారుతం
బను నుద్దండకవీరితప్రకరణంబం దాది నా అంకముల్
దెనుఁగుం జేసితి ; నేఁడు దక్కినవి నాల్గింటిన్ రచింపం దొరం
కొనితిం ; గా నది మూలదర్పణము, నాకున్ సాయ మా
[మీశ్వరా !

మల్లికామారుత ప్రకరణమందలి సప్తమాంక పద్యములు

మ॥ బళె ! మందాకినిగూఢవర్ధితనయస్వర్భూజ మొక్కం తెటో
ఫలియించెం గద ; శేష మింకను ఫలింపం గల్గునో గల్గదో ;
బలవన్మార దురంతతాపహరణ స్వాదోషధిం బుణ్యవ
త్సులభన్, నే రమయంతికం బడసి, సంతోషింపనుం గల్గునా ?

క॥ మన సనుసరించి మసలం
గనుట, మిషన్ మాటమాట గలుపుటయు, హాసం
బున వైముఖ్యము, ముగ్ధం
జనవు పఱుచుకొనఁగఁ దగిన సదుపాయంబుల్.

తే॥ మానవహ్నిఁ రగుల్చు పెన్మందుసుమ్మి
సవతిపే రుచ్చరించుట యువతితతికి ;
భవ్యనిర్వ్యాజ నిర్భర ప్రణయహృదయ
లయిన కులకన్యకల, కది యధికతరము.

చ॥ తరుణులకున్ వివాహ మగుదాఁక నె తద్విధి కంతరాయముల్
జరుగకయుండ బంధువులు చాలఁ బ్రయత్నము లాచరింత్రు ; త
త్పరము, ప్రవృద్ధమానసులభ ప్రియతాగ్రహ సుప్రసాద ; ల
ప్పురుషపురంధ్రులే, సకలమున్ సవరింపఁగఁజాలుమానసుల్.

ఉ॥ కూరిమిపేర్మి మానినులకుం బొలయల్కను బూనుమానవుం
బేరిటి పెన్గ్రహంబు విడిపించుట కుండుఁ, జటూక్తు లొట్టు లీ
మేరవి యెన్నొ ; యన్నిటిని మీఱినయస్త్రము శాంతికిన్, మెడం
జీరను జుట్టఁబెట్టుకొని చేయుట కాళులకుం బ్రణామమున్.

తే॥ నన్నుఁ గాషాయధారణచ్ఛన్నవేషు
సన్నిధిన యున్న నెఱుఁగ దీ యన్నుమిన్న
యరుణకమలరజంబుపై నలము గఱుల
వఱలు రాయంచను స్మరార్తవరటవోలె.

చ॥ స్మరజగదేక వీరవరసైన్యమదాంధగజేంద్రబృంద మం
బరనవపోత్రియాధము దివాంధసమూహదృగంజనంబు ని
ట్టురుణవిశీర్ణకైశ్యము రథాంగగరుద్రథహృద్వియోగ సం
జ్వర శిఖధూమపుంజము దెసల్ కబళించెఁ దమం బుదగ్రమై.

చ॥ సమద నిశీథసామజము సంజను కోకనదాళి మాపి వ్యో [కా
ను మను మహాహ్రదంబునడుమన్ మునుఁగం బృథుసూక్ష్మతార
సముదయ బుద్బుదప్రకరసంకులమై భువనంబు సావిల
త్వముగ దురంతసంతమసపంకము పై కుబికెన్ గరాలతన్.

క॥ మృగనాభి నలఁదుకొని మెయి
మొగమునకున్ నీలిచేలము, ముసుంగుగ, మేల్
వగలాఁడులు వెలిమగలం
జెగి తగులఁ జరింత్రు తిమిర, దేవత లనఁగన్.

ఉ॥ మేలిమి చూరు పట్టెలను మేడలఁ దాపిన మానికంపు దీ
పాలవెలుంగునం బలుచపడ్డయిరుల్ దఱు చయ్యె రథ్యలం
బోలినపట్లకుం బ్రియులపొందున కేగెడుకాలుగంట్ల దృ
క్కీల విసీల చంచలక నీనికలం జనియించు మించులన్.

మ॥ తరుమూలాగ్రతలావకాశముల నుద్యానంబునన్ గప్పి యిం
దురుకాలాయసచూర్ణరాశిఘనతన్ ద్యోతించు పెంజీఁకటిం[లన్
జరణం బె ట్టిటు మోపు చేగుమన మీశ్వామం, గటా ! తెప్ప
విరియం జేసిన మూసినన్ గనులకున్ భేదంబు లే దేమియున్.

తే॥ కారుమబ్బుల గమివోలెఁ గ్రమ్ముకొన్న
చిమ్మచీఁకటినా నయనమ్ము లహహ!

నెందుఁ ద్రిప్పిన నట నిందసుందరంబు
గాన వచ్చెడు రమ యంతికాముఖంబె.

చ॥ పెదవులు వేఁడి యూరుపుల బీఁటలు వాఱఁగఁ బాలచన్నులో
యి దడియ బాష్పవారిని జెయిం జిగి చెక్కునఁ జేర్చి, దీన మౌ
వదనముతోడ వేణి విడి వ్రాలఁగ మూఁపున జిక్కి వెల్లనై
యదె మధురాలసాంగి గననౌ నొకహారమె దాల్చి నేలపై.

చ॥ అలఘునితంబ యీమె సఖహస్తము కేలగ్రహించి భూమణా
వళి గలుగల్లనన్ వెఱఁగుపాటున నెత్తినకన్నదోయి సు
త్పలమయముం బొనర్చుచు నభంబును,మేడఁ బ్రధానవనం బటుల్
సలిపిననాటి ముచ్చట, తలంపునఁ బాతెమ నాకు నిప్పుడున్.

చ॥ ప్రమదమునన్ సవిభ్రమ తరంగిత తారక భాఁ దమాల మా
ల్యము లటు లైన యీచెలికటాక్షము లిట్టటుఁ బన్వరాజమా
ర్గ మరయఁ దాండవోద్ధత శిఖావళి పింఛగుళుచ్ఛరాజి చ
న్న మయిన భాతిఁ దక్షిణమునన్ గనుపట్టె విచిత్రవైఖరిన్.

చ॥ బలహల పాతసంక్షుభిత భాను సుతాలహరీ గభీర మౌ
కలికిమెఱుంగుఁ గన్నుఁగవకాంతిస్రవంతి ఝురిన్ మునుంగు, చి
ప్పొలఁతుక విల్లువంపు కనుబొమ్మలు మేల్మకరంపుఁ జేష్టితం
బుల నలరారెఁ బెద్దయనుబ్రొమ్మ మనోహరలీల నత్తఱిన్.

ఉ॥ ఆ మదిరాక్షి యచ్చటఁ గటాక్షము లన్‌దృఢదీర్ఘరజ్జులన్
నామెయి సర్వముం బెనఁచి, నన్నుఁ బిఱిందికి లాగినట్లు గాఁ
గా, మదనాశుగాహతులఁ గంది, ప్రయాసముతోడ నెట్టు లె
ట్లో మునుముందు నే నడుగు సంచి ప్రకోష్ఠి నతిక్రమించితిన్.

ఉ॥ తేనెవిసంపుముల్కులను దేఁటితెగన్ ఘటియించి సింగిణిన్
వీనులు సోఁకఁగాఁ దిగిచి ప్రేఁకులతోడ శరవ్యమైన యి
మ్మైని నిజాప్రశిక్షపటిమంబును జూపుచు మాటి కక్కటా!
నూనశరాసనుం డరుదుతో దిదె నాయెదురం జరించెడున్.

గీ॥ తొలుత నెవని బలాత్కారధూర్తుఁడంటి
ప్రసభధృతధార్ష్ట్యుఁ డవ్వాఁడె పట్టుఁ జరణ

జలజదానుఁడు సంకల్పసంగ సుముఖి!
యబ్జ మిభమట్లు తావకం బరుణపాణి.

క॥ అహహా! యిన్నాళ్ల కను
గ్రహించె మరుఁ; డీభవంబు, గాదు వృథా; నా
బహుతపము పండె స్వయముగ;
నహహా చేకొంటి నీమె, నన్నులమిన్నన్.

చ॥ బలిమిని లజ్జ సెజ్జగదిఁ బాదమువెట్టినముగ్ధ యిప్పు శృం
ఖల బిగఁగట్టి ఖట్వమునఁ గాళ్లు దివిం, గొనిపోయి భర్త్సని
వ్వలనఁ దమాలశాఖ దృఢబద్ధునిఁ జేసి యదృశ్య యయ్యె; వ
యలమరుచుం బిశాచమటు లల్లుఁడు ప్రేలెడుఁ దల్లక్రిందుగన్.

చ॥ అఱచుచుఁ బొఱు నోర్దెఱచి యట్లు ప్రజన్ విడి; వీఁడు భూ
నెఱవడుఁ జేడ్వ కేడ్వకుఁడు నెట్టులలరై పరివారకంచుకుల్! [మ
నెఱకలువీడ మో మగల నిండసుపిన్ మెయి లోలు చల్లుఁ దు
బ్బతి కలవింగకుండు వికృతాకృతి మై పసుకిల్లు వెల్వడెన్.

సీ॥ కేళీగృహాంతర క్రీడాపరిశ్రాంత
కుసుమపురీవధూ విసరవదన
పద్మసుగంధంబు బంధు వై కమలాక
రంబుల నిద్రాజడంబు లైన
సారసంబుల మనోహారికూజితము దీ
ర్ఘంబు గావించు చారామములను
బ్రచలితవిచికిల ప్రసవసంచయ సౌర
భంబు వెంబడి మూఁగి పఱచు భ్రమర

గీ॥ సముదయము మన్మథస్వామి సకలలోక
విజయబిరుదావళిని బాడ, వేగుఁ బోకఁ
గోమలంబయి యంగానుకూలముగను
మాతరిశ్వుఁడు విహరించు మందగతిని.

---

# విరహిణి

పురిపండా అప్పలస్వామిగారు, కవితాసమితి.

---

ఈపులుగు పాటలే
ఈగాలి తేటలే
విఁసికొని పోవునీ విరజాజి నవ్వులే
నామెడద దహియించు.
నను వేదురుల ముంచు,
నెచ్చెలీ! నెచ్చెలీ!
నేనెటుల జీవింతు?
ఈయగమ్య పథాల
నిటులె సోఁగుదునా!—
ఎడలేక మ్రోగునా
యెద నాపికొందునా?—

అతని యడుగులజాడ
కై పరువు లిడుదునా?—
అంధకారపు బావి
కై నిరీక్షింతునా?—
ఈ తలపు బరువుతో
మెదగాల్పు కోర్కెతో
ఈ నిరాశాపూరితైక జీవితముతో
ఈభాద్రపద రాత్రు
లేరీతి వేగింతు?
నెచ్చెలీ! నెచ్చెలీ!
నే నెటుల జీవింతు?

# 'కన్యాశుల్కము'లో స్త్రీ వ్యక్తులు

శ్రీ శ్రీనివాసరావుగారు, కవితాసమితి.

'కన్యాశుల్కము' నందలి అంపతి స్త్రీ వ్యక్తులలో ఎవరిని మొదట పరిచయము చేయవలెను అన్న వితర్కము వెడలుటతో, తళుక్కున మధురవాణి మెరుస్తుంది; బుచ్చమ్మ అమాయికముగా చూస్తుంది; వెంకమ్మ కూర తరుగుతూ కనిపెట్టుకుంటుంది; పూటకూళ్లమ్మ పల్లెవాటులో చీపురుకట్ట దాచి ప్రవేశిస్తుంది; మీనాక్షి వెంట నంటురుంది; యోగిని సైగచేస్తుంది; మహేశముకూడా పెళ్లికూతురై ప్రవేశిస్తా నంటాడు.

ఇంతమందిలో ఎవరి నెంచుకుందికీ పాలు పోక అప్పుడు నేను అటూ ఇటూ 'కన్యాశుల్కము' పుటలు త్రిప్పుతాను. అదువాటిలో అందరికంటె మొదట మధురవాణి కానవస్తుంది. ప్రథమరంగములోనే మధురవాణి మాట వస్తుంది. ఆ పిమ్మట మధురవాణి ఇంట్లో గది! రామప్పంతులు కుర్చీమీద కూర్చుండగా మధురవాణి యెదుటనిలుచుండుట చూస్తాను. ఆమె ఎట్టిదో, ఎందుకో అంతట తెలుసుకొన బోతాను.

మధురవాణి ఒకవేశ్య. విజయనగరము వాళ్లఊరు. 'సంజీవరావు' గారి కటాక్షపునీడలో కొన్నాళ్లు ఉన్నది. 'ఆయన నాస్తుడు గిరీశము ఆమెను వుంచాడుగాని డబ్బుకి యటామటీగావుండే' డట. సంజీవరావుగారి సహచారము 'అల్లరి'గా పరిణమించిందట. అది మరపురావడముననుగా రామప్పంతులతో మధురవాణి బయలుదేరుతుంది. అంలోపున ఆమెయింట్లో నాటకపు రెండవరంగము ప్రదర్శించబడుతుంది. అప్పుడే మనము పూటకూళ్లమ్మతో ఆదిమ, అంతిమ పరిచయము లభిస్తుంది. రంగమంతటిలో, విమర్శకదృష్టికి, మధురవాణే అధిక మాకర్షముగా ఉంటుంది.

మధురవాణిలో మాంచి సంభాషణ చాతుర్యము కలదని మొట్టమొదటనే స్పష్టమవుతుంది. ఎవరిదగ్గర ఏవిధముగా మాట్లాడవలెనో ఆమె కెంతోబాగా తెలునును. ఒక్కరంగమందు, ముగ్గురితో మూడువిధాల, అతిస్వాభావికముగా అగపడేటట్లు పలుకుచుండుట చూడగా, మనకీ మధురవాణి ముందుముందు రామచంద్రపురం అగ్రహారము 'సమూలం రాణిగా ఏలగలుగుట' ఆశ్చర్యము జనింపజేసే విషయము కాజాలదు.

గిరీశమువంటి వ్యక్తిచేతులలో పడిఉండినా, ఒప్పుకోవలసిన తెలివైన 'పిల్ల' మధురవాణి. 'నేను యేమో ఉద్యోగాలూ ఊళ్లూ యేలి తనతో వైభవం వెలిగిస్తాననే నమ్మకంతో వుంది' అని గిరీశము నవ్వుకుంటాడు. కాని మధురవాణి అంతగ్రుడ్డిగా ప్రవర్తిస్తున్నదా అని కనుగోవలెను. ఈ విషయములో అతనిది మధురవాణి కందనిబుద్ధి కావచ్చుగాని ఆమెమాత్రము అతడిని వదలించుకొన జూచుచుండకపోలేదు. రామప్పంతులుతో ఆమె గిరీశమును గూర్చి ఒనర్చిన ప్రసంగములో బూటకపుధ్వని మనకు వినబడుచునే ఉంటుంది. గిరీశమంటే సదభిప్రాయమున్నది. కాని అతనిమీదనే నమ్మకముంచుకొనుట లేదా వేశ్య. అందువల్లనే రామప్పంతులు 'వుంచుకోవడానికి అంతాసిద్ధం' చేస్తే అతనితో బయలుదేరుతుంది మధురవాణి.

మధురవాణి ఎట్టిదో తెలిసికొనుటకు ఆమెనుగూర్చి అందరూ ఏమనుకుంటారో పరిశీలించాలి. ఆపై మన మామెపై అభిప్రాయము నేర్పరచుకొనుట సాధ్య మవుతుంది. వ్యక్తిత్వపరిశీలన కిది యొకమార్గము.

'మధురవాణి అంటూ ఒక వేశ్యాశిఖామణి యీ కళింగరాజ్యంలో వుండకపోతే, భగవంతుడి సృష్టికి యెంతలోపంవచ్చివుండును?' అని కరటకశాస్త్రి అనుమానపడతాడు. 'నువ్వు మంచిదానివి. యెవరో కాలుజారినసత్పురుషుడి పిల్లవైవుంటావు' అని సౌజన్యారావు అభిప్రాయపడతాడు. లుబ్ధావధాన్లకి మృదువు చేతులూ, తల, తల దగ్గర చేస్తే... ఘుమఘుమా' కలిసి మధురవాణి 'మంచి బుద్ధిమంతురాలు'గా కానవస్తుంది. మొత్తముమీద అందరూ ఏదోవిధముగా ఆమెను మెచ్చుకునేవాళ్లే. గిరీశము మాత్రము మధురవాణిని 'నాచిడెవిల్', అంటాడు. అయినా 'బ్యూటిఫుల్ నాచిడెవిల్' టెండి. 'నాచిగర్ల్స' అంటే అతనికి 'పోజిటివ్ యబహారన్స్' డామిట్! అంతా ఇన్సిన్సిరిటీయే' అట! అయితే గిరీశమునకు మధురవాణియందలి వేశ్య మాత్రమే కనబడింది. ఆమె ఇతర గుణములతో అతనికి పరిచయము కలుగు అవకాశము లేకపోయింది.

నాటకమున మధురవాణి వ్యక్తిత్వము పరిపూర్ణముగా ప్రకటించబడలేదు. కాని చిత్రితమైనంతవరకు మాత్రము అంతా ఎంతో స్ఫుటముగా కానవస్తుంది. అట్లుగా కరటకశాస్త్రి ఆమెను 'త్రిలోక సుందరి' వని పొగడినప్పుడూ, శిష్యుడు 'దాని నవ్వు పట్టుబడాలని నిదానిస్తున్నప్పుడూ మన కామె సౌందర్యము కొంత కానవస్తుంది. రామప్పంతులు 'సొగసుకత్తెల అలకలో కూడా అదో స్రుంగారం' గ్రహిస్తాడు, ఆమె అందము కొందటి నాకర్షించగలుగుతుంది. అందమును ప్రదర్శించి ఆమె కొంతకార్యము సానుకూలము చేస్తుంది.

మధురవాణికి విద్యకూడా ఉన్నదని మనము నమ్మవచ్చును. ఆమెకు 'గిరీశము కొంతకాలం యింగిలీషు చదువు చెప్పేవాడు.' ఆమెకు 'మృచ్ఛకటికము' తెలిసిన నిదర్శనాలు ఉన్నవి. 'బుద్ధిమంతురాలైనతల్లి తరిఫీదు' చేత మధురవాణి 'విద్యా' సౌందర్యాలు దోహదంచేసి 'పెంచుచున్న'దట. 'మాతల్లి ధర్మమా' అని, ఆమె నా చెవిలో గూడుకట్టుకుని బుద్ధులు చెప్పబట్టిగాని, అని మధురవాణి తనకు తల్లే ప్రాథమిక సంస్కారము ఇచ్చిందని అడుగడుగుకీ సూచిస్తూ ఉంటుంది. అటిలేరిన మధురవాణి వీణ వాయించుటలో వింతవిషయము లేదు.

మధురవాణి హృదయ మెట్టిది? 'వృత్తిచేత వేశ్యని గనక చెయ్యవలసిన చోట్ల ద్రవ్యాకర్షణ చేస్తానుగాని, మధురవాణికి దయాదాక్షిణ్యాలు నున్న అని తలచారా'? అంటుం దామె. 'వేశ్య అనగానే అంత చులకనా పంతులుగారూ? సానిదానికి మాత్రం నీతి వుండొద్దా?' అంటుంది. 'పెళ్లతలచుకోలేదు... పూరుకుక్కలనూ, సీమకుక్కలనూ దూరంగా వుంచడానికి ఆలోచిస్తున్నాను' అంటుంది. ఇదే ఆమెలో పరివర్తనము. 'వెయ్యిరూపాయలకంటె వక ముద్దు యెక్కువ విలవా?' అని సౌజన్యారావు ఆశ్చర్యపడినప్పుడు మధురవాణి సహృదయత్వము వహిస్తుంది.

వేశ్య వ్యభిచరించుట ప్రమాదము కాదుగాని, మధురవాణికి హెడ్డుతో ఎట్టి సంబంధ మున్నదో కనుంగొనవలసి ఉన్నది. 'హెడ్డును నౌఖరులా తిప్పుకున్నాను కాని అధికములేదే' అని మధురవాణి పలికినమాటలో నమ్మకము ధ్వనిస్తున్నది. కాని రామప్పంతులు లేనిసమయాన సలుగురినీ తెచ్చి పేకాడుచుండుట ఆమె అలస ప్రకృతిని కొంత సూచించకపోదు. రామప్పంతులంటే ఆమె లక్ష్య పెట్టేవిధముగా కానరాదు. అతడిని తకవతదవకూ అల్లరి పెట్టుతూనే ఉంటుంది. లుబ్ధావధాన్లు 'మధురవాణికి మీదగ్గిర భయం భక్తీకూడాకద్దు' అన్నప్పుడు రామప్పంతులు 'వుంది, కోపంవొస్తే గడ్డి పరకంత ఖాతర చెయ్యదు. పరాయిమనిషి వున్నాడని అయినా కానదు.' అంటాడు; కొండొకచోట 'తిక్కలంజ' అని తిట్టుకుంటాడు; ఆమె నెప్పుడూ అనుమానిస్తూ ఉంటాడు.

మధురవాణి అంత నాటకానికీ అతి ముఖ్యమైన స్త్రీపాత్రము. ఆమెవలన కథ సూటిదారిలో ప్రవహిస్తుంది. కథ యెదురు తిరిగితే 'చక్రం అడ్డువేయ' గలిగినంత ధీమా ఆమెకున్నది. ఆధైర్యము ఎక్కడా ఆమెయందు లోటుకాదదు. పరిస్థితులు బాగా పరికించి తదనుగుణముగా సూటిగా ప్రవర్తిస్తుంది. కథలో చిక్కు (Complication) తీసుకొని వచ్చునదీ, విడగొట్టునదీకూడ మధురవాణే. రామప్పంతులి లౌక్యచర్చచెప్పించుకుని, కరటక శాస్త్రితో కార్యాలోచనచేసి, తెర వెనుకనుంచి సమయోచితంగా హంగుచేస్తుంది. చతుర్థాంక ప్రథమరంగములో ఆమె తనపని ఎటువంటి నటనావైవిధ్యము, వైదగ్ధ్యముతో నిర్వహిస్తుందో చూస్తే, కరటక శాస్త్రికి ఆమె యెంత ఉపకారము చేసినదీ తెలిసివస్తుంది.

తరువాత మూలకథ అయిన కంటె వృత్తాంతమూ, దానితో బలవత్తరమైన నాటకవేగమూ వస్తవి. మధురవాణి కంటె 'తాంపీ గదపలో కాలుపెట్ట నివ్వను' అనుట గదిలో చిక్కుకున్న వ్యక్తుల రక్షణార్థమే అయినా, రామప్పంతులు ఇంటి నుండి మరలుటతో కథావస్తువునకు క్రొత్తనడక వస్తుంది. అప్పుడైనా మధురవాణి మనోధైర్యము సన్నగిల్లదు. లుబ్ధావధాన్లుమీది దోషారోపణ అందరికీ ఆందోళన కలిగించినా, సమస్యావిభేదన మాత్రము తనకు తప్పక తెలునును.

కనుకనే మధురవాణికి ధైర్యము. ఒకవంక రామప్పంతులుస్థితి, ఒకవంక లుబ్ధావధాన్ల అవస్థ, ఇంకొకవంక కరటకశాస్త్రి కథా మధురవాణి ఎరుగును. 'యెప్పుడైనా మీయిద్దరిప్రాణాలు నేను కనికరించి అడ్డుపడాలి కాని మరియెవడికీ సాధ్యము కాదనుకుంటాను' అని ఆమె కరటకశాస్త్రికీ శిష్యుడికీ సూచిస్తుంది. "మలిగి తేలుస్తాను' అనే ధైర్యము ఆమె కొక్కతెకుమాత్రమేఉంది. అందువల్లనే ఆఖరుకి మధురవాణీ లుబ్ధావధాన్లని పరీక్షించి, కథనుకప్పిన అవగుంఠనము తొలగిస్తుంది.

కాని ఒక్క గిరీశమునకు మాత్రము గొప్పకష్టము జరిగిపోతుంది. అతని ప్రయాసలు నిష్ఫలమై పోతవి. అందుకు ఎంతవరకు మధురవాణి కారణమో కనుగొనదగియుంది. గిరీశము సౌజన్యారావుకి పూర్తిగా నమ్మకముకలిగించిఅతని మెప్పులు పొందుతున్న సమయములో మధురవాణిప్రవేశిస్తుంది. గతుక్కుమని పోతాడు గిరీశము. మధురవాణి గిరీశముయొక్క పూర్వకథ వెల్లడిచేస్తుంది. సౌజన్యారావు తాను కేవలమూ మోసపోయా ననుకుంటాడు. ఇక గిరీశమును పూర్తిగా వితర్కించక అతడు తన ఆఖరు తీర్పు తెలియజేస్తాడు- అతడే గిరీశమునకు అదృష్ట విఘాత అవుతాడు- మధురవాణి 'పాపము ఆయనను బతకనియ్యండి' అన్నా లాభము లేకపోతుంది.

మధురవాణిని వదలి మరొక పాత్రవంకకు మరలుట అనగా ఒక సాంఘిక రంగమునుండి మరొకదానిలోనికి దూకుట అన్నమాట, 'కన్యాశుల్కము' లో సాంఘికదోషములు స్పష్టీకరించబడుటకుగా సాంఘికవ్యక్తులూ- సంఘపరిస్థితులూ ప్రదర్శించబడినవి. ఇందలి పాత్రలందరూ దినదినమును మన మెరిగిన సామాన్యులు. ప్రవహించిపోతున్నకాలములో పడి కానరాకపోవుటకు బదులు ప్రస్తుతనాటకమూలమున బయలుపడి మరల నాకర్షించినారు. వారికథవల్ల, గుణదోషములవల్ల వారియందు ఏదో ఒకఅభిప్రాయము మనకేర్పడుతుంది. కొన్నిచోట్ల వారిప్రవర్తన మనలను నవ్విస్తుంది. కొన్నిచోట్ల మనసంఘ దోషములు వారిలోనుండి కానవస్తూఉంటవి. వారు మాట్లాడుకుంటున్నదంతా జీవితఘట్టములలో ఎందో ఒకచోట వినబడుతూ ఉంటుంది.

'కన్యాశుల్కము'న సాంఘికజీవనమందలి వివిధరీతులు ప్రతిఫలిస్తూఉంటవి. అగ్రహారములు రంగములైనప్పుడల్లా అచ్చటి బ్రాహ్మణజీవితము పరిస్ఫుటముగా కానవస్తుంది. గిరీశమువంటివారు నగరజీవన సౌభాగ్యమును ప్రదర్శిస్తూఉంటారు. స్త్రీవ్యక్తులు సంఘస్త్రీ స్వభావమును స్పష్టముచేస్తూ ఉంటారు.

నగరస్త్రీ అగు మధురవాణిని వదలి అగ్రహారములందలి ఆడువారివరకు వచ్చినంతట పరిస్థితులు మారిపోతవి. వెంకమ్మవంటి స్త్రీని విమర్శించ బూనుకుంటే, వెంటనే కృష్ణరాయ పురప్రశాంతవాతావరణము ప్రస్ఫుటమై వచ్చి పడుతుంది. నాటకద్వితీయాంక మామె వాక్యములతో, ఆత్రముతో ఆరంభమవుతుంది. వెంకటేశము రాగానే ఆమెయే ప్రేమతో అతనిని కౌగలించుకుంటుంది. ఆమెయందలి మాతృహృదయము అక్కడే అతిస్ఫుటముగా కానవస్తుంది. ఆమెయందలి అమాయకత్వమే బుచ్చమ్మలో ప్రతిఫలించినది.

ఈ బుచ్చమ్మ ఎక్కువ మనకుతూహలము రగిలించ గలిగినది. ఈమె "అన్ఫార్చునేట్ బ్యూటిఫుల్ యంగ్విడో" గా గిరీశమును ఆకర్షించివేస్తుంది. ఈమె నియమజీవితములో, నిష్కల్మషహృదయములో ఏవిధముగా, ఎట్టిమెట్లతో గిరీశము విక్షోభము వినిర్మిస్తున్నాడో క్రమముగా మనము కనుగొన గలుగుతాము. ఇది పాశ్చాత్యనాటకపు ప్రణయ ప్రదర్శనరంగము కాదు. ఇక్కడ గిరీశము చాకచక్యముతో జయించగల చేయి చూస్తున్నాడు. ఇదే "అతనికి క్రొత్తదా, కొంత న్యాయమైన దారి" అని తోస్తుంది.

నాటకములో మరొక వితంతువున్నది మీనాక్షి. బుచ్చమ్మకు ఈమెకూ ఎక్కడా పోలికేలేదు. ఈ మీనాక్షి బుచ్చమ్మతో విభేదము కనపరచుటకూ, రామప్పంతులు పాత్రపరిస్ఫుటము చేయుటకూ, లుబ్ధావధాన్ల గృహజీవనము చూపించుటకునుగా ఉపకరిస్తున్నది; వితంతువులలో విధిలేక పాడైపోయిన స్త్రీవ్యక్తిని సూచిస్తున్నది.

మొట్టమొదట మీనాక్షివిషయమును రామప్పంతులు ప్రకటిస్తాడు. మీనాక్షి ప్రవర్తన మంచిది కాదంటా డతడు. గిరీశమువల్ల మనకు 'ఒకప్పు డది ప్రాణభయంకూడా చేస్తుంది' అని తెలుస్తుంది. లుబ్ధావధాన్లకికూడా ఆమె నైజము తెలియనిది కాదు. పెండ్లాడిన పిల్లనిగూర్చి ప్రసంగిస్తూ, దాన్ని పాడుచేస్తావున్నావూ?' అని అనుమానముతో అతడు మీనాక్షి నడుగుతాడు. తుద కామె ప్రవర్తన కొకకారణము కనుగొనుట కతనికి కష్టకాలము అవకాశమిస్తుంది. 'నా జీవానికి ఉసూరుమంటూ అది కాని తిరుగులు తిరిగిందంటే దాని తప్పా,' అని అతడు నాలిక కరుచుకుంటాడు. అతనిలో అంత పరిణామము వచ్చిన పిమ్మట, "భగవంతు డిలాగ" నమ్మిన సౌజన్యారావు 'వితంతువులమతానికి ఆ పిల్లనిపంపడం నా సలహా' అన్నప్పుడు లుబ్ధావధాన్లు ఏమిచేసి ఉంటాడో ఎఱిగికొనుట సులభము, మధురవాణి 'యేం? కులంతక్కువా? రూపంతక్కువా! ఆమెబతుకు భ్రష్టుచెయ్యానే చేశారు; పెళ్లాడి తప్పు దిద్దుకోండి' అని రామప్పంతులుకి సలహా ఇచ్చినా అట్టిపరివర్తనము అతనిలో రాగల అవకాశములు నాటకములో కనబడవు. కావున మీనాక్షికి కాశీవాసమో, మతప్రవేశమో తటస్థించటన్నదే ఎక్కువ నమ్మగల విషయమై చూపట్టుతుంది.

కన్యాశుల్కమున స్త్రీ వ్యక్తులలో పూటకూళ్లమ్మ ఒకర్తె. ఈమెను వితంతు 'వనుటకు గిరీశము ఒప్పుకోడేమో' అని మనము సంకోచించినా 'పూటకూళ్లమ్మలాంటి ముండని' అని అతడు తరువాత పలికిన కారణముచే భయములేదని నిబ్బరము పరచుకోవచ్చును. పూటకూళ్లమ్మ అనగానే చీపురుకట్టకూడా స్మరణకువచ్చి, ఆ ఆయుధము రామప్పంతులికి అంటుకొనుట (గట్టిగానే అని అనుకుంటాను), దానికి 'చీపురుగట్ట సరసం' అనే సరస నామకరణము లభించుటా, మొత్తముమీద అరంగ మంతా నవ్వించగలిగినదే అగుటా మనము గ్రహించుకుంటాము. పూటకూళ్లమ్మ పాత్రము గిరీశ మెట్టివాడో చెప్పుటకు ఉపకరిస్తుంది. ఆమెయందు తక్కువతరగతి హాస్యరసము మన కనుభవ మవుతుంది.

నాటకమందలి అముఖ్యపాత్రములలో యోగిని ఒకర్తె కానవస్తున్నది. ఆమెవలన ఉపదేశము పొందుటగా అగపడుతూ ఉంటుంది.

'కన్యాశుల్కము' నందు కానవచ్చు వ్యక్తు లిట్లు సంఘమందలి వేరువేరు తరగతులనుండి ఏరి తీయబడినారు. వారి నర్థము చేసుకొనుటనగా "కన్యాశుల్కము" ను అర్థము చేసుకొను టన్నమాట.

---

## వేడికోలు

చెలికాని సత్యనారాయణగారు, కవితాసమితి.

గీ॥ ప్రభువతంసమ! వినుము నా ప్రార్థనమ్ము
మనమునందున నెలకొన్న పాపములను
మూల విచ్ఛిన్నముగ గొట్టజాలునట్టి
బలము దయసేయు మో ప్రభూ! పరమపురుష!

నన్ను పెడద్రోవలను పెట్టుచున్నయాశ
యెన్నడును నాదు మదిలోన నెంచకుండ
గనుల నానందబాష్పముల్ గ్రమ్ముకొనగ
స్వామి భవదీయసేవను సల్పునట్టి
బలము దయసేయు మో ప్రభూ! పరమపురుష!

స్వప్నమందును జాగ్రదవస్థయందుఁ
జనుల కుపకారమనినంత గరిమతోడ
శక్తివంచన లేకుఁడ సల్పునట్టి
బలము దయసేయు మో ప్రభూ! పరమపురుష!

బీదసాదల నెన్నఁడు వీడకుండ
కోరి హితముఁ జేసినవాని మరువకుండ
నోర్చి గర్వాంధులకు లొంగకుండునట్టి
బలము దయసేయు మో ప్రభూ! పరమపురుష!

స్త్రీల మానము రక్షింప శ్రేష్ఠమైన
భూతదయ పూర్ణముగఁ గల్గు పూజ్యమైన
దేశసేవను గావింప దివ్యమైన
బలము దయసేయు మో ప్రభూ! పరమపురుష!



గా॥ సర్. యన్. యి. మార్షిబాంక్సుగారు.



శ్రీ గోషన్ ప్రభువు.



గా॥ టి. యి. మాయర్ గారు.



సైమను విచారణ సంఘసభ్యులును, కేంద్రసభాప సంఘసభ్యులును, మదరాసు రాష్ట్రీయ శాసనసభాప సంఘసభ్యులును.



సర్. మహమ్మద్ ఉస్మాన్ సాహెబుగారు.



ఎ. వై. జి. క్యాంబల్ గారు.



గా॥ ది. బ. కృష్ణన్ నాయర్ గారు.



బిన్‌స్టెడ్డు గారు.



సర్ గార్డన్ ఫ్రేసర్ గారు.



డబ్లు. హెచ్. లూకరు గారు.



సర్ జేమ్సు సింప్‌సన్.



సర్ అలగ్జాండర్ మెగ్‌డూగల్.



సి. యి. వుడ్డు గారు.



ఇ. కారన్‌స్మిత్తు, సి. ఐ. ఇ., ఐ. సి. యస్.



యఫ్. బి. వాటన్ గారు.



ఆరమ్‌స్ట్రాంగు గారు.



# ప్రవరుని సంసారసుఖము.

ఆంధ్ర శేషగిరిరావు బి. ఏ., సారస్వతసమాజము

ఆంధ్రకవితాపితామహుఁడు తన మనుచరిత్రమున ప్రవరుని సంసారమును వర్ణించి చిత్రించుటలో నాదర్శప్రాయమగు నొక సుఖకుటుంబమును మనమునం దిడుకొని యుండును. సమష్టి కుటుంబములలోఁ బూర్వము ఆర్యు లెట్టిసౌఖ్యమును బొందిరో ప్రవరుని సంసారచరిత్రమునుపఠించువారికిఁ బెద్దనార్యుఁడు ప్రస్ఫుటము చేసెను. వాసయోగ్యమైన గ్రామమున కాఁపురమును, పెక్కు చందాలంబండుమాన్యక్షేత్రములను,ఒకప్పుడును తఱుఁగనిపాఁడిని, అతిథిజనుల రాకపోకలచే పావనమైన గృహమును, ఇలుదీర్చు తలిదండ్రులను, అనుకూలవతియగు భార్యను, శుశ్రూషావికస్వరహృదయంబగు శిష్యగణమును ఇచ్చి కావ్యబ్రహ్మ పెద్దనార్యుఁడు తన సృష్టించినప్రవరునకు అనంతమగు సంసారసుఖమును కూర్చినాఁడు. ప్రవరునకు సంసారమున అట్టి అనంతసుఖమును కూర్చిన కారణగుణములను విడఁదీసి వివరించి పరామర్శింతము.

ప్రవరుని సంసారసుఖమునకు మూలదుంపమైనది ఆతఁడు కాఁపురమున్న అరుణాస్పదపురముయొక్క వాసయోగ్యత. ఎట్టి సంసారమైనను సుఖవంతమైయుండుటకు ఉండు ఊరు తృణకాష్ఠజలసమృద్ధమై యుండవలయును. నదీతీరభూములు ఎల్లప్పుడును జనాకీర్ణములును, సుభిక్షములును నై యుండుటకుఁ గారణములు అవి తృణకాష్ఠజలసమృద్ధములై యుండుటే. ప్రవరుని స్వగ్రామమగు అరుణాస్పదము వరణాద్వీపవతీ తటాంచలమున విలసిల్లినది. అగుటచే నది తృణకాష్ఠజలసమృద్ధమై యుండె ననుటకు సందేహములేదు. మఱియు ప్రవరునివంటి కర్మఠునకువరణవంటి 'ఎప్పుడు నెడతెగక పాఱునేఱు' అనంతమగు వినియోగసుఖము నీయఁజాలును. అంబరచుంబియైన అచ్చటివప్రము తీరు, చంద్రమండలమునందలి జింకను సయితము తెల్లఁగాఁజేయఁజాలు అచ్చటి పాలగచ్చుమేడల యొప్పు, ముదిమది దప్పిన సరస్వతీనాథుని మెచ్చని అచ్చటి విప్రుల విద్యాప్రౌఢి, బంటు నంపి భార్గవునైన బింకమున బవరమునకుఁ బలిపించు నచ్చటిరాజుల శౌర్యసంపద, ధనాధినాథుఁడైన కుబేరుని సయితము పోషింపఁగల నచ్చటి కోమటుల ధనసంపద, ఆదిభిక్షువు భైక్షమైన మాన్పఁజాలు నచ్చటి శూద్రులహాలముఖాత్తవిభూతి, రంభాదులనైన నొరయఁ గాసెకొంగునవారించి కడసఁగలయచ్చటి వెలయాండ్రనాట్యరేఖాకళాధురంధతానిరూఢి అరుణాస్పదపురముయొక్కవాసయోగ్యతకును, అచటి పౌరులసుఖజీవనస్థితికిని ప్రబలనిదర్శనములై యున్నవి. ఇట్లు సుఖజీవనమునకు వలయు అనుకూలవాతావరణమును గలిగి ఆపట్టణము జనాకీర్ణమై మహీకంఠహారతరళస్ఫూర్తిని విడంబించినది. అట్టి సుఖజీవనస్థితికిఁ దావలమైన వాతావరణముగల పట్టణరాజమున ప్రవరుఁడు 'శమంబు దమంబు గల' విద్యావంతుఁడును, 'శీలము కులము గల' ధనవంతుఁడును అయిన పౌరుఁడై విలసిల్లెను. ఈసంగతి ప్రవరునిసంసారసుఖమున కెందును లోపము లేదన్నవిషయమును తెల్లము చేయుచున్నది. అరుణాస్పదపురముయొక్క వాసయోగ్యత ప్రవరునిసంసారసుఖమునకు మూలదుంప మైనది.

ప్రవరుని అనంతమైన కుటుంబసౌఖ్యమునకుఁ దోడ్పడిన రెండవ కారణము ఆతని ధనాఢ్యత. ఉన్నఊరు ఎంతమంచిదైనను ఎంతతృణకాష్ఠజలసమృద్ధిగలదైనను చేతిలోఁ బైసాలేక 'నిత్యాశనశూన్యం బగు దైన్యంబు'న నున్నవాఁడు అచ్చట సంసారసుఖ మనుభవింపనేరఁడు.

ఉ॥ సంపదచేతఁగాని కొనసాగవుస్థువ్వో గృహస్థధర్మముల్.

—పాండురంగమాహాత్మ్యము.

అని కదా అనుభవజ్ఞు లందురు.

మ॥ బలవద్దైన్యమువ క్త్రిగహ్వరముగాఁ
బల్పొచ్చెట్లఁ గొన్నట్టి య
వ్వులు మై చాఱలు గాఁగ బాలరుదితం
బు ల్మ్రోఁగుటల్గాఁగ

—కేయూర బాహుచరిత్ర.

దారిద్ర్య శార్దూలము ఏ యింటియందు తిరుగాడుచుండునో ఆయింటియజమానికి శాంతిసుఖములు, చందమామ ఘుటికలు. ప్రవరుని సంసారమును ఎప్పుడును ఋణ మనుపాతకము తాఁకలేదు; దారిద్ర్య మనుశార్దూలము చూడలేదు. ఏ మందురా? ప్రవరుఁడు ధనాఢ్యుఁడు. దేహి అని ఒకరిని చేయిచాఁచి యాచింపవలసిన అవసర మాతనికి లేదు. ఆతని మాన్యక్షేత్రములు పెక్కు చందముల పండుచుండును. అగుటచే నాతనియింటియందు ఒకప్పుడును పాఁడిపంటలు తఱుఁగవు. ఇంతటి సంపన్నుఁడు కావుననే ఆతఁడు అర్థమూలమైన అతిథిపూజ చేసి, సిరికిం దరమైన దానరక్తిని చూపి గృహస్థాశ్రమధర్మము నిర్వహింపఁ గలిగితి ననుసంతోషసుఖమును పొందినాఁడు. ధనసంపద, కృషిసంపద మున్నగు సంపదలకుఁ బేరు మ్రోసిన అరుణాస్పదపురమున ప్రవరుఁడు మాన్యక్షేత్రములందుఁ బెక్కుచందాలం బండినపంట, ఒకప్పుడును తఱుఁగని పాఁడి అను కృషిసంపద; బహుధనమూలకమైన వివిధాధ్వరముల నిర్వహించిన ధనసంపద; అనారతాధ్యాపన తత్పరమైన విద్యాసంపద కలిగిన పౌరుఁడై సుఖయించెను.

ప్రవరుని సంసారసుఖపాదపమునకె దోహదము చేసిన మూఁడవ కారణము ఆతని జీవత్తాతపాదత్వము – ఉన్న ఊరు మంచిదియైనను, పిసిగికొని తినుటకుఁ గావలసినంత యున్నను పిన్నటనాఁటనే తల్లిదండ్రులను గోల్పోయి కుటుంబభారమును వహింపవలసిన సంసారికి పూర్తిసుఖ ముండదు, సరికదా అతనికి గృహచ్ఛిద్రములు తెవులులేని వేదన గల్గించును. సంసార నిర్వహణభారమును పూనిన వారికి సంసారసుఖము మనఃక్లేశ మలినము కాక తప్పదు. చూడుఁడు.—

చ॥ జనకభుజావనీజముల చల్లని నీడ వసించియుండు నం
దనులు జగంబున న్సుఖులు తండ్రి మృతుండయి చన్న బిన్న నాఁ
డ నిజకుటుంబభారము గడంగి వహించుచుఁ దీవ్రదుఃఖవే
దనబడువారపుణ్యులు విధాతృనిచేత భుజంగమేశ్వరా!

—మార్కండేయపురాణము.

అని కదా సారమతులు వచియించెదరు. ప్రవరుని విష యమున నిట్టి కష్టములు లేవు. ప్రవరుఁడు జీవత్తాతపాదుఁడు. అగుటనే ఈ విషయమున ఆతని కెట్టి కష్టములును లేవనుట సంసార శకటచోదనమునఁ దమ చీమునెత్తురులు వెచ్చించి యేళ్లు గడపిన ఆతని తల్లిదండ్రులు పురాణదంపతు లగు పార్వతీ పరమేశ్వరులవలె సుఖులై కూడియుండి ఇంటిపెత్తనము చక్కఁబెట్టు చుండిరి. ఎట్టి లోపాలోపము లున్నను అనుభవశాలులు, అనురాగయుక్తులు నగు తల్లిదండ్రులే సవరించుకొని పోవుచుండఁగా ఆ కుటుంబి హృద యము సంసారవిషయమున ఆందోళితము కాలేదు; చింతావకుం ఠితము కాలేదు. ఆతని సౌఖ్యతురంగమునకు కశాఘాత మనునది లేనేలేదు. ప్రవరునకు సంసారమున సుఖమేకాని బాధ్యతలేదు, అను భవమే కాని శ్రమలేదు.

ప్రవరుని కుటుంబసుఖమునకుఁ గారణభూతమైన మఱియొక విషయము అనుకూలవతియగు భార్యాలాభము. వాసయోగ్యమైన గ్రామము, తఱుఁగని పాడిపంటలు, ఇలు దీర్చెడి తలిదండ్రులు ఉన్నను సంసారికి వహ్నిసాక్షిక మగుసఖ్యమున జన్మాంతమువఱకు పార్శ్వవర్తిని యై మెలఁగు కులకాంత అనుకూల కాదేని ఇసుమంత యైన శాంతిసుఖములు లభింపవు.

క॥ చెప్పిన పని యొనరించిన
యప్పణఁతుక కల్ల గహన మది సదన మగున్
జెప్పినపని యొనరింపని
యప్పణఁతుక గల్గు సదన మది గహన మగున్.

—చాటుధార.

అనుమాట మంచి అనుభవముమీఁద చెప్పినది కదా! భార్యావిషయమునఁ గూడ ప్రవరాఖ్యుఁడు మంచియదృష్టవంతుఁడు. "కమనీయ కౌతుక శ్రీవిధిఁ గూఁకటుల్ గొలిచిచేసినకూరిమి సోమి దమ్మ" ఆతనిని సాభ్యావహయై సేవించు చుండెను. అభ్యాగత సేవాపరతంత్రసకలజీవనఁడైన ప్రవరాఖ్యునకుఆతనిభార్య సర్వవిధ ముల తగినది. ఎంతమంది అతిథులు వచ్చినను ఆమె వండుటకు చిరా కుపడదు. అతిథులు అర్ధరాత్రి వచ్చినను ఆమె ఆనందముతో వారికిఁ గావలసిన పదార్థములనెల్ల వండిపెట్టును. సహధర్మచారిణి సౌజన్య మువలన ప్రవరుని అతిథిపూజాభిలాష కార్యరూపము దాల్చెను. అందువలన ఆతఁడు గృహమేధిప్రవరుఁ డయ్యెను, "వలపుగ్, నను పుగ్, దగపుగ్, బ్రియంబునగ్" సోమిదమ్మవలన నాతనికి నిండా రినవి. సహధర్మచారిణి తలలోనాలుకయై తన్నెప్పుడును ఎడఁబాసి యుండని పదదాసియై సేవించుచుండ ప్రవరుఁడు అనంతమగు సంసారసుఖ మనుభవించుచుండెను.

ప్రవరుని సంసారసుఖమునకుఁ గారణభూతమైన వేఱొకవిష యము "విభవానుగుణమైన ఆతని వితరణోన్మేషంబు" ధనమునకు గతులు మూఁడు.—భోగము, దానము, నాశము అని 'కట్టక, కుడు వక,యొరులకుఁ బెట్టక, 'ధనము గావున్నదయ్యాలదఱుమువారి'సం పదకుగతి నాశనమే. అట్టిది సుఖమీయఁజాలదు. సుఖకరమైన లక్ష్మికి త్యాగభోగములు రక్షలు. భగవంతుఁడు తన కిచ్చిన సంపదను తాననుభవించుటవలన కలిగెడి ఆనందము ఆసంపదలో గొంత యితరులకుఁ బంచియిచ్చుటవలనఁ గలిగెడు తృప్తితో మిళితమైనప్పు డే కుటుంబి జీవనము అవంధ్యజీవన మగును; ఆతని సంసారసుఖము సమగ్ర మగును. ప్రవరుని ధనసంపద భోగము, దానము అను రెండుగతులను బొంది ఆతనికి సావధికముగాని సంసారసుఖము నిచ్చినది.

"చెక్కుటద్దములందు జిగివెల్లువలు చిందు
రమణీయ మణి కుండలములు"

చెవులకు—

"పసిఁడిమ్రాత చెఱంగు మిసిమి దోఁపఁ జెలంగు
నరుణాంశు కోత్తరీయంబు"

భుజములమీఁద—

"సరిలేని రాకట్టు జాళువా మొలకట్టు"

నడుమునకు—

"కాశికాముద్ర యిడిన యుంగరము"

వ్రేలికి—

'పసిఁడిగోరము' బాహువునకుఁ— బెట్టి ఆతఁడు తన ధన మును భోగించినాఁడు. అతిథిజనులకుఁ బెట్టి ఆతఁడు తన ధనమును త్యాగముచేసినాఁడు—ప్రతిదినమును ప్రవరుని గృహాంతరమున అతిథి జనములు పావనస్నానవిధాన్నపానములచేత సంతృప్తులగుచు ఆతని అభ్యాగత సేవాకాంక్షకు ఫలసిద్ధియు, ఆతని గృహస్థ ధర్మమునకు వినియోగమును గలిగించి ఆతనికి తృప్తిసుఖముల నిచ్చుచుండిరి.

ప్రవరుని కుటుంబసౌఖ్యమునకు సహకారియైన మఱియొండు విషయము 'అజ ప్రశస్ప్రూపావికస్వర హృదయంబగు ఆతని శిష్య గణము వటువులకు విద్యగఱపి వేదవిద్య పారంపర్యముగ వెలయిం చుట ఆర్యవిప్రులకు విధ్యుక్తధర్మము. అంబురుహ గర్భ కులాభరణ మను అనారతాధ్యాపన తత్పరుఁడును అయిన ప్రవరుఁ డా కారణ మున శిష్యులను చేరదీసి వారికి వేదవిద్యల నేర్పెను. అట్లగుట నాతఁడు స్వధర్మసేవ యథామతిని నిర్వహించితినిగదా యను సంతోషసుఖమును బొందఁగల్గినాఁడు. ఇట్టి సంతోషసుఖమేగాక ప్రవరునకు ఆతని శిష్యులవలనఁ బ్రత్యేకసుఖముకూడఁ గలిగినది. ఆతనిసొద్ద విద్యాభిక్షను గొను విద్యార్థులు గురువునకు పంగనామ ములు పెట్టు రకముగాక ప్రవరుఁడు అరుణోదయమున వరణానదికి స్నానమునకుఁ బోవునపుడు సయితము ఆతని ననుసరించుచు నెల్ల వేళల నాతనికిఁ దోడునీడలై క్రీడించుచు సచ్ఛాత్రులై యుండిరి. అట్లగుట వారు ప్రవరుని అనారతాధ్యాపన తత్పరత్వమునకు ఉచి తోపయోగ్యనృత్తి నాపాదించి అందుచే ఆతని సంసారసుఖమునకు సమగ్రత్వమును సంపాదించిరి.

ప్రవరుని సంసారసుఖమునకుఁ దోడ్పడిన మఱియొండు విషయము ఆతని నియమబద్ధమైన జీవనము. ఎవఁడు తనజీవనమును నియమబద్ధ మొనర్చుకొనునో వాఁడు ఆరోగ్యవద్దేహుఁడును సుఖియు నగును. పెందలకడ లేచుట, అరుణోదయమున శీతలజల స్నానము చేయుట, రమణీయప్రకృతికి వేలముపట్టు అగు నదీ

తీరమున సమిత్కుశార్థ సంచరణము—ఇత్యాది నియమములను ప్రవరుఁడు దినదినము పాటించును.

సీ॥ వరణా తరంగిణీ దర వికస్వరనూత్న
కమలకషాయ గంధము వహించి
ప్రత్యూష పవనాంకురములు పైకొను

బ్రాహ్మీముహూర్తమున ప్రవరుఁడు ప్రతిదినమును నిద్ర మేల్కొనును. అప్పుడాతఁడు శిష్యసమేతుఁడై నదికిఁ బోవును. అందాతఁడు దోవతులు ఉదికికొని అఘమర్షణస్నానము ఆచరించును. పిమ్మట ఆతఁడు సాంధ్యకృత్యమును దీర్చికొనును, సావిత్రిని జపియించును; ఆ నది సైకతస్థలిని కర్మసాక్షి కెఱఁగును. సస్యశ్యామలములైన ఆప్రాంతభూములందు ఫలసమిత్కుశ కుసుమాది బహు పదార్థములను దేవతార్చనార్థము సంగ్రహించుకొని శిష్యులతో నింటికి వచ్చును. ఇట్టి నియమముల నవలంబించి తదాచరణమునఁ 'బ్రజ దన్ను మెచ్చిచూడ' ప్రవరుఁడు ఉదంచితసౌఖ్యమునఁ దేలియాడెను.

ప్రవరుని సంసారసుఖమునకు దోహద మొసఁగిన మఱియొక విషయము నిత్యకృత్య సత్కర్మ కలాప నిర్వర్తనమువలన నాతనికిఁ గలిగిన తృప్తి, లేఁబ్రాయముననే వివిధాధ్వరముల నిర్వహించిన తృప్తి, ప్రతిదినక్రమమున 'వేలిమి, సురార్చన, విప్ర సపర్య' మున్నగు వైదికకర్మల నిర్వర్తించుచున్న తనివి కర్మక్షితియైన ఆర్యావర్తదేశమునఁ బుట్టి వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షా పరతంత్రుఁడైన ప్రవరుని సంసారసుఖమును పోషించినవి. తన సంసార సుఖమునకుఁ బోషణ మిచ్చిన వైదికకర్మనిష్ఠలయందు ఆతఁడు పూర్తిగ నిమగ్నుఁడయ్యెను గావుననే ఆతనికి అరణులు, దర్భలు, అగ్నులు ప్రియములైనట్లు అన్యములు గాకపోయెను. ఆ నిత్యాగ్నిహోత్రికి—

ము...... కేపును మాపు హవ్యములచేతఁ దృప్తుఁడౌవహ్ని
సత్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము
అగ్గలమైయుండి ఆతని సంసారసుఖమును రెట్టించెను.

ఇట్లు వాసయోగ్యమైన గ్రామమున కాఁపురముగలిగి, పెక్కు చందాలం బండుమాన్యక్షేత్రములుకలిగి ఒకప్పుడునుతఱుఁగనిపాఁడి కలిగి, అతిథిజనుల రాకపోకలచే పావనమైనగృహము కలిగి, ఇలు దీర్చు తలిదండ్రులు కలిగి, సౌఖ్యావహమై భజియించుభార్య కలిగి, తోడునీడలైనశిష్యులను కలిగి, ప్రవరుఁడు నిరవధికమైన సంసార సౌఖ్యమునందు ఓలలాడెను. అట్టి ఆతని సుఖమునకు దివ్యత్వమిచ్చినది ఆ కుటుంబమునందలి వివిధ వ్యక్తులనడుమ నెలకొనిన పరస్పర ప్రేమ. ప్రవరుని నిలయము నిజముగా ప్రేమనిలయ మనవచ్చును. చూడుఁడు. ఆయింటియందు తల్లి ప్రాజ్ఞుఁడై యజ్ఞము నొనర్చి సోమయాజియైనతనకుమారుని పిట్టదోషము తగులుననియో మఱియేమో ఎపుడును సంధ్యలయందు నిలువెళ్లనీక రక్షించును; ఆయింటియందు తండ్రి తనయుని "నిముసంబు గానకయున్న నూరెల్ల నరయును" ఆ యింటియందు యజమానుఁడు తాను కార్యార్థియై యెక్కడకుఁ బోయినను కడువృద్ధులగుజననీ జనకులకు భోజనమువేళ యతిక్రమించి వారు ఆఁకలిచే సోలుచు, చింతతోఁ దన్నెదురుచూచుచు నుండకుండ వేళకే యింటికిఁ జేరుకొనుచుండును. ఆయింటియందు యజమానురాలు పతికి అనుకూలవతియై ఆతని మనసులో వర్తించును. ఆ యింటియందు శిష్యులు గురువర్యునకుఁ దోడునీడలై క్రీడింతురు. ఇట్లు ప్రేమసూత్రముచే నిబద్ధమైన వ్యక్తులు గల సంసారమునకు అధిపతియైనవాని సుఖము కొలందులు వెట్టఁదరము కానిది. వానికి భూతలమునందే సశరీర స్వర్గసుఖము సమకొనియె నన్నమాట.

ప్రవరుని అగ్గలమగు నిట్టిసంసారసుఖ మనుభవించువానిఁగాఁ జిత్రించుటవలనఁ గావ్యమున సిద్ధించిన పరమప్రయోజన మేమి?

---

# వైరాగ్యోదయము

వాడ్రేవు శ్రీరంగనాయకమ్మగారు, శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు జమీందారువారికుమార్తె.

క॥ ధారుణి వైరాగ్యోదయ
మేరీతిం గలుగునంచు నెంతయుఁ జింతం
గూరిన మది నూహింపఁగ
నారాయణ! యొక్కనాఁడు నాకుం దోఁచెన్.

గీ॥ ఎటులం టేని వినుమింక నే వచింతు
గట్టిగా నీదుదయఁజూపఁ గడఁగితేని
నీవ యొక కారణంబును నెమ్మిఁ గల్ప
నంబుఁ జేయుదు వీరీతి నంబుజాక్ష!

చ॥ సకల చరాచరంబులను జక్కఁ గనుంగొనఁజాలు నీకు నేఁ
బ్రకటన సేయ నెంచు టది పల్కులు విన్నను నవ్వరే యొరుల్
పకపకమంచు; నవ్వినను భావమునం దొకయించుకేనియున్
వికటముగాఁ దలంపకుము; వెంగలినాదును గాని యచ్యుతా!

గీ॥ తల్లిదండ్రులు ప్రేముడిఁ బిల్లలాడు
ముద్దువాక్యంబులకుఁ జెవిఁ గూర్చుచుంద్రు;
జగతి సర్వంబుఁ గలిగించుజనకుఁ డీవు
వికటవాక్యంబులకునైన వీ నొసఁగవె!

క॥ కించిన్మధురాల్ప నగు నే
నంచితగతి నీకుఁ దెల్ప నాలోచనలో
మించె న్నాయభిలషితం
బెంచి భవద్హృదయమందు నేర్పడ వినుమా!

క॥ ధారుణి నొకకడ వెలయుం
బేరున నుజ్జయిని యనఁగఁ బెంపగు పురియం
దేరీ వీరున కెన యనఁ
బౌరుషవంతుండు గలఁడు భర్తృహరి యనన్.

చ॥ ఇలఁగల సర్వభోగముల నెన్నఁడుఁదన్నెడఁబాయకున్కి ను
జ్జ్వలతరహించి యన్నిటను జాలఁ బ్రశస్తివహించి మించి య
క్కలిమిపడంతి చంచలతఁగానక యింట వసింపఁ బ్రీతి న
ప్పలుకువెలంది యాస్యమునఁ బల్కులు నృత్య మొనర్ప వేడుకన్.

ఉ॥ చారుపతివ్రతామణి సుచారమ భానుమతీ సమాత్యత
స్నేహములుపాటు కించుకయు నెన్నఁడుఁ జెందక భక్తి యుక్తితో
నేమముమీఱఁ గొల్వ నవనిం గన లో టొకయింత గానక
ద్దామభుజాబలంబునను దద్దయుఁ బేరును బెంపుఁగాంచుచున్.

గీ॥ ఒక్కనాఁడు విలాసార్థ ముత్సహించి
భానుమతి తన్నుఁ జేరి సుభాష లాడ
నిష్టగోష్ఠీవినోదాల నెసఁగుచుండ
మేడపై నాతఁ డెంతయు మెలఁగు చుండె.

ఉ॥ గొబ్బునఁ దూర్యనాదములు గూడి చెవింబడ వార లేమొయం
చుబ్బుచుఁ జూడ నేగ నట నోయి పరాత్పర ! వారు గాంచి ర
బ్బబ్బ ! యచేతనాంగమును నాప్తయుతంబుగ నేగుదాసి న
య్యబ్బుర మే మటంచును నిజాంగన తన్నటఁ బ్రశ్న సేయఁగన్.

క॥ మనమున నాశ్చర్యము గదుఁ
బెనఁగొన నది మాటుసేసి ప్రియుఁడను వనితా !
వినవే లోకాచారము
ననుసరణము సేయ నేగు నంగన యనుచున్.

క॥ వామాక్షి సహగమనమును
నేమంబునఁ జేయనేగు నెమ్మిం గంటే ?
కోమలినని విభుఁ డాడఁగఁ
నామహిళారత్న మిట్టు లంచు వచించెన్.

గీ॥ సహగమనమును జేయఁగాఁ జనవలయు నె ?
వనితయంచును బల్కిన వల్లభుండు
కలఁగిన మనంబుతోడఁ జూడ్కుల నిగిడ్చి
బెట్టుగా మది నూహించె నిట్టులనుచు.

ఉ॥ కాంత యెఱుంగదో యిటులు కారణ మేమి వచింపఁగా మదిన్
వంతజనించె ; సత్కులజ, వాసియు నన్నెయుఁ గల్గులేమ, నే
నెంతయు దీనిభావమున హీనమతిం గనుఁగొందునంచుఁ దాఁ
జింతనఁజేసి, నాఁడె తన చేడెను వీడి రయంబు మీఱఁగన్.

గీ॥ వేటయన్ బల్ నెపంబును వే ఘటించి
దుర్గమారణ్య పదములఁదోడనె చని
యాప్తుఁ డావాని నొక్కని నమరఁ బిలిచి
చెప్పఁ బంచెను దా మృతిఁ జెందినట్లు.

గీ॥ తల్లిరో ! నీదునాథుండు చెల్లెనమ్మ !
బెబ్బులికిఁ జిక్కి ; యని వాఁడు బిట్టు వగవ
వార్త చెవినూదెనో లేదొ ! వనిత నేలఁ
గూలి తనప్రాణములు వేగ గోలుపోయె.

గీ॥ తన సతీరత్న మిట్టులు చనిన తెఱఁగుఁ
దిరిగి వే వచ్చి వేగరి తెలుప విభుఁడు
బెదరు గుదిరిన మనమున వీడుఁ జేర
నూరివెలుపలఁ గనె శివ మూర ! యతఁడు.

గీ॥ కాంచి వే బెట్టుగా విలపించె నిట్లు
నిక్కమా నీదు మరణంబు నెలఁత ! నాదు
సత్యహీనంపు జావునఁ జచ్చితీవు
నిక్కముగ ; నేను జావంగనేర నైతి.

చ॥ పరమపతివ్రతామణిరో ! భావమునం దిటు లౌనటంచు నే
నెఱుఁగఁగనైతి ; నీమనము నేఁ దెలియంగలవాఁడఁ గాను; నీ
మరణముఁ గాంచి జీవముల మానిని ! పాయకయుంటి నేను రా
నరయఁగఁ నేక నీవు నరి యాఁగుము నీవెనువెంట వచ్చెదన్.

క॥ అని వగఁగూరిన మతిఁ జిం
తన సేయుచునుండ నండఁ దథ్యముగాఁగన్
మునివరుఁ డొక్కఁడు మృత్పా
త్రను బగుల నడంచి బిట్టు దా వలపోయన్.

గీ॥ ఏల యీలీల జాలిని గూలి తనుచుఁ
బృచ్ఛ సేయంగ మౌనియు నిట్లు వల్కు
నయ్యయో ! యీ ఘటంబున కరయ నీదు
పత్నిఘటమునకును భేదభావ మేమి ?

గీ॥ దేహము, ఘటంబుఁ బాంచభౌతికము, పోవు
నెప్పటికినైనఁ దమ తమ యిక్కలఁ గన ;
నేల చింతిల్లి ? నీవును నేనుగూడ
నట్టివారమె కా, మది నరయు మనిన.

క॥ వైరాగ్యోదయ మగుడున్
వారని భక్తిని మునీంద్రు వరపాదంబుల్
చేరఁగ శిరమున ; నాతఁడు
ధారుణి సాష్టాంగముగను దగఁ బడ మునియున్.

గీ॥ వానిమనమున భక్తిని నఱల నాటి
తన తెఱంగున వేవేగ దాఁ జనుటయు
భర్తృహరి యంత దుఃఖభావంబు వీడి
భవహరంబైన వైరాగ్యపదవిఁ గాంచె.

క॥ నీవే మౌనీంద్రుఁడ వై
యీవిధమునఁ బోధఁ జేసి యీతనికి దయన్
వే వైరాగ్య మొసంగితి ;
దేవా ! నావిషయమందు దిక్కగు మల్లే.

క॥ కావున నళినదళాక్షా !
యేవెరవునఁ జింతసేయ నేలా నాకున్
వేవే సమయము చనుదే
నీవే వైరాగ్యవృత్తి నెగడింతు మదిన్:

పంచ॥ మౌనివంద్య ! భక్తలోక మానసాబ్జ బంభరా !
దీనజన కృపావనా ! తదేకనిష్ఠ మీఱ నో
శ్రీనివాస ! నీపదాబ్జ సేవఁ జేతు నెప్పుడున్
మానసమున నిట్టులంచు మౌనఁబోక భక్తితోన్.

సీ॥ శ్రీకాంత నురమునఁ జెన్నుమీఱ వహించి
కౌస్తుభమణిః దాల్చి కంఠసీమ
శంఖచక్రముల హస్తద్వయి ధరియించి
గదయు శార్ఙ్గము రెండుకరముల నిడి
మణిమేఖలను నడుమున నంటఁ గీలించి
భర్మచేలము మేనఁ బాదుకొలిపి
కస్మకస్తురితిలకమును నుదుట దిద్ది
యాదల మకుటంబు నలవరించి

గీ॥ వెలయు నీ సర్వమంగళవిగ్రహమును
నామనఃపద్మపీఠమునను సభక్తి
కంబుగాఁ గీలుకొలిపి నిక్కంబుఁ బూజ
సేయుదుంబూన్కిమైఁ ; గృపసేయుమయ్య !

---



# విరాటపర్వము—తిక్కన స్వతంత్రరచనము.

నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు, బి. ఏ., సారస్వతసమాజము.

తిక్కనసోమయాజి తెలుగు వాఙ్మయమున నగ్రస్థానము వహించి అయిదారు శతాబ్దములనుండి తెలుగు వాఙ్మయ ప్రపంచమునే కాక తెలుగువారినెల్లరను నిరంకుశముగ శాసించుచున్న ప్రతిభాశాలి. చదువు నేర్చినవారును నేరనివారును గూడ నితని భారతమును విని సమానముగ నానందించుచున్నారు. తెలుఁగువారిజాతీయజీవనమునకుఁ జవి నిచ్చి చేవ గలిగించినవి, రెండు మూఁడు గ్రంథములకన్న నెక్కువయుండవు. అవి భారత భాగవత రామాయణములు. వీనియందలి కథలు తెలుఁగు కవులచేఁ సృష్టింపఁబడలేదు. ఇతివృత్తములను సంస్కృతమునందుండి గైకొని మాతృకలను చాలవఱకు అనుసరించుచు, తమ స్వతంత్రభావనకు తగిన యవకాశ మిచ్చుచు, తమ కవితాప్రతిభను జాటుచు వచ్చిరి. వీరియందెల్ల తిక్కన తన యద్భుతసామర్థ్యములవలన మిన్నయై పాఠకలోకము నలరించుచు వారికి ఆశ్చర్యసంభ్రమంబులను గూర్చుచున్నాఁడు. ఇంతటి యుత్కృష్ట కవిత్వరచనా విశారదుఁడయ్యును ఇతడు 'కవిగాని, పండితుఁడుగాని, రాజకీయవేత్తగాని కాఁ' డని కొందఱు వాదించుచున్నా, రనినచో మన కాశ్చర్యము గలుగక మానదు.

వ్యాసభగవానుని సంస్కృతభారతమునకు భాషాంతరీకరణ మగుటచే ఆంధ్రమహాభారతమునందలి గుణములెల్లను వ్యాసుని వనియు, దోషము లెల్లను అసమర్థుఁడగు తెలుఁగురచయిత వనియు కొందఱివాదన. ఇతివృత్తమును సృష్టించి కల్పనా కౌశలమును (Creative genius) రచనాకౌశలముతో మేళగించినఁగాని మహాకవిలక్షణములు గలుగఁజాలవని మఱికొందఱి వాదన. ఏది యెట్లున్నను పై యిరువురును గూడ తిక్కనవంటివారికి మహాకవులవరుసలో స్థానమును నిరాకరించుచున్నారు. ఇదెంతవఱకు న్యాయమో యాలోచింపవలసియున్నది.

మొదటిది సృష్టికౌశలము. ఇది మహాకవికి ముఖ్యావసరము. దీనికి నిదర్శనముగ ప్రపంచ సారస్వతమున స్థానము గైకొనిన హోమరు, మిల్టను, షేక్స్పియరు, వాల్మీకి వ్యాస కాళిదాసాదులను జూతము. హోమరు ఖ్యాతిగాంచిన గ్రీసు కవిపుంగవుఁడు. అంధుఁడయ్యును దన 'ఇలియడు' కావ్యమును జితారుగైకొనిపాడుచు జగత్తును మోహింపఁజేసిన ప్రతిభాశాలి. ఈతని వీరరచనల చవిచూచి గ్రీసులు తమ సామ్రాజ్యపక్షములను ప్రాచ్యప్రతీచీఖండములయంతర్భాగములకుఁగూడ వ్యాపింపఁజేసిరి. ఇట్టికవి తన కథావృత్తములను తనకు పూర్వులు రచించిన రండానపదములనుండి గైకొని వానికి నాకారము నిచ్చి రసపోషణమును మాత్రము చేసెను. ఇట్లే షేక్స్పియరు. అతని నాటకములం దొక్కదాని యితివృత్తమునుగూడ నాతఁడు సృష్టించలేదు. వానిని పూర్వులు వ్రాసిన కథలనుండియును నాటకములనుండియును గ్రహించి వలయుమార్పులను జేసి రసరూపముల నిచ్చి యమృతములనుగాఁ జేసి దిగంతవిశ్రాంతకీర్తుఁడై ఆంగ్లేయులనేగాక ఇంగ్లీషునేర్చిన సమస్తమానవకోటిభావప్రపంచమునను రాజ్యముచేయుచున్నాఁడు.

మిల్టనుగూడ నిట్టివాఁడె. సుప్రసిద్ధమగు నతని Paradise Lost నందలి యితివృత్తము బైబిలులోనిది. కాని ఆకథకు చలనము, వేగము, ప్రాణము నిచ్చి మిల్టను సైతానువంటి యద్భుతపాత్రమును పోషించి తనకావ్యమునకును, రచనకును అమృతత్వమును సంపాదించెను. ఇట్టిదే వాల్మీకిరామాయణము. రాముని జీవితమును గావ్యముగా వ్రాసి పాడెను. ఇందలి వస్తువునం దేమాత్రము నాతఁడు స్వతంత్రముగ సృష్టించి యుండలేదని ప్రతీతి. వ్యాసుని భారతముగూడ నిట్టిదే. అదియంతయును జరిగిన సంగతి, దీనియందు సృష్టి లేదు. కాళిదాసుని శకుంతలకథగూడ భారతమునుండి సంగ్రహింపఁబడినది. కాని సంగ్రహించిన వస్తువును తమ భావనాగ్నియందు గరఁగించి వలసినరూపగుణములను జేకూర్చుటలో వీరిశక్తి యద్భుతము. వీరి నీవిషయమున స్వర్ణకారునితోఁ బోల్పవచ్చును. అతఁడు ప్రాఁతవడినబంగారమును గైకొని కరఁగించి తనహస్తకౌశలముచే రమ్యమగువస్తువునుదయారుచేయుచున్నాఁడు. అటులే యీమహాకవులును పూర్వకవిగ్రంథగ్రథిత మగువస్తువును గ్రహించి తమ యూహ యనెడిమండిగయందుఁ గరఁగించి చదువరులను రంజింపఁజేయఁగలకావ్యమును దయారుచేయుచున్నారు. ఇట్లు చేసినమీఁదట చదువరులు వీరికి చౌర్యముగాని, అసమర్థతగాని యారోపించుటకు అవకాశము లేదు. ఈవిధముగ జేయుటలో వీ రనేకచమత్కారములను జూపుదురు. ఒక్కొకచోటకథ పెంచెదరు ఒక్కొకచోట తగ్గించెదరు. కథాక్రమమును దాఱుమాఱు చేయుదురు. మూలమునందున్నదానిని తీసివైచి క్రొత్త సంగతులను జొప్పుదురు. వీని నెల్లను గూడ సోమయాజి తన గ్రంథరచనమున నుపయోగించి దానికి వన్నె దెచ్చెను. అందుచే వీరందఱును దమ యితివృత్తములను వేఱొండు స్థలమునుండి గైకొనినను వీరి రచనలుమాత్రము స్వతంత్రము లని పండితపామరు లెల్లరు నొప్పుకొని యున్నారు.

మూలమునం దున్నవిషయమును స్వల్పముగ మార్చి దానికి ఎక్కువ యందమును గూర్చుటలో సోమయాజినేర్పు చూడఁదగినది. భీమునితో ద్రౌపది తాను ఊడిగముచేయుచు, పడుచున్న కష్టమును జెప్పుకొనుచు

పశ్య కౌంతేయ పాణీ మే నైవా౽ భూతాంహి యౌపురా
ఇత్యస్య దర్శయామాస కిణవంతౌ కరావుభౌ॥

20 అధ్యా 25 శ్లో.

(భీముఁడా! పూర్వ మట్లున్న నాచేతు లిపుడెట్లున్నవో చూడుమని కాయలు గాచిన తన రెండుచేతులను జూపెను).

ఆంధ్ర మహాభారతమున ద్రౌపది.

నున్నఁదనంబుగా నలుఁగు నూఱియు జందన మట్లు రాచియుం
బన్నుగ గ్రొత్తవైన కలపంబులఁ గూర్చియు నాసుదేష్ణకుం
గన్నుల సన్నలం బనులు గైకొని వారక చేయుచుండుటం
మున్నటు లున్న పాణితలముల్ బలుగాయలు గాచె చూచితే?

అనెను. అమెనోటివెంట గాయలుగాచె చూచితే యనినపుడు కల్గు కరుణము కాయలుగాచిన చేతు లామె చూపెనని కవి చెప్పినప్పు డుండదు. 'పలుగాయలు గాచె చూచితే' యని యామె సంబోధింపఁగనె వృకోదరునిగుండెలు వెన్నవలె కరఁగిపోయినది. ఇట్లే

ఒల్లరు రాజుదేవులును నొడ్డులు రాచిన చందనంబు మే
నెల్ల చెమర్పఁగా నలయ కేను శ్రమంపడి నిల్చి నిల్చి య
ల్లల్లన మార్దవం బొనరునట్లుగ నెట్టకునేని రాచి మీ
తల్లికి భక్తి పెట్టెడువిధంబునఁ బెట్టుదు బ్రహ్మఁదిట్టుదున్.

అనుపద్యమును మూలమునందున్న ధ్వనికంటె నెక్కుడు రసవంతముగ నున్నది. 'బ్రహ్మఁదిట్టుదున్' అను పలుకులందు ద్యోతకమగు దుఃఖము వేఱుపలుకుల కందనిది. ఇట్టి చిన్నవాక్యములమూలమున గొప్పభావములను స్ఫురింపజేయుట మహాకవిలక్షణము.

తంచే జ్జీవంత మాదిత్యః ప్రాత రభ్యుదయిష్యతి
విష మాలోడ్య పాస్యామి మా. కీచక వశంగమమ్
శ్రేయోహి మరణం మహ్యం భీమసేన తవా౽గ్రతః

—(21 అధ్యాయము. 48, 49 శ్లో.)

[వాఁడు, (కీచకుఁడు) బ్రతికియుండఁగా రేపు సూర్యోదయం బయిన నీయెదుట విషముద్రాగి ప్రాణంబుల విడిచెద. భీమసేనా! యిట్లు దురాత్ముఁడగు కీచకునికిలోఁబడుటకంటె నీముందట చచ్చుటయే మేలుకదా?]

అని మూలమునందు ద్రౌపది యనుచుండ, తిక్కనపోషితయగు ద్రౌపది

వాని దెగఁజూడవైతేని వాయుపుత్ర
నీవు గనుఁగొన నురినైన నీరనైన
నగ్నినైన విషంబుననైన నేను
మేను దొఱఁగుదు నెట్టు నీయాన సుమ్ము.

యనిన మాటలుగూడ ఎక్కుడు రసవంతములుగా నున్నవి. కీచకుని జంపి భీముఁడు ముద్దగా నయియున్న యాతనిని ద్రౌపదికిఁ జూప నామె

కీచకం ఘాత యిత్వాతు ద్రౌపదీ యో పితాంవరా
ప్రహృష్టా గత సంతాపా సభాపాలానువాచహ

—22 అధ్యా. 91 శ్లో.

(ద్రౌపదియు మన కవమానము దెచ్చిన కీచకుండు సచ్చెను. ఇక భయంబు లేదని కలఁకఁదేరి యుల్లసిల్లుచు నర్తనశాలా రక్షకులం బిలిచి చెప్పెను.) అని యుండఁగా తెలుఁగున

చూచుచుఁ జేరి ప్రేల్మిడుచుచుం దలయూఁచి విలక్షచిత్తయై
యా చపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీనికై
కీచక యింత చేసితి సుఖిత్వముఁ బొందుదుగాక యింక న
ట్లేచిన నిట్లు గా కుడుగునే యనుచున్ వెఱఁగందుచుండఁగన్

సింహబల భీముల పోరాటముయొక్క వర్ణనముకూడ నిట్టులే యున్నది.

తయో ర్హ్యాసీత్సు తుముల స్సంప్రహార స్సుదారుణః
నఖదంతాయుధవతో ర్వ్యాఘ్రయోః రివ దృప్తయోః.

(వారిరువురకును నఖదంష్ట్రాయుధంబులయిన మత్తశార్దూలంబులకుంబోలె దారుణంబయి ఘోరధ్వానంబుగల యుద్ధంబు జరిగెను.)

తయో ర్భుజ నిష్పేషా దుభయోర్బలినో స్తదా
శబ్దస్స్య మభవ ద్ఘోరో వేణుస్ఫోట సమో యుధి.

—64

(బలవంతు లయినవా రిరువురును బరస్పరము బాహువుల నొఱచుకొనుట వలన వెదుళ్లు పగిలినప్పుడు గల్గు చప్పుడువంటి గొప్పచప్పు డొకటి గలిగెను).

తత స్తద్భవన శ్రేష్ఠం ప్రాకంపత ముహుర్ముహుః
బలవచ్చాపి సంక్రుద్ధా వన్యోన్యం ప్రతిగర్జతామ్.

—70

(ఒక్కొక్క సమయంబున నీ యిరువురు సంక్రుద్ధులై గర్జనలు సేయఁగా నా నర్తనశాల మాటిమాటికి నదరు చుండెను.)

గృహీత్వా కీచకం భీమో విరురావ మహాబలః
శార్దూలః పిశితా కాంక్షీ గృహీత్వేవ మహామృగమ్.

—75

(మాంసార్థియైన వ్యాఘ్రంబు జింకనుంబోలె భీముఁడు కీచకుని బట్టుకొని సింహనాదంబు చేసెను.

అని సంస్కృతమున నున్నది. రహస్యభంగము గాకుండ యుద్ధము చేయవలసిన భీముఁడును, తన యునికిపాటు ఒరు లెఱుఁగకుండ నుండవలసిన కీచకుఁడును ఇట్లు ఆర్భాటములోను అట్టహాసంబులలోను యుద్ధముచేయుట సరిగాలేదు. అందుచే తిక్కన

క॥ తన యునికి పాటూరు లెఱుఁగుదు
రని సూతుఁడు సమయభంగ మగుటకు భీముఁ
డును గొంకుచు నప్పుడు సే
య నిగూఢవిమర్దనప్రహారములఁ దగన్.

వ॥ మల్లయుద్ధనైపుణ్యమున్ మెఱయం గడంగిరి.

అని వ్రాసెను.

రెండవ విషయము : తత్తత్సమయోచితముగ మూలమునందు లేని వర్ణనము అను దెచ్చిపెట్టి తన కావ్యమును తిక్కన యెక్కుడు రసవంతముగ నొనర్చెను.

కీచకునిఁ జంపిన భీముని ద్రౌపది మెచ్చుకొనుట సమంజసము. కాని సంస్కృతమునం దట్టిది తత్క్షణమే జరుగలేదు. కొంతకాలము జరిగినతరువాత స్నానమాచరించి యతని నవలోకించి

గాత్రాణి వాససీ చైవ ప్రక్షాళ్య సలిలేన సా

— 24 అధ్యా 12శ్లో,

తతో మహా ననద్వారీ భీమసేన మవస్థితమ్
దదర్శ రాజన్ పాంచాలీ యథా మత్తం మహాద్విపమ్

తం విస్మయంతీ శనకైః స్సంజ్ఞాభి రిద మబ్రవీత్
గంధర్వరాజాయ నమో యేనాఽస్మి పరిమోక్షితా

— 24 అధ్యా. 14, 15శ్లో.

(అంత ద్రౌపది రాజనగరంబు సొచ్చి వంటశాలలో మత్తగజేంద్రుఁడువలె నున్న భీమునిఁజూచి యబ్బురపడుచుఁ గీచకునివలన విడిపించిన గంధర్వరాజునకు జోహారులని సంకేతముఁ జెప్పెను). అని యున్నది. తెలుఁగులో నట్లు గాక కీచకునిఁ జూపి నీవు సంతోషించితే యనియాతఁడామె నడుగఁగ నామె యిట్లనెను.

కొలువులోపల నిన్న కోప మగ్గలిత్తిన
దలఁకక నిలిచిన ధైర్యమహిమ
నేఁ డిందు ననుదెంచి నిర్వికారతఁ బ్రజ
కన్నులుఁ గప్పిన గౌరవంబు
మనవారిలోన నొక్కనినైన బిల్వ కు
త్సాహంబునేసిన సాహసంబు

—22 అధ్యా. 61 శ్లో.

లోకదుర్జయుఁ డగు నీ కీచకునిని ప్రే
ల్మిడి రూపుమాపిన కడిమిసొంపు
సూడఁ దలపోయ మెచ్చ సంస్తుతి యొనర్ప
నా దలంచె నీ యుత్తమ నాయకత్వ
మెఱిఁగి నినుఁ గొనియాడ నే నెంతదాన
మహిత విస్మయానంద నిర్మగ్న నైతి.

ఉబ్బులలిఁగఁడగు భీముఁ డామాటలకు మిన్నందెను.

ఉత్తరుని సారథిగాఁగొని తమపైకి వచ్చునర్జునునిఁ గాంచి ద్రోణుఁడు

స ఏష పార్థో విక్రాంతః సవ్యసాచీ పరంతపః
నాయుద్ధే ననివర్తేత సర్వైరపి సురాసురైః
క్లేశితశ్చ వనే శూరో వాసవే నాపి శిక్షితః
అవర్ష వశ మాపన్నో వాసవప్రతిమో యుధి
నేహాస్య ప్రతిమోద్ధార మహం పశ్యామి కౌరవాః.

—39 అధ్యా. 11,12,13.శ్లో.

(ఇదిగో విక్రమంబు మీఱి వచ్చువాఁడు పరంతపుఁ డయినకుంతీతనయుఁ డగుసవ్యసాచి. ఇతం డనికివచ్చెనేని దేవాసురులతోనైనను బోరాడక మరలఁడు. అర్జునుఁడు వనవాసంబు చేయునపుడు మనవలన నెన్నియేని యిడుమలం బెట్టఁబడినవాఁడు. అతఁడు గినిసి యింద్రునిమాడ్కి యుద్ధమున వచ్చి నిలిచెనేని కౌరవులారా! మనలో నతనితో నీడుగ ముందునిలిచి యుద్ధముచేయగలవాఁ డొక్కఁడు గలఁడె!) అనెను. తెలుఁగున

సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమైనుండి మా
తంగ స్ఫూర్జితయూథ దర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతార నివాస ఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.
ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగువార లస్మదీ
యా తతసేనలోఁ గలుగు టారయ సంశయ మెల్లభంగి గో
త్రాతనివర్తనంబు సుకరంబ కిరీటి కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసె నా వినమె పెం పెసలారెడు బాహుసంపదన్.

అను పద్యములం దున్నయావేశమును దదుచితమగు వేగమును సంస్కృతమున గోచరించుటలేదు.

భీముఁ డర్జును నజ్ఞాతవాస వత్సరవ్యాప్తి నిష్కర్షించి చెప్పుచు

ప్రతి యుధ్యేమ సమరే సర్వశస్త్ర భృతాం వరమ్
తస్మాద్యత్తత్ర కల్యాణం లోకే సద్భి రనుష్ఠితమ్
తత్సం విధీయతాం శీఘ్రం మనోహ్యర్థో ఽ భ్యగాత్పరమ్

—52 అధ్యా. 13. శ్లో.

(కావున మనమందఱమును గలిసి విలుకాండ్రమేటి యైన యర్జును నెదిరింతము. లేదా మనసొమ్ము పాండవులకుఁ జెందకుండునట్లు లోకులందఱచే మంచిదని కొనియాడఁబడు సంధియైనను జేయుదము) అనుటకును ఆంధ్రమున

వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగరాదు రా
లచ్చికినై పెనంగినబలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుంద గుం దొడరు టెల్లవిధంబుల కోర్చుటట్లుగా
కిచ్చఁదలంచి యొక్కమెయి నిత్తతి బొందగుచేతయుం దగున్.

అనుదానికిని ఉద్రేకమునం దున్నభేదము చదువరుల కెఱుకయే. ఇటులే చాలచోట్ల తిక్కనసోమయాజి మాతృక ననుసరించుచు దానియం దున్నధ్వని ననుసరించి విపులముగ రచించి కథకును సంభాషణములకు క్రొత్తపోకడలను గూర్చి ప్రాణము పో సజీవముగఁ జేసెను.

అర్జునుఁ డుత్తరునకు కురువీరులను వేర్వేఱ నిరూపించి చెప్పిన స్థలమున మూలమునం దిట్లున్నది.

లోహితాశ్వ మరిష్టం యం వై యాఖ్యు మనుపశ్యసి
నీలాం పతాకా మాశ్రిత్య రథే తిష్ఠంత ముత్తర
కృపస్యై త దనీకాగ్రం ప్రాపయ స్వైత దేవ మామ్
ఏతస్య దర్శయిష్యామి శీఘ్రాస్త్రం దృఢ ధన్వినః

—55 అధ్యా. 43,44శ్లో.

(రక్తాశ్వంబులుఁ గట్టినదియు పులితోలుఁ గప్పినదియు నగురథంబున నల్లని టెక్కెముఁగొని యుత్తరదిశనున్నవాఁడు కృపాచార్యుఁడు. అతని సేనలకుముందుగఁ బోవునట్లు నారథంబు నడుపుము. అమ్మేటివిలుకానికి నా శీఘ్రాస్త్రచాతుర్యంబు జూపెద.)

కమండలుధ్వజే యస్య శాతకుంభమయ శుభః
ఆచార్య ఏష హి ద్రోణః సర్వశస్త్రభృతాం వరః
సదా మమైష మాన్యస్తు సర్వశస్త్రభృతామపి
సుప్రసన్నం మహావీరం కురు ష్వైనం ప్రదక్షిణమ్
అత్రైవ చావరో హైన మేష ధర్మ స్సనాతనః
యది మే ప్రథమం ద్రోణః శరీరే ప్రహరిష్యతి
తతోఽస్య ప్రహరిష్యామి నాస్య కోపో భవే దితి.

—55 అధ్యా. 45,46,47శ్లో.

(పసిండికమండలువును ధ్వజమును గలయాతఁడు విలుకాండ్రమేటి యైన ద్రోణాచార్యుఁడు. ఇతఁడు నాకును ధనుర్ధరుల కందఱకును బూజ్యుండు. మన రథం బితనికిఁ బ్రదక్షిణముగాఁ దోలుము. అచట నితనిఁజూచినపుడు రథం బితనికి ప్రదక్షిణముగాఁ దోలుము. అచట నితనిం జూచినపుడు రథంబు దిగి తోలుము. ఇది పెద్దల నడవడి. ఇతఁడు మొదట శరంబుల నేసినతరువాత నే నేను వానిశరంబులేయుదు. అందుచే నాతనికి కోపము రాదు.)

అస్యా విదూరేచ ధను ర్ధ్వజాగ్రే యస్య దృశ్యతే
ఆచార్య స్యైష పుత్రో వై అశ్వత్థామా మహారథః
సదా మమైష మాన్యశ్చ సర్వశస్త్రభృతా మపి
ఏతస్య త్వం రథం ప్రాప్య నివర్తేథాః పునః పునః.

—55 అధ్యా. 48,49శ్లో.

(ఇతని రథంబుచేరువఁ గాన్పించు ధనురంకితధ్వజుండు మహారథుం డగునశ్వత్థామయుఁ దండ్రివలె నాకును, సకలధానుష్కులకును బూజనీయుఁడు, అతని రథంబునకు మనరథం బెదురుగాకుండఁ బఱుపుము.)

య ఏషతు రథానీకే సువర్ణకవచావృతః
సే నాగ్ర్యేణ తృతీయేన వ్యాపహార్యేణ తిష్ఠతి
యస్య నాగో ధ్వజాగ్రే వై హేమకేతనసంవృతః
ధృతరాష్ట్ర సుత శ్శ్రీమా నేష రాజా సుయోధనః
ఏతస్యాభిముఖం వీర రథం పరరథారుజమ్
ప్రాపయ స్యైష రాజాహి ప్రమాథీ యుద్ధ దుర్మదః
ఏష ద్రోణస్య శిష్యాణాం శీఘ్రాస్త్రే ప్రథమోమతః
ఏతస్య దర్శయిష్యామి శీఘ్రాస్త్రం విపులం రణే.

—55 అధ్యా. 50,51,52,53శ్లో.

(రథికులలో బంగరు మైమఱువు దొడిగి మూఁడవ వ్యూహంబున నాగచిహ్నితధ్వజుండై యున్నవాఁడే ధృతరాష్ట్రునిపుత్రుఁ డయినసుయోధనమహారాజు. అతఁడు క్రూరుఁడును గర్వియు నైయున్నాఁడు. అతఁడు బాణశీఘ్రప్రయోగంబున ద్రోణాచార్యులశిష్యులలో మొదటివాఁడుగ నెన్నఁబడువాఁడు. అతని కీయుద్ధరంగంబున నా యస్త్రప్రయోగకౌశలంబుఁ జూపెద. వానికి నూటిగా నారథంబుఁ దోలెద.)

నాగకక్ష్యాతు రుచిరా ధ్వజాగ్రే యస్య తిష్ఠతి
ఏష వైకర్తనః కర్ణో విదితః పూర్వ మేవ తే.
ఏతస్య రథ మాసాద్య రాధేయస్య దురాత్మనః
యత్తో భవేదాః సంగ్రామే స్పర్ధతేహి సదామయా.

—55 అధ్యా. 54,55

(శంఖధ్వజుండైన యల్లతండె కర్ణుండు. అతనిని నీ వింతకుమున్న యెఱుంగుదువు గదా ? అతఁడు నాతోడ నెల్లప్పుడును బనిపట్టి యుండును గాన అద్దురాత్మునిరథంబునకడకుఁ బోయినప్పుడు యుద్ధంబున నేమఱుపాటులేక నీ వుండవలయును.)

భీష్మునివర్ణన యింటియందును దాదాపు సమముగా నుంటచే నిట దానిని వదలుచున్నాను.

ఇక తిక్కన భారతమునందలి కురువీరులవర్ణనఁ జూతము. కురుసైన్యంబునకు మధ్య ద్రోణుఁడును, కుడి యెడమల అశ్వత్థామ కృపాచార్యులును, ముందు కర్ణుఁడును, వెనుక భీష్ముఁడునుండిరి. దుర్యోధనుఁడు సగపాటిసైన్యంబుతో పసుల దోలుకొని పోవుచుండ నితఁడు దుర్యోధనునకును దక్కినవీరులకును మధ్య జొచ్చి పోవుచుండ దూరమునకు వారి జెండాలు కన్పించుటచే ముందుగ వానిని నిరూపించి చెప్పెను.

కాంచన మయ వేదికా కనత్కేతనో
జ్జ్వల విభ్రమమువాఁడు కలశజుండు
సింహలాంగూల భూషిత నభోభాగ కే
తు ప్రేంఖణమువాఁడు ద్రోణసుతుఁడు
గనక గోవృష సాంద్ర కాంతి పరిస్ఫుట
ధ్వజ సముల్లాసంబువాఁడు కృపుఁడు
లలిత కంబు ప్రభా కలిత పతాకా వి
హారంబువాఁడు రాధాత్మజుండు
మణిమయోరగ రుచిజాల మహిత మైన
పడగవాఁడు కురుక్షితిపతి......

ఇట్లతఁడు తన రథము కొంతముందున కరుగఁగ రథస్థులగు వీరులు కనఁబడుటచే వాని వేర్వేఱ ఇట్లు వర్ణించెను. ద్రోణుని జూచి.

గురునకుఁ బ్రదక్షిణంబుగ
నరదముఁ బోనిత్తు మిమ్మహాపురుషు నెడం
భరిభవము వలవ దీతఁడు
కురుకులనృపతనయశిక్షకుఁడు సు మ్మనఘా.
శస్త్రప్రకారనిపుణుం
డస్త్రవిమోక్ష దూరపాతనాభీలుఁడు వ
ర్చస్త్రాసితరిపుఁడు ధను
శ్శాస్త్రపరిజ్ఞాన ఘనుఁ డసదృశుఁడు శక్తిన్.
ఈతనితోడికయ్యమున కియ్యకొనన్ దగ దేను దుష్ప్రథ
ద్యూతజయోద్ధతుం డగుసుయోధనునిం బరిమార్పఁ బోవుచో
శాతశరోత్కరం బితఁడు చక్కఁగ నేయునొ నన్ను నేయఁడో

చూతము తాన మున్ననికిఁ జొచ్చినఁ జొత్తముగాక పిమ్మటన్.

అనుచుఁ జెప్పి అశ్వత్థామను జూపి

గురుపుత్త్రుఁడు తేజోనిధి
సురాసురులకైన దేఱిచూడ నరిది సం
గరమున నీతని నీశ్వర
వరజనితుఁడు మేటి కౌరవవ్యూహమునన్.

తదనంతరము కృపునిఁ జూపి.

ధైర్యధనుఁ డీతఁడు ద్రోణా
చార్యుల కెన వచ్చు దివ్యశరవిదుఁడు కృపా
చార్యుఁడు మత్పితృసఖుఁ డా
చార్యక మొనరించె మాకు శైశవమునఁ జేసి.
వీర లిరువురు మాన్యులు వీరితోడి
కయ్యమున కిప్డు మన మంత గాలు ద్రవ్వ
వలవ దెచ్చోట నెదురుగా మెలఁగి రచట
మన రథం బల్లనల్లన చనఁగనిమ్ము.

అనెను. ఈ మాటలయందు పితృసఖుఁడును, ఆచార్యుఁడు ననుకృపుని యెడను, గురు కుమారుఁ డగు అశ్వత్థామయెడను, అర్జునునకు గౌరవము మెండని తెల్ల మగును. అందుచే వారితో కయ్యమునకుఁ గాలుద్రవ్వక రథమును వారికి దూరమార్గముగా నడిపించు చుండెను. కాని సంస్కృతమున "అశ్వత్థామ తంద్రివతె నాయుఁ బూజనీయుఁడు. అందుచే మనరథం బతనిరథంబున కెదురు గా నీకుము" అనుచు కృపునిఁ జూచి అతనిసేనలకు ముందుగఁ బోవునట్లు, నారథంబు నడుపుము. అనుటచే అర్జునునకుఁ గృపునియందుఁ గల గౌరవభావమునకు న్యూనత వాటిల్లుచున్నది.

అనంతరము కర్ణునిఁ జూచి.

యోధాగ్రేసరుఁ డిద్ధ తేజుఁడు రణోద్యోగానురక్తుం డు
స్సాహప్రక్రమబాహువీర్యుఁడు గురుక్ష్మాపాలవాల్లభ్యల
క్ష్మీమధామాత్ముఁడు జామదగ్న్యకలితశ్రేష్ఠాస్త్రవిద్యాఢ్యుఁ డీ
రాధేయుం డొకచిరికిం గొనఁడు వీరవ్రాతముం బోరులన్.
శౌర్యాటోపంబున దో
ర్వీర్యంబున నస్త్రశస్త్రవిత్త్వమునను మా
త్సర్యంబు సేయునాకును
దుర్యోధనుఁ డెపుడు దన్నెదురు సేయంగన్.
అతిదృఢవేది పేరు గలయట్టిమగండు రణంబుగల్గె నేఁ
డితనికి నాకుఁ దెల్లముగ నిట్టియెడం బరికించి చూడుమీ
మతి గలఁగంగనీక యనుమానము వాయఁగ నీవు నాయకో
ద్గతి ప్రకటించుచో బహువిధంబుల నిద్దఱ తారతమ్యముల్.
ఈయెడ ననుఁగని వారణ
సేయుఁడు నితఁ డగ్గమైన చిచ్చుఱపిడుగై
పోయి పయిఁ బడుదు నీవర
వాయించుక లేక పఱపవలయు రథంబున్.

అని యనుటలో కర్ణుని మహనీయాస్త్రవిశేషంబును, శౌర్యాతిశయమును, వీరాలిమును చిరికైనఁ గొనని మగఁటిమియు గోచరించుచున్నవి. అదియునుగాక కర్ణార్జునులకుఁ గలపోటీయును, అర్జునుఁ డతనిపైఁ గలనిర్లక్ష్యమును తెలియుచున్నవి. ఆబాల్యసంవర్ధితమై, దురాచరణప్రేరితమైన కర్ణార్జునుల పరస్పరద్వేషము నెటింగినవారు, కష్టపరంపరల కోర్చి అజ్ఞాతవాసానంతరము కర్ణుని తలపడిన యర్జునుఁడు 'అతఁడు నాలో నెట్లుపోట్లాడును బనిపట్టి యుండును గాన అర్ధరాత్రునిరథంబు నందుఁ బోయినప్పుడు యుద్ధంబు నేమఱియుండు, మని చవిగానిమాటలలో నూరకుండు నను కొనఁగలరా? శౌర్యనిధి యగునర్జును డాతనిఁ జూచినంతనే చిచ్చుఱపిడుగై పోయి యాతనిపయిం బడుట నిజము. అప్రయత్నముగ నామాట లాతనినో వెంట రావలసినదే. అపుడే అర్జునునియొక్క యుడుకు మనసు తెలియును.

ఇట్లే సుయోధనునిఁ జూచి

ఉగ్రుఁ డనూనమానమహిమోన్నతచిత్తుఁ డజయ్యవిక్రమో
దగ్రుఁడు హస్తలాఘవసమన్వితుఁ డేయు నెడఁ సమగ్రకో
పాగ్రహబుద్ధి మాడెస ననార్యుఁడు కార్యమునందు ధార్తరా
ష్ట్రాగ్రజుఁ డీతనిం గదిసినప్పుడు పండువు నాకు నుత్తరా.
అరసికొని యెన్నిభంగుల నైన నితని
తేగు మనబారి కగపడు తెఱఁగు గాంచి
యడరి బాసటయై యెవ్వ రడ్డపడిన
మెఱపు మెఱసిన చాడ్పున దఱియఁ జనుము.

అనును. తమ్ము ననేక కష్టములపాలు చేసినదుర్యోధనునిఁ జూచినట్లు వీరహృదయుఁ డగునర్జునునకు కన్నులపండువగాక మఱేమి కాఁగలదు? వీరిని చూచునపుడు తనకొవరపై అక్కసిగలదో ఎవనెవనియెడ మర్యాద పాటింపదలంచెనో తెలియఁజేయుట సమంజసము. తిక్కన నాటకరంగమునందలి పాత్రములవలె మాటలాడినట్లుగా సంభాషణమును కల్పించి కథయందు రుచిని కలుగఁజేసియున్నాఁడు.

మూలమునం దసలే లేనిసంగతులను జొన్పి తిక్కన విరాటపర్వమునకు కావ్యస్వరూపము నిచ్చెను. సూర్యాస్తమయ సూర్యోదయ వర్ణనలును కీచకవిరహమును, వనవిహారమును మూలమునందు లేనేలేవు. వీనివలన కథకు విచ్ఛేదమును కావ్యమునకు విమూత్నసౌష్ఠవమును వచ్చెననుట సాహసము కాఁజాలదు. ఇటులే మూలమునందు లేని చిన్నచిన్న వర్ణనముల నెన్నింటినో రసగ్రంథము తిక్కన తెచ్చిపెట్టెను. శమీవృక్షమునుగూర్చి సంస్కృతమున

ఇయం కూటే మనుష్యేన్ద్ర గహనా మహతీశమీ
భీమశాఖా దురారోహా శ్మశానస్య సమీపతః

—5 అధ్యా. 14 శ్లో.

(నరాధిపా! ఆ యున్నతప్రదేశంబున భీకరంబులగు మృగముల కునికిపట్టయిన యీయరణ్యంబున శ్మశానపాత్రంబునఁ జొరరానిదై గొప్పకొమ్మలు గలిగి యెక్కుటకు సాధ్యపడని యొక జమ్మిచెట్టు గాన్పించుచున్నది.)

అనియుండఁగా ఆంధ్రమున

నెగసినకొన లేచి నింగి యంతంతకు
    నవులఁద్రోవఁగఁ దనరారుదానిఁ
జాఁగినశాఖ లాశాచక్రములకొలం
    దులు బారవెట్టంగఁ బొలుచుదానిఁ
గనట లొండొంటితోఁ గదియుచు నెడములు
    మ్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులుదాని
లోనిజొంపము పవలును బెనుఁజీఁకటి
    నొదవించి పొదలంగ నొప్పుదానిఁ
గనిమెఁ బవమాన వివిధ నర్తనకళాను
వర్తిఁగాకఘూకకావస్ఫూర్తి జాత
భీతపరిసరవర్తి నాభీలభుజగ
చండమూర్తి శమీతరుచక్రవర్తి.

అని యున్నది.

ద్రౌపదిని కీచకుఁడు తన్నుట చూచినపుడు

తస్య భీమో వధం ప్రేప్సుః కీచకస్య దురాత్మనః
దంతైర్దంతాం స్తదా రోషా న్నిష్పిపేష మహామనాః
ధూమచ్ఛాయా మభజతాం నేత్రే చోచ్ఛ్రిత పక్ష్మణీ
సస్వేదా భ్రుకుటీ చోగ్రా లలాటే సమవర్తత.

—16 అధ్యా. 15, 16 శ్లో.

(మహాబలుం డయినభీముఁడా దురాత్ముఁ డయినకీచకుని వధింపఁగోరి పండ్లు పటపటఁ గొఱికెను. కంటిరెప్ప లుబ్బి కన్ను లెఱ్ఱఁబాఱినవి. మోము పొగరయొక్క డాలు నొందినది. బొమలు ముడివడినవి, నొసటఁజెమట గాఱినది) అని వ్యాసుఁడు వ్రాసెను. తిక్కన యన్ననో

కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగము
ల్దనరఁగ సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగవికటభ్రుకుటీచటులప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయదస్ఫురణాపరిణద్ధమూర్తి యై.
నేలయు నింగియు దాళముల్ గాఁ జేసి
యేపున రేగి వాయించి యాడఁ
గులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ
దాఁకంగ వీఁకమైఁ దన్ని యాడ
నేడుసాగరములు నిక్కడక్కడఁ బెట్టి
పలుచనిరొంపి మై నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు నొక్కచోటికిఁ దెచ్చి
పిసికి పిండలిసేసి పిడుచగానఁగ
మిగిలి బ్రహ్మాండభాండంబు పగులవ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గండరించినరూపంబుకరణి భీముఁ
డతిభయంకరాకారత నతిశయిల్లె.

నని వ్రాసి ప్రళయకాలసమవర్తివలె కోపఘూర్ణితమానసుం డై నాట్యము చేయుచున్న భీముని భీమవిగ్రహమును మనయెదుట నిలఁబడునట్లు వర్ణించెను. ఇట్టి వర్ణన తిక్కనసొమ్ము. ఇతఁడు ముట్టిన పాత్ర లన్నియును మాంత్రికుని దండ స్పర్శమాత్రమున లేచి నిలఁబడు మాయబొమ్మలవలె చదువరి మనోనేత్రాంగణ మున తాండవ మాడుచు నిలుచును. దానికి తోడు భావమును దిలకించు భాష యితని కవనమునకు తీఱని యందము నిచ్చుచున్నది. స్థలవిస్తరభీతిచే నింక నుదాహరణముల నిచ్చుట నిల్పుచున్నాను.

పై విషయములను పరిశీలించిన యనంతరము తిక్కన రచనాసామర్థ్యము అసామాన్య మని తేలుచున్నది. సంస్కృత భారతముందునుండి కథా సంగ్రహణము చేయుటయే గాక చాలచోట్ల దానితో తన గ్రంథమును సమాంతరమున నడుపుచున్నను వలసిన చోటులందెల్ల వర్ణనలను స్వేచ్ఛగాఁ జేసియు పాత్రపోషణ మును వేఱుగా జేసియు, క్రొత్తసంగతులను జొన్పియు తన గ్రంథమునకు తిక్కన నవత్వమును గలుగజేసెను.

తిక్కన గొప్పతనమునకు అతని శైలికూడ నొక ప్రబలకారణము. ఇతని భాష భావమునకు సరిగా తగియున్నది. భావమునకును, భాషకును ఇంత సన్నిహిత మగుమైత్రియును మమైకతయును గలకవి తెనుఁగుభాషలో మఱొకఁడు లేఁడు. మార్దవమున పోతన తిక్కన లీతని పంచను రావచ్చును. గుంభనమునను జాతీయమునందును పాండురంగఁడీతని సరిపోలవచ్చును, నవత్వమున శ్రీనాథుఁడు సమానుఁడు కావచ్చును. గమనసౌందర్యమున సోముఁడు సరిపోలవచ్చును. కాని యితని యం దున్న గుణములలోనే రెండును గూడ మిగిలినవారియొద్ద లేవు. అనవసరము లగు అక్షరములును, పదములు నీతని పద్యములందు లేవు. ఇతనిభాష మహాకవులభాష. "ఉగ్రసుందరము," "తంద్రి సచ్చినప్రజలు," "మెత్తని పులి".

మొదలగుప్రయోగము లనితరసామాన్యములు.

తిక్కన కవితాసామర్థ్యము నింతగా అగ్గించుటవలన ప్రథమమున భారతము వ్రాసిన వ్యాసభగవానుని గొప్పతనమును గొంచెపఱుపవలయునని యీవ్యాసము యొక్క యుద్దేశము కాదు. వ్యాసుఁడు విరాటపర్వమును ఇతిహాసముగఁ జేసి నీతి గఱపవలెనని యుద్దేశించెను. అందుచే నతఁడు కథను వన్నెలుచిన్నె లంతగా లేకుండఁ జేసెను. అందుచే వానికి వలయు మార్పులను జేసి కావ్యమున కనువగు వర్ణనలను జొప్పించెను. తిక్కన వ్యాసున కనేకవిధముల ఋణస్థుఁడనుట నిర్వివాదాంశము. వ్యాసునియెడ నితనికిఁ గలమహాగౌరవము ప్రసిద్ధమైనదే. వ్యాసుఁడు మహాకవి యును ఎక్కువ సమర్థుఁ డనుట గూడ నిజము. కాని అట్టి వ్యాసు ననుకరించియును తిక్కన తన గ్రంథమును కేవలపురాణగుణములనుండి ఎడఁ జేసి కావ్యముగా మార్చి రసవంత మొనర్చి యాంధ్రకవిలోకమున నాయకుఁడగుటయే గాక విశ్వకవిశ్రేణిలో జేరఁదగినవాఁ డయ్యెను. రేకటిపాటవలె పాడినదే పాడుచు విరాటోద్యోగపర్వములను పెక్కుసారులు చదువువారు మనలో ననేకు లున్నారు. చదివినపు డుదయించిన యానందాతిశయములో "బలేరా తిక్క" యనువా రున్నారు. కాని యట్టి యానందోదయమునకు హేతువు లగుగుణము లీతనియం దేమి యున్నవి? వానిలో నేమాత్రము వ్యాసభగవానునినుండి యితఁడు గ్రహించెను? ఇతని వ్యక్తిత్వము అం దేమాత్ర మున్నది? యని విచారించినవారు చాల అరుదుగా నున్నారు. అందుచే తిక్కనయొక్క నైజతేజము జనసామాన్యమునకును, విదేశీయులకును మఱుగై యున్నది. ప్రాచీన ఆంధ్ర సాహిత్యమును విమర్శించి ఆంధ్రుల ప్రతిభను (Telugu Genius) గ్రహించి తదనుగుణముగ నవ్యకవితల పోకడలను నిర్ణయించినఁగాని మనకు తరణోపాయము కలుగఁజాలదు. అంతవఱకును మన కవిత్వమును, ఆశయములును అరణ్యరోదనములై ఫలితము నీయఁజాలవు. కావున ఉభయభాషాపాండిత్యము గలిగిన ప్రతిభావంతులు ఇట్టి పనులను బూని నన్నయ తిక్కన పోతనాదుల యౌత్కృష్ట్యము విపులపఱిచి తెలుఁగువారి కృతజ్ఞతకుఁ బాల్పడుదురుగాక!

---

## వేఁడుకోలు

వెలువోలు సీతారామయ్యచౌదరీగారు.

---

దివ్యమై నిత్యమగుచును దేజరిలెడు
నీ యనన్తశక్తి మదీయ నేత్రయుగళ
మునకు సాక్షాత్కరించుత, మనవరతము
భవ్యభవదీయ సుస్వరూపంపుఛాయ
మద్హృదయమున కనుభూత మయి నెగడుత
మధుర మగు నీ సునామము మామకీన
గానము, శ్రుతి, గురుమంత్రమై నిలుచుత
తావకీన ధ్యానంబె మద్ధర్మమును సు
కర్మమును బురుషార్థమై క్రాలుఁగాత
యుష్మదీయ విజ్ఞాన సుజ్యోతిక లన
మద్హృదిని దీప్తి ప్రసరించి మనుత, సతము
నమలమై యొప్పు మీ ప్రణయంబు నాకు
నాత్మధార, ప్రాణాధార మయి వెలయుత,
నాథ! మీదు సౌందర్యమున కనుగుణము
గను మదీయజీవనము సౌఖ్యములఁ గాంచి
సత్యశాంత శివంబుల సరళశుద్ధ
సుస్వరూపంబగుచు వెల్గుచుండుఁ గాత.

---

# మారీచీ పరిణయము —మోహనాంగి, శ్రీకృష్ణదేవరాయల తనయ.

సంపాదకుఁడు:—మ-రా-రా-శ్రీ, సెట్టి లక్ష్మీనరసింహముగారు, బి. ఏ.,

శ్రీచుజ్జానకి లజ్జతో మెడను బుస్తెం చాను గట్టించుకొం
చామై మంగళసూత్ర మూర్మిళగళంబు దక్మిలిం గట్టు శ్రీ
సౌమిత్రిం గన నవ్వు నెత్తఁగ, దదాస్యం బాస్యముల్ వంచుచుం
బ్రేమం జూచెడిరాముఁ డోముతఁ గృపన్ శ్రీకృష్ణరాయప్రభున్.

చ॥ "వనముల బ్రహ్మచర్యమున వర్తిలుచుండుటఁ జూచి కోరి వ
చ్చిన దనుజాంగనన్ మఱిది చేకొనఁ; డీతని కొక్క యస్త్రక
న్యను జతఁగూర్పఁగా వలయు," నం చెలనవ్వునఁ బల్కు సీత తా
మనుచుత సజ్జనాగ్రణిని మజ్జనకుం డగు కృష్ణరాయనిన్.

మ॥ పలుమాఱుల్ జననీపయశ్చయము చేఁపం జేపఁగా గ్రాగుచున్
సెలబాలుండు చెలంగ, వానిని జటానీకంపుటుయ్యాలలో
పల జోకొట్టుచు నూఁపునట్టివిధ మొప్పన్ నృత్యముల్ సల్పు క్రొ
న్నెలదాల్పు చ్చుతఁ గృష్ణరాయనికి నిర్నిద్రంపు నైశ్వర్యముల్.

చ॥ పిరయును మాత తానె యనఁ బేర్వడి, దిక్కను మ్రొక్కలేని దు
ర్గతి గల దీనమానవులఁ గాచెడునట్టి తలంపునన్ జగ
త్త్రయమునందు సత్పథగతిం బరమేశ్వరులోఁ జరించు పా
ర్వతి నరసింహకృష్ణవిభు వాసవసన్నిభుఁ జేసి ప్రోచుతన్.

మ॥ "కనకంపున్నెఅచేల కట్టుకొని బంగారంపు రంగూనె బొ
జ్జను యుష్మజ్జనకుండు; మీ జనని సాక్షాత్స్వర్ణపుర్ముద్ద శ్రీ
కనకాంగీమణి; కాన మీ కడుపు బంగారయ్యె," నంచున్ నిజాం
గన నవ్వన్ నగు బ్రహ్మ మజ్జనకునిం గావించు దీర్ఘాయుఁగన్.

ఉ॥ గాయకకంఠమందుఁ గవిగంటమునందును దొల్త సంభవం
బై, యమృత ప్రవాహముగ నచ్చట వెల్వడుచున్ రసజ్ఞహృ
త్తోయధిసంగమంబున నరుల్ గ్రహియించెడి యా సరస్వతిన్
దోయిలి గొన్న పేలుగవతోడను దోడుగ నుండ వేఁడెదన్.

మ॥ సురగంగార్ద్రిత మిన్న ముట్టునటు హెచ్చుం గాఁచు గాకీక బం
ధుపౌరకాటవిలోపలన్ వెలఁగపండుంబోలె వెన్నాంకు చం
దురులోఁ గల్గు సుధారసంపు గుజాయం దుండంబుతోఁ గ్రోలి, మా
ధురికిం జెంపను జాల మెచ్చి గజవక్త్రుం డిచ్చు నిర్విఘ్నతన్.

ఉ॥ నాకొసఁగట్టి డెల్ల రసవత్కవితాకృతిగాఁ దనర్పవా
ల్మీకిని, బల్కునట్టి సుడి శేకముఁ గేవలవేదరూపముం
జేకొనునట్టి వ్యాసుని, రచించిన దంతయు శారదాకృతిం
గైకొనుకాళిదాసు, నధికం బగుభక్తిని సంస్మరించెదన్.

మ॥ తెనుఁగున్ బాస ప్రపంచమంతటికి నాటిం బొల్పి, నిర్దోషు శా
ట నిజాంచత్పదముల్ బుధాగ్రణులు వేడ్కన్ మాటలం దాల్చి మ
న్నన సల్పంగఁ, ద్రిమూర్తులై వెలయు నా నన్నయ్య తిక్కన్న యె
ఱ్ఱనలన్ భావమునన్ స్మరించెదను నే నాంధ్రాభిలాషంబునన్.

ఉ॥ "పెద్దన విద్దెలందుఁ గడుఁ బేర్వడ నీయన, వేల్పుటొజ్జ పెం
పె?" ద్దనఁ, దక్కనట్టి కవి యెట్టిఁడు నీతనితోడఁ బోల్ప గొ
ప్పెద్దనఁ, డెల్లకైత కజుఁడే యగు నా యలసానివంశప్రం
పెద్దన, మద్గురూత్తముని పెద్దయు గౌరవబుద్ధిఁ గొల్చెదన్.

చ॥ అకలుషమాధురీకవిత నై యలసాని కవీశుఁబోలె స
ల్లలితి, ముక్కుతిమ్మకవిలీలను ముద్దగు పల్కు, బాండురం
గకవిగతిం బదక్రమము గల్గు కవిత్వముతోడ విష్ణుచి
త్తకథ రచించు మజ్జనుఁ దోరపుభక్తి నుతించి మ్రొక్కెదన్.

చ॥ కయితను దోషముల్ వెదకు కార్యము కాకవి చేయునట్టిదే
యయినను, దానిచే సుకవు లందఱు శ్రద్ధమెయిం బ్రబంధసం
చయము లొనర్తురంచును విచారణ చేయుచు బాచిగానికిన్
భయమును భక్తియుం గలిగి పల్మఱు మ్రొక్కి బహూకరించెదన్.

సీ॥ జిగిబిగిప్రాయంపు వగలాండ్రు పొగడు సో
యగమందుఁ దొంగతేని యల్లుఁ డగుచు,
జోగులన్ భోగులఁ గాఁగఁ జేయఁ గల ద
యాగుణంబున వార్ధి యల్లుఁ డగుచు,
విశ్వవిశ్వంభరాధీశ్వరులున్ మెచ్చు
నైశ్వర్యమునఁ గొండ యల్లుఁ డగుచుఁ,
గవిసి ఖానుల తవతవలాడఁ జేయు నా
హవకేళి వసుదేవు నల్లుఁ డగుచుఁ,
గృష్ణరాయ వసుంధరాధీశు నల్లుఁ
డౌట నల్లురయం దల్లుఁ డగుచు, నళియ
బిరుదు నగుడుగాఁ గొన్నట్టి బిరుదుమగని,
మగని మదిలోన నిల్పి నమస్కరింతు.

చ॥ ననుఁ దరియించునట్లుగ నొనర్చెడి తారకమంత్ర మయ్యు, నే
ఘనుని సమాఖ్య నోటఁ బలుకంగను జెల్లదు గాన నేను నె
మ్మనమున సంస్మరింతు, నల మద్విభు పద్మనజద్వయంబు నేఁ
గనులకు నద్దుకొందు నధికం బగు భక్తియు రక్తియుం దగన్.

తే॥ గీ॥ "రాఘవా, మహీపుత్రికారమణ, రావ
ణారి, జాహురాణ తనయావనా", యనఁ బ్రథ
మాక్షరావళి యేఘను నాఖ్య యానొ
యట్టి మత్పతి దైవంబె యగును నాకు.

వ॥ ఇట్లిష్టదేవతా ప్రార్థనంబును, బురాతనాధునాతన సంస్కృతాంధ్ర కవీంద్రసంస్మరణంబును గురుజన నమస్కరణంబును గావించి, యొద్దియే ప్రబంధంబు నవరసబంధురంబుగా రచింప నుద్దేశించి యున్నసమయంబున.

సీ॥ తనయాజ్ఞ లెల్లఁ గుంతలమేదినీంద్రుఁ డౌ
దలమీఁదఁ దాలిచి సలుపుచుండఁ,
దనకాళ్లకుం గటకనృపాలకుఁడు మ్రొంగ
మురపుం గరము లెత్తి మ్రొక్కుచుండఁ,
దన మ్రోల మధురాపురనరేశ్వరుఁడు దయ
కయి తీయమాటల నాడుచుండఁ,
దనకుఁ గాంచీపురీజననాయకుఁడు పనుల్
నడుము కట్టుకొని యొనర్చుచుండఁ,
దనదుధాటికి భామినీధరణిపతులు
భీరుజనములై గడగడ బెగ్గడిలఁగ
నతులకర్ణాటరాజ్యసింహాసనమున
నొలగం బున్న కృష్ణరాయోర్విధవుఁడు.

వ॥ వెండియుఁ బుండరీక క్షీరగర్భాండ భాండ పిచండిల పాండురా యశస్సుధాస్వాదన పరిలబ్ధ నవ్యదివ్యత్వమండిత ప్రచండరిపుప్రకాండుండును మూరురాయరగండుండును, నిజభుజారంగరంగత్కృపాణాంగనా హృదయగమ నృత్తరంగస్థలాయమాన సంగరరంగ రంగవల్లీభంగీ సంపాది రిపుసంఘ తంగ కుంభగలిత మౌక్తిక చయుండును, దిరుమలదేవీహృదయప్రియుండును మధ్యందినాంభోజబాంధవకుంభత్తేజోవిజృంభ న్నిజావక్రపరాక్రమ కుంభసంచులుకిత గంభీరాంభోధి విభావిభాసిత శాత్రవసైన్య మోహాయుండును జిన్నాంబా మనోహరుండును, స్వకీయామందదానవినిందిత ఘనాఘన బృందారి బృందారక ధేనుసింధుసందోహ హరినందన హరిచందనుండును, నరసింహదేవరాయప్రియనందనుండును, గవిజనరాజరాజీ పూజన భాజన కవి

విరాజమాన ముఖాంభోజ విభ్రాజిత నవీనభోజుండును, నాగమాంబా తనూజుండును, సముజ్జ్వలజ్జ్వలజాల వికసనజనకుండును, మజ్జనకుండును, దుష్కర తుష్కర తురుష్క వక్త్ర పుష్కర శ్మశ్రు శైవాల పుష్కల పరచమూ పుష్కరిణీపరివర్త గంధసింధురుండును, గర్ణాటరాజ్య రమా ధురంధరుండు నగు శ్రీకృష్ణదేవరాయ వసుంధరావర పురందరుండు కొలువు విడిచి, యిందిరాసుందరీ మందిరంబగుట సరవిందంబు చందంబున సందంబుగం దనర్చు తన సౌధంబునందలి శేషల యాకృతి గైకొను వాకిళులం గడచివచ్చి, యంతిపురంబుం జొచ్చి, యచ్చోట హెచ్చుగు మెచ్చులం దెచ్చు నొక గదియం దచ్చపుంజిత్తరువుంబోలె మెత్తని దిండున కొత్తుకొని చిత్తంబున మొత్తంబులై పుట్టు క్రొత్తయూహాలకతంబునం దన్నుం జూడని నన్నుం జేరి, యంభోధరగంభీరవాగ్డంభనంబుల ని ట్లనియె.

తే॥ గీ॥ "కన్నుబొమలు పై కెగసి యి టున్న వేల ?
చేతియం దిటు చెక్కిలి చేర నేల ?
చూపు లిటు వట్టిబయలును జూచు నేల ?
పట్టి, యెట్టి గట్టిసమస్య పట్టుకొంటి ?"

క॥ అన నులికి పడుచుం గడుం జ
య్యన లేచి, తదీయ మృదుపదాబ్జద్వయికిన్
వినతి యొనరించి, నే దా
పున నిలిచి, మదిం గల చనవున ని ట్లంటిన్.

ఉ॥ "తండ్రి, సమస్య పూర్తికి నెదం దలపోయుట లేదు; మీర లే
మంత్రి మదీయసాహసము నారసి, కావ్య మొనర్పం బూనితిన్;
'వీం డ్రకుం బాక ముండగం, గవిత్వపుంబాకము నేల ?' యంచు ని
ల్లాండ్రను గేలిసేయు జను లందఱు మెచ్చెడునట్టి శైలితో".

చ॥ అన విని, "యెట్టెటూ ? పలుకవమ్మ మఱొక్కతఱిం; బ్రబంధ మీ
వొనరుప నింతకాలమున కూహ యొనర్చితె ? యెంత చెప్పినన్
వినకయె యుంటి విందనుక; వీనులవిందుగ నీడుకబ్బ మో
తనయ, విననంగ నబ్బునొ కదా యని నిత్య మపేక్ష చేయుదున్.

క॥ చదువుల సరస్వతివి ; నీ
మృదుకవితాశైలి స్త్రీలకే యన నేలా ?
తుదకుం గొమ్ములు తిరిగిన
మదవత్కవిపుంగవులకు మహిని గలుగునే ?.

శా॥ స్త్రీ లన్నంతనె చుల్క చేయుట సమాచీ, మాఢ్యమే సుమ్ము; నా
రీలోకంబున శేముషీయుతలు లేరే పూర్వ ? మిం తేటికిన్,
నాళీకాసను రాణి స్త్రీయె కద ? యెన్నం, గోమలాంగీవచో
లాలిత్యం బది మోటు పూరుషుల కేలా యబ్బంగా నేర్చునున్ ?

ఉ॥ కమ్మని తేనె లుట్టిపడంగా నిపు డీ వొనరించు గ్రంథ మో
యమ్మరొ, యిష్టదైవమున కంకితముగ్ సలుపంగ నీదు డెం
దమ్మున నీవు నిశ్చయ మొనర్చిన లెస్సయె; లేక యున్న, నా
కిమ్ము త్వదీయకావ్యసుత; నే నెదం జేరిచి యాదరించెదన్.

చ॥ అపునవు, ధాత్రిలో మనుమరాలిని బెండిలి యాడ వచ్చు ; నీ
నవనవకావ్యకన్య యిది నాయెడ, వృద్ధవరుండ నౌట, మ
క్కువ పడ దంచు మానుకొనంగూడదు; తక్కువయీడుభార్య కె
క్కువ యగు మక్కువన్ సుఖముం గూరుచు నెక్కువ యీడు భర్తయే.

ఉ॥ పుత్రిక తొల్తం బుట్టు టతిపుణ్యాకరం బని నే నెఱింగియుం,
బుత్రుడు నా కొకం డయినం బుట్టమి, రాజ్యము నెల్ల నేల డొ
హిత్రుండె నాకుం దొల్త జనియింపంగం గోరెదం ; గానం, గబ్బపుం
బుత్రిక నీవు గాంచునెడం, బుణ్యమునం బురుషార్థముం జుమీ.

క॥ నగ లిచ్చెద, నాణెము లె
చ్చుగ నిచ్చెదం, గోరినట్టి సొ మ్మిచ్చెద నీ
'సొగసుంగృతికన్యక," కని
నగుచున్ నామొగము చూచి, నాయన పలుకన్.

ఉ॥ అల్లన నిట్టు లంటి, "దయ నల్లునియల్లుడ నైతివే కదా"
యల్లది చాల, కీసరణి నల్లునియల్లుడ వౌట కెంచితే
తల్లికిం గ్రొత్తగా సవతి దాపుర మైనను, దండ్రి పెండ్లి యం
చెల్లరు సంబరంపడుదురే కద ? కావున నట్లె చేసెదన్.

క॥ ముదిరిన కొలందిని రసము
గదిరెడు చెఱకట్టులు రసికత ముదిరిన నిన్
ముదుసలిడ వనవచ్చునె ? యె
ట్లాదవును గన్యకల కిట్టి యొడయం ?" డటన్నన్.

ఉ॥ నవ్వుచుం దండ్రి నాదు వదనంబునం జూడ్కిని నిల్పి పల్కె, "నీ
వెవ్విధి నేని సమ్మతిలుటే కద కావలె ? నీదు కన్య లే
జవ్వనమందు నున్నం, దనుజాతరో, తాతకు నాతి యైనచో,
నవ్వరె యౌ ; నటుల్ పడుచుటవ్వ నొనర్పు కృతిన్ బిగిన్ మతిన్.

క॥ తియ్యని నుడువులును నడక
యొయ్యారము కలిగి భూషణోజ్జ్వల యై, నా
కెయ్యెడ రక్తి గొలిపి, మృదు
శయ్యను నీ కృతిసుత పడ సమ్మతి సుమ్మీ.

ఉ॥ జాలము వల్ల," టంచు సరసంబుగం బల్కిన తండ్రిం జూచి నే,
"నాలుసు జాలు లేదు, మఱి యర్భకు నామము సోమలింగ మన్
లీలగ నున్న," దంచుం గడు లేనగ వొప్పంగ నన్నం, "జాలు నో
బాలిక, తప్పుకొంట కిటు పల్కెదె ? యొప్పనుజుమ్మి తప్పినన్.

వ॥ ఇదె నిశ్చయతాంబూల," మని నికటస్థిత కనకకలాచికనుండి కర్పూరవీటికం దీసి నాచేత నునిచి మా తాతకుండ నాన లిడిరి.

చ॥ పసితనమందు నేను దన పక్కను జిందులు ద్రొక్కుచుండం, గ్రొం
బసిండి పసందు టందియలం బల్కెడి మువ్వలమ్రోతం విందుకున్
వినువడు ; నాదు పద్దెములు విద్దెల ముద్దియ పైడి యందెలం
దెసంగెడు మ్రోత లంచు విను నిప్పుడు మజ్జనకుండు ప్రేమచే.

క॥ "అమ్మా, నీ గర్భమ్మునం
గ్రమ్మఱ జనియింతు సుమ్మ ; కడుం బ్రేముడి నా
కమ్మేయిం బెట్టుమ యీ నా
మమ్మే" యను నాదు తండ్రి మక్కువ యెంతో.

ఉ॥ తిర్మలదేవికే పొడమితిం గనుకన్ మను తిర్మలాంబ యం
చర్మిలి పేరు నా కిడియు నట్లుగం దాం బిలువంగ రామి, నన్
గూర్మిని మోహనాంగి యను క్రొత్త సమాఖ్యను బిల్చు తండ్రికిన్
జర్మము కోసి యిచ్చినను జాలదు గాదె ఋణంబు తీర్పంగన్.

సీ॥ చతురంగబలయుతసైన్యముల్ నడిపెడు
నతఁడు నాతోం జతురంగ మాడు ;
గంగాఝరిని నాంధ్రకవిత చెప్పునతండు
నా సమస్యాపూర్తి కాస చెందు ;
దిక్కుడ్యములను సత్కీర్తిం జిత్రించు నా
తండు నా రాయు చిత్రముల మెచ్చు ;
రాగసంభరితాంతరంగుం డౌ నతండు నే
రాగ మాలాపింప రక్తి గాంచు;
నన్ను, మన్నాథునింట మన్ననలతోడం
గన్నులం గప్పుకొని ప్రోచెంగాదె ? యట్టి
హిత మహాకావ్యకర్తకున్ గృతిని గోర !
నాదు భాగ్యంబు వర్ణింపంగాం దరంబె ?

ఉ॥ నాయన కిష్ట మాకథయె నాదుప్రబంధమునా నొనర్తు ; రా
మాయణ మన్న నాయనకు మక్కువ మిక్కిలి యొక్క డాట నే
నాయది కొంచుం గల్పితమునందు నొకించుక చేర్చి కూర్చెదం
దోయజ సన్మరందరస తుందిల సుందర కందళోక్తులన్.

వ॥ అని నిశ్చయంబు సల్పి, యనల్పసైచిత్రితో నొక నవీనకథ కల్పించి, దానిని మారీచీపరిణయం బను ప్రబంధంబుగా రచింప నెంచి, తత్కృతిముఖంబున కలంకృతిగా మత్పితృవంశాభివర్ణనం బాచరించెద.

సీ॥ అమలంపుం గమలంపు రమ లింపునకు నింపు
చెలుల మోములను మందలముచేతం
దొగచాలు నగం జాలు జిగి దాలుచుచుం గ్రాలు
మగువల కనులంకమ్మగముచేతం

బలు కుందముల యందములఁ బొందఁ గల సుంద
రుల నగవులను వెన్నెలలచేత
నను తేనెలను బూనె ననఁగా నెసఁగు తేనె
లఁతల పల్కుల నిజామృతముచేతఁ
బోలుటంజేసి తన కాఁడు పోఁడిమిఁ గల
దండు రంచుఁ దారాసుందరాంగిని వల
పించి దిగధీశులకు మది భీతిని మొల
పించి మగఁటిమిఁ దారకాప్రియుఁడు నెగడు.

క॥ విధున కుదయించెఁ దారా
వధూతిలకమందు బుధుఁడు ప్రథితబుధుఁ డిళా
మధురోష్ఠీ హృదుపసనీ
మధుఁడు లతాంగీ నవీనమన్మథుఁడు ధరన్.

క॥ ఆయనకుఁ దనూజాతుఁ
డై యుదయించెను బురూరవాఖ్యనరేంద్రుం
డాయువు తనయుం డాయన
కాయె; నహుషుఁ డతనికి సుతుఁ డై యుదయించెన్.

ఆ-వె॥ అతనికుద్భవిలె యయాతి నయాతి ద
యాతి సద్గుణముల ఖ్యాతిఁ గల్గి;
నుర్వి నతఁడు కనియెఁ దుర్వసు, శర్వసు
పర్వ సురభి సదృశబహుయశుని.

క॥ తుర్వసు సంతతిలోపల
నుర్వీశు లనేకు లుదయ మొందిరి; వారల్
గర్వితరిపు ధైర్య మహో
ర్వ్యత భిదురల్, నృపనయపారగవిదురల్.

తే-గీ॥ తుళువవంశ మవ్వారియందుం బ్రసిద్ధి
పడసెఁ; దుర్వసు శబ్దసంభవము తుళువ
శబ్దమో? లేక తద్వంశజాతు లరత
తుల గెలిచి వారి సతులకుఁ దులువ లైరొ?

క॥ తుళువాన్వయ మంగ మహీ
తల విభుఁడు విపక్షపక్షితతి సాళువ మై
మెలఁగుట సాళువవా లై
వెలసి రతని సంతతిఁ బ్రభవించినవారల్.

సీ॥ పరపక్ష సాళువబిరుదంబు సాంపరా
యస్థాపనాచార్యుఁ డనెడిబిరుదు
బిరుదుమగలు మెచ్చ నరుదుగాఁ గైకొని,
నరు దురంబునఁ గాంచి కురు దళములు
పరుదుకొనఁగఁ జేసి కరిదముల్ హయములు
ద్విరదముల్ భటులును దురదుర మని
చెదరు రీతి నరాతిసేనలు తనుఁ జేర
రాని యవక్రవిక్రమముతో మె
లంగు సాళువ మంగు ముంగొంగు పసిఁడి
యాచుఁ దోఁచుచుఁ బ్రోచెను యాచకతతి;
నాతనికిఁ దనూజాతుండు గౌతరాజు;
కౌమరుఁ డై పుట్టె నతనికి గుండరాజు.

క॥ గుండజనపతికిఁ దిమ్మవి
భుండును నరసింహరాజుఁ బుత్రకు లై మా
ర్తాండహిమాంశులఁ బోల్చి
చండపరాక్రమ విమల యశస్సంయుతు లై.

ఉ॥ దిక్కరిపాళికిన్ శ్రమము దీర్పఁగఁ జాలినయట్టి బాహువున్,
దిక్కరిపాళికన్న వినుతిం గనినట్టి పదద్వయంబునున్
దిక్కతి పాలికిం జనిన దీనులఁ గాచెడి కేలుఁ గల్గి నల్
దిక్కుల గుండయప్రభుని తిమ్మఁడు నించెను గీర్తిచంద్రికల్.

ఉ॥ జైమినిభారతంబు తన సద్యశమున్ శశి కల్గునంతకున్
భూమిని నిల్ప, ఫల్గునిని బోల్కని దానొనరించినట్టి సం
గ్రామములం జరిత్రముగ వ్రాసిన నొండొక భారతంబు కాఁ
గా, మహిలో నృసింహజనకాంతుఁడు పాల్చెనుగీర్తిమంతుఁ డై.

ఉ॥ "కల్వలవిందునందుఁ గల కం దఖిలంబును బోయినట్టి యీ
చెల్వము కంటిరే! సుధ విశేషముగా నిఁక నబ్బు," నంచు వే
ల్పు ల్విబుధాలయంబునను బొంగుచు విందులు సల్పుచుండఁగా
సాళ్వనృసింహభూవిభు యశంబు భృశంబుగ నిండె దిక్కులన్.

ఉ॥ కోవిదసంస్తుతుం డయిన గుండయ తిమ్మవిభుండు దేవకీ
దేవిని బెండ్లియాడి, వసుదేవుఁడు దేవకియందు మున్ను రా
జీవదళాక్షునిం గనిన చెన్నునఁ గాంచెఁ గుమారు నీశ్వరుం
గేవల మీశ్వరుం డనుచుఁ గీర్తిని గన్న ధరాతలేశ్వరున్.

సీ॥ ఆశ్రితావనమున, నైశ్వర్యమందు, ర
మేశ్వరుండును, బరమేశ్వరుఁడు,
సౌందర్యమందు, శాస్త్రవివేచనమున, ర
తీశ్వరుఁడును, భారతీశ్వరుఁడుఁ,
బటుధైర్యమున, మహీభరణదక్షతను న
గేశ్వరుండును, బన్నగేశ్వరుండు,
రాజనీతిని, రణరంగచాతురిని, భ
ద్రేశ్వరుండును, సుభద్రేశ్వరుండు,
బుద్ధిని గణేశ్వరుఁడు, యశంబునను నుడుగ
ణేశ్వరుఁడు, భోగమందు సురేశ్వరుండు,
నిష్టదానతోషితభూసురేశ్వరుండు
నగుచుఁ దిమ్మయ యీశ్వరుం డవని నేలె.

మ॥ ఉదయాద్రిప్రభృతిప్రదేశముల బాహుప్రాభవోపేతుఁ డై
కదనక్షోణిని నిల్చి యీశ్వరమహీకాంతుండు నిర్జించి, తా
నుదయాద్ర్యస్తమహీధ్ర సేతువర శీతోర్వీధ్ర మధ్యోర్వి నా
రదసంచారసమంచితంబుగ నొనర్పం జాలె సత్కీర్తిలోన్.

శా॥ అర్జున్ మృత్యువు గల్గునంచు నిటు లేలా జంకుచున్నాఁడవో
రాజా, యీశ్వరునిన్ భజింపు, మతఁడే రక్షించు ని," న్నంచునన్
హేజీబుల్ తెలుపన్ హరున్ మఱచి తన్నే దిక్కుగాఁ దిమ్మధా
త్రీజానిప్రియపుత్రు శాత్రవుఁడు ప్రార్థించున్ దయాపాత్రుఁ డై.

తే॥ గీ॥ ఈశ్వరునికి నర్ధాంగి యై యొసఁగిన సతి
బుక్కమాంబిక కనియెను బుత్రకులను
విక్రమకుమారు నరసింహవిభు నవక్ర
ధీగుణగణేశ్వరుం డైన తిమ్మవిభుని.

క॥ ఈశ్వరనృసింహుఁ డేలెన్
విశ్వంభర నహితవాహినీ విభుదత్తే
భాశ్వమణీ గణికాప్రము
ఖైశ్వర్యయుతాపరామరాధిపుఁ డగుచున్.

చ॥ వరనరసింహనామ మని ధ్రువంబుగ భూతపిశాచవర్గముం
బరుగున దవ్వుదవ్వులకుఁ బాఱెడున ట్లొనరించుచుండ నీ
శ్వరనరసింహనామ మనిశంబును జేరఁగఁ బిల్చుచుండు న
బ్బురముగ దాపుదాపులకు భూతపిశాచతతిన్ రణక్షితిన్.

సీ॥ నరసింహనామ మన్వర్థమే నిజభక్త
జనుల శ్రీహరిరీతి మనుచు చుంట
నరసింహసంజ్ఞ గణ్యామె సవ్యసాచి కే
సరులతో సరియైన శౌర్య ముంట
నరసింహుఁ డనునాఖ్య న్యాయమే మనుజవ
ర్గములోన శ్రేష్ఠతఁ గాంచి యుంట
నరసింహుఁ డనుపేరు సరియె శాత్రవ నర
గజయూథములకు సింగ మయి యుంట
ననుచుఁ బొగడంగ నెగడె నమ్రారిమకుట
చారుతటహీరమణి వారశాగశాగ
మానుకూలకసాంధ్యరాగాత్మచరణ
రాగరుచిరుండు నరసింహరాజవరుఁడు.

చ॥ గుణమణి యానృసింహుఁ డిలఁ గుంతలమాదిపదంబు లెల్లఁ దా
రణమున గెల్వఁ దద్విభుపరాక్రమబాలుఁడు కీర్తిగర్భమం
దణుపఁ దొఱంగి కుంతలములాది పదంబులు గల్గి వెల్వడన్
వణఁకుచుఁ దత్పదంబులకు వైరులు కుంతలముల్ తగుల్పఁగన్.



ఘనతవహించిన శ్రీ మైసూరు మహారాజా బహద్దరువారు.



ఘనతవహించిన శ్రీ మైసూరు యువరాజుగారు.



ప్రిన్సు జయ చామరాజేంద్ర వుడయరు బహద్దరువారు.



శ్రీ మైసూరు దివాన్‌జీ సాహెబుగారు.



శ్రీ చెన్నప్పగారు.



శ్రీ నీలగిరి సంజీవయ్యగారు.



శ్రీ డి. యస్. మల్లప్పగారు.



శ్రీ కొంతి వేంకట రామమూర్తిగారు,
ఐ. సి. ఎస్.



సర్. ఏ. పి. పాత్రోగారు.



మహామాన్యులు శ్రీనివాస శాస్త్రిగారు.



రాజసభాభూషణ శ్రీ చాండీగారు.



సర్. ఎం. విశ్వేశ్వరయ్యగారు.



శ్రీ వి. వేంకటప్పగారు.

మ॥ కదియన్ వచ్చిన కాలకూటమును మ్రింగం బుట్టి యే మందునం
గుదురం బోక మహేశు కంఠమున గ్రుగ్గం జేయ నెమ్మచ్ఛునన్
సదయుం డీశ్వరనారసింహుఁడు ప్రశస్తుం డైన సత్కీర్తిపా
రదమున్ రాయచు మాన్పి గౌరిమనసున్ రంజింపఁ జేసెన్ బళీ!

ఉ॥ నిత్యముఁ బ్రీతితోడ నవనీసతి నాదివరాహుఁడట్టు లౌ
చిత్య మెఱింగి తాల్చిన నృసింహవిభుండు కృతిన్ గ్రహించె భా
రత్యమలాంగి ప్రాణము వరాహపురాణము నందిమల్లయా
మాత్యకవీశుఁడున్ మలయమారుతసత్కవియున్ రచింపఁగన్.

క॥ శ్రీనరసింహుఁడు తిప్పాం
బానాగాంబారమణులఁ బరిణయ మయ్యెన్
శ్రీనారాయణుఁ డల భూ
శ్రీనీలాలకల మున్ను చేకొన్నగతిన్.

క॥ ఆయమ్మలకుఁ గుమారకు
లై యుదయించిరి సమిజ్జయకుమారకు లై
వే యరులకు మారకు లై
యీయిల వీరనరసింహ కృష్ణనరేంద్రుల్.

ఉ॥ తిప్పమదేవినందనుఁడు ధీరుఁడు వీరనృసింహుఁ డెల్లెడం
గుప్పలు కుప్పలట్లుగఁ గకుప్పులఁ గీర్తిఁ గప్పురంబుఁ దాఁ
గప్పెను : దత్ప్రతాప మధికంబుగ దాని వెలుంగఁజేయఁగా
గుప్పున లేచి క్రమ్మె రిపుకోటులదుర్యశఫుంబొగల్ ధరన్.

శా॥ నాగాంబానరసింహపుత్రుఁ డయి జన్మం బందె నాజన్మస
ద్యోగంబుల్ తనరం ద్రిరత్నగుణచంద్రుల్ కల్గు శాకాబ్దముల్
కాఁగన్ నిర్వికృతిత్వ మావికృతి రాగం బుష్యమందున్ సగం
బేగన్ ద్వాదశి శుక్రవాసరమునం గృష్ణావనీంద్రుం డిలన్.

ఆ-వె॥ అన్నగారివెనుక నవనీభరముఁ దాల్చె
నన్నగారిఁ బోలునట్టి కృష్ణ
దేవరాయ లఖిలదిక్కుల రాజులు
" దేవరా " యటంచు సేవ సలుప.

సీ॥ శూరకులంబు సంశోభింపఁ బుట్టి మ
హానందజన్మవిఖ్యాతిఁ గాంచి
నవనీతదధిహరణయశంబు గడియించి
పుణ్యబృందావనంబునను మెలఁగి
యహితాపకారి యానట్టులు నటియించి
గోవర్ధనకరత్వ మావహించి
చేపట్టఁ గోరు నెచ్చెలులకుఁ బ్రియుఁ డయి
యక్రూరవిజ్ఞప్తు లాదరించి
యుగ్రసేనాతివశముగా నుండునట్లు
మథుర నొనరించి విజయసంబంధుఁ డగుచు
ధర్మపరిపాలనము నిల్పి ధరను గృష్ణ
దేవుఁడే కృష్ణదేవుఁ డై తేజరిల్లు.

మ॥ ధర సింహాసనమై నభంబు గొడుగై దైవాఱఁగా ధారుణీ
వరసింహుం డనుసుప్రసిద్ధిఁ గని దుర్వారారిభూమీశసిం
ధురసింహుం డయి సింధురక్షితధరన్ ధోఃపీఠిపైఁ దాలిచెన్
నరసింహాధిపకృష్ణభూధవుఁడు శ్రీనారాయణుండట్లు గన్.

సీ॥ అభ్రము నభ్రమునందు ముద్దాడంగఁ
జౌదంతి కిప్పుడు సందు దొరకె;
క్షమతోడ క్షమతోడ సరసంబు లాడ నా
దివరాహమున కిప్డు వ్యవధి యొదవె;
మేనక మే నకటా ! నిమురఁగఁ గోరు
హిమవంతున కిపుడు సమయ మయ్యె;
భోగముల్ భోగముల్ ముడిచి పొందఁగ శేష
ఫణి కియ్యెదలఁ దీరుబాటు కలిగెఁ;
గూర్మితోఁ గూర్మితోడను గూడి యాడఁ
గమఠనాథునకిపు డవకాశ మబ్బె
స్థిర స్థిరముగాఁగ నిజభుజాసీమయందుఁ
గృష్ణరాయప్రభుండు భరించు చుంట.

శా॥ అస్తోకప్రతిభాపరామరగురుం డౌకృష్ణరాయండు శ
త్రుస్తోమాత్యపకీర్తిధూమ మిల నెందుం బుట్టు నందందుఁ దా
ని స్తంద్రోగ్రనిజప్రతాపవిపులాగ్నిం గూరుచున్, యత్రధూ
మ స్తత్రాగ్ని యటన్న న్యాయము మదిం బాటించుచున్ మాటికిన్.

మ॥ నరసింహప్రభు కృష్ణరాయ రిపులండంబుల్ విదారింప భా
స్కరబింబంబునఁ బుట్టు రంధ్ర మతితేజం బుంటచే నం దగో
చర మయ్యెం, బ్రతిబింబితం బగుచు మచ్చంబోలెఁ దోఁచున్ స్వకీ
యరుచుల్ లేక రవిప్రభన్ వెలుఁగు నీహారాంశుబింబంబునన్.

ఉ॥ అచ్చపు టాటకత్తియ కదా ? మెడపైఁ బడి కొందఱన్, హృదిన్
గ్రుచ్చి కవుంగిలించుకొని కొందఱఁ, గొందఱఁ బెద్దనిద్దురం
బుచ్చుచుఁ గృష్ణరాయ నసిపుత్రిక శత్రుల మాయఁ జేయు: వా
రచ్చర లబ్బినన్ మఱవ రచ్చెలిమర్మవిభేదకార్యముల్.

సీ॥ మహిశూరవాసులు మహిశూరు లన్న వి
ఖ్యాతి పోవఁగ శరణార్థు లైరి;
గంగవంశపు నృపుల్ గంగ వంశపుఁగీర్తి
కలియ వినమ్రు లై కాళ్లఁబడిరి ;
శివసముద్రప్రజల్, "శివ ! సముద్రమె దిక్కు
మా కిఁ," కంచును గాందిశీకు లైరి ;
శ్రీరంగవాసులు, "శ్రీరంగ ! రంగ ! రం
గా ! " యటంచును గంపితాంగు లైరి
దిక్కు లదరంగ, సప్తధాత్రీధరములు
గ్రక్కదలఁ, గృష్ణరాయ ధరావరుండు
విపులసేనతో యామ్యదిగ్విజయయాత్ర
కేగు నెడలఁ దద్రణభేరి మ్రోఁగినంత.

చ॥ ఉదయగిరిం గలట్టి బలియుం బ్రహరేశ్వరపాత్రు నొంచి, దు
ర్మదుఁ డగువాఁడు దాల్చు నవరత్నకిరీటము కాలిపీఁటగా
సదమలవారిపూరముల స్నానమొనర్చి జయేందిరం గొనెం
ద్రిదశులు మెచ్చఁ గృష్ణజగతీతలకాంతుఁడు నూత్నకాంతుఁ డై.

చ॥ కనకగిరిన్ వసించునెడఁ గల్గక మానదు స్వర్గవాసమం
చును భయ మంది కావలయు నూనులుఁ జానలుఁ దానుఁ దాని గ్ర
క్కున విడనాడి వింధ్యమునకుం జనిరొకెన్ మును వీరభద్రరా
జనిమెనఁ గృష్ణరాయవసుధాధిపసింహుఁడు నిల్చి పిల్చినన్.

చ॥ రణమున నోడి కృష్ణు మది రంజిలునట్లు మణీ నిజాత్మజా
మణులను దెచ్చి యిచ్చి విషమం బగునట్టి గుహాంతరంబునం
దణఁగిన వీరభద్రవసుధాధిపుఁ దొల్లిటి భిల్లుకేంద్రుఁగా
గణుతి యొనర్చి భిల్ల జనకాంతులు కొల్తురు వింధ్యభూములన్.

సీ॥ కొండవీడు జనులు కొండ వీడుట మాని
కావించి రచటనే కాఁపురంబు;
విజయవాటికవారు విజయవాటిక యిఁకఁ
దమయూరు కాదని తల్లడిలిరి ; ·
రాజమహేంద్రవరప్రజల్ రాజమ
హేంద్రా !" యనిరి చేతులెత్తి మొక్కి ;
యొడ్డెమాఁకలు చేతు లొడ్డె మాకస్థితి
భయకారణమున సంప్రాప్తి కాఁగ;
దిక్కు లదరఁగ సప్తధాత్రీధరములుఁ
గ్రక్కదలఁ గృష్ణరాయధరావరుండు
విపులసేనతోఁ బూర్వ దిగ్విజయయాత్ర
కేగునెడలఁ దద్రణభేరి మ్రోఁగినంత.

శా॥ నాగంబుల్ కల కృష్ణరాయవిభు సేనల్ త్రాగుటం జేసి కృ
ష్ణాగోదావరులందుఁ గల్గు జలముల్ సంపూర్తిగా శూన్యముల్
కాఁగా వానిని దానధారల యథాకారంబుగా నించుఁ బు
ణ్యాగఖ్యాతి వహించినట్టి ఘన శుండాలంబులుం దానునన్.

శా॥ సీతానాథసమానవీరుఁ డగు నా శ్రీకృష్ణరాయేంద్రు వి
ఖ్యాతిన్ లోకుల కెల్లఁ దెల్లముగ వ్యాఖ్యానంబు గావింపఁగాఁ

పాతాళంబునుండి వెల్వడిన సప్తస్వామియే నాఁగ సం
జాతం బయ్యెను బొట్టునూరి విజయ స్తంభం బహీనాకృతిన్.

మ॥ తన ధైర్యం బచలంబు గాఁగఁ బరఁగం దామేటి యాకాశ మె
ప్ప, నృసింహాధిపకృష్ణరాయఁడు మథింపన్ భంగమం గన్న జీ
వనమున్ గల్గు ప్రతాపరుద్రుఁ డొక శేషం బా నదీనత్వమున్
గని, లక్ష్మిం దనకూఁతు నిచ్చి ముదితుం గావించె భూమీశునిన్.

మ॥ అనిలోనన్ నరసింహకృష్ణవిభు నత్యంతోగ్ర తేజంబునం
కను గన్నెత్తియుఁ జూడ నోడిన తురుష్కక్షోణిపుల్ మింటిలో
వను దత్తేజపు ముక్కలే యనుచు భావంబందు నూహించి, సూ
ర్యుని నెమ్మేనును జీల్చుచుం జనుదు రోహో! యెంత మాహాత్మ్యమో?.

ఉ॥ ఏఁ డిలఁ గృష్ణరాయ ధరణీశునితో నని సేయఁ గల్గువాఁ
డేడిలఖాను, బీజపుర మేలు పఠాను, నటు చేసి, ప్రాణముల్
వీడి, యముండు లేఁ దయిన పీటికిఁ బోవక, రంభ మేనుసన్
వీడియమున్ గొనం జనిరి, వేల్పుబోజుంగులు మెచ్చ నూర్పఁగన్

సీ॥ ఊర్వశి నెమ్మేని హొయలు చూపుట మాని,
బురఖాను ధరియించి తిరుగ సాగె,
మేనక చీరలు మాని యిజారులఁ
గుడిలినీలున్ వేసికొనఁగ సాగె;
రవికల విడనాడి రంభ జుబ్బాలు క
బ్బాలు బిబ్బీలట్లు వాడ సాగె;
లోచనంబులకుఁ దిలోత్తమ కాటుక
మాని సుర్మా నిత్య మూన సాగెఁ;
గృష్ణరాయకరాసిచేఁ ద్రెళ్లి గోల
కొండ బీజపురంబులనుండి స్వర్గ
పట్టణంబున కరుదెంచినట్టి దొడ్డ
ఖాను బిడ్డల కుంపుడుకత్తె లగుచు.

ఉ॥ రాజు కరంబుఁ బేదలఁ దిరంబుగ శ్రీదులఁ జేయ నీవిచే;
రాజు సతీజనాళి కనురాగము కల్గఁగఁ జేయ రూపుచే;
రాజు సుధామయంబుగ ధరావలయంబును జేయఁ గీర్తిచే;
రాజు నృసింహకృష్ణుఁ డవురా! భువిలోన సమస్తకీర్తులన్.

సీ॥ శరమునో, శరదంబుధరములో, మౌక్తిక
సరములో, ధవళచామరములో, ఖ
డురములో, రజతభూధరములో, నమరకుం
జరములో, సురనదీఝరములో, మి
హిరములో, నమృతశీకరములోఁ, జంద్రికో
త్కరములో, దుగ్ధసాగరములోఁ, గ
పురములోఁ, బరశుభ్రదరములోఁ, బన్నగ
వరములో, నవబిసాంకురములో స
మం బనుచుఁ గవుల్ తనదు యశంబు పొగడ,
గాయకులు, " సరిగా, సరిగా, " యని శిర
ములు కదపఁ, గవితాగానములకు మాత్ర
మలరు శ్రీకృష్ణదేవరాయప్రభుండు.

ఉ॥ కోటులు గాఁగ గృష్ణవిభుఁ గూర్చి కవుల్ విరచించినట్టి యా
చాటువు లెల్లఁ గూర్చినఁ బ్రశస్తతరం బగు గ్రంథ మౌను; గ
ణ్టాట కవీశు, లాంధ్ర కవినాథులుఁ దత్సభ మాటిమాటికిన్
మేటుల మేమె మేటులము మేమె యటందురు కాటులాటగాన్.

సీ॥ మనుచరిత్రము కృతిగ నొసంగి పెద్దనఁ
దగు నాంధ్రకవితాపితామహుండు,
సత్కీర్తిమైఁ బారిజాతాపహరణము కృ
తిగ నొసంగిన నందితిమ్మనకవి,
మాటల నతులితమాధురీమహిమంబు
తోడఁ బల్కుచునుండు ధూర్జటికవి
రసముప్పతిలుచుండ రచనచే సుధ పెడఁ
జల్లు మాదయ గారిమల్లనకవి.
మున్ను గల యష్టదిగ్గజంబు లను కవుల
మంత్రిసత్తముఁ డైన తిమ్మరసుఁ గూడి
భువనవిజయనామకసభాభవనమందు
నోలగం బుండు కృష్ణభూపాలకుండు.

ఉ॥ తానుఁ గవీశ్వరుం డఁట! సదా తనచుట్టును గూరుచుండి స
న్మానము లందువారు కవితల్లజులే యఁట! నైజరాజధా
నీనగరంబు కృష్ణధరణీతలనేతకుఁ బేరు గన్న వి
ద్యానగరంబు గాఁగఁ దనరారుటలోన విచిత్ర మున్నదే?

చ॥ తెనుఁగు నృపాలుఁడై నరపతిత్వము కల్గిన వీరభద్రు పు
త్రిని, మతి యోఢ్రుఁడై గజపతిత్వము కల్గు ప్రతాపరుద్రు పు
త్రిని వరియించియుం దురక లేఁ దగు నశ్వపతీశు పుత్రిఁ గై
కొనక నృసింహకృష్ణుఁ డొనగూర్చెను బంక్తిని బక్షపాతమున్.

సీ॥ ప్రబలను ధాత్రి యై రక్షించు నొక్కతె,
సిరు లిచ్చి మనుచును శ్రితుల నొకతె;
నిరతక్షమాఖ్యతోఁ జరియించు నొక్కతె,
శ్రీకాంత యనఁగను జెలఁగు నొకతె ;
సుగుణంబులను సనతగ నొప్పు నొక్కతె,
యగును జంచల చూపులందు నొకతె ;
రమణుని పలు గారవము లొందు నొక్కతె,
మగని యెదకు హత్తి మసలు నొకతె ;
భూసతియు శ్రీసతియు నాఁగ వాసి గాంచి
యున్న యన్నపూర్ణాదేవియును దిరుమల
దేవియును బట్టపుదేవు లై వెలసెను
గృష్ణరాయప్రభుండు శ్రీవిష్ణునిభుఁడు.

తే॥ గీ॥ కనె సుతల మోహనాంగి నైన నను దిరుమ
లాంబయందు, నా చెల్లె లైనట్టి వేంగ
ళాంబ నన్నపూర్ణాంబికయందు మాదు
జనకుఁ డగు కృష్ణరాయ రాజన్యమౌళి.

సీ॥ ఆముక్తమాల్యద నంకితం బందిన
యిలు వేల్పు శ్రీవేంకటేశ్వరుండు,
తత్ప్రబంధంబునందలి కథానాయకుం
డై యున్న శ్రీరంగనాయకుండు,
తనుఁ దత్కృతి రచింపు మని కలం బ్రత్యక్ష
మైనట్టి శ్రీకాకుళాంధ్రవిష్ణు,
నా ప్రబంధంబు వ్రాయక మున్నుఁ దాఁ గొల్చి
నట్టి శ్రీసింహాచలాధినేత,
సర్వగతుల రక్షింప రాజపరమేశ
రాజరాజాధిరాజ వీరప్రతాప
మూరురాయరగండప్రముఖబిరుదస
నాథుఁ డై కృష్ణరాయభూనాథుఁ డలరు.

కం॥ ఏవంవిధచరితునకు, శ్రీ
తావనసమయస్ఫురద్దయాభరితునకున్,
శ్రీవేంకటేశపదసం
సేవాపరిలబ్ధపుణ్యజితదురితునకున్.

కం॥ విద్యాభోజునకుఁ బ్రచం
డద్యుమణిసమాన తేజునకు, శ్రితపాళీ
సద్యస్సురభూజున, కన
వద్యగుణసమాజునకు నవమనోజునకున్.

క॥ హరిచందన హరచందన
శరకుందనవారవింద శశిశర దంభో
ధర తారక ధరతారక
దరహీరక హార తుషార ధవళ యశునకున్.

క॥ స్వభుజాయత బలశమిత ది
గిభునకు రఘుముఖ్యపూర్వనృపతినిభునకున్,
త్రిభువనశుభకరగుణసౌ
రభునకు నరసింహకృష్ణరాయవిభునకున్.

శ॥ అమితనిజాశ్రితగృహ వ
ర్ధమానబహువస్తువాహధనకనకనకన్
విమతాళికనకనకు ని
ర్మమతాగుణజనకనకను మజ్జనకనకన్.

వ. సభక్తితాత్పర్యంబుగా సాష్టాంగదండప్రణామంబు లాచరించి తద్రాజకందర్పజనకునకు సమర్పణంబుగా నాచే నొనర్పంబడిన శ్రీమారీచీపరిణయప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

క థా సం గ్ర హ ము

1 వ ఆశ్వాసము.—పదునాలుగేండ్లబాలిక యొకతె దక్షిణసముద్రతీరమున శరత్కాలపూర్ణిమారాత్రి నొంటిక త్తెయై యాటలాడుకొనుచుండఁగా, విశ్వామిత్రయాగావనము చేయుచున్నలక్ష్మణుని బాణముచేత తూలఁ గొట్టఁబడిన మారీచుఁ డచ్చట గబాలున మీఁదినుండి పడి మూర్ఛ చెంది, యాబాలిక చేసిన శీతలోపచారములవలన సేదదేఱి, యామె కంతవఱకును మాటలాడు సామర్థ్యము గాని ప్రపంచజ్ఞానము గాని లేకుండుట యెఱింగి, సరస్వతిని బ్రసన్నురాలినిగాఁ జేసికొని, యా బాలికకు సర్వభాషాజ్ఞానమును, వేదశాస్త్రాది విద్యాజ్ఞానమును, ప్రపంచజ్ఞానమును కలిగించి, దండకారణ్యమున నొక పర్ణశాలయందు నామెయుఁ దానును నివసించు చుండును.

మారీచుని పుత్రిక యై యా బాలిక మారీచి యైనది.

2 వ ఆశ్వాసము.—మారీచి యడుగఁగా మారీచుఁడు తన వెనుకటి వృత్తాంతమా మెకుఁ దెలుపును. (ఆవిధముగా రామాయణకథ సీతారామలక్ష్మణుల పర్ణశాలానివాసమువఱకును నడుచును.) మారీచుని పర్ణశాలకు సమీపమునఁ గల పుష్పోద్యానమందు మారీచీలక్ష్మణు లొండొరులను జూచుట తటస్థించును. వారి కొండొరులపై మోహ మంకురించి, మొలకెత్తి, యెదుగసాగును. అది తెలిసి మారీచుఁడు లక్ష్మణునిపైఁ దనకుఁ గలభయముచేతను గోపముచేతను దన నివాసము లంక కీవలియొడ్డునఁ గలసముద్రతీరమునకు మార్చుకొనఁగా, పుష్పకముపై రాకపోక లొనర్చు రావణుఁడు మారీచిని జూచి మోహించి, యామెను దొంగిలించికొనిపోవుటకై సమయ మరయుచుండును. మాయలమారీచుఁడు జీవించియుండఁగా అట్టిపని సాధ్యము కా దని వాఁడు తెలిసికొనును.

3 వ ఆశ్వాసము.—శూర్పణఖాపరాభవము. ఖరాదులమరణము. శూర్పణఖ రావణునితోఁ దన పరాభవమును, సీతారామలక్ష్మణుల వృత్తాంతమును దెలిపి, సీతాపహరణమునకుఁ బ్రేరేచును. అంతకంటె మారీచ్యపహరణమును, మారీచమరణమును ముఖ్యముగాఁ గోరుచున్న రావణుఁడు తగినమిష దొరకుటకు సంతోషించి, మారీచుని మాయలేడిగాఁ బంపించి, చంపించి "రామరామా" యని యేడ్చుచున్న సీతను, " లక్ష్మణలక్ష్మణా, " యని యేడ్చుచున్న మారీచిని బలాత్కారముగా లంకకుఁ గొనిపోయి, వేఱుచోట్లఁ బెట్టును.

4 వ ఆశ్వాసము.—సీతాన్వేషణము. సుగ్రీవసఖ్యము. సుందరకాండకథ. సేతుబంధనము.

5 వ ఆశ్వాసము.—యుద్ధము. లక్ష్మణమూర్ఛ. పదునాలుగేండ్లు నిద్రాహారములు లేని వారు సంజీవి పోసినచే తప్ప పదునాలుగేండ్లు నిద్రాహారములు లేని లక్ష్మణుఁడు మూర్ఛ లేవఁ డని జాంబవంతుఁడు చెప్పఁగా, అట్టిది మారీచి యని నారదునివలన విని యామెను చెప్పించి, హనుమంతుఁడు తెచ్చిన సంజీవిమూలమున రాముఁడు లక్ష్మణుని బ్రదికించుకొనును. నిరాశలో రాముఁడు యుద్ధము మానుకొనఁబోఁగా, నారదుఁడు రావణునికి బ్రహ్మవలనఁ గలిగిన శాపమును గూర్చి చెప్పును. ఆ శాపమేమనఁగా:—రావణుని తపస్సునకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై వరము కోరుకొ మ్మనఁగా రావణుఁడు తనకుఁ జావులేమి కోరెను. అది స్వభావవిరుద్ధ మని బ్రహ్మ యనఁగా, "కూఁతును గామించుట మాత్రము స్వభావవిరుద్ధము కాదా? అట్టిది జరుగు చుండుట లేదా ? తాతా," యని రావణుఁడు గేలి చేసెను. "కూఁతును గామించినచే నీకుఁ జావు కలుగఁ గలదు; అంతవఱకును గలుగదు," అని బ్రహ్మ యదే శాపముగాను వరముగాను బలికెను. ఈ శాపవృత్తాంతము తెలిపి నారదుఁడు, " రామా, బ్రహ్మశాపము ఫలించి రావణుఁ డీకఁ జచ్చుట తప్ప," దని తెలుపును. అది యెట్లనిన: నలకూబరునికడకుఁ బోవుచున్న రంభ కైలాసప్రాంతమున రావణుని కంటఁ బడఁగా, వాఁ డామెను బలాత్కరించి పోయెను. సద్యోగర్భమున రంభ యొక స్త్రీశిసువును కని జుగుప్సకతమున దాని నచ్చటనే పాఱవైచి చనియెను. ఆ శిశువు రోదనము విని కైలాసమునుండి పార్వతీపరమేశ్వరులు దిగి వచ్చి, యా శిసువును దమ విమానముపై నెక్కించుకొని, యా బాలిక నెవ్వరైనను పీసి పెంచువఱకు నహాయము గాని యాఁకలినిద్రలు గాని కలుగకుండునట్లు వరము లిచ్చి, సముద్రతీరమున డించి పోయిరి. ఆమె యచ్చట నొంటిగా పదునాలుగేండ్లుండి తుదకు మారీచుని పుత్రిక యయ్యెను. కాఁబట్టి మారీచి రంభారావణులపుత్రిక. పుత్రికను గామించిన రావణుఁడు చచ్చుట తప్ప దని నారదుఁడు రామునికిఁ దెలుపును.

6 వ ఆశ్వాసము.—రావణవధ. సీతాగ్నిప్రవేశము. సీతారామలక్ష్మణు లయోధ్యకు తిరిగివచ్చుట. ఊర్మిళాదేవినిద్ర. ఆమెపాలయబుక. మారీచీపరిణయము.

మారీచీపరిణయచతుర్థాశ్వాసాది ని ట్లున్నది:—

"కం॥ శ్రీ సుమశర సమరూప వి
లాస విభాసుర సుపుత్ర లాభప్రాప్త!
శ్రీసామ్య తిరుమలాంబా
వాసహృదయ! కృష్ణరాయ వసుధాభ్యుదయా!

వ. తండ్రీ! నాయొనర్చినపుణ్యం బగణ్యం బగుట నిస్సంశయంబు. ప్రశంసాపూర్వకంబుగా మీరు నాకరంబున నిశ్చయతాంబూలంబు పెట్టినది యెట్టి శుభముహూర్తంబో కాని, మీరు పరిగ్రహించి ధన్యం జేయనెంచిన నా కావ్యకన్యకరచరణాద్యవయవంబు లేర్పడి మత్కవితాగర్భంబునుండి వెలువడకమున్న వెలందుల తలమిన్న యైనమాయంబ తిరుమలాంబాదేవి గర్భంబు ఫలించి, పాలకడలి సంతానంబు వడువున నామె చిరకాంక్షితపుత్రసంతానంబు పడసినది. సదాశివు సత్కృపం బొడమిన మాతమ్ముఁడు సదాశివుఁడు శుక్లపక్ష యామినీధవుఁడుంబోలె దినదినప్రవర్ధమానుం డై, సౌందర్యంబునఁ గందర్పసమానుండై తల్లిదండ్రుల రగు మీకు, నక్కలమగు మాకుఁ దక్కుం గల యెల్లవారలకు నల్లారుముద్దుగాఁ బెరుగుచున్న వాఁడు.

శా॥ మార్కండేయచిరాయువుఁ, సకలసామ్రాజ్యంబు, నాచంద్రతా
రార్కం బైనయశంబునుం గలిగి, యే యంశంబునన్ దోషసం
పర్కం బొందక, కోరుటే తడవుగా మా ముద్దుతమ్ముఁడు తాఁ
గోర్కుల్ తీరి, సదాశివుం డగుచు నీ క్షోణిన్ మహిం గావుతన్ !

వ. చిరకాల మనోభీష్టసిద్ధిచే సంతుష్టాంతరంగుండ నై యున్న యో తండ్రీ! పరాకు మాని యవధరింపు,. మనంతరకథావిధానం బెట్టి దనిన:—

---

## ఏరిన పువ్వులు

స్థానాపతి సత్యనారాయణ శాస్త్రిగారు, కవితాసమితి.

---

ఉ॥ భూరిత రేభగండ మదపూర్ణత వర్ధిలి సారకైరవో
దార పరాగబంధుర నితాంత సుగంధ కృతాంగమై సదా
మీరెడు షట్పదం బకట మేదుర నింబ సుమార్కనాటి సం
చార మొనర్పఁగావలసె శాత్యవిధిన్ గురుతింప శక్యమే.

చ॥ అరయఁగ బంధుమధ్యమున నర్థములేక వసించుకంటె భీ
కర వృక భల్లుకాది మృగకాండ వికీర్ణ మహాటవీస్థలిన్
వరలుచు కందమూల ఫల పత్రములన్ భుజియించి శాద్వలాం
తరముల బండినారల ననారతమున్ ధరియించు టొప్పగున్.



# ఉష

కామరాజు బాపయ్యగారు

భయద జీమూత మందిరద్వారసీమ
కలుషజీవిత దీపికాకాంతిలోన
వేసరిల్లక దర్శింప వేచియుంటి
ఆరిపోవునె జీవిత మంతలోనె?
దుస్తరవిషాద వేదనాతుహినకరుని
బాధ కోర్వంగలేదు హృత్ప్రసవ మింక
క్రుంగి కృశియించి ఏనాఁడొ కుమిలిపోవు
నీదు ప్రేమార్ద్ర హృదయాన నిలువనిమ్ము.
ఈ యనంతభారమ్ము వహింపలేక
భువిని హృదయతంతువె తెగిపోవునేమొ
వేచియున్నది. ఆశతో విశ్వ మెల్ల
శ్రావ్యమంజులగీతికారవముకొఱకు.
స్వాదుజీవిత ప్రేమరసమ్ముతోడ
నేఁడు హృదయపాత్రిక నిండ నింపినాను
భగ్న మయిపోయి ఏనాఁడొ పదటఁ గలియు
ద్రావఁగా రమ్ము ప్రేయసీ! తనివి దీర
చలితధవళాంశు కాంచల ఛటులలోన
మందగమనాంబుదచ్ఛాయ మలసిపోవ
స్ఫీతగండస్థితస్వేద శీకరమ్ము
మంచు ముత్యాలసరులలో మాయ మయ్యె.
జ్వలిత హేమ మంజీర నిక్వాణవితతి
కలవిహంగమ ధ్వనులలో కలసిపోవ
దరవికస్వర ప్రసవపత్త్రాలలోని
నళియు నీలాలకమ్ముతో నాట్య మాడె.
ఆమె దివ్యమంజుల దరహాసరేఖ
అరుణరాగార్ద్రజ్యోతిలో నలసిపోవ
స్వాదుమృదులమృణాళికావంశి నూఁది
ప్రణయగీతిక లెన్నెన్నొ పాడుచుండె.
నిదురవోయిన విరికన్నె నెమ్మొగమ్ము
విస్మయానందభరిత మై విరిసికొనఁగ
నంత తారకాసుమకాంత అలసిపోయి
శ్యామలాంబరశయ్యపై శ్రాంతి నొందె.

తరుణదరహాసచంద్రికా ధవళకాంతి
శీర్ణ హృదయనిర్గతదుఃఖశిఖిశిఖాలి
మిళిత మై నవసాంధ్యలో మెఱసిపోవ
ప్రణయలీలాప్రసన్న వై పలికినావు.
"నీదు శ్యామికా హృద్వీథి నిర్నిమేష
తారకా వీక్షణాల ప్రసారకలన
కలుషజీమూతసంఘమ్మె కాల్చివైతు
దీనహృదయునివోలె రోదింపవలదు.
నేను సుప్రభాతప్రభాశ్రీని గాన
లలితలావణ్యప్రేమైకలక్ష్మివోలె
మెఱసిపోదును హృదయాబ్జ మృదులవీథి
విరియనిమ్ము హృత్ప్రసవంపు సిరుల నెల్ల
ఎడతెగక దుఃఖ మెదను దహింపనిమ్ము
కుటిలలోకమ్ము నిప్పులఁ గురియనిమ్ము
స్వాదు మాధ్వీక కవితారసమ్ముఁ గ్రోలి
గాన మొనరింప వేమోయి కవికుమార?"
ఈ విషమ విషాదభరిత హృద్విపంచి
తరుణ మృదులాంగుళీస్పర్శ ధన్యమయ్యె
ప్రణయలోకాన భావసామ్రాజ్యరాజ్ఞి
ప్రేయసీ! ఉషాదేవి! నా పిలుపు వినుము.
"దారుణ వియోగజనిత బాధావిషమ్మ-
శృంఖలాబద్ధ దుర్భర జీవితమ్ము
ప్రళయ భీకరోజ్జ్వల దుఃఖజ్వాలలందు
కరగి కన్నీటికాల్వ లై కనులజాఱు.
హృదయనిర్గత రుధిరవాహినులవోలె
వఱలుచున్నవి మిన్నేటి తరఁగలిపుడు
తావకీనపదతలాన జీవితమ్మె
పాడివైతును కడసారిపాటగాఁగ.
సకియ! నా జీవితాంతంపు సమయమందు
నీదు హృదయాన ప్రణయమే నిలిచియున్న
విరియనిమ్ము నీ ప్రేమార్ద్రవీక్షణాల
ప్రాణ మంతయు హాయిగా వదలివైతు.

# పుక్కిటిపురాణము—కొన్ని తునుకలు.

పూడిపెద్ది వేంకటరమణయ్యగారు, కవితాసమితి.

ప్రభాతము

కడవెలుంగున నడరు చుక్కలను మింటఁ
జల్లు లాడుచు ప్రాచీదిశా విశాల
వీథిఁ జంచూచలన శోణ వీచు లుఱుకఁ
గూసెఁ దలమెత్తుచుఁ బ్రభాత కుక్కుటమ్ము.

పసుకరొమ్మొత్తి చిక్కులుపడ్డ విమల
మందమందానిలతరంగమాలికలను
సుమదళానేకముల సౌరభములు వెడలఁ
బ్రక్క కొత్తిలి మేల్కొనెఁ బగలు పడఁతి.

విమల బాలార్క కర నికరముల నొదిఁగి
కరఁగి దినకాంత చెక్కులఁ గావి నించె
దిక్తటుల రాగసంపద దీటుకొనియె
ప్రణయగీతాలు ప్రకృతి విపంచి మ్రోఁగె.

మింట దినరాజు తళతళ మెఱయువేళ
మధురజీవన శోభాయమానము లగు
సరసుల గభీరహృదయాలజాడ లెతేఁగి
సంచరించెడు నవసరోజమ్ము పోలె
విరియునే ? కాండపట పరంపరల డాఁగి
ముకుళితమ్మైన జవరాలి మోముదమ్మి.

ప్రకృతి నిరుపమ లావణ్య భాగ్య మరయ
వదలు చీఁకటి కన్నురెప్పలు తొలంగ
జదలు తెఱచెను దొంగలి జగము కన్ను
తెఱచెనో మూసెనో యేరి కెఱుక కడఁక
వెలుఁగెఱుంగని తెరచాటు వెలఁదికన్ను.

చలువతెరదాటు నీరెండ జాడఁ దడవి
వలపు విందిడు గాలిసంపర్క మెతేఁగి
జాలువాతెడు పికగీత మాలకించి
నిలుచునే యంతిపురిలోని బెళుకుగనులు
వేయితెరఁగలవెలుపల వెల్లివిరియు
సోయగ మ్మొక్కపరి తొంగిచూడకుండ.

పులుఁగు కదుపుల ముద్దుపల్కులను విఱిచి
భావముల నేతి తొలిప్రొద్దు కావితీవ
మీఁటి నవసాంధ్యరాగము మేళవించి
ప్రకృతి కృతిఁ బాడఁగల దాసిపజ్జ నున్న
తెరమఱుంగున నడఁగునే తెఱవమిన్న.

అనుపమైఁ బట్టుతెర వీడు నాకుచిల్క
చీఁకటుల దాటు లేప్రొద్దు జిలుఁగు బిళ్ల
పద్మగర్భమ్ము వెడలు బంభరయుగమ్ము
సోయగము—మోముతళుకు—కన్దోయిబెళుకు
రాణివాసమ్ము విడుజవరాలిసొంపు
పుడమి కెల్లను బెట్టని భూషణమ్ము.

చెలియ చేయూతఁ దెరదాఁటి చిటుకుపొటుకు
నడచి తొలిసారి జగముసౌందర్య మరసి
పొలఁతి కనురెప్ప లల్లాడ మోము విరియఁ
బలుకు నిట్టుల నచ్చెరుపాటు నొంది.

నాయిక

"తలపు తొలిప్రొద్దు వెలుఁగు నిద్దంపుఁదళుకు
టద్దమున ముద్దు లొలుకు బ్రహ్మాండపటము
వెలఁది ! యేలలితకళాప్రవీణుఁ డింత
పనివడి రచించెనో దిద్దుబాటు లేదు !"

చెలియ

బ్రహ్మ

"మున్ను వెన్నుని మురిపెంపు బొడ్డుదమ్మి
లీలమై నాడికొన్న యా బాలకుండు
మంజుగతి సృష్టిచిత్రాల మలఁచు శిల్పి
వరుసఁ దప్పని వేదాల పాటగాఁడు
పలుకులవెలంది నెతేఁగిన పండితుండు
వివిధలలితకళావంతుఁ డువిదన ! యజుఁడు.

నాల్గుమోముల నొప్పు నీ నలువ తొల్లి
నైదుమోములు గలవేలుపంట చెలియ !
జగము రచియించు నానాఁటి జాణతనము
చతురతర మైన దన్న నాశ్చర్య మున్నె ?
తరుణి ! యీతాత మున్ను విద్యాధనమ్ముఁ
గోలుపోయిన వెంగలి గోల యయ్యె !
అఖిలజగమును విపరీత మయ్యె నాఁడు
కడలిగర్భానఁ బొడమె సంగ్రామభూమి."

నాయిక

"అంతిపురమునఁ గాండపటాంతికమున
నాఁడు నీరెండచాయలజాడ లరసి
మురిసి యానందబాష్పముల్ గురిసి తేను;
ఇంత భాస్వంతమే రవికాంతి యింతి !"

చెలియ

రవి

"కంజలోచను నీలవక్షమ్మునందు
మెఱయుఁ గౌస్తుభమణిపోలె మిన్నుఁ ద్రోవఁ
దళతళల వోవు గగనరత్న మ్మతండు
భాస్కరుఁడు సర్వశాస్త్రార్థపారగుండు !"

అంజనీసుతుఁ డీ తరుణార్కబింబ
రుచులఁ బరిపక్వ ఫల మాధురులఁ దలంచి
మరఁగి కబళింపఁ జని హనూమంతుఁ డయ్యె
ఘన ఫలాపేక్ష దుఃఖభాజనము చెలియ !

మే నొలిచి యాచకున కిడ్డ మేటి దాత
స్వామికార్యానుకూలదీక్షారతుండు
వీస మడివోని భారతవీరవరుఁడు
కర్ణుఁ డీ వేఁడివేలుపు కన్నకొడుకు
ఇనకులము క్షాత్రమునకుఁ బెట్టినది పేరు.

నా యి క

" రమణ సుకుమారకుసుమసౌరభ తరంగ
మాలికల వెల్లిగొల్పుచు మందగతుల
నోలపాటల నిచట వాహ్యాళి సలుపు
నితఁడు మగువలఁ గని యోసరిల్లెడమ్మ !
గంధవహుఁ డన్న మగవాఁడు గాఁడె ? చెలియ !"

చె లి య

గా లి

సర్వసముఁడైన యీ ప్రభంజనుఁడు—వనిత !
సృష్టిలోఁ గల చేతనాచేతనముల
భేద మెన్నక, డాకొన్న ప్రియునివోలె
గూరిమి రచింప నెనసి యక్కున గదించు
నిట్టి యవ్యాజపుం బ్రేమ మెసఁగ జగము
నోజఁ బాలించు మహనీయుఁడే జగత్తు.

కాన్కగా నిడ్డ విమల ముక్తాఫలాల
నాత్రమునఁ జీల్చి రామనామాక్షరముల
నరయు భాగవతోత్తము నంతవాని
తండ్రి యగునీతఁడే జగత్ప్రాణుఁ డబల.

సింహబలు వ్రేలికొనలఁ జీల్చిన బలిష్ఠు
మొనసి రారాజు దునిమిన పోటుబంటు
భీము, నానాఁటి భారతవీరుఁ దొల్లి
పడఁతి ! పడసిన యమ్మహాబలుఁ డితండు.

వనితి ! యీశుని కన్ను రెప్పల మెలంగు
విమలతేజస్వి నతులపవిత్రచరితుఁ
బావకుం డనఁ బొప్పు దిక్పతిని గన్న
జనకుఁ డీతఁడు వాయవ్యచక్రవర్తి.

నా యి క

ఇంతి! యాక్రేవ సౌధల నెత్తి మనల
నచలుఁ డై చాటు చాటున నరసి యరసి
మిన్న ముట్టెడుఁ గనుమా మహోన్నతుండు!
ఘనుల చూడ్కులు నిత్యనిష్కల్మషములె ?

చె లి య

కొం డ

పడఁతి ! ముగ్గిన నేరేడుపండు మోము
మొగిలు తెరలోన దాఁగుడుమూఁత లాడ
జగముశృంగార మెల్ల నిశ్చలతఁ జూచు
నతఁడు నగరాజు వస్తుతత్త్వార్థవేది !

గండుతుమ్మెదలట్లు పక్షములఁ జూచి
యీ గిరులు దిక్తటమ్ముల నెగసెనంట !
పృథ్వి పూవయి యానాఁడు విరిసె నేఁడు
వారిధులు తేనెకాల్వ లై పారె నేమొ
చెలియ ! తెలియదు మనతొంటిసిరులమేర !

మఃనికి సవినయసాష్టాంగమును రచింప
బడుగువలె నేలనిలువునఁ బడ్డవింధ్య
నిలువ దీ నాటికిని వాని నియతి లేక
ఉవిద ! భక్తికి భారతీయులది పేరు !

కలికి యీపర్వతమ్ముల కులముసామి
కలిమిలేముల పగ్గాలఁ గట్టువడక
కన్నకూఁతును బేదజంగమున కిచ్చెఁ
భారతము కన్నెదాతల పంటనేల !

కడలినడుమనుగూడ మార్గమునఁ బోవు
నాంజనేయున కాతిథేయమ్ము నిడ్డ
నాఁటిగృహమేధి చెలియ మైనాకనగము.
భారతీయుల దతిథిసత్కారదీక్ష !

మున్ను సౌమిత్రి సంగ్రామభూమిలోన
నలుఁగు పోటునఁ బడి సొమ్మసిలిననాఁడు
ప్రాణదానమ్ము సేసెను ద్రోణనగము
నెలఁత ! మనదేశ మోషధీ నిలయసుమ్మ !

గోకులమ్మున తా వాన గురియునాఁడు
గోప గోగణముల తలగొడుగుగాఁగ
వఱలి పేరొందినట్టి గోవర్ధనమ్ము
శైలమే సుమ్ము ! దీనజనాళికెల్ల
వనిత మనభూమి తలదాఁచికొనెడుచోటు,

పాలవెల్లిని నివుల త్రిప్పటలఁ బొంది
వేలుపులకెల్ల నమృతంపు విందుఁ బెట్టి
ధన్య మయ్యెను దొల్లి మందరనగమ్ము
భారతీయులు ధర్మతత్పరులు తరుణి !

వెలది వెన్నెలపూవులు విరిసినట్లు
పాలచిమ్మల జల్లులు ప్రాకినట్లు
లలిత మై వెల్గునదియ కైలాసనగము
అదియ త్రిపురాంతకునకు సింహాసనమ్ము
పొలఁతి ! మనదేశ మెన్నిన పుణ్యభూమి!

మేరు వనఁ బర్వతమ్ములఁ బేరువడిన
శైలరాజమ్ము తప్తకాంచనమయమ్ము
బాణతీక్ష్ణము ధైర్యసంపన్న మబల !
నగములకు భక్తిపూర్వప్రణామశతము.

నా యి క

రమణి ! సవిలాసముగ నంబరమున కెగయు
కొండచరియలలో నాడికొను నొకర్తు
కెరలి యీతమ్మిపూఁదోఁట క్రీడ సలుపు
జల జలజగంధి ! తొలి తెరచాటు లేదె ?

చె లి య

న ది

మబ్బు చివురుల మించుజొంపముల నలరు
మిన్నుపూఁదోఁట వాహ్యాళి మెలఁగునామె
స్వర్ణదీకన్య నిర్మల స్వాదుశీల
మురిపెములప్రోవు వెన్నుని ముద్దుబిడ్డ.
చెలియ ! తెలినీటి జల్లు గజ్జియలస్రోత
చెలఁగ నటియించు. నీ విలాసిని వరించె
గరళకంఠుని నటరాజుగా నెఱింగి
జాహ్నవీకన్య లలిత రసజ్ఞురాలు.

వెలుఁగు నెలవంకతో మబ్బుబెడఁగుతోడ
తళతళలు వోవు నల వియత్తలమువోలెఁ
గరము పెంపొందు తన మనోహరుని శిరము
పుట్టినిల్లయి తోఁచుఁ గాఁబోలు ! చెలియ
శివు జటాజూటమున గంగ చిందులాడు.

నాఁడు సమసిన సగరసంతతి తరింప
నెలఁత యీ వినిర్మల నాకధునీ లతాంగిఁ
దనయుఁగ భగీరథుఁడు పెంచికొనియెఁ గోరి
పతిత దేశమ్ము నుద్ధరింపఁగఁ బవిత్ర
చరిత యీ లేమ యొక్కతె చాలునమ్మ !

ఇంతి ! తనపట్టిసవతిగ నెఱఁగి యెఱఁగి
యీ నదీకన్య హిమవంతుఁ డెలమిఁ బెంచు
ప్రవిమలాకార- సరళ స్వభావలలిత-
సరసగుణజాల- వంశభూషణము గాదె?

వీరుఁ డయ్యును సమరసాత్త్వికుఁడు రాగ
వర్తనుం డయ్యు నైష్ఠిక బ్రహ్మచారి
యస్త్రకౌశలుఁ డయ్యు సన్న్యాసివరుఁడు
త్యాగధనుఁ డయ్యు పృథులప్రతాపశాలి
భీష్ముఁ డీస్వర్ణదీకన్యబిడ్డఁ డమ్మ !
కలికి ! మన కెల్ల నీ వియద్గంగ, గంగ !

నా యి క

ఈ లలిత మనోహర వస్తుజాల మరసి
ఓ వెలఁది ! నా మనమ్ము నిల్పోపదయ్యె !
నక్కన గదింతునా ? వాని నాదరమున
ముద్దిడి తరింతునా ? బాష్పములు దొరంగ.

చె లి య

పా ము

తెలిచడుఁగుఁబోలు నెమ్మేని దిద్దుబాటు
కనులకాటుక, యీదలమణివిభూష
సడలిపోవని నవకమ్ము నడల తీరుఁ
గాంచి భ్రమఁ గొని ముద్దాడఁ గడఁగె దేల ?
నోట విస మమ్మ యీఫణీంద్రునకుఁ జెలియ !
ఈ పొదలలోన నెమ్మొగ మింతఁ జేసి
బెదరిచూచుచుఁ జిఱుకెంపు పెదవిఁ దడిపి
కొనుచు నన్య మెఱుంగని గోలవోలె
నొంటిమై నాడు నీ పాఁప యార్పుటలలు
సకియ ! ఘోరవిషానలజ్వాల లమ్మ !
విరియు గేదంగి పూరేకు తెరలలోన
జిలుఁగుదిండులఁబుప్పొడి సెజ్జఁ బండి
గాలిమీఁగఁడఁ దిని మంజుగానవీథిఁ,

దిరిగి వాహ్యాళి జగ మెల్ల మఱచు నిద్ది
భోగి యోఁగాని చెలి దీనిపొత్తు మిత్తి !
చిఱుసడికి కన్నుమనెడు నీ చిలువనేత
తలను దాలి మోసెనంట భూతలమునెల్ల
తరుణి ! నీ యుంగరాల ముంగురులనీడ
వాడిపోయెడు నీ నవవారిజమ్ము
బ్రహ్మ భరియింపదే బంభరమునుబోలె !
మధుర కలశాంబుధి తరంగమాలలోన
నెగయ బడబానలజ్వాల రగులుకొల్పె
స్వచ్ఛ మైనట్టి యుచ్చైశ్రవమ్ము మేనఁ
గందుఁ గల్పించె నీభుజంగంబ చెలియ!
పాపజాతికి విపరీతవర్తనములు.

పరులకు విసమ్ము వెట్టు నీపన్నగమ్ము
తాను గడుపార మధురామృతమును ద్రావఁ
బూరిఁ గఱవ నాలుక బీఁటవాఱెఁ జెలియ !
ఫలము దానానుసరణ మై వెలయుఁ గాదె?

చిన్నికృష్ణుఁడు మంజు మంజీర రవము
గడలుకొన నీయనంతునిపడగమీఁద
నతివ! సవిలాసముగ నృత్యమాడెనంట
యదిగొ ! కన్గొను మడుగుల యానవాలు
పడఁతి మిలమిలలాడు నీపాముఁ జూచి
బిచ్చగాఁడైన దిస మొలవేల్పుగూడ
భూషణమ్ముగఁ గంఠానఁ బూదివికొనియె
సోయగ మ్మొక్కటియె పూజనీయ మేమొ !
వెన్నుఁ డొకవేళ నిల్లాలి విందుకొఱకు
బడుకటింటను వంశానఁ బాడునేమొ
పాటరుచులను జొక్కు నీ పాఁపతేఁడు
విడువఁ డాగానలోలుని విరులపాన్పు
కలికి ! తొలిసేయు సర్పయాగమ్మునాఁడు
వేలుపులతేని గద్దియ వెనుక డాఁగి
ప్రాణముల నిల్పికొన్న యీ పాఁపతేడు
కోరి యీ పరీక్షిత్తును గూలఁబొడిచె
పరుల కుండదె తననంటి బ్రతుకుతీపు ?

పొలఁతి! యేమర్మ మెఱుఁగని ముద్దరాండ్రు
భారతీయ పురంధ్రు లీ పాము నెఱఁగి
సవినయమ్ముగ నాగులచవితినాఁడు
దీనిఁ బూజింత్రు పాలపంచేరము లిడి
శిష్టునకుఁ దుష్టునకుఁ గూడఁ జేయిమోడ్పు !

---

## జీవకణము

—విద్వాన్ కే. బి. కోటిలింగ దేవరగారు.

గీ॥ అనిల వియ దగ్ని వా ర్ధ్యాము లణుమయములు
తృణ. లతా గుల్మ వృక్షాదు లణుమయంబు
లఖిల పశుపక్షి క్రిమిజాల మణుమయంబు
లణుమయము గాని దేది బ్రహ్మాండమందు?

గీ॥ మహితవాగర్థములభంగి మాన్య మగుచు
ననిశ మొండొంటి వీడి శూన్య మగునట్లు
జీవమును వీడి కణమె ట్లభావమగునో!
కణము విడనాడి జీవ మా కరణి లేదు.

గీ॥ స్థావరాదిక ధాతుసంతతులయందు
గర్భితం బైనచిచ్ఛక్తి గాంచలేక
జడము జడ మని వచియించు జడమనస్కు
డంతియే కాని జడమొకం డవనిఁ గలదె?

గీ॥ తూలికాధూళి చేల మై క్రాలులీల
మృద్రజఃపాళి కుంభ మై యొసఁగుభంగి
నీ సమష్టిస్వరూపమే నిఖిలసృష్టి
నీ వియోగంబె లయము సంజీవకణమ!

గీ॥ సాంద్రతాశీతలోష్ణవైషమ్యకలన
చిత్రముగ నిన్ను నీవె సృష్టించుకొనుచు
ఖేలనము సల్పి క్షణములో ప్రీలుచుండు
నిరత పరిణామ శీలవే నీవు కణమ!

గీ॥ నీ సమాశ్లేష వైషమ్య నియతిఁజేసి
బాహ్యపరిణామమున జగద్భావమందు
దంతియేకాని నీ నైజ మింతయైన
శిథిల మొందదు సుమ్ము సంజీవ కణమ!

గీ॥ కూడునప్పుడు మోదంబు వీడునపుడు
ఖేదమును లేక నిత్య మామోద మెసఁగ
చిత్రగతి సృష్టి లయములఁ జేసికొనుచు
చెలఁగుచే నీదు నైజంబు జీవకణమ!

గీ॥ చటుల జీమూతపటల గర్జారవంబు
మృదువిపంచీగుణక్వణామృతరసంబు
బాలికా కలకంఠ నిస్వానకలన
నీ వికంపన భేదముల్ గావె కణమ!

గీ॥ మృదుశిరీష లతాంత సంపదలయందు
మృదుతర మరందబిందు సద్బృందమందు
మృదులతమ మగు పూపతెమ్మెరలయందు
నీ విరళభావ భేదంబె జీవకణమ!

గీ॥ కఠినలతికాప్రకాండ కార్కశ్యమునకు
కఠినతర దారుశైల కార్కశ్యమునకు
కఠినతమ లోహ వజ్రకార్కశ్యమునకు
నీ విఘట్టన భేదంబె జీవకణమ!

గీ॥ గ్రహము లొండొంటిఁ దాఁకి చూర్ణమయినపుడు
చూర్ణితాజాండములు నీట స్రుక్కినపుడు
ఘోరవిలయాగ్ని జలరాశిఁ గ్రోలినపుడు
అంత్యకాలానిలం బగ్ని నార్పినపుడు.

గీ॥ అనిలచలనంబు మింటిలో నడఁగినపుడు
మిన్ను సూక్ష్మించి బుద్ధిలో మెలఁగినపుడు
బుద్ధి యవ్యక్తరూపంబుఁ బొందినపుడు
చెడనిదానవు నీవెకా జీవకణమ!

గీ॥ ప్రకృతి పురుషస్వరూపమై వఱలు నీవె
యాదికారణమనియె కణాదమేని
జగదుదయ లయ శక్తిసంసక్త వగుట
దేవుఁ డెవ్వఁడు నీకంటె జీవకణమ!

* *
*

* *
*

* *
*

## మల్లిక

చిలుకతెక్క హొరంగు పుట్టము
లలిత లతికాంగమున జాఱఁగఁ
పలిత పీత పలాశ కంచుక
కలిత వైతివి మల్లికా.

ననలు దొడిగిన నీదువన్నియ
కనుల కింపగుఁ గమ్మవిల్తుని
మొనలు నూఱిన వెండిముల్కుల
దొనల గనివలె మల్లికా.

నెవ్వగల సకి వేయినోళుల
నవ్వినట్టుల పూచి తావుల
త్రవ్వి నింపితి వెల్లతావులఁ
బువ్వుఁదేనియ మల్లికా.

కమ్మతెమ్మెర కొంటెకుఱ్ఱఁడు
తుమ్మెదల ముడివిప్పగమితో
దొమ్మిగా నీసారభస్వము
చిమ్మిపోయెనె మల్లికా.

అందముగఁ గైసేసి వేసఁగి
సందెవేళ వృషాంగసంగతి
నంది యేల కృశించిపోయెదు
మందమతి వై మల్లికా.

సలుపవే నెత్తావి కరువలిఁ
గలుపవే పూఁదేనెసోనల
నిలుపవే నీరూపు వెలుఁగున
పొలుపు మీఱఁగ మల్లికా.

# బెంగాలిభాష - ఉచ్చారణ

శ్రీయుత. బిజయ గోపాలరెడ్డిగారు బి. లిట్ విశ్వభారతి.

౧

ప్రస్తుతము భరతవర్షమున నూతన జాగరణ (Awakening) ను కాంచుచున్నాము. రాజకీయవిషయములయందును, సారస్వత విషయములయందును, చిత్రకళావిషయములందును,గృహపరిశ్రమలలోను కొలదికాలముక్రితము మనల ఆవరించియుండిన జడత్వమును త్రోసివైచితిమి. దేశమును సకలవిధముల ఉన్నతపదవికి గైకొనిపోవుటకు యత్నించు చున్నారము. ఈ నవ చలనమునకు హేతువులు ముఖ్యముగ రెండు:—

ఈ జాగరణ ఝరణ (ఝరి) ప్రపంచములోని సర్వదేశములందును ప్రవహించి, ఆయా వాఙ్మయములను, కళలను సస్యవంతములుగ నొనరింప గలుగుచున్నది. ప్రజల రాజకీయఅభిప్రాయముల మార్చివైచుచున్నది. అట్టితతి,బహుకాలమునుండియు గొప్పనాగరికత ననుభవించి, పెక్కు నాగరకమత గంగాప్రవాహములకు గంగోత్రియై అలరారుచుండిన యీభరతవర్షము సహితము మేల్కాంచుటలో అబ్బురము లేదు.

ప్రాచ్య పాశ్చాత్య నాగరికతా సమ్మేళనము రెండవ కారణము. మనల పరిపాలించుచున్న ఆంగ్లేయులు మన కొసగు విద్య మనకు నూతనభావములను, నూతన ఆదర్శముల నొసగినది. ఇవియే మనసు స్తతఅభిప్రాయముల గుచ్చి పైకి నెత్తగలిగినది.

ఈ రెండుహేతువులచే మనదేశములోను జాగరణ వసంతపవనము వీచి, మృతప్రాయములగు సారస్వత తరు లతాదుల చిగురింప జేయగల్గినది. ఇక భావి ప్రబుద్ధభారతవర్షము తన మధురపరిమళముల నల్దిక్కుల ప్రసరింపజేసి, తన పూర్వ ఉన్నతపదవిని అనతికాలములోనే చేరగలదనుట నిస్సందేహము.

కాని, భారతవర్షము రాజకీయ, మత సాంప్రదాయముల ననుసరించి ఒకే దేశమని పిలువబడుచున్నను, నిజముగ నిదియు ఐరోపావలెనే ఒకఖండము. ఇందును పెక్కుభాషలు, పెక్కుజాతులు, పెక్కుమతములు గలవు. మన అభాగ్యవశమున, ఒకప్రాంతమునకును, మరియొక ప్రాంతమునకును సామీప్యసంబంధము కుదురుటకు వీలుగాని పరిస్థితులు ఏర్పడియున్నవి. ఈపరిస్థితుల నిటులే యుండనిచ్చి, మనమును ప్రస్తుత మున్నరీతినే విశీర్ణమైయుండిన యీ అభివృద్ధిని సూచించుచున్న శకోదయమునుండి విశేషమైన సహాయమును పొందనేరము. ప్రతి ప్రాంతమునందును, జాగరణ తన్ను ఏవిధముగ వ్యక్తపఱచుకొనుచున్నదియు, యేరీతి క్రొత్త పంథల ననుసరించుచున్నదియు, యెటుల మానవహృదయములపై నూతన అభిప్రాయములతో ఆధిపత్యమును చలాయించుచున్నదియు తెలిసికొన ఆవశ్యకత మెండు. ఇట్లు ఒకరి నొకరు తెలిసికొని, సానుభూతి జూపి అందలును ఏకమనస్సుతో పని జేసినగాని, ఫలితమును పొందనేరము. ఈ జాగరణావస్థ త్వరలోనే తిరుగ మూర్ఛిత యవస్థగ మారిన మనకును నెంతయో ఆశాభంగకరముగ నుండును. అట్టి విషమావస్థ ఆసన్నము కాకమునుపే, యెల్లవారును యీవిషయమై మేల్కాంచుట మేలు.

ఈ క్షుద్రవ్యాసమున బెంగాలినిగురించి కొంత చెప్ప దలంచుచున్నాడను. ఈ నూతన జాగరణ మధుర వేణుగానమునకు ఫణముల విప్పి నాట్యము సల్పుచున్న కృష్ణసర్పములలో 'బాంగ్లా' కృష్ణసర్పము ప్రధానమైనది. అది అన్నిటికన్న ముందుగనే,ఆమురళీనాదస్వారస్యమును గ్రహించి పారవశ్యము నొందినది. ఇతర వాఙ్మయములు కొన్ని ఉయ్యెలలోను, కొన్ని కౌమార ప్రాంగణమునందును, కొన్ని నవయౌవనములోనుండ, యీ బాంగ్లా వాఙ్మయరాజము పరిణితయై, సంసారమధువును ఆస్వాదించుచున్నది. కనుకనే, యీపె యన్న తన కుటుంబములోనియితరులకును, యిరుగుపొరుగువారికిని యింతగౌరవము, యింతశ్రద్ధ. ఆపెయే గృహిణి. ఆపెయే యింటిపెద్ద. స్వాభావికముగ, ఆపరసారస్వత కిశోరములు తమ జ్యేష్ఠ సోదరి, నాయకురాలును నగు బాంగ్లా వాఙ్మయపు అభివృద్ధి, సొంపు, కులుకుల చమత్కారముల గమనింపవలసి యున్నది.

రవీంద్రనాథుఁడు వంగ సాహిత్య గగనమండలమున రవి మాడ్కియే విరాజిల్లి, తనసహస్రకరముల నల్దిక్కుల ప్రసరింపజేయ మొదలిడినతతినుండియు, పెక్కుమంది ఆంధ్రులు, బెంగాలి సాహిత్య విషయమై తెలిసికొన కుతూహలులగు చున్నారు. అందులో, అనుకూలపరిస్థితుల పొందిన కొలదిమంది, ఆభాషనుగూడ నేర్చుకొని, దాని సాహిత్య మీమాంస చేయదొడంగిరి. క్రమేణ బెంగాలి నేర్చిన ఆంధ్రులసంఖ్య కొలఁదికొలఁదిగ హెచ్చుచున్నది. మఱియు ఆభాషను నేర్చుకొనవలయు ననెడి ఆసక్తియు, యితరులయందు అధికమగుచున్నది. బెంగాలి నేర్చుకొనబోవువారికి, ఉచ్చారణవిషయమై యీ వ్యాసము కొంత సహాయపడగలదని నమ్మిక.

అక్షర శాస్త్రజ్ఞులు బాంగ్లా అక్షరములకును, నాగరి అక్షరములకును సంబంధమున్నదని వక్కాణించుచున్నను, బెంగాలి లిపివేరనియే చెప్పవచ్చును. బెంగాలి హిందీలలో అక్షరముల సంఖ్యలో భేదములేదు. మనదేశములోని పెక్కుభాషలవలెనే, అ, ఆ, ఇ, ఈ, క, ఖ, గ, ఘలు గలవు. కాని ఉచ్చారణలో కొంత భేదము కలదు. కాన బాంగ్లా ఉచ్చారణ యితరప్రాంతీయుల కలవడుట దుష్కరమే. వారు మాట్లాడు వాక్యములలో పెక్కు సంస్కృతపదము లున్నను ఉచ్చారణ భేదముచే తెలిసికొనుటకు బొత్తుగ వలనుపడదు. సంస్కృతమును చదువు వంగీయులు, సంస్కృతమునుగూడ తమభాషరీతినే చదివెదరు గాన, వారు సంస్కృతశ్లోకముల చదువుచున్నను, మనకు అగమ్యగోచరముగ నుండును. మధుర మగుసంస్కృతము వంగీయుల వదనములలో బడి అపభ్రంశ మగుచున్నదా యనునట్లుండును. స్వచ్ఛముగ సంస్కృతమును పఠింపగల మనకు కర్ణకఠోరముగ నుండును. వారి ఉచ్చారణకు, బెంగాలీలు పలుమారు ఇతరుల అవహేళనమునకు పాత్రులగుచుందురు. బెంగాలిఉచ్చారణయే కొందఱి యింగ్లీషుఉచ్చారణపైగూడ బ్రసరించుచుండును.

౨

తెలుగులోనున్న అక్షరములలో పెక్కు బెంగాలియందు లేవు. తెలుగులో లేనివి బెంగాలియందు కొలదిఅక్షరములుగలవు. ఎ, ఒ, చ, జ, ఱ,ళ, యివి బెంగాలియందు లేవు. డ, ఢ, య (దీనివిషయమై తర్వాత చెప్పెంచెదను) ౕ, ఈ, అక్షరములు బెంగాలియందు ఎక్కువ యున్నవి. ఉచ్చారణ వేఱుగా నుండు అక్షరముల మాత్రము గైకొని చెప్పెంచెదను.

అ. దీని ఉచ్చారణయే వంగీయేతరులకు కొంతకష్టము. దీని ఉచ్చారణ మన 'ఒ'కు చాల సామీప్యము, అ- పదప్రథమమునగాని,మధ్యగాని వచ్చిన-ఒ-మాదిరే పలుకవలయును. కపి బెంగాలి ప్రకారము కొఓియగును. కామనా, కామొనా యగును*. పదముయొక్క చివర వచ్చిన, కొన్ని పర్యాయములు - ఒ - యగును. కొన్ని పర్యాయములు దాని ఉచ్చారణయే లోపమై కేవలము హలంత మగును.

| | | |
|---|---|---|
| మన్మథ | మొన్మొథొ | యగును |
| జల | జొల్ | ,, |

ఏ పదములయందు - ఒ - యగును, ఏ పదములయందు అసలే లోపించునను విషయమై పద్ధతు లేమియు లేవు. అభ్యాసముచేతనే తెలిసికొనవలయును. బెంగాలి క్రొత్తగ నేర్చుకొనువారు, దీని ఉచ్చారణవిషయమై చాల శ్రద్ధనుంపవలయును.

బెంగాలియందు ఒ లేదు గాన, ఒ, ఓ, లకు వ్యత్యాసము చేయక ఓగానే పలుకవలయును. పద్యములలో మాత్రము ఒక్కొకప్పుడు హ్రస్వఒకార మగును. ఈ పద్ధతియే ఎ, ఏ లకు గూడ అనువర్తించును.

ఋకారము:—ఇందు సంస్కృతములోనే కొంత మతభేద మున్నట్లు కాన్పించు చున్నది. దీనిని 'రి 'వలె 'రు ' వలెగూడ సంస్కృతమున నుచ్చరింపవచ్చు నని కొందఱు సంస్కృతపండితులు అభిప్రాయ మిచ్చి యున్నారు. అస్సామీ, బెంగాలి. హిందీలలో దీని ఉచ్చారణ 'రి 'కి దగ్గరగా నున్నది.

* అ-ఉచ్చారణ ఒ-మాదిరిఉండుననిన దానికిని దీనికిని భేదములేదనికాదు. భేదము బహుస్వల్పము. క్రొత్తగ వినువారు భేదమును కనుగొనజాలరు.

J

ఋషి ఉచ్చారణ రిషి

అమృతము " అమ్రితము.

ఋగ్వేదము " రిగ్వేదము

గుజరాతి, మరాఠీ, కన్నడము, తెలుగు, ఒరియా భాషలలో 'ర'కు దగ్గరగా నుండును.

ఋషి రుషి

ఋతువు రుతువు

కృతము క్రుతము

కాని బెంగాలి చదువునప్పుడు-రి- వలెనే పలుకవలయును.

తెలుగువారు ఋ- ను యెల్లప్పుడును రు- వలె ఉచ్చరించుచు, కృష్ణుడు అను పదమును మాత్రము క్రిష్ణుడు అని పలుకుటకు కారణము మృగ్యంబు.

ౡ గూడ లి వలెనే బెంగాలియందు పలుకబడును.

ఐ ఉచ్చారణ ఓయ్

పైసా పాయ్‌సాగా గా ఉచ్చరింపనగు

భైరవ భొయ్‌రొబొ "

ధైర్య ధొయ్‌ర్జొ "

ం- దీనిఉచ్చారణ తెలుగులో ంగ్- వలెనగును.

అం- అని వ్రాసి అంగ్ వలె ఉచ్చరించెదరు.

ఢం ఢంగ్

బెంగాలీలో రఙ్ అని గాని, రంగ్ అని గాని వ్రాయవలయుననిన రం- అని వ్రాసిన చాలును. దీనికి భిన్నమగు నుచ్చారణ యుండుటచేతనే చంద్రుడు అని వ్రాయుటకు బెంగాలీలో చన్ద్రుడు అని వ్రాయవలసి వచ్చుచున్నది. తెలుగులో వలె చంద్రుడు అనివ్రాసిన చఙ్ద్రుడు పలుకవలసివచ్చునుగాన చన్ద్రుడనియే వ్రాయవలసి యుండును.

రవీంద్రుడు రవీన్ద్రుడు.

గీతాంజలి గీతాఞ్జలి

అంబరము అమ్బరము.

కాని, బెంగాలి సంయుక్తాక్షరముల వ్రాయునపుడు మనకు కొలదికష్టముగ నుండును.

ఁఇది ద్రావిడభాషలలో లేదు. పెక్కు ఉత్తర హిందూస్థానపు భాషలలో గలదు. దీనిని నాసికద్వారా పలుక వలయును. ఇంగ్లీషులో Fan ను ఉచ్చరించుటకు Fa ను ఉచ్చరించిన రీతికి దగ్గరగనుండును.

చాఁద్ (చంద్రుడు)

హాఁసీ (హాసు) —మున్నగునవి.

ఇక హల్లుల విషయము చర్చించెదము.-ఉచ్చారణ వేఱుగానున్న యక్షరముల గూర్చియే చర్చించుట యని చదువరికి మరొకమారు జ్ఞప్తికి తెచ్చుచున్నాను.

ణ, న- స- కు ఉచ్చారణ యొకటియే. రెంటిని 'న' వలెనే పలుకవలయును. గుజరాతి,మరాఠీ,ఓఢ్రభాషలలో -ణ- ఉచ్చారణ పలుమారువచ్చుటలేట స్థించుటచే వినుటకు కటువుగనుండును. బెంగాలిలో -ణ- వచ్చిన ప్రతిచోట 'న'నే పలుకుటచే చాల మృదువుగనుండును.

ఫణి ఫొని

కోణ కోన్

బెంగాలీలో రెండు 'య'లు కలవు. ఈ రెండింటిలో నొకదాని యుచ్చారణ 'జ'- మరొకదాని ఉచ్చారణ 'య'. య అని ఉచ్చరింపవలసిన అక్షరము పదాదినిగాని, పదాంతమునగాని యెన్నడును రాదు. కేవలము పదమధ్యమున వచ్చుచుండును. అనగా దాదాపు 'య' అను ఉచ్చారణ మొదట గల పదమే బెంగాలిలో లేదు. ఈ రెండు 'య'ల తారతమ్యము తెలిసికొనుటకు 'య' అని ఉచ్చరింపవలసినదాని క్రింద ఒక చుక్కను పెట్టెదరు.

యమ జొమొ

యుద్ధ జుద్ధొ

వాతాయన వాతాయొన్

జలధి-మున్నగు పదములలోని జకారము తెలుగులోని 'జ'వంటిదే. జొమొలోని 'జ'కును జలధిలోని 'జ'కును సంబంధములేదు. అకారములు కూడ వేఱు.

'జ' ఉచ్చారణతో ప్రారంభమగు క్రొత్తపదమును వ్రాయవలయు నని, బెంగాలీలలోనే అభిప్రాయభేద మేర్పడకమానదు. సహధారణముగ అభ్యాసముచేతనే తెలిసికొనవలయును.

వ, బ, అను రెండు అక్షరములు లెక్కకు ఉన్నను, ఆకారములలో రెండింటికిని భేదము లేదు గాన రెంటిని బ అనియే పలికెదరు.

వన్దే మాతరమ్ బొన్దే మాతొరొమ్

కవి కొబి

సంస్కృతము చదువు బెంగాలీలు, బెంగాలిలిపిలోనుండు సంస్కృతగ్రంథముల చదివెదరుగాన, పెక్కుమందికి సంస్కృతమున వందేమాతరమా లేక బందేమాతరమా యను సందేహముగూడ తఱచుగ గల్గుచుండును.

అసామీ, బెంగాలీ, హిందీలలో ళ-లేదు. కాన వారికి ళ-ను ఉచ్చరింపవలసిన అవసరముకు లేదు. మనకళాభవనము వారి 'కొలాభొబొన్' యగును. వ్రాయునప్పుడుకూడ 'ల' యే వ్రాసెదరు.

ఓడియా, మరాఠీ, కన్నడ, గుజరాతీలలో పెక్కు సంస్కృతపదములలో 'ల' 'ళ' యగును.

బాలక బాళక

తిలక తిళక

బెంగాలీలో శ, ష, స ల ఉచ్చారణలలో భేదములేదు. వ్రాయునప్పుడు వేరుగ వ్రాసినను, అన్నిటిని 'ష'వలెనే పలికెదరు.

శాన్తి షాన్తి

శపథ షొపొద్

సకల షొకొల్

షట్పద షొట్పొదొ

హిందీ గుజరాతీలలో ష, శల భేదముచేయరు.

అశోక అషోక

'స'ను 'స'గనే ఉచ్చరించెదరు. బెంగాలీలో మూడిటిని 'ష'గ మార్చివై చెదరు.

అస్సామీలో 'స' 'హ'గ పలుకబడును. శ, షలు 'ష'గ మారును.

సకల హకల యగును.

అసాం అహాం

అదేభాషలో 'చ' 'స' గా పలుకబడును. "

ఆచమన ఆసమన

బెంగాలీలో 'క్ష'ను 'క్ఖ' వలె ఉచ్చరించెదరు.

అక్షయ ఒక్ఖొయ్.

క్షమ క్ఖొమొ.

డ, ఢ ల క్రింద చుక్కలు పెట్టబడిన రెండు అక్షరములు హిందీ,బెంగాలీలలో గలవు. వీటి ఉచ్చారణ సరిగా నిర్దేశించుట కష్టము. 'యఫ్' అని వ్రాసి క్రింద చుక్కను బెట్టి యింగ్లీషు-F-వలె మనము ఉచ్చరించుచీతినే, యీ రెండుఅక్షరముల ఉచ్చారణయు మారును. హిందీ కొద్దిగ వచ్చినవారికి వీటి ఉచ్చారణ అతి సులభము.

హిందీలో ఈ రెండుఅక్షరముల క్రిందనే గాక, అరబ్బీ- ఫారసీ పదములకు వలసిన చోట్లంతయు నీ చుక్కను క్రింద నుంచెదరు. ముఖ్యముగ 'క'-ఖ - గ - జ- ఫ'- ల క్రింద.

వక్త్ (సమయము)

ఖబర్ (సమాచారము)

అఫ్‌గనిస్థాన్

జాదా (ఎక్కువ)

ఫాయిదా (లాభము)

ఇంతటితో హల్లుల విషయ మైపోయినది. కొన్ని కొన్ని సంయుక్తాక్షరములకును ఉచ్చారణభేదము గలదు. కాని, వానిని సూత్రములచే బంధించుటకు వనుపడదు.

ఈ క్రింది కొన్ని పదముల, వాని ఉచ్చారణల చదువరులు గమనించిన చాలవరకు బోధపడగలదని నమ్మిక.

పదము ఉచ్చారణ

చిహ్న చిన్హొ

| పదము | ఉచ్చారణ | |
|---|---|---|
| వాక్య | బాక్కొ | |
| యజ్ఞ | జగ్గొ | కొది కొద్దిగ అనునాసికస్వరము గలదు. |
| ప్రతిజ్ఞ | ప్రతిగ్గొ | |
| మహాత్మ | మహాత్తొ | |
| జ్ఞాన | గ్గాన్ | (Cat లోని 'కా' వలె) |
| వ్యాప్త | బ్బాప్తొ | ( ,, ) |
| లక్ష్మి | లొఖి | |
| ఆర్య | ఆర్జొ | |
| సన్యాసి | షొన్నాషి. | |

ఒకప్పుడు బౌద్ధమతము వంగదేశమున ప్రబలియుండినదనియు, అందువలన ప్రజలు విరివిగ 'పాలి' పుస్తకముల చదువుచుండుటచే పాలీ లోని ఉచ్చారణయే బెంగాలికిగూడ వచ్చినదనియు, అందువల్లనే బెంగాలి ఉచ్చారణ వేరైనదనియు పలువురు పండితులు అభిప్రాయపడుచున్నారు.

ఈపైసూత్రముల శ్రద్ధగ గమనించి బెంగాలి చదువగడంగిన ఆంధ్రమహాశయునికి బెంగాలి ఉచ్చారణ చాలవరకు సరిగ నుండగలదని నమ్ముచు వ్యాసమును పూర్తి చేయుచున్నాను.

*　　*　　*　　*　　*

# మా న సి

## శ్రీ రబీంద్రనాథ్ ఠాకూరు.

కేవలము విధాతృని సృష్టివి కావు నీవు నారీ,
పురుషుఁడుగూడ తన అంతరమునుండి సౌందర్యమును సంగ్రహించి నిన్ను కల్పించుచున్నాఁడు.
కవులు కూర్చొని సువర్ణ ఉపమాన సూత్రములచే వసనముల నేయుచున్నారు.
నీపై నూతనమహిమను సమర్పించి, శిల్పి నీదుప్రతిమను అమర్త్య మొనర్చుచున్నాఁడు.
ఎన్ని వర్ణములు,ఎన్ని సుగంధములు,ఎన్ని భూషణములు నీకై చేకూరుచున్నవి!
సింధువునుండి ముత్యములు, ఖనినుండి కాంచనము వచ్చుచున్నవి. వసంతపు వనములనుండి పుష్పభారము ఏతెంచుచున్నది.
చరణముల అలంకరించుటకు కీటకములు తమ ప్రాణముల నర్పించుచున్నవి.
సిగ్గుదొంతరల నిచ్చి, అలంకరణముల నొసఁగి, ఆచ్ఛాదనములతో నిన్ను దుర్లభముచేసి గోపనము కావించుచున్నారు.
ప్రదీప్త అభిలాషలు నీపై ప్రాలుచున్నవి.
సగము మాత్రము మానవివి నీవు. సగము కేవలము కల్పన.

---

# ప్ర శ స్తి

కొమరవోలు నాగభూషణరావుగారు.

అర్కకులవంశమణి జైత్రయాత్ర వెడలి
సమరరంగంబునందు సుక్షాత్ర శౌర్య
తేజ మెడలించి ధవళ దీధితి వహింప
మరలినాఁడు వసుంధరాపురమునకికి.
ప్రావృషేణ్య పయోధర ప్రభలతోడ
లలితకాంతుల విద్యుచ్ఛలాకతోడ
జయజయధ్వను లీను గర్జనముతోడ
ఆహవప్రీతిఁ జూపె వియత్ప్రభాంగి.
అతులితానంద మొప్ప జోహా రొనర్చి
బహువిధ మధురఫలసమర్పణముఁ జేసి
పుష్పములతోడ భక్తిమైఁ బూజజరపి
వృక్షములుగూడ నపుడు చూపించె భక్తి.
చిఱుతరొద సేయు సెలయేఱు శ్రీమహాది
శక్తి పీఠస్థ గాంగ నిర్ఝరిణికరణి
ఉరుతరంగార్భటీ వినంఘూర్ణమాన
దివ్యమాధుర్యవిజయగీతికలు పాడె.
ప్రభవ మొందిన నీరేజ ప్రసవసమితి
తరళకాంతుల కించిత్స్మితంబు నూపె;
అరుణరాగార్ద్రమైనబాలార్కబింబ
కిరణ సంశ్లేష మోదసాగరము నింపె.

విస్తృతం బగుచుఁ బరిఘావృతము నగుచుఁ
గనుల కింపెసలారు దుర్గంపుగోపు
రాళి దృగ్జాలదర్శనప్రాయ మయ్యె;
వసుధ నుండు కైలాసపర్వతమువోలె.
అది మహోన్నత వైభవాభ్యుదయతతికిఁ
దావలం బైన శౌర్యముక్తాఫలంబు;
శ్రీమహాలక్ష్మి కనకాభిషేచనాంత
రమున మాణిక్యవల్లికారాజితంబు.
వాహినీపదఘట్టనా వ్యాపనోత్థ
రాగశోభితాలక శ్రేణి రాణఁ గూర్చ
అనుణముంగురు లాచు ముత్తైదువాళి
లాజ లర్పించిరఁట మహోల్లాసగరిమ.
మావి మరకత మాంగల్యమహితతోర
ణములు విలసిల్లె వింతవిన్నాణసరణి;
దర్శనాసాధ్య భూరిసౌధములనుండి
పతన మగుచుండె మౌక్తికయుతసరములు
రాజమందిర ప్రాంగణ రమ్యభూమి
వర్ణనాతీత మైనట్టి వైభవంబు
తోడ వెలుఁగుచు బహుళసంతోషపాత్ర;
పొగడ దరిలేని వైకుంఠపురమువోలె.

---

# భట్టుమూర్తిప్రశంస

అష్టావధాని పింజల సుబ్రహ్మణ్యముగారు.

చ॥ అనుపమ దివ్యకావ్య రచనాతిధురీణ మనీష ! వాయునం
దన కరుణాకటాక్షజనిత ప్రతిమాన విహీన సర్వ స
ద్వినుతరస ప్రదీపక కవిత్వశుభోదయ ! రామరాజభూ
షణసుకవీంద్ర ! నిన్నుబొగడ శక్యమె మాదృశమర్త్యకోటికిన్ ?

సీ॥ చోద్య మై, యత్యంత హృద్య మై, నిరతాన
వద్య మై, తగు పద్య గద్యగరిమ
నిత్య మై, లోకసంస్తుత్య మై, సంగ తౌ
చిత్య మై, యలరు సాహిత్యపటిమ
యోగ్య మై, త్రుటిత వైరాగ్య మై, సతతాను
భోగ్య మౌ పాకసౌభాగ్యమహిమ
తోర మై, సమ్ముదాధార మై, కవిత శృం
గార మై, చను చమత్కార ఫణితి

తే-గీ॥ గలిగి సర్వత్ర పరమవిఖ్యాతిఁ గాంచు
సత్ప్రబంధంబుల రచించి జగతియందు
సార్థకి మొనర్చితివి ప్రబంధాంక కులము
మూర్తి కవివర్య ! హరిదంత కీర్తిధుర్య !

సీ॥ ఘనతర లస దనంతనిరర్గళశ్లేష
కవితా ప్రవాహ సంగతులఁ బరపి
గంభీరభావ సంకలిత చంచద్రసో
దయ మృదుమధురబంధములఁ గూర్చి
యనుపమ హృదయంగ మానూన శబ్దార్థ
సదలంకృతు ల్విశేషముగ నిలిపి
యాంధ్ర గీర్వాణభా షాహీన సామ్రాజ్య
సర్వంకషత్వంబు సంతరించి

తే-గీ॥ కృతుల నిర్మించు నతులిత వితత చతుర
మతియుతుఁడ వౌచు జగతి కంచితహితంబు
సల్పిన త్వదీయశక్తి నెంచంగ వశమె ?
రామరాజభూషణ ! కవి రాజమాన్య !

సీ॥ గడియలోపల శతకంబును నిర్మింప
దినమున కొక కబ్బమును రచింప
సంగీతకళలోని సార మెల్ల గ్రహింప
మృదుతర వాగ్వైఖరిని జరింప
రత్నాభిషేక సంరంభంబు వహియింపఁ
గాంచనజన్మఁ డౌ ఖ్యాతిఁ బెంప
శ్రీరామచరణసంసేవారతి న్మించ
నతులి తానేక సత్కృతులఁ గాంచ

తే-గీ॥ ననుపమానాతిసామర్థ్యమునఁ జెలంగి
యవనియం దద్వితీయుఁ డౌ ననఁగ నెలసి
యతులితప్రభాభాజి వై యలరినావు
కవిజనవరేణ్య ! విబుధప్రకాండగణ్య !

శా॥ ఔరా ! యేమి వచింపనేర్తు ? నరసింహాధీశ్వరుంగూర్చి శృం
గారం బొప్ప రచించి మించిన యలంకారప్రబంధంబునం
దారూఢిఁ దనరారు లక్ష్యకృతపద్యవ్రాత మేవేళ నో
గూరంజేయుచుఁ బాఠకావళికి నత్యుత్సాహముం గూర్చెడున్.

చం॥ అసదృశకల్పనాపటిమ నంతయుఁ గూర్చి యొనర్చినట్టి నీ
వసుచరితంబుఁ గాంచి యనివార్యముదంబు వహించి వేతఠ
భ్యసనపరత్వ మూనుఁ గవివల్లభులం దెవఁడేని దాన ని
వ్వసుధ భవద్యశోధుని యపారముగాఁ బ్రవహించు నేటికిన్.

ఉ॥ సాంద్రకలాకలాపులు విశాలయశఃపరిదీప్తు లౌ హరి
శ్చంద్ర నలావనీశ్వరుల సచ్చరితంబును ద్వ్యర్థి గాఁగ ని
స్తంద్రమనీషితన్ సలుపఁ జాలిన తావకభవ్యశక్తి సూ
రీంద్రుల కేని యెంతయు నుతింపఁ దరంబె ధరాతలంబునన్.

మ॥ భవదీయాంచితకావ్యరాజముల నప్రామాణ్యము ల్సేసి యా
భువి నొందేని నుదాహరింపరు ఖలాత్ము ల్గొంద ఱద్దాన స
త్కవిసందోహవరేణ్య ! తావక దిగంతవ్యాప్తదోషజ్ఞసం
స్తవనీయాధిక శుభ్రకీర్తి కసితత్వం బింత వాటిల్లునే ?

తే-గీ॥ " ఉపమ లున్నను శయ్యల నొప్పియున్న
నంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబు గాద"
టంచుఁ బల్కిన దుష్టవాక్యంబు నడఁప
నీ ప్రబంధము ల్దగిన వై నెగడుఁ గాదె ?

చం॥ కనుఁగొన నెట్టిపండితునిగాని యఖండతపఃప్రభావుఁ డై
తనరెడువానిఁ గాని మహితప్రతిభాత్మునిఁ గాని దుష్కృతం
బును హృదయంబునం దలఁపఁ బోక కులంబునె కారణంబుగాఁ
గొని నిరసించునట్టి చెడుగుల్ దిలకింపఁగలారె సద్గతుల్ ?

చం॥ అమలగుణాఢ్యుఁ డై చెలఁగునాతఁడు హీనకులంబునం దుదయి[ంచు
న్నముఁ గనినన్ సమస్తజనమాన్యుఁడు దుర్గుణసంయుతాత్ముఁ
త్తమకులమందుఁ బుట్టినను దద్దయు దూష్యుఁ డగున్ మహర్షిస
త్తములె వచించియుండిరి గదా ! యిది యెట్టు లబద్ధ మయ్యె
డున్ ?

ఉ॥ "కాఁపుకవిత్వ" మంచు " నెసకంబును గూర్పఁగఁ జాలియుండ
బాఁపనవారి" కంచు బలుభంగుల దూషణసల్పినట్టి యా [నే
పాపిని ద్వేషసంకలితభావుని నెట్టి దురుక్తు లాడినం
గోప మడంగునే సుకవికోటికి ? మాటికి నెంచ నేటికిన్. [వు

సీ॥ చెలువారు నుడికారములసొంపునం దెల్గు బాస నెంతేనిఁ గై సేసినా
నాల్గుచందాలచే నలువొందు కై తల నల్లంగ జాణ వై యలరినావు
నుడువులచెలి యెల్లపుడు నాల్కపై నట్టువను సల్ప మేటి వై తనరినావు
ఉడివోక మిగులఁ బెం పడరు కీరితి దచ్చి కడలందు వెలుఁగొందఁ గ్రాలినావు

తే॥ గీ॥ ఎంత దూఱిన నీ కిసుమంతయేని
సాటివత్తురె తులువ లేనాఁటి కైన ?
శ్లేషకవిచక్రవర్తి ! విశేషకీర్తి !
పటుతరప్రతిభాస్ఫూర్తి ! భట్టుమూర్తి !



శ్రీ తిరువనంతపురము మైనరు మహారాజు గారు.



శ్రీ సింగంపట్టి జమీందారు గారు, ఎం. ఎల్. సి.



ఘనతవహించిన శ్రీ కొల్హాపురము మహారాజా బహద్దరువారు.



శ్రీ పుదుక్కోట మైనరు రాజు గారు.



శ్రీ రామనాథపురము రాజుగారు.



శ్రీ పెద్ద పవని రాజకుమార సాహెబుగారు.



శ్రీ మునగాల రాజావారు.



రాజా వేంకట రామరావుగారు.



శ్రీ లాల్ దాసుగారు.



శ్రీ బొబ్బిలిరాజా బహద్దరువారు.



కీ॥ శే॥ ఆచంట సుబ్బారాయడుగారు.



శ్రీ టెక్కలి జమీందారుగారు.



శ్రీ చల్లపల్లి రాజాగారు.



శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావు పంతులు జమీందారుగారు.



# మా ప్రణయగాథ

ఎమ్. ఆర్. వి. కృష్ణరావు గారు.

## 1

"ఎన్నాళ్ళ కొచ్చావోయ్, బావా మా యింటికి!" అని ఆహ్వానించింది కమలం గుమ్మంలో అడుగుపెట్టగానే.

"ఎంతవాడ వయ్యావురా నువ్వు! మొన్న చూచిన గుంటడవు అప్పుడే బి. యే., ప్యాసవడానికి సిద్ధమయావు!" అని ఆనందంతో ఆదరించాడు మామామయ్య. నరే. తక్కినవారుకూడా ఆహ్వానించిం తరవాత సావిట్లో కుర్చీలో కూచున్నాను.

"మొన్న వస్తానని రాకపోతే నువ్వు రావనుకున్నాంసుమీ బావా!" అంటూ దగ్గిర కొచ్చి పక్కకుర్చీలోకూచుంది కమలం.

"కమలా, పెద్దదానవయ్యావే నువ్వు" అన్నా నేను చిరునవ్వుతోటి.

"నువ్వుమాత్రం కాలేదు"...ఆరేళ్ళయిందికదా మాయింటి కొచ్చి, బంధువులని చూడాలని ఆమాత్రంవుండదు కాబోలు!" అంది నునుసిగ్గుతోటి అనురాగంగా కమలం.

"అబ్బే కమలం అదికాదు. ఎప్పటి కప్పుడే వద్దా మనుకుంటూండడం, వ్యవధి చిక్కకపోవడం"

"నరే! ఇప్పుడే వ్యవధి లేకపోతే రేపు బి. ఏ., ప్యాసయితే అసలే కనపడం!"

"వెంటనే పరవాలేదులే నిరుద్యోగసమస్య—"

"కమలం! బావని స్నానానికిలెమ్మను" ఇంట్లోంచి మా అత్తయ్య.

"ఆ. బావా! స్నానాని కిట లేవ్వోయి. పాపం అలిసిపోయావు ప్రయాణంబడలికచేత"

## 2

వెంకటేశ్వరరావుగారు నాకొక్కడే మేనమామ. బెజవాడలో సబ్ కలెక్టరు కచేరీలో పని. కొంచెం ఆస్తిగలవాడనే చెప్పవొచ్చు. ముగ్గురు పిల్లలు. వొకడు మొగబ్బాయి, తక్కినవాళ్లిద్దరు ఆడపిల్లలు. కమలం రెండోది, దానిచెల్లెలు మాణిక్యానికి దానికిమధ్య నొక సంతానం నష్టమైంది. మాణిక్యాని కిప్పుడు ఎనిమిదోయేడు. కమలం నాకన్న సుమారొకవత్సరంపెద్ద. నాకువన్నెండోయేట నాల్గోఫారం చదువుతోన్నపుడు కమలానికి వివాహమయింది. అప్పుడు వెళ్లడమేగాని, మళ్లీ మా మామయ్య కుటుంబాన్ని చూడ్డం తటస్థించింది కాదు. ప్రతియేడు శలవుల్లోరమ్మని ఆయన వ్రాస్తూండడం నే నశ్రద్ధచేయడం అయ్యేది. కాని ఈమాటు వాళ్లు రమ్మని వ్రాయకుండానే బందరు పనిమీద వెళ్లడంవల్ల తిరిగి వచ్చేటప్పుడు బెజవాడలో వారిని చూడ్డానికి దిగాను.

## 3

భోజన మయిం తరవాత ఇవతలి కొచ్చాను. సావిట్లో 'బెర్నార్డుషాగారి డాక్టర్సు డైలమ్మా' అనేపుస్తకం చదువుతూ కూచుంది కమలం. చూడగానే నా కాశ్చర్యమయింది.

"అబ్బో బెర్నార్డుషాగారి గ్రంథాలు చదివేవరకు వచ్చింది చదువు!" అన్నా నవ్వుతో నేను.

K

"ఏం! నువ్వేగాని ఇంకెవ్వరూ చదవకోడదా?"

"అదికాదు. చదువు ఇంతవృద్ధి ఎప్పుడు పొందిందా అని."

"మనిషిపెరిగితే మనస్సూ పెరుగుతుంది. తెలివి తేటలెక్కువవతాయి; చదువూ వృద్ధవుతుంది,ఎల్లకాలం ఓలాగే వుంటా డేమిటి మానవుడు?"

"నేను నీపెళ్లినాటికి చూశేటప్పటికి రెండోఫారంలోలావుంది అవునా? చదువుతోండేదానవు. పెళ్లవగానే బడిమానేస్తివి. ఇంతవృద్ధి ఎల్లా చేసుకొగలిగావా అని సందేహం."

"మాఅన్నగారి సహాయంవల్ల తీరికవుండడంవల్ల ఇంతవృద్ధి చేసుకున్నాను."

"అడగడం మర్చిపోయాను. అన్నగారు ఎల్లావున్నారు? మళ్లీ పిల్లలా?"

"ఉంటే కనబడరూ! ఏమిటా అడగడం?"

"కోప్పడకు మరి. ఎన్నాళ్లయింది నువ్విక్కడ కొచ్చి? ఇంటి దగ్గిర ఎవరున్నారు?"

"పెద్దమ్మాయి ఆయన వున్నారు, ఓవారంరోజులయింది వచ్చి."

"అయితే మళ్లీ ప్రయాణమెప్పుడు?"

"ఏం! నే నిక్కడనుంచి త్వరగా వెళ్లిపోవా లనుందా ఏమిటి నీకు?"

"ఆహా! అదికాదు ఊరికే అడిగాను."

"అమ్మాయీ! అన్నానికిరా?" ఇంట్లోంచి.

"వస్తున్నా, రావోయిబావా అక్కడ కూచుందుగాని పీటేస్తాను."

## 4

మాధవరావుగారికి పెళ్లినాటికి సుమారు నలభైయేళ్లుంటాయి. కమలం రెండో వివాహం ఆయనకి. మొదటిభార్యకు ఇద్దరు ఆడపిల్లలు. పెద్దపిల్ల లక్ష్మీపాపం వితంతువు. రెండోది లలిత. పదునాల్గేళ్లుంటాయి. పెళ్లయి కొద్దిదినాల క్రిందనే కాపరానికెళ్లిందట. మాధవరావుగారు మంచి ఆస్తిపరుడు. గుంటూరు అరండేలుపేటలో మంచి మేడ వుంది. ఉద్యోగంలేదు. అక్కరలేదు కూడాను.

♦ ♦ ♦ ♦ ♦

కమలం, నేను మొదట ఆరేళ్లక్రింద చూచినప్పుడు అందమయినపిల్లనే అనుకునేవాణ్ణి. అయితే అప్పటి కింకా అవయవ లావణ్యాన్నిగురించిగాని, అతివ సౌందర్యాన్నిగురించిగాని స్ఫుటమైన భావా లుండేవి కావు.

కమలం వాళ్లనాన్న ముద్దుబిడ్డ. అందగాడికి, విద్యావంతుడికి చేద్దామని ఆయన ప్రయత్నం. అయితే మన ప్రయత్నం అన్నింటిలోను సఫల మవుతుందా? చివరకి అల్లాంటి వరు డెవ్వరూ దొరక్కపోతే ఓ పదాది చిన్నవాణ్ణయినా నాకే కట్టిబెడదామని

చూశారు. మా అమ్మ "ఊ" అన్నా, మా నాన్నమాత్రం వప్పుకోలేదు.

వెతికి వెతికి చివరకి ప్రాణం విసిగి మాధవరావు గార్కి కట్టిపెట్టారు కమలాన్ని. అయితే కమలాని కప్పుడు మాధవ రావుగార్ని చేసుకోడం ఏమాత్రం యిష్టంలేదు.

"అత్తయ్యా ఎల్లకాలం ఇల్లాగే వుంటాడా ఏమిటి? పెద్దవాడవడూ బావ! నేను బావనే చేసుకుంటాను. ఒక ఏడాదే కాదూ నేను బావకన్న పెద్ద?" అని మా అమ్మదగ్గిర ఏడ్వడంమొదలుపెట్టింది.

"అవునే అమ్మా నేను పెద్దవాడ నవనుటే? ఎల్లకాలం ఇల్లాగే వుంటానా ఏమిటి? షేక్సుపియరు తనకన్న ఆరేళ్ల పెద్ద పెళ్లాన్ని చేసుకున్నాడు. నేను చేసుకుంటే తప్పా ఏమిటి? అయినా కమలంకన్న నేను ఓ ఏడాదేగా చిన్న?" అని నే నన్నాను.

మామయ్య, అంతా నవ్వి "తప్పమ్మా అల్లా చేసుకోకోడదు. కులంలోంచి వెలేస్తారు మన్ని నువ్వు బావని చేసుకుంటే" నని చివరకి ఎల్లాగో వొప్పించేటప్పటికి బ్రహ్మాండ మైంది.

♦ ♦ ♦ ♦ ♦

ఆనాడు పెళ్లయింతరవాత ఆరేళ్లకి ఇదే చూడడం కమలాన్ని.

పూర్వంకమలం కా దిప్పుడు. ఇదివరకు నాకన్న కమలే పొడుగైనా ఇప్పుడు నేనే పొడుగ్గావున్నాను. యౌవనలావణ్యం, అంగసౌష్ఠవం, దేహకాంతి కమలాన్ని నిజంగా అందకత్తెని చేశేశాయి. దానికి తగ్గట్టు ఆ ఉడుపులు. సన్న జరీ తెల్లచీర, కాఫీరంగువంటి మెడజాకట్టు. ఆ మెడలో కొంచెం బిగువుగా (జిగినీకి బదులు కాబోలు) మంచిముత్యాల పేరు, వాలుజడ, పట్టీగొలుసులు, కాళ్లకి బర్మాజోడు, ఇవన్నీ కలిసి ఓవింత అందం ఇచ్చాయి కమలానికి. పాశ్చాత్య నాగరకతావీచికలు కుసుమసౌరభాన్ని ఆమెదేహకాంతులలో విరజిమ్మాయి. దానికితోడు చదువు. ఇంగ్లీషు బాగా వొచ్చును. (Shelly, Keats, Byron,) షెల్లీ, కీట్సు, బైరను (Wells, Shaw) వెల్సు, షా, మొదలైన ఆధునిక కవులనే కాక, షేక్సుపియరు మొదలైన ప్రాచీనకవులనికూడా చదవడమే గడచిన రెండేండ్లనుంచీ పని అని చెప్పింది. ఏమైతే నేం? కమలంలో ఇప్పుడు ఒకనూత్నజ్యోతి వెలుగుతోంది. ఆనయనాల్లోవింతకాంతులు ప్రసరిస్తున్నాయి. పరిపక్వపరిమళం ఆమెలో వెల్లువిరుస్తోంది. సరసత్వం ఆమెను స్వీకరించింది. లలితత్వం ఆమెలో లీనమైపోయింది. సురూప సుకుమారంతో స్వర్ణలతలాగా మెరుస్తోంది కమలం. బాంధవ్య బంధనాలతో ఇదివరకే కొంచెం ప్రేమబద్ధుడైన పద్ధెనిమిదేళ్ల ఆధునికయువకుని ముగ్ధుని చేయడాని కింతకంటే ఏం కావాలి?

## 5

ఇదివరకు ప్రేమనుగూర్చి, ప్రియులనుగూర్చి పుస్తకజ్ఞానమేగాని, అనుభవజ్ఞానం లేదు. ప్రేమవారిధిలో సంతోషతరంగాల మీద తేలి ఆడడం, ఆప్రియురాలి ఈసడింపులు, ప్రియుడి బ్రతిమాలడాలు, ప్రణయకలహాలు, ప్రేమజాడ్యాలు, వెన్నెల విహారాలు, విరహతాపాలు, ఊహాప్రపంచంలోనేగాని ప్రత్యక్షానుభవం ఎప్పుడూలేదు. నేను కమలాన్ని ప్రేమిస్తున్నా నని అనుకోగానే— అనుకోవడ మేమిటి? ప్రేమిస్తున్నాను— ఇదివరకు నవలలలోను,కావ్యాలలోను చదివిందంతా ఆవర్ణన,ఆనాయికానాయకులు, వారిచేష్టలు ఒక్కసారి మెఱుపువేగంతో తళుక్కుమన్నాయి. ఒడలు గగుర్పొడిచింది. హృద్వేగం ఎక్కువయింది. కమలాన్ని ఆ సాయంత్రమే సరిగ్గా చూడలేకపోయాను. అప్రయత్నంగా నా నడవడికలో, నాచేష్టలలో, నాచూపులలో మార్పు కల్గింది. మార్చుకొందామని యత్నించినా మారిందికాదు. ఆ సాయింత్రం మా యిద్దరిచూపులు పెక్కుసార్లు కలుసుకున్నాయి. హృదయాంతరాళాలని కరిగించేశాయి.

నాలో కల్గినమార్పు కమలం ఒకచిరునవ్వుతో కనిపెట్టింది. కానీ ఏమీ అనలేదు నాకూ తెలుసును ఆమె కనిపెట్టిం దని. నేనూ ఏమీ అనలేదు.

ఆమెలోకూడా కలిగిందిమార్పు. మయూరవయ్యారం వివిదరూపం దాల్చింది. ఆమె నేత్రాల్లో వింతచూపులు ప్రసరించాయి. ఆ చూపులలో తన్మయత్వం, ఆహ్వానంకూడా కనిపించాయి. ఆ నేత్రాలు నన్ను పరవశుణ్ణి చేశేశాయి.

కమలంతో ప్రొద్దున్నలాగ మాట్లాడలేకపోయాను. ఏదో మాట్లాడదామని ఉపక్రమించినా కష్టమనిపించేది. ఎల్లా పలకరించాలో కూడా తెలిసింది కాదు. నా నడత నాకే వింతగా గన్పట్టింది. కమలంకూడా అల్లాగే వుంది. షికారు వెడదామని డ్రస్సు వేసుకు బయల్దేరాను.

"బావా దీని కర్థమేమిటోయి?" అని వెనక్కిపిలిచింది కమలం. దగ్గిర కెళ్లాను. అది 'షా'గారి ఇంకో గ్రంథం. "పరస్పరానురాగబద్ధులైన ఇరువురికలయికకి వాళ్లని దూరంగావుంచడమే అత్యుత్తమమార్గ" మని వ్రాశా డాయన. అందులో ఏ మర్థం కాలేదో తెలిసిందికాదు నాకు. "ఇందులో ఏమర్థం కాలే ద" న్నాను.

"అర్థాని కేముగాని, దీన్నిగురించి నీ అభిప్రాయమేమి" టని చిరునవ్వుతో నా ముఖంకేసి చూశి.

నా ఒడలు కంప మెత్తింది. ప్రేమవాహిని హృదయాంతరాళాల్లోంచి ఒక్కసారిగా పొర్లిపోయింది. రక్తనాళాల్లోంచి వెల్లువలై పారింది. పరవశంవల్ల ఒడలు మైమరచింది. నాసంగతి కనిపెట్టి కమలం "కూర్చో బావా బాగాఆలోచించు తొందరలేదులే" అంది ఎదురుగా ఒకకుర్చీ చూపించి.

అప్పు డులిక్కిపడి లేచాను ప్రేమ నిద్దురలోంచి. ప్రేమతత్త్వమిప్పుడు బాగా బోధపడ్డది. నాకే మాట్లాడడం సిగ్గయింది. అయితే వూరుకున్నానా? లేదు. నా హృదయం ఒత్తిడివేదన భరించలేకపోయింది. కమలం రెండుచేతులు పట్టుకుని "కమలం, నిన్ను హృదయపూర్వకంగా, మనసార ప్రేమిస్తున్నాను. నా ప్రేమ ఎంతనిష్కళంకమైందో, ఎంత నిర్మలమైందో యీశ్వరునకే తెలుసును. నీమనస్సు"

"నిన్ను ప్రేమిస్తున్నానో లేదో అనా? బావా మంచి కూచో. ని స్నీవాలకలంతో చూస్తే అత్తయ్యేమనుకుంటుంది?"

"ఏమనుకుంటుంది? ఏమనుకున్నా సరే. నాజీవితరహస్యం నీకు చేప్పేశాను. హృదయంమీంచి పెద్దబరువు దింపినట్టుంది"

"........................."

"ప్రొద్దున్నేగదావచ్చాను. ఇంతలో అంత ప్రేమ ఎల్లావొచ్చిందంటావేమో? ప్రేమలోని ప్రధానపదార్థం మానవాతీతమైంది

నీ విక్కడున్నావుగాని నా మనోవీథిలో నువ్విలావుంటావు, ఇంత పెరిగి వుంటావని ఎప్పుడూ ప్రేమ నీప్రతిమను ప్రదర్శిస్తూవుండేది.

"బావా ప్రేమంటే అర్థ మేమిటో నా కిప్పుడు తెలిసింది. నేను నిన్ను ప్రేమిస్తున్నాను కాని—"

"ఆమాటలు వినబడడంతోటే నాజీవితం ధన్యమైం దను కున్నాను. పరిష్వంగసౌఖ్యానికి బాహువులు చాచాను.

"ఆ...ఆ..."

'ఆ' లేదు. 'ఊ' లేదు. మా తనువులతోకూడా మా ఆత్మలు ఏక మైపోయాయి.

.....................

ఒక్కనిమిషం.—కమలండులిక్కిపడి విదల్చుకుని తలవాల్చు కుని సిగ్గుతో "బావా సరిగ్గా కూర్చో నీ కుర్చీలో" అంది.

నాహృదయం నిలువునా నీరైపోయింది.

"నేను పరస్త్రీనిగదా! నీవు చదువుకున్నవాడవు. ఇల్లా చేయడం నీతి బాహ్యం కాదా?".

"నీవు పరస్త్రీవని ఎవరు చెప్పారు?"

"ఇంకొకరి భార్యను నీకు పరస్త్రీని గానా?"

"నేను నిన్ను ప్రేమిస్తున్నప్పుడు నీవు నాకు పరస్త్రీ వెట్లా అవుతావు."?

"నేను ఇంకొకరికి వివాహం చేయబడ్డాను. వారిసొత్తునయి పోయాను. ఆయనకూడా నన్నుప్రేమిస్తున్నాడు. నీవు నన్నల్లా ప్రేమించడం నీతిబాహ్యం కాదా?"

"మళ్లీ మొదటి కొస్తున్నావు. ప్రేమతత్త్వం బోధపడ్డ దన్నావు. ఇదేనా? ప్రేమలోని, ప్రధానపదార్థం మానవాతీతమైం దని చెప్పలేదా? నీ వాయనను ప్రేమించడం లేదు."

"కాని ఆయన నన్ను ప్రేమిస్తున్నారు."

"అయితే?"

"అల్లాంటప్పుడు నీవు నన్ను ప్రేమించడం, నేను ప్రేమించ నియ్యడం నీతిబాహ్యం కాదా?"

"ఎన్నటికి కాదు. నీతేమిటి? దేవుడు మొదట ఇవన్నీ తెచ్చి పెట్టాడా? నీతి, అవినీతి, మంచి, చెడ్డ, పాపం, పుణ్యం ఇవన్నీ కూడా బాంధవ్యపదాలు (Relatiʌe terms) మంచి లేకపోతే చెడ్డం టారు. నీ నీతి నా అవినీతి. వారివారి భావాలనిబట్టి,వారివారి ఆలో చనలు, రుచులనిబట్టి నీతి అవినీతులు ఏర్పడుతుంటాయి. నాకు ఇష్ట మయింది, నేను ప్రేమిస్తోన్నది, పదిమందికి ఇష్టముండదు. వారు దాన్ని గర్హిస్తారు. మానవనిర్మితులైన వీనినన్నిటిని మానవుడు పట్టుకు వూగులాడడం పరిహాసాస్పదం."

"కాని నీవు చెప్పినట్లు నడుచుకుంటే ప్రపంచం లో ఎంత సంక్షోభం, ఎంత కల్లోలం బయల్దేరుతుందో నీవు గ్రహించడంలేదు."

"నీవు చాలా పొరబడుతున్నావు. ఒకరు నిర్మించిన సాంఘిక కట్టుబాట్లవల్ల, ఒకరు ఏర్పరచిన నీతి అవినీతులవల్ల తాను మానవ సేవ చేస్తున్నానని మానవుడు తలవడంకన్న ఆత్మవంచన ఇంకొకటి లేదు. హిందూసంఘానికి పనికివచ్చింది. అది ఆచరణలో పెట్టు తోన్నది ఇంకోసంఘం గర్హించి విసర్జిస్తుంది. అందుచేత మానవుడు తనకుతానే తన ఆత్మజ్ఞానానుసారం మంచి చెడ్డ విచక్షణ చేసుకు నడవాలిగాని ఇంకొకరిమీద సంఘంమీద ఆధారపడడం చేతగాని పని. దైవసంకల్పానికి విరుద్ధం."

"పెద్దలయెదుట అగ్నిసాక్షిగ పెండ్లాడినభర్తనువదలి-"

"ఒకరిసాక్ష్యమేమిటి పెళ్లికి? 'అయ్యో! మనం ఒకకట్టు బాటు ననుసరించి చేసుకున్నాం,దాని అతిక్రమిస్తే ఇతరు లేమను కుంటారో, సంఘ మేమనుకుంటుందో' అని ఆలోచించి చేసుకుంటే అది వివాహ మవుతుందా? ప్రేమప్రపూరితములైన ఇరువురి హృదయాలకి వారి ఆత్మవివాహం భగవంతుడే చేస్తాడు. అట్టితరి దాన్ని విచ్ఛిన్నంచేసి మానవనిర్మితమైన కట్టుబాట్లకి లోబడి ఉండ డంకన్న దైవద్రోహం వేరే ఉండబోదు. అందుకనే హిందూకుటుం బాల్లో 99 పాళ్లు సంసారం అంత శృంగారరహింతంగా వుంటుంది. పెద్దలు, ఋషులే కావచ్చు, ఏర్పరచినకట్టుబాట్లు తప్పని, ప్రకృతి విరుద్ధములని వారికి తెలునును. అందుచేతనే సంసారాన్ని వారు విచారసాగర మన్నారు."

"....................."

"తెలిసిందా! క్రమంగా మనం ఇప్పుడు కొన్ని వేల సంవత్స రాల తరువాత మేలుకొన్నాం. ఆధ్యాత్మికానందానికి, పరలోక సౌఖ్యానికి ఇహలోకంలో కష్టపడాలని మనపూర్వుల అభిప్రాయం. అది శుద్ధపొరబాటని చెప్పనుగాని వాళ్లు ఒకవైపే తీసుకున్నారని నా అభిప్రాయం. 'ఎందే డెందముగందళించురహిచే నేకాగ్రతం... 'ఆనందో పరబ్రహ్మ' అని చెప్పిన నుడువులుకూడా పై రెండింటికి త్రోవలే?"

"కాని అట్లాంటివి 'తుచ్ఛ సుఖముల్, మీసాలపై తేని యల్' అని త్రోసివేయలేదా?"

"చేశాడు. అది వాడికి ఆకవికి ఉత్తమమార్గమయింది. అం దుచేత వాళ్లు ఆధ్యాత్మికానందునికి, పరలోకసౌఖ్యానికి ముక్కు మూసుకుని 'కరణులు, దర్భలు మొదలైనవాటితో నిత్యకృ త్యాలు తీర్చుకోవడం ఒకటే సాధనమనుకున్నారు గనుక."

"అయితే ఇంకోసాధనం వున్నదా?"

"ఆ. ప్రేమప్రపూర్ణులైన ఇరువురు స్త్రీపురుషులు వారిప్రేమ ఐహికసుఖాలవంకకి మరలినంతసేపు గృహస్థాశ్రమంలోనుండి శృం గారసౌఖ్యాల ననుభవిస్తో మానవసేవ చేస్తే అదీవాటికి మార్గమే. ముక్కుమూసుకు వేదాలువల్లిస్తో కూచోడం కన్న ఇవే ఉత్తమ మార్గం. మానవసేవ అత్యుత్కృష్టమైంది. అదే కర్మయోగం. అదే తక్కిన యోగాలికి ముఖ్యసాధనం."

♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦

కమలం ఒక్క నిట్టూర్పు విడిచింది.

"బావా! అయినా ఈజన్మలో నేను నీదానను కాజాలను. మరుసటిజన్మములోనైనా మనలనిద్దర భార్యాభర్తలుగచేయ భగ వంతుని ప్రార్థిస్తాను. నాజీవితం మకరందపరిమళములు లేని ఒకపూవు వంటిది, అది పై అందాన్నిచూశి మురిసేవాళ్లకే తప్ప నీకుపనికిరాదు.

"అదే పిచ్చివూహ. ఈజన్మంలోమాత్రం నీవు నాదాన వెందుకు కాగూడదు?"

“నీవు కోరేది తుచ్ఛ ఐహికసుఖం. పరస్పరానురాగ బద్ధులైన ఇరువురి హృదయాలు దూరంగావున్నా! సంప్రతిస్తూనే వుంటాయని చెప్పలేదా ‘కార్లైలు కవీశ్వరుడు?

“అవును. కాని మనలాంటి మానవమాత్రులకి ఇంకా ఆనంద పరిపూర్తికావాలంటే, భౌతికసౌఖ్యాలుకూడా కావాలి. ప్రియుల భౌతికానందంలో కొంత పరమార్థం ఉంది. అది వారి నేకీభవింపజేసి, భగవంతుని సచ్చిదానందునిగ గ్రహింప వీలు గలుగజేస్తుంది.”

“బావా! నా ప్రేమసంగతి నీకు తెలియదు. ఇన్నేళ్లనుంచి నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్ను పొందాలంటే పొందగలను. కాని నా కది ఇష్టంలేదు. నా ప్రకృతి కావచ్చు, లేక నా స్వభావం కావచ్చు, నా మనోభావం కావచ్చు. ఆ తాపంలోనే, ఆ నిరాశలోనే, ఆ ప్రేమాభంగం లోనే ఒక ఆనందంవుంది. ఆ బాధలో ఒక విధమైన శక్తివుంది. నా కదే ఓర్పునిస్తుంది. నిన్ను ప్రేమిస్తున్నాను. అదే నాకు కావలసినది. నా కీ జీవితంలో భౌతికసుఖంకూడా లేదని తెలుసును. మానవమాత్రులై పుట్టినతరువాత కామతృష్ణ (Sex-passion) సాధారణంగావున్నా అది భార్య భర్తయెడల విధిగా నిర్వహిస్తుంది గాని, అవసరంగా తీసుకోదు. నాలాంటి స్త్రీలు హిందూకుటుంబాల్లో కోట్లకొద్దీ వున్నారు. వాళ్లనుభవిస్తున్నది సంసారసుఖం కాదని చెప్పవచ్చు. జ్ఞానులై........

“అమ్మాయీ! ఎంతసే పామాటలు! భోజనం వేళయింది తెలుసునా? ఇవ్వాళ నాన్నగారు అన్నయ్య ఆలస్యంగావస్తారు బావని మడికట్టుకోమను.”

నేను ఆ రాత్రి బండికే బెజవాడ వదిలిపెట్టాను. కమలం విగ్రహంహృదయఫలకంమీాదపరిస్ఫుటంగాముద్రింపబడిపోయింది. ఇక ఎన్నితుపానులైనా ఆ దివ్యమూర్తిని చెరిపెయ్యలేవు. ఆమె ఆఖరుమాటలు “నాలాంటిస్త్రీలు హిందూకుటుంబాల్లో కోట్లకొద్ది వున్నారు. జ్ఞానులైతే......”? ఏంచెప్పదల్చుకుందో కమలం?

---

# కవులు నిరంకుశులు

గుండిమెడ వేంకట సుబ్బారావుగారు.

సీ॥ హిమవ న్మహీధరాగ్రమునుండి పుడమి లం
ఘించు గంగాతరంగిణి యనంగ
అగ్నిభూధర గర్భ మవలీలఁ జీల్చి మి
న్నంటు మహోగ్రానలార్చి యనఁగ
అరిలోక దహన లీలార్థి గాండివ శరా
సన ముక్త దుర్జయాస్త్రం బనంగ
జలద పంక్తులనుండి జాఱి, భూగర్భంబు
భేదించి చారఁ బారు పిడు గనంగ

గీ॥ దుర్నివార ప్రభావ విద్యోతగతుల
పొడముచే మానసంబునఁ దడవు గాఁగ
ఎట్టి నిజమనోభావార్థ మేని యిట్టి
వెలికి రాకున్నె కవి మనో వీథినుండి!

సీ॥ తన వాక్ప్రతాప దుర్దాంత మహాగ్ని క
క్రను ధూర్త చక్రంబు కంప మొందఁ
తన సుధామధుర సుందర గాన వాహిని
కఖిలభూతములు జోహా రనంగ
తన దివ్యశాల శీతల ముఖ్యజ్యోతి క
ద్భట తమఃపటలి విధ్వంస మొంద
తన సూక్ష్మ దృగ్జాలమునకు దృశ్యాదృశ్య
బహుళ విశ్వము బట్టబయలు గాఁగ

గీ॥ అద్వితీయ కాంతుల మయూరాసనంబు
నందు వాణీసమేతుఁడై యధివసించి
మించి పదునాల్గు భువనముల్ సంచరించు
సత్కవి నిరంకుశుఁడు కాఁడె జగతిలోన.

సీ॥ ఆగ్రహం బుదయించెనా, పీన్గు చితి యాను
మణి రత్నఖచిత సింహాసనంబు!
కారుణ్య మొదవెనా కఠిన దరిద్రతా
స్థానంబు సౌభాగ్య ధామ మగును!
వైషమ్య ముండెనా వసుమతీ నరక మై
తనరు నెట్టి నరేంద్రు మనికి యైన!
అభిమాన మొప్పెనా యతినిష్ఠురంపు జీ
వనమేని భూతల స్వర్గ మగును!

గీ॥ అహహ! సర్వస్వతంత్రుఁడై యఖలవేది
యై, యవార్య శాపానుగ్రహ ప్రభావ
గణ్యుఁ డగుచు, నమోఘ సంకల్పుఁడైన
సత్కవి నిరంకుశుఁడు కాఁడె జగతిలోన!

చ॥ కనులను మంటలొల్కవు ముఖం బిసుమంతయు జేవురింప దా
త్మను దురహంకృతోద్ధతులు మచ్చునకేనియుఁ గానరావు! ధూ
ర్తనయుల మార్గవర్తన కతంబునఁ జిత్తము ఖేద మంద దే
మనఁదగు! సత్కవీశ్వరు హృదంతర రీతులు చిత్ర చిత్రముల్!

సీ॥ లేదు రాజభయంబు లేదు లోకభయంబు,
ఆత్మీయశక్తి నిరంకుశంబు!
లేదు భాగ్యస్ఫూర్తి లేదు దారిద్ర్యంబు,
కలిమిలేములు మూర్ఖ కల్పితములు!
లేదు సంతోషంబు లేదు విచారంబు
సకలంబు నానందసాగరంబు!
లేదు మిత్రగణంబు లేదు శత్రుగణంబు
జన్మలగ్న మజాత శాత్రవంబు!

గీ॥ అహహా! కవిచంద్ర! సకల కల్యాణసాంద్ర!
సిద్ధ సుకవితా సామ్రాజ్య సింహపీఠి
నధివసించి బ్రహ్మాండంబు నరయుచున్న
నీకు నెదు రెందు కలదె ముల్లోకములను!!



ప్రేమోన్మీలనము

శిల్పి: ఉపేంద్రనాథ దోస్తేదారు.



# కళాప్రోత్సాహము

డాక్టరు బుర్రా శేషగిరిరావు పంతులుగారు ఎం. ఏ., ఆంధ్రభారతీ తీర్థప్రధాని, విజయనగరము.

మన దేశమును కలవరపరచుచున్న సమస్య లన్నిటిలో స్వాతంత్ర్యసమస్య యగ్రగణ్య మయినది. ప్రపంచమందలి యితర రాజ్యము లెట్టి స్వాతంత్ర్యము గలిగి దినదినప్రవర్ధమానము లగుచున్నవో అట్లే మన దేశమును తొల్లిటివలె స్వతంత్రత గలిగి సమస్త వైభవములతోను తులదూగుచు దినదినాభివృద్ధి గాంచవలెనని మన భారతీయు లందరి యాశయమును నైయున్నది. ఆర్థిక స్వాతంత్ర్యము గల్గినగాని రాజకీయ స్వాతంత్ర్యము కలుగనేరదనియును, అంతా అంగీకరించిన సిద్ధాంతమే. కేవలము ముసద్దీ వృత్తిచేతను, తత్తుల్యము లగు నౌఖరీ వృత్తులచేతను, ఆర్థిక స్వాతంత్ర్యము చేకూరనేరదనుటయు నందరికి తెలిసియే యున్నది. పూర్వము హిందూదేశమున నీ ముసద్దీనౌఖరీవృత్తు లేకొద్దిమంది గలజాతులకో వంశపారంపర్యము లైయుండి దేశీయులలో మూడువంతు లందరు స్వయంకృషి చేసి స్వతంత్రజీవనము చేయుటకు తగిన వృత్తివిద్యల నభ్యసించి యుండిరి. కాగా దేశములో పారతంత్ర్యము తక్కువగా నుండెను. ప్రస్తుతపు విద్యావిధానము వల్ల వృత్తిజీవన విద్యలయందు నిరసనభావమును, ముసద్దీ వృత్తులయందు గౌరవమును కలిగియుండుటచేతను, విద్యావిధానమంతయు ముసద్దీవృత్తికే అనుకూలముగా నేర్పడియుండుటచేతను, ముసద్దీ వృత్తిలో ముసలికాలము వచ్చుసరికి రాజకీయముగా వ్యక్తులకు పెద్దపదవులు లభించుచుండుటచేతను, విద్యాభ్యాసమునకు దిగినవారిలో చాలామంది యిట్టి విద్యయే పరమావధిగా చేసుకొని వంశ పారంపర్యముగా తమ తమ జాతములలో గల వృత్తివిద్యలయందు నిరసనము చూపి యుభయభ్రష్టులై నిరుద్యోగపు సమస్యను దేశములో తెచ్చిపెట్టుటకు కారణభూతు లగుచున్నారు. పూర్వము మన దేశములో విద్యలు, కళలు, అనేకముగా ప్రబలి యుండినవి. దేశ మీ విద్యలును కళలును ఉపాసించుటకు తగిన సాధనసామగ్రి సమకూర్చి యుండెను. వంశపారంపర్యముగా ఆయా జాతములలో నచ్చుచుండిన జ్ఞానముగాక గ్రంథస్థమై గురుకటాక్ష ప్రాప్తము కాగల ప్రయోగమూలక విద్యా కళాజ్ఞానము పలువిధములుగ లభ్యము కాగలిగి యుండెను. జైనులు, బౌద్ధులు, శైవులు, అజీవికులు, వైదిక సన్న్యాసులు మొదలగు కర్మజ్ఞాననిష్ఠాపరాయణు లెందరో గిరిగహ్వరాంతరములలో గల తమ తమ గురుకులములలో శిష్యుల కిట్టివిద్యలయు, కళలయు, రహస్యములను ప్రయోగమూలకముగా ప్రత్యక్షప్రమాణములతో బోధించుచుండిరి. ఏ యొక్క విద్యయో కళయో సాధించినయెడల మనుష్యునికి జీవితములో సౌఖ్యము చేకూరుచుండెను. ఆ జ్ఞాన మేమైనది? ఆ గ్రంథము లేవైనవి? రాజకీయ విప్లవములలో కొన్ని దగ్ధమై పోయినవని చెప్పక తప్పదు. కాని యింకను కొన్ని మిగిలి యున్నవి. కొన్ని రాజ్యాంతరముల పాశ్చాత్యులను చేరుకొన్నవి. పోగా మిగిలిన వైనను మనము సంగ్రహించినయెడల, సంగ్రహించి విద్యావిధానములోనికి దించినయెడల, నూతనప్రయోగమూలకములుగాజేసి పరిశోధనల కాధారము చేసికొన్నయెడల, తిరిగి మనదేశములో వృత్తిజీవితము రేకెత్తగలదు. వృత్తులు అర్థవంత మయినయెడల దేశము భాగ్యవంతమగును. ఆర్థికస్వాతంత్ర్యము చేకూరును. దానంజేసి రాజకీయ స్వాతంత్ర్య ప్రయత్నము సుకరమై సుగమమై పోవును.

వృత్తిజీవితమునకు తగిన కార్మిక విద్యాప్రదానమునకు ప్రాముఖ్యముగల విశ్వకళాపరిషత్తును ఆంధ్రదేశమందు స్థాపింపవలెనన్న కోటానకోట్లు వెచ్చించవలె నని యందురు. పాశ్చాత్యదేశములందు సంవత్సరములకొలది కృషిచేసి యొక తరగతి యభివృద్ధికి తేబడిన వృత్తివిద్యల నా దేశములో నెట్లు బోధింతురో అచ్చముగా ఆరీతినే బోధింపగల పరిషత్తు కావలసినయెడల నట్లే యనుకొనవచ్చును గాని దేశీయము లైన వృత్తివిద్యలు నేర్పుట కంత ధన మవసరములేదు.

బట్టల నేతలో సాఫుపని, రంగులు వేయుటలో సాఫుపని, పైరు పంటలు తెగులు పట్టకుండా నిలుపుకోగల సాధనములు; జలాశయములు నిర్మించుటకు కావలసిన భౌతికశాస్త్రము, ఖనిజశాస్త్రము, ఔషధతంత్రము, సంగీతము, నాట్యము, శిల్పము, తోళ్లు బాగుచేసుకోగల శాస్త్రము, అశ్వశాస్త్రము, రత్నశాస్త్రము, హేమతంత్రము, వాస్తుశాస్త్రము, చిత్రలేఖనము, నీరు బాగుచేయు శాస్త్రము, విషవైద్యము, పశుశాస్త్రము మొదలగున వెన్నియో కార్మికవిద్యాబోధకము లగుశాస్త్రములు పోగా మిగిలియున్నవి దేశములో కలవు. ప్రారంభములో గురు శిష్యులకీ గ్రంథములలోని యంశము లవగాహనము చేసుకొనుటయు, వీటిని గూర్చిన ప్రయోగములు (Experiments) స్వయముగా చేసి చూచుకొనుటయు పని యగును. ఈ గ్రంథములను సేకరించి ముద్రితము చేయుట మరియొక పని యగును. కేవలము విద్యావిషయక వాదగ్రహణమునకే యుపయోగపడునవి గాక ఇట్టి ప్రయోగము లెంతవరకు సిద్ధించిన నంతవరకే సఫలములు కాగలవు.

ధనుర్విద్య చూచుకొనుడు. దీనిలో పూర్వము రెండు భాగము లుండెను. అస్త్రభాగము, శరభాగము. కేవలము శరలాఘవముచేతనే చేయగల యద్భుతచర్య లీ శాస్త్రములో నెన్నో కలవు. అర్జునుని ధనుర్విద్యా కౌశలమును ప్రకటించిన వనులలో చాలామట్టుకు శరలాఘవము ననుసరించినవే. ఈ విద్యలో మంత్రసాధ్యములగు అస్త్రములు "విద్యలు" "మహిమలు" అనవగును. శరలాఘవముపై నాధారపడి అభ్యాసవిశేషమున సాధ్యము కాగలవి "కళా" విశేషములు, ఆంధ్రమందు "ధనుశ్శాస్త్రము" పాకలపాటివారు, క్షత్రియులు రచించినది కలదు. దాని ప్రతులు కొన్ని కీ॥ శే॥ శ్రీ శ్రీ శ్రీ తుని రాజాబహా

ద్దరువారు ముద్రింపించిరి. కాని అది దేశప్రఖ్యాతము కాలేదు. ఉదారపురుషులు ప్రకటించ దలచినయెడల ఆంధ్ర భారతీ తీర్థ మందలి ప్రతియు, శ్రీ శ్రీ శ్రీ డవేజరు రాణీసాహెబా ఆఫ్ తుని వారు ఆంధ్రభారతీ తీర్థమునకు దయచేయించిన ముద్రిత ప్రతియు పోల్చి, ఆంధ్రభారతీ తీర్థముపేర పీఠిక వ్రాసి యివ్వగలను. అర్జునుడు చేసిన అద్భుతపు పనులన్నియు అభ్యాసయోగమున చేయగల సామర్థ్య మెట్లు చేకూరునో ఇందులో చెప్పబడి యున్నది. గ్రంథమే గురువు. విల్లులు, అమ్ములు, నారి అన్నియు తయారు చేసుకోవడమునకు మార్గములు బోధింపబడి యున్నవి. ఇవి పని మరుగులు (Trade Secrets) మోటారు బళ్లు దేశములోకి దిగుమతి యగుచున్నవి. మోటారు బళ్లకు కావలసిన భాగములును దిగుమతి యగుచున్నవి. కాని ఈ భాగములన్నియు తయారుచేయగల జ్ఞానవిశేషములుమాత్రము పని మరుగులు (Trade Secrets) ఇవి దేశాంతరములలో కార్మికవిద్య నేర్చిన మనవారికిని లభ్యము కాలేదు. అట్లుగాక పని మరుగులు కూడా మర్మము విడిచి బోధించే గ్రంథమీ ధనుశ్శాస్త్రము. ఇది యొకడు నేర్చి యభ్యాసమునకు దించి యందలి యద్భుతకార్యములు సాధించినయెడల ఆత్మ సంతుష్టికే గాక అత్యద్భుత హస్తలాఘవము చూపి ప్రజల మెప్పించి వేలకువేలు ఆర్థికముగా నార్జించగల కౌశలము లభించును.

ఇక మంత్ర సాధ్యము లగు అస్త్రభాగములును పూర్తిగా అంతరించలేదు. ఆంధ్రదేశములో అది కొన్ని కొన్ని చోట్ల గుప్తముగా నున్నది. బ్రహ్మాస్త్రము, నారాయణాస్త్రము మొదలగునవి కలవు. కాని మన దౌర్భాగ్యముచేత మన దేశీయుల శాస్త్ర విశ్వాసమును, ఆత్మశాస్త్ర విశ్వాసమును అంతరించిపోయినవి. కారణములకు వెదకుటతోనే మనము కాలము గడపుచున్నాము గాని, పోగా నిలిచియున్న జ్ఞానమును జమచేసి పరిశో చుటకు తగిన యేర్పాటులు చేయకున్నాము. ఈ కార్మిక జ్ఞా పునరుజ్జీవనమునకు రెండుమార్గములు కనబడు చున్నవి.

౧. కళాప్రదర్శనములు పెట్టి, ఏ కార్మికవిద్యయం నైపు కౌశలములు చూపగలవారికి ప్రోత్సాహకముగా బిరుదపత్రము పతకములును ఇచ్చుట. ఇది పోటీమార్గముగా గాక పరీక్షామా ముగా నుండవలెను. ఈ పని కొంత ఆంధ్ర భారతీ తీర్థవ యుత్సవములలో ప్రతి సంవత్సరమును జరుగుచున్నది.

౨. కార్మిక జ్ఞానవంతము లగు గ్రంథములను, గ్రంథ మూ ములను సేకరించి ప్రచురించుట. గ్రంథసంగ్రహము ఆంధ్రదేశ నందలి వివిధ గ్రంథాలయములలో జరుగవచ్చును. అట్టి గ్రం సూచికలను "సమదర్శిని" వంటి పత్రికలు ప్రకటించు వచ్చును.

౩. ప్రయోగ పరిశ్రమలు.

ఇవి జరుగుటకు తగిన యేర్పాటులు వివిధ విద్యాలయ ములలో జరుగవలసియుండును. ప్రస్తుతపు విద్యాలయముల గవర్నమెంటువారును, విశ్వకళా పరిషత్తువారును ఏర్పరచిన గ్రం బోధనము పరీక్షాధికారులను మెప్పించుటకు మాత్రము కావల రీతిని బోధించుటతో సరిపోవుచున్నది. దీనివల్ల జ్ఞానమా అభి కావడము లేదు. ఐహిక తారణోపాయమా కలుగుట దీనికి తోడుగా ఆయా విద్యాలయ పరిస్థితుల కనుకూలము కార్మిక విద్యాబోధన కొంత జరుపబడుచుండినయెడల కొంత కొంతయైనను లోకోపకారము కాగలదు.

దేశాభిమాను లీ యంశమును తగురీతిని విచారణచేసి దే మున కార్థిక స్వాతంత్ర్యము చేకూరగల కార్మిక విద్యావిధానము ఏర్పరింతురు గాక!

---

## సుకారిపిల్ల

కవికొండల వెంకటరావుగారు.

గీతిక

ఆపిల్లకేసి నేజూస్తే
యౌవనవతి యని చెప్పి
చూడలేదు. సొగసైన
చేడె మిన్న యని చెప్పి
చింతన మిడలేదు.
పిల్ల తనదు నెఱికురుల
నల్లుకొన్న తెలిగవ్వల—
పిల్ల తనదు మణికట్ల
వేసికొన్న తెలిగాజుల—
పిల్ల తనదు పాదములకు
బెట్టుకొన్న చిఱు మువ్వల—
నలరి, తలరి, యరసితి నోహో —
..........................
సుకారిపిల్ల
శకావికానవు

లోకేవితముగా—
కోడెదూడకంటె
కొమరు మీఱియుండె
దూడమెడను మువ్వ
దూడమెడను గవ్వ
చేడె మిన్న గవకు
చేడె మిన్న మువకు
జోడు గుండ దన్నా
వాడి మాట గాదు,
స్వేచ్ఛకూడ నంతే;
పిల్ల కోన నడుమ
నుల్లసిల్లు తీరు
మల్లి చూడమెందు;
బొంత పరికిణీ పై
వింత రంగు పయట—

పుఁటిపొద్దు కాంతిఁ ;
వెలుగు గొలుపుచుండు.

........................

"రాగిడిస్త పిల్లా!
రంగుగాజు లేస్తా!
అంగడిలో నీ కమరే
అన్నినగలు తెస్తా!"
"వద్దు నాకు మాంవా!
ఎద్దునమ్ముకుంటూ
ఎద్దుమెడను గవ్వ
ఎద్దుమెడను మువ్వ
దిద్దు చుందు నేను.
దిద్ది దిద్ది నేను
ముద్దు గొందు దాని.
దాని కంత సొగసు
వేనివలన వచ్చె?
గవ్వవలన కాదె?
మువ్వవలన కాదె?
గవ్వ అంటె గవ్వా?
కడలిఱోఁర గవ్వ!
మువ్వ అంటె మువ్వా?
నవ్వకోరి మాంవా!"

---

## 'కార్తీకి' నుండి కొన్నిపాటలు.

దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు.

మ్రోయింప కోయ్ మురళి మ్రోయింప కోయ్ కృష్ణా
తీయ తేనియ బరువు మోయలే దీ బ్రతుకు !

మురళిపాటకు రగిలి
మరుగు నీ వెన్నెలలు ;
సొగయు నాయెద కేల
తగని సౌఖ్య జ్వాల !

కాలు చల్లదనాలొ!
కనలు తీయదనాలొ!
వలపు పిల్లనగ్రోవి
పిలుపులో, సొలపులో !!

వలదోయి, అలము నీ
కలలలో నిదురింతు!
భరమోయి నీ ప్రేమ
వరమే నేటి రేయి !!

మ్రోయింప కోయ్ మురళి
మ్రోయింప కోయ్ కృష్ణా!!
ఎడబాసి పోకోయి యీదాసి నీరేయి
ఈ యెదకు నిమునమే

నెడబాటు విసమేను!
చెదరు నా బ్రదుకులో
కదలు స్వప్నాలలో
నీ సొగసు నీలాల నిలుపలే దేవేళ !

పరచు నీ పద మాగ,
బ్రదు కంటికొని పోగ
విడని సంకెలగ నా యెడద బంధింపనా !
నీచరణ ధూళిలో

నిదురించు బ్రదుకులో
ఏతావు లెగయునో, ఏ తేనె లలయునో !

ఎడబాసి పోకోయి
ఈ దాసి నీరేయి !!

ఏ విసువు లేదు నా హృదయేశ్వరునకు నా
కే వేదనైన తన వేణూత్సవమ్మేన?
అలయ దా రేయి వెన్నెలల మల్లియ యెడద,
ఎడలేని యమృతాల జడులేల ఆబేల

కేవిసువు లేదు నాహృదయేశ్వరునకు-

ఎగయునా యమున హృదయమున నల లేవయిన,
సొగయించు వాసనలె సెగలైన ఆదీన

కేవిసువు లేదు నాహృదయేశ్వరునకు-

భరియించుకోగలది నిరుపేదరాలి యెద,
పులకించు సుకములే పొరలగా విరియగా-

ఏవిసువు లేదు నాహృదయేశ్వరునకు-

నేడే రమ్ము నేడే రమ్ము వాడిన యీ సుమము గోయ !
నేల వాలిపోవునో, పెం ధూళి కేగివేఁగానో !!!

విసరు గాలి తొందరలో,
వేసవి నిశ్వాసములో !

మసలకోయి, యీనిముసపు కొసనె గాదె నామనుగడ !!

మసురు రేయి తొలిచీకటి
మసక మసకలే యలమునొ !

మసలకోయి, నీ పూజా మంగళ సమయమె పోవునో !!

మస్రునా శ్రీగళమాలిక
మలసి నిలుచునో లేదో !

మసలకోయి, మధువు లేల, మధురపరిమళము లేల !!

కొనుగోరుల తురుమవేమొ !
కూర్పవో బాధా భాగ్యము !

మసలకోయి, మసలకోయి, మన్నింపవొ? జాలి మనవి !!

నేడే రమ్ము నేడే రమ్ము
వాడిన యీసుమము గోయ !!!

# పూజాభంగము.

పి. అన్నాజీశర్మ గారు.

నగము నిద్దురలో సుఖ స్వప్న మట్లు
కనులకుం గట్టు నీ రూపమును మదీయ
హృదయమున నిల్పియుండఁగా నెదియొ కాని
తెలియరాని కంఠము నన్ను బిలిచిలేపె.

అపుడు మెల్లన దూరంబునందు మావి
తొలి చిగురు తిండి కోయిల కలికి పాట
యలలుగా, తావిగా గాలియందు వచ్చి
నిల్చి పోయిన నన్ను మంత్రించి వైచె.

౨

నిశ్చలంబగు నీదుమూర్తిని
భక్తితో పూజించు వేళల
తన్మయత నేకాగ్రదృష్టిని
సర్వమున్ మఱ పొందితిన్.

నీవె లోకము గాఁగ భావనఁ
జేయుచుండెడు వేళ నేదో
భ్రాంతి మైమఱచితే యిటు
వంతలన్ ననుఁ గ్రోసెదే?

౩

తమ్మిగొలఁకుల కెలఁకు లందున
సరసి చలువ పిసాళి గాలుల
వలపు లేపులు వీచు వైపుల
కేగఁగా మన సయ్యెనే?

తరఁగలందలి తళతళం గన
మెఱపులందలి మిలమిలం గన
కారుమబ్బుల కలకలం గన
దీనబంధూ పోయితే?

వియద్గంగా వీచికలపై
తేలియాడే హంస దంపతు
లార్ద్రహృదయము లైక్యపఱచుక
మెలఁగుట ల్గనఁబోయితో?

లీలగా చదలేటి తుంపర
లోపలన్ కనకంపు పీఠిక
మీఁదట న్నవరోహణం బొన
రించి పో మన సయ్యెనో?

చిగురుదొన్నెలఁ బూవుఁదేనెల
గ్రోలు లసకృన్మత్త మధుచయ
గీత నిస్వన లహరి మ్రోసెడు
పూఁబొదల్లకుఁ బోయితే?

హరిత రంజిత శాద్వలస్థలి
మధురిమంబున మధురుతంబుల
మసృణ రాగ లహరిని నింపె
నెమళుల న్విననఁబోయితో?

ప్రసవ సుందరి నిండు కౌఁగిట
భ్రామికొనిన పరీమళంబుల
లోని కమ్మని చల్లఁదనమును
ద్రావఁగానే పోయితో?

ఉదయభానుని శాతకిరణో
న్మీలితంబున పరిమళించెడు
వారిరుహములలోని మధుపూ
రంబు గ్రోలఁగ బోయితో?

వ్రాలు సంజలు మెఱుగు వాఱిన
మబ్బుతున్కల పరుగు లాటల
దారి తెలియక యాకసంబున
దారులాడుచు నుంటివో?

౪

పూవులో తేనె చుక్కగా భువికి జాఱి
యింకిపోయిన నా వల పేల నీకు?
సుమములో తావిగా గాలి సురిగిపోయి
ఎగిరి పోయిన నావల పేల నీకు?

నీవు వచ్చెద వనునాస నిలుపలేని
యలలు పుట్టించె నా హృదయంబునందు,
నీవు న న్నేలు దనునాస భావిలేని
యున్నతిని ముందుఁ బెట్టి నాచిన్న మెదకు.

మన మనసు లెవ్వ రెఱుఁగరే మాటలాడి
కొన్న యాక్షణముఁ బ్రదికియున్న నాళ్లు
మరల మరల నాయెడఁదలో మరిగి మరిగి
రేపి పుట్టించు నవియె వెఱ్ఱితలఁపులను.

౫

మాధవీలత కభిముఖంబుగ
నీవు నిల్వఁగ మించు స్వరముల
నాలపించెడి కదలికలతో
బరవశతగను వీణయున్.

దివ్యమోహన మందిరాంతర
భవ్య నిర్మిత కనకవేదిని
భక్తితో మీ కమరఁజేసిన
ప్రణయ పూజాపీఠమున్.

పొంగి పొరలెడు దుఃఖ మంతయు
మ్రింగివేయుచు నిన్ను కన్గొన
వేచియున్నవి, కరుణఁ బ్రోవఁగ
వేగ రాఁగదవే!

* * *

నీకొఱకె నీకొఱకె సుమీ నిలువలేక
నిలుపలేని తలపు లేవేవొ కలచి వైవ
యలలో పూవువలె తెలియంగరాని
గతులఁ దిరుగాడు చుంటి, నన్ గావరాదె.

# అచ్చుతప్పు

కొండెకాడు

మూడురోజు లాలోచించి, ముచ్చట తీరా "మురళీమోహన" మని మూడు ముత్యాల సగాలురాశాను. పద్యాలు చాలా బాగున్నట్టు కనిపించాయి. అంటేయేమిటి? ఆకల్పన - కల్పనకు తగినమాటలు - మాటలలోని మధురిమ - మధురిమలోపలి లాలిత్యము-లాలిత్యములోని...ఇన్నెందుకూ? చాలా బాగానే ఉన్నాయి. పద్యాలు. పైవాళ్లకు వినిపిస్తే ఎలాగుంటుందో అని చూచాను. అప్పుడక్కడ, సుబ్బావధాన్లుగారి భార్య, మా మేనల్లుడు ఇంటర్మీడియేటు చదువుతున్నాడు వాడూ, మా ఆవిడా, ఆసమయానికి వచ్చిన మాజోస్యులుగారూ (చెవిటి జోస్యులంటారుగానీ అతని కేమి చెవుడు?) వీళ్లందరున్నారు. అందరినీ కొంచెం వినండని ఆ పద్యాలు చదివాను. నిజంగా, నేను చదువుతూవుంటే, వాళ్లంతా అలా కొయ్యలైపోయి నిలబడిపోయారు. చదివి ఆగేసరికి, "మరి లేవా?" అని అందరూ (జోస్యులుగారు తప్ప) ఒక్కసారి అడిగారు. దానితో వాళ్లహృదయాల్లో భావరాగాలు శృతి వేసుకుంటున్నా యని గ్రహించి పద్యాలు పనికిమాలినవికా వని స్థిరపర్చుకున్నాను.

తరవాత, చిన్నఉద్దేశం కలిగింది. పోనీ, నాలుగు రూపాయాలు పోతే పోతాయిగానీ, ఈ మూడు ముత్యాలసరాలూ చిన్న "ఖండకావ్యం" కింద అచ్చువేసి; నలుగురి కిస్తే సంతోషిస్తారు గదా అని అనుకున్నాను. ఎలాగైతే నేం? మా గవరసెట్టి ధర్మాన్ని అచ్చువేయించాను. అచ్చులో ఆపద్యాలు చూచేటప్పటికి నాకే చెప్పరాని ముద్దువేసింది. సంతోషముతో సంగీతం వరసను చదివాను—ఇం కేముంది! చతికిల బడ్డాను!—ఏమంటా రేమిటి? అర్థం పాడయింది: 'అంతడబ్బూ వ్యర్థమయింది—రెండో పద్యంలో మూడోపాదంలో "ప్రణయ" మని ఉండడానికి బదులు "ప్రళయ" మని అచ్చుపడ్డాది...ప్రణయమంటే ఏమిటూ! వల్లకాడు! ప్రణయమంటే ప్రణయమే! ప్రేమ, అనురాగం, అంటే పేలవంగా ఉంటుంది—దాన్ని పాడుచేసి ప్రళయంచేశాడు దుర్మార్గుడు—అచ్చుతప్పని మెల్లిగా అంటా రేమిటి? కొంపలుతీసినతప్పుకాదూ యిది!

నా కొళ్లంతా మంటలెత్తుకుంది. కడుపులోని మంట కళ్లల్లోకొచ్చింది. అచ్చువాళ్లమీదికోపం ఆపుకోలేకపోయాను; అమాంతంగావెళ్లి అచ్చాపీసంతా ఆపోసనంపడతే బాగుంటుందని అనిపించింది—ఆహా! అదికాదు, తప్పు కూర్చాలంటే మరెక్కడా చోటులేదూ? తప్పులేకుండా అచ్చువేస్తే తప్పుగాబోలు ఈ తెలుగువాళ్లకి? తెలుగచ్చులో తప్పులేకపోతే దేవతలు శపిస్తారో! కాబట్టే అశుద్ధపత్రిక లాంధ్రంలో అలవాటయి పోయినాయి. పోనీ యండి, తప్పులిప్పకుండా ఉండవలసిందే అనుకుందాం—మరెక్కడ వెయ్యకూడదా—మరెక్కడ వెయ్యకూడదా ఆదిక్కుమాలిన తప్పు? జలంఅంటేమలం అని వేసేటట్టు, సరిగ్గా ప్రణయాన్నే ప్రళయం చెయ్యాలీ? లేమలేదు! ఇది సాధారణమైన పొరపాటు కాదు. ఉద్దేశపూర్వకంగా, చెయ్యాలని, చేసిందే యిది. ఆహా! పద్యాలు బాగున్నాయని పాడుచెయ్యాలని చూచారు. ఇదంతా ప్రబంధవాదులకుట్ర. అవును వాళ్లదే! కొత్త కవిత్వమంటే గొంతు కోసుకుంటారు. అయితే? అచ్చువాడి కేంపో యీకాలం?

ఇలా అనుకుంటూ ఉంటే నా కాపాదమస్తకమూ అగ్నిజ్వాలలు పరిగెట్టాయి. సాధారణంగా నేను ప్రళయ మూర్తిగానే ఉండేవాడను; కాని, నిజంగా, ప్రళయమూర్తినై పోయాను. అక్షరాల్లోవచ్చిన అచ్చుతప్పు ఆత్మలో కెగబాకిరి పోయింది. దాస్‌తో ప్రళయకాలరుద్రుడిలాగ లేచాను. లేచేసరికి, మా గురువుగారిమాట జ్ఞాపకంవచ్చింది. "అపరిమితంగా కోపంవస్తే, అరవైదాకా లెక్కపెట్ట" మన్నారు మాగురువుగారు. ఆసూత్రం ప్రకారం లెక్కపెట్టడం మొదలుపెట్టాను. పందొమ్మిదీ, ఇరవై, యిరవైయొకటీ, యిరవై రెండూ అనేసరికల్లా, బోధివృక్షంకింద బుద్ధుడికికలిగినట్టు, నాకుకూడా ఒకచిన్నఊహ పొడగట్టింది. అచ్చుపడ్డామాటే రైటని అనుకోకూడదా అని తోచింది. సరేకానియ్యని, "అచ్చే రైటు, నాదేతప్పు" అని తర్కంతో అట్నుంచి నరుక్కురావాలని అనుకున్నాను. పద్యాలుపట్టుకొని "ప్రణయ మెందుకవాలి? ప్రళయ మెందుకు కాకూడదు?" అని అడుక్కున్నాను—ఛీ! ముష్టిముండామాట!—ప్రశ్న వేసుకున్నాను. వేసుకొనేసరికి, మీరు నమ్ముతారో నమ్మరోగాని—నిశ్చయంగా, ప్రణయ మనడానికన్నా ప్రళయమంటేనే బాగున్నట్టు కనిపించింది పద్యం. పద్యంలో రుధిరపాత్ర, రక్తశీధువు, నీలాభ్రపంక్తులు, హృదయ దారణాలు, అన్నీ చక్కగా ప్రళయానికే సరిపోయినాయి. ఇలాంటి వర్ణనలో ప్రణయ ముంటుందా అని అనుకొని అచ్చువేసేవాడు—బుద్ధిమంతుడులాగున్నాడు—ప్రళయ మని చక్కగా అచ్చువేశాడురా అని నిశ్చయించుకున్నాను.

ఇంతేకాదు-రెండోది:—ప్రళయ మంటే ఏమిటి? లోకంలో ఏదైనాఒకటి, నీరో, అగ్గో, గాలో, ఏదో ఒకటిగాని, కొన్నిగాని, ప్రకోపించి అన్నిటినీ మించిపోతే, దాన్నే ప్రళయమంటారు. అవునా? మరీ ప్రణయ మన్నమాట చూడండి. ఇప్పుడేపత్రిక చూచినా ప్రణయములేనిపత్రిక లేదు. ప్రతిపుస్తకంలోనూ ప్రణయమే, ప్రతిపాటలోనూ ప్రణయమే. చిన్నకథల్లోనూ, నవలల్లోనూ, గీతాల్లోనూ, నాటకాల్లోనూ, అన్నిటిలోనూ ప్రణయమే. ప్రణయహత్యలు, ప్రణయరోదనాలు, ప్రణయక్రాపింగులు, ప్రణయ కాఫీ హోటేళ్లూ, అన్నీ ప్రణయవస్తువులే. అంతా ప్రణయమే! ప్రణయం ప్రకోపించి పోయిందంటారా, లేదంటారా? కాబట్టే ప్రళయమన్నాడు అచ్చుసోదరుడు. "ముద్రితవాక్యము రిత్తవోవునే" అని అనాలి మరి.

పాపం! వేటూరు ప్రభాకరశాస్త్రిగారి లాంటి వారెవరో "ణ" కు "ళ" వంటి గుణితమంటే బాగుంటుందని లిపిసంస్కారము చేశారేమో అని మొదట అనుకున్నాను. కాని అదికాదు. అయినా, ఎందుకైనామంచిదని అచ్చాపీసుకి వెళ్లి "ఇలాగేనా చేస్తారు" అని అడిగాను. పాపము వాళ్లుకూడా గతుక్కుమని పోయారు. కష్టపడి వెతికి, నే నిచ్చిన కాగితంచూచారు. నేనూ చూచాను—ఏముంది! నాచేత్తోనే, నాకొంకిరి దస్తూరితోనే ప్రళయ మని అక్షరాలారా ఉన్నాది. ఏమిరా యిది అని అనుకున్నాను. అది ప్రణయ భావాల్లోని ప్రణయతొందరవల్ల కలిగిన ప్రణయ పొరపాటని పోల్చుకున్నాను. ఇంకా, "ముద్రితవాక్యము రిత్తవోవునే" అని వాళ్లనీ వీళ్లనీ గొప్పచేయడ మెందుకని, "పండితవాక్యము రిత్తవోవునే" అని పాతపాటే పాడుకుంటూ యింటికిపోయాను.




౧

తుది సీమకై తెరను దించారు. శకుంతలపాత్రను ధరించి నటన మొనరించు చున్న తారాదేవి ప్రేక్షకుల స్తబ్ధులగావించె. నవ్వు, పశ్చాత్తాపము, దూషణలు ముప్పిరిగొన దుష్యంతు డనిచెంత నిలువంబడి నాపె వచించు చుండ ప్రేక్షకులెల్లరు నాపెను స్తుతించుచుఁ జప్పట్లు కొట్టుచుఁ బ్రదర్శనరంగముచెంత కరిగిరి.

రథారూఢ యై మేనక వచ్చి నాపెను గొంపోవకపోయినఁ బ్రేక్షకులలో గొందఱాయువులఁ బాసి యుందు రావేశముచే. నాట్యమండలి నధిపతి యరుదెంచి వారి మెచ్చుదలకు గడుంగడు మెచ్చుకొని నా ప్రదర్శనమునే మరల మఱుచటి దినంబునఁ బ్రదర్శింపఁజేతు నని నావేశాపూరితు లైనవారల శాంతహృదయుల గావించె. రంగస్థలమం దింకను సందచందముల నొప్పారెడి నొక యువకుఁడు నిలచియుండె. అతఁ డొక రాజకుమారుని జోలి యున్నవాఁడు.

'తారాదేవిని నే నొక్కపరి చూడవచ్చునా యని' ప్రేక్షకులెల్ల వెడలినంత నాట్యమండలి నధిపతితో ననియె.

'మా సంఘచట్టముల కయ్యది విరుద్ధము'నని నాతఁడనెను.
'నా కాగితము నాపెవద్దకు లోనికిఁ బంపెదరా'
'అయ్యదియు మాసంఘచట్టవిరుద్ధమే'
నిరాశుఁడై నా రాజపుత్త్రుఁడు వెడలిపోవ నున్నంత,
'అయ్యా ! ఒక్క త్రుటి సేపాగుడు'
అంత నాతఁ డొక కాగితముపై నేదో వ్రాసి నా నాటకాధిపతి కిచ్చె.
మానేజ రా కాగితమును దిలకించి నివ్విధమున నద్దానిచదివె.
కన్వారు నిర్మల్ ఖంటు చౌదరి ఓ. బి. ఇ.

మానేజరుమోము వికసించినది, గానవిశారదుఁడైన, విద్వాంసుఁడైన, యేడెనిమిది లక్షల నాదాయపరుఁడైన, బహిరంగసభల కెవ్వానిధనము వెచ్చింపబడెనో నట్టి యాతఁడు దన నెదుర సర్వసామాన్యునిఁబోలె నిలచియుండె గదా !.

అంత మానేజ రొక్కింత తాఁ జేసినదానికి సిగ్గువడి

ఆర్యా! క్షమించుము. మీ లేఖనుఁ దారాదేవివద్ది కిప్పుడే గొంపోయెద అని వినమ్రుఁడై జవాబిడె.

కన్వారు సాహిబు నాతని వాగుమని సైగఁజేసి 'ఆపె నేమి శ్రమపెట్టు కొన నివ్వద్దు. విశ్రాంతి దీసుకొను కాల మాపె కియ్యది. నే హృదయమున నామెను దలచెదను' అనె నాతఁడు.

'కాదు. ఆమె యిని యేమియు నరకుగోరదు. ఒక్క త్రుటిలో వచ్చెద.

మానేజరు తనను గౌరవించినందులకు వందనము లొనర్చి రేపు వచ్చెదనని వెడలెను.

౨

రుచిగా నున్న నొకగదియందుఁదార నొక మేజాబల్లవద్దఁ గూర్చొని నాలోచనాంబుధి నోలలాడుచుండె. ఆవెనుకటి రేయిజరిగినదెల్ల జ్ఞప్తికివచ్చె. అదియంతయు తనవద్ద తిరుగ జరుగుచున్నట్లు గన్పడెను. ఆదినములు మరల వచ్చునా? ఆమెతో స్నేహము గావించుకొన, నామెనుఁ దిలకింప వా రెంత యారుటల పడిరి !

ఆమె వారలఁ దృణీకరించె. ఆ కలకలములో నొక్కఁడు నిశ్చలముగా యుండె. వాని నొక్కయవయవమైన గదలలేదు. వాని నేత్రములలో నెంత ప్రేమసుధ యున్నది. ఆపెహృదయము మన్మథతూణీరంబులచే జర్జరీకృత మైనట్లు నామె మరల వానిని దిలకించునా. ఎవరు చెప్పెదరు. అదృష్టదేవత నామె నావేశించిన, నాతఁడు నేఁడరుదెంచిన, మాటాడక నాతనిని వదలిపెట్టదు. ఆపె అంతట ముకురములో మోము చూచుకొనెను. ఆపెమోము పూర్ణకళాపూర్ణమైన పంకజము ననుకరించుచుండె ! ఈ నవనవలాడు వికసితపద్మము ముప్పదైదేండ్లు చూచినదని నెవ్వారు వాక్రుచ్చెదరు. ఆసుందరాంగన సౌందర్యము, నాకాంతి నేపడతికైన సిగ్గులచేటు గావించదా. మరల నామె తన హృదయాలయమందు ప్రేమదివ్వెను వెలిగించినది. ఇరువదేండ్ల క్రితము తార ప్రేమయొక్క విషాదానుభవమును గాంచినది. నాటంగోలె నాపె వైధవ్యకాలయాపన గావించుచుండె. అగణిత స్త్రీ స్వభావు లాపెనుదమ వశీకరణిగాఁ జేయఁ దలఁచిరి. కాని ఆమె వారల ప్రార్థన నిరాకరించె.

వారిది ప్రేమ గాదు, మోహము. వారలో పయోముఖవిషకుంభములు. కా నింద్రియనిగ్రహ మిప్వేళ యంతరించినది. ఇరువదేండ్ల క్రితము ననుభవించిన కా యే నేఁ డొందినది. ఆ జనసంఖ్యలో నామెహృదయపద్మము నొక్క భ్రమరము నాకర్షించుచున్నది. అట్టివాని మఱవ నాపెకు శక్యమే. తనకట్టెదుట స్త్రీ స్వభావుఁడై నిలుచుండ వానిని నిరాకరింప నాపెకు వశమే.

ఆపెదాసియరుదెంచి బాజీ నిన్నటిబహుమతుల నేను లోనికి జేర్చా,

వద్దు. తేవలసిన నవసరములేదు. ఆగు మొక్క త్రుటి. అక్కడ జరిగేదేమి

అదొకగుంపు. ఎవరదని నేను నుడివెద. అచ్చట సువర్ణనాణాలు, గుడ్డలు, తాయెత్తులు, ఉంగరాలు, అందమైన హారమాలిక గల్గిన నొకచిన్న పేటిక గలవు. అద్దాని నెప్పుడు నేను చూడలేదు. అవన్నిటిని వరుసగా నేర్పఱచితి పెట్టెలో.

అట్లైన నాపేటిక నిట్లు తెమ్ము. అట్టిసమయంబున నొకసిల్లవాఁ డేతెంచి నొకయుత్తర మిచ్చిపోయె. కన్వారు నిర్మలుకెంటు ఓ. బి. ఇ. అని దస్కతుచేయ బడియున్నది దానిపైన. ఇది నీకెవరిచ్చారు. జరీతలపాగా ధరించినాఁడా అయ్య యాతఁడు. కాదు.

మానేజరుసాహె బిచ్చారు. (అని ఆబాలుఁడు వెడలె) తారా ఆశ్చ దెఱవ మొట్టమొదట నాపె నొక చిన్ని పేటికను గాంచె. అం దొక లేఖ, హార యున్నవి. అద్దాని చదివె నిట్లు: కన్వారు నిర్మల్ ఖంటు......!

ఆలేఖ క్రిందపడినది. ఆపె అంతట నచ్చటనుండి లేచి నానేకగదులదాటి మానేజరుచావడి చేరెను. మానేజ రామెను గౌరవించి నీజయమునకు సంతసించితి ఇదె వందనములనెను. కన్వారు నిర్మలుఖంటుబయట వేచియున్నాఁడా. బాలుఁడొడు లేఖనిచ్చి నే నేమైన నడుగకముందే నదృశ్యమాయె. నేను కన్వారు సాహె యొక్క లేఖ నిన్నటిరేయి నీవు వెడలినంత పొందితి. అప్పుడే నాకేలపంపలేదు నీవు విశ్రాంతిగైకొనుచుంటివని దలఁచితి. అప్పుడు నిన్నుకలతపెట్టదలఁచలేదు నిన్ను కన్వారు సాహిబుకు స్నేహముగొల్పి నేను నిజంగా గోల్పోవనున్నా

నేనే వనితనైన నాతని నేమూలకైన వెంబడించి యుందునే అంతే గాని నే నెన్నఁడు గాంచలేదు. జరీతలపాగా ధరించిన దాతఁడే. నీవుగూడ చూచితి వనుకొనెద.

అవును. మరల నాతఁ డెప్పుడు వచ్చును? అవును. ఆతఁ డైదుఘంటలకు వచ్చును. విద్వాంసుఁ డాతఁడు, ఇవాళ రిహార్సలుకు రాను (అని ఆపె ద్వారము చెంతకు వెళ్లుచు), తన యెట్టయెదుట నేమియో తదేకదృష్టితో చూచు చుండె.

3

కన్వారుసాహిబు వచ్చెద నన్న వేళ యతిక్రమించుచున్నది.

ఆపె ముకురముచెంత గూర్చొన నాపె దాసి నామెకు దుస్తులఁ దొడిగి కాంత నొక్కొక్క యవయవ సౌష్టవమునకుగాను నొక్కొక్క భూషణమలంకరించెడివారు. ఇప్పుడో ఎవ్వారిమనంబుల కెట్లుదోచిన. అందచందముల నొప్పారు వలె ననెడియాశయే మనోనిశ్చయమే. పదునైదేండ్లనుండి రంగస్థలమున బ్రవేశించి నలవాటుకలదై యెల్లవారి మనముల చూఱగొన్నది. ఆశ్రీగంటి చూపులు, ఆమందస్మిత వదనారవిందము, ఆ దేహలత మెఱుపును, ఆకేశపాశముల నిగనిగ యెట్టి మానిసినైన నాపె పాదపద్మ మకరందమును గ్రోల నేతెంచిన భ్రమరముగా నాకర్షించుచున్నన తిశయోక్తి గలదే.

ఇదంతయు నానుదతికన్న నింకెవ్వారికిఁ దెలియు. అప్పుడతఁ డెగదియందే బల్లవద్ద నిల్చుని కన్వారుసాహిబు లేఖను దిలకించుచుండె. మోటారు సవ్వడి వినఁబడునేమోయని నాపెవీనులు విన కుతూహలపడుచున్నవి. తన చిత్తచోరు డప్పుడే యేతెంచిన బాగుండునని తహతహపడుచున్నది. యెదకాంతి బొందు నేటి నా జీవితరంగమును నాకాంతాలలామ సమీపించినదని జీవితము ముందు సౌభాగ్యము జోహారు లిడెనని నెవ్వారలు వాక్రుచ్చెదరు!

కన్వారుసాహి బాబూబోడిని గాంచ వేగిర పడుచుండె. పదినిముసములలోఁ కన్వారుసాహిబ్ చలనహేతు శకటపు సవ్వడి నామెవీనులఁ బడె. ఒక్క తృటిలోఁ నిర్మల్ ఖంటా పద్మాక్షి యెట్టయెదుట సాక్షాత్కరించె. ఆ లలనామణి తనను తన కరకమలము నొసంగుటగూడ మఱచి వివశయైపోయె. అతనియెదుట లజ్జాసమన్వితయైన కన్నియవోలె నిల్చుండె. అతఁ డామె గ్రీవాలంకృత ముత్యాలహారమును గాంచి తనచే నీబడినదగుటచే హర్షసాగరంబున నీదులాడె. అతఁ డిప్పుడు నిరాశ ఆశ లైనట్లు భావించె.

నిన్న వఱువాత శ్రమ దీసికొన జేసినందులకు నన్ను మన్నింపుమా. భవదీయ దర్శనాకుతూహలనైన నా కింకేమి కావలె. తఱచుగా మిమ్ములఁ జూచెదనని దలఁచెద.

నీవు నన్నుచూడఁ దలవనప్పటికిఁ బ్రతిదినము నీ గృహకవాటమును దట్టుచుండెద.

నవీన వస్తు వెర్రిన్నైన మిమ్ముల నాకర్షించువఱకు గాఁబోలు! అంతేనా

ఇయ్యది. కబుర్ల కాలం గాదు. జీవితసంబంధమైన విషయసూచిక. నిన్ను నానందాంబుధి నోలలాడింపఁజేయుటయందు మదీయమగు వాయువులఁ బాసినను నాకుకొఱంత గాదు. వార లల్పాహారంబుఁ గైకొని నెవ్వరిత్రోవ వారు చనిరి. ప్రేమ పాశబద్ధులైపోయి రా యిర్వురు.

## ౪

ఒకమాసము గడచిపోయె. కన్వారు సాహి బామె ననేకపర్యాయములు దర్శించె. ఒక్క తృటినేనైన నామె నెడఁబాసి యుండలేకపోయెఁ డా సర్వాంగుఁడు. ప్రతిదినము షికారు వెళ్లుచున్నా రా ప్రేమస్వభావులు.

వా రొక్కపరి చిన్నిపడవనెక్కి నదియందుపోయియు, నారామములయందు భ్రమ్మరియుఁ, గాలక్షేపంబు గావించుచుండి రా ప్రేమడిగొన్నవారు. తారాదేవి ప్రేమైకజాలములోఁ కన్వారుసాహిబ్ చిక్కుకున్నాడని, నాతని ధనమెల్ల నామె తస్కరించుచున్నదని ప్రజలు తలఁచిరి. తారకుఁ దన మనోహరుని ప్రేమకన్న నెక్కుడు విలువ గాదు ప్రపంచమందలి ధనరాసులు. ఆ యువిదకుఁ గావలసిన దాతని ప్రసాదమేదురంబగు కటాక్షమే.

అతనిఁ గాంచి నెల లైనప్పటికిఁ దనకుఁ గావలసినది పకయలే దాతార. అతఁ డెల్లవేళల ప్రేమైక సంభాషణలనుడివినను బరిణయమూడుమాట నెత్తనే లేదు. దాహము గొన్న మానవుఁడుదనకుఁ గావలసిన నుదకము లభ్యముగా కెట్లుతపించునో నట్లే తారస్థితికూడ. తననుబరిణయమాడుమాట నాతఁడెత్తకుండుట నామెకు వింతగా నున్నది. అతని నాసతి యైన సెగతోని జ్వాలజాలముల నుతికి నాయువులనైనఁ బాయ సంసిద్ధురాలై యున్నది. ప్రేమకు ప్రేమయే గావలె. ఆమె ఒక్కపరినాతని గొంతనాస్తి నపహరించి యుండనోపు.

కన్వారు సాహిబుతో కూడిన సిగ్గులచేటు జీవనము గడపఁజాల దింక తార. నిర్మలఖంటు బంధుబాంధవసముదాయముకెల్లగ కీ గతవార్తలు దెలియకపోలేదు. తారాదేవినుండి నాతని విడదీయ వారు వాంఛించిరి. వేరే నేనో నెచ్చటో నాతనికి వైవాహికము గూర్పఁదలఁచిరి. వారాతఁడు తారనుబరిణయమాడినాసుందరాంగికి నాస్తి యిచ్చునేమోయని భయపడిరి. సాయంసమయమున కన్వారుసాహిబ్

తారా ఇటు చూడు. నిన్నొకటి యడుగుచుంటి. అద్దాని నియ్యదలచుకుమా.

తారాడెందము తటతట కొట్టుకొన్నది.

ఏమి టది. చెప్పుమా ! నేనేమి నివ్వదలఁపను.

అతఁడు మరువచింపకముందే నాతని పాదములచెంతవాటిని దన యశ్రుకణంబుచే దడిపివైచె. ప్రేమ యన నిట్టిది కాదా !

## ౫

"నా ఆశలన్నీ నిరాశలైనవి. నన్ను చాలాకాలము పరీక్షచేసితివి."

" నీవనుకొనునది కాదు. అది ఉపోహ. నీవు న న్నంగీకరించెదవని దృఢనమ్మకమున్న నానాఁడే నేనీ ప్రార్థనకు తలయూపినవాఁడ నయ్యెడివాఁడను. నను పరీక్షింపుమా. ఎద్దానిలోఁ నీకు సముఁడ నేను. నీవో సకలసద్గుణ సన్నిభురాలవు, నేనోఎట్టివాఁడనో నెఱుంగుదువు గదా. నీసేవాపరతంత్రుఁడనై కాలంబు గడప నావాంఛ. నావద్దనెద్దియైన సుగుణమున్నదన్న నయ్యది నిన్ను ప్రేమించుటే నీవో గానవిశారదవు. నేనోకొద్దిపాటి చదువరిని. నాకునీవుసామాన్య రాలవోలె గన్పట్టుటలేదు. అప్సరసవోలె దేవకన్యకవోలె నాకు దృగ్గోచర యవుచుంటివి. నాయీయదృష్టరేఖకు నేనున్మత్తుఁడనైపోయి యుండవలసినదే. అని తనహృదయాంతరాళరహస్యవిషయములెల్ల నాతఁడు కనుచీకటిపడువరకు నుడివె. అతఁడు నుడివినదెల్ల నా బోటి వినుచుండె. ఆమె మనమున బశ్చాత్తాపము, నొవ్వు, లజ్జ ముప్పిరిగొనుటచే ముఖపద్మము వాడి పోయినది.

ఈమన్మథాకారుఁడు సర్వసాధారణముగా అడంపవలో వచించుచుండెఁ ఘనుఁడు గాఁడె !

నాహృదయారవిందము (కోరిక) వికసించునద్దే వఱువాత. లావణ్యరాశీ! చాలదినంబులవఱకు నాలస్యము గావించకుమా.

చట్టమునకు మనమెదు రెళ్లగుదమిదానికి నుపాయం బెయ్యది ?

నన్నద్దానివిషయంబై విసిగించకు. న్యాయవాదుల నదివఱకే నడిగితి. మన నైక్యము గావించు చట్ట మొకటి గలదు. అది సివిలు వివాహచట్టము. ఇద్దినమే మఱునటివారమున మహూర్త సమయము. అంగీకరింతువా ? తారా అంగీకారసూచకంబుగ దలయూపె. అద్దినపు వేకువవేళ నిన్ను గొంపోవ పిలచెద. సర్వసిద్ధురాలవై యుండుమా. ముద్దులగొమ్మా.

తార మస్తకము గ్రిందికివాల్చి మరుమాటాడలేదు. అతఁడు వెడలిపోయె. కాని ఆమె యింకను నచ్చట శిలాప్రతిమవోలెఁ గూర్చొనియుండె.

తన మనోహరుని పరిష్వంగసుఖంబున నోలలాడి నాతనితో నైక్యమై నర్ధాంగియని పిల్వబడు వివాహపుదినమేతెంచె. ఎల్లవారా సుందరాంగిని గొనియాడియుఁ గానుకల నొసంగిరి. కన్వారు సాహి బామెకు నమూల్యభూషణాంబరయుత పేటిక నిచ్చె. అబూబోడికి మనంబున సంతసరాగచిహ్నమైన నంకురించలేదు. అతని నాటాడించుటకా యీవైఖరి. లేక ప్రేమైకస్వభావుని మోసగించునా? ఎల్ల బంధువర్గమును విడచి వచ్చిన నాతని మంచుబిందువువంటివాని మోసగించునా? కా దన్నటిరి.

ఆ కోమలాంగి యొందఱను మోసగించలేదు! ఇట్టి ప్రేమ నదివర కెవరివద్ద నుండి గైకొనలేదే అంతాంగి. కన్వారు సాహిబ్ నానందింపఁజేయునా చేయవచ్చు. ప్రకృతిని మోసగింప సాధ్యమే నెవ్వారికైన? భాస్కరుఁడు మధ్యాహ్న మార్తాండుఁడై చండమయూఖంబుల బ్రసరించుపగిది నపరాబ్ధి గ్రుంకునెడ గావింపఁగలఁడే, అసాధ్యంబుగాదే.

అవ్వనితమరలనెచ్చటనా నానందము, నాహాస్యరసమునా ప్రేమగాంచగల్గు? ఇన్నిటిలో గూడుకొనిన నాతనిని మరలఁ గాంచగల్గునే! కన్వారు సాహిబు జీవితము సుఖవంతముగా జేయనోపునే! వృషభమునకు యౌవన మలంకరించిన వృషభమునకు సమానత్వము గలదే !

ఎందు కామె యీస్థితికి రావలె ?

కల్పనాచాతుర్యముచే నాత నిట్లు తేనేల?

ఆస్థితికి వచ్చియు నామె యేల తన యౌవన మంతరించినదని వాక్రువ్వనేల?

అదన్గరేయి. బల్లకెదురుగ చతికిలఁబడి నాలతాంగి దేలోకో నాలోచనామగ్నమానసురాలై యున్నది. ఎట్టయెదుట తనకువచ్చిన సన్మానములరాశి గోచరించుచుండె. వాటిని దిలకించుట లేదు.

కొద్దిగోజులక్రిందట నామెకు వీటిపై నపేక్ష గలదు.

ఇప్పుడో వాటిపై వైరాగ్యము కల్గినది. ప్రేమ సత్యమైనది.

ప్రేమ, కాపట్యము నొక్కతోవ కలిసి చనఁజాలవు.

అప్పదేశము వీడి తార యింకొకచోటికి పోగూడదా?

ఎవ్వ రెఱుంగరాని ప్రదేశమునకు పోగూడదా?

తనలో తానే ప్రశ్నించుకొన్నది. కన్వారు పరిణయమైన తదుపరి తనను గురించి చెప్పకొనఁగూడదా! అతని కెద్ది వాటిల్లునో యా పరమాత్మకుఁ గాక నితరులకుఁ దెలియునా? ఆమెకు మార్గమెద్దియు గోచరించుటలేదు. తనజీవితమును నామె దుఃఖములో వెక్కివెక్కి యేడ్చుటలోఁ గడపవలెఁ నిఁక. తన కెద్దిసంఘటిల్లినను నామె తనను నమ్మిన మానవుని ప్రేమైకస్వభావుని మోసగించఁదగునే స్వార్థపరురాలై! ఆమెకు శిక్షయే యియ్యది!

అట్టితఱి నొకదాసి వచ్చేసి,

బాజ్జీ ఇటురా కొంచెము తీసుకో. పన్నెండైనది. నీ కెద్దియు లేదు.

లేదు. ముదుసలీ నాకాఁకలిలేదు. నీ వాహారము గైకొను. వెళ్లు.

బాజ్జీ నన్ను మఱవకుమా, నిన్ను నేను వెంబడించెద.

అట్లయిన సరే. సరే. నీకు నూతనదుస్తులు తయారుచేసుకున్నావా?

అయ్యో ! బాబ్జి క్రొత్తదుస్తులతో నే నేమిచేయుదు? నీజీర్ణవసనములు నాకు చాలవా?

దాని యదృశ్య మైనంత, తారా గడియారంవంక చూపుం బ్రసరించినది. ఇప్పుడు పన్నెండే. వేసవవేళ కింక నాలు ఘంటలున్నది. వలువార నాతఁడు నా పెను విడుచును బోణయమాడు ప్రదేశమునకు. దైవమా! ఏల నీ వాపెకు మఱచి పోయిన సంగతి జ్ఞప్తికి దెచ్చితివి?

తారాలేచె.

అమూల్యభూషణములఁ కాంచనాంబరముల ద్యజించి ధవళవసనముధరించె. శుభ్రప్రక్షాళనము గావించి తదుపరి నా లలనామణి ముకురముచెంత కరిగె. ఆ గ్రేవము యెక్కడ! ఆ నవనవలాడు వెల్లవారి మనంబుల నాకర్షించు నాపంకజా క్షులెన్వో? ఆ అందచందములెటు మాయమయ్యె? సుందరాంగి యని యింక పిల్వ బడునే? అచ్చట నామె యింకనుండలేకపోయింది. సుఖప్రదమైన నానమూల్యభూషణములు విచ్చలవిడిగా నాబల్లపైఁ బడియుండె. తనకాపట్యము తననే బాధించుచుండె. విద్యుద్దీపసమన్వితమై నేత్రపర్వ సౌందర్య నాగృహ మాపెకు నగ్నిహోత్ర సమన్విత కమ్మరకొలిమివోలె గన్పించుచుండె. ఎక్కడకుపోవలెనా అని నాపెమనమున బ్రశ్నయంకురించినది. ధూమశకటపట్టాలవెంబడిపోయిన దప్పించుకొనుట కష్టము. ఎవ్వారలు దనను వెంబడింపజాలని జోరరాని మార్గానువర్తియై బోవఁ దలఁచె.

తారహృదయము గర్వంపు టడుసు పూర్ణమైయుండె. ఆపెకు నిరాశగాని శోకముగానిలేదు. మరల నామె తిరిగి కన్వారుసాహిబ్‌వద్దకు వచ్చిన రావచ్చు. తనను గనుఁగొనజాలక బీభత్సకృత్య మెద్దియైనఁ గావించునేమో యనునొక తలంపామె హృదయమునఁ దటిల్లతవోలె మెఱసె. ఆతలంపు నామెను నొవ్వులపాలఁ గావించె. నిరాశయై యామె యొక్కతృటినే పోగి మేజాబల్లవద్దకేగి యివ్విధమున వ్రాయఁదొడంగె:

మనోహరా! నన్ను మన్నింపుము. నీకుఁ దగినదానను గాను నేను. నే నెన్నడు చూడలేని ప్రేమసుధ నాకొసంగితివి. ఇఁక తేచాలు. నాచివరదినములలో నీచే ప్రేమింపబడితినను దలంపుచేఁ దృప్తి గల్గి యుండవలసివచ్చె. కామముకన్న ప్రేమస్వభావమును దలఁచుకొన్న నెక్కుడునానందము కలదని నాయభిప్రాయము. నే నచ్చటికి వచ్చి నిన్ను దర్శింపగల్గుదు. నేమో నీవివాహానంతరము నేను వచ్చుట కియ్యదిదే షరతు. ఆగ్రహావేశుఁడవు గాఁబోకుమా. ప్రేమస్వభావుఁడా ! నీవు నా కిచ్చిన భూషణముల నీ గాఁబోయె దర్ధాంగి కిమ్మా, నేను వాటి నిచ్చటవదలి వెళ్లుచున్నాను. నీ ప్రేమైకసన్మానమగు నాముత్యాలహారమునుమాత్రమే గొంపోవుచున్నాను. నాకొఱకై వెదకకుమా. నీకునేను ముకుళీకృతహస్తనై వందనములర్పించుచుంటిఁ గైకొనుమా. నీదానను. నీలో నైక్యమైపోవుదానయెప్పటికిని.

నీ ప్రియ తార.

ఈలేఖనుబరిసమాప్తిగావించినాబల్లపై పెట్టిముత్యాలహారముసు గ్రీవాలంకృతముగావించుకొని నాగదినుండి నిర్గమించె. నాటకరంగమునుండి సంగీత మాపెవీనులఁబడుచుండె. హఠాత్తుగా నామె యేలొకో కొంతవడికి నాగిపోయినది. చిత్రప్రతిమవోలె నిశ్చేష్ట యై పోయినది. అప్పడతికిప్పుడు బంధుబాంధవుల నెల్ల నెచ్చెలులనెల్ల విడనాడవలసివచ్చె. ఆపెకు శోకావేశ ముదయించినది. అచ్చోటి కనతిదూరగ మానేజరు నడచివచ్చుచున్నట్లు గన్పించె. అయ్యువిదహృదయము కొట్టుకొనసాగె. ఒక సద్యమువెనుక నామె దాఁగుకొనెను.

మానేజరు తన దృష్టినుండి తొలఁగినంత నచ్చోటనుండి వెడలి అసంఖ్యాకమైన వీధులు క్రంతలు గడచి యెట్టకేలకుఁ బవిత్రగంగానదికిఁ దోడ్కొనిపోవు మార్గానువర్తి యై పోయె.

గంగానదిచెంత నిశ్శబ్దముగానుండెను. అచ్చటచ్చట సన్యాసులు హోమకుండము లెదుటనుండఁ గాంచె. కంబళులపై బరున్నయాత్రికులు గోచరించిరి. హరిపాదపంకేరుహోద్భవపవిత్రఅంభోహారి యను నా గంగావాహిని భీకరసర్పాకారముఁ దాల్చి బ్రాఁకుచున్నదో యన మహావేగంబునఁ బ్రవహించుచుండె.

ఒక చిన్నిపడవ నద్దరినుండె. అందున్నపడవవాఁడునునిద్రపాలుపడుచుండె.

నావికా! న న్నద్దరి చేర్చెదవా?

ఇయ్యర్ధరేయి వలనుపడదు (అని నిద్రనుండిలేచి అనెను)

మామూలుకన్న రెట్టింపిచ్చెద నన్నప్పు డామె, నాతఁడు తెడ్డుగైకొని పడవకట్టు విదిలించి, అమ్మా ! ఎచ్చట కేగెదరు ?

అద్దరి నున్న నొకగ్రామమునకు నెట్లు నేను తక్కిన ప్రయాణికుల నెట్లు సంపాదింతు.

పోనీలే, నన్నొక్కర్తెనే గొంపొమ్ము.

తా రాపడవలో నెక్కఁగనే నాపడవ కెరటముల నురవడిపై కేగె. వాఁడు త్రిప్పె. అయ్యె దొక పిశాచము, రాత్రి వేళ పోవుచున్నదా యనిపించునట్లుండె. భూరుహాముల పైనుండి సుధాకరుఁడు పడవతోఁగూడ ననంతసంభ్రమమున నీఁదుచున్నాఁడా యనునట్లు గాన్పించె.

---

# రా క

ముడుంబై వరాహ నృసింహాచార్యులుగారు.

సీ॥ కలశపాథోరాశి కడుఁ బ్రీతి నూర్మికా
పృథుకరంబుల నిన్నుఁ బిలుచుచుండ
నల చకోరక బృంద మలఘు మోదంబున
త్వద్దర్శనాభీష్టతను చెలంగు
కమనీయకల్హార ఘనవితానము నీదు
శుభోదయమునకై చూచు చుండ
నల నిశా లలితాంగి యత్యధిక ప్రమో
దాంచితంబుగ నిరీక్షించు చుండ

గీ॥ తారకాంగన లెల్ల నిన్ గోరుచుండ్రు
నోషధులు త్వద్దిదృక్షచే నొవ్వుచుండు
దంపతులు నిన్ను మాటికిఁ దలచుచుండ్రు
రాక ! యి ట్లవి యెవ్వ నీరాకకొఱకు.

చ॥ కలువలనోముపంట ! సురకాండపు టూఁకటివంట ! పల్ విరుల్
గుల కరికాలిచుంట ! రవికూరిమి జంట ! చకోరముల్ కడున్
గులికెడి పేర్మిదంట! జనకోటికిఁ జల్లనిపంట ! జక్కవల్
పలికెడిమింటిమంట ! త్వరపాటునఁ బూర్ణత నొంది రమ్మికన్.

---



గా॥ సర్. సి. వి. కుమారస్వామి శాస్త్రిగారు.



గా॥ సర్. వి. యమ్. కూట్స్ ట్రాటర్ గారు.



గా॥ యమ్. దేంట సుబ్బారావుగారు.



గా॥ సర్. విల్లియమ్ ఫిలిప్సుగారు.



గా॥ హెచ్. డి. సి. రైలిగారు.



గా॥ రా॥ బ॥ సి. వి. అనంతకృష్ణయ్యర్ గారు.



గా॥ వే. రామేశం పంతులుగారు.



గా॥ రా॥ బ॥ క. పాండలెగారు.



గా॥ జి. హెచ్. బి. జాక్సన్ గారు.



అబ్బాసాలి సాహెబ్ బహద్దుర్ గారు.



గా॥ సి. మాధవ నాయర్ గారు.



సి. కన్ని రామన్ గారు.



రా॥ బ॥ బి. వి. శ్రీహరిరావునాయుడుగారు.



ది. బ. ఓ. తణికాచలం శెట్టిగారు.



మి: జి: జె. క్వరాషి సాహెబ్ బహదూరుగారు.



రా॥ బ॥ సి. టి. ఆళ్వారుశెట్టిగారు.



డి. అప్పారావుగారు.



రా॥ బ॥ సి. వి. కృష్ణస్వామిశెట్టిగారు.

# నీలకంఠేశ్వర స్తవ రాజము

బ్రహ్మశ్రీ, శతావధాని కన్నెకంటి ప్రభులింగాచార్యులు గారు.

మ॥ సకలగ్రంథముల న్పఠించినను విశ్వంబంత వీక్షించినన్
ప్రకటం బౌయశమున్ గడించినఁ బ్రభుత్వం బందినన్ వంశదీ
పకు డంచు న్పొగడొందినన్ ధనము సంపాదించినన్ నిన్ను గొ
ల్వక ముక్తిన్ గ్రహియించునే నరుఁడు దేవా నీలకంఠేశ్వరా!

మ॥ కలహంసల్ చిలుకల్ మయూరములు చక్రంబుల్ పికంబుల్ బకం
బులు పాదాయుధముల్ వనాంతరమృగంబుల్ రాఁ బరీక్షింప రె
క్కల దేహంబుల నెన్నొచిత్రగతులన్ గల్పించి యెన్నెన్నొవ
న్నెలఁ జేకూర్చితి వెంతవాఁడవుర తండ్రీ నీలకంఠేశ్వరా!

మ॥ జ్వలనజ్వాలలలో త్రయాంతరసహస్రారాంబుజాతంబులో
జలజాతాహిత పద్మినీరమణ నక్షత్రప్రభారాజిలో
జ్వలదంభోభృ దనంత భాస్వరతటిత్సంఘంబులో గాజుకు
ప్పెలలో వెల్గితి జ్యోతిరాకృతి కృపాబ్ధీ నీలకంఠేశ్వరా!

మ॥ విమలంబై తనరారు గంగను కృపన్ విన్వీథి సృష్టించి శీ
ర్షమునన్ దాలిచి భేకయుక్తముగ బాషాణంబునందుంచి మే
ఘములన్ గూప తటాకవార్ధిఝురులన్ గల్పించి పై నారికే
శములం దుంచితి వెంతవాఁడవు సుశీలా నీలకంఠేశ్వరా!

భ్రమరంబున్ సృజియించి దాని కొకదివ్యజ్ఞానసంపత్తి సం
భ్రమలీలన్ గలిపించి వారిజ సుధాపానంబు గావించి మో [నా
దమహాంభోనిధిదేలు భాగ్యముఁ గృపాత్మన్ గూర్చి యోంకార
దముఁ జేకూర్చితి వెంతవాఁడవుర దేవా నీలకంఠేశ్వరా!

మ॥ కలధౌతాద్రి భవన్నివేశ మలకాకాంతుండు నీమిత్రుఁడు
జ్వలజాంబూనద ధారుణీధరము త్వచ్ఛస్త్రాసనం బష్టభూ
తులచే నొప్పితి వింక నిన్ గొలుచుభక్తుల్ తృప్తి జెందన్ గొలుం
త లవంతైనఁ జెలంగునే తలఁప రుద్రా నీలకంఠేశ్వరా!

మ॥ కలిమిన్ గల్గినవారు పండితులు భక్తగ్రామణుల్ చక్రవ
ర్తులు గాంధర్వకళావిదుల్ కవులు శాంతుల్ దాంతు లద్వైతవే
త్తలు ధీమంతులు పుత్రవంతులు యథార్థస్వాంతు లుద్యద్యశుల్
తొలిజన్మంబుల నిన్నుఁగొల్చిన మహాత్ముల్ నీలకంఠేశ్వరా!

మ॥ తులువల్ దుష్టులు మూర్ఖచిత్తు లయశోర్థుల్ వ్యర్థు లారోగ్యహీ
నులు జాత్యంధులు మందు లాశ్రమవిహీనుల్ దీను లజ్ఞాను ల
ర్థు లసత్యాత్ము లపుత్రవంతు లసమర్థుల్ పెందరిద్రుల్ జడుల్
తొలిజన్మంబుల నిన్నుఁగొల్వని దురాత్ముల్ నీలకంఠేశ్వరా!

మ॥ ఫలపుష్పాన్వితధారుణీరుహములన్ పక్షిప్రకాండంబులన్
సెలయేళ్లన్ ధరణీధరంబుల తపస్విశ్రేష్ఠులన్ ధర్మవే
త్తల ధర్మాచరణైకచిత్తుల మహాధర్మంబులన్ వేడ్క భా
సిలు త్వత్తేజ మహర్నిశంబు గుణరాశీ నీలకంఠేశ్వరా!

మ॥ నీరంబున్ గన సంతసంబు, భయ మగ్నిన్ గాంచ నాహ్లాదమా
సారంగంబును సాఁక సర్పముల బెంచన్ భీతి చేకూరు త
న్నీరం బగ్ని మృగంబు సర్పము లహో నీయంద భాసిల్లె నె
వ్వారల్ గందురు త్వన్మహామహిమ దేవా నీలకంఠేశ్వరా!

---

# కవితాకుమారి

బూదూరు రామానుజులు రెడ్డిగారు.

కవి కిశోర ప్రకాండ సంఘములనడుమ
రత్నమాణిక్యమంజుల ప్రభల వెలుగు
కొలువుకూటాల నాట్యాలు కొన్నినాళ్లు
కలికిగతులను కులుకుచు సలిపినావు ;
ప్రబలపాండిత్య కిరణాల ప్రభలగొలిపి
కంచుఢక్కల బగులగొట్టించినావు ;
ఆశుధారా కవిత్వమాహాత్మ్యములను
మించి పెండేరములను గడించినావు ;
సార్వభౌమాది బిరుదాళి సంతరించి
దేశదేశాల గీర్తిని దెచ్చినావు ;
ఒక్కచో రాజరాజును నూడబెఱికి
శాప మిచ్చి ఫకీరుగా సలిపినావు
శిల్పచాతుర్య భసిత విశేషభూష
ణముల దాల్చి పొల్చి మెఱసినావు, నాడు—

నేడు, నాటి సింగారముల్ వీడి, కనక
కిరణసంగతుల గలసి, మెఱసిపోయి
సంజకెంజాయలను గ్రీడ సలిపినావు ;
తనర దెలిమబ్బు వెలిచీర దాల్చి నీవు
తరుణ కుసుమ కిరీటంబు దాల్చినావు ;
అవల కాసారముల నీదులాడి యాడి
మృదుతరంగపంక్తుల విశ్రమించినావు ;
విమల స్వేచ్ఛావిహార ప్రవృత్తి నీవు
కొండల, గుహల, విపినాల కుతుక మొప్ప
వింతదిరుగుదు పురములచెంత బోవు ;
నీదు ప్రకృతిని యేరు వర్ణింపగలరు !
నిముసమున కొక్కరీతిగా నెగడగలవు.
చెలువముగ దివ్యప్రకృతి భాసిల్లునట్టి
నీ కిదే, నమస్కృతి కవితాకుమారి !




శ్రీయుత నల్లవరపు విశ్వేశ్వరరావుగారు.

నీ
సొగకన్నుల కొనల
చూపట్టె నోసఖీ!
వేయి తారల మిణుకు
లూ తళుకులూ నాకు!—

ఏ నభస్సీమ వో,
ఏ సుదూర సురాల
య జ్యోతులో, దివ్య
సుమ కోరకాలో?

నీ కళ్లలోతులం
దో కోమలీ! తూగు
తూ, ఊగుతూ, పాడు
తూ నాట్య మాడేవి-
ఆలేత వెల్గు నీ
డలు నన్ను పులకించు!

ఓ చెలీ! నీ పల్కు
తేనెవాకల దేలి
నే స్నాన మాడేవి,
నే పూత మయ్యేవి,—

ఆ దినాల శుభోద
యా లెప్పుడో?
ఆ శుభోత్సవ సుక్ష
ణా లెన్నడో?

నీ గులాబీ నవ్వు
లో సౌరభించేవి,—
ఆ లేత భావాలు,
ఆ వింత సైగలూ,
నా గుండెలని లాగి
నా యౌవనము రేగి,
నీ చీర చెరగు గా
లులు సోకి నంతనే
ఉపశమన పొందుదునా
తహతహల వేగుదునా
తెలియనే తెలియకే
అలిసి ని ట్టూర్తునే
నో దివ్య సమ్మోహినీ కామినీ!
ఓ చకిత సౌరభిత సౌదామినీ!

నా జీవనపు యావ
నపు విహ్వాల పథాల
నే నొంటినై గాలి
లా సాగిపోయేది
ఎంతకాలము చెలీ?—

చెంత నీవే గాని
వింతగా నిల్చుచో,
అంతంత నిన్నేల
తాంతమ్ముగా దాల్చ
నాహాళిపై నేను!
ఈ ప్రపంచపు ధూళి
లో ఒక్క రేణువై
నా సోక నిత్తునా
నాచెలీ! నీమంజు
పాదాంచలములైన?
నే నీ జగమ్మేలు
రారాజు నైనచో
నా మయూరాసన
మ్మె నీది! రారాణి
వే నీవు నాచెలీ!

నా భాగ్యమే పండి
నాభావి వెల్తురై,
నాగానమే దిగం
తా లంటి మోగినా,
నా సంపదవు నీవు!
నా మనోరథ మీవు!
నాగానమున మోగు
నాదలక్ష్మివి నీవు!
నాకు నీవే లేని
నాకలోక మెడారి!
నా జీవితపు వాగు
నడిదారినే హరించు!
ఆర బోని పిపాస
నవసి నే తపియించి
అర విచ్చి వసివాడు
సుమ మౌదునో?
విరిగి రాలిన లేత
ద్రుమ మౌదునో?

———



# గదబలు

గొ॥ రామదాసు గారు, బి. ఏ. ఎమ్. ఆర్. ఏ. ఎస్. ఎం. ఏ. జీ. ఎస్, కవితాసమితి.

విశాఖపట్నంజిల్లా కొండప్రదేశమందుండు నాదిమనివాసులలో గదబలనువారొక జాతివారు. వీరు సవరలవలె ముండాజాతులలోఁ జేరినవారు. వీరచ్చటచ్చటఁ జెదరియుండుటచే వీరి విషయమైన భోగట్టా సంపాదించుట దుస్తరమైనను నవకాశము గలిగినపుడెల్ల స్వంతముగా వీరితో మాట్లాడి సంపాదించిన భోగట్టాను, నాకంటెఁ బూర్వమున నీజాతివారి మర్యాదలను గ్రహించి ప్రచురముఁ జేసిన వారిచ్చిన యంశములతోఁ గలిపి యిచ్చుట న్యాయఁ బూనుకొంటిని.

ప్రస్తుతకాలమందు గదబలనేక వృత్తుల నవలంబించుచున్నారు. కొందఱు వ్యవసాయముచేసి జీవించుచున్నారు. కొంద అడవిలోఁ బిట్టలను జంతువులనుఁ బట్టి చంపి జీవనోపాధి గావించుచున్నారు. మరి కొంతమంది సవారీలుమోసి జీవించుచున్నారు. కాని గదబలకు నిర్ణీతమైన వృత్తి చేఁపలను బట్టుటవలె నగపడుచున్నది. ఏజాతియొక్కడైన స్వవృత్తిని గమనింపవలెనన్న నాజాతివారు వివాహములయందు, మృతతిథులయందు నాచరించు కర్మలను బరిశీలించవలెను. భాష, బట్టలు, నలంకారములు మాఱిన మాఱుఁ గాని పెండ్లి పెడాకులయందలి వృత్తులు మాత్రము విడువఁబడవు. నాగరికతఁ జెందిన చాతుర్వర్ణ్యములవారికి నిర్ణీతమైన కర్మలు విధించి గ్రంథస్థమైనను బుస్తకములయందు లేకుండ పూర్వాచార విధిగా జరుగుచున్న క్రియలు కొన్నియాచరించుట చూచుచున్నాము. వివాహదినములలో శేషహోమమైన వెంటనే దొంగవేలము జరుపుట బ్రాహ్మణ వంశములలో విధియై యున్నది. ఇదియే శాస్త్రమందు నగపడదు. నాకబలియైన తరువాత వసంతముల యాటగూడ నటువలెనే పూర్వాచార విధి. ఇటువంటి యాచారములఁ గనిపెట్టి చూచిన నాజాతియొక్క పూర్వసంబంధములు బోధపడును.

ఇటువలెనే గదబలపరకర్మలయం దాచరించు విధులను బరిశీలించిన వీరికి నిర్ణయమైన వృత్తి మనకుఁ దెలియఁగలదు. ఒక జనుఁడు మృతినొందిన వెంటనే గ్రామస్థులందఱు నాశవమును శ్మశానమునకుఁ గొనిపోయి దానినిగాల్చియో పూడ్చియో వచ్చి యొక గెడ్డయందుఁ జేఁపలనుబట్టి వండి ప్రేత తృప్త్యర్థము త్రోవలో విడుతురు. వివాహకాలమందు గెడ్డలోఁబట్టి తెచ్చిన మత్స్యములను ముఖ్యముగా వండుదురు. వీరు నివసించు ప్రదేశములుగూడ సాధారణముగా గెడ్డయొడ్డుననే యుండును. ఈయంశములనుబట్టి గెడ్డలయందుండి జీవించువారని తోఁచుచున్నది. అందుచేతనే వీరికి గదబ (గెడ్డ—బ) లని నామకరణమైనట్లు పొడఁగట్టుచున్నది. గోదావరి యొడ్డునుండి వచ్చినవారుగాన వీరి కీపేరు గలిగెనని చెప్పుదురుగాని యదంత సమంజసముగా లేదు. ప్రస్తుతము గదబలుండు ప్రదేశములను దేశపటమందు గుర్తించిచూచిన గోదావరి తీరమునకు నెంతో దూరముం దున్నవి. ముండాజాతులవా రందఱును వింధ్యపర్వతప్రాంతములనుండి యడ్డుగాఁ దూర్పుకనుములలోనికి వచ్చినట్లు కనఁబడును. సవరజాతివారు నేటికిని గంజాం మాలయాలలోనే గాక మధ్య హిందూస్థానమందు సాగర్. డెమొ ఆ, యను జిల్లాలలోఁగూడ నున్నారు. గదబలు కూడ నీజాతులతో సంబంధించినవారగుటవలన వీరుగూడ మధ్య హిందూస్థానమందు వింధ్య ప్రాంతములనుండి తూర్పు కనుమలలోనికి వచ్చినట్లు సూచించును. విశాఖపట్నం మాలయా ప్రదేశములయందు, దీనికిఁ జేరియున్న బస్తరు, కలహండీ పరగణాలయందును గదబలున్నారు. ఇంతియెగాక యాచార వ్యవహారముల యందెగాక భాషలోనుగూడ సవర,ఖుర్వా, సంతాలీ, ముండారీ జాతులవారితో సంబంధము గలిగియుండుటచే గదబ లుత్తర హిందూస్థానమునుండి దక్షిణమునకు వచ్చినవారేగాని గోదావరి నదితో నెట్టివిధమైన సంబంధము గలిగియున్నట్లు దోఁపదు.

గదబలలో నైదు జాతులున్నవి:—

1. పెద్దలేక గూటాబ్ గదబలు:—వీరి యాడువారు చెవులకుఁ బెద్ద యిత్తడి తీఁగచుట్లు పెట్టుకొందురు. నీలి, యెఱుపు బద్దెలుగలబట్టలు కట్టుకొందురు.

2. పారెంగు గదబలు:—చెవుల యిత్తడిచుట్లు చిన్నవి. ముక్కులకుఁ గమ్ములు పెట్టికొనియెదరు. కట్టుకొనెడి బట్టలకు, నెఱుపు, నీలి డోరియాలుసన్నగా నుండును.

3. ఒలార్ గదబలు:—పారెంగ్ గదబలవలెనె యలంకారములు దుస్తులను ధరియించుదురుగాని, మొలచుట్టు చిక్కుమువలె నల్లిన త్రాటినిధరియింతురు. దీనికి ఉద్దల్ అని యందురు.

4. కాఁపు గదబలు:—తెలుఁగుదేశములో నివసించి యాజనుల యాచార వ్యవహారముల నవలంబించిన జాతులకుఁ గాఁపుశబ్దము ముందుఁబెట్టి యా జాతిపేరు చెప్పుదురు. అట్టివారే యీకాఁపు గదబలు. ఇలాగుననే గంజాం జిల్లాలో గాఁపు సవరలున్నారు.

అలంకారములు:—ఏజాతిలోనైనను బురుషులకు నలంకారము లుండవు. అలంకారములెల్ల నాఁడువారివే. గదబ స్త్రీలు ప్రతినిత్యము నుదయమునను తల దువ్వుకొని, శరీరమున కంచురాగము పూసుకొనినపైనియలంకారములను ధరింతురు. తలచుట్టు నిత్తడితోఁగాని గవ్వలతోఁగాని చేసినయొకవలయమును ధరింతురు. చెవులకిత్తడితీఁగెచుట్లు, మెడయందు నల్లపూసలు, తగరము, సత్తు, యెల్లోమినియముతోఁజేసిన గుళ్లు కలిపిచేసిన వివిధహారములను జేతికి మందమొదలు మోచేయివఱకు నిత్తడికడియములు, గాజులును, గాళ్లకునందెలు కడియములు, చేతికి నుంగరములు, కాలివ్రేళ్లకు పిల్లాళ్లు పెట్టుకొందురు. ఇత్తడికడియములు రెండుచేతులకు వేసికొందురుగాని గాజులమాత్ర మెడమచేతికే తొడుగుకొందురు. ఇందులకు గారణ మేమని నేనడుగఁగా, "కుడిచేతితోఁ బనిచేయుదుము అప్పుడు దెబ్బలుతగిలి గాజులు పోవును - అందుచే నొక్కయెడమచేతికే వేసికొందు" మని ప్రత్యుత్తర మిచ్చిరి.

బట్టలు:—పురుషులేబట్టలనైనను వాడుకొనియెదరు. వారికిఁ గావలసిన వెల్లఁ గౌపీనము, శిరోవేష్టనము. స్త్రీలుమాత్రం అట్లుగాదు. ఏజాతిలోనైనను స్వజాతిమర్యాద పోషకులాడువారే- గదబ స్త్రీస్వంతముగా నేసికొనినబట్టను దప్ప నితరబట్టనువాడదు. బట్టనేయుట నేర్చినఁగాని స్త్రీవివాహ యోగ్యురాలు గాదు. అత్తవారింటికి వెళ్లునప్పుడు తనకొఱకొక బట్టయుఁ, దనపురుషునికొక బట్టయు స్వంతముగానేసి తీసుకొనివెళ్లును. ఈబట్టలు కిరంగ్ అను నారతో నేయుదురు. ఇదియడవిలో మొలచునొక జాతి మొక్కయొక్క పైపట్టనుండి చేయుదురు. మూడునూళ్ల పొడవు నందులో సగము వెడల్పుతో నొక్కొకబట్ట యుండును. పెద్ద గదబలు నెఱుపు, నీలిబద్దెలు వెడల్పుగా నుంచెదరు. పారెంగ్ గదబలు వాటినే సన్నముగానుంచెదరు. ప్రతి స్త్రీయు రెండుబట్టలు ధరించును. కట్టుకొనుట కొకటి. పై మీదకొకటి. పూర్వ మీబట్టలకుఁ బడుగుపేకైకూడ నారతోనే వేసేవారు; సీమనూలు వచ్చిననాఁటనుండి పడుగునకు సీమనూలే పెట్టుచున్నారు. పట్నవాసపుఁ జెంతనున్న గదబలు వారిజాతికి నుచితమైనదుస్తులను నలంకారములను విడిచి సన్నని సొగసైన బట్టలను నాగరికత గలయలంకారములను ధరించుచున్నారు.

నివాసము:—గదబవారందఱు నొక్కొక్కస్థలమందు నిండ్లుగట్టుకొని నివసించెదరు. గ్రామాధికారి నాయకుఁడు; ఇతనిగృహము గ్రామములోని కెల్ల పెద్దది. ఇందు శయనగృహము, వంటగృహము, పానగృహము, దినుసులు నిలవచేసుకొనేటందు కొక గృహము. పశువులసాల- గృహప్రాకారమధ్యమున రెండువరుసలను గృహములు గట్టుదురు. ఒకదానియందుఁ బడకగది, సామానుకొట్టు, వంటిల్లునుండును. దీనికెదుట కొంచెముదూరములో పశువులసాల, దానిప్రక్కను పానగృహము కలిపి కట్టియుండును. మద్యపానము చేయునప్పుడీపానగృహమందుఁ దప్ప నలుగురు కూర్చొని పుచ్చుకోరు. గ్రామస్థులందఱు గలసి మద్యము సేవింపవలసినపుడు గ్రామములో నొకచోట నాయకునియింటివెనుక విశాలస్థలమును నేర్పఱచి యుంచెదరు. అందఱు నిచ్చట సమావేశమై కల్లుకుండలు మధ్య నుంచుకొని త్రాగెదరు.

గ్రామములో నిండ్లు రెండువరుసలుగాఁగట్టి మధ్యను బ్రాంగణము విశాలముగానుంతురు. నడివాకిలి మధ్యమునొకచెట్టు మఱ్ఱి, రావి, మామిడి మొదలైన వృక్షములలో నొకదానిని బాతి దానిచుట్టును బలకరాళ్లతో నొకయున్నతాసనము నేర్పఱతురు. చెట్టు మొదట నొకగుండురాతిని నిశానదేవత యను పేరుననుంచెదరు. గ్రామతగవులు పరిష్కరింపవలసినప్పుడు నాయకుఁడు మొదలైన, గ్రామములోనున్న పెద్దమనుష్యు లీచెట్టువద్దనే కూర్చొని తీర్మానించెదరు.

ఏకకుటుంబమున కాయిల్లున్నప్పటికి, యువతీ యువకులు రాత్రులయందుఁ గలయకుండ వేర్వేఱుగా శయనించుటకు గృహము లుండును. యువతీజనమున కంద

తికి నొకటి- దీనికి దూరముగా యువకులకందఱికి మఱియొకటి. పదిరెండువత్సరములు వచ్చిన బాలికలుగాని, పదియాఱు వత్సరములు వయస్సైన బాలురుగాని తలిదండ్రులయిండ్లలోఁ బదుకొనఁగూడదు. వీరువీరికొఱకుఁగట్టినగృహములయందే శయనింపవలెను. ఇట్లు వివాహమయ్యేవఱకే. వివాహమైనవెంటనే యావధూవరు లీగృహములయం దుండరు. యువకులందఱిలో నొకనిని యజమానునిగా నేర్పఱిచుకొని యతని యాజ్ఞలలో నందఱుఁ బ్రవర్తించెదరు. ఆలాగుననే యువతులకుఁ గూడ నొకపెద్దయుండును. ప్రొద్దుట లేవగానే యువకులు వారిగృహమును యువతులు వారిగృహమును శుభ్రపఱచుకొన్నతర్వాత నెవరిపనులకు వారు పోవలయును. పరుండు సమయమునకే వీరు వేర్వేఱు గృహములందుండుటగాని యితర కాలములయం దందఱు కలసిమెలసి తిరుగుచుందురు; ఆడుకొనుచుందురు.

వివాహము:—గదబజాతిలోఁ గూడ గోత్రము లున్నవి. ఒక్కగోత్రపుఁ బిల్ల, పిల్లవాఁడు, వివాహము చేసికొనఁగూడదు. కుఱ్ఱవాఁడు తనగోత్రీకురాలు కాని యొకయువతి నెంచుకొని తనతలిదండ్రులతో నాకన్యను వివాహమాడవలెనని యున్నదని చెప్పును. కొన్నిసమయములందు కుఱ్ఱవాఁడు చెప్పనవసరముగూడ లేదు. పిల్లవానికి వివాహయోగ్యవయస్సు వచ్చినదని గ్రహించి వానితలిదండ్రులే వానికిఁ దగినకన్య నాలోచింప యత్నించెదరు. వీరిలో 'కన్య'యనఁగా వివాహముగానిపిల్ల యనియేగాని రజస్వల కానిదని యర్థములేదు.

పిల్లవాని యిష్టానిష్టములను గనిపెట్టి, యాకన్య కన్నవారింటికి కొంచెము బియ్యము, కొంతమద్యముతో తమబంధువులలో నొకనిఁబంపుదురు. అతను నా బియ్యమును, మద్యమును నాకన్యయింటివాకిట నుంచి కూర్చొనును. కన్యయొక్క తలిదండ్రులువచ్చి "యేమికార్యముపై వచ్చితి"రని ప్రశ్నించెదరు. "ఏమియులేదు. మీతోసంబంధము చేయవలె"నని వచ్చితిమి. ఈబియ్యము, ఈ మద్యము స్వీకరింపుఁడు" అని ప్రత్యుత్తరమిచ్చును. ఆమద్యము నెల్లినవాఁడు పిల్లతండ్రి యన్నదమ్ములు మొదలైనవారు గలసి త్రాగుదురు. సంబంధమిష్టములేనిచో బియ్యమును మద్యమును త్రిప్పివేయుదురు. ఇది మిగుల నరుదు.

మఱికొన్నినాళ్లు పోయినతర్వాత మళ్లీబియ్యము, మఱింతమద్యమును బట్టించుకొని మధ్యవర్తితోఁ గన్యయింటికి పిల్లవానితలిదండ్రులే వెళ్లుదురు. పిల్లపుట్టింటి వాకిట బియ్యము మద్యమునుంచి కూర్చుందురు. పిల్లతాలూకు తలిదండ్రులు, నన్నదమ్ములు నింకనితరబంధువులు సమావేశమై కూర్చునియుండఁగా పిల్లవానితండ్రి కన్యయొక్కతండ్రితో 'మీపిల్లను మాపిల్లవానికిచ్చి వివాహముచేయు, మని యడుగును. 'సరే' అలాగే చేయవచ్చును'మా బంధుమిత్రులున్నారుగదా! ఆలోచింతము" అని జవాబుచెప్పును. ఆ తీసుకొనివెళ్లినమద్యమును నందఱుగలసి సేవించిన పైనివరునితాలూకువారు తిరిగి యిండ్లకువత్తురు. మఱికొన్నిరోజులు పోయిన తర్వాతఁ దిరిగి కొన్నిబియ్యము మఱింతకల్లుపట్టించుకొని పిల్లవాని తలిదండ్రులు, బంధుమిత్రులుకలసి కన్యయింటికి వెళ్లుదురు. వీరువెళ్లినతోడనే పిల్లతాలూకు తలిదండ్రులు బంధువులు స్నేహితులు జమగూడి కూర్చుందురు. వీరువారు గలసి వివాహమువిషయమై ప్రశంసింతురు. పిల్ల కీయవలసినశుల్కమును, పిల్లతాలూకు బంధువులకు మిత్రులకివ్వవలసిన కట్నములను గానుకలను నిర్ణయించుకొనియెదరు. గ్రామపురోహితుఁడు (దిసారి) ముహూర్తము నిశ్చయముచేయును. నక్షత్రములను బడిగట్టి యోగమునుజూచి నిర్ణయించును. తదుపరి నందఱు గలసి యా తెచ్చిన మద్యమును త్రాగుదురు. ఊఁగుకొనుచు, జోగుకొనుచు పిల్లవాని తలిదండ్రులు మొదలైనవారెల్లఁ దిరిగి యిండ్లకు వత్తురు.

వివాహదినము రేపనఁగ, పెండ్లికుమారునికి బసుపురాచి స్నానముచేయించి, క్రొత్తబట్టలుగట్టించి వాద్యవిశేషములతో వానిని దీసుకొని పెండ్లికుమార్తె యింటికి వెళ్లుదురు. అచ్చట కన్యయొక్కతల్లికొక యర్ధరూపాయియు నొక క్రొత్తబట్టయు, దండ్రికి రెండురూపాయలు వివాహపుఖర్చుకొఱకును నిచ్చెదరు. ఇంతకాల మా కన్యతో నాడుచుపాడుచునుండిన యువతీజనమున కొక యర్ధరూపాయియు నిత్తురు. అటు మ్మట పెండ్లికుమార్తెచేతికి నిత్తడికడియములు తొడిగి యాచేయిఁబట్టుకొని పెండ్లికుమారుఁడు దానిని లాగుకొనివచ్చును. వధువువారడ్డుకొన్నట్లు నటించగా వరునివారు సహాయమునకు వెళ్లుదురు. అంతటవారు వీరును గలసి తన్నులాట గ్రుద్దులాటయు నటింతురు. ఇట్లు కొంతతడవు జర్గిన పైని వాద్యములతో వధూవరులను దీసుకొని యందఱు వరుని యింటికి వత్తురు.

పెండ్లికుమారుని యింటియెదుట నొక పందిరి వేసియుండును. ఆపందిరి మధ్యను నొక యద్దగిల్లికఱ్ఱయు, నొక వెదురుకఱ్ఱయు, నొక గుగ్గిలపుగఱ్ఱయుఁ, గలిపి కట్టి పాతుదురు. దాని చెంతను నొక తిరగటి దిమ్మనొకటి వేసియుంచెదరు. ఆ తిరగటిపాపపైఁ బెండ్లికుమార్తెను గూర్చుండఁబెట్టి యామెయొడిలో వరుఁడు గూర్చొనును. అచట సమావేశమైనస్త్రీలందఱు నట్లు కూర్చొని యున్నవధూవరులపైఁ బసుపు, పసుపు నీళ్లు పోయుదురు. తదుపరి వారికి స్నానము చేయించి క్రొత్తబట్టలను గట్టించెదరు. దిసారివచ్చి వారుచేతులు గలిపి వారికొంగు ముడివేయును. ఇదియే పాణిగ్రహణోత్సవము. ఇది యైనవెంటనే యందఱు గలసి బాగా దిని త్రాగి యుత్సాహముగా నుందురు.

రెండవ దినమునఁదిరిగి వధూవరులను బందిటిలోనికి తీసుకొనివత్తురు. దిసారివచ్చి పందిలికివెలుపలఁ గొంత మట్టిని బ్రోగుచేసియుంచి యందులోఁ [illegible] దీసి పందిటిమధ్యను వేయును. అంతట వధూవరు లిద్దఱు నామట్టిలో [illegible] బురదఁజేసి యాబురద నందఱిపైని జల్లుదురు. ఒకరిపై నొకరు పెండ్లివారెల్ల [illegible] చల్లుకొని వినోదించెదరు. తర్వాత స్నానార్థమై యొక జలాశయమునకు [illegible] వెళ్లుదురు. శుభ్రముగా స్నానముచేసి బట్ట లుదుకుకొని యిండ్లకువచ్చి [illegible] లారగించెదరు. వాద్యములు వాయించుచుఁ, బాడుచు నాట్యమాడుదురు. ఇం[illegible] వధూవరులుమాత్రము గలియరు. వీ రొకచోట నుపవసించి చూచుచుండ య[illegible] న్నంది స్త్రీ పురుషులు గలసి యాటపాటలను జరుపుదురు.

భర్తృ మరణానంతరము విధవ తిరిగి పెండ్లి చేసికొనవచ్చును. తన పెనిమిటి తమ్ముని బెండ్లియాడుటయే ముఖ్యము. అతనిని వివాహమాడుట తనకిష్టము లేకున్న దామెను వివాహమాడు పురుషుఁడు పెద్దలు నిర్ణయించిన శుల్కమును నాపె మఱఁది కిచ్చుకొనవలెను. మగవానికి భార్యయం దిష్టములేక విడిచినను భార్యకు రెండురూపాయి లిచ్చి విడియాకు లియ్యవచ్చును. స్త్రీకి పురుషునిపై నిష్టములేక మఱియొకనికిఁ బోయెనా, యా నూతనభర్త వదలిన పెనిమిటికిఁ బెద్దలు నిర్ణయించిన తప్పిచ్చుకోవలెను.

ఉత్సవములు:—సంవత్సరమునకు మూఁడుపండుగలు. ఈమూఁడు పండుగలు విశేష శ్రద్ధాభక్తులతోఁ జేయుదురు. వసంతకాలములో చైత్రపర్వము; వర్షకాలమందు బలిజాత్ర; హేమంతకాలమందు పుష్యపర్వము.

చైత్రపర్వము:—చైత్ర వైశాఖమాసములయందు నీయుత్సవము ప్రతి గ్రామమందును జరుగును. ఈ రెండు మాసములయందును గ్రామములోనున్న పురుషులందఱును, ముసలివారు, రోగులు, పిల్లలు తప్ప, నడవికివెళ్లి జంతువులను వేటాడి తెత్తురు. ఇండ్లవద్దనున్న స్త్రీలు అలంకరించుకొని యాటపాటలయందు కాలము గడపుదురు. స్త్రీలు మనోహరముగ బాట పాడెదరు. పురుషులు స్త్రీలు నుగలసి వాక్యోపవాక్యములుగఁ నీపాట పాడినప్పుడు చాల మనోహరముగ నుండును. పాటలలోని మాటలు నాక్షణమందు కల్పించినవే. భావగర్భితములై ఛందోబద్ధములుగా స్వరమున నమర్చియుండును. స్త్రీ భావము యుక్తిగాఁ బ్రత్యుత్తరముగాఁ బాడఁదగినపురుషుఁడు దొరకినప్పుడు స్త్రీకిఁ గలు యానందము విపరీతము. ఈ పాటకుఁగూడ చైత్రపర్వమని పేరు. పాటకంతము లేదు. కథోపకథనము సరిగాఁ బాడఁగలిగినవారైతే రోజులకొలఁది పాడుదురు. ఇందులోఁ బురుషుఁడు పాడలేకపోయిన స్త్రీకిఁ గొంత పైకమిచ్చుకొని నమస్కారముచేసి వెళ్లవలెను. స్త్రీగాని పాడలేనప్పుడు పురుషునికి విందుఁజేసి సంతోషపెట్టవలెను.

వేటకుఁ బోయిన పురుషులు ఏజంతువును చంపకుండ నింటికి వచ్చిరా, స్త్రీలందఱు వారిపై పేడనీళ్లు చల్లి వారినవమానించెదరు. ఏజంతువునైనా జంపినచో ముందుగా నొకఁడు గ్రామమునకు వచ్చి చెప్పును. వెంటనే స్త్రీ లలంకరించుకొని వాద్యములతో నడవియెదురుగ వెళ్లుదురు. ఇంతలో వేటాడినవారు జంతువును మోసుకొని యడవి వెలుపలికి వచ్చియుందురు. స్త్రీలు పాడుచు వేటలోఁ జచ్చిన జంతువుల చుట్టూ నాట్యముచేతురు. తరువాత నీజంతువులను జట్టీపట్టి పురుషులు మోసుకొనిరాఁగా, ముందు స్త్రీలు పాడుకొనుచు నాడుకొనుచు గ్రామమునకు వత్తురు. గ్రామమధ్యను జంతువులనుంచి చర్మము నొలుచుట, తినవలసినదైన మాంసము పంచుకొనుట మొదలైన యుత్సవమును జరపెదరు.

ఈ చైత్రపర్వోత్సవము చేసినఁగాని, స్త్రీలుగాని పురుషులుగాని మఱియే కృషి పనియును జేయరు. ఈపర్వకాలములలో వనితలు బాగా నగలుపెట్టుకొని, శుభ్రమైన బట్టలు కట్టుకొని వనములయం దానందముగా నుందురు. ఒక్క భోజనమునకుఁ దప్ప సర్వకాలములయందును గీత వాద్య నాట్యములయందే కాలము గడపెదరు. పెద్ద చిన్నయని లేదు. అందులో నవివాహితులైన యువక యువతీజనములకు మఱింత యుత్సాహము. స్త్రీ పురుషుల యలంకారములను నుత్సాహమును నీరోజులలోఁ జూచి తీరవలెను.

బలిజాత్ర:—ఈ యుత్సవము వర్షకాలమందు ముఖ్యముగా భాద్రపద మాసమందును జరుగును. ఇది తొమ్మిదిరోజులపండుగ. ఊరివెలుపల పందిరి నొకటి వేసి యందు 9 మట్టి పాలికలయందు మన్నునింపి యందు నవధాన్యములను జల్లుదురు. ప్రతినిత్యము వాటికి నీరు పోయుట, పూజ లొనర్చుటే గాక స్త్రీ వాద్య నృత్యములతో గాలము వెళ్లఁబుత్తురు. వివిధ వేషములు వేసికొని నాట్య

మాడెదరు. ఈపాలికలకుఁ బూజ నొనరించువాఁడు నపుంసకుడు, స్త్రీ వేషధారి. అట్టివాఁడు లభించనప్పుడు స్త్రీయే యాపనికి నియమింపఁబడును. పూజయైనతర్వాత దేవత యావేశమునకు వచ్చును. పూజారికి-డప్పులు డోళ్లు తప్పెటలు, నందఱును వాయించగా, వారిమధ్యను గత్తిపట్టుకొని యొడలు తెలియని తాండవ మాచరించును. ఇట్లు నవరాత్రములుజరిపి పదియవరోజున నీయుత్సవము నడుపుదురు. ఆరోజు సూర్యోదయ మైనదిమొదలు వివిధవేషములు వేసికొనినవారు పాకవద్దకువచ్చి నాట్యముచేయ, జూచుటకు నాగ్రామములోనివారెల్ల నక్కడ సమావేశమగుదురు. పాకలోపలనుంచినపాలికలలో నీ 9 రోజులకు మొక్కలుసుమారు 9 యంగుళములు పెరిగియుండును. వీటికే 'బల్లి'యని యందురు. ఇవి యుంచినపాక బల్లిపాక. పదియవరోజు నుదయమున బల్లిపాకయొద్ద నందఱు సమావేశమై యొకగొఱ్ఱెపోతును బలియిచ్చి కొంత సేపుత్సవముచేసి సంభ్రమముతోఁ దిరిగి వెళ్లిపోవుదురు. తిరుగ సాయంకాలమునం దందరీపాకయొద్దఁజేరి యుత్సవముఁజేయుదురు, బలులిచ్చినపైని బల్లిని పాలికనుండి బైకిఁ దెచ్చియుంచి, పూజారి (కీరసానియని తెలుఁగుదేశమందును, ఓఢ్రదేశములయందు బెజ్జుఅని చెప్పు దురు.) కొంతతడవు నాట్యముచేసి యచ్చటవేసియున్న ముళ్లయుయ్యలపైఁ గూర్చొని యూఁగును. ఈ సమయమున నెవరేని ప్రశ్నలడిగిన కీరసానిచెప్పునని, యతడుచెప్పునట్లు జరుగునని యొకనమ్మకము. ఆముళ్లయుయ్యలలో, దానూఁగుటయేగాక నెవరినైన గూర్చుండఁబెట్టి యూగించునని, ముండ్లుగుచ్చుకోవని గూడ జెప్పుదురు.

పుష్యపున్నమ :—పుష్యమాసపు పౌర్ణమి నాఁడీ యుత్సవము జేయుదురు. ప్రొద్దునలేచి స్నానములుచేసి పిండివంటలతో బంధుమిత్రులుగలసి భుజింతురు. డప్పులు డోళ్లు వాయించుచుఁ బాడుచు నాట్యమాడుదురు. ఎనుమునుగాని, పందినిగానిచంపి,దానిమాంసమువండి భుజింతురు. రెండు మూఁడురోజు లీ పండుగ జరుగును. ఇది యింటింటజరిగే పండుగ. పైనిజెప్పిన పండుగలు గ్రామమంతా కలిసి చేసెడివి.

ఈజాతివారి వాద్యములు:—డప్పులు, డోలులు. సంభ్రమములో గ్రామస్థులందఱు వెళ్లునప్పుడు ముందు వీటిని వాయింతురు. తప్పెటలుచిన్నవి,పెద్దవిగూడ నుండును. వీటిని దోలుపట్టీలతో వాయించెదరు. ఆనపకాయ బుఱ్ఱకు వెదురుకఱ్ఱ నమర్చి ఒక్కతీఁగె గట్టిన తంబురా- దీనిని పాడఁగలిగిన పురుషుఁడే వాయించును. ఇది వాయించుచుండఁగాఁ జుట్టును స్త్రీలు నాట్యమాడుదురు.

భుజించు పదార్థములు:—ధాన్యము, చోళ్లు పండించుకొని తినెదరు. అడవియందు దొరకెడు వెదురువేళ్లు, కొన్నిరకముల దుంపలు, ఆకుకూరలు మొదలైనవాటినేగాక నాగుఁబాముతప్ప తక్కినపాములను, గప్పలను, నెలుకజాతులన్నిటిని, ఎండ్రికలనుగూడ తిందురు. గడ్డలలోని చేపలను చెప్పనే యక్కఱలేదు. చేపలుపట్టుటయందు నీజాతివారిప్రావీణ్యము చెప్పనక్కఱలేదు. పిట్టజాతులలో,కోళ్లు పావురాలెగాక, చిలుకలు, గ్రద్దలు, కాకులు, గుడ్లగూబలు మొదలైనవన్నియు వీరికి ప్రీతియే. మేకలు గొఱ్ఱెలు చిన్నచిన్న పండుగులయందును ఆలపశువులను, ఎనుములను బందులను బెద్దపండుగులయందును దిందురు- జీలుగచెట్టునుండి దీసినకల్లు, ఇప్పపూవుతో వండిన సారాయి చెఱఁ ద్రాగుదురు. పండుగరోజులలోఁ జోడిపిండితో 'లాండా' యను నిసాద్రవ్యము వండుదురు- ఇది త్రాగిన చాల నిషా నిచ్చునట- ఇది ద్రాగుటవల్లనే నేరములు జరుగుచున్నవనికూడ ననియెదరు. ఇప్పపూవును నెల్లతోటకూరగింజలతోఁజేసిన పేలాలును గలిపి మిఠాయిజేతురు. ఇది మందముగా నిషాజేయునట. ఈ తోటకూర పెరళ్లలోఁ బండింతురు. మొక్కలు కూడ చాల సొగసుగానుండి మారెడేసి వెన్నులు వేయును.

అపరక్రియలు:—గ్రామములో నెవరు చనిపోయినను, గళేబరమువెంట శ్మశానమునకు స్త్రీపురుషాదులందఱును వెళ్లుదురు. పురుషుఁడుచచ్చిన వానిభార్యయు, స్త్రీపోయిన దానిపురుషుఁడును వెంటవెళ్లవలెను. పురుషులు, ముసలివాఁడు వారు చనిపోయిన కాల్తురు. తక్కినవారినందరిని పూడ్తురు. మృతకళేబరమును శ్మశానమందు వినియోగపఱచిన తర్వాత నందఱును సమీపమం దున్న గెడ్డలో స్నానముచేసి కొన్ని చేపలనుబట్టి యింటికిదెత్తురు. అచ్చట నొకపిడతలో నన్నమును, మఱియొకదానియందు నీచేపలనువండి శ్మశానమునకు వెళ్లుదారిలో విడిచివచ్చి మఱితాముభుజింతురు. తిరుగమూఁడవరోజునఁ బ్రేతమునకుబలిప్రదానముచేయుదురు. అన్నముచేపలువండి మృతునిపేర శ్మశానమందు విడుతురు- తరువాత గ్రామస్థులందఱునుగూడి భుజింతురు. మద్యముగూడ వినియోగమగును.

పదియవరోజున నింతకన్న నెక్కువగా శ్రాద్ధక్రియ జరుపుదురు. ఇతరగ్రామములలోని బంధుమిత్రులుగూడ వత్తురు. ఒకయాల పశువునో లేక యెనుమునో చంపి వండుదురు. మద్యము విస్తారముగాఁ దెత్తురు- ప్రేతపేరన బలిదాన మిచ్చి, యందఱు భుజింతురు. ఇంతటితో జచ్చినవానికిని బ్రతికినవానికిని సంబంధము తెగిపోదు. మూఁడు నాలుగేండ్లలోపున విశేషోత్సవములోఁ జచ్చినవానికిఁ దృప్తిచేయవలెను. దీనికి 'గోత్ర' యని యందురు.

గోత్ర:—చచ్చినవానిని శ్మశానమందుగాల్చియో, పూడ్చియో యిండ్లకుఁ దిరిగివచ్చునప్పుడు, కర్మచేయువాఁడు,శ్మశానమునుండి యొకఱాతినిదెచ్చి తనయింటివద్ద భద్రపఱచి యుంచును- ప్రతిసంవత్సరమును దనయాదాయములో గొంతతీసి వేరేయుంచును.ఇట్లు మూఁడుసంవత్సరములకో,నాలుగు సంవత్సరములకో కొంతసమకూర్చుకొని యెక్కడెక్కడ నున్న బంధువులకు స్నేహితులకు నాఁటికి రమ్మనమని వర్తమానము బంపును. సుమారు రెండు మూఁడు వందలమంది సమావేశమగుదురు. వచ్చినవారందఱికి భోజనములుపెట్టి యథేచ్ఛఁగా దాదరించును. నియమితదినమున గ్రామమధ్యమున నొకరాట పాతి దానికిపశువులను గట్టుదురు. ఆకుటుంబములో జచ్చినవారొక్కొక్కరిపేరున నొక్కొక్క పశువుచొప్పున గట్టుదురు. యజమానుఁడేగాదు, అతనియన్నదమ్ములు, పినతండ్రికొడుకులుకూడ నొక్కొక్క పశువును గట్టుదురు. ముఖ్యముగా నెనుములనే కట్టుదురు. అందులో నొకదానికిఁ జెట్టులో బదిరూపాయిల మూటనుగూడ దినిపింతురు. అంతయు నైనతర్వాత నాపశువుల నన్నిటిని బావమఱదుల కిచ్చివేయుదురు- వారు వాటి కన్నిటికి కన్నెలువిప్పివేసి తఱుముకొనిపోదురు. మిగిలినవారెల్ల చేగొడ్డళ్లుపట్టుకొని వాటిని వెంటదఱుముచు,వాటి గుదస్థానముగుండ చేయిలోపునకు జొరబెట్టి ప్రేగులను బైకిబెఱికి చంపుదురు. అట్లుచేయుటలో ఎవనికాలినిపించిన పదిరూపాయలు దొరకితే యవి వానివే! ఎవఁడుపెఱికినప్రేగులు వాఁడుతనయొడిలోవేసికొనిపోవును. ఈప్రకారముగా రాటకుఁ గట్టినపశువులనన్నిటిని జంపుదురు. ఈ యుత్సవకాలమందుఁ దగవులాటలు, దెబ్బలాటలుగూడ మెండు. అనేకవత్సరములనుండి దేశాంతరమునం దున్నబంధువుల నందఱిని యొకస్థలమందు సమావేశముచేసి బంధుత్వము తెగిపోకుండ నుంచుటకు నిర్ణయించిన యుత్సవ మిది యని తోఁచుచున్నది- సగోత్రికులందఱు కలియుదురుకాన నీ యుత్సవమునకు 'గోత్ర' యని పేరుకాఁబోలు.

భాష:—గదబభాష క్రమేణ క్షీణించిపోవుచున్నది. గదబలు చెంతనున్న నాగరికభాష నవలంబించి స్వభాషను మఱచిపోవుచున్నారు. తెలుఁగులేక కాఁపు గదబలు తెలుఁగుభాషయును, ఓఢ్రదేశమందలి వా రోఢ్రమును, హిందీజనుల చెంతనున్నవారు హిందీభాష నవలంబించి వారిస్వభాషను బొత్తిగా మఱచిరి. అచ్చటచ్చటఁ జెదరియుండుటచేతఁగూడ నీజనులభాష విస్తరించలేదు. ఈ భాషాపదములను గ్రహించుటే చాలాదుస్తరము. అయినను గొన్ని పదములను బొందుపఱచి యీదిగువను వ్రాయుచున్నాను.

| | తెలుఁగు | గదబ |
|---|---|---|
| 1 | చేయి | తిత్తి, తీతి (నేయి) |
| 2 | పాదము | దుసంగ్, నుసంగ్ (పావల) |
| 3 | ముక్కు | మి (మువ్వు) |
| 4 | కన్ను | మో (మా) |
| 5 | నోరు | సార్తో (తోవా) |
| 6 | పన్ను (పళ్లు) | గీనే (జీ) |
| 7 | చెవి | కిన్తిర్ (లావ్వు) |
| 8 | జుట్టు | ఇంగ్చో |
| 9 | తల | బోక్ (భా) |
| 10 | నాలుక | ల ఆంగ్ |
| 11 | కడుపు | సులోఇ (పుటాని) |
| 12 | తండ్రి | ఆపాంగ్ |
| 13 | తల్లి | ఈయోంగ్ |
| 14 | మనిషి | రేమల్ |
| 15 | ఆడది | కుంబై |
| 16 | కొడుకు | ఓడు - అఙ |
| 17 | కూతురు | ఒనో - అఙ |
| 18 | దేవుడు | కీటు - అఙ |
| 19 | దయ్యము | సే ఆరాఇ |
| 20 | సూర్యుడు | సీఇ |
| 21 | చంద్రుడు | ఆర్కీ |
| 22 | నక్షత్రము | పోటేంగ్ |
| 23 | నీరు | డాబ్వ |
| 24 | అన్నము | లాయి |
| 25 | అంబలి | ఇడ్డా |
| 26 | కూర | మా |
| 27 | ఉప్పు | బిత్తి, బిట్టి |
| 28 | ఒకటి | మూయే |
| 29 | రెండు | ఉంబగ్ |
| 30 | మూడు | ఇగ్గేఙ |



# ధమ్మపదము

శ్రీ రవీంద్రనాథ ఠాకూరుగారి వ్యాసమునకు అనువాదము, జంధ్యాల శివన్న శాస్త్రిగారు

పాలీ భాషయందలి 'ధమ్మపద' మను గ్రంథమును, మూలము, సంస్కృత వ్యాఖ్య, వంగానువాదములతో శ్రీ చారుచంద్ర వసువుగారు ప్రకటించిరి. ప్రపంచవిఖ్యాతము లగు రెండుమూడు ఉత్తమ ధర్మ గ్రంథములలో 'ధమ్మపదము' గూడ నొకటి. ఇందలి విషయము లన్నియు బుద్ధునినోటనుండి వెలువడినవే యనియు, బుద్ధుని నిర్వాణానంతరము కొలఁదికాలముననే అవి గ్రంథరూపమున సంకలితము లయ్యె ననియు బౌద్ధులతలంపు.

ఈ గ్రంథమందలి శ్లోకబద్ధములగు ఉపదేశము లన్నియు బుద్ధుని రచనలే యని గట్టిగ చెప్పఁజాలము. కాని యీ ఉపదేశములు పూర్వమునుండియు భారతదేశమున ప్రచలితములై బుద్ధదేవుని కాలమునఁ గూడ వాడుకలోనికి వచ్చినవి. ఇందలి కొన్ని శ్లోకములు మహాభారతము, పంచతంత్రము, మనుస్మృతి మున్నగువాని శ్లోకములతో నేకీభవించుచున్నవి. ఈ విషయమును పండితసతీశచంద్ర విద్యాభూషణుఁడు గారు ఈ వంగానువాదపు భూమికలో స్పష్టపఱచి యున్నారు. ఇట్టి స్థితిలో ఎవరు ఎవరి గ్రంథమును సంగ్రహించిరి అను వివాదము వ్యర్థము. ఇట్టి భావముల ప్రవాహము చిరకాలమునుండి భారతవర్షమున ప్రవహించుచు వచ్చుచున్నది. మనదేశము అనాదినుండియు ఇట్టి భావనలనే కలిగి యున్నది. బుద్ధభగవానుఁడు ఈభావములనే నలుప్రక్కలనుండి ప్రోగుచేసి తనవిగాఁ జేసికొని వానికి చిరస్థాయిత్వ మొసఁగెను— విచ్చలవిడిగ నున్న యాభావములనే యొక సూత్రమున గ్రుచ్చి వానిని వ్యవహార యోగ్యములుగ నొనర్చెను. కనుకనే భగవద్గీతయందుబలె ధమ్మపదమునఁ గూడ భారతహృదయము చిత్రితమయ్యెను. కనుకనే గీతయందును ధమ్మపదమందును భారతీయ గ్రంథాంతరములందలి పెక్కువిషయముల ప్రతిబింబము కనుపట్టుచున్నది.

ధర్మగ్రంథమును ధర్మగ్రంథమునుబలె వ్యవహరించువారలకు దానిచే నేమిఫలము గలుగునో అది యిచటఁ జర్చింపఁబడదు. మనమిచట నీవిషయమును చారిత్రక దృష్టితోఁ జూడఁ గోరుచున్నాము. కనుక ధమ్మపదముచే ప్రపంచమున కేమిలాభము గల్గెను? అను మాట యెత్తుకొనక భారతవర్షముతో దీని కెట్టిసంపర్కము గలదు? విషయమునే ముఖ్యముగ నిచట విచారింతము.

ప్రతి మానవుని జీవితచరిత్రయు నొకవిధముగ నుండనటుల ప్రతిదేశపు చరిత్రయు నొకవిధముగ నుండదు గాన భారతదేశమున ఐతిహాసికసామగ్రి దొరకుట లేదనిన, భారతదేశమున ఐరోపాఖండమువంటి ఐతిహాసికసామగ్రి దొరకుట లే దనుకొనవలెను. అనఁగా భారతీయేతిహాసము, రాష్ట్రీయేతిహాసము గాదు. భారతవర్షమున ఒకటిగాని అంతకంటె నెక్కుడుగ గాని జాతులు గలసి ఎన్నఁడును, రాష్ట్రస్థాపనకుఁ బ్రయత్నింపలేదు. కాన ఈ దేశమున ఎవ్వఁడు ఎప్పుడు రా జయ్యెను? ఎన్ని రోజులవఱకు వాఁడు రాజ్యముచేసెను? అను మాటలను వ్రాసియుంచ స్వ
ల్పము దేశమున కెన్నఁడును గలుగనే లేదు.

భారతవర్షము రాష్ట్రనిర్మాణమున లీనమయి యున్న
ఐతిహాసిక సాధనము లెక్కువగ లభించెడివి. అప్పుడు ఇతిహా
లేఖకులపని చాల సులభ మయ్యెడిది. అయితే ఇంత మాత్ర
మున భారతవర్షము తన భూతభవిష్యత్తులను ఐక్యసూత్రము
బంధింపనే లేదని చెప్పుటకు వీలులేదు. ఆ ఐక్యసూత్రమ
సూక్ష్మము. కాని దాని ప్రభావము అల్పము గాదు. అది స్థూ
దృష్టికి గోచరింపకున్నను అదియే నేటిదనుక మనల నొక్క
బంధించి యుంచినది. మనలను చిందఱవందఱగఁ బోనీయలేదు
అంతటను ఇది యొకవిధమగు వైచిత్ర్యరహిత మగునమ్మ
మును స్థాపించినది. అన్ని వైచిత్ర్యములకును, అన్ని విషమత్వ
లకును మూలమున అప్రత్యక్షముగ సంయోగసూత్రము గ్ర
తమై యున్నది. కనుకనే మహాభారతకాలము నాఁటి భారతవర్ష
నకును ఇప్పటి భారతవర్షమునకును పెక్కు విషయములందు భే
మున్నను రెంటి మధ్యను నాడీయోగము విచ్ఛిన్నము గాలేదు.

ఈయోగమే భారతవర్షమునకు సర్వాధికమగు సత్యము
ఈ యోగేతిహాసమే నిక్కమగు భారతవర్షేతిహాసము. ఈయో
ము దేనిమూలమున నేర్పడెను? తొలుతనే చెప్పితిమి. రాష్ట్రీయ
స్వార్థముతో నీయోగము కలుగలేదు. ధర్మమూలముననే ఈ
యోగ మేర్పడెను. ధర్మ మన నేమియని తర్కమునకు దిగుచో
దీనికంత మెన్నఁటికిని నుండదు. మఱియు భారతవర్షమున ధర్మము
యొక్క బాహ్యరూపమున అనేక పరివర్తనములు కలుగుచు వచ్చె
ను. ధర్మమునకు నేఁడు గాంచుచున్న రూపము, పూర్వము లేదన
టకు సందియ మిసుమంతయు లేదు. అయినను పరివర్తనము
విచ్ఛేదము తెల్లమగుట లేదు. శైశవదశనుండి యౌవనదశకు ప
వర్తనము చెందుట విచ్ఛేదమూలమున కలుగదు. అనఁగా యౌవ
నము శైశవముయొక్క వికాసమేగాని దానికి భిన్నముగాదు
యూరోపీయ చరిత్రమునందును రాష్ట్రీయ ప్రకృతిలో నన్నే
పరివర్తనములు గలిగెను. ఆ పరివర్తనములనుండి ఐతిహాసిక
ణామ స్వరూపమును బ్రకటించుటయే చరిత్రకారుల పని.

యూరపునందలి రాష్ట్ర నిర్మాతలు అనేక పరివర్తనము
నుండియే రాష్ట్ర సంఘటనము చేయుటకుఁ గడంగిరి. భారతీయు
లును అనేక పరివర్తనములనుండియే ధర్మమునకు సమాధము
అనేకరూపముల నిచ్చుటకు ప్రయత్నము చేసిరి. ఈప్రయత్నము
నందే ప్రాచీనాధునికభారతవర్షముల ఐక్య మిమిడియున్నది.

యూరపునందు ధార్మికకృషి అంశరూపముననే తన ప్రభ
వమును జాటెను. కాని రాష్ట్రీయకృషి సంపూర్ణముగ తనప్రభ

---

*ఈ వ్యాసమందలి ధర్మశబ్దమునకు మతమని యర్థము. మతమున్న
ధర్మము విశాలార్థబోధక మగుటచే ఆశబ్దమే ఇందు ప్రయోగింపఁబడినది.

వమును విస్తరింపఁ జేసెను. అక్కడ ధర్మము స్వతంత్ర భావముతో నుదయించెనుగాని అది రాష్ట్రిమున కంగమయ్యెను. అట్లు కానిచో ధర్మమునకును రాష్ట్రిమునకును శాశ్వతమగు విరోధము గలిగెడిది.

మహమ్మదీయ ప్రభుత్వకాలమున మనదేశములో రాష్ట్రీయకృషి శివాజీ నాశ్రయించి తలయెత్తెను. ఆసమయమున ఆకృషి తన ధార్మికలక్ష్యమును మఱచియుండలేదు. శివాజీకి ధర్మగురు వగు రామదాసు దీనికి ముఖ్యాధారమై యుండెను. దీనిని బట్టి భారతదేశమున రాష్ట్రీయకృషి ధర్మమున కంగమయ్యెనని స్పష్టమగుచున్నది.

రాజనీతియు (Politics) జాతియు (Nation) యూరపునకు ప్రధాన విషయము లయినటుల ధర్మచర్చ భారతదేశమునకు ప్రధాన విషయము. పాలిటిక్సు, నేషన్ శబ్దములకు సరియగు అనువాదము మన భాషయందు అసంభవమగునటుల ధర్మశబ్దమునకు, ప్రతిశబ్దము యూరోపీయ భాషలయందు దొరకఁజాలదు. గాన మనము ధర్మమును ఇంగ్లీషులో (Religion) అని పిలుచుచు చాల పొరపడుచున్నాము. ధర్మసంగంభైక్యమే భారతదేశముయొక్క ఐక్య మనిన ఎల్లరకు స్పష్టముగ తెలియక పోవచ్చును.

మానవుఁడు ముఖ్యముగ ఫలము నపేక్షించియే పనిచేయుచుండును. దీనిని బట్టియే వాని ప్రకృతి గోచరించుచున్నది. మానవుఁడు స్వలాభముకొఱకు ధన మార్జించును. కల్యాణకాముఁడు చేతను ధన మార్జించును. (స్వార్థపరతయందు పాపభీతి యుండదు. కల్యాణకాముమునందు పాపభీతి యుండును.) కల్యాణకామికి ధనార్జనమందు అనేక విఘ్నములు గలుగును. జాగరూకతతో వానిని వారించుకొని యతఁడు ముందుకుఁ బోవును. స్వార్థపరుఁడు ఇట్టి విఘ్నములను లక్ష్యముచేయఁడు. (పని జరుగుటయే వానికి ప్రధానము.)

మనము కల్యాణమును (మంచి) ఎందుకుఁ గోరుచున్నాము? భారతవర్షము లాభముకంటె కల్యాణమును—ప్రేమముకంటె శ్రేయమును ఏల వాంఛించుచున్నది? ఈవిషయమై యిపుడు యోజింతము.

కేవలము ఏకాకిగా నున్నవానికి మంచి యనియు చెడ్డ యనియు నేమి యుండదు. ఆత్మానాత్మల యోగముచేతనే మంచి చెడ్డ పనులు పుట్టుచున్నవి. గాన తొలుత ఆత్మానాత్మల యథార్థ సంబంధమును నిర్ణయింపవలయును. సంబంధమును నిర్ణయించుటయు ఆసంబంధమును నిత్యవ్యవహారమున స్వీకరించుటయునే అనాదిగా భారతదేశముయొక్క సర్వ ప్రధానమగు కృషియైయున్నది. భారతదేశమున గనఁబడు వింత యేమన, ఇచ్చట వేర్వేఱుమతములవారు ఈసంబంధనిర్ణయమును వేఱువేఱు విధముల చేయుచున్నారు. కాని వ్యవహారమున అందఱును ఒక స్థానముననే చేరుచున్నారు. వేఱువేఱు స్వతంత్రరూపములతో భారతవర్ష మొకమాటనే చెప్పుచున్నది. ఒకసంప్రదాయము ఆత్మానాత్మలకు భేదము లేదనియు, భేదము గనుపెట్టుటకు కారణము అవిద్యయేయనియు చెప్పుచున్నది.

అయితే ఒకటికంటె నెక్కువగ రెండనది లేనిచో, మంచి చెడ్డల కాస్పదము లేదు. కాని ఏ అజ్ఞానముచే ఒకటి రెండుగా తోఁచుచున్నదో దానిని నశింపఁజేయవలయును. లేనిచో మాయాచక్రమునఁబడి నిరంతరము దుఃఖమునే అనుభవించవలసియుండును. ఈ లక్ష్యమున దృష్టియుంచి కర్మయొక్క మంచిచెడ్డలను స్థిరపఱుపవలయును.

మఱియొక సంప్రదాయము చెప్పుచున్నది—మనము ఈ మిథ్యాప్రపంచమున వాసనాబద్ధులమై భ్రమించుచు, దుఃఖముల నందుచున్నాము. ఒక కర్మచే మఱియొక కర్మయును దానిచే వేఱొక కర్మయు నుత్పన్నము లగుచున్నవి. ఇట్టి శృంఖములచే మనము బంధింపఁబడుచున్నాము. ఈ కర్మపాశమును త్రెంచుకొని ముక్తుఁడగుటయే మానవునికి శుభమగు కర్తవ్యము.

అయితే ఏపనియు జేయక యూరకుండవలసినదని కాదు. కర్మనుండి విడువఁబడుట అంత సులభమగు పనికాదు, గాన కర్మను నియమిత మొనరింపుచో దానిబంధము క్రమముగ శిథిలమగును. దీనిపై లక్ష్య ముంచి కర్మయొక్క శుభాశుభముల నిర్ణయించుకొనవలయును.

ఒక సంప్రదాయము చెప్పుచున్నది—ఈ ప్రపంచము భగవంతుని లీల. ఈలీలకు మూలమగుభగవంతుని ప్రేమను, ఆనందమును అనుభవించుటయందే మనకు సార్థక్యము గలుగుచున్నది.

ఈ సార్థక్యోపాయముగూడ పైని రెండుసంప్రదాయముల యుపాయములకును భిన్నము గాదు. మనము మనవాసనను తగ్గించుకొనకుండ భగవంతుని యిచ్ఛను అనుభవింపఁజాలము. భగవంతుని యిచ్ఛయందు మనయిచ్ఛను మిళితము చేయుటయే ముక్తి. ఈ ముక్తిని లక్ష్యమున నుంచుకొనియే శుభాశుభకర్మలు నిర్ణయింపఁబడుచున్నవి.

అద్వైతానందము లక్ష్యముగాఁ గలవారును వాసనను మోహమును నశింపఁజేయఁ గోరుచున్నారు. కర్మశృంఖలనుండి ముక్తి నపేక్షించువారును వాసన ఉద్వాసము గోరుచున్నారు. భగవంతుని ప్రేమయందే లీనమయి కల్యాణము నభిలషించువారును, విషయవాసనను తుచ్ఛముగ నెంచి దూరముగ నుండఁదలఁచుచున్నారు.

ఈవివిధసంప్రదాయముల యుపదేశములు కేవలము జ్ఞాన విషయములే యై మనకు జ్ఞాతములగుచో, మన పారస్పరిక భేదమున కంత ముండెడిది గాదు. కాని ఈసంప్రదాయప్రవర్తకులెల్ల తమ తమ తత్త్వములను కర్మయందు పెట్టుటకు కృషిసల్పిరి. ఆతత్త్వములు ఎంతసూక్ష్మము లయ్యును ఎంతస్థూలములయ్యును, వానిని ఆచరణలో పెట్టుట కెన్నికష్టములు కలిగినను వానిని సహించి మన గురువులు ఆతత్త్వములనుకర్మమార్గమునసఫలమొనరించుటకు కృషిచేసిరి. భారతవర్ష మెంతకఠినవిషయమునైనను అసాధ్యమని కాని జీవయాత్రకయోగ్యమనికాని, తలఁచి భయపడి యెన్నఁడును త్రోసిపుచ్చలేదు. కనుకనే యొకనాఁడు మాంసాహారిగనున్న భారతవర్షము నేఁడు ప్రాయికముగా నంతటను నిరామిషభోజిగాఁ గనుపట్టుచున్నది. ప్రపంచమున నిట్టి దృష్టాంతము మఱియెచ్చటను గానగాదు. జాతిగతప్రవర్తనములన్నిటియందును సదుపాయమే యోజించుయూరపుఖండము భారతవర్షము కృషిప్రధానమనియు, గోజాతి లేనిచో కృషి కఠినముగాన భారతవాసులు గోమాంసమును విసర్జించిరనియు చెప్పవచ్చును. కాని మనుస్మృతి మున్నగు గ్రంథములందు ప్రమాణమున్నను భారతవర్షముమాంసాహారమును, తుదకు

మత్స్యభోజనమునుగూడ పెక్కుస్థానములందు విసర్జించినది. 'ఏప్రాణిని హింసింపవలదు' అను ఉపదేశమును కఠినముగఁ బాలించు జైనుల ధర్మనిష్ఠను జూడ, 'సదుపాయమునకై మాంసాహారము వర్జింపఁబడినది' అని యెవ్వరును చెప్పఁజాలరు.

ఏమైననగుఁ గాక తత్త్వజ్ఞాన మెంతదూరము పోయెనో కర్మనుగూడ అంతదనుక భారతవర్షము ఈడ్చుకొని పోయినది. భారతవర్షము కర్మతో తత్త్వమును వేఱుసేయలేదు. కనుకనే మనదేశమున కర్మయే ధర్మము. కర్మయే మానవునికి లక్ష్యము, కర్మచే ముక్తి పొందుటయు, ముక్తికొఱకు కర్మ సేయుటయునే ధర్మము.

తొలుతనే చెప్పితిమి: తత్త్వములలో మనకు భేద ముండుఁగాక, కర్మలయందు ఐక్యమే గోచరించును. అద్వైతానుభవమున నేని ముక్తియగుఁగాక. భగవంతుని యప్రమేయపరమానందమున నేని ముక్తి యగుఁగాక ప్రకృతిభేదముచే ముక్తికిఆదర్శ మేదేని యగుఁగాక. ముక్తిమార్గమునకుఁ గొంపోవు నుపాయములలో నొకవిధమగు ఐక్యమే కనుపట్టును. ఆ ఐక్యము మఱియేమియుఁగాదు, అన్ని కర్మలను నివృత్తివైపునకుఁద్రిప్పుటయే. మెట్లనుదాఁటిపోవుటకు మెట్లే యుపాయమయినటులు భారతవర్షమున కర్మను దాటుటకు కర్మయే యుపాయము. మన సమస్త శ్రుతిస్మృతిపురాణములందును ఈ ఉపదేశమే యొసఁగఁబడినది. మనసమాజము ఈభావముమీదనే ప్రతిష్ఠింపఁబడినది.

యూరపుఖండము కర్మను కర్మనుండి ముక్తినిపొందించు సోపానముగఁ జేయలేదు. అది కర్మనే లక్ష్యముగాఁజేసికొనెను. కనుకనే యూరపునందు కర్మసంగ్రామమున కంతములేదు. అచ్చట కర్మ క్రమముగ విస్తృతమును విచిత్రమును అగుచున్నది. ఇందులో సఫలత్వ మొందుట ఎల్లర యుద్దేశ్యము నయియున్నది. యూరపుయొక్క ఇతిహాసము కర్మయొక్క ఇతిహాస మయియున్నది. యూరపు కర్మను గొప్పగా నెంచుచున్నది, గాన కర్మకరుల కది స్వాతంత్ర్యమును గోరుచున్నది. మాయిచ్చవచ్చినటుల మేము నడచెద మను స్వాతంత్ర్యకాంక్షచే నితరుల స్వాతంత్ర్యమునకు నష్టము గూర్చు చోటనే శాసననియమము (చట్టము) ఆవశ్యకమగుచున్నది. ఈచట్టము లేనిచో సంఘమున ప్రతి వ్యక్తికిని నుచితమగు స్వాతంత్ర్యముండనే యుండదు. కనుకనే యూరోపీయ సమాజమున ప్రతిమానవుని యిచ్ఛను స్వతంత్రముగఁ జేయుటకొఱకే శాసనములు కల్పింపఁబడినవి.

భారతవర్షముగూడ స్వాతంత్ర్యమును గోరుచున్నది కాని, ఆ స్వాతంత్ర్యము కర్మలనుండి విముక్తినిపొందు స్వాతంత్ర్యము. మనము దేనిని ప్రపంచమని యనుచున్నామో అచ్చట యథార్థమునకు కర్మయే కర్త. మానవుఁడు దానికి వాహకుఁడు. పుట్టినది మొదలు చచ్చువఱకును మనము ఒకవాసన తర్వాత మఱియొక వాసన, ఒక కర్మ తర్వాత మఱియొక కర్మను మోయుచు తిరుగుచున్నాము. ఊపిరి తీసికొనుటకుఁగూడ నవకాశము గల్గుట లేదు. అటుపిమ్మట నీ కర్మభారమును మఱియొకని నెత్తిపైఁ బెట్టి హఠాత్తుగ మృత్యుముఖమునఁ బడుచున్నాము. వాసనావశీభూతుల మై యనంత కర్మల నొనరింపుచు మనము జీవితమును గడపుచున్నాము. అట్టి కర్మల నిరంతరదాస్యమునుండి విముక్తి నొందుటయే భారతవర్షము యొక్క యుద్దేశ మై యున్నది.

ఈలక్ష్యభేదముచేతనే యూరపు వాసనకు వీలగునంతవఱకు స్వాతంత్ర్య మొసఁగెను. ఇంక మన మీవాసనను వీలగునంతవఱకు తగ్గింపఁ గోరుచున్నాము. వాసన యెన్నఁడును శాంతిపక్షమునకు గొంపోవఁజాలదు. అది పరిణామ రహితమగు కర్మచేష్టనే విజృంభింపఁ జేయును. దీనినే మనము వాసనాదాస్యమని చెప్పుచు ఏవగించుచుందుము. యూరపు ఏమనుచున్నదో చూడుఁడు. వాసన యెట్టి పరిణామమునకును జేర్పఁజాలదు. అది మన ప్రయాసను హెచ్చరించుచుండును. అదియే దానికి గౌరవము. ప్రాప్తికున్నమానె సంధానమే యానందము. ఇంక భారతవర్షముయొక్క జవాబు తిలకింపుఁడు—దేనిని మీరు ప్రాప్తియనుచున్నారో అందు ఆనందమే లేదు. ఏమన, ఆ ప్రాప్తివిషయమై మన సంధానమున కంత ముండదు. ఆప్రాప్తి మనలను మఱియొక ప్రాప్తికడకు ఈడ్చుకొని పోవుచున్నది. మనము ప్రతిప్రాప్తిని పరిణామ మను కొందుము. అది వట్టిభ్రాంతి. ఏమన, ఆపరిణామము సిద్ధమగుటలేదు. ఏప్రాప్తిచే మనకు శాంతికలుగునో, ఏప్రాప్తిచే మనసాధనల కంత మేర్పడునో, అట్టి ప్రాప్తినుండి మనల నీభ్రాంతి దూరస్థులఁ జేయుచున్నది. మన కెవ్విధమునను ముక్తి నొసఁగుటలేదు. ఏవాసన ఆముక్తి విరోధియో దానిని మనము బలహీనముగఁ జేసి విడువవలయును. మనము కర్మను ఎప్పుడును విజయిని కానీయఁగూడదు. దానిని మనము జయింపవలయును.

మన గృహస్థధర్మములు, మనసన్న్యాసధర్మములు, మన యాహారవిహార నియమములు, మన సాధారణ భిక్షుకుని మొదలు గొప్పగొప్ప తత్త్వవేత్తల శాస్త్ర చర్చల పర్యంతము సర్వత్ర ఈ భావమే ప్రభుత్వము సేయుచున్నది. కృషీవలుఁడు మొదలు పెద్ద పండితులవఱకు ఈమాటనే చెప్పుట విందుము—మనము విశేషముచే ముక్తిమార్గమును బడయుటకే దుర్లభమగు మానవ శరీరమును దాల్చితిమి. ప్రపంచమందలి యనంతములగు నావర్తముల యాకర్షణముల నుండి తప్పుకొనిననే మన జన్మము సార్థకమగును.

సంస్కృతభాషలో భవశబ్దమునకు ధాత్వర్థము 'అగుట' యని. భవబంధనమును మనము త్రెంపుకొనఁగోరుచున్నాము. యూరపు దానిని ఇంకను బలపఱచుకొనగోరుచున్నది. ఇట్టిభయంకరమగు స్వాతంత్ర్యప్రయత్నము మంచిదియా చెడ్డదియా యని నిర్ణయించుట కఠినము. స్వాభావిక విరక్తి గలవారితో ఆసక్తులగువారు కలసియున్నచో వారనేక కష్టముల నెదుర్కొనవలసి యుందురు. తుదకు మృత్యుముఖమునఁబడుటకూడ అసంభవముగాదు. అయినే జీవనమరణసార్థక్యమే అంతిమపరీక్షగాదు. ఫ్రాంసు భయంకరమగు తనరాష్ట్రవిప్లవమందు విశేషమగు నొక స్వాతంత్ర్యాదర్శమును నిలువఁబెట్టుటకు ప్రయత్నించెను. ఆప్రయత్నములో దాని యంతము సన్నిహితముగనే యుండెను. అట్టి స్థితిలో అది నష్టమగుచో దాని యాత్మగౌరవము నష్టమగునా? మునిఁగిపోవుచున్న మానవుని రక్షించుటకై యొకఁడు తన ప్రాణమిచ్చెను. మఱియొకఁడు ఒడ్డున కూర్చుండి తమాషా చూచుచుండెను. వాని ప్రయత్నము ముగ్గ పరిణామాత్మకమని ప్రాణరక్షకుని నిందింపవచ్చునా? నేఁడు ప్రపంచములో అన్ని దేశములందును వాసనా ప్రచండాగ్ని ప్రజ్వలించుచున్నది. కర్మసంగ్రామము ద్విగుణితముగ జరుగుచున్నది. నేఁడు భారతవర్షము జడత్వముచేతను, మూర్ఖత్వముచేతను గాక, ప్రబుద్ధ

ప్రబుద్ధమును సచేతనమును అయి వాసనాబంధమగు మోక్షాదర్శము నకై శాంతినిజయపతాకను చలింపక దృఢముగఁ బట్టుకొని పృథివీ వ్యాప్తమును రక్తరంజితము నగు ఈ యశాంతిపై నిలఁబడి మరణించినను లోకులు దానిని నిందించిన నిందింతురుగాక. మృత్యువు మాత్రము దాని నెన్నఁడును అవమానింపఁ జాలదు.

ఈ వివాదముతో నిచ్చట పనిలేదు. ఒక్కటేమాట, యూరోపీయేతిహాసముతో మన యితిహాసమునకు కలయిక కుదురఁ జాలదు. ఈ మాటను మనము మాటిమాటికి మఱచిపోవుచున్నాము. ఏ ఐక్యసూత్రమున భారతదేశముయొక్క భూతభవిష్యత్తు లిమిడి యున్నవో సాంఘికులు దాని ననుసరించుటకై అనుష్ఠానమునకుఁ బూనుకొనవలయును గాని వ్యర్థమగునాక్షేపణలు చేయుటచే నేమియు బ్రయోజనము లేదు. యూరపు ఇతిహాసముయొక్క ఆదర్శమును బుచ్చుకొని భారతేతిహాసమును వ్రాయుట కెన్నఁడును బూనఁగూడదు.

ఈ ఇతిహాసమునకు వలయు పెక్కుసాధనములు బౌద్ధశాస్త్రములయందు నిండియున్న వనుటకు సందియము లేదు. మనవారు పెక్కుసంవత్సరములనుండి బౌద్ధశాస్త్రములవంక కన్నెత్తి యైనను చూచుటలేదు. ఇప్పుడు యూరోపీయపండితులు వాని నుద్ధరించుటకుఁ బూనుకొనియున్నారు. మనము వారిని అనుకరించుటకు వేచి యున్నాము. ఇదియే మనదేశమునకు ఘోరలజ్జాకర మగువిషయము. మనదేశభక్తి యంతయు ప్రభుత్వమువారిని బిచ్చమడుగుటయందే సరిపోవుచున్నది. దానికి వేరొకగతి లేదు. ఇంతదేశములో ఐదుగురు మనుష్యులైనను బౌద్ధశాస్త్రముల నుద్ధరించుటకు తమ జీవితమును ధారపోయరా? ఈబౌద్ధశాస్త్రజ్ఞానము లేకుండుటచే భారతేతిహాసమంతయు అసంపూర్ణముగ నున్నది. ఇది యెటులైనను దేశములోని నవయువకులు ఈపనికిఁ బూనుకొనరా?

ఇప్పుడు శ్రీయుత చారుచంద్రవసువుగారు ధమ్మపదమును అనువదించి దేశీయులకృతజ్ఞతకుఁ బాత్రులయిరి. వారు ఇంతటితో విరమింపక బౌద్ధశాస్త్రముల నన్నిటిని అనువదించి సాహిత్యకళంకమును బాపుదురు గాక. మూలమునుండి మక్కికి మక్కిగా అనువదించుట మంచిది. కఠినమగుచోట దానికి వ్యాఖ్యవ్రాసి భావమును స్పష్టపఱుపవచ్చును. అనువాదము సర్వత్ర వ్యాఖ్యారూపమును దాల్చుట అన్యాయము. ఏమన, వ్యాఖ్యలో అనువాదకునికి భ్రాంతి గలుగు టసంభవము. గాన అనువాదము, వ్యాఖ్యయు వేఱువేఱుగానుండుటచే పాఠకులవిమర్శన కవకాశము కలుగును. మూలములో స్పష్టము కానిమాటలను అనువాదములో అట్లే యుంచుట మంచి దని మా యభిప్రాయము. గ్రంథమందలి మొదటిశ్లోకమే దీనికి దృష్టాంతము.

మూలము—"మనోపుబ్బంగమా ధమ్మా మనోసేట్ఠా మనోమయా" చారుబాబు దీని నిట్లు లనువదించెను—మనస్సే ధర్మమునకు పురోగామి, మనస్సే ధర్మములందు శ్రేష్ఠమైనది. ధర్మము మనస్సునుండియే యుత్పన్న మగుచున్నది.

దీనిని మూలములో నున్నప్రకారము వ్రాయుచో—"ధర్మములు మనఃపూర్వంగమములు, మనఃశ్రేష్ఠములు, మనోమయములు" అని యుండెడిది. పాఠకులు మూలమందలి అస్పష్టతపై అర్థవిచారము చేసెడివారు. "మనస్సే ధర్మములందు శ్రేష్ఠము" అనుటచే వాస్తవికార్థము బోధ యగుటలేదు. ఇట్టిస్థానములందు మూలమునే ఉన్న దున్నట్టుల నుంచుట మంచిది.

"అక్కోచ్ఛిమం అవధిమం అజినిమం అహాసిమే
యేచతం ఉపనయ్హంతి వేరం తేసం నసమ్మతి॥"

అనువాదము—నన్ను తిట్టిరి, నన్ను కొట్టిరి, నన్ను ఓడించిరి, నాద్రవ్యము హరించిరి, అను ఆలోచన ఎవరి హృదయమునఁ బుట్టదో వానికి వైరభావము తొలఁగిపోవు చున్నది.

'అను ఆలోచన ఎవరి హృదయమున బుట్టదో' అను వాక్యము వ్యాఖ్యగాని అనువాదముగాదు. 'ఎవరు ఇందు చిక్కుకొనరో' అని యున్నచో బహుశః మూలము ననుసరించెడిది. అర్థబోధకై విశేషవిషయములను బ్రాకెటులో వ్రాయవచ్చును.

ఉదా—నన్ను తిట్టిరి, నన్ను కొట్టిరి, నన్ను ఓడించిరి, నా (ధనమును) హరించిరి, ఈమాటలను ఎవరు (హృదయమున) పెట్టుకొనరో వారి వైరము శాంతించుచున్నది.

ఈ గ్రంథమున మూలమున కన్వయము, సంస్కృత భాషాంతరము, వంగానువాదము ఉండుటచే పాఠకులకును విద్యార్థులకును విశేషోపయోగముగ నున్నది, ఈ గ్రంథసహాయమున పాలీభాష నేర్చుకొనుట సుగమముగా నుండును.

ఈపాలీధమ్మపదమునే శ్రీహరిహరానందస్వామివారుసంస్కృత వంగానువాదములతోఁ బ్రకటించిరి. అదికూడ ఈ ధర్మ గ్రంథ ప్రచారమున సాయపడును.

---

## ప్రతీక్ష

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు.

నీలి నీలి దారాల తారా లతాంత
నూలు లల్లును నా ప్రియురాలు రేలు;
పువుపువుగ విడదీసి మబ్బుల చెరంగు
కొసల ముడివైచి నాడి దాచికొను పవళ్లు!!

ఎన్నడును గాని నారాక కెదురుచూచు
నాసకియ జీవితము నంత నవయబోదు;
ప్రతి నిశా చంచలా చల లాస్యములగు
పసపులిపునామె వ్రేళ్ల తొందరలు నాకు.

# జ్ఞాన ప్రశంస

మ॥ రా॥ రా॥ శ్రీ నాగపూడి. కుప్పుస్వామయ్యగారు.

లోకమున నెల్లవారును నెల్లకాలములందును సుఖమునే యనుభవింపఁ గోరుదు రనుట యెల్లవారు నెఱింగినవిషయమే. సుఖ మనఁగా మనసునకుఁ గలుగు నిష్టరూప మగు నానందము. దుఃఖ నివృత్తిసహితంబుగ నున్నంగాని సుఖానుభవంబు గలుగదు. దుఃఖ సమ్మిశ్రితం బగుసుఖము సుఖాభాసమే కాని కేవల సుఖము కానే రదు. ఇది యైహికసుఖములకును ఆముష్మికసుఖములకును నన్వ యించును. దుఃఖ మప్రియము. సుఖము ప్రియము. కావున దుఃఖ మును నివర్తింపఁ గోరుటయు, సుఖమునుఁ బొందఁగోరుటయుఁ బ్రాణి మాత్రసహజగుణ మైయున్నది. ఆపద- రోగము- మొదలగునవి, ప్రాణుల కప్రియము లైనకారణంబుచే వాని నెవ్వారును గోరరు. అవి తమంతన వచ్చెనేని వాని నెట్లయినం దొలఁగింపఁ బూనుదురు. ఇట్లున్నను నీవిషయమున మానవులకును దదితర ప్రాణులకును గొంత భేదము కనఁబడుచున్నది. మనుష్యేతరము లగుజీవకోటులకు మనుష్యుల కున్నట్లు వివేకసామగ్రి లేమిచే వానికిఁ గలుగు సుఖ దుఃఖములును నల్పములే. పశుపక్ష్యాదుల నెవరైనను దూషించి నను భూషించినను నవి ఖేదమోదములం బొందవు. కొన్నిజంతువులు తప్పఁ దక్కినవి తమ సహవాసులతో నెడఁబాటు గలిగినపుడు దుఃఖించునట్లును వానికి సంయోగ వియోగముల భేదము తెలియు ననియుఁ దోఁపదు. తాము చేయు ప్రయత్నము లత్యల్పములు. అవియు విఫలము లయ్యెనేని వానికై జంతువులు చింతింపవు. మను ష్యులకు బుద్ధియు వివేకమును భగవంతుఁ డధికముగా ననుగ్రహించి యుండుటచే వారికి సుఖదుఃఖ పరంపరలు బహుళములుగా నుండును.

మనుజులకుఁ గలుగుదుఃఖము లిన్నియని చెప్పశక్యముకాదు. అవి యనంతములును నానాప్రకారములును నై యుండును. జనన ప్రభృతి మరణపర్యంతము బాల్యకౌమార యౌవనవార్ధకములను, నన్నిదశలందును నేవియోదుఃఖములు మనుజులకు సంభవించుచునే యుండును. పుడమి యేలెడు రాజులకును, మడక దున్నుకొని జీవిం చు కాఁపువానికిని నేవో సంకటములు గలిగి వారిం బీడించు చుండు ను. రోగము- దారిద్ర్యము - స్వజనవిరోధము-నింద-హింస మొ దలగు దుఃఖములెన్నియో సతతము మనుజులను వేధించు చుండును. ఇవి యిహలోకమునకు సంబంధించిన కష్టములు. ఇవి కాక జనన మరణాది క్లేశరూపమగు సంసార మనియెడు గొప్ప దుఃఖమును గలదు. అది పరలోకమునకు సంబంధించినది. ఈ యిరుదెఱంగు లగు దుఃఖములను దొలఁగించి యభీష్టసుఖములను బడయుటకుఁ బ్రధానమగు సాధనము జ్ఞానము. జ్ఞానముచేతనే మనుజులనుసంబుల లో దుఃఖనిరసనోపాయంబులును సుఖాపాదనోపాయంబులును స్ఫురించును.

జ్ఞానము నానాప్రకారములు గలది. జ్ఞాన మనఁగా బుద్ధి వికాసరూప మగు చిత్తవిస్తారము.. ఏ పని చేయువానికిని దానికిఁ దగినంతవఱ కైనను జ్ఞానమును సంపాదింపకున్నచో వాఁడు చేయు పని నెఱవేఱదు. ఏకాలమునం దేవిత్తనము చల్లవలయునో యది తెలియక యకాలమందుఁ జల్లెనేని విత్తనము పాడగును. వెన్నెల రాత్రులలో వెదురు బొంగులను నఱికి తెచ్చినయెడల నవి పుచ్చి పోవును. అవియే యమావాస్య రేలు నఱికి తెచ్చినచో నెంతకా మైనను దృఢముగా నుండును. తల్లికి బిడ్డలఁ బోషించువిధము లెస్సగాఁ దెలియకున్నను స్త్రీలు ప్రసవించునపుడు గమనింపవలసి విధులు దెలియకున్నను బ్రమాదములు సంభవించును. రాజుల రాజ్యతంత్రములు దెలియకున్నచో వారికిని బ్రజలకును మహాన ములు వొసఁగును. ఇట్లు సకలవ్యాపారములందును వివేకము లే న్నచోఁ గష్టములు సంభవించును. అట్టి వివేకమునకే జ్ఞాన మ పేరు.

అది సద్గ్రంథపఠనమువలనను, నార్యు లగుసజ్జనులసంగ వలనను గలుగును. ప్రాచీను లగుమనపెద్దలు తమ వెనుకటివా హితంబు గోరియే వేద స్మృతి పురాణాదు లగుగ్రంథములను వ్రా యున్నారు. వానిని వ్రాయుటకు వారి కితర ప్రయోజనము లే యులేవు. అవి యొకకాలమువ కని మాత్రమే కాక సర్వకాలము లందును సర్వజనాను శ్రేయము లై హితకరంబు లగునట్లు వ్రా యున్నారు. వాని నన్నింటిని బఠించుటకు జీవితకాలమంతయుఁ బ్రయ త్నించినను జాలదు. కావున వానిలోఁ బ్రధానము లగువానినైన నెల్లవారును బఠింపవలయు. విద్యవలన మన కున్నయవివేకమునక సదసద్వివేకము గలుగును. ధర్మాధర్మము లివి యని తెలియనగు కష్టములను రానీయక యాపుటకును, నవి వచ్చునపుడు పాపు కును సదుపాయములు గోచరించును. ఇంతకు మున్ను లేని సౌఖ్య ములను గలిగించుకొని క్రొత్తసుఖంబుల ననుభవింపను దగు నుపా యములను నెఱుంగఁ గలము. జ్ఞానము హెచ్చగు కొలఁది మన సౌఖ్యమునకే కాక లోకుల సౌఖ్యమునకును సదుపాయంబుల స్ఫురించి వానిం జేసి సకలజనహితంబు సేయఁజాలుదుము. ఏగ్రంథ ములను బఠింపవలయు ననిన సులభోత్తరంబు చెప్ప శక్యముకాదు. మనుజులు తమ జీవయాత్ర నడపుటకు వలసిన విద్యఁ గఱపుగ్రంథ ముల నవశ్యము పఠింపవలయు. ఇది గాక ధర్మములను నీతులను లోకసంప్రదాయములను దెలుపు గ్రంథములను బఠించుటయు నావశ్యకము. వీనిలో దేశ వార్తాపత్రికలును జేరుచున్నవి. ఇవి యవి యననేల ? జ్ఞానమునకుఁ బరిమితియే లేదు కావున మనుజులు సర్వదా తమకుఁ దీఱిక యున్నపుడెల్లను జ్ఞానదాయకము లగునట్టి మగ్రంథములను బఠించుచు జ్ఞానాభివృద్ధిఁ గావించుచునే యుండ వలయు.

ఇఁక సత్సంగతింగూర్చి చెప్పెద. సాధుజనులతోడి సాంగ త్యమువలన మనకుఁ జాల మేలు కలుగును. సాధువు లెవరనగా పాపదూరులు, సర్వభూతహితకాంక్షులు, దయాళువులు, పరమశాం తులు, సత్యశీలురు, కామ క్రోధ వివర్జితులు, గభీరస్వాంతులు, అద్రోహచింతనులు, అహింసావ్రతులు, దంభాహంకారరహితులు, ఈశ్వర భజనతత్పరులు. ఇట్టివారు సాధువులని భగవంతుఁ డగు శ్రీకృష్ణుఁ డుద్ధవున కుపదేశించెను. వారే సత్పురుషులు. వారి తోడి సాంగత్యము కలుషాపహారమును సర్వశ్రేయస్కరమును నగుట.

"సదా సంతోభిగంతవ్యాః యద్య ప్యుపదిశంతి న।
యాహిస్వైరకథా తేషా ముపదేశాభవంతి తాః॥"

అను నార్యవచనముచొప్పున నారు మన కేమియు నుపదేశింపకున్నను వారు చెప్పెడుసామాన్యకథలును మనుజుల కుపదేశములే యగును.

గంగాస్నానము చేసినచోఁ బాపములు నశించును. చంద్రకిరణములు సోఁకినచో శరీరతాపము శమించును. కల్పవృక్షము దైన్యమును (దారిద్ర్యమును) పోఁగొట్టును. సజ్జనదర్శనము పాపమును దాపమును దైన్యమును బోఁగొట్టును.

"గంగా పాపం శశీతాపం దైన్యం కల్పతరు స్తథా।
పాపం తాపంచ దైన్యంచ హంతి సజ్జనదర్శనమ్॥"

అని యార్యులు చెప్పియున్నారు.

జ్ఞానము, సత్సంగము– ఈ రెండును జనులకు రెండునేత్రములు. నేత్రములు లేనియంధుఁడు సంచరింపనేరనివిధమున నీరెండు నేత్రములు లేనిజనులు మంచిమార్గములందు సంచరింపనేరరు. ఈ యర్థమునే

"సత్సంగశ్చ వివేకశ్చ నిర్మలం నయనద్వయం।
యస్య నాస్తి నరస్సోంధః కథం నస్యాదమార్గగః॥"

అని పెద్దలు చెప్పియున్నారు.

కావున జ్ఞానసంపాదనమునకై సద్గ్రంథపఠనంబును సత్సాంగత్యమును మనుజుల కవశ్యకర్తవ్యములు. వీనిచేఁ గలుషంబులు నశించు. కామక్రోధాదులు క్రమంబుగఁ బొలియు. సదాచారంబు పట్టువడును. అధర్మచింతలు మాను. ధర్మచింత లొదవు. భేదదృష్టి వలనఁ గలుగునసూయాద్వేషాదులు నిర్మూలంబులై చెడు. సర్వ భూతంబులందును సోదరీ సోదరభావం బొదవి సమదర్శిత్వబుద్ధి కలుగు. ఎవరినైనను నిందింపను నేప్రాణికైన నపకారముచేయను దలంపుగలుగదు. అన్ని జీవకోటులకును నుపకారము చేయుతలంపు గలుగును.

ఇవి యీశ్వరానుగ్రహంబువలన లభించు. ఈశ్వరానుగ్రహము మనము పూర్వజన్మములందుఁ జేసిన సుకృతవిశేషంబువలనఁ గలుగు. దానిచే భగవద్భక్తి యొదవు. భక్తియే యాకాలంబున నుత్తమగతిం బడయుటకు ముఖ్యసాధనము. దానింగూర్చి విస్తరించి చెప్పఁ బూనిన నీయుపన్యాసము కడుం బెద్దదిగా బెరుఁగు నను భయంబున నింతటితో విరమించెద.

---

# సంధ్యావేగము

శ్రీరంగం నారాయణబాబు గారు, కవితాసమితి.

గీ॥ ఆంధ్రవని పాడు నంబరంబంటి సంధ్య
సాంప్రదాయసూత్రమ్ముల జాఱవిడిచి
తెనుఁగు మీఱిన యాంధ్రపుత్రికలు భక్తి
పూయు ఢో లాక్ష యరుణిమ పోకమున్నె.

గీ॥ వెన్నెలల్ తిని విహరించు వెలది గాంచి
చీకటులఁ ద్రావి జీవించు చెలియఁజూచి
సంధిసేయగ మింటను సంధ్య మెఱసె
రాయబారగీతాలాపరాజి మ్రోయ.

గీ॥ కలుషదుఃఖతమంబుల కారునిశనొ
విరియుప్రేమల వెన్నెల వెండి రేయొ
ఏది నా కిత్తువో మీర లెఱుకరాదు
సంధ్య! ప్రియురాలి యధరంపు చక్కదనమ!

......................

......................

గీ॥ సంధ్య చివురాకుదోనెలో చల్లనైన
తుహినబిందువు నా చుక్క తోచె నంత
విరహ దావాగ్నికీలల వేడి వెతల
వలపు లొలికించు తీయని తలపుభాతి.

గీ॥ పాంచభౌతికదేహంబు పతిత మాట
హుతవహుని పూతజిహ్వా కాహుతిగఁ జేసి
పరమపదశాంతి పర్వాల పరిమళించి
వెలుఁగుమానినీ శీలంపు వెన్నపూస.

గీ॥ పరిమళించెడు భావాల పదనుకత్తి
దృశ్యకావ్యోర్మికా గీత సస్యఫలము
పులకరింపుల తొలికారు పూల మొగ్గ
అధరరుచిలోన మధురంపు సుధలచుక్క.

......................

......................

గీ॥ ఊడి రేకులు గా పడివాడె సంధ్య
విశ్వమంత సుషుప్తికై వేచియుండె
అప్పుడప్పుడు జృంభికలట్లు తోచె
మారుతమ్ములు యీ మునిమాపు వేళ.

గీ॥ సాంధ్యరాగసుధాసూత్రసంచయములు
కాలపురుషుండు త్రెంచెను గడియలోన
చీదరించెను దుఃఖమై చీకువాలు
ఉసులు స్మృతికణములై లే తొడిమ దొడిగె.

గీ॥ ప్రకృతి యవ్యాజముగ నిచ్చె ప్రణయరక్తి
పచ్చియాఱని తాంబూల పాటలంబు
కాలపురుషుండు చీకట్ల గలుపకుండ
త్రాగలేడని చెప్పవే మూగపికమ.

.................

నవ్యతేజస్సు దిక్కుల నాపుగట్ట
లేతజాబిల్లి వెన్నెల పూతబూసె
భువన మంతయు నానందభవన మయ్యె
ఎందులకొ నేడ్చు నీ వెఱ్ఱిజెంద మకట!
సమసిపోయిన సంజకై జాలిగాను.

గీ॥ కవికిశోరంపు భావనాకల్పలతల
నవ్యరాగంపు వంశీనినాదములను
పొటమరించిన సంధ్యల పూలవాన
కారురాతిరి కెర యంచు నేరి కెఱుక.

.................

సాంధ్యరాగాంబుఝరులను స్నాన మాడి
చలువచేసిన వెన్నెలవలువఁ దాల్చి
మధు రసాలకిసాలయ మధ్య నిలిచి
పాడె ఋక్కులు కోయిలబ్రహ్మచారి.



# ఆదర్శ వార్తాపత్రిక

శ్రీయుత కొడాలి శివరామకృష్ణారావుగారు, ఆంధ్రపత్రికా సహాయ సంపాదకులు

స్వదేశములయందును, అన్ని భాషలయందును, వార్తాపత్రిక లుద్భవించుచున్నవి. నిలిచినవి నిలుచుచున్నవి. గిట్టినవి గిట్టుచున్నవి. వార్తాపత్రికా పఠనాభిలాష నానాటికి ఎల్లెడల హెచ్చుచున్నది. ఇతరదేశముల మాటయేమియో గాని మన ఆంధ్రదేశములో వేరగా పత్రికదొరకిన చదువువారే హెచ్చుగ గన్పించుచుందురు. దబ్బిచ్చి తెప్పించుకొనువారి సంఖ్య యింకను హెచ్చవలసి యున్నది. దినపత్రికలు బయలుదేరతర్వాత, వారపత్రికలు మాసపత్రికలలోని వార్తలు పాతచెత్తలాగు చూచుచున్నారు. నిన్నటిదినపత్రిక నేడు చదువరులకు పాతపడిపోవుచున్నది. గంటగంటకు పత్రిక బయల్వెడలిన బాగుండు ననువారును గలరు. కొన్నిపత్రికలు దినమునకు మూడు నాలుగు ముద్రణములను గలిగియుండుట జూచుచున్నాముగదా. అట్టితరి గంటగంటకు పత్రిక వలయు ననుటలో నాశ్చర్యమేమున్నది ?

ఆదర్శ వార్తాపత్రికనుగురించి వ్రాయుటలో దినపత్రికనే మదినుంచి వ్రాయుచున్నాను. పత్రిక స్వామిదారుడు పత్రికానిర్వహణయందు అనుభవజ్ఞుడును దక్షుడు నై యుండవలెను. అప్పుడే కార్యనిర్వహణయందలి లోపములను, తాబేదారుల లోపములను కనిపెట్టగలిగియుండును. స్వామిదారుడు అచ్చుకూర్చుపని మొదలు సంపాదకీయములను వ్రాయువరకు సమర్థుడైయుండుట శ్రేయము. అనుభవజ్ఞుడు గానిచో తాబేదారుల గోదనములు చెవిటివానిముందర సంకూదినట్లే. పత్రిక స్వామిదారుడు ఒకడుగానున్న మంచిదా లేక లిమిటెడ్ కంపెనీలాగుండిన మంచిదా యనువిషయము నాలోచింతము. ఒకడుగా నున్నచో మంచివాడైన తప్ప లేకున్న నిరంకుశాధికారము హెచ్చును. ఇతని వారసులు సరియైనవారు గానిచో పత్రిక ఈతనితోనే అంతరించును. డైరెక్టర్లు 4,5 గురు కలిగిన లిమిటెడ్ కంపెనీ అయినచో మానేజింగు డైరెక్టరు ఒకప్పుడు పొరపడినను తక్కిన వారా పొరపాటును సవరింపగలిగియుందురు. మానేజింగు డైరెక్టరు అనుభవజ్ఞుడును న్యాయబుద్ధిగలవాడును సమర్థుడునైయుండవలెను. లిమిటెడ్ కంపెనీ క్రింద వ్యవహారము జరుగుచుండినయెడల, పత్రిక చాలకాలము నడుప వీలుగనుండును. పత్రికయొక్క జయమునకు క్రమము ప్రధానము. క్రమము తప్పక దినదినము పత్రిక సరిగ బయల్వెడలినప్పుడే చదువరులకు, లోకులకు నమ్మిక కుదురును. అప్పుడే పత్రికకు జయము కలుగును. స్వామిదారుడు,లేక స్వామిదారులు పత్రికను సాగించుటకు ముందు స్వంతగృహమును,స్వంత ముద్రణాలయమును ఏర్పాటుచేసికొనవలసియుండును. స్వంతగృహము లేనిచో నిక్కడనుండి అక్కడకు, అక్కడనుండి యిక్కడకు మారుటలో సామానుల నష్టము, అలస్యము, డిక్లరేషన్ తొందరలు మున్నగునవి తటస్థించును. అద్దె యిల్లగుచో సరియైన వసతిగలది గాకపోవచ్చును. స్వంత ముద్రాక్షరశాల లేనిచో పత్రికనుగురించి తలిపెట్ట నక్కరయే లేదు. ఇతర ముద్రాక్షరశాలలో అచ్చువేయునెడల సకాలమునకు పత్రిక వెల్వడకపోవుట యటుండ, ఖర్చును హెచ్చగును. పత్రిక సాగించిననాటనుండి దబ్బు కుప్పతిప్పలు గావచ్చునని ఏకొలది ద్రవ్యములోనో సాగించి లాభములేదు. 1,2 సంవత్సరముల కగు ఖర్చును మదింపువేసుకొని దానినంతయు పోగొట్టుకొనినను. సరే యనుధైర్యముతో ప్రారంభించి నడుపుచున్నప్పుడే కాలక్రమమున పత్రిక తనకాళ్లపై నిల్వగలదు.

స్వామిదారుడు పత్రికానిర్వహణసమందుగా చేకూర్చుకొనవలసిన పరికరము లెవ్వియో యోచింతము. పత్రికాసంపాదకుడు, సహాయసంపాదకులు, మేనేజరు, గుమాస్తాలు, కంపొజిటర్లు, ప్రూఫ్‌రీడర్లు, ఉపవిలేఖకులు, నౌకరులు, మంచి పుస్తకభాండాగారము. స్వామిదారుడే పత్రికా సంపాదకుడైన మేలు. ఏలనిన, తన అభిప్రాయానుసారము వ్యాసములను వ్రాసికొనును. సంపాదకుడు జీతము గైకొనువాడైన, యజమాని అభిప్రాయానుసారము, అతని చిత్తవృత్తిని గ్రహించి వ్యాసములు వ్రాయవలసియుండును. జీతమునకై ఒక్కొక్కప్పుడు తన మనస్సాక్షిని చంపుకొనవలసియుండును. అందుచేతనే స్వామిదారులకును, సంపాదకులకును అభిప్రాయభేదము లంకురించుట మనము వినుచున్నాము. స్వామిదారులే సంపాదకులుగానుండుట మిక్కిలియరుదు. దానంజేసి పలుతావుల సంపాదకులు జీతము గైకొనువారుగనే యుండవలసి వచ్చుచున్నది. సంపాదకుడు సర్వవిషయములు తెలిసినవాడుగను లోకానుభవము గడించినవాడుగ నుండవలెను. మేనేజిమెంటు నిర్వహింపగల నేర్పుగలవాడై యుండవలెను.

సహాయ సంపాదకులు సంపాదకునకు తోడ్పడగల సమర్థులై యుండవలెను. వీరిలోనొక్కొక్కరు అధమము ఒకవిషయమునుగురించి అయినా విశేష పరిశ్రమ చేసినవారైయుండుట మేలు. ద్రవ్యసంబంధము, ఉత్తర ప్రత్యుత్తరములు నడుపుట, గుమాస్తాలను, నౌకర్లను అదుపులోనుంచగలవాడు మేనేజరుగ లభింపవలెను. గుమాస్తాలను నౌకరులను చురుకైనవారినిగాజూచి తగుమందిని మేనేజరు నియమింపవలెను. పదిమంది చేయగలపనిని ఒకరినెత్తినివేయక ప్రతివాడును ఉల్లాసముగ పనిచేయులాగున కావలసిన సిబ్బందిని నియమించుట మంచిది. ఎప్పటి యుత్తరమున కప్పుడు జవాబు వెడలునట్లు ఆఫీసునందలిపని చురుకుగను, క్రమముగను ఉండవలెను. కంపొజిటర్లను కావలసిన సంఖ్యకంటె 4 గురిని హెచ్చుగా నియమించుట యుత్తమము. హెచ్చుపని వచ్చినప్పుడు వెదకుకొనకుండ వీరు ఆ పనిని సులభముగ నెట్టగలరు. ప్రూఫ్‌రీడర్లు మంచి భాషాజ్ఞానము గలవారై యుండవలెను. ఉపవిలేఖకులు తమతావుల పలుకుబడియు, నేర్పుగ వ్యాసములు వ్రాయగలవారును, సత్యవంతులునై యుండవలెను. బాధ్యతగలవారై యుండవలెను. వ్రాయదమనువారినెల్ల ఉపవిలేఖకులుగ నియమింపరాదు. వీరిని సరియైనవారినిగ నియమించుటలోనే స్వామిదారుని ప్రజ్ఞగలదు. సిబ్బంది నేర్పఱచుటలో స్వామిదారుడు వారివారి అర్హతలకు తగురీతి జీతములనిచ్చి అసంతృప్తి వారిదరి చేరకుండునటులును వారు తమవిధిని ఉల్లాసముగ నెరవేర్చునట్లుగను జూడవలెను. పత్రికాసంపాదకునకు పనికివచ్చు గ్రంథములన్నియు పుస్తకభాండాగారమునందుండవలెను. ఇవన్నియు 'ధనమూల మిదంజగత్త'నురీతి ద్రవ్యముతో కూడియున్నవి. ద్రవ్యమును విరివిగ వెచ్చింపగలిగిననే పత్రికాజయముకూడ లభింపగలదు.

మనదేశమునదిన పత్రికా నిర్వహణకు ఒకరాజధానిని "యూనిట్టు"గా తీసికొనదము. అంతకుమించినను అంతకుతగ్గినను సొంపులేదు. లేదా ఏకభాషావ్యాప్తి ప్రదేశమునైనను యూనిట్టుగా తీసికొనవచ్చును. స్వదేశభాషలయందు పత్రికను నడపవలెనన్న, సంపాదకవర్గమునందు సంఖ్య హెచ్చుగ నుండవలెను. వీరికి తగ్గని పనియు అధికముగ నుండును.

పత్రికయందు సంపాదకీయములు చదువరుల అభిరుచినిబట్టియు, పత్రిక వ్యాప్తి ప్రదేశమందు గల ప్రజలనాగరికత, భాషాభివృద్ధి ననుసరించియు నుండవలెను. ఒక్కొక్కప్పుడు దీర్ఘముగను తఱుచు క్లుప్తముగ నుండవలెను. పత్రికలో రాజకీయములు, సాంఘికములు, దేశీయవార్తలు, వృత్తాంతలేఖలు, విదేశ సమాచారములు, వర్తక వ్యవహారములు వ్యవసాయవిషయములు, శాస్త్రచర్చలు, నాటకవిషయములు, దేహపరిశ్రమ విషయిక మగునాటలు, గ్రంథవిమర్శలు, విద్యావిషయములు మున్నగునవన్నియు పత్రికయందు ప్రచురింపబడు చుండవలెను. ఎవరి కేవిషయమునం దభిరుచి యుండునో వారి కావిషయమందు గావలసినరీతి వ్యాసము లుండవలెను. ఏరాష్ట్రమునకు పత్రిక చెందునో ఆ రాష్ట్ర వార్తలు, ఆరాష్ట్ర విషయములు హెచ్చుగ నుండవలెను. సాధారణముగా ఏప్రాంతవాసి తనప్రాంతమందలి వార్తలేమిటో యని పత్రికను విప్పిచూచును. అం దేదైనా గన్పడినచో సంతసించును. అవ్విధముగనే పత్రిక తనప్రదేశవ్యాప్తియందలి ప్రతి ముఖ్యపట్టణముయొక్కయు, ప్రతి ముఖ్యగ్రామముయొక్కయు వార్తలను ప్రచురింప గలస్థితిలోనుండెనేని ఆపత్రికయం దభిమానము ఎల్లరకు కుదురును.

ఇట్లు అభిమానము కుదురుటకు జల్లెడయల్లికవలె ఎల్లెడలను ఉపవిలేఖకులను ఏర్పాటుచేయవలసియుండును. రిపోర్టరులను వెంటనే బంపి ఆయాతావుల జరుగు ఆందోళనవ్యవహారములను విశదముగ ప్రచురింపవలెను. సహాయ సంపాదకులచేతను, ప్రముఖులచేతను ఆయావిషయములమీద మంచివ్యాసములను వ్రాయించుచుండవలెను. కాలక్రమమున విలేఖరులును, సహాయ సంపాదకులును మంచి సంపాదకులుగా తయారగునట్లు చూచుటయు, పత్రికయొక్క ఘనతనే చాటును. పండితులచే కథలను వ్రాయించుచుండవలెను, గ్రంథ విమర్శనలను మంచిమంచి



కీ॥ శే॥ దీ. బ. తిరుమల పిళ్లెగారు.



పి. టి. రాజన్‌గారు.



సర్. కూర్మ వె. రెడ్డినాయుడుగారు.



రా॥ బ॥ యమ్. సి. నాయుడుగారు, యమ్. యల్. ఎ



గా. యస్. వీరాస్వామిగారు.



రా॥ సా॥ ఆర్. సుబ్బయ్యనాయుడుగారు.



ఆర్. యస్. నాయుడుగారు.



యమ్. కోటి రెడ్డిగారు, యమ్. యల్. సి.



లింగం వీరభద్రయ్య చౌదరిగారు.



ఆర్. ఫాక్స్‌గారు



టి. యమ్. మొయిదుసాహెబ్,
యమ్. యల్. సి.



రా॥ బ॥ సి. యస్. రత్నసభాపతి మొదలియారుగారు,



దీ॥ బ॥ యస్. కుమారస్వామి రెడ్డిగారు.



మి. డబ్లు. పి. ఏ. సౌందర్యపాండ్య నాడార్ గారు,
యమ్. యల్. సి.



రా॥ బ॥ యస్. ఎల్లప్ప శెట్టిగారు.



రా॥ బ॥ కె. సీతారామరెడ్డి, యమ్. యల్. సి.



రా॥ సా॥ బి. మునుస్వామి [illegible]



రా॥ బ॥ ఎ. టి. పన్నీరుశెల్వంగారు.

ఆయావిషయములను తెలిసినవారిచేతను వ్రాయించుచుండవలెను. అప్పుడే సద్గ్రంథములు వెలువడుటయు, భాషకు మేలుకలుగుటయు తటస్థించును. ప్రతిగ్రంథము బాగున్నదని వ్రాయుటలో అర్థములేదు. నిష్పాక్షికముగ వ్రాయుటలోను వ్రాయించుటలోనే పత్రిక ఘనతగలదు. ఏదైన విమర్శింపవలసివచ్చినప్పుడు పత్రికా సంపాదకుడు మొగమోటమునకు తావొసంగగూడదు. పత్రికయందు దూషణకవిత్వమునకు చోటుండగూడదు. వినాశకరమగు విమర్శనకంటె నిర్మాణకరమగు విమర్శ యుండవలెను. ఒకరిని దూషింపక మృదువాక్యములతో మందలించురీతి వ్యాసములున్ననే చదువరుల కెక్కువరుచించును. కొందలు ఏకృషియు జరుపకనే మాస గొడ్డు కావలెను, అది కావలెను ఇదికావలెనని పత్రికలను వ్రాయుచుందురు. వారు ముందుగా ఆయాసంబంధికులను వ్రాసి ఏమియు ప్రయోజనము లేనప్పుడే పత్రికను వ్రాయునలవాటు కలిగించుట మంచిది. ప్రజలకు చెందినముఖ్య యిక్కట్టును గురించి పత్రికలో పడగానే దానిని గురించి మార్కుచేయుచు ఒకప్రతిని ఆయాసంబంధము గలఅధికారికి పత్రికవారు పంపుచు మేల్కొలుపుచుండవలెను.

పత్రిక ఆకృతి ఎట్లుండవలయును అనువిషయమునుగురించి యోచింతము. అచ్చు స్పష్టముగను, సులభముగ చదువుట కనుకూలముగ నుండులాగుండవలెను. కాగితము చదువుకొనువరకైన చినుగునదిగాకుండ కొంచెము దట్టమైనదిగ నుండవలెను.

ఆయావిషయములకు సంబంధమైన బొమ్మలు కలిగియుండవలెను. సైజు ఎట్లున్నను యిబ్బందిలేదుగాని దబ్బున కాకించి చదువునవి వ్యాసములో, ప్రకటనలలో తెలియునటులాగున అన్నియు కలగలపుచేయక రీడింగు మాటరు ప్రత్యేకముగా కొన్నిపేజీలయందును, ప్రకటనలను ప్రత్యేకముగా కొన్నిపేజీలయందును ప్రచురించుట యుత్తమముగా నుండును. ప్రకటనల నైనను ప్రజల మోసపోవునవిగాకుండులాగు చూచి ప్రచురించుట మేలుగానుండును.

దేశీయవార్తలు, నాటకవిషయములు, ఆటపాటలు మున్నగువాటిని కలగలుపు పులగముగావేయక వేఱొక వాటికి ప్రత్యేకపేజీల నియమించి ఆపేజీలయందు అవి ప్రచురింపబడులాగు చూడవలెను.

ఇట్లుగా పత్రిక నడుపబడుచుండిన, ఆదర్శవార్తాపత్రిక యనిపించుకొనును. చూచినంతవరకు మనరాజధానిలో, హిందూపత్రిక కొంతవరకు ఆదర్శవార్తాపత్రిక యని చెప్పదగియున్నది. ఇట్టిఆదర్శవార్తాపత్రిక ఆంధ్రుల కెన్నడైన లభించునా ?

---

## "పిలుపు"

అడివి బాపిరాజుగారు, బి. ఎ.,

రావోయి సిన్నవాడా
మావాడ
రావోయి సిన్నవాడా
పోటూపాటులయేరు
పొంగిపొర్లేసోట
రావోయి సిన్నవాడా
మావాడ
రావోయి సిన్నవాడా
యెన్నెల యెలుగుల్లోన
యేటీనురగల్లోన
తెల్లని తెరసాపెత్తి
తీయని గొంతూ కెత్తి
రావోయి సిన్నవాడా
మావాడ
రావోయి సిన్నవాడా

వాలూనూవుల చూస్తా
కోలేస్తు నే నుంటే,
యెండీ తళుకుల సేప
యేటిలో వల వేతుగాని
రావోయి సిన్నవాడా
మావాడ
రావోయి సిన్నవాడా
ఉబికే వాగుల్లోకి
ఉయ్యాల లూగుతు పోయి
సందరాన పుట్టేటి
సెందురూని సేరుకొందం
రావోయి సిన్నవాడా
మావాడ
రావోయి సిన్నవాడా

---

## ఉగాదిస్వాగతము

దుర్గమహంతి సోదరకవులు.

సీ॥ నవమల్లికా ప్రసూనసమాగతసుగంధ
పవమానలహరీ విభాసితంబు
నవపల్లవాళనోన్మత్త పికాంగనా
మాధుర్యగీతికా మానితంబు
నవవధూజనతా ప్రణయరాగవీక్షణ
మాలికావైభవ మంజులంబు
నవసహకార పనసముఖ్య పరిపక్వ
ఫలపరివార విభ్రాజితంబు

తే-గీ॥ సంచబాణపరాక్రమ ప్రకటితంబు
సకలజంతుసంతానహర్ష ప్రదంబు
గా ; వసంతుడు తనకు స్వాగత మొసంగ
నరుగుదెంచె దెలుంగు యుగాది నేడు ॥

---



# నిజాము రాష్ట్రమునందలి ఆంధ్రులు.

శతావధానులు శ్రీ శేషాద్రి రమణకవులు.

విశాలమగు నాంధ్రదేశమునందలి నలువదియొక్కవేయి మూఁడువందల నలువదియొక్క చదరపుమైళ్ల విశాల ప్రదేశము నిజాముసర్కారువారి పాలనము నం దున్నది. ఆంధ్రజాతీయతకును, ఆంధ్రవికాసమునకును, ఆటపట్టగు నీపుణ్యభూమిని శోధించి చరిత్రాంశములను సేకరించువఱకు నాంధ్రచరిత్రము సమగ్రము గాదు. అచట కవులజీవితములను సేకరించి చర్చించువఱకు నాంధ్రకవిచరిత్రము సమగ్రముగాదు. రాజకీయసంబంధ మగుతెఱ యొకటి యడ్డుపడుటచే ఆంధ్రదేశము రెండుచీలికలైనది. వాఙ్మయ సంబంధమున నీతెఱను జించివేసి ఆంధ్రైక్యమునకు మంచి యవకాశము చిక్కును. నిజామురాష్ట్రములోని పదియామండలములలో 1 వరంగల్లు, 2 కరీంనగరు, 3 ఆదిలాబాదు, 4 అత్రాపుబల్దా, 5 మెదకు 6 నిజామాబాదు, 7 మహబూబునగరు, 8 నల్లగొండమండలములు పూర్తిగా నాంధ్రమండలములు. గుల్బర్గాజిల్లా చాలభాగ మాంధ్రదేశమే. ఇఁక కర్నాట మహారాష్ట్రప్రాంతములలోఁ గొన్ని యాంధ్రగ్రామములు కలవు. మొత్తమున కీరాష్ట్రమున ఆఱువదినాలుగులక్షలకుపైన నాంధ్రులు గలరు, వీరలందఱు నించుమించుగా నీప్రాంతమునం దాదిమవాసు లని చెప్పవచ్చును. మహమ్మదీయ నామాంకితము లగు గ్రామనామములన్నియు నిన్నమొన్నటివఱకు దేశీయ నామములతో నుండెడివి. వానిని ప్రభువులు, అధికారులు, జమీందారులు స్వనామాంకితములుగ మార్చి చరిత్రగౌరవమును బలవంతముగఁ దొలంగించిరని విజ్ఞులు తలంపురుగాక, వందలకొలఁది సంవత్సరములనుండి యవనులు పాలించుచుంటచే నిచటి యాంధ్రుల వేషభాషలలోఁ గొంతమార్పు గలిగెను. ఉన్నతపాఠశాలలందు ఆంధ్రమునకుఁ బ్రాముఖ్యము లేకపోవుటవలనను, ప్రాథమిక పాఠశాల లాంధ్రులకుఁ జాలినన్ని లేకపోవుటవలనను జనసామాన్యమున కిచట ఆంధ్రభాషాప్రవేశము తగ్గినదని తోఁచును. మహమ్మదీయులు పెట్టిన గ్రామనామములు రాజకీయ వ్యవహారములలో నెట్లు వాడఁబడుచుండెనో అటులే పూర్వనామములు ప్రజావ్యవహారములలో వాడుచున్నచోఁ జరిత్రమునకుఁ గొంత యనుకూలపరిస్థితి యేర్పడును. జాతీయత యేనాటికేని బహిరంగ మగును.

నిజామురాష్ట్రమునందు దాదాపు సగము భాగ మాంధ్రదేశము. ఇచటి యాంధ్రులు వసించుపుణ్యభూమి, యాంధ్రచరిత్ర రహస్యములకు నెలవు. మహాకవు లిందు పలువురుదయించిరి. త్యాగమూర్తు లగురాజాధిరాజు లీప్రదేశమున సామ్రాజ్యములు నెలకొల్పి యాంధ్రవ్యక్తిత్వము నెలకొల్పిరి. ఆంధ్ర శిల్పు లిందు దృఢతరము లగుదుర్గములు, చిత్రతరములగు దేవళములు కట్టి యాంధ్రకౌశలమును వెల్లడించిరి. ఈ విశాలచారిత్రకప్రదేశ మిపుడు నూతనోత్సాహముతోఁ దనజాతీయతను నిలువఁబెట్టుకొన ముందంజ వేయుచున్నది.

## చరిత్రస్థలములు.

చరిత్రదృష్టితో శోధించితిమేని నిజామురాష్ట్రమున సుప్రసిద్ధము లగు ప్రాచీననగరము లెన్నియో గోచరించును. ఇపుడు నాందేడు అనఁబడునగరము పూర్వము నందగిరియని వ్యవహరింపఁబడుచుఁ బశ్చిమచాళుక్యుల పరిపాలనమున మహాభోగముల ననుభవించెను. ఆలేరుచెంతనున్న కొలనుపాక సుప్రసిద్ధమగు జైనక్షేత్రము. అచ్చటి జైనవిగ్రహము అమూల్యమును ప్రాచీనతరము నై యున్నది. విజాపురమండలములోని బాదామి పశ్చిమచాళుక్యులలోఁ బ్రథముఁ డగు సత్యాశ్రయ పులకేశివల్లభునికాలమున మహత్త్వముగ నుండెను. రాష్ట్రకూటుల రాజధాని యనుకట్టలూరును, అనంతరరాజధాని యగు మాల్యఖేటము ఉస్మానాబాదు ప్రాంతములలో నున్నవి. మాల్యఖేటము ప్రపంచములో నాలుగవ సార్వభౌముఁ డని ప్రశంసనొందిన గోవిందరాజు రాజధాని. అశోకుని రాజప్రతినిధి వసించిన సువర్ణగిరియు అమూల్యమగు అశోకుని శిలాశాసనము లభించిన మాస్కి రాయచూరుప్రాంతమున నున్నవి. విక్రమాంకదేవచరిత్రమున బిల్హణకవిచే నభివర్ణితుఁడైన ఆఱవ విక్రమాదిత్యునికి రాజధానియగు కల్యాణపురము గుల్బర్గామండలము లోనిది. ఇంతియగాక గంగాపురము, నేలకొండపల్లి, పానుగల్లు, ధర్మపురి నందగిరి, ఆమనగల్లు, ఏలేశ్వరము, ఓరుగల్లు మున్నగు చరిత్రప్రసిద్ధములగు గ్రామము లీరాష్ట్రమునఁగలవు. ఈచరిత్రస్థలములలో నున్నవారికి జరిత్రాభిమానము లేకుంటచేతను రాష్ట్రీయులకు దూరస్థులగుటచే బ్రిటిషు ఆంధ్రులకిట పరిచయము లేకున్నది. ఇంతియ గాక భద్రాచలారణ్యమునందును, ములుగుప్రాంతమునందలియరణ్యమునందును, గోదావరి పరిసరభాగములందును మహానగరచిహ్నములు, శాసనములు, దేవాలయములు లెక్కకుమించినన్ని గోచరించుచున్నవి. అరణ్యములలోనున్న యీ యగమ్యభాగముల వృత్తాంతములు తెలిసికొనువారె అరుదుగ నున్నారు.

## శాసనములు, చరిత్రాంశములు.

రాష్ట్రకూటులు, పశ్చిమచాళుక్యులు, చోళులు, కాకతీయులు మున్నగు ఆంధ్రరాజన్యులచరిత్రములం దింక నెన్నియోచరిత్రాంశములు తెలియవలసియున్నవి. రాష్ట్రీయుల ఉపేక్షాదృష్టిచే నిజాంరాష్ట్రమునఁ జరిత్రోపయుక్తము లగుశాసనములు దురవస్థలో నున్నవి. ఎడతెగని దండయాత్రలలో నిజామురాష్ట్రాంధ్రులు సర్వస్వము గోలుపోయిరి. ఛిన్నాభిన్నము గాని యాలయమే లేదు. రూపుమాయని విగ్రహమే లేదు. ఎటనైనఁ జూడుఁడు. శాసనములు విఱిగి ముక్కలు ముక్కలై పైభాగ మొకతావునను, క్రిందిభాగమున వేఱొకతావునను లభించుచున్నవి. హనుమకొండలోని యొకశాసనమునఁ గాకతీయులు తొలుత జైను లని తెలియును. మఱి యొకశాసనమువలనఁ బ్రత్యర్థి రాజులగు గుండరాజు, జగద్దేవుఁడు, మేడరాజు, గోవిందరాజు, మైళగిదేవుఁడు మున్నగువారల నామములు గోచరించుచున్నవి. కొఱవి, గూడూరుగ్రామములందలిశాసనములు నన్నయభట్టారకునకుఁ బూర్వమునున్న ఆంధ్ర వాఙ్మయమును జదివిచూపుచున్నవి. రంగశాయి గుట్టచెంత నున్నగుహలోని శాసనములు సిద్ధేశ్వరాలయ గుహాశాసనములు ఆంధ్ర సామ్రాజ్య వైభవమున సహస్రముఖములఁ గొనియాడుచున్నవి. కొలనుపాక, అలంపూరు, అల్లాదుర్గము, ఆమనగల్లు, గంగాపురములలోనిశాసనములు పశ్చిమచాళుక్యుల రాజ్యవిస్తీర్ణమునకుఁ బరిపాలన కౌశల్యమునకుఁ దార్కాణముగ నున్నవి. అయ్యనవోలు శాసనమువలన అనపోతనాయకుఁ డను వెలమవీరుఁడు సోమకుల పరశురామ బిరు దొందినట్లు తెలియును. ఉమామహేశ్వరశాసనమువలన ద్విపద రచనాధారేయుఁ డగు గోన వంశముకాలము, విష్ణుపురాణరచయితయగు నాగనాథునికాలము తెలియుచున్నవి. కేసుమాలుశాసనమున ప్రతాపరుద్రునిమంత్రి పురవరిమహాదేవనాయకు లని కలదు. సామంతశూరుని శాసనము, పానుగల్లుశాసనము, ఇనుగుర్తిశాసనము, కొలనుపాక శాసనము, రుద్రమదేవి గణపతిదేవునిపుత్రి యని తెలుపుచున్నవి. ఇటులె చరిత్ర విషయమున నమూల్యము లగుశాసనరాజములు నిజామురాష్ట్రమునందలి ఆంధ్ర భాగములలో విరివిగ లభించుచున్నవి. చాలశాసనములు విలువ తెలియక అజ్ఞులు బావులకు చెఱువుతూములకు ఆలయప్రాకారములకు బిగించి, వాని ప్రయోజనము రూపుమాపిరి. దొరతనమువారు 1914 లో శాసనపరిశోధనశాఖను నెలకొల్పి గాని ఆంధ్రచరిత్రమున కుపయోగించు శాసనములను ఐదింటినో నాలుగింటినో ప్రచురించియున్నారు. ఎన్నివేల శాసనములో ప్రచురణము కావలసి యున్నవి.

## శిల్పములు – దేవాలయములు.

అజంటాలోని శిల్పములు లోకోత్తరములు. ఇచటి చిత్రములు జీర్ణములైనచో శిల్పకళకుఁ గొఱంత కలుగునని త్రివర్ణచిత్రములలో ఆఱులక్షల రూప్యములు వెచ్చించి నిజాము దొరతనమువారు వ్రాయింప నెంచుట శుభసూచకము. అజంతా బౌద్ధయుగమునాఁటి శిల్పప్రశస్తికిఁ దార్కాణము. సమీపమున నున్న ఎల్లోరా గుహలు అన్యమతమువారి శిల్పభూషణమునకు దృష్టాంతముగనున్నవి. ఇవి రెంటినిగూర్చి దేశీయులకుఁ బ్రత్యేకించి పరిచయము గలిగింపవలసినపనిలేదు. ఇవి ఔరంగబాదు మండలములో నున్నవి. మహమ్మదీయదండయాత్రలలో చిత్రశోభా[illegible] లగుశిల్పములు గల ఆలయరాజములు చాలవఱకు రూపుమాసినవి. వృత్తులు న[illegible]నవి. పూజా పురస్కారములు శూన్యమైనవి. ఎండ వెన్నెలవినముల భగ్నమైనను ప్రాచీనశిల్పకళమాత్ర మప్రతిమానముగ గోచరించుచున్నది. నిజామురాష్ట్రమున జైనులు, బౌద్ధులు కట్టినయాలయములు నేఁటికిఁ గొన్ని గోచరించుచున్నవి. కొలనుపాక వీరనారాయణాలయము, అల్లాదుర్గములోని వీరభద్రాలయము, [illegible]నూరులోని శివాలయము, వేములవాడలోని రాజేశ్వరాలయము తొలుత జైన

లయములై. పంటచెరువులోని మూఁడువందల జైనాలయములను శైవులు శివాలయములుగ మార్చిరి. హనుమకొండలోని పద్మాక్షి జైనదేవత. ఇప్పు డామె కాళీయపరావతార మైనది. ఇవియన్నియు మతకలహములలో నొందిన రూపాంతరములు. చాళుక్యులు, కాకతీయులు ఎనిమిదవ శతాబ్దము మొదలు పదునాలుగవ శతాబ్దమువఱకు శిల్పకళను బెంపొందించిరి. చాళుక్యశిల్పమునఁ గొంత జీవకళ యతిశయముగ నుండును. కాకతీయశిల్పము ఆకారవైచిత్ర శిల్పవిన్యాసములు పై మెఱుంగులతో నుండును. చాళుక్యశిల్పమునకుఁ జెందినవి గంగాపురము, కోదూరు, హానుగల్లు, అలంపూరు, కల్యాణనగరములలోని దేవళములు. కాకతీయ శిల్పమునకుఁ జెందినవి. హనుమకొండ, పిల్లలమఱ్ఱి, నాగులపాడు, జలాలుపురము, పాలెంపట్టు, గణపురము మున్నగుతావులలోని దేవళములు. ఈ యాలయములందలి స్త్రీప్రతిమల శృంగారహావభావములు, పురాణకథాశిల్పములు, లతాకల్పనములు, త్రిభంగినృత్యము ప్రత్యేకప్రశంసాపాత్రములు. పాలెంపట్టు దేవాలయములోని విగ్రహములు శృంగారరసమునకుఁ బరమావధి యనఁదగినవి. ఓరుగల్లులో శంభునిగుడి దండయాత్రలలో రూపుమాపఁబడెను. ఇపుడున్న యాలయము మధ్యకాలమునఁ గట్టినది. మనోహర మగు నీ యాలయ శిల్పశకలములు దుర్గపు గోడలందును, అసంపూర్ణభవనములందును, ప్రాకారములందును మధ్యకాలమున జేర్చి కట్టిరి. ఇవియుఁ గాకతీయశిల్పమునకు లక్ష్యములే. ఒరంగల్లులోని శిలాద్వారములు, శోభనాలబావి, అక్కచెల్లెండ్రబావి, కాకతమ్మబావి, మైలారుదేవుని అయ్యవోలు దేవాలయము, ప్రత్యేకప్రశంసాపాత్రములు. ఈ యాలయరాజము లన్నియు మహమ్మదీయుల గునపపుదెబ్బలకోర్చి ఛిన్నభిన్నములైన జీర్ణచిహ్నము లనుసంగతి సోదరాంధ్రులు మఱవ వలదని మాప్రార్థనము.

## దుర్గములు – తటాకములు.

ఆంధ్రవీరుల ప్రత్యేకవ్యక్తిత్వము దెలుపుదుర్గములను బ్రశంసించుట ప్రకృతము గాకపోదు. విశాల మగునాంధ్రసామ్రాజ్యమునకు నెలవైన ఓరుగల్లుకోట దర్శనీయము. ఆ యగడ్తలు, ఖాతికోట, పుట్టకోట. బురుజులు, పూర్వప్రతిభను నేటికిని జాటుచున్నవి. కాకతీయుల కాలమునను, దరువాతికాలమునను బేరుగొన్న రాచకొండ, ఆరామగిరి, భువనగిరి, కంభముమెట్టు, ఉర్లుగొండ, ఉరుగొండ, దేవరకొండ, కనకగిరి, దుర్గములు నేఁటికి దర్శనీయములుగ నున్నవి. ఇవిగాక అరణ్యములలో నెన్నియోదుర్గములు క్రూరమృగావృతము లై దుర్గమములుగా నున్నవి. మహమ్మదీయులకాలమునఁ గట్టఁబడిన నిర్మలదుర్గము, వేల్పుకొండదుర్గము, గోలకొండదుర్గము ఆధునికములు గాన, నింకను దృఢతరములుగనున్నను కల్పనాలాఘవమున ఆంధ్రవ్యక్తిత్వము దెలుపుదుర్గములముందు వీసిపోవుచున్నవి. కాకతీయరాజులకాలములో నెలకొల్పఁబడిన తటాకములు నేటివఱకు నెట్టి మరమ్మత్తుగోఁ గూడఁ బనిలేకుండ అగాధజలపూరితము లై రాష్ట్రీయులకు శాల్యోదనము ప్రభుత్వమునకు లెక్కలేనంత బొక్కసము సమకూర్చుచున్నవి. రామప్పచెఱువు, పాలచెఱువు, లక్నావరముచెఱువు, గణపురము చెఱువు, కమలాపురము చెఱువు, ధర్మసాగరము చెఱువు ప్రత్యేక ప్రశంసాపాత్రములు. ఓరుగల్లు కోటచుట్టు నున్న అగడ్తయే కొన్నితావులఁ దటాకమువలెఁ బైరుపచ్చల కుపయోగముగ నున్నది. ఎన్నియో తటాకములు గండ్లుపడి సేద్యము చేయఁబడుచున్నవి.

## ఆధునికయుగము – పరిశ్రమలు.

ఇతరస్థలములనుండి దిగుమతి యగువస్తువులకు సుంకము విధించు నాచారముండుటవలనను, విదేశవస్తువులు ప్రయాణసౌకర్యములు లేని మాఱుమూలలకుఁ బోవ వీలు లేకపోవుటవలనను ఈరాష్ట్రమునఁ జేతిపనులకు భంగము కలుగలేదు. సీమనూలువలె సన్నగ మృదువుగా దారమువడుకు కులకాంతలు, చక్కఁగ నేయఁగల పనివాండ్రు పలువురు గలరు. లోహములతోఁ జిత్రములగుపోఁతపనిమట్లు చేయువారలు, కొమ్ములతోఁ జిత్రము లగు పెట్టెలు, కలములు, కట్టెలుచేయువారలు నేఁటికిఁ గలరు. పట్టువస్త్రములు చిత్రములగు అంచుబట్టలు, కత్తులు, కాకితములు, రుమాలలు, మున్నగున వీరాష్ట్రమున విరివిగఁ దయారగుచున్నవి. తాళములు, పెట్టెలు, వాహనములు, గాజులు చేయుట, రాళ్లనుండి లోహములను దీయుట, ఔషధపరిశ్రమ నేఁటికీ రాష్ట్రమున సజీవముగ నున్నది. రాష్ట్రీయ లీవృత్తుల నభిమానించుచుంట యొక విశేషము.

## నవయుగారంభము, నూతనవికాసము

నిజామురాష్ట్రాంధ్రులిపు డభ్యుదయకాంక్షులై ముందఁజవేయుచున్నారు. యువకులలో మృదుమధురముగఁ గవితరచింపఁగలవారలు, సరసముగ, జమత్కారముగఁ, గాలోచితముగఁ గథాకల్పనము గావించువారలు ముందంజ వైచి సరస్వతీసేవకుఁ బూనుకొనుటయే శుభోదయ సూచనము. ఏకారణముచేతనైన నేమి, రాష్ట్రమునఁ బలుసబడి సంపాదించిన నీలగిరి, తెనుఁగుపత్రిక యను వారపత్రిక లిపు డంతరించినవి. ఇవి రెండు రాష్ట్రమునఁ బ్రబోధము కలిగించిన వనుట సత్యము. ఇపుడు గోలకొండ యను ద్వైవారపత్రిక రాష్ట్రమునకు విజ్ఞానము ప్రసాదించుచు, విజ్ఞానవ్యాప్తి కుపయోగించుచున్నది. సుజాత యను సచిత్రమాసపత్రిక రెండుమూఁడు సంవత్సరములనుండి సర్వాంగసుందరముగఁ బ్రచురింపఁబడుచున్నవి. కృష్ణదేవరాయ గ్రంథాలయపక్షమున రెండుసంవత్సరములక్రింద హైదరాబాదులో జరుపఁబడిన రజతోత్సవసందర్భమునఁ బ్రచురింపఁబడిన సంచికలు రెండును, ఆంధ్రగ్రంథాలయోద్యమజీవిత మీరాష్ట్రము నెట్లభ్యుదయము నొందినది తెలుపుచున్నవి. సారస్వత కళలు లభియువకులు వృద్ధులు బాలురుకూడ ఆవేశాభిమానములతో నీయుత్సవసందర్భమునను సంచికాప్రకటనమునను జూపిన ప్రత్యేకాభిమానము ప్రశంసాపాత్రము. ఆంధ్రవ్యక్తిత్వమును నిలువఁబెట్టుటకుఁ బ్రయత్నించు ఆంధ్రకేంద్రసంఘమును, దాని కార్యదర్శియు నిరాడంబర కార్యదీక్షాతత్పరుఁడును నగు శ్రీమాడపాటి హనుమంతరావు పంతులువారిని మన మీసందర్భమునఁ బ్రశంసింపవలసి యున్నది. ఆంధ్ర కేంద్రసంఘము జాతీయమతనిలువఁ బెట్టుటయందును, గులసంఘములను దనపాలనములోనికిఁ దెచ్చుటను, ఆంధ్రుల ప్రత్యేకవ్యక్తిత్వమును గార్యరూపత్వమును బ్రకటించుటయను, శక్తికొలఁది పాటుపడుచున్నది. పరిశోధనశాఖను గ్రంథాలయశాఖను బోషించుచు కేంద్రసంఘము మహారాష్ట్రకర్ణాట మహమ్మదీయ వ్యక్తిత్వముల నతిశయించి ఆంధ్రవ్యక్తిత్వము పేరొందుటకై గావించుప్రయత్నము లేనాఁటికేని ఫలింపకపోవు. సంఘసంస్కరణోద్యమము, పంచమసంఘోద్ధరణము, జీవరక్షాప్రచారము, స్త్రీవిద్య మున్నగు నూతనోద్యమములలో నిజామురాష్ట్రములోని ప్రధాననగరములు ముందంజ వేయుచున్నవి. కాని, వితంతూవివాహాదిసంస్కారములు పల్లెలలోఁగూడ యువకులాచరణమునఁ బెట్టుటచే సాంఘికవిప్లవములు, బహిష్కారములు, అన్యోన్యాభియోగములు చెలరేఁగి కలహములకుఁ గారణమగుట సంతాపకరము.

## భాషాసేవ – పరిశోధనము

ఉస్మానియా యూనివర్సిటీవారు ఆంధ్రభాషకుఁగూడఁ దావొసంగిరి. కాని, ఆంధ్రవిద్యార్థులసంఖ్య చాల స్వల్పముగ నున్నది. రాజకీయములలో సాంధ్రమునకుఁ దావు లేకుండుటచే నీపరిస్థితి యేర్పడిన దని కొందఱందురు. మహామహులగునాంధ్రులు తొలుత విశ్వవిద్యాలయ విద్యార్థులకు నాంధ్రమును సహాయభాషగాఁ గైకొను విద్యార్థులసంఖ్య పెంపొందించుట చాల అవసరము. మహారాష్ట్ర లనుయవనులను, కన్నడులను, ఈసందర్భమున ఆదర్శముగాఁ దీసికొనుట యుక్తము. ఆంధ్రులలోఁ బలువురు ఆంధ్రోద్యమములయెడ నభిమానముఁ జూపుచున్నారు గాని మాతృభాషా గ్రంథపఠనములయం దింక నభిమానము కుదురలేదు. ఇపుడిపుడు మే మాంధ్రులము, మాది ఆంధ్రభాష, మాకును బ్రత్యేకవ్యక్తిత్వము ప్రత్యేకవాఙ్మయము గల దనునభిమాన ముదయించినది. నిశ్చయముగా నుపన్యాసవేదికలపై నధికారులు ఆంధ్రభాష: మృతభాషయని సాహసించి పలుకుటయు, దేశభాషలను తుంగలోఁద్రొక్కి ఉర్దును మాతృభాషగ వ్యవహారభాషగ, నీరాష్ట్రమునఁ జేయవలయుననుటకు ఉరుదూపత్రికలు సాహసించుటయు నీమధ్య జరిగినది. ఈ యవనసోదరులు తపతీసంవరణోపాఖ్యానము, యయాతి చరిత్రము మున్నగు ఆంధ్రకావ్యముల నంకితముగాఁగొన్న యవనులసంతతివారమే యను సంగతి మఱచిపోవుట సంతాపకరము. నిజామురాష్ట్రమున స్థానికసంఘములు పురపాలకసంఘములు దొరతనమువారి యధీనములం దున్నవి. అందుచే దేశభాషల బోధించు ప్రాథమిక పాఠశాలలు ప్రజాపక్షమున చాలినన్ని లేవు. ప్రత్యేక పాఠశాలలు (Private Schools) ఉండఁగూడదని దొరతనమువా రాజ్ఞాపించిరి. ఆంధ్రవ్యక్తిత్వమున కిది యెంత భంగకరమో సోదరు లూహింపఁగలరు! నిజాము దొరతనమువా రీమధ్య (1914 లో) పరిశోధనశాఖను నెలకొల్పిరి. ఈసంఘమువా రింతవఱకుఁ దెలుఁగుశాసనములను నాలుగింటినో యైదింటినో ప్రచురించిరి. వందలకొలఁదిగఁ బ్రతిగ్రామమునఁ బడియున్న దిక్కుమాలిన తెలుఁగు శాసనములపై వీరి యనుగ్రహదృష్టి యంతగాఁ బ్రసరింపకుంట సంతాపకరము. ఈ లోపమును దీర్చుటకై కేంద్రసంఘమువారి యధీనమున నున్న ఆంధ్రపరిశోధకసంఘమువారు ప్రాచీనగ్రంథసంపాదనము శాసనసంపాదనము ధారాళముగఁ జేయుచున్నారు. దొరతనమువా రీశాఖకు కొంతగ్రాంటు నొసంగి యభిమానించినచో ఆర్థికలోపము తొలంగి యింకను గొంత కృషి జరుగ నవకాశము లభించును. పరిశోధకశాఖయెడ శ్రీ మునగాలరాజావారు ప్రత్యేకాభిమానము జూపుచున్నారు. ఈ శాఖయెడ ఆదిరాజు వీరభద్రరావుగారు, సిరుగూరి హనుమంతరావుగారు,

రాజాబహద్దరు పిళ్లెగారు ప్రత్యేకాభిమానము చూపుచున్నారు. ప్రతి సంవత్సరమును వేసవిలో మేము ఈసంఘపక్షమున శాసనపరిశోధనమును గ్రంథసంపాదనమును జరుపుచున్నారము. ఇప్పటికి దాదాపుగ 225 శాసనములు, 200 తాళపత్రగ్రంథములు సమకూర్పఁబడినవి. పరిశోధక శాఖకుఁ బ్రత్యేక కార్యస్థానము, ప్రచురణపత్రిక, అవసరమని తోఁచుచున్నది. ఆర్థికలోపముచే నింతవఱకీయత్నమే లేకున్నది. అన్నితావులందువలె నిజామురాష్ట్రమున నిరుద్యోగసమస్య తలసూపుచున్నది. యువకులు త్యాగముజేయుటకు సిద్ధముగా నున్నారు. సూర్యాపేటలో జరిగినయువక సభ ఆంధ్రుల భవిష్యజ్జీవిత విధానమును సూచించుట యొక విశేషాంశము. యువకులదృష్టి ప్రతిభ వాఙ్మయమునందును, స్వదేశసేవ యందును, గ్రంథరచనమునందును, పరిశోధనమునందును, బ్రసరించినచో రాష్ట్రాభ్యుదయమున కెంతయో విలంబముకాదు.

## రాజకీయపరిస్థితులు.

దొరతనమువా రొకప్రక్క గ్రంథాలయములకు విరాళముల నొసంగుచున్నారు. పోలీసువా రొకప్రక్కనుండి గ్రంథనిలయములు బలవంతముగా మూయించుచున్నారు. ఈ యతివృష్టికిగాని, యీయనావృష్టికిఁగాని కారణములు తెలియకున్నవి. ఆంధ్రసంఘమువారలు గావించు వార్షికసభలలో భజనసంఘము, గ్రంథాలయోద్యమము, సంఘసంస్కరణము, కేంద్రసంఘ కార్యప్రణాళిక మున్నగు నవియె చర్చింపఁబడును. రాజకీయముల కిందు తావేలేదు. కాని ప్రభుత్వమువారి యలజడి మెండు. సభల కనుజ్ఞయే యొసంగరు. సభలుజరుపవచ్చును. వాని నాటంకపఱుపరాదను న్యాయస్థానపు తీర్మానమునకు ఆచరణమునకు సంబంధము లేకున్నది. నిజాము దొరతనమువారి యభిమానమునకుఁ బాత్రులగు జ్ఞానవయోవృద్ధులు పాల్గొను నీయాంధ్రోద్యమమునెడఁ బ్రభుత్వమువా రభిమానము జూపుట, అనుమానము విడుచుట కర్తవ్యము. దొరతనమువారి పాఠశాలలలోఁ బెట్టబడు పఠనీయ గ్రంథములలో మార్పు గావలసినంత గోచరింప కున్నది. వాఙ్మయమునం దపూర్వమగు ప్రచారము జరుగుచున్నది. వాఙ్మయ వికాసమునకు హేతుభూతము లగు వాచకములు కావ్యములు వ్యాకరణములు నవలలు పెక్కులు బయలువెడలుచున్నవి. దొరతనమువారి పాఠశాలలలో నీనూతన గ్రంథములకుఁ దావులేదు. విద్యాశాఖవారి ప్రత్యేకాజ్ఞ యున్నఁగాని, నూతనగ్రంథముల నేర్పఱుపరు. మహమ్మదీయమతమును ఇతరవిషయముల నీగ్రంథము విమర్శించుటలేదని ప్రత్యేకోద్యోగి విద్యాశాఖవారికిఁ దెలుపవలెను. ఇవి యనుకొన్నంత సులభముగా జరుగునవి కాకపోవుటచేఁ బరంపరగా నొకేవిధమగు పఠనీయగ్రంథములు వాడుకలోనున్నవి. ఈమధ్య పఠనీయ గ్రంథసభ్యులు వసుచరిత్రమును పఠనీయముగా నేర్పఱుప దొరతనమువారి పక్షమునుండి అందలి కృత్యాదిలో మహమ్మదీయుల పరాజయములు వర్ణింపఁబడెనుగాన నిషేధింపవలయు ననిరఁట. ఇట్టిపరిస్థితులు మాఱుట కింక నెంతకాలము పట్టునో !

## జరుగవలసినపని.

ఆంధ్రపరిశోధనశాఖపక్షమునఁ బరిశోధన మెంతయో జరుగవలెను. [illegible] జీర్ణించు వ్రాతప్రతులను సేకరించి అముద్రితములకుఁ బ్రత్యంతరములను వ్రాయవలెను. కేంద్రసంఘము వాఙ్మయదేశీయ సంస్థలఁబోషించుట కెంతేని మూలధనము గడింపవలెను. నిజాము రాష్ట్రమున నున్న గ్రంథాలయములు దాదాపుగ 120 ఉండును. వీనిపక్షమున నొక త్రైమాసిక పత్రికయో, అట్టి యవకాశము గలుగనిచో సుజాతలో గ్రంథాలయానుబంధమో వెలువరించుట యవసరము. ఆంధ్రు లెచ్చట నున్న నొక్కటియే యను నుదారభావమునకు భంగకర మగు "రాష్ట్రీయాంధ్రులు, రాష్ట్రేతరాంధ్రులు" అను ప్రశ్నకుఁ దావీయక ఆంధ్రు లందఱు పాలు [illegible] గలసి రాజకీయ వాఙ్మయైతిహాసిక లలితకళలలోఁ బూర్వాని యాంధ్రాభ్యుదయమునకుఁ బాటుపడవలెను. నిజాం రాష్ట్రాంధ్రులు శారదానికేతనమునకు, ఆంధ్రజాతీయ విద్యాలయమునకు, స్వరాజ్యపత్రికకు, లక్ష్మీనృసింహ షష్ఠిపూర్తిసంపుట ప్రచురణమునకు, ఇంకను నిట్టిదేశీయసంస్థలకుఁ గావించిన సేవయు, సహాయము అపారము. చారిత్రికవిషయశోధనము గావించువారికి, కవి జీవితములకు, గ్రంథసముదాయమునకు ని॥ రాష్ట్రము రత్నఖని. ఈ ఖనియందలి రత్నము లన్నింటిని సమకూర్చుట యమూల్యహారము గావించి ఆంధ్రభారతి కంఠమున నలంకరించుట ప్రత్యాంధ్రునివిధి. ఎనిమిదిమండలముల వైశాల్యముగ అఱువదినాలుగు లక్షల యాంధ్రసోదరులకు నెలవై గద్వాల, వనపర్తి మున్నగు స్వదేశ సంస్థానములకు కాటపట్టయి, ఆంధ్రవాఙ్మయ పీఠమగు నీరాష్ట్రమధ్యమున ఆంధ్రులపక్షమున [illegible] చిత్రవస్తుప్రదర్శనశాల, ఒక ప్రాచీనగ్రంథనిలయము, ఒక యితిహాస పరిశోధనశాఖ యవసరము.

## సమాప్తి.

నిజామురాష్ట్రములోని యాంధ్రసంస్థానములు వాఙ్మయమునకు గావించిన సేవయపారము. సేనాఫలితమును రాష్ట్రస్వరూపపటమును రాష్ట్ర స్థానిక చరిత్రములను బ్రచురించి నిజామురాష్ట్రములోని యాంధ్రభాగము ఐతిహాసిక దృష్టితో సమగ్రమగు నాంధ్రఖండమున నొకభాగ మనునంశము రూఢిచేయుట కాంధ్రులందఱును బ్రయత్నించుటయును, బ్రిటిషు ఆంధ్రప్రాంతములలోని పత్రికలు [illegible] నిజామురాష్ట్రమునను, నిజామురాష్ట్రాంధ్ర పత్రికలు బ్రిటిషు ఆంధ్రదేశమునను వ్యాపింపఁజేసి, "ఎక్కడనున్నను నాంధ్రులందఱొక్కటియే" యను నభిమానము దేశీయుల హృదయములలో స్థిరపఱుప నాంధ్రనాయక రత్నములను బ్రార్థించెదము. నిజామురాష్ట్రమునుండి బొంబాయి ప్రాంతములకు వలస యేగిన యాంధ్రసోదరులు మాతృదేశాభ్యుదయమును గాంక్షించి, కేంద్రసంఘమునకు విరాళము నొసఁగుచు, నిజామురాష్ట్ర విశేషాంశములు తమ మాసపత్రికయందును సంవత్సరాది సంచికయందును బ్రచురించుచు, ఆంధ్రాభ్యుదయమునకు సర్వాంకషముగ యత్నించుట భావ్యభివృద్ధికి శుభచిహ్నము. ఆంధ్రసోదరులు చరిత్రదృష్టితోనో, సమష్టిభావములోనో, సోదరాభిమానముతోనో నిజామురాష్ట్రముపై దృష్టిపఱుపు ధర్మము.

---

# శాంతి గనరాదు! సౌఖ్య మావంత లేదు!

గాడేపల్లి సోమసుందర శాస్త్రిగారు బి. ఎ., బి. ఇ. డి.

శారద, తుషార, చంద్రికా జనిత శమన
భాసుర నిశాప్రశాంతి గర్భమున నైన ;
అభ్రచుంబిత భర్మ్య హర్మ్యాంతరస్థ
హంసతూలికా మృదులశయ్యలను నైన;
శాంతి గనరాదు! సౌఖ్య మావంత లేదు!
రత్నకోటి కిరీట విరాజమాన
విమల మాణిక్య సింహాసనమున నైన ;
నీల, నిర్మల, నిబిడ, విశాల, శాంత
శమిత గంభీర సింధు గర్భమున నైన ;
శాంతి గనరాదు! సౌఖ్య మావంత లేదు!
అమల కాసార శకులార్భ కాళి నకట!
ప్రబల పాఠీన మొక్కటి పట్టి మెసవు;
దాని మ్రింగంగ నంతరిక్షానఁ దిరుగు
ఘనతరానిల రయమున క్రౌంచ మొకటి ;
కర్కశపు కార్ముకంబును గరము బట్టి
శరము సంధించి క్రౌంచమ్ముఁ శబరి వేయు ;
ఎక్కడిది శాంతి! సౌఖ్యమిం కేడఁ గలుగు!

కలుకు కత్తులనొండొరుల్ నఱుకుకొనఁగ
సోదరులె తీవ్రదృష్టులఁ జూచుచుంద్రు ;
"ఇదియె నామతధర్మ" మంచెగిరివడుచు
పరమపుణ్యుని నొకఁడు తుపాకి గాల్చు
ఎక్కడిది శాంతి! సౌఖ్యమిం కేడఁ గలుగు!
మదగజతురంగ సైన్య సంహతులతోడ
జరిగి పరరాజ్య కబళన సలుపు రాజు!
కఠిన భీషణ తీవ్ర భూకంపమునను
సకలరాజ్యంబు లొకపెట్టు నమసిపోవు ;
ఎక్కడిది శాంతి! సౌఖ్యమిం కేడఁ గలుగు!
కాన గారాదు తృప్తి యెక్కడను నైన,
సహన మనుమాటయే వినఁజాల మెపుడు,
ఎచ్చటను జెప్పజూడ రహింసమాట,
ఎక్కడిది శాంతి! సౌఖ్యమిం కేడఁ గలుగు!
ఈ, వినాశా మహాచక్ర హేతి, నిట్టి
క్రమక్రమాక్రమితోగ్రసంఘర్షములను,
ఎక్కడిది శాంతి! సౌఖ్యమిం కేడఁ గలుగు!

# అగ్నిపర్వతములు-మధ్యధరా సముద్రము

రంగనాయకులుగారు, ఆక్సఫర్డు.

మనదేశమునుండి ఇంగ్లండు వెళ్లునప్పుడు హిందూమహా సముద్రము, ఎఱ్ఱసముద్రము, సూయజు కెనాల్ దాటినపిమ్మట "పోర్టుసెయిడు" అను పట్టణమునకు వచ్చెదము. అచ్చటనుండి మధ్యధరాసముద్రమునందు ఐదుదినములు ప్రయాణ మొనర్చిన పిమ్మట గమ్యస్థాన మగు 'మార్సైల్సు' అను ఫ్రెంచి రేవుపట్టణము నకు చేరెదము. "మార్సైల్సు"నకు రెండుదినములలో, సుమారు 45 గంటలలో చేరెదమను సమయమునందు, "మెస్సిని" జలసంధి మధ్య ప్రయాణము చేయుచుండెదము. ఈజలసంధి కొకవైపున ఇటలీదేశపు దక్షిణపు కొనయు, మరొకవైపున "సిసిలీ" యనుద్వీప మును కలవు. ఇటలీదేశముయొక్క కొనపై, "రెగ్యోడ కలబ్రి" అనుపట్టణము కానవచ్చును. సిసిలీద్వీపముపై, క్రమముగా మెస్సిని, ఎక్రి, కాటెనా, సిరక్యూసు అను పట్టణములు దృక్పథమున వచ్చును.

ఈసిసిలీద్వీపమునకు ముఖ్యపట్టణము, "మెస్సినీ'' యనునది. ఇది యొకగొప్పపట్టణము, ఈ పట్టణపుపేరునుండియే, జలసంధి, తన పేరును పొందుచున్నది. ప్రథమపర్యాయము, ఈజలసంధిద్వారా పోవుచున్నప్పుడు, సాయంత్రము మూడుగంట లగుచుండెను. భానుడు, అపరదిక్కున ధగధగ మెరయుచుండెను. సూర్యకిరణము లచే శోభిల్లుచు, పర్వతమయ మైన "ఇటలీ" సముద్రతీర మొక గొప్పరాగికోట గోడవలె మెరయుచు, కాంతిమయమై, చూపఱుల కాశ్చర్యము కలుగజేయు చుండెను. మెరుగు వెట్టిన రాగిగోడలా, లేక సముద్రమథనము జేయునప్పుడుపయోగించినపాత్రముల శిథిల ములా, లేక సముద్రతరంగముల రాపిడివలన భూమికి, సముద్రము నకు ప్రతినిముసము జరుగుచున్న అంతర్యపుయుద్ధమునందు జనించిన కోపాగ్నియా అనునట్లు అత్యద్భుతముగా, ఆసముద్రతీరము ఇసుక మయమై యుండుటకుమారు, ఎత్తయిన, ఎక్కుటకు వీలుగాని,నిలు వుగనున్న సముద్రపుటంచులతో నిండియుండెను. గంటలు గడచెను. సముద్రము ఘోషించుట మానలేదు. సూర్యుడు చల్లగ దిగుచుం డెను. ధగధగ మనుచున్న గోడలు క్రమక్రమముగ వేడియారిన రాగిపాత్రములవలె, స్వచ్ఛందమగు కోపమునకుమారు దుర్వ్యా పారయుతమగు దుర్మార్గబుద్ధివలె నల్లని మెరుపురంగును బొందుచుం డెను. సాయంత్రము ఆరైనది సూర్యుడు క్రుంకెను. గోడలు దూర ముననున్న చీకటికట్టడములవలె దృక్కునందుండి వెనుకకు వెళ్లుచుం డెను. సిసిలీవంక తిరిగితిమి. భగభగ మంటలు ఆకాశమునకు దగ్గ రలో కాన్పించుచున్నవి. ఎల్లరము నివ్వెరపడి చూచుచుంటిమి. అంద రొక్కపరి "ఎట్నా ఏట్నా" అనుచుండిరి. బాలురు, ఏది ఏది యని యెగురుచుండిరి. పెద్ద లనేకులు. చుక్కాణియద్దముల నా మంటవై పునకు త్రిప్పుచుండిరి.

మంటతగ్గెను. నల్లనిపొగ బయలుదేరెను. తెల్లనిపొగ, మంట అన్నియు కలిసిన ప్రవాహము, పొగమెల్లడనాపర్వతముపై కన్పట్టు చుండెను. కొన్ని గ్రామములు తగులబడుచుండినను, అట్టి దృశ్యము కలుగదు. గాలి, ఆమొత్తున తక్కువగుటచే, వేగవేగముగ తగుల బడుటకు మాని, నిర్భయముగ, గంభీరముగ, మందగమనమున, ఆయగ్ని వెల్వడుచుండెను. కుమిలి కుమిలి, ఆపరానిదుఃఖము, నెమ్మ దిగ కన్నీటిద్వారా ఇంగ్లీషు స్త్రీభావము బయల్పడుచున్నట్లు, ఆ పొగ బయల్వెడలుచుండెను. ఆకస మెల్లెడ చంద్రునివెన్నెలద్వారా కాంతిమయమై యుండుటచే ఆ "ఎట్నా'' దుఃఖపూర్వక మగు అగ్నిజ్వాల లెట్లా పర్వతమున కిరుప్రక్కల మైళ్లకొలదిగా ఆకస మును భీభత్సయుతముగా జేయుచున్నవో కన్నులకుగట్టినట్లు చూప ట్టెను. ఎఱ్ఱనికరుళ్లా, పచ్చని బంగారు రేకులా, ఘుమఘుమారావ సంకులఘోరజీమూతపటలసంఛన్నాభ్రమా, అస్తమించు సూర్యుని రోషజ్వాలలా అనునట్లు, అనేకవిధముల చిక్కిరిబిక్కిరిగా, భావ ప్రపంచమును కాగడాల్పెట్టి వెదకి, జ్యోతిని ముట్టించునట్లుగా, కవుల హృదయముల తేజోమయముగా జేయునట్లు, సృష్టివైచిత్ర్య ముల జూచి ఆనందింపగల్గు నావంటివారి కన్నులకు గొప్ప వినోద ములాగ, ఫోటోలుతీయువారిపాలిటి పంటవలె, బాలురకు గొప్ప భగవత్స్వరూపమువలె ఆయగ్నిజాలలు కన్పట్టుచుండెను. భగవం తుని జూచుచున్నభక్తునకు వర్ణించుటకు మాటలువచ్చునా! హిర ణ్యకశ్యపుని జంపిన నృసింహుని దేవతలు వర్ణింపజాలరన్న పోతన "కవిహృదయము"ను, ఎఱింగెననుటలో ఆశ్చర్యమున్నదా! కాదను వారు, ఈ"ఎట్నా" మంటలు, అచ్చటనుండు నాకసమును జూచిన బాగు.

ఇంతకు "ఎట్నా" యేమిటి? అది యొక యద్భుతమైనయగ్ని పర్వతము. అనేకులు రాజకీయజ్ఞు లుండవచ్చు. కాని, వారిలో తత్కాలమునందు,ప్రాముఖ్యమువహించి, రాచకార్యముల నిర్వహిం చుటో, ఎదిరించుటో చేయుచున్నవారినే మనము గణించుచుండె దము. అటులనే యగ్నిపర్వతములు ప్రంచపమున గలవు. ఇటలీ దేశమునం దనేకవందలపర్వతములు అట్టివి కలవు. కాని. యూరపు ఖండమునందెల్ల ఈ "ఎట్నా" పర్వత మత్యధికముగా ప్రఖ్యాతి వహించి యున్నది. ఏల? 1908 సంవత్సరమునందు పొంగి పొర్లి ప్రవాహమై, గ్రామముల, పట్టణముల, దేశము నంతను తనవరదల మయము గావించెను. ఆవరదలు మనకృష్ణా, గోదావరి, కావేరివర దలు కావు. మనవరదలవలె తేలికయగు, ఉరవడిగ ప్రవహించు, భయంకరాకార మగు నీటిప్రవాహములు కావు. ఈవరదలు, నీటి వలెనున్న. కాగిన యినుమువలె ప్రవహించు, కరగిన బంగారు వలె కన్పడు అగ్నిప్రవాహము. మంటలుకావు. గాలికి ఎగురు కరుళ్లు కావు. నుసిమైనగొండరాయితో కల్గినమంటప్రవాహములు. నదులవలెనచ్చును. అగ్నివలెకాల్చును. నూనె ప్రవాహాలుప్రవహిం చును.వరదలవలె నన్నిటి నూడ్చును.వేటవానివలెఅన్నిదిక్కులనుండి ప్రజల, వారిగృహముల, పొలములచుట్టును గాలివానవలె భయం కరముగ నుండును. భగవత్స్వరూపమువలె మహాప్రళయముగ కానబడును. ప్రపంచమును భస్మముజేయుటకు ఈశ్వరుడు మూడవ నేత్రము తెరవగా వచ్చుచున్న కాంతిరేకులవలె తళుక్కుతళుక్కు మనుచు వెల్వడుచుండును. గజేంద్రునిగావవచ్చుచున్న "చక్రము".

లాగనిశ్శబ్దయుతముగ ఆవడిమాత్రములేక బయలుదేరును. మంగళగిరి పానకాలరాయలుస్వామి పానకమును బళక్కు బళక్కుమని తడవతడవకు, వెలిగ్రక్కుచున్నట్లు గొప్ప మహానుభావుడు అగ్నిని, పర్వతగర్భమునుండి, "ఉస్సు"మని, ఊదుచున్నట్లు వెలికి ఇంతంతన రాని ఇన్నిటన్నులు అడుగు లని చెప్పరాని అగ్నిప్రవాహము వెలికి వచ్చుచుండును.

మెస్సినాపట్టణమునందు, రెండుభాగములు 1908 సంవత్సరపు వరదలక్రింద భస్మ మయ్యెను.

1,26,500 ప్రజ లా అగ్నిప్రవాహమునందు నాశన మైరి. మెస్సినీ పట్టము దగ్ధమైన దని ప్రపంచము తెలిసికొనెను. ఎల్లెడ భయంకరముగ జూపట్టెను. తిరిగి "మెస్సిని" పట్టణమేర్పడినది. దగ్ధమైన యిండ్లస్థానములందే తిరిగి ప్రజలు గృహముల నిర్మించిరి. తిరిగి లక్షప్రజలు, క్రొత్తవారు వచ్చి నివసించుచున్నారు. మరల, గొప్ప వ్యాపారము ఈ పట్టణమునందు సాగుచున్నది. ఇందు గలమాహాత్మ్యమును కనుగొనగలమా? వీరందఱు, తిరిగి యెప్పుడో "ఎట్నా" బయలుదేరునని యెరుంగుదురు. మరల నొకపరి తమగృహములు, ధనము, తమప్రాణములు దగ్ధ మగు నని తెలియును. ఏ సమయమునకో, తాము నిదురించునప్పు డెప్పుడో, ఆ మహారాక్షసి అగ్నివర్షముతో బయల్వెడలి, శక్తిస్వరూపమును ప్రజలకు గనబరచి, తన యమోఘ మగునోట లక్షలకొలది ప్రజల నుసిజేయునని ఎల్లరెఱుంగుదురు. ఐనను, తిరిగి యిచ్చటికే వత్తురు. 1922 సంవత్సరమున తిరిగి ఆ మహాప్రళయము వచ్చెను. ప్రజలు నిదురించుచుండగా, కొన్నిగ్రామములు ముట్టడింపబడెను. కొన్ని పట్టణములనుండి పారిపోవు ప్రజల, దారిలో భస్మమొనర్చెను. బిడ్డలకై యిండ్లలోని కరికినతల్లులు మాయ మైరి. ధనము, గృహము అన్నియు వెనుక భస్మమగుచుండ, ప్రాణరక్షణార్థమై వేలకొలది ప్రజలు పరుగెత్తుచుండిరి. ఇటలీ ప్రభుత్వము, మోటారు లారీలద్వారా, కారులద్వారా, వేలకొలది ప్రజల సురక్షితమగుప్రదేశములకు జేరవేసెను. కొన్ని గ్రామములను ఎత్తైన గుడికట్టలద్వారా రక్షించెను. "మెస్సిని" పట్టణమునకు కొలదిగా నష్టమతిరిగి కల్గెను. కాని "రక్షణ" మార్గములద్వారా కలుగబోవు నష్టమును తగ్గించిరి. యజమాని వదలినను, పిల్లి తన పాతగృహమును వీడదట? సింహములు, పులులతో నున్నయడవుల బోయవారు, చెంచువా రధికముగ ప్రేమింతురు. తుపాను లనేకముల నెదిరించుటకు, ఓడవలు పగులుటకు, ప్రాణనష్టము నెదుర్కొనుట కనేక సముద్ర ప్రయాణికులు తయారగు చున్నారు. ప్రతిదినము ఐదుగురు మృత్యువువాతం బడుచున్నను, ఇంగ్లండునందు లక్షల కొలది ప్రజలు, గనులందు బొగ్గును బగులగొట్టుటకు భయపడుట లేదు. అనేక విమానములు తెగులబడుచున్నను, తల క్రిందుగా భూమిపై బడుచున్నను, వందలకొలది యువకులు ఉత్సాహులై, వాయువు జయింప విమానముల నాడించు చున్నారు! "సృష్టి" యద్భుతము. రత్నగర్భము. కష్టముల కాలవాలము. కష్టముల నెదుర్కొని, ధైర్యమున సృష్టి నెదిరించి, సృష్టిని మానవుల కుపయోగార్థముగ, వృద్ధికరముగ జేయుటకు అనుదినము కోట్లకొలది ప్రజలు ప్రతినిముసము ప్రయత్నముల నెదుర్కొను చుండుటవలననే వృద్ధి కల్గుచున్నది. నాగరికతాభివృద్ధి గాంచు చున్నారము. మనుష్యశక్తి హెచ్చగుచున్నది. భయంకర మగు ప్రపంచము స్నేహపూర్వక మగు కళకళమని నవ్వుచుండు, పచ్చగ మెరయు పచ్చిక యనుతివాసీలతో, తేజోవంతమగు సస్యము లనువర్తము లతో, కోకిల, లార్కు, చిలుక, గోరువంక, శుకపిక, కుకూ. నినాదములద్వారా మానవుల హృదయములను సృష్టి శక్తియం దైక్యమొనర్చి, భగవత్స్వరూపమును మనుజుల హృదయనాళములందు ప్రపంచమును కళలతో, తేజముతో, జీవితముతో, భగవత్స్వరూపు లగు ప్రజలకు జీవసమాన మగుప్రపంచముగా మార్చుటకు సార్థ మగుచున్నది.

రాత్రి యయ్యెను. "ఎలెక్ట్రిక్ దీపములు" వరుసలు వరుసలుగా, బారులు బారులుగా, లక్షలకొలదిగా ముత్యపు సరముల మాడ్కి, మైళ్లపర్యంతము ఆపట్టణములనుండి కన్పట్టుచుండెను. దీపావళినాడుగూడ మన పట్టణము లంత తళతళ మను చుండక వీథులుగాని, ప్రజలుగాని, గృహములుగాని మాకు కానరావు. వెలుతురు దీపములు మాత్రము, చీకటి యనుమహారణ్యమును భేదించుచు, మినుకు మినుకు మనుచు, తళ తళ మనుచుకనుబట్టు చుండెను. షేక్స్పియరు మహాకవియొక్క "మాక్బెత్తు" నందలి "దయ్యముల" వెలుతురులా, మన రైతులు బాలురకు జూపెట్టు కాగడాల దయ్యములా, వరిపంటలపై లక్షలకొలదిగా నెగురు చుండు మిణుగురు పురుగులా యనునట్లు, ఆ విద్యుద్దీపములు చూపట్టుచుండెను. యుద్ధములు చేయుటకు బారులు దీర్చి, "మార్చి" చేయు చున్నారా, గుంపులు గుంపులుగా నున్నచోట, "జనరలు" క్యాంపులు వేసికొని యున్నారా, యని తట్టును. వెంటనే వైరులు చూతు రన్న భయముచేత వెలుతురు, యుద్ధమునం దున్న యిరు పక్షములవారు ఉంచరని తోచుటతోడనే, మనసునకు ప్రయత్న రహితముగనే సంధికి వచ్చిన యిరుపక్షములవారు సంతోషప్రకటన మొనర్చుటకే, వెలుతురు వెట్టినుఖ మొందుచున్నారా యని తోచును. మైలుమైలు దాటినకొలది గుంపులు గుంపులుగా ఈ వెలుతురుదీపము లుండుట పైభావమును సమర్థించును. ప్రపంచము మరచిన, కవి భావలి స్వముగల్గినవానికి పిచ్చిభ్రమలన్నియు కల్గును. సుఖశాంతి, ఆతురత, ఆశ్చర్య మొక్కుమ్మడి గల్గును. ఇంతలో తనస్థానము జ్ఞప్తికివచ్చును. అంత తన కన్నిభావముల తట్టకేక ఆదృశ్యమును ప్రేమించును.

రైలుకూతలు "కూయికూయి" మని వినబడెను. ఎచ్చటెచ్చటనని యందరము నివ్వెరపడిచూచుచుంటిమి. కానరాలేదు. నిముసములు గడచెను. దృశ్యము కాలేదు. ఇంతలో నేను వెనుదిరిగి మా బోటువెనుక నొకబోటుపోవుచున్నట్లును, దానిపై కొన్ని కొలది విద్యుద్దీపము లున్నట్లు కానవచ్చె. అందఱికి తెల్పితి. చూచి నవ్వువారు, ఆశ్చర్యపడువారు గంతు లెత్తువారుగా నెల్ల గుంపు చల్లగ వెలుతురుదీపము లావలియొడ్డునకు చేరెను. 'కూయి' మని కూత వచ్చె రైలు పోయెను. రెండుభూభాగముల మధ్య బోటు సాయముచే రైలును నడుపుచున్నారని కన్గొంటిమి. అబ్బ! అప్పుడు మా కెంతిహృదయపరితాపము! కల్గెను. దినమంతదాహము తీర్చు కొనజాలక! ఆతురతతోవచ్చిన బాటసారికి భావికన్పడినను చేదెడు లేనట్లు వేలకొలది ద్రాక్షపండ్లు దగ్గరలో నున్నను ఎక్కి కోయుటకు శక్తి లేనివానివలె సముద్రప్రయాణమునుండి యలసినవారి

యుండి ఎప్పుడుభూమికి జేరి, ఎప్పుడు రైలెక్కి ఈలంకణాలబోటు వదలి రైలెక్కి త్వరత్వరగా ఇంటికి జేరుచుంటి మనుణావముచే సంతోషము జెంద నిచ్చయున్నను రైలు అంతదగ్గరలో నున్నను భూమి యంతసామీప్యములో నున్నను మేము దిగలేని స్థితియం దుండుటయు ఇంకమూడుదినములు సముద్రమువిూద నుండవలయు నను తలఁపుకల్గుటయు ఎంతకష్టమో యాలోచింపనగు. రెండువత్సరముల క్రితమీదృశ్యము ననుభవించితిమి. ఇంకను అక్లేతళతళమనిలా లింపుచు నాముందాదృశ్య మశ్లె యౌవనమున నాట్యమాడుచున్నది.

---

# మంచు కాలపుఁ బ్రొద్దు పొడుపు

శ్రీయుత దుప్పూరి రామిరెడ్డిగారు.

పిఱికివాఁ డొక సింహపంజరముఁ దెఱచు
నట్లు, కిటికీని దెఱచితి నల్లనల్లఁ;
జలికిఁ గప్పిన కంబళి సడలనీక
తొంగిచూచితిఁ; గనుక్రొత్త దోఁచె నాకు!

ఆకసంబడ్డముగ వ్రాలె ననఁగ మంచు
దట్టముగ వ్రేలి సర్వంబు దాన యయ్యె;
భావ దుర్భిణీ యంత్రంబుఁ బట్టి చూడఁ
బ్రళయకాల సూక్ష్మాకృతి ప్రతిఫలించె.

బాలభానుండు మంచులోపల వెలుంగఁ
గ్రమముగా బహుత్వము చుట్టుఁ గాన నయ్యె;
బాల్యమున విన్న "దయ్యాల బైని" కథకుఁ
దగిన యస్ఫుటచిత్రమై తనరె జగతి!

వలికిం జెమ్మలువోయి కుత్తుక మెదల్పన్ లేక లేమెండ రాఁ
కలకుల్ తెక్కలు విచ్చి యార్చుఖగసంఘాతంబు ప్రాభాత మం
జులగీతల్ వినిపింప నోపవు;హిమాంశుం డయ్యె సూర్యుండు;ప్ర
చిలవంబేనియుఁ జిత్రకారునకు సంసేవ్యంబు గా దిప్పుడున్.

ఇనకరతాపచండిమము హెచ్చుకొలందిని మంచుకోఁత కో
యను వరిమల్లెకుం బఱచుహాలికపాళి సువర్ణగోచుల్
మునిఁగి యథార్థరూప పరిపూర్ణత నొందిరి తద్వసుంధరా
తనయ లవిత్రపూజ సరిదాకునె విగ్రహపూజ లెన్నియేన్.

నా కిటికీకి నేరుగఁ గనంబడి రిద్దఱు యౌవనంపు లేఁ
బాకపుఁ దీవ్రులన్ మెఱుఁగువాఱిన యాలుమగల్; నెలంతయుం
బోఁక సగంబుగం గొఱికి ముందుగ భర్తకువెట్ట నాతఁడున్
ఆకుఁ బొగాకుఁ ద్రుంచుకొని యాలిపయింటనుగట్టె శేషమున్.

పెండ్లిక్రొత్తఁదనము వీడని దాంపత్య
లజ్జ, యళుకువాఱు లాలనంబు
మొదటి ప్రేమ దుడుకుపోకల మురిపెంబు
వారి చేతలం దవార్య మయ్యె.

పనులు పాటులు నంతిగాఁ బట్టువడని
తరుణి ములువును మున్నుగాఁ దానె కోయు;
క్షేమముకుఁ దాళని చెలిపైన జాలి పుట్టి
దప్పి గొనె నీరు దెమ్మని తడయఁ బంపు.

ఆఁడుబిడ్డల యత్తల యాడికలకుఁ
బొంచుచూపుల కెడమైన పొలముపనియె
క్రొత్త మిథునంబునకు స్వేచ్ఛఁ గూర్చునేమొ!
తోడి పనిపాటు ప్రేమకు దోహదంబు.

వారటు పంటచేలఁ బని పాటొనరింపఁగఁ గాంచి నేను సో
మారితనంబునన్ గిలకమంచము డిగ్గక, యున్నికాలు వే
మాఱక పొర్లుచుంటఁ గని మాటికి నాపయి రోఁత పుట్టి సం
సారి వ్రతంబుఁ బూనుటకు సల్పితి గొప్పప్రతిజ్ఞ ధీరతన్.

---

# Spencer & Co. Ltd., Madras and Branches

# సెపెన్సర్ అండు కంపెనీ లిమిటెడ్

మదరాసునగరము
బ్రాంచిఆఫీసులు




## బ్రాంచీలు

భారీ వ్యాపారము
బొంబాయి—కరాచీ

చిల్లర వర్తకము
దక్షిణ యిండియా.

| | |
|---|---|
| అల్లెపీ | పాలిఘెటా |
| బెంగుళూరు | క్విలన్ |
| కాలికట్ | సికిందరాబాద్ |
| కాంపియన్‌కేఫ్ | త్రివాండ్రం |
| కాకినాడ | తిరుచినాపల్లి |
| కొచ్చిన్ | వేపేరి (మద్రాసు) |
| కోయంబత్తూరు | వాల్టేరు |
| కూనూరు | గోల్డన్ రాక్ |
| ఖాజాటౌను (మద్రాసు) | పియర్ మేక్ |
| కొడైకెనాల్ | మండకాయం |
| కోటగిరి | బొనామి |
| మధుర | వండిపెరియార్ |
| మర్కారా | చిక్‌మగలూరు |
| ఉదకమండలము | విశాఖపట్నం |

ఉత్తర హిందూస్థానము
ముర్రే
పెషావర్
రావల్‌పిండి

—

చుట్టల ఫ్యాక్టరీ
దిండిగల్లు

## డిపార్టుమెంట్లు
(వివిధ శాఖలు)

| | |
|---|---|
| ద్రాక్షరసములు, సారాయములు | బైసికిల్లు |
| కాఫీ తేయాకు చిల్లరసరుకులు | ఫోటోగ్రాఫ్‌సామానులు |
| చుట్టలు పొగాకు | ముక్కద్దముల రకములు |
| వెండి పూతసరుకులు | స్టేషనరీ |
| జేబు గడియారములు పెద్దగడియారములు | మనోహరవస్తువులు |
| కట్లరీ | బూట్లు పాదరక్షలు |
| క్రాకరీ | తోలుసామానులు జీనులువగైరా ప్రయాణమునకు మజిలీలకు వలయు సామానులు |
| గాజుసామానులు | కుట్టుపని |
| దీపములు | పురుషులకు ఉడుపులు తయారు చేయుట |
| ఇనుపసామానులు | స్త్రీలకు ,, ,, |
| అన్నిరకముల ఇనుపసామానులు | చిల్లర అమ్మకపు సరకులు |
| సుగంధ ద్రవ్యములు రసాయనములు | ఇంటికి కావలసిన సామానులు |
| ఆయుధములు మందుగుండు సామానులు | బండ్లు పెట్టెలు తయారుచేయుట |
| గ్రామఫోనులు | ఏరేటెడు పానములు |
| షికారీసామానులు వ్యాయామోపకరణములు | రొట్టెలు చేయుట |
| బొమ్మలు | ఆవిరిచే వస్త్రములు శుభ్రపరచుట |

హెడ్డాఫీసు:— మౌంటురోడ్డు, మదరాసు. { టెలిగ్రాఫిక్ అడ్రెస్. "టార్పెడోస్"

HEAD OFFICE:— MOUNT ROAD, MADRAS. TEL: "TORPEDOS"



సంధ్యారాగము

శిల్పి : ఉపేంద్రనాథఘోషు దోస్తీదారు.

# వ్యాకరణశాస్త్రము - తత్ఫలము

కావ్య పురాణ తీర్థ విద్వాన్, జనమంచి వేంకట సుబ్రహ్మణ్య శర్మగారు, కడప.

భాషాపోషకులారా! ఆస్తిక మహాజనులారా! గ్రహ నక్షత్ర తారాది పరిశోభితం బగు జగత్స్రష్ట కధీనం బైన యీ జగంబం తయు నెట్లు విలసిల్లుచున్నదో యే నియమంబునకు లోనయి రక్షింపఁబడుచున్నదో యెఱుంగ నబ్బురం బగుచున్నయది. ఇట్టి మనోహర మై విమలమైన యాదర్శమును మన కన్నుల యెదుట నుంచుకొని నిశ్చలుల మై చూచుచున్న వార మయ్యును నిదమిత్థ మని నొక్కి వక్కాణింపఁజాలక చిత్రప్రతిమల కైవడి నా పరమేశ్వరుని లీలా విలాసంబులయందు నడంగి యిదియంతయును భగవన్నియమాధీనం బనియు, నాతఁడు నియంత యనియుఁ దలంచి యేమియుఁ దక్కుం గలదానిని స్మరింపనేరక యున్నారము. మన భావంబునకుఁ దోఁచిన యర్థజాతంబునే మనము భగవన్నియ మంబులేక నక్కాణింపఁజాలక యున్నారము. జగత్తునందుఁ గలి గిన యీ యవస్థ కల్పనాతీతమై విరాజిల్లుట సహజ మైనది. ఈ ప్రపంచంబునందు జరుగుచున్న కార్యజాలంబులం దన్నింట భగ వంతునిచేఁ జేయఁబడిన యేర్పాటులు, నియమములు నిండియున్న వని వ్రాయుట కెవ్వఁడును జంకఁడు. నిజ మగు నిద్దానికి సంశ యంబు గలుగఁ జాలునే. ఒక్కొక్క ప్రాణికి ననేల, జడంబులు మున్నగువానికెల్లఁ గాలాదినియమంబులు గల్పించి మించిన మహానుభావుని నెంచ సామాన్య బుద్ధిబలయుతులు వలంతు లగు దురే. మహానుభావు లగుమునీంద్రు లాత్మభావనానియమంబున నప్పరంజ్యోతింగనుంగొని తన్మయు లై విలసిల్లుచు నప్పరమాత్మ తత్త్వంబు నీదృశమహిమావిరాజితం బనియును, నీదృశరూప సమ న్వితం బనియుఁ దెలియఁజాలకయున్నవారు. తక్కుంగలవారి లెక్క సేయనేల? భగవన్నియమబద్ధుండు గానివాఁ డెవ్వఁడును లేఁడు.

సర్వ వ్యాపారములందు నియమంబులను గల్పించిన పర మేశ్వరుఁడు మానవ సముదాయంబునకుఁ గల భాషయందును నియమంబుల నేర్పఱచినవాఁ డనుటలోఁ గ్రొత్త లేదు. మనస్సుల యందుఁ బ్రతిఫలించు భావంబును బ్రకాశింపఁజేయుటకే భాష యుప్పతిల్లినది. ఆ భాష సార్థక మై నియమబద్ధమయిననే గాని యొప్పార దని తలంచియే భాషను బోషింప నెంచిన సృష్టికర్త వ్యాకరణశాస్త్రంబును నిర్మించెను. వేదార్థంబుల నెఱుంగుటకైనను, భారతీయము లగు శాస్త్రసముదయంబుల చందం బెఱుంగుటకును వ్యాకరణ నియమంబులు దెలియక యున్నచో గ్రుడ్డి వాఁడద్దంబునందుఁ దన రూపంబును జూచుకొన్నరీతిగనే యగును. కాఁబట్టియే పెద్దలు వ్యాకరణశాస్త్రంబును "ముఖం వ్యాకరణం స్మృతమ్" అని ఘంటాపథంబున వాక్రుచ్చిరి. అనఁగా సమస్త పదార్థ తత్త్వబోధకు వ్యాకరణ నియమంబులే యాద్య సాధనంబు లని భావము. భాష యనుజగంబునందు సరస్వతీదేవి మంది రంబు గలదు. అది పవిత్రమై యచ్ఛ మైన సాహిత్య మను మనో హరమై విశాల మైనదివ్యసుందరం బగుమందిరము. దానికి వ్యాక రణ శాస్త్రమే ముఖద్వారము. దానినే సింహద్వార మందురు. నిక్కంపు మాతృభక్తి గలవాఁ డా సింహద్వారమునఁ బ్రవేశించి మంద మంద గమనంబుల నా భవ్య మందిరాభ్యంతరంబుఁ జొచ్చి యందుఁ బద్మాసనాసీనమై యలరారు సరస్వతీదేవి చరణసరసి జంబులకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి స్తుతి కుసుమాం జలుల నర్పించి దివ్య పుష్పాలంకారములచే నా భాషాజనని నలం కృతం గావించును. అట్టి మహిమ గలవాఁడే విద్యావినోది యనఁ బడు భక్తవరేణ్యుఁడు. ఎద్దియేని కుమార్గంబున దేవీమందిరం బునం బ్రవేశించి వ్యాకరణ విరుద్ధంబు లగుపదంబులచే రచియింపఁ బడిన మాలికచే నెవఁడు సరస్వతీదేవియొక్క పాదపద్మముల నలంకరింపఁ బూనునో యట్టివాఁడు కుందేందు తుషారధవళంబు లగు దేవీచరణకమలంబులఁ గళంకవంతంబులఁ గావించునట్టివాఁ డగు. గాలిపడగ యెట్లు సూత్రబద్ధ మై యాకసంబున నెగురుచు మనంబున కాహ్లాదంబు సంఘటింపఁ గలదు? అది వాతాహతిచే ఖండిత సూత్రం బయ్యేనేని మన నయనంబుల కగపడక యెట్లు విచ్చలవిడిఁ బోయిమనచేతికిఁ జిక్కక శీర్ణంబై నిరుపయోగం బగును? అక్కరణిఁ జక్కని వ్యాకరణ నియమంబులం బాటించిన, భాషామతల్లి యెం తయు శోభిల్లఁ గలదు. విపరీతం బయ్యేనేని ఫలంబును విపరీతంబ యగును. సందియంబు గలదా? ధీరులు కుమార్గగాములై భాషా జననికిఁ గళంక మాపాదింపఁ బ్రయత్నించునట్టివానిని మహాపాపి యనియు, దోషియనియుఁ బల్కుదురు. ధీరు లనఁగా నెట్టివారు? "అవయః కేవల కవయః, కీరాః స్యుః కేవలం వీరాః, ధీరాః పం డిత కవయః, తాన వమంతాస్తు కేవలం గవయః" అనఁగాఁ గేవల కవు లజాసదృశులనియుఁ, గేవల పండితులు శుకసదృశులనియుఁ, బండితులయి శాస్త్రనియమంబులకు బద్ధులై చక్కని కవిత్వముఁ జెప్పు మహానుభావులు ధీరులనియు, వారి నవమానించువారు గురు పోతులనియు నొక్క మహాశయుండు పలికినట్లు ధీరుల గుణంబట్టిది. భాషాజనయిత్రికి నంతఁ గల్పింపక పోషించునట్టివాఁడే సుకృతి. పాపియై నియమంబుఁ బాటింపక స్వేచ్ఛం జరించువాఁ డపకృతిఁ గావించువాఁడు. కాఁబట్టి సుకృతంబు నాపాదించునది వ్యాకరణ శాస్త్రంబేగాని యితరంబు గాదు. వాగ్దేవీ నిర్మల ధవళ చరణ సారసంబులకు పవిత్ర మై శ్వేతవర్ణవిభ్రాజితం బగుచందనంబనంబడు రంజక ద్రవ్యంబు వ్యాకరణంబు. సాహిత్యంబునకు సౌందర్యంబు నొసంగునది వ్యాకరణంబు. సాహిత్య శిరోభూషణంబు వ్యాకర ణంబు. చూచుట కందముచే నొప్పారుచుఁ దప్తకాంచన సమాన తను కాంతియొప్పుచు మిగుల సుందరవదనారవిందుఁ డై యొసఁగు కుమారుఁడు మూఁగ యైన నా సౌందర్య లావణ్యాదులు లెక్కకు వచ్చునా? అట్లే వ్యాకరణ జ్ఞానహీనుఁ డైనవాఁడు సాహిత్యాలం కార చతురుండు గాకపోవును. రూపయౌవన సంపన్నయు, నున్న తకుల సంభవయు, సౌందర్యంబున సాటిలేనిదియు, "సర్వోప మాద్రవ్యసముచ్చయేన వినిర్మితా విశ్వసృజా ప్రవృత్తిః" అను రీతి నెసఁగుచున్న దై సమస్తాలంకారాలంకృత యై, సకలైశ్వర్య

ధుర్యమై, హర్మ్యతలంబున నివసించుచున్నదయ్యును యువతి సతీధర్మవివర్జితురాలైనంతమాత్రమున నెట్లు సామాజికులగువిద్వాంసులచేతనేగాక యెల్లరచే దూషిత యగునో యట్లే వ్యాకరణజ్ఞానరత్నహీనుఁడైనవాఁడు భాషావిలాసవిషయంబున నార్యవర్యులచే దూషితుఁడగును.

భాష సాధ్వసాధుభేదములచే ద్వివిధముగ నుండును. గ్రంథరచనయందు సాధుభాషయు, వ్యవహారమునందుఁ బరస్పరోపకథనమున నసాధుభాషయుఁ బ్రవర్తిల్లును. వ్యాకరణంబు సాధుభాషకు మూలంబు. అదియే సంస్కరింపఁబడిన దని పెద్దలచేఁ బేరు గాంచు. వ్యాకరణ మసాధుభాషయగు వ్యవహారభాష కనానశ్యకంబు. వ్యవహారభాష తాత్కాలికము. సాధుభాష సార్వకాలికమై గ్రంథస్థమై యొప్పుచుండునది. ప్రాచీనకాలంబునుండియు వ్యాకరణసూత్రబద్ధంబగు సాధుభాషపట్ల నెల్లవారికి నాదరంబు మెండు. వ్యాకరణప్రకాశము లేక భాష ప్రకాశింపఁజాలదు. ఒక్కొక్కదేశంబున నొక్కటేభాష పెక్కు తెఱంగులుగ నున్నను జక్కని భాష యొక్కటియే యుండును. కాంచితిరే నిష్కలుష మగు భాషకుఁ గల స్థిరత్వము? ఇందుఁ జిత్రంబు గలదా? ఇది వ్యాకరణమహిమంబే కాని యన్యంబు గాఁజాలదు.

భారతదేశంబున సాహిత్యశాస్త్రంబు విస్తరిల్లినట్లు మరెందును విస్తృతం బయియుండలేదు. వ్యాకరణము తెలియకయున్నచో సాహిత్యాగారమునం దుండుజ్ఞానరత్నము సులభసాధ్యము గాఁజాలదు.

మనదేశంబున మనభాషయం దేమి, సంస్కృతభాషయం దేమి, తక్కుం గల భాషలయందేమి నిర్మలంబుగ వెలుంగు జ్ఞానరత్నంబు వ్యాకరణజ్ఞానదీపంబు లేక పొందఁజాలక ముగ్ధులై స్వేచ్ఛాచారులై భాషను బలువిధంబులుగఁ ద్రిప్పుచు నియమంబులను నిగళప్రాయంబులుగాఁ దలంచువారి విచిత్రచరిత్రంబు వాక్రువ్వ నాచతుర్ముఖునకు సాధ్యంబుగాదు. భిన్నభిన్నాభిప్రాయులై ప్రాచీన మార్గంబులఁ బరిత్యజించి కుమార్గంబులఁ ద్రొక్కఁజూచుట బాధకంబగును గాని సుఖసంపాదకంబుగాఁజాలదు.

శాస్త్రసముదాయకాంతిపుంజరంజితంబైన భాషాకాశంబునందు సాంఖ్యవేదాంతోపనిషదాది నక్షత్రములు సర్వకాలంబులందును నిర్మలంబులై వెలుంగుచున్నయవి. ఇందు సకలజన మానసాకాశాశేషశాంతివిధాయక మగువేదమే శీతకరుఁడు. అందుఁ గల సమస్తపదార్థనిచయమును బ్రకాశింపఁజేయుటచే వ్యాకరణంబే సూర్యోపమానం బగునది. కాఁబట్టి మన శాస్త్రంబులందుఁ గల దివ్యజ్ఞానంబు సంపాదించుటకు వ్యాకరణమే సాధకం బగును. ఈ మాట శాస్త్రపారంగతు లగువిద్వాంసులెల్లరు నంగీకరింపక మానరు. ఇందుల కుదాహరణముఁ గనుంగొనుఁడు. సర్వదర్శన సంగ్రహాంతర్గతపాణిని దర్శనంబున "ప్రథమం ఛంద సామంగ మాయు ర్వ్యాకరణం బుధాః" అని యొక్కయెుగి నొక్కి వాక్రుచ్చి యున్నాఁడు. కాఁబట్టి వ్యాకరణ శాస్త్రమునకు శబ్దానుశాసనం బనియు, సకల పదార్థ దర్శనం బనియు, వేదపరిరక్షకంబనియు, లోకరక్షణం బనియు, నాయుష్యనియు, వ్యవహారము కలిగినది. దీని ననుసరించియే భాష్యకారుఁడు "రక్షోహా గమలఘ్వ సందేహాః ప్రయోజనమ్" అని నిర్వచించెను. లోకమున నెవ్వఁడైనను శబ్దార్థాదిదోషములులేక వ్యాకరణ సంస్కృతంబైన చక్కనిపదమును బ్రయోగించినఁ గీర్తియుతుఁడగుననియు, నపవర్గప్రాప్తియుతుండగుననియు, గట్టిగ భాష్యకారుఁడు "ఏకః శబ్దః సమ్యగ్జ్ఞాతః సుష్టు ప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి" యని పల్కియున్నాఁడు. ఇది నిక్క మగుమాట. "నాకమిష్ట సుఖం యాంతి సుయుక్తైర్బద్ధ వాగ్రథైః" అను మాట కర్థమును యోజించిన నెంతయేని భావము గలదు గదా!

ఆర్యులారా! శబ్ద శాస్త్ర మచేతనము గదా? దీని కింతటి ఫలంబు గలదా యని యనుమానింపకుఁడు. శబ్దశాస్త్రమును మహాదేవునితోఁ బోల్చిన శ్రుతిం దిలకింపుఁడు.

"చత్వారి శృంగాత్రయో అస్యపాదాద్వేశీర్షే సప్తహస్తాసో అస్య త్రిధాబద్ధో వృషభో రోరవీతి మహాదేవో మర్త్యాం ఆవివేశ" దీనికర్థము భాష్యకారుఁ డీరీతి వివరించియున్నవాఁడు. చత్వారిశృంగాణి: నాలుగు పదజాతములు (నామము, ఆఖ్యాతము, ఉపసర్గము, నిపాతము) త్రయోస్యపాదాః: లడాది విషయములు మూఁడు విధములు:—భూత భవిష్యద్వర్తమాన కాలములు. ద్వేశీర్షే: నిత్యానిత్యములు. సప్తహస్తాసో అస్య: తిఙాదులు సప్త విభక్తులు. త్రిధాబద్ధః మూఁడు స్థానములయందుఁ గట్టఁబడినవి. అనఁగా ఉరంబునఁ గంఠంబున శిరంబున నిబద్ధంబయినదనియర్థము. వృషభో రోరవీతి: శబ్దమును జేయుచున్నది. మహోదేవః మహాదేవుఁడు అనఁగా శబ్దము, మర్త్యాః: మనుష్యులను, అవివేశ: ప్రవేశించె అని వివృత్తి వ్రాయఁబడియె.

"ఇద మాద్యం పదస్థానం సిద్ధిసోపాన పర్వణామ్
ఇయం సా మోక్షమార్గాణా మజిహ్మా రాజపద్ధతిః"

ఈశ్లోకమును మనంబునందిడి యమేయఫలదంబు వ్యాకరణంబని యెంచి స్వచ్ఛమై యకలుషంబగుభాషను బ్రయోగించి శాశ్వతకీర్తిని బొందఁ దలంపుఁడు. వ్యాకరణము కష్టమని తలంచి స్వేచ్ఛాచారులు గాక పెద్దల మార్గం బనుసరించుట శ్రేయస్కరంబు. దాన నైహికాముష్మికసుఖంబులు తప్పక కలుగును. పరమేశ్వరుఁడు లోకానుగ్రహతత్పరుండై సత్పథంబునకు విజయంబు గలిగించుఁ గాక!

---

# "అమ్మడు."

తెన్నేటి వేంకట రామమూర్తిగారు బి. ఏ., బి. ఎల్.,

పిన్నిగారూ, మీ దగ్గిరైనా నాకడసారి వీడుకోలు తీసుకోవాలని ఏదో ప్రకోల్పుతూంది; క్షమించాలి నాసాహసానికి ; చేసినహత్యకు కార్చే కన్నీటితో మీ పాదాలు కడిగి మీరు యిచ్చే క్షమాపణశాంతిలో నాజీవితము చాలిద్దామని కాదు, యీ పాపాత్మురాలు యిల్లా వ్రాయడములో చేసినధైర్యానికి కారణము- మరెందుకో పూర్తిగా చదివి గ్రహించండి.

పితృహంతకురాల్ని; యింకా యీగదిలో ఎదురుగుండా రక్తము ధారలుగట్టి ఎండుతూండము మొండిగా, క్రూరంగా చూస్తున్నా- యిది లోకానికి వెల్లడిపరచండి. యిది నా ఆఖరు పాపకార్యము, పూర్తి అయింది; నా పాపాలన్నిటి కాశిక్ష ఇక్కడ అనుభవింపగలిగేలాలేదు. యింకో లోకంలో అయినా, మీరు నాతండ్రితో కాపురముచెయ్యనని, ఏడ్చి మీవాళ్లని పిలిపించుకుని, అల్లరిచేసి వెళ్లిపోయి యింతవరకూ కనపడకపోయినా, పడేబాధ, అనుభవించే చిన్నతనమూ, దినదినమూ లోకానికి మొహముచూపలేక లోలోపల దిగమింగుకునే దుఃఖములో, అపకీర్తిలో కృశించే హృదయము, వీటి సగము చేసుకున్నా- మిమ్మల్ని నిందించలేనివాళ్లలో నొక్కతెను.

మీరు ఉన్న ఒకటి రెండు సంవత్సరాలు నాతో ఎల్లా మసలారో జ్ఞప్తికి వస్తూంది. కాని యిప్పుడైనా కనికరిస్తారని నాకు నమ్మకము లేకపోలేదు. నా పాడుప్రఖ్యాతికి—పాడు జీవనానికి కారణము మానాన్నగారే. అల్లా అన్నానని ఎవ్వరైనా వింటే యింకోలోకంలో ఉన్నా నామీదకి దండెత్తివస్తారు. అయినా క్లుప్తముగా చెప్పాలి- నేనూ నాభర్తతో కాపురము చేశాను పదినెలల కాలము. తను వద్దంటూంటే, తనగుండెలో జబ్బు తెల్సికూడా నిర్బంధించి, అందరూ బలవంతంగా కట్టిపెట్టిన నామీద అసహనీయమగు జాలి లేకపోలేదు. తన కాలపరిమాణము గుర్తించినట్లు బ్రతికుండే కొద్దిఘడియలూ వదలకుండా నన్నే లోకంగా, నా శుశ్రూషే శాంతిగా, నా సంతోషమే ఆశయముగా కాచుకుని, పూర్తిగా తనప్రేమనంతా నామీద వర్షించేరు. నాకు గర్వము మరిపించి, లోకంలో ప్రేమరుచులుమాత్రము చవి చూపించేరు.

కడసారికౌగలింతలో కఠినంగా, కర్కశంగా, ఏలోపలదాచుకున్న బరువు చేత క్రుంగిపోయిన గుండెలతో అన్నారో- 'సాధనముకోసము కట్టుకున్న నీకు, నీవాళ్లకి ధనము వదలిపోతున్నా' నన్నారు. నోటి పోటు గాయము యింకా మానలేదు. మెరుగుతూంటుంది. 'అయ్యో' అని క్రిందపడ్డా. మళ్లీలేచేప్పటికి, యింకా ఎక్కడ- ఆప్రేమమూర్తి, ప్రణయ సామ్రాజ్యచక్రవర్తి అంతరించిపోయేడు. యింట దీప మారిపోయింది. యింకా బొంది యీడ్చుకుంటూ మిగిలాను నేను మాత్రము.

తరువాత పడ్డబాధ గ్రహించగలవూ? దినాలు తరబడి ఏకగ్రీవంగా ప్రేమకోసము తల్లడిల్లిపోయే, కొట్టుకులాడే జీవాన్ని చూడలేకపోయేవారు మావాళ్లు, నాన్నగారూ. ఎల్లప్పుడు ఒక్కటేస్మరణ; ఒక్కటేఆవేశము; అతడు చూపిన ప్రేమని, చేసినలాలన, ఒదలని చేతులస్పర్శసుఖము, తిరిగితిరిగి జ్ఞప్తికి వచ్చేకొలది, మండిపోయేహృదయము ఆర దనుకున్నా; నా బాధలోని మూల్గులు వేసేవి; మా వాళ్లని నాగాఢవిశ్వాసాలకి హడలెత్తేవారు......

మా నాన్నగారు అప్పటి ఆజమీందారు స్నేహితుణ్ణి పిలిపించేరు; యింట నేను దిక్కులేకునా. వంటది ఎప్పుడో వచ్చిపోయేది; దాసినినేను. యితగాణ్ణి నాకు శుశ్రూషచెయ్యడానికి, సహాయ్యముగా యింట్లో మసలడానికి పిలిపించేరు. అతణ్ణి చూడ్డానికే నీకంతకోపమే, ఏం అపకారమైనా చెయ్యకపోయినా, మరి నన్నేం చెయ్యమంటావు? నా కంతవరకు యిష్టమైన వంటరితనము యిప్పుడు భయపెట్టేది. ఎందుకో ఎవ్వరైనా దగ్గిరుండా లనిపించేది; ఎప్పుడూ ఆభర్తస్వరూపము ఎదురుగా కనపడేది. నేనే యిష్టములేకపోయిన రంగయ్యని పిలిచేదాన్ని. కొన్నాళ్లకి పరిచయబలములో అతడు తనఊరు పోయేడా, వచ్చేనాకా ఎదురుచూస్తూ కాచుకు కూర్చునేదాన్ని.

ఒకనాడు మోటారు దిగివచ్చాడు; తిన్నగా మేడమీదకి; ఎదురువెళ్లి ఆహ్వానమిచ్చాను. ఎవ్వరూలేరు; యిద్దరమూ ఆగదిలో, నాపూర్వపు పడకటింటిలో తలెత్తిచూస్తే నేను కుట్టిన ఊలు పటాలు పెద్దఫోటోలు వెక్కిరిస్తున్నాయి. యీ స్నేహ మేంటా అని, వెళ్లి గభాలున పెద్దపటము చింపేసేను, ముక్కముక్కలుగా ఊలు సగముసగము వీడికిందికి పడింది, దానికి వెనక ఆరురూపాయలు ఖర్చు అయింది; ఆవేళ దగ్గరలేదంటూంటే నాన్నగార్ని అల్లరిపెట్టి, పక్కయింటి ప్లీడరుగారిదగ్గిర అప్పుతెప్పించి కుట్టింది; ఆ చిరిగినముక్కలు పోగుచేసి, వాటిలో కృష్ణుని మొండిమొహము చూసేప్పటికి, ఆపుకోలేని ఏడ్పువచ్చింది. భోరుమని అన్నాళ్లకి గొంతెత్తి తృప్తితీరా ఏడ్చాను.

రంగయ్య గభాలునవచ్చి ఒళ్లోకితీసుకుని, 'అమ్మడూ ఏం టిది,' అన్నాడు. ఉక్రోషములో 'పో' అన్నా- వదలలేదు. అతనిచేతుల ఒత్తుడి కొంత హాయియిస్తూంది; ధైర్యముచేసి, గ్రోసివేసి ప్రక్కగదిలో మంచముమీదకి పోయా. నాన్నగారు వచ్చారు. ఏం చెప్పాడో, నాదగ్గిరికి వచ్చి 'అమ్మడూ, తప్పు కదూ అతన్ని అల్లా చిన్నతనముచెయ్యడము' అని బోధచేశారు. ఏం చెప్పేది నేను. అదిమొదలు అతనితో స్నేహానికి.

అయితే అస్పర్శబాధ హెచ్చించేస్తూంది. ఇంకాయింకా కోరుకున్నట్లు శాంతిలేక లొంగిపోయే, కాలిపోతూన్న శరీరము మనసు మంటల్లోకి శాంతికోసరము పడే అల్లకల్లోలములో పూర్తిగా నశించిపోయింది. అర్థమయిందా, ఆఖరకి ఎల్లా పరిణమించిందో. దాని పర్యవసానము ఒకనాటిరాత్రి పన్నెండుగంటలకి అతడూ, నాన్నగారూ డాక్టరుని తీసుకురావడము.

తరువాత కొన్నినెలలు బాధపడ్డా. అతడు కనపడేవాడు కాదు. కొంత సంతోషమైంది. అతడంటే సిగ్గు, కోపము, అసహ్యము, బాధ ముసురుకున్నాయి నాలో. ఎప్పుడైనా కనపడినా, మొహముతిప్పుకుని మసలేదాన్ని- అతడూ నన్ను లక్ష్యముచెయ్యకే మసలాడు.

ఒకనాడు మావాళ్లింటిలో పెళ్లిసమయంలో పాటపాడుతున్నా. పక్కగుసగుసలు వినపడ్డాయి. అమ్మడు అనగానే పాట పూర్తిచేసి, పక్కగావెళ్లి నాజన్మంలో ఒక్కమారు మాత్రము దొంగతనంగా విన్నాను వారి సంభాషణ, ఆయ్యో, పూర్తిగాతెల్సు వీరందరికి నాకథంతా. ఆపడిన సిగ్గుని ఎన్ని విశ్వాసాలు తీర్చి పారెయ్యగలవు. ఒళ్లు జల్లుమంది. లోకం యిదా, నాగురించి అనుకుంటూన్న వెక్కిరింపుమాటలు; వాళ్లందరికీ అసహ్యమట నన్నుచూడానికి, నాపాట వినడము పాపమట, యింటికి పారిపోయేను. నాన్నగారు రంగయ్యతో మాట్లాడుతూ కనపడ్డారు. వేరేపిల్చి చెప్పేను; యింకనేను బ్రతకాలంటే పెళ్లిచెయ్యా' లని— ఎందుకో అదిమాత్రము నాకు మిగిలిన ఒక్కమార్గమూ యీ ఆరాటము, సిగ్గు, అపఖ్యాతి తప్పించుకు బ్రతకడాని కిలా అప్పటిలో కనపడింది. 'ఛీ, పశువు ప్రతిష్టలు తీసెయ్యడానికి' అని తిట్టేరు, క్రోధంగా అతనివేపు చూసి వెళ్లిపోయెరు. అదిమొదలు నా పాడు ప్రఖ్యాతి వింటూన్న కొద్దిమొండికెత్తి జీవిస్తున్నా.

యింక నాన్నగారు మా అమ్మపోయిన దగ్గిరనుంచీ ఒంటరితనంలో ఎన్నాళ్లో చాలా బాధపడ్డారు.ఆమె పోయినది నాచిన్నతనంలోనే. నాన్నగారు నన్నూ తీసుకుని ఒకఏడు నీలగిరి, ఒకమారు పూనా, ఓమారు కలకత్తా యిల్లా వెర్రెత్తినట్లు తిరిగేరు. కలకత్తా వెళ్లినప్పుడే యీ బంగాళీ అమ్మాయితో పరిచయ మైంది. ఆమెకు నేనంటే ఎంతో ప్రీతి. వేసంగికి చల్లదనాని కని యిక్కడికివస్తా నని వ్రాసేప్పటికి దీనిబిడ్డుక యిల్లు కాళీచేయించి యిచ్చేశారు. ఆమెచేరింది అందులో, ఎంతమందో బంధువులతో దొంగతనంగా మానాన్నగారిని రానిచ్చేది. మెల్లగా ఆ యిల్లు యీమధ్యే రాయించేసుకుంది, యిప్పటిలో మనకి మిగిలిన ఆస్తి అంతా అదేలే.

బాగా ఆవేశము వృద్ధిఅయింది. ఇంటికివచ్చేరా ఏ బ్రాందినిషాయో మరుపు పరచి అంతే. నాకుకూడా కొద్దిగాపట్టి నేను వేసే గెంతులలో సంతోష పడే

వాడు, యిల్లా గడుస్తూంది. ఇదంతా కనిపెట్టి, చుట్టాలు, స్నేహితులు అంతా బలవంతపెట్టి యీపెళ్లి నిశ్చేశారు. ఎప్పుడూ అనుకునేదాన్ని అందులో అతడు సుఖ మనుభవించడానికి ఏమి హక్కు ఉందా అని.

దానికి తోడు కాలము గడుస్తూన్నకొద్ది క్షీణించిపొయ్యే ఐశ్వర్యముతో యింట్లో కలవరము హెచ్చిపోతూంది; అది గుర్తించి సరిచెయ్యడానికి నేను ఎంత ప్రయత్నించినా సాధ్య మయిందికాదు. లేమి తరిమే అతిశయములోపడి వెర్రెత్తి మానాన్నగారు కొట్టుకపోతున్నారు. మరింత చీకాకు, అల్లర్లు; యింట్లో అశాంతి ప్రబలిపోయింది. జీవిత మసహ్యమై పోయింది. ఎందుకిల్లా ఎవ్వరికైనా బ్రతుకు సాగించడమో అర్థముకాదు.

ఒక్కటే యింకాఆశ; మామామగారివాళ్లదగ్గిరనుంచి రావలసిన ఆస్తి. అది ఏమవుతుందో.

ఇంతలో ఈ కొత్తపరిచయము. దీనిగురించి అప్పుడే విని ఉంటావు- యితనితో మొదటిసమావేశమునాడే ఏదో చిరపరిచితుడులా కనపడ్డాడు; పలకరించాడు; అనిర్మలమైన, సజీవమైన, ప్రకాశవంతమైన పదనములోకి నేను ఎర్రబారిన కోర్కెలతో మలినవంతములైన కళ్లతో చూడ్డానికైనా అధికారముందా అని భయపడేదాన్ని. తప్పించుకుని తిరిగేదాన్ని. కాని అతడు ఒప్పితేనా; ప్రేమదృష్టుల చల్లదనము పంపి, మండిపోతూన్న హృదయాన్ని శాంతిపరిచేడు; ప్రేమవాక్కులతో పద్యాలెత్తే, దారితప్పిన ఆలోచనలని మార్గములోకి తెచ్చేడు. క్రొత్తగా ప్రేమకు అర్థము బోధచేసేడు.

స్నేహము ఎంత దూరపరచుదా మని ప్రయత్నాలు చేస్తున్నానో అంత బలపడుతూంది; అతని దివ్యవర్చస్సు ప్రకాశించని కాంతి చీకటిలా ముంచేసి, కలవరపెట్టేది; అతనిరూపము, ఆదర్శాలు, మాటలు, ఆవేదాధ్యయనము,పూజ, స్తోత్రపాఠములు, యీక్రొత్త పరిచయము నీలోకమంతా నింద్యంగా చూస్తూంది. నలుగురూ వమ్మన్నద్దరని అనుమానపరమైన చూపులతో చూడ్డము, చూసి భయపడ్డాను; వెనుకటి పెండ్లినాటి తలుపుపక్కమాటలు జ్ఞప్తికి తెచ్చుకున్నా. ధైర్యముచేసి ఒకనాడు పిలిచాను అతన్ని వెరట్లోపెద్ద చానమీదికి. నాకథ అంతా పూర్తిగా వెల్లడిపరిచేను ఏమాత్రమూ దాచకుండా. దానితో నాగుండెబరువు కొంత తీరింది.నేను అతనినితెలుసుకోడానికైనా తగనని చెప్పి బ్రతిమాలాను, యింక కనపడకుండా మాయమై పొమ్మని నా లోకంలో నుంచి.

నవ్వుతూ, మెల్లగా దగ్గిరగా చేరచెయ్యితీశాడు, యింక దూరముండడము చేతకాలేదు. ఆహాయి యింతకుముందు అనుభవించలేదు. స్పర్శమాత్రాన్న అలపడే సుఖము గ్రహించాను. ప్రేమ అక్షణ హెచ్చయిపోయింది.—యీ శరీరముమీద ఆవెన్నెల ప్రశాంతి ఆనందసమయములో అతడు ముద్రించిన ప్రణయచిహ్నాలు నాపాపాల నొక్కటొకటే పరిహారముచేసి పవిత్రపరుస్తూన్నట్లు సంతోషమైంది. శాంతిచేరింది;లేచిపోయింది హృదయమంతా కొత్త ఆనందంలో. గ్రహించుతావూ నేను పడిన ఆవేశము. 'స్నేహితులము మళ్లే గడుపుదామన్నా' 'వీల్లేదు; వివాహబంధము నిన్ను నాదాన్ని చేసెయ్యాలి;

'లోకము మిమ్మల్ని హర్షించదు.'
'ప్రేమ ఆమోదించుతుంది; సర్వమూ
ఈర్ష్యతో పెదమెంగ మవనీ!
వెళ్లిపోయాడు ఈవేళ పగలంతా!

మానాన్నగారు చాలా గగ్గోలుపడుతున్నారు. టీచిమేడకి ఎవరినో పంపించిరహస్యంగా సంభాషించుతున్నారు. ఇంట్లో నౌజల్లా పచార్లు; బంగాళా అమ్మాయిని తిట్టుతున్నారు. నేను నాసంగతి ఎత్తకూడ దని అసలు కనపడకుండా మసలుతున్నా. సాయంకాలము పిలిచేరు నాన్నగారు, యింకా ఎవరో ఉన్నారు. దావా కాగితాలమీద సంతకము చెయ్యమన్నారు. అతని మొహముల్ని చూస్తే భయమువేసింది. సంతకము చెయ్యబోయేను. మళ్లీ అంతరాత్మ ఎక్కడను చో పలకరించింది. 'ఏంచేస్తున్నావు' అని దగ్గిరకిటికిలోంచి తొంగిచూశాను. క్రీ దూరంగా అతడే, తొందరగా, విలాసంగా, ఆలోచనల తీవ్రింలో నడచి పో తున్నాడు. నాన్నగారి వేపుచూ సిధైర్యంగా,'చెయ్యను, పెళ్లాడుతాను, నాక్కి అక్కర్లేదు.

'చెయ్యవూ' ఘర్జించేరు. కాళ్లకింద మేడ వణకినట్లయింది. కదలని చేయి తో సంతకము చేశాను. సాయంకాలమంతా ఏడ్చిన ఏడ్పు యిల్లా విసికొట్టింది. ఆప్రేమమూర్తి దర్శనమవగానే వెళ్లి ఆవిశాలవక్షములో తలఆనించి వెక్కివెక్కి ఏడ్చాను. ఏడుపులోతప్ప శాంతి కనపడలేదు. యిక్కడ, యీగదిలోనే, 'పెళ్లి దు' అన్నాను, నాన్నగారిమాటలు యింకా గింగురుపెడుతూన్న భయములు ఒణుకుతోనే, 'ఎందుకులేదూ; నువ్వు,నాదానివి కావాలి, అవుతావు, భయపడకు కాలమును నమ్ముదాము'—అతని నమ్మకములో ఏం నిజము లేదూ; తీవ్రంగా ఆలోచించే వ్యక్తుల ఆశయాలు, నమ్మకాలు వృథా అవగలవూ- మాపట్ల అయి నట్టేనా; వెళ్లుతున్నా అతన్నిచేరకపోను, ప్రేమలోకములో పాపాత్మురాలినైనా, అతని కోసరమేనా, మాకు సమావేశభాగ్యము లభింపకపోదు.

అప్పుడే నాన్నగారల్లా వచ్చారు- యీ వ్యవధీ, కాలక్షేపము, అసహ్యంగా ఉన్నాయి అంటూ వెళ్లి, వద్దంటూంటే సలకరించారు; అధైర్య మేంటో అ నిర్ఘాంతపోయి, చలనములేక, నిర్జీవశిలనై నిలిచి ఉన్నాను. నాకు తెలుసు, నాన్నగారు పడుతూన్న మహాందోళనము, బంగాళీ అమ్మాయిపట్ల ఘోరమైన కష్టాలు, గగ్గోలు, పెద్దఘర్షణజరిగింది; ఆరెండు నిముషాలు ఒక యుగంలా ఉంది.

'అమ్మడూ' అని పిలిచేరు, ఆప్రియాహ్వానములో ప్రక్కకి వెళ్లి నిలిచాను.

నన్ను ప్రేమించిన వేడిరక్తము, మొదటి గాఢప్రేమాలింగనముకోసము ఉబుకుచూ, ఉద్రేకపడుతూ పెద్దవర్షధారగా వచ్చి ముంచేసి తడిపేసింది. తొందరతొందరగా బట్టలలోంచి శరీరాన్ని తట్టుతూ. ఆప్రేమవాహినిలో పవిత్రస్నానము చేశాను. ప్రక్కకి ఆవేశముతో చూస్తే క్రిందపడిన శరీరముమీద వెర్రి చూపులతో నాన్నగా రున్నారు. కోపము రాలేదు, 'నాన్నా' అన్నాను.

'అప్పగించు, అల్లాచూడకు,నన్ను చంపుకోడానికైనా శక్తిలేదు' అన్నారు.

ప్రియుని రక్తము కాలువలు కట్టి నాపాదాలు తడిపివి. జేసురుడిం యిదని కొత్తకాంతి పాదాలకి పారాయణగా నిలిచి కళ్లని మెరిపించేయి. మహాశక్తి ఆవేశమువూని, నాలో ప్రకాశించింది. బట్టలడిలోంచి ప్రియుని ప్రాణం శరీరాన్ని నొక్కుతూన్నాయి. ఆబాకు అందుకున్నా. పూర్తి అయింది, శక్తిస్వరూపము; అందునుండి యింకా బొట్లు బొటపాట రాల్తున్నాయి. నేను చంపాలను అన్నా, ఆచప్పుడులో అర్థమయ్యేభావాల ఉన్మాదములో- పాడిచాను తండ్రిని- అంతమొనరించాను; గిజగిజలాడుతూన్న హత్యబాధని.

పిన్ని యింకా కతినురాలిని వ్రాయమంటావు- ఏంగుండెలో గ్రహించి వాటికి తగినసమాధి యియ్యండి.

దీప మలా వెళ్లనట్టయితే తలుపుబిగించా; యీ నిమిషములో నీవుమాత్రమూ నీ భవిష్యత్తుజీవితముతో భయంకరంగా కనపడితే తెగించి వ్రాశాను. యింకా ఆవేశంలోనే - కాని క్రొత్తవప్పుడే భావాలు పరుగెట్టుతున్నాయి.

అదుగో కదులుతున్నాయి చీకట్లో వారి శరీరాలు- భీకరంగాలేవు- రమ్మని పలకరించు తున్నాయి- ఆమహాసమాధి అవతలకలుసుకొని ప్రేమగా పిలుస్తున్నారు- ఆలస్యము చేస్తున్నా- ఎలా కలుసుకోవడము జ్ఞాపకముంది- నీకత్తవ్యము—

ఎవ్వరో తలుపుకొట్టుతున్నారు, తొందరపడతా, శలవా! —అమ్మడు



రా॥ బ॥ బి. మునుస్వామి నాయుడుగారు.



శ్రీ. పి. గోవిందరావు నాయుడుగారు.



శ్రీ. జె. రామచంద్రా రెడ్డిగారు.



శ్రీ డి. పి శేషారెడ్డిగారు



శ్రీ కల్లికోట రాజాగారు.



దీ॥ బ॥ యమ్. గోపాలస్వామి మొదలియారుగారు.



శ్రీ యస్. రంగారెడ్డి గారు.



శ్రీ కె. కుప్పుస్వామి చౌదరిగారు.



రా॥ బ॥ యమ్. కె. రెడ్డిగారు.



మి. యమ్. రత్నస్వామిగారు.



రా॥ బ॥ ఎ. పి. రామునిమీనన్.



యస్. యి. రంగనాధంగారు.



కెప్టన్ సి. కె. నాయుడుగారు.



ప్రొపసర్ రాధాకృష్ణన్ గారు.



యమ్. వెంకటరామానుజులుగారు



మి. యమ్. బాలయ్యగారు.



శ్రీ బులుసురామ[illegible]గారు.



మి. సి. రామస్వామిగారు.

T

# ప్రణయ బలి

మ॥ రా॥ రా॥ శ్రీ దువ్వూరి రామిరెడ్డి గారు

బచ్చెన పండుఁ గీర మటు భ్రాంతిమెయిం గనిపెట్టుకొన్న నా
పిచ్చితనంబు కొందఱకు వేడ్కయు, నా కనవాప్తిలజ్జయుం,
బచ్చని కోర్కెకుం జెవులు బంధుహితాళికి జాలిఁ గూర్చి, పై
పెచ్చుగఁ దీఱరాని వెతవెట్టునొ జీవితశేష మంతయున్.

రాజరాజ హృద్దేశ విభ్రాజమాన
కమ్రనాయకమణి శుక్తి గనును గాని
మూల్య మెఱుఁగ ద దెంతటి మూఢమతియొ ;
వింత యొనగూర్చెఁ బ్రారబ్ధ విలసనంబు!

ఈఁక లెదిగినఁ గనుదాఁటి యెగురు నంచు
ఱెక్కలను ద్రుంచెఁ బిల్లకు నొక్క పులుగు ;
ఇదియె వాత్సల్య దృష్టాంతమేని యింక
స్వార్థపరతకు ముద్దుపేరబ్బినట్లు!

అతివ, యవివేక దూషితం బైన బంధు
జన సదుద్దేశమే భావి సమయ భోగ
భాగ్యములకు నిరోధక బంధమయ్యెఁ ;
దల్లి విషపాత్ర నందియఁ ద్రావ వలెనొ!

సదనురాగంబు పరిభవక్షతి నొగిలియు
ద్వేషముగ మాఱఁబోదు పవిత్ర మగుట ;
వే ఱొకని జీవితంబు నీ ప్రేమ కతన
సౌఖ్యపడునేని యది కొంత సంతసంబె.

మగనాలి వౌట, నాకుం
దగ దీక్షఁ దలపోయ నిన్నుఁ దరుణీమణి, నే
నగపడను దెరల మాటున ;
విగతాశుని వీడికోలు వేడకు మింకన్.

కాని, యొకకోర్కె గలదు ; నీ మానసమునఁ
బ్రణయ బలి రక్త ధార లార్ద్రముగ నున్న
మఱవఁ బోకు మత్ప్రేమసమాధిమీఁదఁ
గనికరంబున నొక బాష్పకణము రాల్ప.

చెలఁతా, భగ్నమనోరథుం డగుట నేనే గాని, వాంఛింపకే
కలిగెన్ నీ కమృతత్వసిద్ధి, కవితా కల్యాణ సౌధంబునన్
నెలకొంటం; గవియాత్మ నుచ్ఛ్రిలవయోన్ నీతోడి సామాన్యలాఁ
జెలులట్లే నివసింతువేమొ యిల నక్షయంబుగం జీకటిన్.

అన్నిదినాలు భావపటమందున నే లిఖియించుకొన్న య
భ్యున్నత భావిచిత్రము లొకొక్కటఁ జింపి, నిరాశ మంటలం
దిన్నగ వైచి, పై కెగసి తేలెడు ధూమముఁ జూచి చూచి, మే
ల్కొన్నటు భ్రమ్మఱం బడయఁ గోరుదుఁ గీలల రూపరేఖలన్.

అమలం బైన ప్రభాతరాగరసవిన్యాసంబునం బ్రేమ చి
త్రములన్ వ్రాసియువ్రాసి యిప్పటికి వర్ణంబంతయుం, గుంచెయుం
హిమికాస్వచ్ఛచిదంబరంబు వ్యయ మాయెం ; దచ్ఛిమప్రస్థమా
గమనీయం బగుసృష్టి నాయెదుట దగ్ధం బౌట కెట్లోర్తునో!

కవితలు వ్రాసి చింపునటు గాదు! హృదంతరలగ్నమైన యా
యువతి మనోహర ప్రతిమ నూడఁ బెకల్చెడునప్డు జీవిత
ప్రవిమలరక్తపూరములు పై కెగఁజిమ్మెడు బాధ నోర్చునో
నవునె విధాత, నీకయిన ; నారునె గాయము ; మచ్చమాయునే,

ఆశాభంగ కఠోరశస్త్రికల నన్నంతంబు గావించి యా
వేశోన్మత్తతఁ ద్రొక్కినన్ సరియ! దుర్వృత్యంబు కోటీనస
కాశ ప్రాభవ దివ్యతేజము మనఃకంజంబునన్ వెల్గెఁ ; ద
ద్రాశీభూత పవిత్రశక్తి యగుటన్ దర్పింతువే దుర్విధీ?

తలవంపులు ఘటియించితె
పలునంతల నన్నగిలినవానికి ; విధి, నీ
బల మెంతో దెలిసికొందును
గలకాలము నీకు నాకుఁ గలహము సుమ్మా.

కాలన్రాచి విదల్ప నేఁ బురుగునే, కాలానలజ్యోతి యం
చేలా నీ వెఱుఁగంగలేవు ; నిను నీసృష్టిం దుటారించి భా
వాలంబంబున దివ్యలోకములు రమ్యంబౌనటుల్ సల్పి నీ
యాలిన్ దొంగిలిపోయి మత్ప్రణయరాజ్యశ్రీ నొనర్తున్ విధీ!

తలఁపులయందె నావెతను దాఁచఁ దొడంగితిఁ గాని, వాతసం
చలిత పయోధి వీచికల చాడ్పున రేఁగు విషాద మేచి, యా
కులమయి, గాఢసంయమనకూలముఁ ద్రెంపి క్రమించె నాలుకన్ ;
దలఁగెను దానఁ గొంతపరితాపము ; నర్థవిముక్తి చేకుఱెన్.

కరుణను నా కయాచితముగా వరిపించిన నీవరంబులన్
మరలఁ బరిగ్రహింపుము రమాధవ, రమ్యకళావిభూతి, యం
బరచర భావలోలతయుఁ, బల్లవకోమలమౌ మనంబు దు
ర్భర రుజ లాచు నైహిక నివాస మసహ్య మొనర్చె నెంతయున్.
గఱులను ద్రుంచి, నేలకును గాలికి బంధము వైచియుం, బయో
ధర రథ చక్రముల్ పగులఁ దాఁచి, తటిల్లత జాటఁ ద్రెంపి, క
ర్బుర రమణీయతా కిరణ రోధక మౌఁ గవచంబొసంగి ప్ర
స్తర కఠినాత్ముఁ జేసి నను సంసరణార్హు నొనర్పు మీశ్వరా.
కవితావల్లకి, క్రూర మౌ విధి తిరస్కారంబునన్ నీకు సం
భవ మయ్యెన్ హృదయాంతక వ్యథలు కావ్యాలల్లి పాడంగఁ ; జా
లు విషాదాంకిత గీతికారవళి! చాలున్ నిల్పు మాక్రోశ గా
న విషజ్వాలలు! పూను మీ యచల మౌనన్యాసదీక్షాధృతిన్.

ఆ శీ ర్వా ద ము.

చెలియా, నిత్యశుభోదయంబు, సకలశ్రేయంబులున్, భోగముల్
విలసత్ ప్రేమ సదాభివృద్ధియుఁ, గళా విద్యాభిలాషంబు, ని
శ్చల మాంగల్యము, పుత్ర పౌత్రులును బ్రజ్ఞా తారతమ్యోజ్జ్వల
వెలయన్, జీవిత యాత్ర మీ కిఁక సుఖాన్వీతంబుగా సాగుతన్.

# గౌరీగర్వభంగము

కావ్య వ్యాకరణ తీర్థ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు.

“యుక్తియుక్త ముపాదేయం బాలా దపి సుభాషితమ్”—అని పెద్దల అనుశాసనము. ఈసూక్తిని వాఙ్మయమువిషయమునఁ గూడ వర్తింపఁజేసినచో, రసభావనాధను లగు కవిజనుల కవితలు ఎంతున్నను సరసుల కానందదాయకములు కాకపోవు—అనువిషయము జ్ఞప్తికి రాకమానదు. ఆంధ్రవాఙ్మయమునందు నన్నయతిక్కనాదుల రసమహితమగు కవిత్వమున కెట్టిస్థాన మొసంగవలసి యుండునో పోతరాజు, శ్రీనాథుఁడు, సోమన, పెద్దన—మున్నగు పెద్దల సుధామాధురీధురీణము లగు రచనల కెట్టి పూజ్యస్థాన మర్పింపవలసి యుండునో, అక్షరాస్యత నెఱుఁగకయే తమంతతామ ఉద్బుద్ధములై పొంగి పొరలివచ్చు కవితాప్రవాహములను భక్త్యుద్రేకానుభవచేత, నాంతరంగిక మగు అభినివేశమున, నిరర్గళముగా లోకముల వెల్లివిరియించిన పామరజనుల రచనలకును అట్టిస్థానమునే యొసంగి మనము చిరితార్థులము కావలసి యున్నది. ప్రకృతము గ్రంథస్థముగాకయే ఇంతవఱకును పల్లెటూళ్లయందలి వృద్ధస్త్రీలు పరంపరగా కంఠస్థముచేసి కాపాడుచువచ్చిన అట్టి వాఙ్మయమునుండి యొకచిన్నబిందువును ప్రత్యేకించి దూర్చి చదువరులకు ఉపాయనీకరించుచున్నాను. అది ఈగౌరీ గర్వభంగమే.

గౌరీగర్వభంగము—అనునది యొక పాట. చదువను వ్రాయ నెఱుంగని మన ముసలమ్మలు భక్తితో పాడుకొనునట్టిది. చక్కని కవితాధారయును, పరిణతము అగు రససంపదయును పొంపిరివోవునట్టిది. నీతినిధానము. దీనికి గంగా గౌరీసంవాదము—అనియును పేరు గలదు.

పాటలోని కథాంశము:—గంగయును, గౌరియును, ఈశ్వరునికి భార్యలు. గంగ పెద్దది. గౌరి చిన్నది. సాధారణముగా చిన్నభార్యకు ఎక్కుడు స్వతంత్రత యుండుటయు, నందుచే సాపత్న్యము కాలూనుకొని చివరకు అసాధ్యమైనరూపగుటయు లోకసాధారణము. ఇట్టి పరిస్థితిచే కీడే కాని మేలు లేదని రూపింపఁదలచి ఈపాటను రచించినట్లు తోఁచుచున్నది, సవతితనము కారణముగా నిరంతరము గౌరి తనతో పెడవాదము లాడుచు. ఒకమాఱు బహిష్ఠ యగుట సంభవించును. గౌరిని ఎట్లైనను మార్గమునకు తేఁదలఁచిన గంగ ఆసమయమును కనిపెట్టి గౌరికి గర్వభంగము చేయుటకై తా నంతర్ధానము నెందును. అప్పుడు గౌరి ఋతుస్నానమునకై యుదకముల నన్వేషించి ఎచ్చటను గానక విసివి అలసిపోయి—ఏమి చేయుటకును తోఁచక తనకుమారునిద్వారా శివునితో తన దుస్థితిని మొఱవెట్టుకొనును. పరమేశ్వరుఁడు గౌరికి గర్వపరిహారముఁ గావించి నీతిని ఉపదేశించి వికమత్యఫలమును నీతిరూపమున ననుగ్రహించును. ఇది కథ. ఈకథను మన పూర్వస్త్రీలు భక్తితో పాటగా రచించుకొని పాడుకొనెడివారు. ప్రకృతము ఈపాటను వ్రాసినవా రెవరో తెలియదు. కనుక కవికాలకర్తృత్వాదివిషయముల నటుంచి మన మిఁక విషయమును చర్చింతము.

## పాట

శివశరణు మాం పాహి శివశరణు శరణు
శివశరణు మాపాలి శివునికిని శరణు
గురుశరణు మాంపాహి గురుశరణు సోహా
గురుశరణు మాపాలి గురువులకు శరణు
హరిశరణు మాపాహి హరిశరణు శరణు
హరిశరణు మాపాలి హరులకును శరణు.

ఇది యీపాటకు మకుటము—అనికాని, లేక పల్లవి అని గాని చెప్పవచ్చును. దీనిని అయిదేసి నాల్గేసి పదేసి చరణములకు (లైన్లు Lines) ఒక్కొక్కమాఱు మఱలమఱల పాడుచుందురు. ఇట్లు పాడుటచేత పాట వినుట కింపుగానుండుటయే గాక, కథాఘట్టములందు శ్రోతలు నెమ్మదిలో నిలచి రసాస్వాదమును చేయుటకు వీలు గలుగుచున్నది. కనుక మనమును అవరున ననుసరించే ఆఘట్టములను పఠించుచు నడతుము గాక.

ఎక్కనే గౌరమ్మ ఎలనందిమీఁద
కోసెనే పూలన్ని కొమ్మలూ వంచి
ముడిచెనే ఆపూలు ముందుగా తాను
మూడువ మిగిలినపూలు మోదమున
బంగారుపళ్లెమున బాగుగా నుంచి
హంగుగా పంపెనే గంగమేడలకూ

శివశరణు మాం పాహి శివశరణుశరణు
శివశరణు మాపాలి శివునికిని శరణు

రూపము భర్తృవాల్లభ్యము స్వతంత్రగా—అనేగుణములచే కొమరొప్పెడి గౌరి గంగకంటెను ముందుగా లేచినది. మహోత్సాహములో బాలభావము వీడని ప్రాయపు టభిమానములో తనకు చేతికందనిపూలను సయితము నంది నెక్కి మంచి పరిమళము గల పూలను అన్నిటినీ తానే కోసినదట. అంతతోఁ బోక అందులోఁ గల మంచిమంచి విరులను తాను ముందుగా ముడుచుకొన్నదట. ఆపైని ముడువఁగా మిగిలినపూవులను (ఉన్నదికదా మనిసవలి యని కాఁబోలు) భర్తృవాల్లభ్యగర్వసూచకముగా తనసవతికి ఇచ్చి రమ్మని, బంగారుపళ్లెములో నుంచి గంగమేడకు హంగుగా పంపినదట! ఇందులో వున్న ‘బంగారుపళ్లెము హంగు’ అనేమాటలు గంగకు ఈర్ష్యాభిమానము లనెడి గంగవెఱ్ఱుల నెత్తించునేమో యని చదువరులకు అనుమానముగ పుట్టిస్తున్నవి. ఎందువల్లననగా— సపత్నీజనభుక్తనిర్మాల్యము లగు అనులేపాభరణాదులు సాధారణముగా మానోద్దీపకము లగుననునది ఆలంకారికసంప్రదాయము. ప్రపంచస్వభావము. ధనికుల వల్లభలు ప్రాయః ఇట్లే చేయుచుందురు కాఁబోలు. ఎట్లైన నేమి- ఈపూవులు పంపుట అనేమిషతో గౌరి పైకి బంగారుపళ్లెముల హంగును చేసినను, అంతర్యమునందు సపత్నీజనమనస్తాపమే తనమనోరథసర్వస్వ మని తలంచుటను చెప్పకయే చెప్పుచున్నది. ఇఁక గంగను చూచెదము. ఆమె గౌరికంటెఁ దక్కువా? ఏమనుచున్నదో వినుఁడు.

వాడుపూ లంపిన వనిత యెవ రమ్మా?
వదలుపూ లంపిన వనిత యెవ రమ్మా?
చాలియుంటె తనకు సరిగ చూడాలె
చాలకుంటే తానె సరికొల్లలాడు.

శివశరణు మాంపాహి శివశరణుశరణు
గుహశరణు మాంపాహి...........

గంగకు సవతిచేసిన ఈసత్కారము చల్లనిబోతగా పరిణమించినది. కాని తాను వయసునఁ బెద్ద. పడుచుప్రాయమునఁ దుండుడుకుత్తన గౌరితో సమముగా రచ్చకెక్కుటకు నిచ్చ లేనిది. కాని సవతితనము ఎంతటి శాంతమతుల నైనను చరచరలాడించునట్టిది. తన కెంతగ ఇష్టము లేకున్నను, కొలఁదిగానైనను, తన యాధిక్యమును చూపక తప్పదు. మఱొక విషయ మేమనఁగా గౌరివలె తాను అగ్నిసాక్షికముగా పరిణీతురాలు కాదు. చేపట్టినది. కనుక ఒకింతజంకుతోనే మెత్తనిమాటలతో బనులు పలుకుచున్నది. “మాకు అగౌరవముగా ఈవాడుపూవుల నంపిన దెవ్వరు? మాయందు తగినంత ఆదరము కలుగనప్పుడును, తమతో మేము సమానులము కాము—అనుఅభిప్రాయము ఉన్నప్పుడును ఇట్లు చేయుట తగదు. ఎవరిఆధిక్యము వారిదే. తనకు ఆధిక్య” మున్నచో తానే దానిని కొల్లలాడఁదగునే కాని సమానుల నిట్లు! అవమానించుట తప్పు—” అని అనీఅననట్లు జవాబు చెప్పింది.

ఎట్టులయినను గిల్లి కజ్జాపెట్టుకొనఁదలఁచినవారికి ఈపాటి సమాధానములు రుచించునా? ఎట్లైనను కవ్వించి మూల నున్నవారిని ముంగిలి కీడ్వవలసి యున్నది. గౌరి స్వాతిశయముతో ఉన్నదని ఇదివఱకే మన మెఱుఁగుదుముకదా! ఆరంభములో నాటినబీజమున కిపుడామె దోహదప్రాయముగా అనుచున్నది. ఏమనీ?— వినుఁడు.

సరికొల్ల లాడను సరిదాన వటవే?

అని. ఈమాట అనుటకు చిన్నదే; కాని ఈర్ష్యాగ్నిని రగుల్చుటకు అమోఘమైన కరుకుగా నయినది. ‘ముందు వచ్చిన చెవులకంటెను వెనుక వచ్చిన కొమ్ములు వాడవు’—అనునట్లు నాకంటెను ఎంతో వెనుక వచ్చిననీకు ఇంతటి అతిశయమా? ఎవరి హెచ్చుతగ్గులు అయినను ఈఒక్కవిషయము నాలోచించినఁ దెలియరాదా? చూడుము ఆలోచించీ?—అన్నది. ఏమనీ!

సరిదానఁ గాకున్న శివుఁ డేల దెచ్చు?
శివుఁ డేల తెచ్చునే? జగ మేల మెచ్చు?
శివుని చిన్నాల! నాచిట్టిచెల్లెలా!

గంగ వేసినయీప్రశ్న గౌరికి గొంతుకపట్టుకొన్నంతపని చేసింది. జవాబుచెప్పుటకు ఏవిధమునూ పాలు పోలేదు. ఇట్టిసందర్భములందే కదా మహనీయవేత్తలు అన్నారు—ఏమని? శేషం కోపేన పూరయేత్—అని. దీన్ని అనుసరించియే గౌరి—ఏమి జవాబు ఇవ్వగలిగెనో ఊహించుకోవచ్చును. కాని, ఊహయేల?—వినండి!

అన్నమాటకు కోప మతిశయింపంగ,
తన్నె సవతిని గుండె తల్లడిలి పగుల.

ఆహా! గౌరి చూపినధార్త్యము ఎంత అంతులేనిది! అనాలోచితముగా ప్రవర్తిల్లినది. ఇది నిజముగా పనుచుదక్తపుపనియే గదా! ఈవిషయము నిట్లుంచి గౌరిచేసిన యీచేష్టకు గంగ యెట్లు ప్రత్యుత్తరమిచ్చెనో మనమనస్సులు తెలియ నుత్సహించుచున్నవి. గనుక పిమ్మట చదువుదము. అప్పుడు గంగ—

అక్క మీపాదాల రాలిన మన్ను
చక్కని యక్కలను సవరింపఁ దెన్ను.
సందులను గట్టిస్తు గొందులను గడుదు,
కొడుకు వీరన్నకు కోటలను గడుదు
కోడలు బుద్ధికి మేడ గట్టిస్తు
బసవన్న పడుకకు పంచటుగొడుదు
శివపూజగద్దెల చెలఁగఁ గట్టిస్తు
నీయాన సరిగద్దె నీకుఁ గట్టిస్తు.

అన్నది. ఈమాటలలో గంగ చక్కనినేర్పు చూపినది. నేర్పనిన నేర్పా? భగ్గుభగ్గుమనుచున్న క్రోధాభిమానములను పదిలముగా పచ్చగడ్డిలో చుట్టి పట్టినది. చెవికి చుఱుమనుటయేగాక, గుండెలు పగులునట్లు తాఁచినతాపుగ తియ్యని వీఁచోపులలో వెనుకపట్టించుచున్నది. తన్నిన తన్నునకు ఇనుమడిగా మాఱు తన్నులను తన్ని వన్నెకెక్కవలసిన వన్నెలాడి, అతన్నును సన్నఁగా జారవిడిచి, అంతలోఁ బోక, అకుంన్నితముగా - ఆమన్ను తనయక్కలను తీర్చఁజాలుట కొక తెన్నుగా నయ్యె ననియు, దానితో సందులు గొందులు మాత్రమే గాక కొడుకువీరభద్రుఁడికి [ఇచ్చట కొడుకు—అనేమాట తనకు సవతులకుండెడి ఈర్ష్యలేదని వెల్లడించుచున్నది.] కోటకూడ కట్టింపఁగలదఁట! కేవలము ఇంతతో వదలిపెట్టినదా? లేదు. విఘ్నేశ్వరునిభార్యయైన బుద్ధికి (ఈయనకు సిద్ధి, బుద్ధి—అని ఇద్దరు భార్యలు.) మేడను, బసవన్న పరుండుటకు చక్కని అఱుగును శివునికి పూజకై గద్దెలను (సింహాసనములు)—ఇంకా గౌరికి కూడా [తనతోఁబాటుగా] ఒక సరిగద్దెను గట్టించునఁట!

భేష్! ఎంతచక్కనిజవాబు! సుధాలిప్తములగు విషఘుటిక లనిగాని, [చక్కగా మన కీ కాలమున బోధపడుటకై చక్కెరపూఁతవేసిన క్వైనామాత్ర లనిగాని వీనిని మనము ఎన్నవచ్చునుగదా!]

ఇక నిట్టిస్థితిలో గౌరిని పోలినమేధావిని ఏమన్నదని చదువరులు త్వరపడెదరు కాఁబోలు! అట్లైన వినుఁడు.

సరిగద్దె కట్ట నాసరిదానవటవే?

ఇది ఇంతకుముం దొకసారి అనినమాటయే. కాని, ఇచ్చటిపరిస్థితి వేఱు. సవతిపైఁగల క్రోధమును కాలితాపుతో ప్రతివచనీకరించియు, ఆక్రోశము తనివి నసకయును, అంతకంటె ప్రతిక్రియ తాను చేయఁగలదియు లేకయును, జేవురించిన కనులతోను కటకటపడెడి భ్రూకుటితోను తాపుతినిన ఆఁడుత్రాచువలె గోజాచు నిల్వఁబడియున్న స్థితిని ఇది యిచ్చట వెల్లడించుచున్నది.

ఇక గంగస్థితి పఠింతము. ఆమెకుఁ గొంచెముగొంచెముగా విజయసూచనము కన్పట్టుచున్నది. కనుకనే ఆమె తనశాంతమునకు ఊత నేర్పరచుకొనుచు క్రోధాభిమానామరి గ్రుడ్డివాఱిన గౌరిని ఒక చేయిపట్టిచూడఁ దలచినట్లున్నది. కావున నామె వెనుకటిజవాబునే ఇక నొకమాఱుకూడ విన్పించుచున్నది.

సరిదానఁ గాకుంటె శివుఁ డేల దెచ్చు?
శివుఁ డేల తెచ్చునే జగ మేల మెచ్చు?

శివశరణు మాంపాహి......
శరణు.

పాపము! గౌరి మఱల ఈజవాబే వచ్చునని తలంపలేదు. కాని ఒకమాఱు పరాస్తమయినను మఱల ఈప్రశ్న యుదయించుటతోనే ఆమెకు పూర్తిగా కోపపు కావిరి గ్రమ్మినది. కనుక ఆమె మతి; ఆలోచనములేకుండఁగా వెనుకటికన్న మిన్నగాఁజవాబే చెప్పినది. ఏమి టనఁగా,

శివుని చిన్నాలిని నీచెల్లి ననుచు
తన్నెనే సవతిని తలపండ్లు రాల.

మఱల గంగ కూడ మతింత చిగురెత్తింది. కనుక ఆమె ఇట్టి జవాబును చెప్పె యట్టులనే—

రమణి! నీపాదాల రాలినపండ్లు
కూర్చుండి యేరిస్తు గుండుగంపలకు,
నిలుచుండి యేరిస్తు నిలువుగంపలకు
పరుండి యేరిస్తు పాటిగంపలకు
పిన్నలకు పెద్దలకు పెడుదు పంచంగ.

అని అన్నది. గంగయొక్క జాణతనము సాటిలేనిది. గౌరి తన్నినతన్నునకు తన నోరిలపండ్లు అన్నియు గాలినవఁట! (ఇది సరస మయిన అధిక్షేపము.) అట్లు ముగా పండ్లూడఁదన్నుట తనపాలికి పరాభవము గాకుండుట యట్లుండ—పైగా అది భాగ్యము కూడ అగు ననియును, ఆభాగ్యమును కేవలము తా నొక్కతె మాత్రమే గాకుండ పిన్నలు పెద్దలు—మున్నగు నందఱకును బంతికలియునట్లు గుండుగంపలతో- నిలువుగంపలతో- పాటిగంపలతో ఏరించి పంచిపెట్టెద ననియు జవాబు. ఎంతగడుసరిజవాబు! మాటలు అన్నియు నన్ని ఫిరంగి వ్రేటులేకదా!

ఇంతవఱకు నోటిఆక్రోశమున కారాటపడుచున్న గౌరికి—కొంచెము వా మయిన పట్టు చిక్కినది. పిన్నలకును పెద్దలకును సమముగా పంచుట—యను టపట్టు ఆమెకు దొరకినది. గనుక ఇక ఆమె తడవుకొనకుండ —

పిన్నలకు పెద్దలకు పెట్టెదే పంచి?
పసిబిడ్డ బాలాది నే పంచి పెడుదు.
సరి పంచిపెట్ట నా సరిదాన వఁటనె?

అనినది. గౌరి యీమాటుకూడ ఇట్టిజవాబే చెప్పుటచేత గంగకు అలుచు చిక్కినది. ఒకవిధముగా గొంయోటమికూడ ధృవపడినది. సరియైనజవాబు లేనప్పుడే కదా ఈరీతి పిష్టపేషణము కలుగును.

ఈ సంగతిని గంగకూడ కనిపెట్టినది. ఇక గౌరి తనమాటకు బదులు చెప్ప లేక మొండితగవు ఆడుచుండుటను ఆమె గుర్తించి ఇక నంతతోనాను ఆచ్చోటు నుండి తొలఁగి పోవఁ దలంచినది. కాని మాఱు పల్కకయే పోయినయెడల గయ్యాళియగుగౌరి తనపై గెలుపు చాటిమి పెట్టునేమో యనుకొనుచు—

సరిదానఁ గాకుంటె శివుఁ డేల దెచ్చు!
శివుఁ డేల దెచ్చునే జగ మేల మెచ్చు?
శివుని చిన్నాల! నా చిట్టిచెల్లెలా!
అనుచునే గంగమ్మ చనెను మేడలకు.

వెళ్లినది. సరి యిఁక నాలస్య మేల? గౌరియును ఇటుపైని చేయునది లేక పోయినది తనయునికికి! కాని ఆమెమనసునకు మాత్రము మిది మఱపురాలేదు. పా టంతో నిచ్చటికి రచన తెగినది. కనుక కవి దాని నిటుపై నడుపుచున్నాడు:- చూడుఁడు.

అంతఁ గొన్నాళ్లకు వింతగా, గౌరి
చింతింప నొకనాడు చెంగు తా మాసె
కన నీటిజాడలు కానరా వాయె,
కొడుకు వీరన్నను కొమరొప్పఁ బిలచె.

ఇంతలో గౌరికి చెంగు మాసినదఁట! [చెంగు (చెఱఁగు) మాయుట యన గా నాఁడువారు బహిష్ఠలగుట.] చెఱఁగుమాసిన నాల్గురోజులును మెల్లఁగా వేగించినవి. కాని అయిదవనాఁడు స్నానదినము. ఆనాఁడు నీరెట్లు? గంగలో నా కలహించినదిగదా! నీళ్లనాడనిది పవిత్రత గల్గదు!—మఱి కర్తవ్య మేమి?— అని గౌరి ఆలోచించినది. "గంగ అమాయికురాలు. అశీఘ్ర కోప. గనుక దూరమున నెక్కడైనను వెళ్లి దాగియుండవచ్చును" అని తలంచినది కాఁబోలు. కనుకనే ఆమె అనుచున్నదిగదా తనకొడుకు వీరభద్రునితో—

రావోయి వీరన్న! రాజశేఖరుఁడా!
వయసుతో వర్ధిల్లవయ్య వీరన్నా!
ఇది స్నానవేళగా మది నెన్న మన్నా!
ఉదకాలజాడలు వెదకు మాయన్నా!

అని అనినది. వీరభద్రుఁడు తల్లిమాట జవదాఁటని తనయునివలె కానవచ్చుచున్నాడు. కనుకనే- ఆయన తల్లికై బయలుదేరినాఁడు. కేవలము బయలుదేరుటమాత్రమేనా? ఎంతలేసి ప్రయాసలు పడుచున్నాఁడో- ఆతల్లి కొఱకు! చూడుఁడు!

అటుబోయి వీరన్న ఆకోలను చూచె
ఆకోలని ఉదకాలు దాచింది గంగ.
ఇటుబోయి వీరన్న ఈకోలను చూచె
ఈకోలని నీరంత దాచింది గంగ.
చిలుకసముద్రాన్ని చేరఁబోవంగా
చిన్న మెత్తూనీళ్లు చెప్పఁగా లేవు.
పాలసముద్రాన పలిమెడు లేవు
వెదకిన నెటఁగూడ నుదకముఁబు లేవు.
ఈ (వి)బూదిగుండాన నింకిపోయినవి
మల్లయ్యగుండాన మఱఁగిపోయినవి
సవతులగుండాన చట్టువాఱినవి
వెళ్లెనే వీరన్న వెనుకకు మఱలి.

వీరభద్రుఁ డిట్లు వెదకివెదకి వేసారి వట్టిచేతులతో వచ్చినాఁడు. గారికి అభిమాన క్రోధాదు లలముకొనసాగినవి. కాని ఏమిచేయఁగలదు ? ఏమి చేయుటకును అది సమయమూ కాదు. అప్పు డిఁక విధిలేక శాంతివహించి ఆవీరభద్రుని తనతండ్రియైన దక్షునొద్దకు పంపుచున్నది.

ఉదకాల జాడలు కానరా వాయె
తుది నెట్లు గాంతునో తోయము నేను,
దక్షుమేడలదాక పోయి రా కొడుకా !
పోయి దక్షునికి ఈపారుపు జెప్పుమురా !
దయపుట్టఁగాఁ జెప్పు తాతతో నీవు
అయిదుదినములఁబట్టి స్నానమే లేదు.
ఆఱుదినములు గడచె హరుపూజ చేసి
శివపూజ మాతల్లి చేయలేదనుము
కలవర్యొ నని చెప్పు కాసిని నీళ్లు.

అని తండ్రికి కబురు చెప్పుమనుచున్నది. అంతట వీరభద్రుఁడును బయలుదేఱి—

కొమరొప్ప వీరన్న గునకనడకలతో
గుజ్జుమామిడి దాఁటి గులివెంద దాఁటి
బల్లెంబు శూలంబు పట్టి యిరుకేల
రాక్షసుల మర్దించు రాణ నొప్పారి
వెళ్లెనే వీరన్న దక్షుమేడలకు

అని ఇంత అట్టహాసముతో దక్షుని యునికిపట్టునకు వెళ్లినాడు. అప్పుడు మనుమని జూచి మహానందముతో—

రావోయి వీరన్న రాజశేఖరుఁడ
ఎన్నఁడు నామేడ లెఱుఁగవే తండ్రీ !
ఏమి పని కొ స్తివో ఎఱిఁగింపు తండ్రీ !

అన్నాఁడు. వీరభద్రుడికి కొంచెం వెసలిక చిక్కింది. అప్పుడు—

అయిదుదినములబట్టి స్నానంబు లేదు
ఆఱుదినములబట్టి హరుపూజ లేదు
శివపూజ మాతల్లి చేసికోలేదు
ఉదకాలజాడలు కానరా వాయె
ఉదకాలజాడలు మి మ్మడుగు మనెను.

అని చల్లఁగా మెల్లఁగా చెప్పినాఁడు. పాపం కూఁతురుకు వచ్చినచిక్కులు తొలఁగించవలసిన బాధ్యతే ఆకాలమునకూడ నున్నందుననే కాఁబోలు—దక్షుఁడు అమిత త్తఱపాటుతో,

అటుపోయి దక్షుఁడూ ఆకోలను జూచె
ఆకోలని ఉదకాలు దాచింది గంగ
ఇటుపోయి దక్షుఁడు ఈకోలను చూచె
ఈకోలని ఉదకాలు దాచింది గంగ.

పాపము. ప్రజాపతితర్వాత సృష్టికర్తృత్వమునకు చాలినవాఁడు దక్షుఁడు. ఈయన ఉపప్రజాపతులలో(అనఁగా ఉపబ్రహ్మలలో) ప్రధానుఁడు. గౌరిగాక(పురాణముల ననుసరించి దక్షునికి కూఁతురుగా పుట్టి శివుని చేపట్టిన దాక్షాయణి, లేక సతీదేవి అని ఈమె నిజ మగు పేరు. అయినా పాటలో అభేదమును పాటించినట్లున్నది.) ఈయనకు ఇంకను పెక్కురు కూఁతుండ్రు కలరు. అశ్విని మున్నగు నక్షత్రములరూపములో చంద్రునకు భార్యలుగా పేర్కొనంబడిన దివ్యతేజశ్శాలినులు ఇర్వదియేడుగురు నీ దక్షప్రజాపతికి కూతుండ్రే. వీరందఱికంటెను గడగొట్టు దగుటచేఁ గాఁబోలు గౌరియెడ దక్షున కింత మక్కువ! తనముద్దులకూఁతున కేలోపము గల్గినను తనదిగా నితఁడు భావించినాఁ డనక తప్పదు. గనుకనే అమితమగు హడావిడిలో ఆకోలనులు ఈకోలనులు గాలించినాఁడు. కాని ఫలము ఎప్పటట్లే !

అప్పుడు దక్షునకు విస్మయమును వెఱఁగుపాటును కోపమును కూడ వచ్చినవి. గంగ కావలయు నని ఈమోసము చేసియుండవచ్చు ననుకొనుచున్నాఁడు. చూడుఁడు. అప్పటి ఆయనస్థితి ఎట్లున్నదో ?—

గంగ కీయధికార మెవ రిచ్చినారు?

ఈప్రశ్నకు జవాబు చెప్పుట కచట నెవరున్నారు? ఎవ్వరు లేరు. తర్వాత ఆశ్చర్య మలమికొనుచున్నది.

చిలుకసముద్రాన చేరెఁడు లేవు
పాలసముద్రాన పలమెఁడు లేవు.
విభూతిగుండాన నింకి పోయినవి
మల్లయ్యగుండాన మఱఁగిపోయినవి
సవతులగుండాన చట్టువారినవి.

ఎంతవింత! తెచ్చపాటు గదిరినదక్షునిహృదయమునకు తనకుగల సృష్టికర్తృత్వశక్తి స్ఫురించి యుండవచ్చును. దానితో ఆయనకు కొలఁదిగా పట్టింపుకూడ నెట్టుకొనినట్లు ఉన్నది ?

కావిళ్ళ నంచెపై కాశి పంపింతు
గంగలో ఉదకాల కట్టి తెప్పింతు.

బళే!—ప్రతిజ్ఞ! ఇఁక ఆలస్య మేల జరుగును? అదిగో దక్షుఁడు

కాశికావిడి గట్టి కాశికే పంపె.
గంగకావిడి గట్టి గంగకే పంపె.

మహాప్రయత్నముతో కాశికావళ్లు గంగకావళ్లు అంచెలమీఁద పంపుచున్నాఁడు. ఫలిత మెట్లుండునో అందురా ?—వినుఁడు.

కాశిలో నుదకాలు కళ్ళఁబడవాయె.
గంగలో నుదకాలు కానరావాయె.
అంచెకావిళ్ళన్ని అటుతిరిగివచ్చె.
కొంచెమైనా నీళ్లు కూడకేపోయె.

అయినది. దక్షుని ప్రయత్నము కూడ మఱి ఇఁక గతి యేమి? ఆలోచించినాఁడు దక్షుఁడు. రసవర్గములగు నీళ్లు దొరకనప్పుడు ప్రత్యామ్నాయముగా పాలు పెరుఁగు నేతులు వాడవచ్చు నని తోచింది. ఇవికూడ శుద్ధిహేతువులే కదా ! కనుకనే—

పట్టించు పదివేల పాలకావిళ్లు
నెట్టించు పదివేల నేతికావిళ్లు
పెట్టించు పదివేల పెఱుఁగుకావిళ్లు.

అన్నాఁడు. ఆహా ఏమి రాజసము! ఎంతదిదర్జా! రాజు తలచిన దెబ్బలకు కొదువా?—అన్నట్లు సృష్టికర్తతర్వాత సృష్టికర్తంతటివాఁడు. దక్షుఁడు తలచిన తర్వాత—ఇఁక అడ్డేమున్నది?

పాలకావిళ్లొచ్చి పందిళ్ళ దిగెను,
నేతికావిళ్లొచ్చి నెలవులను దిగెను,
పెరుగుకావిళ్లొచ్చి యరుగులను దిగెను,

ఏమియు లోపము లేకుండ నంతయు సిద్ధమైనది. అప్పుడు గౌరి విజయసూచకములగు చిఱునవ్వులతో—

పాలతో గౌరమ్మ పసపునీళ్లాడె
పెరుగుతో గౌరమ్మ పేరోల లాడె
నేతితో గౌరమ్మ నెఱిజలక మాడె

ముగిసినది స్నానము. ఎట్లయిన నేమి గౌరియే గెల్చి గట్టెక్కిన దనవచ్చును. కాని ఇంతలో సరిపోయిందా. సిరి సంపదల చెలువంపు గర్వముతో నేతులను పాలను పెరుగులను స్నానము చేసినను లేటనీటిస్నానమునందువలె ఆప్యాయనము కల్గునా? కలుగకపోవుటయే గాక మఱొకచిక్కుకూడ వచ్చినది. వినుఁడు కవి అంటున్నాడు

పాల నేతులజిడ్డుపారినవంట
చీమలు దోమలు చెడఁ గుట్టసాగె.

అప్పుడు గౌరి తన పెద్ద ఉపద్రవమే వచ్చినది. ఇది సవతిబాధకంటె మించినది.

తప్పు తెలిసికొనినది. కాని బహిరంగముగా ఒప్పుకొనుటకు అభిమానము అడ్డుకొను చున్నది. కనుక వీరభద్రుని బిలచి తనకు సంభవించిన యీ ఉపద్రవమును శివుని తోఁజెప్పి తొలగించునట్లు చేయుమని వేడుటకు పంపుచున్నది. ఆసందేశ మిదిగో!

పంచవటీదాక పోయిరా కొడుకా
పరమేశ్వరుని మ్రొక్కి ప్రార్థించు కొడుకా!

వీరన్నకు కొంచెము అనుమానం. ఇన్నివల్లే ఈవిధంగా తనతండ్రిని ప్రార్థించినచో మేలు అగును కాని, ఇంతవఱకు వెకిలిగనతర్వాత నిపు డిఁక నుపయోగ మగునన్న ఆశ ఆతనికి లేదు. కాఁబట్టి సంశయాస్పదమైన భావమును సూచించుచు—

పోయి నే తండ్రిని ఏమడుగ నమ్మా?

అన్నాఁడు. పార్వతికి [గౌరికి] వీరభద్రుని ఆలోచనము కనిపెట్టునంతటి నెమ్మది యేదీ?—ఆమె ధోరణి ఆమెదే. అనినదికదా!—

అయిదుదినములనుండి స్నానమే లేదు,
ఆఱుదినములనుండి శివపూజలేదు
శివపూజ మాతల్లి చేసికోలేదు
ఉదకాలజాడలు కానరా వాయె
ఉదకాలజాడలు మిమ్మడుగు మనెను

అని చెప్పుమనినది. సరియే యని వీరభద్రుఁడు—

కొమరొప్ప వీరన్న గునుకనడకలతో
గుజ్జుమామిడి దాటి గులివెంద దాటి
బల్లెంబు శూలంబు పట్టి యిరుకేల
రాక్షసుల మర్దించు రాణ నొప్పారి
వెళ్లెను వీరన్న తండ్రి మేడలకు

వెళ్లినాఁడు. శివుఁడు ఇది యంతయు నెఱింగియున్నను చమత్కారముగా ప్రేమ ఉట్టిపడునట్లు చేరఁబిలుచుచు—

ఎన్నఁడు నామేడ ఎఱుఁగవే తండ్రీ!
యేమిపని కొస్తివో ఏమొ వీరన్నా!
కుశలమా మీతల్లి గుణవంతురాలు!
నీ మంచి గుణములనే చెప్పుచుండు.

అని ప్రశ్నించినాఁడు. శివుని యీ కుశల ప్రశ్నలో "మీతల్లి గుణవంతురాలు"— అనుమాట మనము మఱువరానిది. వీరభద్రుఁడు చెప్పుచున్నాఁడు—

శరణార్థి శరణార్థి శరణార్థి నయ్య!
శరణార్థి మాతల్లి శరణు మహాదేవా!
అమ్మ బంపఁగ వస్తి నయ్య యవధారు
క్రమ్మె యాపద మమ్ము కరుణించు దేవ!
నీరాణి మాతల్లి నేటికి దేవ
ఐదుదినములనుండి స్నానమ్ము లేదు,
. ఆఱుదినములనుండి శివపూజ లేదు
శివపూజ లేనిదే చేకొనదు గంగ
ఉదకాలజాడలు కానరా వాయె

వీరన్నమనవి విన్నాఁడు శివుఁడు. కొంచెముగా కోపమున మోము కెంపెక్కించినట్లే ఉన్నది. అయినా కార్యవాది కావున—

ఏప్రొద్దు గంగతో ఎదురువాదమ్ము
ఏర్పడ నాఁడు ఆయిల్లాలు తండ్రీ!
కూడ దని చెప్పిన కోపించుఁగాని,
వీడకెల్లప్పుడు విసవిస రోసలు
ఏప్రొద్దు సమముగా ఎదురువాదమ్మె.
కూడదని చెప్పుమీ గౌరితో నీవు.
ఈప్రొద్దు గంగకు నెమ్మి మ్రొక్కు మను
గంగ సప్తమతమైన గన నుదక మబ్బు
నదు లన్ని నిధులుగా పొదలంగఁ గలవు
స్నానపానమ్ములు సకలజపములును
నీకుంటె నెఱవేరు నిజము! వీరన్న
మీతల్లి స్నానాల మేలందవచ్చు
కలసి మెలసీ ఎంతో వెలయంగవచ్చు.

శివశరణు...శరణు
హరశరణు...శరణు.

అని అంటాడు. అప్పు డీసంగతి మఱలి వచ్చి గౌరితో వీరన్న చెప్పివేసినాఁడు. గౌరికి ఈమాటలు వినగానే మఱల అఱికాలిమంట నెత్తి కెక్కినది. కాని ఏమి చేయుటకును తోఁచకున్నది. పైఁగా వీరభద్రుఁడు మఱికొంచెము కారణమైనాఁడు కూడాను. అయినను గౌరి ఊరుకొనలేదు—ఏదో అనుచున్నది. విందురా!

ఆయమ్మ ఎక్కువేమి? నా తక్కువేమి?
పుట్టింప గిట్టింప శివుఁడు తా కర్త
ఆయమ్మ పోయఁగా నా బ్రహ్మ కర్త
...నల రక్షింప నల విష్ణు కర్త
అజయ నోచిననోము కాగౌరి కర్త

అని హెచ్చులెగ్గలను సృష్టికార్యములలో గల వివిధపరిస్థితులలోను లభించు కర్తృత్వాదులను తడవినది. ఇందులో చిత్రమేమంటే—ప్రపంచములోఁ గలత్రిమూర్తులూ తానూ మాత్రమే అఘటన ఘటనాకర్తలఁట!—తనను అత్రిమూర్తులతో సాటి పెట్టుకొన్నది. కాని తనసవతి గంగకు చివఱకు ఏచిన్నకర్తృత్వాన్నికూడ కట్టఁబెట్ట నొప్పుకొనక పోవుటేగాక ఆమెపేరైనను ఎత్తలేదు. అప్పుడు వీరన్న కొంచెము నోరు చేసికొనక తప్పినదికాదు. అతఁడు—

ఆనీళ్ల జాడలకు గంగ తాఁ గర్త.

అన్నాఁడు. అంతతో నూరకున్నాఁడా? లేదు.

ఏప్రొద్దు గంగతో ఎదురువాదమ్ము
లేర్పడ నాఁడును యెపుడు తా గౌరి
కూడ దని చెప్పుమీ గౌరితో నీవు
ఈప్రొద్దు గంగకు నెమ్మి మ్రొక్కు మను
గంగ సప్తమత యైన గన నుదక మబ్బు
నదులన్ని నిధులుగా బొదలంగఁ గలవు
స్నానపానమ్ములు సకలజపములును
నీకున్న నెఱవేరు నిజ మిది సుమ్మ
అని చెప్పుమనె తండ్రి అమ్మతో నీవు!
జని వేడుమీ గంగ సందేహ మేల?

గౌరికి కూడ ఇది కొంచెము యుక్త మనిపించింది. కాని తనంత తానై పోయినచో అలుసు అగునేమో!—కనుకనే ఆమె

కంటను నీరుంచి కటకటపడుచు
నీచురాలిని వేడ నెటుపోదు కొడుక
పోయిన మనతోడ పాత్తేల నేయు
జాలాకిదానిని సరిచేయు టెట్లు?
ఇవి కానిమాటలు ఇఁక నొకటి వినుము
నిను ముద్దుగాఁ జూచు నెమ్మి తా గంగ
నీవు పోయిన, పని నిశ్చయ మగును,
పోయిరా వేగమే పుత్త్రి వీరన్న—

అని కొడుకును మెల్లఁగా పంపింది. అప్పుడు—

వెళ్లెనే వీరన్న గంగవాడలకు

గంగ యీసంగతి కనిపెట్టినది. అమితవాత్సల్యము కలదానివలె ఎదురుగావచ్చి అనుచున్నది—

ఎన్నఁడు నావాడ లెఱుఁగవు తండ్రీ!
ఎన్నఁడు నామేడ లెఱుఁగవే తండ్రీ!
యేమి పనికొస్తివో యేర్పడఁ జెపుమా.

సరే!—ఇఁక వీరభద్రుఁడు మామూలుధోరణితో—

అని పల్కె వీరన్న యనెను గంగతో
అయిదుదినములనుండి స్నానంబు లేదు
ఆఱునోజులనుండి శివపూజలేదు
అమ్మ ఉపవాసాల అలమటించెడిని
శివపూజ మాతల్లి చేసికో లేదు
ఉదకాలజాడలు కానరా వయ్యె
ఉదకాలజాడలు మి మ్మడుగు మనెను
ఉదకాలజాడల ఎఱిఁగింపు తల్లీ!

అన్నాఁడు. గంగకు ఉప్పొంగినంత సంతోషం. కాని బయటబడలేదు. చిన్న మల్లెగుల్లాలు పెట్టఁదలచుకొని—

మీ యమ్మ తక్కువేమి నా యొక్కువేమి
ఆమెకన్న ఘనము అజయ నా కన్నె?
ఇంతకూ నే నేమి ఎఱుఁగను తండ్రీ!
ఉదకాలజాడలు నే నెఱుఁగ ననెను.

వీరభద్రునికి గోపముచే మొగము జేవురించినది. కొంచెము పడుచుతనపు వాగా ట్యము కూడా తోడ్కొని ముందుకు వచ్చింది. ఆయన అనుచున్నాఁడు గదా!

ఆమాటకు వీరన్న ఆగ్రహపడెను
తల పగులకొట్టెను తన్ని వేసేను
సాగిలేసేను చంపివేసేను
తప్పడు యముకును వప్పగించేను
నర్దులో యమబాధ చాల చేసేను

అన్నాఁడు. తలపగులకొట్టుదును తన్నెదను చంపెదను—అని ఇత్యాదిగా బెద రింపసాగినాఁడు. ఈ బెదరింపులకు అదరతుందా? గంగ. ఆమె కిట్టివి లచ్చోపల చ్చలు!—ఇక ఆమె జవాబు వినండి.

వద్దువద్దు వీరన్న వాదు లాడంగ
మంత్రాల మామిళ్లు మఱి గాలు నయ్యా?
పోవోయి వీరన్న పొంకాలు మాని

వీరన్న పని ముగిసింది. ఆ బింకాలు గుట్టుమట్టముగా దాఁచుకొని

వచ్చెనే వీరన్న తల్లి మేడలకు.

గౌరి ఆమితవగు నాత్రముతో, ఎదురుగుబోయి అడిగినది.

ఏమని చెప్పెరా యేమి గంగమ్మ?

వీరభద్రుఁడు వినిపించుచున్నాఁడు—గంగతోడిసంభాషణము—

మీయమ్మ తక్కువేమి నాయొక్కువేమి?
ఆమె కన్నా ఘనత అజయ నా కన్నె?
ఇంతకూ తానేమి యెఱుఁగ దట తల్లీ!
ఉదకాలజాడలు తా నెఱుఁగ ననెను.

గౌరికి నుండెలు నుఖేలు మన్నవి——ఆమె యెల్లైన నేమి——

ఆమాట విని ఉమాదేవి దిగులొంది
ఎందు కీ వైరమ్ము ఏమి పాపమ్ము?
శివునకు చిన్నారి శిరసెక్కె గనుక
ముచ్చట్ల మురియుచు ముదిత కూర్చుంది,
అనియిట్లు తలపోసి తా పయన మాయె.
ముందఱ వీరన్న వెనుక గణపన్న
ఇద్దఱ నడుమను గౌరి తా నడచె.

బయలు దేఱింది. ఆహా! ఇప్పటిగౌరికూపును వ్రాయుటకు ఎన్నిచిత్తరువు లయినను చాలవు కదా! నివురుగప్పిననిప్పులాగున అభిమానాభిమానములను ఒకవైపు మా టుకొని, పాప మెట్టెట్లో గంగమేడలకు చేరవచ్చుచున్నది. గంగకూడ ఈవిషయ మును గుర్తించి, తగినట్లు పరాభవము చేసి మితిమీఱిన ఆయభిమానపు గొప్పను దతిమివేయఁ దలఁచినదేకదా! అందులకై ఆమెముందుగానే——

గౌరప్పరాకలను గంగప్ప జూచి
వంచన చేయఁగా వన రని తలఁచె
పచ్చిచేపలు దెచ్చి పందిళ్లు వేసె
ఎండుచేపల పూల గుండ్లు చేయించె
పసరుచేపల పెద్ద పంచాది గట్టె
కప్పజచ్చిన నీళ్ల కళ్లాపి చల్లె
చేపజచ్చిననీళ్ల చేయించె శుద్ధి

ఈరీతిగా ఏర్పాట్లు చేసింది. కులాభిమానమును కూలద్రోయుట కింతకంటె ఎక్కు డేర్పాట్లు కావలెనా? ఎట్లో ప్రాణాలు బిగబట్టుకొని గౌరి గంగమేడలో ప్రవే శించినది. ఇక్కడినుండి గంగాగౌరుల సంవాదము బహు సరసముగా సాగు చున్నది. కనుక ఇకమేము ఆభావములవివరించుమాటలు వ్రాయుట మాని చదువరులు స్వయముగా తమంత తామే ఆసరసమును ఆలకించుటకై ఆబంతులను ఉపాయన మిచ్చెదము, చిత్తగింపుడు.

గంగ:—(ఆశ్చర్యమును నటించుచు)
ఎన్నఁడు నామేడ లెఱుఁగవే చెల్లీ!
ఏమి పని కొస్తివే ఇంతి! గౌరప్పా!

గౌరి:—ఆమాటలు విని హరురాణి చెప్పె
అయిదుదినములబట్టి స్నానంబు లేదు
ఆఱుదినములబట్టి శివపూజ లేదు
శివపూజ సుంతైన చేసితో లేదు
ఉదకాలజాడలు కానరా వాయె
ఉదకాలజాడలు చెప్పు గంగప్ప.

గంగ:—(నిర్దోషివలె—పెదవి విఱుచుచు)
నాయొక్కు వే మమ్మ నీతక్కు వేమి?
నీకన్న ఘనురాల నే నెట్లు లగుదు?
ఇంతకును నే నేమి ఎఱుఁగనే తల్లీ
ఉదకాల జాడలు నే నెఱుఁగ ననెను.

గౌరి:—(దీనముగా బ్రతిమాలుచు)
నాకొడుకు వీరన్నను నీ కిత్తు గానీ,
ఉదకాల జాడలు చెప్పవే గంగా?

గంగ:—(లేని ప్రేమ నభినయించుచు)
నీకొడుకు వీరన్న నాకొడుకు గాఁడా?
ఉదకాల జాడలు ఎఱుఁగనే చెల్లీ!

గౌరి:—నాకోడలు బుద్ధిని నీకిత్తు గానీ
ఉదకాలజాడలు చెప్పవే గంగా!

గంగ:—నీకోడలు బుద్ధియును నాకోడలు గాదా
ఉదకాల జాడలు నే నెఱుఁగ తల్లీ!

ఈవిధముగానే చీరలు రవికెలు సొమ్ములు—ఇట్లు ఒక్కొక్కదానిని ఇచ్చెద నని గౌరి బ్రతిమాలుకొనుచు, నీటిజాడలు చెప్పుమనుటయును, గంగ నీవన్నియు నావే. మనకు భేదము లేదు. కాని తనకు నీటిజాడలు తెలియనే తెలియ వని బదులు చెప్పుటయును జరుగును. [ఇచ్చట పాటపాడుకొనెడి స్త్రీలు అచ్చము చీరలు రవి కెలు సొమ్ములు మాత్రమే గాకుండా—తమకు తెలిసిన మంచిమంచి వస్తువుల నన్నింటినీ పాటలో కలిపి పాడుచుందురు. గనుక ఇక్కడ వారివారి తెలివితేట లనుబట్టి పాటయొక్క చరణములు పెఱుఁగుచుండుటయును, తఱుఁగుచుండుట యును కూడ సంభవించుచుండును.] కనుక ఆచరణములు చదువరులకే వదలివైచి, చివఱిసంభాషణ అందుకొనెదము.

గౌరి—నా ఒక్కశివుని నీకిత్తు గాని
ఉదకాల జాడలు చెప్పవే అప్పా.

గంగ:—(కలఁగిన చిత్తములో)
ఇప్పు డనినమాట తప్పకే చెల్లీ
తప్పకుంటే నీకు గుప్పి వేసెదను.

గౌరి:—తప్పనే ఈమాట తప్ప గంగమ్మా
గంగ:—ఇందుకు సాక్షులు ఎవరో? చెప్పవే.
గౌరి:—భూమి ఆకాశాలు పొంకముగ సాక్షి
మద్దులు మాకేళ్లు మఱిమఱి సాక్షి
సూర్యచంద్రులు మనకు సొంపుగా సాక్షి
వాడవాడల దేవవర్గముల్ సాక్షి

గంగ:—(ఆనందములో)
అనఁగ సంతోషించి అపుడు గంగప్ప
గుప్పుగుప్పున గంగ యుప్పొంగ సాగె
చెఱువులు గుంటలు చెలువొప్ప నిండె
యేరులన్నీ చాల ఏకమై నిండె

అప్పుడు గౌరి మహానందముతో స్నానము చేసి మట్టు బాపుకొనును. కాని అవ మానజనితమౌ సాన్ని దహింప రోజుచు—

గౌరి స్నానముఁజేసి శివపూజ చేసి
శివుఁడొచ్చురాకలు చేరి వీక్షించి
గడియ గ్రక్కునఁబెట్టె గౌరమ్మ అపుడు.

నవపుల నిద్దఱను చక్కఁజేయుటకు ఇప్పటికి తీరినది శివునకు. కాని ఆయన తీరా వచ్చుసరికి గౌరి తలుపుమూసికొన్నది. ఎందుచేతనో?—గంగ వచ్చి ఆయనలో నన్నదికదా!

భోరున తలుపెయ్య మేలయ్యె నాకు,
భూమి ఆకాశాలు పొసంగంగా సాక్షి
మద్దులు మారేళ్లు మఱి మఱి సాక్షి
సూర్యచంద్రులుకూడ సొంపుగా సాక్షి
వాడవాడల దేవవర్గముల్ సాక్షి
ఈశ్వరా! గాలి నిన్నిచ్చెను నాకు.

పరమేశ్వరుఁడు కూడ చతురుఁడిలాగున నన్నాఁడు. కావున్న రెండుకత్తుల (కత్తెర) కాపుర మెట్లు చేయఁగలఁడు? ఆయన అప్పుడు ఏంచేశాడంటారా? చదవండి. దీనిలో ఈపాటకూడ సరి.

అని చెప్ప శివుఁ డపుడు హరాన పొంగి
అతివ లిద్దఱఁ బిలిచి అంతయు నడిగి
సాక్ష్యాలు పుచ్చుకొని సతుల నిద్దఱిని
కలహంబు వద్దింక కలకంఠులార!
ఐక్యాన నొప్పుడీ అంగనలార!
ఐక్యమే ఎంచిన ఆనందజలధి—
అని చెప్ప నప్పుడా యతివలు తాము
సఖ్యాన ప్రేమల సరసవచనముల
పొందికగాఁ గూడి పొలు పెసగుచుండ్రి.

చదువరులారా!—ఇది గాలిగర్వభంగపు కథ. ఇందుగల మంచి నాబుద్ధికి తోఁచినంత మీకు ఎంచి చూపితిని. కనుక పాటలు వాఙ్మయమగునా? అనిత్రోసివేయక గాజుపెంకులును రత్నములు నొకే గనిలో పుట్టుటను గమనించి గ్రంథస్థము గాక చివికి జీర్ణించిపోవుచున్న యీవాఙ్మయము నుద్ధరించి అందలి రసవాహినినాంధ్రలోకము నోలలాడించుటకై మీరు ప్రయత్నింతు రను నమ్మకముతో దిగ్దర్శకముగా దీనిని వ్రాసితిని. కనుక చిత్తగింప వేఁడెదను.

---

# వింశతిశతాబ్దపుటాంధ్రకవితా లావణ్యము

సాహిత్యసరస్వతి డి. యస్. శర్మ మహాశయులవారు.

సీ. కర్మస్వరూపుఁడా కాలమహావ్యక్తి
వేయిసారుల నిన్నుఁ బిలుచువేళ
వేకువ చల్లన వెలసి తెమ్మెర జోగి,
వెదకి యంతట నిన్నుఁ బిలుచువేళ
నిశ్చలంపు సమాధిని నిశాతపస్విని
నిలిచి యోంకృతి నిన్నుఁ బిలుచువేళ
తుదిలేని వనధి నీ తుదిమొద లెఱుఁగక
విధిగ ఘోషించి నిన్ బిలుచువేళ
జననమరణ పరంపర చక్రలీల
బ్రతుకుగాఁ గల యీ సృష్టి బహుకుటుంబి
వేల్పులకు వేల్ప! నిన్ భక్తిఁ బిలుచువేళ
నేల ప్రత్యుత్తరం బీవ దేమి? తండ్రి?

సీ. ఒకసోగతీఁగయం దూఁగుచు గోకిల
నీపేరె జగముల నింపుచుండ
పూచిక ముండ్లలోఁ బుజ్జని మొగుడు బం
గరుఁ బిచ్చుక త్వదీయ కథల చెప్ప
వఱువాత శాత్తమ్మి వ్రాలి యందు ముసుంగు
నళికాంత నీదు చోద్యములె చూప
ముఱుగుడు గవిలోనఁ బుట్టు మార్జాలిక
పునుఁగుఁదావుల నీదు ఘనతఁ జాట
పడిన గింజలఁ బారులు విడిసి తెచ్చి
కొక్కుపాల్సేయు చీమ నీ టక్కుఁ దెలుపఁ
దెలిసి దాసుఁడు ప్రభు! నిన్నుఁ బిలుచుచుండ
నేల ప్రత్యుత్తరం బీవదేమి తండ్రి!

ఉ. ఇట్టులమైన సోయగము లెత్తెడు పూవుల నోళ్లు విప్పి యం
దుట్టిన తావు లూని, వలినొందుచు గార్కొను నీటి తాల్పులన్
బిట్టదలించి, పొల్చి మముఁ బెంచెడు నీతుదిలేని చాగ మె
ప్పట్టున నుగ్గడింతు? బలె వాకొన నీ వశివీవె తెమ్మెరా!

ఉ. ఎమ్మెనలారఁ గొమ్మలు రహిం దిరు తిండికిఁ బిల్వ నొప్పికొం
చిమ్మున నేఁగి యాకెలన హెచ్చెడు దావుల గెల్లువాటి యా
కొమ్మల దండలం దలరి గొంతుకబంటిగ మోవి తేనియల్
నెమ్మదిఁగ్రోలి క్రాలుదువు నివ్వెర నీ చెయిదంబు తెమ్మెరా!

ఉ. మోము చెమర్చువాఁ డొడలు పొక్కినవాఁడును మందు వేసవిన్
సామయి యున్నవాఁడు చెఱసాలను గుయ్యిడువాఁడు నందఱున్
నీ మెరకంపు రాకఁ గని నిండఁ దనించుచు మ్రొక్కుచుండ్రు నీ
వే మణివంపు మూర్తమున నింతకుఁ బుట్టితొ యారఁ తెమ్మెరా!

# మరణానంతరము

శ్రీయుత చల్లా శేషగిరిరావు పంతులుగారు, ఆంధ్రపత్రికా సంపాదకులు.

## మరణ మన నేమి?

మరణానంతరము జీవుడు నిలిచియుండునా, లేక దేహనాశనముతో జీవుని నాశనముకూడ గలుగునా యను ప్రశ్న, మానవులను అనాదికాలమునుండియు కలవరపెట్టుచునే యున్నది. కాని ఇప్పటికన్న, పూర్వకాలమున ప్రజలకు మరణానంతర జీవితముగూర్చి ఎక్కువ స్థిరమగు నభిప్రాయము లుండెడివని తోచును. ఈ దేహములోనే సర్వసుఖములును సర్వదుఃఖములును అంతరించుననుభ్రాంతి, ఆకాలమున ప్రబలియుండలేదు. స్వల్పసంఖ్యాకు లగుచార్వాకు లున్నను, మిగిలినవారందరును జీవుని నిత్యత్వమును నమ్ముచుండిరి. భగవంతుని యునికిగూర్చి ఇదమిత్థమని చెప్పని బౌద్ధులుగూడ, పునర్జన్మమునందు నమ్మకముగలవారై యుండిరి. బుద్ధుడప్పుడప్పు డవతరించుచుండునని తెలుపుచుండిరి. పునర్జన్మమును, కర్మము, హిందూబౌద్ధమతములకు సామాన్యమయిన ఆధారములుగ నుండెను. ఈరెంటియందును నమ్మకము లేనివారలకును, హిందువులకర్మలును ఆచారములును వెట్టిగదోచుటకింత గాదు. ఉత్తరక్రియలు, శ్రాద్ధాదులు, తర్పణములు మున్నగుకర్మలన్నియు, మరణానంతరము జీవుడు నిలిచియుండుననువిశ్వాసముపై నాధారపడియున్నవి. ఇహలోకజీవితము ఎంతసత్యమో, పరలోకజీవితముగూడ హిందువున కంతసత్యమే. మానవసేవ ఎంతయవసరమో, పితృదేవతలసేవయు అంత యవసరమే. చనిపోయినవారేరూపముదాల్తురు, ఏయేలోకములలో సంచరింతురు, మరల నెటులయిహలోకమున జన్మింతురు మున్నగు ప్రశ్నలకు ప్రాచీనగ్రంథములు తగిన సమాధాన మిచ్చుచున్నవి. హిందువులందరకును పరమప్రమాణమగు భగవద్గీత యిటుల దెలుపుచున్నది.

శ్లో. “వాసాంసి జీర్ణాని యథావిహాయ  
నవాని గృహ్ణాతి నరోపరాణి  
తథా శరీరాణి విహాయజీర్ణా  
న్యన్యాని సంయాతి నవాని దేహీ.”

“జీర్ణమయిన వస్త్రములను మానవుడు విసర్జించి, నూతనవస్త్రముల నెటుల ధరించునో, జీర్ణమయిన శరీరములను జీవుడు విసర్జించి నూతనశరీరముల నటులనే పొందుచుండును.”

శ్లో. అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్,  
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి.

“ఈ ప్రపంచమునంతను నిండియున్న ఆత్మకు నాశనము లేదని తెలిసికొనుము. అవ్యయమగు నీయాత్మను నాశనము చేయగలిగిన దేదియు లేదు.”

శరీరము అనిత్యము, ఆత్మ నిత్యమనుసిద్ధాంతమును పైభగవద్గీతావచనములు బోధించుచున్నవి. ఇట్టి సిద్ధాంతము హిందువుల ప్రమాణగ్రంథము లన్నిటిలో సామాన్యముగ గనిపించును. క్రైస్తవమతము, పునర్జన్మనుగూర్చి ప్రతిపాదింపకున్నను, జీవుడు మరణానంతరము నిలిచియుండుననియు, తీర్పుగోరున భగవంతుని ఎదుటకు వచ్చుననియు స్పష్టపరచెను. దయ్యములగూర్చిన నమ్మకము, యూదులలో వ్యాపించియుండెనని, బైబిలుగ్రంథమునందు పెక్కునిదర్శనములు గనిపించును. ఏసుక్రీస్తువారు,దయ్యములబట్టిన పలువురకు వానిబాధను తొలగించిరనియు, దయ్యములు బాధితుల శరీరములను విడువలేక ఎంతోకష్టముమీద వదలిపోయెననియు, వారిచరిత్రయందు వివరింపబడెను. ఎట్టివిత్తును నాటిన, అట్టిఫలమే గలుగును వాక్యములందు కర్మసిద్ధాంతము గన్పట్టును. “నేనును నాతండ్రియు ఒక్కరమే” అను వాక్యములందు అద్వైతప్రతిపాదనము గోచరించును. మరణానంతరము జీవుడు నిలిచియుండుననియు, పరమేశ్వరుడు అవసరమయినపుడెల్ల మానవరూపము దాల్చు ననునమ్మకము ప్రాచీనకాలమున తూర్పుప్రపంచమునందు సర్వసామాన్యముగ వ్యాపించియుండెనని తలంప నవకాశము గలదు.

## ఆధునికయుగము

ఏకారణముచే నయిననేమి, ఆధునికయుగమున పరలోకరహస్యములపట్ల విశ్వాసము తగ్గినది. మానవులు తమ మతగ్రంథములపట్ల కొంత గౌరవము జూపుచున్నను, నాచరణలో వాని ననుసరించుటకు పట్టుదలనూపుటలేదు. మరణానంతరవిషయమై యోచింపబూనుకొనుటలేదు. ఈవిషయమై కొందరకు గలవిశ్వాసములు, మూఢవిశ్వాసములని గేలిసేయబడుచున్నవి. కాని, పాశ్చాత్యప్రపంచమునందే, మరణానంతరవిషయమై అన్వేషణ ప్రారంభమయినది. ఛాయాపటములద్వారా, భూతావేశము గలవారిద్వారా, చనిపోయినవారిజీవులు నిలిచియుండురని రుజువు చేయబడుచున్నది. ప్రకృతిశాస్త్రజ్ఞులకు గూడ, యీవిషయమై నమ్మకమేర్పడుచున్నది. ఆధ్యాత్మిక సంఘములు వట్టిబూటకము లనునమ్మకము తొలగిపోవుచున్నది. ఇట్టి విషయములలో సత్యమిమిడియున్నదని పలువురు నమ్ముచున్నారు. వారివారి యనుభవములను గ్రంథరూపమున బ్రచురించుచున్నారు. పాశ్చాత్యులచే కనిపెట్టబడిన సత్యములు, విద్యాధికు లగుభారతీయులకు పరమప్రమాణములగుటచే, వీరుగూడ తమ అవిశ్వాసమును విడిచిపెట్టుచున్నారు. రావణవధానంతరము, దశరథుడు దేవలోకమునుండి భూలోకమున కరుదెంచి, తమ ప్రియపుత్రులగు శ్రీరాముని కౌగిలించుకొని వనవాసక్లేశములను బాసినందులకు సంతసించినటుల శ్రీరామాయణమునందు గలదు. ఇటులనే పితృదేవతలు దర్శనమిచ్చి తర్పణములను స్వీకరించిన నిదర్శనములు ప్రాచీనగ్రంథములలో గలవు. ఇట్టి నిదర్శనములు అసత్యములనియు, కల్పితకథలనియు, నిరాకరించుటకు వీలు లేదని, ప్రస్తుత పరిశోధనలు తెలుపుచున్నవి. కీ॥ శే॥ రిశేషులను స్టెడుగారు, తమపుత్రునితో మాట్లాడుచుంటిరి. (rest: ) ముచ్చటించినటుల, వారు ప్రచురించిరి. సర్ ఆలీవర్ లాడ్జి అను ప్రసిద్ధప్రకృతిశాస్త్రజ్ఞులు, చనిపోయినవారితో తాము ప్రసంగించినరీతిని వివరించిరి. సర్. ఆర్థరు కానన్ డాయిలుగారు, అనేకనిదర్శనములను తమగ్రంథమునందు వివరించిరి. తియసాఫికల్ సంఘప్రముఖులు, సూక్ష్మశరీరులతో తరుచుగ నెటుల సంప్రతించుచుందురో, వారిగ్రంథములలో కాననగును. వీరి సిద్ధాంతములకును మూలాధారము, సూక్ష్మశరీరులపట్ల గలవిశ్వాసమే. ఈరీతిని వెలువడుచున్న నిదర్శనములన్నిటిని కట్టుకథలనిగాని, భ్రాంతిమూలములనిగాని త్రోసివేయ వీలులేదు. కాని, యీ యనుభవములన్నియు వ్యక్తిగతములగుటచే, రుజువుచేసిచూపించుట కష్టము. బల్లలద్వారాను, వ్రాతమూలమునను, పరలోకవాసులతో సంభాషించుటకు సాధ్యమయినను, ఇట్టి సాధనములను అందరు చూచుచుండగ అవలంబింప వీలయినను, వీనికిగూడ నరములకదలికయే కారణముగాని భూతావేశము గాదని నిరసించుటకు వీలగును. అందుచే ఎవరికి వారీవిషయములను పరీక్షించి తెలిసికొనుట లాభకరము. మోసగాండ్రు పరులను వంచించుట కిట్టిమార్గముల నవలంబించి, అసత్యములను బలుకుట కవకాశము లేకపోలేదు. ఇట్టి అవకాశ ముండుటచేతనే, ఎవరిమాటలను విశ్వసింపవలయునో, ఎవరిమాటలను విశ్వసింప వీలులేదో కనుగొనుట కష్టమగుచున్నది. సోదెచెప్పువారు, బుడబుడక్కలవారు, దయ్యపుమంత్రగాండ్రు మున్నగువారుగూడ కొంతయావేశాపరులై, సూక్ష్మజీవుల సందర్భములను గ్రహింపగలరని యూహింపవచ్చును. కాని వీరందరును ధనార్జనమునే ప్రధానవృత్తిగ బెట్టుకొనుటచే, సత్యమును వచించెదరనిగాని, బూటకపు సంగతులను వివరింపదనిగాని చెప్ప వీలులేదు.

## నా యనుభవము.

గ్రంథస్థమయినవిషయములనుగాని, ఇతరుల యనుభవములనుగాని యీ వ్యాసమునందు పేర్కొనుటకు నే బూనుకొనలేదు. నాకు దెలిసినవిషయములను, నే నూహించిన సంగతులను మాత్రమే యిట కొలదిగ వివరించెదను. 1921-వ సంవత్సరములో ఆంధ్రదేశమున పెక్కు ప్రదేశములలో చనిపోయినవారితో సంప్రతించు చున్నా రని విని, అట్టిసంగతు లెంతవరకు యథార్థములో కనుగొన యత్నించితిని. మూడుకాళ్ల బల్లద్వారా, కాగితముపై వ్రాతద్వారా, సూక్ష్మశరీరులతో సంప్రతింప వీలుగలదని కనుగొంటిని. గుంటూరులో నొక మిత్రుడీవిషయమున సహాయము చేసెను. ఇట్టి ప్రయత్నములలో మనయూహాతే వ్రాతలలోను, బల్లలద్వారా తెలియుసంగతులలోను ప్రతిఫలించు ననువిష

యము కొంతవరకు సత్యమే యయినను, మన మూహింపనివిషయములుగూడ గోచరించుటచేతను, మన యూహలకు భిన్నము లగుసంగతులు తెలియుటచేతను, వీని కసుగుణముగ సందర్భములు తటస్థించుటచేతను, ఇట్టియనుభవములను పూర్తిగ నిరాకరింప వీలులేదని నాకు దోచెను. ఇంతటితో నాయనుభవమాగినచో, పూర్వపు అవిశ్వాసము నన్నావరించెడిదేమో చెప్పజాలను. కాని, ఎట్టి బాహ్యసాధనలతో నిమిత్తము లేకుండనే, నామనస్సుతో, అశరీరులు సంప్రతించుట జరిగెను. తద్ద్వారా ఇదివరకు తిన్నగ దెలియనివిషయములు అనేకములు బాగుగ దెలియవచ్చెను. సందేహములు తీరవచ్చెను. ప్రాచీనగ్రంథములు పూర్వమువలె మూఢవిశ్వాసమూలప్రోక్తని గోచరింపక, సత్యమును ప్రతిపాదించుచున్నటుల తెల్లమయ్యెను. షేక్స్పియరు మహాకవి దెలిపినటుల, మతత్త్వమునందు సూచింపబడని రహస్యము లెన్నియో ఆకాశమునందును భూలోకమునందునుగూడ గలవని గోచరించెను. కాని, యీవిషయమై అన్వేషణ సలుపుటకు నాకు తీరిక గాని, సావకాశముగాని కనిపింపకుండుటచే, విశేషానుభవమును సంపాదించితి నని చెప్పజాలను. సాధ్యాసాధ్యములు కొంతవరకు తెలిసెననిమాత్రము చెప్పగలను. నాయనుభవముల నిట వివరించి చదువరులకు విసువు గలిగింప దలపెట్టలేను. వానినిబట్టి నేను గ్రహించిన విశేషములనుమాత్రము సూక్ష్మముగ వివరించెదను. పరలోకవాసులతో సంప్రతించి, నూతనవిశేషములను గ్రహించుటకు, పరిశుద్ధమగు జీవన మవసరము. మలినమగు జీవనముగలిగినవారి కిట్టి శక్తిగలిగినను, సత్యము దెలియజాలరు. మలినులగు జీవులే, వీరితో ముచ్చటించుచు, కల్మషమగు తలంపులనే ప్రవేశపెట్టుచుందురు. పాపపుటూహలే, వీరిమనముల నావహించును. ఇట్టివారు ఇతరులకు చెడుగుజేయుటకు తలపెట్టుట వింతగాదు. పూర్వకాలమున మహర్షులు, యోగాభ్యాసముచేతను, తపోనిష్ఠచేతను, శమదమాదిసద్గుణసంపత్తిచేతను ఆర్జించిన ఆధ్యాత్మికశక్తులను మానవకళ్యాణమునకై వినియోగించుచుండెడివారు. స్వార్థమును పెంపొందించుకొనుటకై వీరు వీనిని వినియోగింపకుండిరి. ఎన్నడయినను వీరు కామక్రోధాదులకు వశు లయినచో, తపస్సంతయు నిష్ఫలమగుచుండెడిది. ఇందుకొరకు పరితపించి, వీరు తిరిగి ఇంద్రియనిగ్రహము నభ్యసించెడివారు. రాక్షసులుగూడ తపోనిష్ఠచేతను, హఠయోగాదిసాధనలచేతను అనేకశక్తులను సముపార్జించి, వానిని స్వలాభాభివృద్ధికిని, పరపీడనమునకును వినియోగించుటచే, లోకకంటకులయిరి. తుదకు వీరు వినాశము గాంచుచుండిరి. అందుచే, ఆధ్యాత్మికశక్తులను స్వార్థాభివృద్ధికిగాని, పరపీడనమునకుగాని వినియోగింపకుండుట యత్యవసరము. ఇటులచర్చించువారికి సత్యము అద్దమువలె కనిపించును. మహర్షులకు గోచరించిన సత్యములు, పరిశుద్ధహృదయులగు మానవులకుగూడ గోచరించుట కవకాశమెంతేని గలదు. పరలోకవాసులలో నయినను! మంచివారు గలరు, చెడ్డవారును గలరు. చెడ్డవారు చెడుతలంపులను, మంచివారు మంచితలంపులను ప్రేరేపించుచుందురు. అందుచే సూక్ష్మశరీరులు దెలిపినంతమాత్రాన, అదియే పరమసత్యమని భ్రమజెందక, ఎవరిబుద్ధిచేవారు తరచిచూచికొనుట అవసరము. లేనియెడల, అనేకచిత్తభ్రమలకు లోనై, క్లేశము గాంచుట సంభవింపగలదు. ఉత్తమలోకముల బొందునవకాశము తప్పిపోక మానదు. అందుచే ఎట్టిశక్తులు లభించినను అవి సద్వినియోగమయినపుడే వాని ప్రభావము బయల్పడును.

## అశరీరుల శక్తులు.

అశరీరులకు, స్థూలదేహధారులకన్నను ఎక్కువశక్తులు గలవనుట నిశ్చయము. స్థూలప్రపంచమున గల అడ్డంకులు వారిని బాధింపవు. వారు ఎక్కడ కయినను బోగలరు. పంచభూతములు వారి నడ్డగింపవు. దూరశ్రవణము, దూరమననము వారికి సులభసాధ్యములు. గాలిలో, నిప్పులో, నీటిలో, వారు స్వేచ్ఛగ దిరుగగలరు. రాతిగోడలు, వారిప్రవేశము నడ్డగింపవు. ఇంతకన్నను నెక్కువ విషయమేమన, వారు మానవుల మనోవైఖరులను కనిపెట్టగలరు. మన మేమి తలంచుచున్నామో చెప్పగలరు. తమతలంపులను మనలో ప్రవేశపెట్టగలరు. అవి మనతలంపులే యని తలచునటుల భ్రమపెట్టగల్గుదురు. మన మనస్సులను వారు ఎటులబట్టిన నటుల యాడింపగల్గుదురు. వారిముందర మనము నిస్సహాయులమని చెప్పవచ్చును. ఈలోకమున ఎందరో తలవనితలంపుగ కార్యముల నెన్నిటినో చేయుచుందురు. వారియూహలకువారు విరుద్ధముగ ప్రవర్తింపవచ్చును. ఇట్టిసమయములలో అశరీరుల ప్రేరేపణ చాలవరకు గలదని నమ్మవచ్చును. వీనిని దయ్యపుచేష్టలని, మనవారు దెలుపుచుండుట యాచారమయినది. మనోనిశ్చయ మున్నవారలు, ఎట్టిప్రేరేపణనయినను జయింపగలిగినను, సామాన్యులు అట్టి ప్రేరేపణలకు లొంగెదరు. దైవోపాసకులను మాత్రము, ఇతరులు చలింపజేయజాలరు. నా యనుభవమునం దిట్టిసందర్భము లనేకపర్యాయములు గోచరించెను. ముందుజరుగబోవు సంగతులను సూక్ష్మశరీరులు సులభముగ కనిపెట్టగలుగుదురు. మా గృహము నొకమరణము ఫలానిరోజున నిన్నిగంటలకు జరుగునని దెలుపగ, ఆటులే సంభవించెను. సామాన్యపరిస్థితులలో నింతశ్రీఘ్రముగ మరణము జరుగునని తలంపలేకపోయెను. ఆకస్మికముగ నొకరికి జబ్బుచేసెనని అశరీరి తెలుపగ, నేనావిషయమును నమ్మకపోతిని. కాని నేను ఇంటికిచేరకముందే, నాకొరకొకరు వ్యాధివార్తదెలుపుటకు సైకిలుపై పరుగెత్తికొని వచ్చుచుండిరి. ఇటులనే అనేకసమయములలో, జరుగవనువిషయములు జరుగలేదు. జరిగితీరునని చెప్పిన విషయములు జరిగెను. ఇట్టిఫలితము, పలుమారులు నాయూహకు భిన్నముగ పరిణమించి యాశ్చర్యమును గలిగించెను. అయినను, పరలోకవాసులు దెలుపు జోస్యమంతయు సత్యమని చెప్పుటకుగూడ వీలులేదు. వారిలోగూడ కొందరు మోసపుచ్చువారుందురు. కొందరు తమకు తెలియనిసంగతులను తెలిసినటులనటించెదరు. అందుచే, ఎవ్వరయినను తమ హేతుజ్ఞానమును విడనాడి, అంధప్రాయముగ విశ్వసించుట పాడిగాదు. ఒక్కవిషయమునుమాత్రము రూఢిగ జెప్పవచ్చును. స్థూలదేహులగు మనకన్న, సూక్ష్మదేహులగువారు ఎక్కుడు త్వరితముగ భావిస్థితిని గ్రహింపగలరనియు, నెక్కుచోటుల జరుగుచున్నవిషయములను మనకన్న త్వరితముగ గ్రహింపగలరనియు, వారికి మనకన్న నెక్కుడు మానసికశక్తులు కలవనియు నిస్సందేహముగ జెప్పవచ్చును. ఇంకొక సందర్భమునుగూర్చి విచారింపవలయును. పరలోకవాసు లయినను మనకు కొలదిగ నయినను తెలిసినవిషయములనే బాగుగ గ్రహించునటుల జేయగల్గుదురు గాని, మన కసలే దెలియనివిషయములను బోధింపజాలరు. మన మనఃపరిమితి ననుసరించియే, వారు బోధింప గల్గుదురు. గణితము బొత్తుగ దెలియనివారికి, ఆశాస్త్రమును బోధించుట వారికి కష్టమగును. కొంచెము వేదాంతశాస్త్రము దెలిసినవారికి, ఆవిషయమై బుద్ధివికాసము గలిగించుటకు వారు తోడ్పడగలరు. ఇటులనే కవిత్వము తెలిసినవారిని కవిత్వమునందు ప్రవీణుల గావింపగలరు. గానవిద్యావంతులను ఇంకను ఎక్కువ ప్రజ్ఞగలవారినిగ నొనర్పగలరు. పూర్వకవుల నేకులు, తమకు వాగ్దేవీప్రసన్న మయ్యెననియు, తాము కవిత్వమును ధారగ చెప్పగల్గితి మనియు, తమప్రబంధములలో వ్రాసికొనిరి. అట్టివ్రాతలు అసత్యములనియు, కల్పితములనియు ఆధునిక విమర్శకులు దెలుపసాగిరి గాని, పలువురుకవులు సత్యమునే పలికిరని నానమ్మకము. ఈవిషయమై మోసముల బలికినవారున్నను, వారిసంఖ్య లల్పమని, నేదలంతును. ఆధ్యాత్మిక ప్రపంచరహస్యములను తరచినకొలదిని గోచరమగుచుండును. కాని, ధాతికభోగాభిలాషయే ముఖ్యమని భావించువారికి, ఈవిషయము గోచరము కాజాలదు. ఈవిషయమై ఏమాత్రముజ్ఞానమున్నను, మరణానంతరము జీవు లిక్కడికన్న స్వేచ్ఛగ నుందురనియు, వారిజ్ఞానము విస్తరించుననియు, వారి కపరిమితశక్తులు లభించుననియు, నిర్బంధములతో నిండియున్నయీలోకమునుండి ఎక్కువ స్వేచ్ఛావకాశములున్న లోకమునకు బోయెదరనియు నమ్మవచ్చును. అక్కడ గల యమూల్యావకాశములనుగూడ జారవిడుచువారు దురదృష్టులని చెప్పవలయును. మానవుడు, ఈజీవితమునందే సత్కర్మాచరణమునకు బూని, కామక్రోధాదిదుర్గుణములను విడనాడి, త్యాగమార్గము నవలంబించి, స్వార్థరహితబుద్ధితో ప్రవర్తించెడల, పరలోకమునందు సద్గతినొందగలడు. అట్టివారు, ఇహలోకమున నివసించుచున్నవారికి మేలొనర్పగల్గుదురు. తాము తరించి, మానవులను తరింప జేయగల్గుదురు. లేనివారు ఎక్కడకుబోయినను క్లేశముల ననుభవించి, క్షీణలోకముల బొందుట సహజము. అట్టివారు పలుమారు పుట్టుచు, గిట్టుచుందురని, శాస్త్రములు దెలుపుచున్నవి.

## సంప్రతింపుమార్గము

పరలోకవాసులతో సంప్రతించుటకు మార్గ మేది యని యడుగవచ్చును. మనకు తెలిసియున్న యుత్తమజీవులపై మనస్సు లగ్నముజేసి, ఏకాగ్రచిత్తముతో ధ్యానించుచో, వారు మనతో సంప్రతించెదరని చెప్పవచ్చును. స్థూలదేహమును పరలోకవాసులు విసర్జించినను, సూక్ష్మములగు దేహములను దాల్చుచుందురు. అవి స్థూలేంద్రియములకు గోచరింపవు. ఈదేహములను గాలి చలింపజేయజాలదు. నిప్పు దహింపజాలదు. నీరు తడుపజాలదు. సూక్ష్మశరీరములలోగూడ భేదములు గలవు. సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ దేహములుగలవని చెప్పవచ్చును. చనిపోయినవెంటనే, యీదేహమునుబోలిన సూక్ష్మదేహమునే జీవులు దాల్తురు. మనకును అట్టిదేహములతోనే వారు గనిపింతురు, ఆపిమ్మట, నింకను సూక్ష్మతరములగు దేహములను దాల్తురని తోచును. ఉత్తరక్రియలవలన లాభముగలదా లేదా యను ప్రశ్న నడుగవచ్చును. బంధువులు ప్రీతితో సలుపుకర్మలపట్ల, సూక్ష్మదేహధారులు ప్రీతిజూపుట సహజము. పిండములను వారు భక్షింపకపోయినను

వారి నాఘ్రాణించి తృప్తిజెందగలరు. ఆయాదేశములవారు జరుపు ఉత్తరక్రియ లలో భేదమున్నను, చనిపోయినవారియెడ జూపు ప్రేమయే వీనికన్నిటికిని మూలా ధారము. జీవించియున్నవారికిని, చనిపోయినవారికిని, ఇట్టికర్మలు సంబంధము గలుపుచున్నవి. అందుచే నివి మూఢవిశ్వాసములని త్రోసివేయ వీలులేదు. చనిపో యినవారు, ఏయంత్రములేక తమ యభిప్రాయములను మన కెటుల దెలుపగలరని యడుగవచ్చును. మనమనస్సును వారొకమారు ప్రేరేపింపగలుగుచో, ఆపిమ్మట వారు చెప్పుమాటలన్నియు స్పష్టముగ వినిపించుచుండును. మనస్సున కవి గోచరిం చుచుండును. మనముగూడ మనస్సుతోనే వారితో సంభాషింపగలము. ఇది విచి త్రముగ గనిపించినను, నాయనుభవములో నున్న విషయ మగుటచే, ఈవిషయమై రూఢిగ జెప్పగలను. మనమాటలును, అన్యులమాటలును వేర్వేరుగ నుండును. పరుల భిన్నాభిప్రాయములను మనము వినవచ్చును. మన యభిప్రాయమును వారికో దెలుపవచ్చును. తప్పయినచో, మన యభిప్రాయములను దిద్దుకొనవచ్చును. మనక న్న నెక్కువ ప్రజ్ఞగలవారి సహాయమును బడయ వీలగును. జ్ఞానాభివృద్ధికిది అమూ ల్యసాధనముగ దోచును. ఇహలోకము, పరలోక మను భేదమున్నను సత్యమరసిన నట్టిభేదమే కన్పింపదు. మరణమనునదియే లేనపుడు లోకభిన్నత యెటు లుండును? ఆత్మ యను మహాసముద్రమునందు, జీవులన్నియు బిందుకణములవలె నుండునని గ్రహింపవలెను. ఏజీవున కాజీవుడు ప్రత్యేకముగనున్నను, అన్నియు నేకజీవుని యంశములేయని గుర్తించుట సులభము. మనతలంపులు మనవేయని చెప్ప వీలులేదు. ఎవరో శక్తిమంతు డొకవిధమున దలచిన, మనమును అట్టితలంపులే గలుగుచుండును. మనతలంపులు ఇతరులతలంపుల నటులనే ప్రోద్బలపరుపగలవు. అందుచే నేను, నావి యనుభావము స్థూలదృష్టిలో గోచరించినను, సూక్ష్మదృష్టిలో సర్వమును పర మాత్మయందే లీనమయి యున్నదనియు, "నే" ననునది భ్రమయనియు గ్రహింప వీలగును. సర్వమును పరబ్రహ్మమే. బ్రహ్మపదార్థము గాని దేమియు లేదని చెప్పవచ్చును. జీవుడు స్థూలబంధములను దాటినకొలదిని, పరమాత్మస్వరూప మును సులభముగ గ్రహింపనేర్చును. అందుచే ఆధ్యాత్మిక తత్త్వశాస్త్రమును పఠించుటవలన, పరమేశ్వరస్వరూపమును కనుగొన వీలగును. పాశ్చాత్యు లింకను ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞానమునందు, ప్రాథమికావస్థలో నున్నారు. అయి నను, వారికి నిజము త్వరితముగ బోధపడుచున్నది. భారతీయు లిదివర కీవిష యమున విశేషాభివృద్ధి గాంచినను, నేడు చాలవరకు దీనిని మరచియు న్నారు. తిరిగి నూతనజ్ఞాన ముదయించుచున్నది. పూర్వస్థితి మరల చేకూర వచ్చు ననునాశ పొడముచున్నది. స్థూలదేహులయినను, స్వప్నావస్థయందును, ధ్యానావస్థయందును, ఇతర సూక్ష్మశరీరులతో సంప్రతింప గలుగుదురు. ప్రతివారిని స్థూల సూక్ష్మదేహము లావరించియుండును. స్థూలదేహము పనిచేయ నప్పుడు, సూక్ష్మదేహము చురుకుగ బనిచేయును. పాము దనకుబుసమును విడిచి నటుల, జీవుడు ఒకశరీరమువెంట వేరొకశరీరమును విడుచుచుండును. ఇట్టి విషయ ములను గ్రంథములమూలమునానే గాక అనుభవజన్యజ్ఞానమువలనగూడ గ్రహింప వీలగును. నాకు దెలిసినవిషయములను నే నిటవివరించితిని. నాయనుభవముల నన్ని టిని వివరించిన, నవి ఇతరుల కంతలాభ మొసగవు. అందుకే నాయనుభవములబట్టి నేను గ్రహించిన సత్యములను కొన్నింటినిమాత్రము పేర్కొంటిని. చదువరులు తమతమ యనుభవములతో వీనిని పోల్చిచూచిన, ఈవిషయమునకు సంబంధించిన జ్ఞానము విస్తరించు నను నమ్మకముతో, నీవ్యాసమును వ్రాయుట తటస్థించెను. ఇంకొకవిషయమును తెలిపి యీవ్యాసము నింతటితో ముగించెదను. పంచేంద్రి యములు లేనియెడల వినుటకుగాని, చూచుటకుగాని, మాటాడుటకుగాని, వీలు లేదని సామాన్యముగ ననుకొనువిషయము, పూర్ణసత్యము గానేరదు. బధిరుడును, అంధుడును, మూగవాడునుగూడ సూక్ష్మశరీరుల వాక్కులను వినగలరు. చూడ గలరు. వారితో సంప్రతింపగల్గుదురు. మనస్సహాయముతో, నారు ఇకార్యము లనన్నిటిని గావింపగల్గుదురు. ఇంద్రియములను బంధించి, వీనిద్వారా కన్న నెక్కుడు ఘనకార్యములను సాధింప వీలుగలదు. యోగసాధనలు ఇట్టి సత్యమును దెలుప గలవు. ప్రాచీనులు సూచించిన మార్గముల ననుసరించుచో, ఆధ్యాత్మికజ్ఞాన మల వడునను టకు సందియము లేదు. ఆధునికప్రకృతిశాస్త్రజ్ఞులు గనుగొనుచున్న సత్య ము లిట్టి యూహలను బలపరచుచున్నవి. ఈవ్యాసమును ఈక్రింది గీతావాక్య ముతో ముగించెదను.

శ్లో॥ నజాయతే మ్రియతేవా కదాచి
న్నాయం భూత్వా భవితా వా నభూయః
అజో నిత్యశ్శాశ్వతోయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే.

"ఆత్మ ఒకప్పుడు పుట్టినది గాదు, ఇంకొకప్పుడు చనిపోవునది గాదు. భూతభవిష్యద్వర్తమానములు లేనిది. పుట్టుక లేనిది. నిత్యమయినది. శాశ్వతమయి నది. అనాది యయినది. శరీరము నశించినను ఆత్మ నశించునది గాదు."

---

# వేంకటగిరి సంస్థానాధీశులు

సింగంపల్లి వేంకటాద్రిగారు

ఆంధ్రావనిలో సంస్థానము లనేకములు గలవు. వీనిలో విజయనగరము, బొబ్బిలి, కురుపాం, చీకటి, పర్లాకిమిడి, సంగనల్ల, పిఠాపురము, దేవరకోట, కొచ్చెర్లకోట, మున్త్రిప్రగడ, తుని, వల్లూరు, నూజవీడు, ముక్త్యాల, మునగాల, వేంకటగిరి, దోమకొండ, అమరచింత, గద్వాల, వనపర్తి, పాల్వంచ, జటప్రోలు మొదలగునవి ప్రసిద్ధములు. వీనిలో విజయనగరము, బొబ్బిలి, పిఠాపురము, నూజవీడు, వేంకటగిరి యత్యంతప్రధాన మైనవి.

ఇవన్నియు నాంధ్రసాహిత్య కవితామృతముచే పునీతమై యాంధ్రి పౌరుష, పరాక్రమ రక్తధారలచే భావనంబై యాంధ్రి శిల్ప హస్తవిన్యాసముచే సజీవమై సస్యఫల సమృద్ధిశ్వైర్య సంశోభితంబై పూర్వమునను, ప్రకృతమునను, నవన్యసామాన్య వైభవోపేతంబై యాశ్రితజనకోటికి కల్పద్రుమంబు లై విరాజిల్లు ననుటకు సందియంబు లేదు.

ఈ సంస్థానాధీశుల యౌదార్యస్వభావము, మాతృభాషా పోషణము, త్యాగశీలము దానశాధేయత నిరుపమానములనుట నిస్సంశయము.

ప్రకృతమున వేంకటగిరి సంస్థానమునుగూర్చి దిఙ్మాత్రముగా వ్రాయ సాహసించుచున్నాను.

వేంకటగిరి సంస్థానము దక్షిణ హిందూస్థానమునందలి యత్యంత ప్రాచీనసంస్థానములలో నొకటి. ఈసంస్థానములో వేంకటగిరి, సాగుటూరు, పోలూరు, మనుబ్రోలు మొదలగు పరగణాలు చేరియున్నవి. ఇవన్నియు రాజాగారి ప్రధానోద్యోగులచే బాలింపబడుచున్నవి. సంస్థానముయొక్క వైశాల్యము 2117 చ॥ మైళ్లు. సంస్థానము క్రింద 625 కేరిగ్రామములును, 215 అగ్రహారములు లేక యీనాము గ్రామములును, పెరుమాళ్లు కైంకర్యార్థమై వినియోగింపబడిన గ్రామములు పండ్రెండును, మతి పది గ్రామములును మొత్తము మీఁద 862 గ్రామము లున్నవని గణింపఁబడుచున్నవి. ఈ సంస్థానాధీశున కేఁటేఁటఁ బదునొకండులక్షల యాదాయము వచ్చును. కాని బ్రిటీషు ప్రభుత్వమువారికి పేష్కష్ క్రింద నాలుగు లక్షల నలువదివేల రూప్యములు చెల్లింపవలసి యున్నది. ఆంధ్ర దేశములో నింతకంటె నధికముగ పేష్కష్ చెల్లించు సంస్థానము మతెద్దియును లేదు. ఈ సంస్థానమున సువర్ణముఖి, ముసి, గుండ్లకమ్మ అను నదులు ప్రవహించుచున్నవి. ఇప్పటికిని మహారణ్యములు కొన్నిగలవు. వీనిలో రక్తచందనవృక్షములు బాగుగా పెంపొందుచుండును. వేంకటగిరి పట్టణమునకుఁ బదునైదు మైళ్ల దూరములో 'కమిలినీ' అను ప్రసిద్ధ మైన యొకకోట గలదు. ఆ ప్రాంతము చూచుట కిప్పటికిని నత్యంత రామణీయకముగ నుండును. ఈ సంస్థానముననే వేఁలోకకోట యుండెడిది. పూర్వకాలమున నా కోటలో ఫిరంగులు మొదలగునవి భద్రపఱుపఁబడుచుండెను. ఆ ఫిరంగుల నన్నింటిని, బ్రిటీషు ప్రభుత్వమువారు కొంతకాలము క్రిందట స్వాధీనపఱచుకొని నాలుగు ఫిరంగులను మాత్రము పట్టాభిషేక మహోత్సవాది శుభసమయములం దుపయోగించుకుటఁ గాను సంస్థానమువారిపర మొనర్చియుండిరి.

## వేంకటగిరి సంస్థానముయొక్క పూర్వ ప్రశస్తి

ప్రప్రథమమున నీ సంస్థానము కాకతీయ ప్రభువుల క్రింద సేనాధిపతిగ నుండిన చేవిరెడ్డి యను మహావీరునిచే పండ్రెండవ శతాబ్దాంతమున స్థాపింపఁబడిన దని చరిత్ర ప్రసిద్ధి. ఈ పరాక్రమశాలియే పిల్లల మఱ్ఱి భేతాళ నాయకుఁ డను పౌరుష నామముచే గీర్తింపఁబడుచుండెను. ఈ శూరాగ్రణి సాహసవిక్రమమున నద్వితీయుఁడుగ నుండుటయె గాక సుశీలతకును, దైవభక్తికి ప్రసిద్ధి కెక్కియుండెను. పదమూఁడవ శతాబ్దాంతమునను, పదునాల్గవ శతాబ్దారంభమునను, వేంకటగిరిసంస్థానముఁ బరిపాలించుచుండిన ప్రభువులు దక్షిణ హిందూదేశమం దతివ్యాప్తమై యున్న పాండ్యరాజ్యమును జయించి లోఁబఱచుకొని కాంచీపుర ప్రాంతములవఱకు తమ ప్రాబల్యమును జాటియుండిరి. వేంకటగిరి ప్రభు సంతతిలో నేడవవారగు పెదసింగమనాయఁడు కవీంద్రుఁడును పండితోత్తముఁడును నై యుండెను. ఈయన సంస్కృతాంధ్రములలోఁ బెక్కుగ్రంథ ముల రచించి ప్రసిద్ధి కెక్కెను. వానిలో రసార్ణవ సుధాకర మను నలంకార శాస్త్రమును, సంగీత రత్నాకర వ్యాఖ్య యనునవి సుప్రసిద్ధములు. ఈయనమనుమఁడగు సర్వజ్ఞ సింగమనాయఁ డనుమహీపతి గొప్పభాషా కోవిదుఁడును, బంధిత కవిజన పోషకుఁడు నై యుండెడు. ఈ ప్రభు సత్తముని పాండిత్య గరిమను కవిసార్వభౌముఁ డగు శ్రీనాథ ప్రభృతు లెందఱో ప్రశంసించియుండిరి.

ఈ మహనీయుని సమకాలికమహాకవి యగు బమ్మెరపోతనామాత్యుఁడు భోగినీద-డక మనుసద్గ్రంథమును సర్వజ్ఞున కంకితమొసఁగె నని ప్రతీతి. ఈ ప్రభుసంతతిలోఁ జేరిన యొకరు పదునాఱవ శతాబ్దమున దేవరకొండ యను రాజ్యమును విజయనగర సామ్రాజ్యాధీశ్వరుఁ డగు శ్రీ కృష్ణదేవరాయలకు సామంత ప్రభువుగా నుండి పరిపాలించి యుండెనఁట. శ్రీ కృష్ణరాయలీ ప్రభువునకు కందనోలు (కర్నూలు) మండలాంతర్గతమైన వెలుగోడు అను సంస్థానమును బహూకరించి యుండెను. ఆ కారణముననే కాఁబోలు వేంకటగిరి ప్రభువులలో నిటీవలివారు తమ నామధేయములకుఁ బూర్వము వెలుగోటి యనుపదమును అలంకరింపఁ జేయుట పరిపాటి యైనది.

క్రీస్తు శకము 1620 సం॥ న రాయభూపతి యను ప్రభువు నాగకొండవీడు, వినుకొండ, ప్రాంతములను జయించి విజయ నగర ప్రభువుల మైత్రిని సంపాదించి యుండెను. ఈ మహీపతికే వేటూరి కృష్ణరంగరాజకవి భానుమతీపరిణయ మను ప్రబంధమును రచించి కృతి యొసంగియుండెను. 1695 సం॥న సర్వజ్ఞకుమార యాచమనాయకులను భూధవుఁడు సింహాసన మలంకరించెను. ఈయన సంస్కృతమున నసం దద్వితీయపాండిత్యమును గడించి పేరొందెను. ఈవిద్యాసనాధుఁడు కాళహస్తీశ్వరుని యర్ధాంగలక్ష్మియగు జ్ఞానప్రసూనాంబపై నొక అష్టకమును, చూర్ణికను రచించియుండెను. ఈపుణ్యశీలుఁడే అప్పయ్యదీక్షితులవారిచే విష్ణుపురాణమును సంస్కృతమునుండి యాంధ్రీకరింపఁ బ్రోత్సహించెను. 1755 సం॥ర బంగారు యాచమనాయ

లనువారు ఢిల్లీ పాదుషాసన్నిధినుండి యొకసన్నదును సంపాదించి సింహాసన మధిష్ఠించి సర్వతోముఖముగ రాజ్యము నభివృద్ధిఁజేయ సమకట్టెను. ఈయన శిల్పకళాభ్యుదయమునకై విశేషముగఁ దోడ్పడియుండెను. అనేకరాజసౌధములను, సుందరమందిరములను, వాపీకూపతటాకములను, ధర్మశాలలను, రాజమార్గములను ప్రతిష్ఠించియుండెను. రాజధానీనగర మగు వేంకటగిరియందు కాశీ విశ్వేశ్వరాలయ మనునొక గొప్పదేవాలయమును నిర్మింపఁజేసెను. ఈపుణ్యపురుషుని సహధర్మచారిణు లిరువురును సహగమన మొనరించి శాశ్వతకీర్తిని గడించిరి. ఈయనతరువాత రాజ్యమునకు వచ్చిన కుమారయాచమాన్యు లనేకమండపములను, మందిరములను నిర్మించి పుణ్యము గట్టుకొనెను.

ఈయనగా రొక మసీదునుగూడ నిర్మించియుండెనని ప్రసిద్ధి. ఏమీ! ఈయనసర్వమతాదరణము.

1790 వ సంవత్సరమున బ్రిటీషు ప్రభుత్వమునకును టిప్పుసుల్తానునకును యుద్ధము ప్రాప్తించినపుడు వేంకటగిరి సంస్థానాధిపతులు బ్రిటీషు ప్రభుత్వమునకు బాసటయై విజయమునకుఁ దోడ్పడిరి. ఈకారణమున చెన్నరాష్ట్రీయ ప్రభుత్వమువారు కృతజ్ఞతాపూర్వకముగాను, బహుమానపురస్సరముగ నిన్నూరు తుపాకుల ననుగ్రహించి యుండిరి. తరువాత రాజ్యమునకు వచ్చిన బంగారు యాచమాన్యు లను మహీపతి రాష్ట్రపాలకుఁడగు సర్ థామస్ మన్రోగారి కాప్తమిత్రులై, విశేషసత్కారముల, మన్ననలనందిరి. ఈయనగారు తన పూర్వీకులవలెనే యనేకధర్మకార్యముల నొనర్చి సత్కీర్తి నందెను. కాశీవిశ్వనాథున కొక రజతరచితమగు గజవాహనమును సమర్పించియుండెను. ఈపుణ్యమూర్తి సంస్కృతాంధ్రవాఙ్మయముల నతివిశేషముగఁ బ్రోత్సహించెను. ఈయన కాలముననే తర్కభూషణ వేంకటాచార్యు లనువారు శృంగారకల్పవల్లి యను అలంకారగ్రంథరాజమును వ్రాసియుండిరి. ఎన్నియో గ్రంథములను సంస్కృతమునుండి యాంధ్రమున ననువదింపఁజేసిరి. వానిలో ముఖ్యమగునవి వాల్మీకి రామాయణము, శ్రీకృష్ణజన్మకాండము, భగవద్గీత మొదలగునవి. ఇవి యెల్లను గోపీనాథ వేంకటకవిప్రణీతములు. ఈయన కంచి, రామేశ్వరము మొదలగు పుణ్యక్షేత్రముల దర్శించి యందలి దేవతానీకములకు విశేషకానుకల సమర్పించిరి. ఈయన లెక్కకు మిక్కిలిగ ధర్మకార్యము లొనర్చెను. పరమపవిత్రక్షేత్రమగు కాశికాపురియం దొకసత్రమును నిర్మించి యనుదిన మిన్నూటయేబది మంది యన్నాతురులకు భోజన మొసఁగునటుల శాశ్వతమగు నేరాటులం గావించెనఁట. ఈయనపిమ్మట 1879 సం॥న శ్రీగోపాలకృష్ణయాచేంద్రులనువారు సింహాసన మధిష్ఠించిరి. ఈయన తమపూర్వీకులు ప్రతిష్ఠించి యనుగ్రహించిన దేవాలయాదులను, మడిమాన్యములను నిర్విఘ్నముగఁ గొనసాగునట్లు ప్రోత్సహించి స్వయముగ మఱికొన్ని పత్రములఁ బ్రతిష్ఠించిరి. మదరాసునందు విక్టోరియా ఘోషాహాస్పిటలును నిర్మించి పుణ్యముఁ గట్టుకొనిరి. ప్రకృతమున నెల్లూరునందున్న కళాశాలను ప్రథమమున స్థాపించినది వీరే.



W

ఈయనకు బ్రిటీషుప్రభుత్వమువారు 1888 సం॥ న నైట్ కమాండర్ ఆఫ్ ది ఇండియన్ ఎంపైర్ (కె. సి. ఐ. ఇ.) అను బిరుదము నను గ్రహించిరి. చాలకాలము రాష్ట్రీయశాసనసభయందు సభ్యులుగానుండి ప్రజాహితకార్యములందు పాల్గొనిరి. వీ రిరువది రెండు సంవత్సరములకాలము దక్షిణహిందూదేశజమీందారీసంఘమున కధ్యక్షులుగ నుండిరి. శ్రీజార్జి సార్వభౌముని పట్టాభిషేకసమయమున శ్రీగోపాలకృష్ణ యాచేంద్రునకు మహారాజా, యను బిరుదమను గ్రహింపఁబడెను. ఈయనభాషాభిమానము పండితాదరణము వర్ణింప నశక్యము. ఈవిద్వద్భోగభాగ్యునికాలమునం దనేక గ్రంథములు రచింపఁబడి ప్రకటితము లయ్యెను. వానిలో ముఖ్యమైనవి 'రాధాకృష్ణసంవాదము' 'శిశుపాలవధ' 'దశకుమారచరిత్రము' 'అమరుకకావ్యము' 'శ్రీకృష్ణాభ్యుదయము' 'హాలాస్యమాహాత్మ్యము' 'గీతగోవిందము' 'బ్రహ్మగణేశ ప్రకృతికాండములు' 'కాళిదాసప్రకరణము' 'వినోదకథాకల్పవల్లి' 'సుమనోవినోదభూషణము' 'ఉత్తరరామచరిత్ర' మనునాటకము 'సంస్కృతకవిజీవితము' 'రుక్మిణీపరిణయము' 'గోపీకథాకౌముది' 'కథాసరిత్సాగరము' 'ఆంధ్రదశరూపకము' మొదలగునవి.

చూచితిరా! ఈమహనీయుని యాదరణప్రోత్సాహముల వలన నెన్ని గ్రంథములు రచింపఁబడెనో. ఆంధ్రవిజ్ఞానాభ్యుదయమునకును, ఆంధ్రభావభాస్కరతేజప్రసారమున కిట్టిగ్రంథము లెంతేని యుపకరింపఁ గలవు. వీనిలో పెక్కు ద్రాక్షాగుచ్ఛములవలె మృదుమధురములై, యితిహాసములై, నీతిసాగరములై, కథాకల్లోలినులై, విరాజిల్లుచున్నవని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఈమహారాజులుం గారు చెన్ననగరమునం బ్రతిష్ఠితమైన యాంధ్రపరిషన్మండలికి విశేష ద్రవ్యసహాయ మొనర్చియుండిరి. ఈయశశ్చంద్రుఁడు 1916 వ సం॥న అస్తమించెను. వీరికుమారులును ప్రకృతపాలకులు నగు శ్రీగోవిందకృష్ణయాచేంద్ర బహద్దరువారు 1917 వ సం॥ న రాజ్యభారమును వహించిరి. శ్రీవారు నెల్లూరునందలియున్నతవిద్యాలయమును కళాశాలగాలభివృద్ధిఁజేసిరి. మహారాజా సర్ గోవిందకృష్ణ యాచేంద్ర బహద్దరువారు సైనికశిక్ష నభ్యసించి బ్రిటీషు సేనలయందుఁ బ్రవేశించిన భారతీయసంస్థానాధిపతులలో మొదటివా రని చెప్పవచ్చును. మదరాసు గవర్నరుగారియొక్క గౌరవనీయాంగరక్షకునిగా దొరతనమువారు వీరిని నియమించిరి. వీరికిని కె. సి. ఐ. ఇ. మహారాజా మున్నగు బిరుదావళి నొసంగి సత్కరించుట గమనార్హమైన యంశము. మదరాసులో జరిగిన ప్రథమబ్రాహ్మణేతర మహాజనసభ వీరి సుప్రసిద్ధాధ్యక్షతక్రింద నిర్వహింపఁబడెను. వీరు ఢిల్లీనగరమునందలి రాజ్యసభయం దొకప్రతినిధిగా ప్రభుత్వమువారిచే నియమింపఁబడిరి. కాని వీ రనతికాలముననే సభ్యత్వమును వదలివేసిరి. శ్రీరాజావారు తమతండ్రిగారైన కీర్తిశేషులగు మహారాజా సర్ రాజగోపాలకృష్ణయాచేంద్ర బహద్దూరు జి. సి. ఐ. ఇ. లోహప్రతిమను వేంకటగిరి నగరమునఁ బ్రతిష్ఠింపఁజేసిరి. శ్రీరాజావారికి శ్రీమహావిష్ణు చతుర్భుజములవలె నలువురు కొమాళ్లు గలరు. వీరిప్రథమపుత్రులగు సర్వజ్ఞకుమార కృష్ణయాచేంద్ర బహద్దూరుగారు స్థానికసంస్థలయందుఁ బ్రవేశించి విశేషకృషి నొనర్చుచున్నారు. వీరు ప్రజలపక్షమున శాసనసభాసభ్యులుగ నెన్నుకొనఁబడియుండిరని పాఠకు లెఱింగియే యుందురు. శ్రీగోవిందకృష్ణుని తక్కిన కుమారరత్నములుగూడ దైవభక్తియందును, శాంతశమదమాదికల్యాణగుణములయందును తమ పూర్వుల ననుసరించుట శుభావహముగ నున్నది.

కీర్తిశేషులైన శ్రీరాజా సర్ పానుగంటి రామారాయణింగారి శాసనసభాస్థానమున ఖాళీయేర్పడగా, శ్రీగోవిందకృష్ణ యాచేంద్రులవారు పోటీలేకుండ నెన్నుకొనబడియుండుట సర్వజనవిదితమే.

ఇట్టి దాన ధర్మాది సద్గుణైశ్వర్యసంపన్ను లగు మహారాజావారికిని, శ్రీవారి పుత్ర పుత్రికా సంతతికిని పరమదయాకరుఁ డగు భగవంతుఁడు పరిపూర్ణాయురారోగ్యములం బ్రసాదించుఁగాత!

---

# శ్రీ శుకుఁడు

పండిత పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిలవారు.

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిపో
వ మహాభీతి నొహో కుమార యనుచున్ - వ్యాసుండు నీరంగ వృ
క్షములం దన్మయతం బ్రతిధ్వనులు సేక్కంజేసి యున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపో - ధన్యాగ్రణిన్ ధీమణిన్.

పురాణములలో నైమిశారణ్యమున సూతుఁడు శుక శౌనకాదులకుఁ బెక్కు ధర్మములను వారునేయు దీర్ఘసత్రయాగ సమయమునం జెప్పినటులు కాన్పించుచు. శ్రీమద్భాగవతాదిని మాత్రము శౌనకుని ప్రశంసయె కాని శుకుని ప్రశంస ధర్మశ్రోతలలోఁ గానరాదు. కాని శుకుఁడు పరీక్షిన్నరేంద్రునకు భాగవతకథల నన్నిఁటిని జెప్పినటులు కాన్పించును. ప్రథమస్కంధాంతమున శుకుని ప్రవేశము, ద్వాదశస్కంధాంతమున నిష్క్రమణము కాన్పించును, కాన శుక లిద్దఱా? యొకఁడా? యను సందియ మొకటి విమర్శకులకుఁ గలిగియుండును. శ్రీశబ్ద మొకటి గ్రంథకర్తలచే శుకయోగిశబ్దమునకు ముందు తఱుచుగఁ జేర్పఁబడు చుండుటచే శుకుఁ డింకొకఁడుండెనని ధ్వనియగుచున్నది. మహాభారతమున గృష్ణశబ్దవాచ్యులు నల్వురు కలరు. అందు వ్యాసునకుఁ గల కృష్ణశబ్దమునకు ద్వైపాయనశబ్దము పిమ్మటను, వాసుదేవునకు శ్రీశబ్దము మొదటను జేర్పఁబడుచుండును.

అర్జునున కెక్కడనో కాని కృష్ణశబ్దము వాడఁబడదు. ద్రౌపదికి స్త్రీలింగ రూపమున నుండుటచే స్పష్టముగఁ దెలియుచుండును. అటులనే శ్రీశబ్దము గల శుకనామముచే నన్యుఁ డొకశుకుఁ డుండెనని తలంపవలసి యున్నది. శౌనకునితోఁ గూడిన శుకునివృత్తాంతము మన కంతగాఁ దెలియదు కాని, వ్యాసపుత్త్రుఁ డగు శ్రీ శుకునిచరితము భాగవతపాఠకులకు సువిదితము. శ్రీశుకుని జన్మాదికము మహాభాగవతములో శాంతిపర్వమున నిటులు కలదు. భీష్ముఁ డీకథను ధర్మజునకుఁ జెప్పెనట! ఆకథ యిది.

మేరుపర్వత సమీపమునఁ గర్ణికారవనము కలదు. అందుఁ బ్రమథగణములచే సేవింపఁబడుచు నీశ్వరుఁడు పార్వతీసమేతుఁడై నివసించెను. పారాశర్య వ్యాసుఁ డచటికి యోగబలమున నేఁగి గొప్ప తపస్సుఁ జేసెను. ఈశ్వరుఁ డా తపస్సునకు మెచ్చి నీకేమి కావలయు నడుగు మనఁగా వ్యాసుఁడు, పంచభూతములతో సమబలము గలపుత్త్రుని నా కిమ్మని వేఁడెను. ఈశ్వరుఁ డటులే యగునని యనుగ్రహించెను. పిమ్మట వ్యాసుఁడు తన యాశ్రమమున నగ్నికార్యము దీర్చుట కరణిని మథింపుచుండగఁ "ఘృతాచి" యను నప్సరోవనిత వ్యాసునికి దృగ్గోచర యయ్యెను. వ్యాసుఁ డయ్యెలనాగం జూచి కామార్తుఁడు కాఁగా ఘృతాచి వంచనచే చిలుక యయ్యెను. కాని వ్యాసుఁ డప్సరోవనితా లగ్నమానసుఁడై యరణిని మథింపుసమయమున నాతనికి రేతస్స్ఖలనమై యది యయ్యరణింబడఁగా నదిచూడక యరణిని వ్యాసుఁడు మథింపుచుండగ నాయరణినుండి జనకసమానుఁ డగు శ్రీ శుకుఁ డుద్భవించెను. (అరణినుండి పుట్టుటచే "ఆరణేయుఁ డనియు, శుకనిర్దిష్టచిత్తుఁడై నపు డుద్భవించుటచే శుకుఁడనియుఁ బేరులు కలిగెను.) అపుడు శుకునకు మందాకిన్యాదులు ప్రత్యక్షమై సకలోపచారములం గావించెను. పుట్టినపుడె తండ్రి యంతవాఁడయ్యెను. వేదము లపుడె యాతనికవగతములై నను నామమాత్రముగ బృహస్పతిని గురువుగఁ జేసికొనెను. పిమ్మట తండ్రి యాశ్రమంబునకు వచ్చి యాటలను మరగియుండఁగా వ్యాసుఁ డాతనికి సాంఖ్యాది విద్యలను నేర్పెను. వేదాంతవిద్యలో మిథిలదేశాధీశుఁడు మిన్న యగుటచే నాతనికడ నావిద్యను నేర్వ వ్యాసుఁడే శ్రీశుకు నతనికడకుఁ బంపెను. అనేక పర్వతాదులం దాఁటి యాతఁడు మిథిలం జేరి రాజభవనమున కేఁగుచుండ, ద్వారరక్షకు లడ్డుకొనిరి. ఈ వృత్తాంతమును పిమ్మటఁ దెలిసిన జనకుఁ డాతని సభక్తికముగ నెదుర్కొని గౌరవించెను. అతని కానాఁడును, మఱునాఁడును జనకుఁడు సమస్తోపచారములం గావించి వచ్చినపని మోక్షధర్మజిజ్ఞాస యని తెలిసికొని నడుమ నడుమ శుకుఁ డడుగు ప్రశ్నలకు సదుత్తర మిచ్చుచు వేదాంతవిద్య నుపదేశించి నీకు మోక్షము సిద్ధించుఁ బొమ్మని పంచెను. (ఇట నొక విచిత్ర మగుగాథను మా తండ్రిగారు చెప్పుచుండిరి. అదియిది. శ్రీ శుకులు జనకు కడకు వేదాంతవిద్యను నేర్వ మిథిలాపురికరిగి యాసమయమున జనకుఁడు ధర్మాసనస్థుఁడై యుండుటచే న్యాయసభకే పోయి బాలుఁడుగాన నిలిచియే జనకుఁడుతీర్చుతీర్పును వినుచుండెనఁట! అది యొక హత్యతో సంబంధించిన వ్యవహారము. నేరము ఋజువైనది. కాని జనకుఁడు నేరము కలవానియందు కరుణకలవాఁడై వీని నొక గుఱ్ఱముపైఁ గూర్చుండబెట్టి శిరంబున నీటిపాత్రనుంచి వానినిబట్టుకొమ్మని మార్గమ్మంబరుగెత్తింపుఁడు, పాత్రలోని నీరు తొణకి క్రిందఁబడినవీని శిరంబు నచ్చటనే ఖండింపుఁడు, నీరు తొణకకుండిన వానిని జంపక విడిచిపుచ్చుఁడని భటులకాజ్ఞాపించి వేఱుపనిఁ జూచుకొనుచుండెను. ఇంతలో భటులు జనకునాజ్ఞ ననుసరించి వడిగల యశ్వమున వాని నధిష్ఠింపఁజేసి నీటిపాత్రను వానితలపై నుంచి గుఱ్ఱమును వేగము వారించిరి. నేరగాఁడు పాత్రను గట్టిగఁ బట్టుకొని తన దృష్టినంతయు జలపాత్రపైనె యుంచి జాగ్రతగ నుండుటచే నొక్కచుక్కయైనఁ జెదరి భూమిపైఁ బడనందున నావృత్తాంతమును భటులు రాజునకు విన్నవించిరి. రాజు తదేకదృష్టికలిగి వీడు నేరమునుండి మోక్షితుఁ డయ్యెఁగాన వీనిని వదలుఁడని, జనకుఁడటులనె నిలిచి యీవృత్తాంతము నంతయుఁ జూచుచున్న శ్రీశుకుం జూచి యంతకుముందు శుకునిఁ బలుకరింపనివాఁ డపుడు మోక్షవిధానము తెలిసినదా యన, శ్రీ శుకులు తెలిసెనని యపుడే వెడలి పోయెననియు, జనకుఁ డీతఁడు వ్యాసపుత్త్రుఁడనియు తండ్రియాజ్ఞప్రకారము తనకడ మోక్షధర్మముఁ దెలిసికొనవచ్చెననియు, పని తీరుటచే నాతఁడు మఱలిపోయెననియు, సర్వభూతమయుఁడు గాన నాతని కర్ఘ్యాదిమర్యాద లవసరములేదనియుం జెప్పెనట! ఇది పుక్కిటిపురాణగాథయే కాని యింపుగ నుండుటచేనిటఁ బ్రసక్తమయ్యెను.)

జనకుని కడనుండి శ్రీశుకుఁడు తిరిగి పర్వతాదులం దాఁటి హిమవంతంబున నున్న వ్యాసునికడ కేతెంచెను. అప్పటికి వ్యాసుఁడు. "పైల, జైమిని, వైశంపాయన, సుమంతు" లనుశిష్యులకు వేదాధ్యయనముఁ జేయింపుచుండెను. కొన్ని కారణములచే శిష్యులకు వ్యాసునకు సరిపడక వ్యాసు నానతిచేతనె వైశంపాయనాదులు వివిధదేశముల కరిగిరి, ఆశ్రమము వేదఘోష లేక చిన్నవోయెను. నారదుఁ డపుడచటకువచ్చి యిటులు వేదఘోష లేకుండుట మంచిదికాదన శుకవ్యాసు లిరువురును వేదపారాయణముం జేయుచుండఁగ గొప్పగాలి వీచెను. అది భగవత్ప్రీత మైనదని శుకుఁడు వ్యాసునివలనం దెలిసికొనెను. గాలి నిలిచినపిమ్మట వ్యాసుడు శుకునిఁ జూచి నీవు వేదపారాయణముం జేయుచుండుము, నేను స్నానముంజేసి వత్తునని గంగానదికడకుఁ బోయెద. ఆ సమయమున శుకుని తెలివితేటలకు సంతసించి నారదుఁడు నీ కేమికావలయునో యడుగు మన, మోక్షాపేక్షను శుకుఁడు తెలిపెను. సంగవిముక్తుఁడ వయిన మోక్షమునందుదు, విటనుండిన మోక్షము నందవనగాఁ దోడనే వ్యాసునికడ కరిగి, నే నాశ్రమమును విడిచి యెటకే నరిగి యోగాభ్యాసముం జేయుదుననఁ బుత్రవాత్సల్యముతోఁ బోవద్దని వ్యాసుఁడు పలికినను వినక కైలాసగిరికేఁజని యోగాభ్యాసముంజేసి యక్కడకు వచ్చిననారదునకుఁ దన వృత్తాంతముఁ జెప్పి యాయాశ్రమమును విడిచి సర్వభూతమయుఁడు గాన తరుగుల్మ లతాదులతో నాతండ్రి నాపేరుపెట్టి పిలిచినయెడల మీరు, ఓ యని పలుకుఁ డనిగిరిశృంగములను భేదించుకొనిపోవుచుండగ నచట నచ్చరలు వివస్త్రలై జలకమాడు చుండిరి. కాని శ్రీశుకుఁడు సర్వసముఁడగుటచే వా రాతనింజూచి సిగ్గునొందక వివస్త్రలుగానే యుండిరి. పిమ్మట శ్రీశుకుఁ డాకాశయానమున దేవతలకందరాని బ్రహ్మపదము నొందెను. పుత్త్రునిపైనుండిన ప్రేమచే వ్యాసుఁడు వెనుకొని తానుగూడ యోగబలమున నగమ్యము లగుమహాపథముల నతిక్రమించి శుకా! యని పిలువ నంతకుముందు శుకునుపదేశానుసారము తరుగుల్మలతాదులు ఓ యని ప్రతిధ్వనించెను. వ్యాసుఁడు పోవంబోవ సిద్ధచారణాదులు శుకునిమార్గము నెఱిఁగించిరి. అతఁ డచ్చరలు జలకమాడుచోటున కేఁగ వారు శుకుం జూచినటులు కాక సిగ్గునొంది వస్త్రధారిణులైరి. అందువలనఁ దనకంటెఁ దన కుమారుఁడధికుఁ డని వ్యాసుఁడు తెలిసికొని యొక పర్వతశిఖరముపై నిలిచి బ్రహ్మపదప్రాప్తుఁడగుశుకునికై విచారింపుచుండఁగా విశ్వేశ్వరుఁ డటకు దేవతలతోఁ బ్రత్యక్షమై పంచభూతములతో సమ మగుబలము గలకుమారుఁడు కావలె ననియడిగితివి- శుకుఁ డటులనె నామహిమచేతను నీతపోబలముచేతను నై దేవతలుకూడ పొందరాని బ్రహ్మపదము నొందియున్నాఁడు. వాని కీర్తి సదా జగద్విదితమైయుండును. వానియాకృతి గల ఛాయ నీకడ నుండునని యోదార్చి యంతర్హితుఁ డయ్యెను. ఈవృత్తాంతమును నారదునివలన నేను వింటి నని భీష్ముఁడు శరతల్పగతుఁడై ధర్మజునకుఁ జెప్పియుండెను.

భీష్ముఁడు కురుక్షేత్రయుద్ధానంతరము రెండుమాసముల లోపుననే ధర్మజునకు ధర్మముల నుపదేశించెను. అప్పటికి శుకుఁడు బ్రహ్మపదప్రాప్తుఁడైనటులు పైగాథ చెప్పుచున్నది. అయితే మహాభారతాదిని, భీష్మపర్వమునను కృష్ణద్వైపాయనుఁడు యుద్ధానంతరము మూఁడేండ్లకు మహాభారతమును రచించిపైల, జైమిని వైశంపాయన సుమంతులకు శుకునకు వేదములతోఁగూడ మహాభారతమును జెప్పిన

టులఁ గలదు. [చూడుఁడు అనుక్రమణికాధ్యాయము] ఇఁతమాత్రమే కాదుమహాభారత రచనానంతరము నారదోపదేశముచే వ్యాసుఁడు భాగవతమును రచించి శ్రీశుకున కుపదేశించినటులు కలదు. ఇతసూత్రమె కాదు. సకలపాండవయుద్ధానంతరము 36 సం॥రములకు హస్తిపురి రాజ్యమునఁ బట్టాభిషిక్తుఁడై 60 సం॥ లు రాజ్యముంజేసి బ్రాహ్మణశాపోపహతుఁడై మృతినొందిన పరీక్షిత్తు శ్రీశుకునిచే జ్ఞానోపదేశము నొందినటులు భాగవతమునం గల దనుసంగతి సర్వజనవిదితము. అనఁగా శుకుఁడు బ్రహ్మపదప్రాప్తుఁడైనపిమ్మట కొన్నియేండ్లకు మహాభారతముంజదివి 7, 8 సం॥ములకు భాగవతముం జదివి నూతెండ్లకుఁ బరీక్షిత్తునకు భాగవతము నుపదేశించినటులపై గాథలచేఁదెలియనగును. మఱియు మహాభారతమును ధృతరాష్ట్రాదులు మృతినొందిన పిమ్మటనే భారతమును లోకమున వ్యాసుఁడు ప్రకటించెనని యీక్రిందిశ్లోకార్థము చెప్పుచున్నది.

"ధర్మాత్ముఁ డగువ్యాసుఁడుభీష్మునియొక్క, తల్లియొక్కయాజ్ఞ ననుసరించి విచిత్రవీర్యునిభార్యలయందుఁ ద్రేతాగ్నులంబోలు ధృతరాష్ట్రాదులం గని తపస్సుకొఱకుఁ దిరిగి స్వాశ్రమమున కేఁగెను. ధృతరాష్ట్రాదులు పుట్టి పెరిగి ముసలివారై మృతినొందిన పిమ్మటనె మనుష్యలోకమున మహాభారతముం జెప్పెను—

శ్లో. మాతుర్నియోగా ద్ధర్మాత్మా గాంగేయస్యచ ధీమతః
క్షేత్రే విచిత్రవీర్యస్య కృష్ణద్వైపాయనః పురా
త్రీనగ్నీనివ కౌరవ్యా౯ జనయామాస వీర్యవాన్
ఉత్పాద్య ధృతరాష్ట్రంచ పాండుం విదురమేవచ.
జగామ తపసే ధీమాన్ పునరేవాశ్రమంప్రతి
తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిం
అబ్రవీ ద్భారతం లోకే మానుషేస్మి న్మహా నృషిః ఆదిపర్వ. 1-వ అ.

పై యంశముచే యుద్ధానంతరము 18 సం. రములకుఁగాని మహాభారతము ప్రకటింపఁబడలే దని తోఁచును. (ధృతరాష్ట్ర విదురులు యుద్ధాంతమున 18 సం॥ ములకు మృతినొందిరి.) ఇంకొక విచిత్ర మేమన, శ్రీశుకుఁడు పరీక్షిత్తుకడకు వచ్చునప్పటి కతనిపేరోలగంబున శుకుని తండ్రి యగువ్యాసుఁడు, తాత యగు పరాశరుఁడు, ముత్తాతతండ్రి యగువసిష్ఠుఁడుకూడ నుండినటులను వారందఱు శుకునకుఁ బ్రత్యుద్గతు లైనటులును భాగవతమున వర్ణింపఁబడెను. పైగాథలకు సమన్వయ మెటులు? భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పుట యబద్ధమైనఁ గావలయును; లేక, పరీక్షిత్తునకు శుకుఁ డుపదేశించుటయైన నసత్యము కావలయును. భాగవతమునఁ బరీక్షిత్తుశాపహతుఁడై జీవితాశవదలి జనమేజయుని రప్పించి యాతనికిఁ బట్టాభిషేకముం జేసి సర్వసంగములనువదలి ప్రాయోపవేశుఁడైనటులు కలదు. మహాభారతమునను పరీక్షిత్తుచరిత మాదిపర్వమునఁగలదు. అం దాతఁడు విరాగియై ప్రాయోపవేశము నొందినటులుగాని, శుకుఁ డాతనికి బ్రహ్మజ్ఞానోపదేశముం జేసినటులుకాని సూచనయైనఁ గాన్పింపదు. జనమేజయుం డప్పటికిఁ దండ్రిమృతి తెలియనంతటి బాలుఁడు. మంత్రులె పరీక్షిన్మరణానంతర మాతనికిఁ బట్టాభిషేకముం జేసినటులు కాన్పించును.

భాగవతవర్ణితపరీక్షిత్తు విరాగి. భారతవర్ణితపరీక్షిత్తు ఆత్మసంరక్షణోపాయాన్వేషి. ఏడవనాఁటి సాయంకాలమున మునిశాపసమయము దాఁటినదని ప్రాణము పైఁ దీపిచే సంతసించినటులు కలదు. మహారాజపదమున నుండినవాని కీ మహాభారతపరీక్షిత్తే తగినవాఁడు. చారిత్రకముగూడ నాతఁడె తగియున్నాఁడు. కాన పరీక్షిత్తునకు శ్రీశుకుఁడు భాగవతము నుపదేశించుట కల్లగాఁ గాన్పించును. శాంతిపర్వగాథ యసమంజస మని చెప్పుటకు యుద్ధాంతమున మూడేండ్లలో పదునెనిమిదేండ్లలో ప్రకటింపఁబడిన వ్యాసభారతము నాతఁడు శుకునకుఁ జెప్పినటులుండుట హేతువగుచున్నది కాని, శుకుఁడు వ్యాసునికంటె ముందుగనే బ్రహ్మపదప్రాప్తుఁ డయ్యెననియు, నాతనికై వ్యాసుఁడు చింతించెననియు మాత్రము నిజముగ చెప్పవలసియున్నది. అరణ్య, శాంతి, అనుశాసనిక పర్వ గాథలు పిమ్మట గూర్పఁబడి మహాభారతమునఁ జేర్పఁబడినవని పాశ్చాత్యులె కాక, వంగ, మహారాష్ట్రదేశపు పండితులును, దత్తు బంకిం చంద్ర ఛటర్జీ, వివేకానందస్వామి, వైద్యా, తిలక మొదలగువారు పరిశోధించి వ్రాసియున్నారు. కాని యాంధ్రదేశస్థాధునాతకోభయకవిమిత్రకవిరాజుగారికి కంటగింపుగ నుండినది. వారి తిక్క తిరుగదు. దాని నటుండనిండు. కృష్ణద్వైపాయనున కొక యచ్చరలేమ కనుపించినంతమాత్రముననె తాను చేయు సత్కర్మనైనఁ దలంపక యింద్రియస్ఖలనముం జేసికొనునంత నికృష్టస్వభావుఁడా? యనునదియె విమర్శనీయము. దీనిని కవిరాజుగారును, హిందూ బాంధవి పత్రికాధిపతులును సమర్థించి వ్రాయఁగలరు. ఇంకొక విశేష మేమనఁగా, కృష్ణద్వైపాయనజన్యులగు శుక, ధృతరాష్ట్ర, పాండు, విదురు లాతఁ డుండఁగనే గతించిరి. కృష్ణ ద్వైపాయనునకె కాదు, భాగవతముతో సంబంధించిన నల్వురు కృష్ణుల [illegible] నవసానమునకుఁ బుత్రులు గతించిరి. శ్రీ కృష్ణుని పుత్రు లగు ప్రద్యుమ్న సాంబాదులు యాదవ కలహమునను, అర్జున సుతులగు నభిమన్యాదులు కురుక్షేత్ర సంగ్రామమునను, కృష్ణాపుత్రు లగు ప్రతివింధ్యాదులు పదునెనిమిదవనాఁటి రాత్రి సమరమునను మరణించిరి. తుదకు "కార్ష్ణి" వేదమును శ్రీకృష్ణ కృష్ణ [illegible] గావించిన పంచమకృష్ణులగు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి యేకపుత్రుఁ డగు సుదర్శనుఁడుకూడ నకాలమరణము నొందుట విచారకరము. కృష్ణద్వైపాయనుఁడు శుకనిర్యాణముచే ఖిన్నుఁ డగునపుడు విశ్వేశ్వరుఁడు ప్రత్యక్షమై పవనాంబరాదులతో సమవీర్యుఁ డగుపుత్రుఁడు కావలెనని కోరితివి గాన [illegible] కోరిక ననుసరించి (కామ్య కర్మ ననుసరించి) తగిన కుమారుఁడు పుట్టి [illegible] ర్భూతుఁ డయ్యె నని యోదార్చెను. శ్రీకృష్ణుఁ డఖండ విజ్ఞాని, మేధావి, ధీరుఁడు. కాన, గాంధారీపుత్రుల నన్యాయముగాఁ జంపించుటచే నామె యిచ్చిన శాపకారణముచేతనె తన కట్టిఫలము కలిగెనని తలంచుకొనినాఁడు. వీరుఁ డగునర్జునుఁడు యుద్ధారంభముననే తా నొరులఁ జంపునపు డొరులు తనవారిం జంపరాదని విషాదమునొంది యట్టిఫలమునకుఁ బ్రతిఫలము వచ్చుననియె తలఁచి యభిమన్యు వధానంతరమునఁ దగిన ప్రతీకారముఁ జేసి దుఃఖాపనయముం గావించుకొనెను. కృష్ణకూడ మానవతిగాన సౌప్తికవధఁ జేసిన యశ్వత్థామపైఁ బ్రతీకారముం జేయించి శిరోమణ్యపహరణముం జేయించి విచారముఁ బోఁగొట్టుకొనినది. పంచమ కృష్ణుఁడు మాత్ర మేకారణమున సుదర్శనుఁ డదర్శనుఁడయ్యెనో యాథర్వమునే తెలిసికొనలేక పలవించుచు దైవముం దూఱియున్నాఁడు. యావద్భారతజాతిని నాదర్శపురుషుఁడుగా భూతభవిష్యద్వర్తమానకాలములయందుండు నభిమన్యు వధము వ్రాయుట, వినుటకూడ గొప్ప విచారకరము. విచారకరమెకాదు, ఆకథ ఘట్టమును విన్న బాలునకుఁగూడ మనస్సు విషణ్ణమగును. అట్టి కథాసందర్భము వ్రాయుట కవిరాజు శుభసందర్భముగాఁ దలఁచి యిటులు వ్రాసెను'

క. అభిమన్యువధము వ్రాసిన
శుభసందర్భమున నున్న-చో నాకంటన్,
ప్రభవింపఁజేసి యశ్రులు
బుభుపతిసుతున ట్లనుగ్ర-హించితె తండ్రీ.

ఇదియె సుదర్శనుం డదర్శనుఁ డగుటకు హేతువగును. తమ కర్మఫలమనుభవించుచు దైవముందూఱుట మూఢత్వమని ద్రౌపదీధర్మజసంవాదమున ధర్మజుఁడు దైవముం దూఱు ద్రౌపదికి నచ్చఁ జెప్పియున్నాఁడు. ఇంకొకటి యజుర్వేదారణ్యకమున నీ క్రిందివాక్యము కలదు.

"సహో వాచవ్యాసః పారాశర్యః విద్యుద్వధ మే వాహం మృత్యు మైచ్ఛ మితి" ఆరణ్యకము 1—9—6.

దీనికి విద్యారణ్యభాష్యమునందిటులు కలదు. "ఇతి పరాశరస్యపుత్రో వ్యాసాఖ్యః మహర్షిః యోఽస్తిసః, ఖల్వేవం ఉవాచ విద్యుతాఽశనినాక్రియమాణో యోవధ స్తమేవ 'అహం' మృత్యుమైచ్ఛం తస్య మరణస్యాతి కష్టత్వాత్, యో వధ ఏవో మృత్యుశబ్దస్య ముఖ్యార్థః తదపేక్షయాన్యేషాం పాపిష్ఠత్వాభావా తరేవథామృత్యవ ఏవనభగంతీ త్యహం మన్యే"

తా॥ (ప్రక్రమము విద్యుత్ లేక పిడుగుయొక్క ప్రశంస) "పరాశరుని కుమారుఁ డగువ్యాసమహర్షి యిటు లనుచున్నాఁడు: విద్యుత్తు పిడుగుచేనైన చావునే నేను మృత్యువని తలఁచుచున్నాను. అట్టి మరణ మతికష్టమగుటవలన అ పిడుగువలననైన చావొకటియే మృత్యుశబ్దమునకు ముఖ్యార్థము. దాని యపేక్షచే నితరములకు పాపిష్ఠత్వాభావమువలన నితరవధలు మృత్యువులే కావని నే దలఁచు చుంటిని,"

లోకమున నెవఁ డేకష్టమునను భవించునో దానినే గొప్పకష్టమని తలఁచును. శ్రీశుకుఁడు గోవ్యాసునకు పిడుగువలననైన కష్ట మతికష్టముగాఁ గాన్పించెను. శ్రీశుకుఁడు యణఁగిన పిమ్మట వృక్షములఁ బ్రతిధ్వనులు చిక్కంజేసి గిరిశిఖరములం భేదించుకొని భూతమయుఁడై పోయె ననుటయు, ఛాయమాత్రము వ్యాసునికడ నిలిచియుండెననుటయు, వ్యాసుఁడు పిడుగువలనఁ జచ్చిన చా వతికష్టమని చెప్పుటయుఁ జూడఁగా శుకుని బ్రహ్మపదప్రాప్తికిని, పిడుగుపడుటకు నేమైనసంబంధముండునా? వికటముగ నున్న నా వ్రాతకుఁ జదువరులను మన్నింపఁ బ్రార్థించు చున్నాను. ఇందువలన నన్ను నాస్తికుఁడని నిందింపకుఁడు. శుకోపదిష్టభక్తిభావనచే నాయాత్మ సదా పునీత మగుచున్నది. నిజమగు చరిత్ర వ్రాయుటయె నాముఖ్యోద్దేశము.



సామనకుమారి నెహ్రూ కన్య.



కన్యా సీతాదేవదాను, బార్-అట్-లా.



మిస్ చంద్రబాయిపంతి.



లాయరు ఆనందాబాయి కన్య.



శ్రీమతి కమలాబాయి, శ్రీమతి కృష్ణాబాయి.



శ్రీమతి గారి అమ్మాళు.



పవిత్రము కన్య.



శ్రీమతి కోమలము నటి.



శ్రీ భాగీరథి అమ్మాళు



శ్రీమాన్ కే. శ్రీనివాసన్ గారు.



ఏ. రంగస్వామి అయ్యంగారు.



శ్రీయుత చల్లా శేషగిరిరావు పంతులుగారు.



సి. ఆర్. శ్రీనివాసన్ గారు.



కీ॥ శే॥ గోమేధికము ఓమ్. శ్రీ శంకరస్వాములవారు.



మె॥ ఏ. ఏ. హెయిల్సుగారు.



వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారు.



దంతనాల నాగేశ్వర శాస్త్రిగారు.



కే. విశ్వనాథ మీనన్ గారు.

## ది జూపిటర్ జనరల్ ఇన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

# నారాయణదాస్ గిరిధరదాస్

చీఫ్ ఏజెంటు

10, మెక్లీన్ వీధి, మదరాస్.

భీమా వ్యవహారమునందు అందు ముఖ్యముగ భారత భీమా కంపెనీల విషయమున దేశమునం దితర ప్రాంతములవలె మదరాసు రాష్ట్రమునం దంతటను ఉత్సాహ మతిశయించియుండుట స్పష్టముగ కనుపడుచున్నది.

ఆ విషయమున "జూపిటర్" ఎంతయు గమనింపదగియున్నది. కాని యింతకును ఇదివరలో యితర దేశములు చేసియున్నట్టియు, అనేక దేశము లిప్పుడు చేయుచునే యున్నట్టియు పనికన్నను మేమేమియును హెచ్చుగ చేయలేదు.

భీమా పరిశ్రమ యీ దేశమునందు నెలకొన్నది. కావున ప్రజల ప్రతిదిన జీవితమునందీ భారత భీమా కంపెనీల నొక యవసరాంశముగ చేయవలసినది మదరాసు రాష్ట్రీయుల కర్తవ్యము.

జీవిత, అగ్ని, సముద్ర, మోటారుకారు మున్నగు భీమాల వివరములకు వ్రాయుడు.

---

ప్రజలకు సహాయ పడుటయే మా ముఖ్యోద్దేశ్యము

నమ్మకము! సంతృప్తి!! గ్యారెంటి!

మున్నగునవి గల చోటనే మీరు లావాదేవి గలిగియుండవలెను. ఇదివరలో ఖుద్దున ఒకసారి మాతో లావాదేవిచేసినవారు చాలా దూర ప్రదేశములనుండియే పదేపదే భారీఆర్డరును వారు పంపుచుండుట మాత్రమే గాక, వారి స్నేహితులనుకూడ ప్రోత్సాహపరచి ఆర్డరులును పంపించుచుండుటయే మా నమ్మకమునకు ప్రబలనిదర్శనము. ఇదివరలో మాతో బేరము చేయని మీరు ఒకసారి బేరముచేసిన అన్నియు విశదమగును. బంగారు, వెండి, పలుకెమల సీమకమలములు, కెంపులు, పుష్యరాగముల నగలు ఎప్పుడు సిద్ధముగానున్నవి.



ముఖ్యగమనింపు:–

నవీన వెండి సామానులు, అద్భుతముగా ఎలెక్ట్రిక్ పవరుచే నూతన మిషను లందు తయారగుచున్నది. వర్తకులకు, టోకుగా తీయు వారికి ప్రత్యేక సదుపాయములు గలవు.



### ఉమ్మిడి బంగారుశెట్టి అండ్ సన్సు

సీమ కమలములు బంగారు వెండి నగల వర్తకులు

28 చైనాబజారురోడ్డు మద్రాసు.

పరిశ్రమశాల, 226 గోవిందప్పనాయకుని వీధి.

---

## THE CITY DENTAL COMPANY,

**159, BROADWAY, MADRAS.**



మితవ్యయమునకు ఏ మోస్తరు పనినైనను సమయపాలనకు మొదటి తరముగను మేలుతరముగను ధర సరసముగను సంతృప్తికిగను ఉండును.

ఉత్తరవాదము.

# పి. ధర్మలింగదేవర్

దంతవైద్యులు.

### సిటీ డెంటల్ కంపెనీ,

159, బ్రాడ్వే, మదరాసు.

# ఏలపదాలు - నాగరికత

శ్రీ యుత పోణకా పిచ్చిరెడ్డిగారు, ఎం. ఏ.,

ఏలపదాలంటే నాగరిక వాసన లెఱుగక, నిష్కైతవపు గ్రామ జీవనమున హాయి ననుభవిస్తూ ఉండు యువతీయువకుల నిర్మలహృదయములు పొంగి ప్రవహించు ప్రేమరస ప్రవాహమే. విద్యాధికులకు మాత్రమే తెలియనగు ఛందోనియమములుగాని కావ్యపద్ధతులుగాని యెఱుగని అమాయకులనుండి వెలువడుటచే స్వాభావికములు భావపూర్ణములగుటచే నుద్దేశికజనితములు. కృత్రిమ మెఱుగని ప్రణయవర్ణనము లగుటచే ప్రకృతి యాథార్థ్య సిద్ధాంతోపదేష్టలు.

అట్లయ్యును వీనిలో చాలమట్టుకు పరనారుల నుద్దేశించినవి ఉన్నవి. ఇట్లుండుటకు కారణ మేమి? సంసారసుఖ మెఱిగిన పరవనితలు మాత్రమేనా ప్రేమ సంభాషణములకు దగిన సఖులు? విటుని గోష్ఠిలోమాత్రమేనా కుటుంబస్త్రీ లానందము గనజాలునది? కాదు. ప్రకృతిసిద్ధాంతాలు యిందుకు విరుద్ధముగా ఉన్నవి. పశుపక్ష్యాదులు మొదలు ప్రకృతిలోని హీనసృష్టి యంతయు నిందులకు వ్యతిరేకముగా ఉన్నది. మానవులలోగూడ నీచజాతుల ప్రవర్తన యిందుకు భిన్నముగా కనుపిస్తున్నది. అట్లయిన ఉత్తము లనుకొను జాతులలో మాత్ర మీవైచిత్ర్య మెందుకు కాన్పింపవలయును? స్వేచ్ఛావిహీనులగు కాముకీకాముకులు ఈసంఘములలోమాత్రమే యేల యుండవలెను?

అందులకు కారణ మిది; అనాగరికజాతులలో స్త్రీపురుషులు ఒండొరులను ఇచ్ఛగించినయెడల వారు భార్యాభర్తలుగా నుండుటకు, కావలయు ననుకొన్నప్పుడు విడిపోవుటకు ఏమీ అభ్యంతరాలుండవు. వారి సహకారజీవనము వారిమీద మాత్రమే ఆధారపడి ఉంటుంది. జాతి వృద్ధిబొందేకొద్దీ, నాగరికతవల్లసాంఘికజీవనము క్లిష్టమయ్యేకొద్దీ తత్త్వము మారుతుంది.

వర్ణ భేదాలవల్ల ఆర్థికవ్యత్యాసాదులవల్ల-విడివడరాని శాసన స్మృతిబంధనములవల్ల పూర్వపు సహజస్థితి తారుమా రవుతుంది. చాలామంది స్త్రీలు పురుషులు, ప్రత్యక్షముగా మనకు కనుపించే విషయాలను బట్టి ఆలోచిస్తే తమ జీవితాలంతా భ్రాంతిగా అనుకూలతలేని దాంపత్యబాధ అనుభవిస్తూ ఉండడము అ దులోనుండి తప్పించుకొనుట అసాధ్య మనేభావముతో దినదినానికి కృశించి పోవడము సంభవిస్తూ వున్నట్లు తెలుస్తుంది. ఎన్నడో జరిగినదన్నీ, తమకు భ్రాంతిగా బాధ్యతలేనిదిన్ని అయిన ఒక ఆచారము పెండ్లివల్ల తమ భావిజీవితాలంతా ఎడతెగని దుఃఖసాగరములో గడపవలసినట్లు యేర్పడుతుంది.

అట్టి పరిస్థితులలో కొందరు సౌఖ్యావహము లగు నితరుల సంబంధాలు సాధారణముగా వెదుక్కుంటారు, కాని, ఆసంబంధాలు చాలాసందర్భాలలో రహస్యముగానే ఉండవలసినట్లు యేర్పడుతుంది. జీవితము కలసి అనుభవించుటకు లేక, పుత్రప్రేమా సౌభాగ్యము పొందలేక, గూఢముగనే చర్య నడిపించవలసివస్తుంది. అటువంటి సంబంధాలలో రహస్యముగా ఉండవలసిన లోప మొక్కటే గాక యితర యిబ్బందులుకూడ చాలా ఉంటవి.

అవసరముగా-స్త్రీపురుష భేదము ప్రాముఖ్యమువహిస్తుంది. వారి సంబంధమునకు ఒక్క-అర్థము మాత్రమే కనుపిస్తుంది. మనస్సు కెప్పుడు స్తిమితము లేక చిందులు త్రొక్కుతూ ఉంటుంది. నరములు ఎప్పుడు పూర్తిశ్రుతిలో ఉండుటవల్ల కలిగే ఉద్రేకము (Excitement) దేహారోగ్యమునకే, శాంతికే, భంగము కలుగజేయవచ్చు. కృష్ణ యినా శాంతిస్తుందా అంటే అదీసందేహమే. ప్రేమ, సంతానము, సాహచర్యము, ఈమూడు కలసిఉన్నప్పుడే స్త్రీపురుషులసంబంధము శ్రేష్ఠతమ మనిపిస్తుంది. అట్టి సౌఖ్యము, అటువంటిఆనందము, పై సందర్భాలలో కలలలోకూడ పొందుటకు సాధ్యము కానేరదు.

అయితే సంఘము వీలుకలిగించనప్పుడు రహస్యముగానైనా కాముకులు కలుసుకొనుట తప్పవుతుందా? దీనిని విచారించుటకు ముందు 'తప్పు' అంటే యేమిటో కనుక్కుందాము. మనవాళ్లు ఆచారానికి కట్టుబాట్లకు వ్యతిరేకముగా జరిపించే చర్యలన్నీ అక్రమము అంటారు. కాని ఇది న్యాయముగా ఉన్నట్లు తోచదు. ఆచారాలు ప్రపంచములో అంతా ఒకటేమాదిరిగా లేవు. ఒక్కొక్క దేశములలో ఒక్కొక్కవిధమైన కట్టుబాట్లున్నవి. అందులో కొన్ని ఒకదాని కొకటి విరుద్ధముగాకూడా ఉంటవి. ఒకచోట తప్పుజేసినవాడు యింకొకచోట నేరస్తుడుగా యెంచబడుటలేదు. అసలు యీసిద్ధాంతాలన్నీ ఆకాలానికి అవసరమని తోచి మార్పులుచేసి అప్పటిజను లేర్పరచుకున్న వేగదా! ఆపరిస్థితులు మారిపోయి వాటితో అవసరము తీరితే మనముకూడా వాటిని విసర్జించి క్రొత్తవి ఏర్పరచుకోవచ్చు.

కొందరు విద్వాంసులు పరిస్థితులవలన మలినపరుపబడని అంతరాత్మకు ఆనందము కలిగించేవన్నీ మంచివని, తక్కినవి అందులకు వ్యతిరేకగుణమును పుట్టించేవి చెడ్డవని, చెప్తారు. కాని మన ఆత్మ పరిశుద్ధముగా ఉన్నదో, కలుషిత మై పోయినదో, కనుక్కొనుట దుస్సాధ్యము. కాబట్టి యీమార్గముకూడ మనకు అంత ఉపయోగకారి కాజాలదు.

మరి మూడవది: ఇదిమంచి ఇదిచెడ్డ అని యితరులవలన నేర్పబడని మనిషికి సహజభావోద్రేకమువల్ల కలుగు గుణాలన్నీ మంచివని, అందుకు విరుద్ధముగా ఉండేవి చెడ్డవని అంటే సంఘానికి ఆనందించే శక్తి. అపాయములో ఉండువానిస్థితికి వగచుట. ఇట్టివి ఒకరు నేర్పకుండనే మనకు కలుగుతున్నవికదా. అట్లే ఈ సృష్టిములో ఉండే సారాంశ మేమిటంటే స్వలాభమని, సంకుచితదృష్టితో చూస్తేనేతప్పు, మన ప్రకృతి మరీచెడిపోయి ఉంటేనేతప్పు, మనకు కలిగే భావాలన్నీ మంచివిగానే ఉంటవని వాటిని తృప్తిపరచుట మనము చేయదగిన ఉత్కృష్టకార్యాలలో ఒకటని.

ఈదృష్టితోచూస్తే ఆర్థికముగాగాని, ఈర్ష్యవల్లగాని, యిత రత్రాగాని, స్వలాభాపేక్షతో కూడుకొని ఉంటేనేతప్ప నిర్మల స్వభావజనిత ప్రేమోద్రేకసంతృప్తికొరకేర్పడు కాముకుల రహస్య సంచారమునందు తప్పులేనట్లు కనబడుతున్నది. అట్లుగాక సంసార మునర్చుచు, ద్రవ్యసంపాదనకో, అత్యధికముగా ప్రయత్నము వలన వృద్ధిబొందిన కామోద్రేకసంతృప్తికొరకో ఆవృత్తి నభ్యసిం చువారి కార్యము లిందు జేరవు.

[అసాధారణ పరిస్థితుల కన్వయించు మన యీ సిద్ధాం తము సామాన్య గృహస్థధర్మమున మార్పుజెందక తప్పదు. ఆపరి ణామ మిట్లుండవలయునని శాసించుట మనపనిగాదు. కాని విమర్శ నకు బూనుకొనునపుడు ప్రతివిషయమును దాని సహజపరిస్థితు లలోనుంచిమాత్రమే చూడనగును గాని, శ్రుతి స్మృతి పురాణాదుల ప్రమాణము ననుసరించిమాత్రమే అభిప్రాయప్రకటన మొనర్చుట న్యాయము గాదు.]

ఈ గుణముమాత్రము ఎట్టిసంఘములోనైనా ఉండక తప్పదు. కాని, ధారాళమైన సంస్కరణము జరిగితే కొన్నివిషయా లలోమాత్రము మార్పు వచ్చితీరుతుంది. అనవసరమైన దుఃఖము కొంతవరకు తగ్గుతుంది. దాంపత్యబాధ ననుభవించు కొందఱు స్త్రీ పురుషులు సుఖపడుటకు అవకాశములుకూడ కలుగవచ్చు.

వర్ణభేదములు, ఆర్థికవ్యత్యాసములు, శాసనతీవ్రత నశించి ప్రజాభిప్రాయములో అనువగుమార్పు కలిగినయెడల అప్పుడు ప్రపంచము ఎట్లుంటుంది? అప్పుడు ప్రేమబాంధవ్యాలకు పరిపూ ర్ణావకాశ ముంటుంది. తమ ప్రథమప్రేమయే శాశ్వత సంబంధము గా ఉండేదంపతులు ఇప్పటివలెనే కొంద ఱుంటారు. తమ చంచల ప్రేమవల్ల ఊరక సంబంధాలు మార్చుకునేవాళ్లుకూడ ఇప్పటి అమె రికాలోవలెనే కొందఱుంటారు. అయితే యిప్పటివలె వారికి ప్రతి బంధకము లంతగా ఉండవు. అయితే ఆర్థికవిషయాలలో, దొరతన మే బిడ్డలనందఱిని పోషించేటట్లు యేర్పడితే తప్ప అప్పటికికూడా కొన్నిచిక్కులు నిలిచి వుంటవి.

ఏకపత్నీవ్రతమే వుంటుందా? అదీచెప్పుటకు వీలులేదు. ఒక పండితుడు చెప్పినట్లు స్త్రీ లంతా ద్రౌపదివలె బహుభర్తృత్వము నాశాధిస్తారేమో! అధికమగు స్వేచ్ఛ ననుభవించే కొన్నిపక్షులు తమజతలో ఒకటిచనిపోతే దుఃఖముతో అశ్లేకృశించి చనిపోవునని అంటారు. ప్రపంచములో పశుపక్ష్యాదులు మొదలు అన్నిజా తుల మానవులలోను గల స్త్రీపురుష సంబంధ మనువిషయమును గూర్చి ఎక్కువ పరిశీలన చేసిన ఒకపండితుడు సృష్టిలోని జంతుజా లము యీవిషయములో ఏకిమార్గము ననుసరించుటలేదని సెల విచ్చినాడు.

కాని పశుపక్ష్యాదులను ఉదాహరణముగ గైకొనుట న్యా యమా? వయసువచ్చినతర్వాత ఆజాతికి తల్లి, దండ్రి, సంతానము. అనిలేదుగదా! భార్యాభర్తల సంబంధమేకదా అది యెఱిగినది! నాస్తవమే. కాని, మానవప్రకృతిమాత్రము యిందుకు వ్యతిరేక ముగా ఉన్నదా! ఇతరకారణాలవల్ల మనము కొన్ని నిబంధనలు ఏర్పరచుకున్నాముగాని సహజముగా మనమనస్సు ఆమార్గమున వర్తించుట సాధ్యమేకాదు అని చెప్పగలమా? హిందువులు కూడ దను చెల్లెలి (పినతండ్రికూతురు) సంబంధము మహమ్మదీయులకు వెగటుగా తోచుచున్నదా? సోదరికుమార్తెను పెండ్లిజేసికొనుటకు కొందఱు అసహ్యించుకుంటున్నారా? కొందఱు తమసంఘము వెలు పలివారిని పెండ్లాడరు. దీనియర్థమేమి? పూర్వకాలమున ఈ జిప్టు దేశపురాజులు అన్నదమ్ములు అక్కసెల్లెండ్రను వివాహము చేసికొ నుచుండిరిగదా! క్రైస్తవమతసిద్ధాంతముప్రకారము ప్రజలందఱు అన్న, చెల్లెలు సంతతియేకదా. ఇంకొకసారి ప్రళయము వచ్చిన ప్పుడు సంతానార్థము కుమార్తెలు తండ్రితో రమించినట్లున్నది. ఒక గ్రీకునాటకమున ఒకరాజు తనతండ్రిని చంపి తెలియక తల్లిని భార్యగా గ్రహించినపుడు అతని కామెయెడ మాతృభావము కలుగ లేదని వ్రాయబడియున్నది. ఇంతేగాక తాము ఎవరైనది తెలియ నప్పుడు సోదరులకుకూడ కాముకీ కాముకులవలె అనురాగము కలు గుట సహజము, అని యిప్పటిశాస్త్రజ్ఞుల యభిప్రాయము.

సాధారణముగా ప్రతియువకుడు తనకు తగినయువతిని పెం డ్లాడవలెనని ఉవ్విళ్లూరుతూ వుంటాడు. ఉత్తమభార్యా సంపాదన మే వాని ముఖ్యాదర్శము. ఈ ఆదర్శముకూడా వానిని నాగరికుని చేయుటకు తోడ్పడుతుంది. అది వానిలోని నీచత్వాన్ని పోగొట్టి ఉన్నతభావాలకు ప్రేరేపిస్తుంది. కామికానివాడు మోక్షకామికానే కాడు. సత్యానురక్తి, సరస మగుసంభాషణ, నమ్రత, నిదానము మొదలగు సుగుణాలు యువకులలో అంకురించుటకు ప్రణయ మహిమయే కారణము.

కాని ఉత్తమవధూకరగ్రహణమునకు చాలసందర్భాలలో మన సంఘనిర్మాణము అడ్డువస్తున్నది. వర్ణభేదములు పూర్ణవికా సము నొందదగిన కొందఱిజీవితముల మాడ్చి నరకభాజనములుగా జేస్తున్నవి. పూర్ణరాగపరిచితము లౌ తరుణప్రాణములు మేల్కొ నకయే మరణిస్తూ ఉన్నవి.

# భీమా కంపెనీలు

డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు

ఒక్క విదేశీ బ్యాంకింగు ఇన్సూరెన్సుల మూలంగా మనదేశంనుండి ఏటేటా సంవత్సరానికి నూరుకోట్లరూపాయలు విదేశాలకు పోవుచున్నవి. వెనుక నొకసారి బ్యాంకింగునగూర్చి వ్రాశాను. ఇప్పుడు భీమాలనుగూర్చి యించుక వ్రాస్తాను. పాఠకులు సాకల్యంగా చిత్తగింతురుగాక. జీవితాల భీమాను యింగ్లీషులో లైఫ్ ఇన్సూరెన్సు అంటారు. మొదట యీ భీమాకంపెనీలు మనదేశంలోకి వచ్చినప్పుడు భీమాచేసినవాడు బ్రతికున్నంతకాలము డబ్బు చెల్లిస్తేగాని మరణానంతరం వాని కుటుంబానికి కొంతడబ్బు యిచ్చేయేర్పాటు వొక్కటే యీ కంపెనీల్లో వుండేది. కాని యిప్పుడున్నట్లు అందరికీ అనుకూలంగా బ్రతికుండగానేకూడా డబ్బువచ్చే యేర్పాట్లప్పుడు లేవు. పూర్వం యే పెద్దవుద్యోగం చేసేవారో భీమా చెయ్యడం, వారిమరణానంతరం వారికుటుంబాలకు కొంతడబ్బురావడం యీ సంగతి తెలుసుకొన్నవారు వీటికి చావుఫండు కంపెనీలని పేరుపెట్టడం తటస్థించింది. ఇప్పటికీ కొందరు భీమానుగూర్చి సంగతి సందర్భాలేమీ తెల్సుకోకుండానే యివి చావు కంపెనీలనియు, వాట్లలో డబ్బువెయ్యడం, అమంగళం, వాగాయిత్యం, ఆయుక్షీణకరం అనియు భయపడుతూ భీమా అంటేనే యేవగించుకొనేవారున్నారు.

న్యాయంగా యీ భీమాకంపెనీలకు తెలుగులో "అన్యోన్య ఆపత్సహాయ సంఘా"లని గాని, లేక "ఆపదుద్ధారకసంఘా"లనిగాని పేరుపెడితే బాగుంటుంది. ఇవి పాశ్చాత్యదేశాల్లో అత్యద్భుతంగా అభివృద్ధిపొంది మానవసంఘానికెంతో మహోపకారం చేస్తున్నవి.

ఆదేశాల్లో మనదేశంలోవలె మానవుని యిహలోక కష్టసుఖాలకు వాని పూర్వజన్మ దుష్కృత సుకృతములే కారణము లను కర్మసిద్ధాంతవిశ్వాస మంతగా లేదు. కావుననే పురుషయత్నంతో వారు సాధించే మహాకార్యాలెన్నో మనకు ఆశ్చర్యంగా వుంటవి. ఒకమనిషికి యేదన్నా ఆపద వస్తే వాడికర్మం వాడనుభవిస్తున్నాడని మిగతాసంఘం అంతా వుపేక్షతో మెట్టవేదాంతంచెపుతూ మనవారివలె పొడిమాటలతో వోదార్చి వూరుకోరు. సంఘంఅంతా కలిసి సమష్టిగా ప్రయత్నించి ఒకవ్యక్తికి గలిగే కష్టనష్టాలను తామంతా పంచుకొని వీలైనంతవరకూ వారివిపద్భారాన్ని తగ్గించేటట్టు చూస్తారు. ఇదే అన్నివిధాలైన భీమా కంపెనీలకు మూలమాత్రం.

అగ్నిభీమానుగూర్చి చాలమంది ధాన్యం వ్యాపారస్తులెరిగేవుంటారు. ఒక ధాన్యంకొట్టును అగ్నిభీమా చేస్తేనేగాని, దాన్ని తాకట్టుపెట్టుకొని యేబ్యాంకువారున్నూ ఋణమివ్వరు. ఎందుచేతనంటే యే ఆస్తియొక్క హామీని నమ్మి ఆబ్యాంకువారు అప్పిచ్చారో ఆయాస్తికి అగ్నిప్రమాదం సంభవిస్తే ఆబ్యాంకు దివాలా తీయవలసి వస్తుంది. కాబట్టి, యీ యేర్పాటు చేశారు.

లోకంలో ప్రతివ్యాపారమున్నూ పరపతిమీదనే ఆధారపడివుంది. ఒక ఆస్తినిబట్టిన్నీ, సత్ప్రవర్తనమునుబట్టిన్నీ వానికి పరపతి పుట్టుచుండును. ఆస్తియొక్కభద్రతను భీమావల్ల కాపాడితే నిరాక్షేపణగా తగినపరపతి యేర్పడి వ్యాపారం సాగుతుంది, కావున దేశంలోని వ్యాపారాభివృద్ధికి భీమా కంపెనీలే మూలాధారము. ధాన్యంకొట్లకు అగ్నిభీమా అనగా అర్థం యేమంటే, సుఖంగా ధాన్యం వ్యాపారము చేసేవారంతా గలిసి దురదృష్టవశాత్తు అవ్యాపారంలో అగ్ని ప్రమాదమువల్ల నష్టముపొందే ఒక నోటివర్తకుని నష్టమును భర్తీచేసి, దానితో వాడు కుంగిపోకుండా నిలువబెట్టి వానిని రక్షిస్తారన్నమాట. అదేవిధంగా యిండ్లు మేడలు అన్నివిధములైన సరుకులు అగ్నిభీమా చేస్తారు. పాశ్చాత్య దేశాల్లో వ్యాపించిన యీ భీమాపద్ధతులు ఎంతో ఆశ్చర్యంగా వుండును. సముద్రంమీద పోయే ఓడలను, అందలిసరుకులను జలప్రమాదాలనుండి రక్షించేనిమిత్తం సముద్రపు భీమాకంపెనీలు గలవు. మరియు వర్షాలభీమాలు, తుపానులభీమాలు దొంగతనం భీమాలు, అవయవాలభీమాలు, పశువులభీమాలు, పంటలభీమాలు, ఆరోగ్య భీమాలు, సత్ప్రవర్తనభీమాలు మొదలైన వెన్నోరకాలు భీమాలు గలవు. ఫ్యాక్టరీలలో పనిచేసే కూలివాండ్రు తమచేతులనో కాళ్లనో తమకు కావలసిన మొత్తాలకు భీమాచేసి, చేయి లేక కాలు 1-కి సంవత్సరానికింత అని యొక నిర్ణీతమైన వాయిదామొత్తంను ఆభీమాకంపెనీకి చెల్లిస్తూవుంటారు. ఈవిధంగా యే 50 వేల మందో చేతులూ, కాళ్లూ భీమాచేస్తే, యేపదిమందిచేతులకో ప్రమాదం సంభవిస్తుంది. ఆపదిమందీ నిరాధారులై పోకుండా వారు భీమాచేసిన మొత్తాలను ఆకంపెనీవారు వారికి చెల్లించి, వారినీ, వారికుటుంబాలను అధోగతిపాలు గాకుండా కాపాడుతారు. అనగా కాలుచేతులకు ప్రమాదం కలుగకుండా సుఖంగా సంపాదించుకొంటూ జీవిస్తూవున్న 49990 కూలీలును గలిసి ప్రమాదంపొందిన తమసోదరకూలీలు పదిమందికిన్నీ సాయంచేస్తున్నారన్నమాట.

భీమాకంపెనీలంటే సుఖంగావున్నవారంతా కలిసి, కష్టదశలో వున్నవారికిన్నీ, లాభం పొందేవారంతా కలిసి నష్టంపొందేవారికిన్నీ, సాయంచేయుటకై యేర్పాటుచేసికొన్న ఒక ధర్మసంస్థ.

అదేవిధంగా మానవజీవితాల భీమాఅంటే దీర్ఘాయుష్మంతులుగా బ్రతికి సంపాదించుకొని సుఖంగా జీవిస్తున్నవారంతా కలిసి, తాము చెల్లించే భీమావాయిదాల ధనంమీద పెరిగే వడ్డీతో, తమ కంపెనీలో తమతోపాటు భీమాచేసి అకాలమరణం పొందినవారి కుటుంబాలకు ఒకనిర్ణీతమొత్తమును యిచ్చి, వారికి కొంత జీవనాధారమును చూపించి పోషిస్తారన్నమాట, జీవితాల భీమాకంపెనీ ఒక కల్పితమైన జాయింటు కుటుంబము. ఇందులో భీమాచేసేవారంతా సోదరులు. వీరిలో ముందుగా చనిపోయేవారి కుటుంబాలను, వెనుక బ్రతికిమిగిలియున్నవారంతా కలిసి పోషించుటకు, లేక సాయంచేయుటకు యీకంపెనీద్వారా యొకఒడంబడిక చేసుకొన్నారని చెప్పవచ్చును. కావుననే వీనికి అన్యోన్యఆపత్సహాయ సంఘాలనిగాని, ఆపదుద్ధారక సంఘాలనిగాని పేరుపెడితే బాగుంటుందని మొదట సూచించాను. వీరిలో నూటికి 95 మంది పూర్ణాయుష్మంతులుగా బ్రతుకుతారు, మిగతా యేను గనైదుగురో మాత్రము అకాలమరణము పొందవచ్చును.

## భీమాసహకారము.

భీమాకంపెనీ లన్నీ ముఖ్యమైన సహకారసంఘాలు. వ్యక్తి సంఘంకొరకున్నూ, సంఘంవ్యక్తికొరకున్నూ జీవించుటయే సహకారోద్యమానికి మూలమంత్రం. (All for each and each for all) నీవు సుఖంగాసంపాదించుకొనేరోజుల్లో కొంత సొమ్మును భీమావాయిదాలక్రింద చెల్లిస్తూ, సంఘంయొక్క సమష్టిక్షేమానికి తోడ్పడడం నీకు విధాయకం. నీకు వార్ధక్యం వచ్చినప్పుడుగాని, అకాలమరణాది విపత్తులు సంభవించినప్పుడుగాని నీవో, నీకుటుంబమువారో మీకు కావలసిన ధనసహాయాన్ని మీసంఘం(కంపెనీ)నుండి పొందుటకు సర్వవిధాల మీకు హక్కు గలదు. మొదట స్వధర్మం నెరవేర్చినవానికే పిదప అన్యులపై హక్కు లభించును. కావున సహకారోద్యమాభిమానులంతా భీమాకంపెనీల యభివృద్ధికి సర్వవిధాల త్రికరణశుద్ధిగా తోడ్పడవలసియున్నది. మరియు యీ భీమాకంపెనీలు తమ ధనంతోకూడ సహకారసంఘాలకు అనేకవిధాల తోడ్పడగలవు. ఈభీమాకంపెనీల ధనమును కోఆపరేటివుబ్యాంకులలో చౌకవడ్డీలకు డిపాజిట్లుగా వేయువచ్చును. మరియు యీసొమ్ముతో యేటేటా అనేకమైన భూమి తనఖాబ్యాంకులను నెలకొల్పి రైతులోకముయొక్క ఋణగ్రస్తత నచిరకాలంలోనే రూపుమాపవచ్చును. ఇప్పుడు మనదేశంలో పనిజేయుచున్న సహకారసంఘాలు నిజం విచారిస్తే దేశీయుల ఋణగ్రస్తతను వృద్ధిచేయుటకే తోడ్పడుచున్నవి. ఈభీమా కంపెనీలు గ్రామంలో వ్యాపించినకొలదిని రైతుల్లోకూడా నిర్బంధంగా ఆదా జేసుకొనే అలవాటు వ్యాపిస్తుంది. భీమావ్యాపారంయొక్క అభివృద్ధి యెప్పుడూ దేశైశ్వర్యాన్ని తెలియజేస్తుంది.

## భీమా – సంఘజీవనము

ప్రజలకు దేవాలయాలు, చదువులబడులు, వీధులలోని దీపస్తంభాలు యెట్లాగో అట్లాగే భీమాకంపెనీలుకూడా ప్రజాసంఘానికంతకూ ఉపయోగకరమైన క్షేమస్థలు. పూర్వులలో ధర్మదాతలైనవారు బహుజనక్షేమమునుగోరి, ప్రజారోగ్యము కొరకును, సంఘముయొక్క విద్యాభివృద్ధికొరకును, దైవారాధనము మొదలగువాటికిని, అనేక దానాలు, ధర్మాలు చేస్తూవుండేవారు. ప్రస్తుతకాలంలో మానవసంఘం నూతనమార్గాల్లో చాలా అభివృద్ధిపొందుతోంది. జనులు పరిశ్రమలను వర్తకాన్ని ఆధారంగా చేసుకొని జీవిస్తున్నారు. ఎవరికివారు విడివిడిగా లాభాలు గడించుకొనేరోజులొచ్చినవి. అందుచేత సంఘముమొత్తముమీద క్షేమం ఆలోచించడం పోయింది. ఈవొత్తిడివల్ల ఎవరికివారు డబ్బు పొదుపుచేసుకోవడం, ఈ జీవితాన్ని భీమాచేసుకోవడం అవసరమైంది. ఒకమునిసిపాలిటీలో వున్న (లైటు పెయుదు) పన్ను చెల్లించేవాడొకడు ముసలివాడవడంచేత చీకటిపడగానే బయటకు రాడనుకోండి. అంతమాత్రాన ఆ మునిసిపాలిటీవారు రాత్రులందు దీపాలు వెలిగించినందుకు వసూలుచేసే పన్ను అతనిదగ్గరకూడా వసూలు చేయకుండా మానుకుంటారా? ఏయిల్లమ్మకో బిడ్డలు లేకపోవడంచేత ఆవిడదగ్గర స్కూలు పన్ను

పుట్టుకోకుండా వుంటారా! అట్లాగే యిప్పుడు మేము ధనవంతులమై వున్నామనిగాని, మాకు అప్పులు సప్పులు యేమీ లేవనిగాని, ముసలితనం వచ్చినతరువాత యెట్లావుంటుందో అనే అనుమానం లేదనిగాని యీమొదలైన సాకులుచెప్పి యెవ్వరుకూడా తమ జీవితాలను భీమాచేయించకుండా వూరుకోకూడదు. జీవితాన్ని భీమాచేసుకోవడం ఒక్క మన ప్రత్యేక ధనసంగత్షణకే కాదు. అది ఒకవిధంగా మనమనుకోకుండా జేసే నిష్కామ్యధర్మం. అది సంఘంమొత్తానికి జేయబడే సేవ అంతే కాకుండా మనకంటె అదృష్టహీనులైన మనసోదరులకున్నూ మనకంటె అల్పాయుష్కు లయినవాటికన్నీ చేయబడే గొప్పప్రేమపూర్వకమైనదానము. భీమాచేయడంచేత ఒకనికి పొదుపరితనమునందు మంచిశిక్షణము అబ్బేటట్లు చేస్తుంది. ఆకుటుంబానికి ముఖ్యమైన ఒక ఆధారము గల్పిస్తుంది. అటు సంఘ సేవకూ,యిటు రాజ్యాంగానికి తగిన ప్రయోజనకారి అవుతుంది. రాజ్యానికంతకూ గొప్పలాభదాయక మవుతుంది. భీమాచేసినవారి కది చక్కని ఆదా చేసేమార్గము. మొట్టమొదట డాక్టరుపరీక్ష చేయించుకోవడంవల్ల ఆమనిషియొక్క ఆరోగ్యస్థితి వున్నదున్నట్లుగా తెలియనూ తెలుస్తుంది. ఇకముం దింకా యిన్నాళ్లు నిశ్చయంగా బ్రతుకవచ్చు నన్నధైర్యము కలుగుతుంది. లేకపోతే యిదివరకు మనకు తెలియకుండావున్న వ్యాధులేమైనా వుంటే తెలుసుకొని దేహస్థితిని చక్కబరచుకొని నాటి నివారణోపాయము ఆలోచించుకోవడానికి అవకాశాలు కలుగును. సరిగా నిర్ణయంకాలానికి డబ్బుచెల్లించవలసిన అవసరం వచ్చేటప్పటికి, మనడబ్బు ఖర్చుపెట్టడములో ఒక సక్రమపద్ధతి యేర్పడి తగిన పొదుపరితనము అబ్బుతుంది. పైగా ప్రజలు అందరు కూడి నడిపే వుద్యమాలు యెట్లానడుస్తవో తెలుస్తుంది. ఈవిధంగా భీమాచేసినవారి కన్నివిధాల సంతృప్తి కలుగుతుంది. అకాలమరణం పొందేవారి కుటుంబాలన్నిటికీ ఈభీమాపద్ధతి మూలాన తగినజీవనాధారా లేర్పడి వారికుటుంబాలు కటిక దారిద్ర్యంలో మునిగిపోకుండా కొంతవరకు వారిని కాపాడవచ్చును. అందుచేత సంఘంలో పరస్పర సోదర భావము వృద్ధి పొందుతుంది. సర్వజనసమానభావముకూడా పెంపొందగలదు. మీరు ధనవంతులు, మంచి ఆరోగ్యసంపత్తి గలవారనుకోండి. ఇంటువంటి మీరు చెల్లించే భీమా వాయిదాధనమువల్లనే దురదృష్టవంతులయిన మీ యిరుగు పొరుగువారి కెంతో సౌఖ్యం కలిగిన దనుకోండి. ఇట్టి సద్భావం మనస్సులో కలుగడమే మహానందకరమైనదిగదా! ఇందులో దాతలు ధన్యులే. ప్రతిగ్రహీతలు ధన్యులే. మనము ప్రత్యేకంగా బుద్ధి పుట్టితే యెవరికైనా తృణమో పణమో ధర్మంచేసుకోవచ్చు. కాని, యీభీమావల్ల కలిగే సోదరభావం, యీమైత్రి అత్యాశ్చర్యకరం. ఏధర్మగ్రంథాలు, యేమహర్షులూ, యేవేదశాస్త్రాలు యిట్లాంటి దానపద్ధతిని నిర్ణయించలేదని ఖండితంగా చెప్పవచ్చును. ఈ భీమాపద్ధతివల్ల "ఐకమత్యం" యెట్లా కలుగుతుందో దీనివల్ల పరిజాసంఘంతో, యీభీమాజేసినవారికీ, యెట్లాంటి గట్టిసంబంధం యేర్పడుతుందో, సంఘంమొత్తంమీద యిది యెంతలాభదాయకంగా వుండేది పాఠకులే వూహించుకో గలరు. భీమాడిపార్టుమెంటు వృద్ధి అయినకొద్దీ యెంతో పెద్దవ్యవహారాలు క్రొత్తగా సాగించవలసి వుంటుంది. వెనకవున్న భీమాదారులందరినీ పోకుండా పట్టవలసివుంటుంది. వైద్యపరీక్షలు చేయించాలి. వ్యవహారం దిద్దుకునేటందుకు ఆఫీసర్లను నియమించాలి. భీమాపద్ధతిని, దానికి విధింపబడిన శాస్త్రీయంగానడిపించాలి. ఈడిపార్టుమెంటునంతా జాగ్రత్తగా పట్టుకొని రావలసివుంటుంది. ఇంత మహాకార్యం జరిపేటందుకు యెంతమందికో వుద్యోగాలు యివ్వవలసివస్తుంది. ఎన్నిచోట్లనో యెంతమందో సమర్థులు దీనికి పూనుకోవలసి వుంటారు. వీరందరికి కావలసినంత పని కలిగితే నిరుద్యోగ సమస్య తొలగి పోతుంది. బాగా సరియైనపద్ధతిలో నడిచే భీమా ఆఫీసులో సంవత్సరం, సంవత్సరానికి బోలెడు సొమ్ము సమకూడుతూ వుంటుంది. కొన్నికొన్ని సమయాల్లో గంటగంటకూడా లెక్కలేని సొమ్ము పోగుపడుతుంది. దాన్నంతా గవర్నమెంటు సెక్యూరిటీల్లోనూ వినియోగించి భద్రంచేస్తారు. ఈప్రపంచములోవున్న గవర్నమెంటు సెక్యూరిటీలు నూటికి అరవై పాళ్లు అన్నీ భీమాకంపెనీలవే. ఇక యీ భీమాకంపెనీలవారి డబ్బు, పోర్టుట్రస్టునిధులలోను, మునిసిపాలిటీలలోను రైల్వే కంపెనీలలోను, ట్రాంబండ్ల కంపెనీలలోను, బొగ్గుగనులకంపెనీలలోను, స్టీమరు కంపెనీలలోను వాటాలుకొనుక్కొని పెట్టుబడిగా వేయబడియున్నది. అంటే ప్రభుత్వంవారు చేసే ప్రతికార్యమునకూ, యింకా ప్రజలు సమష్టిగా గావించే ప్రతిపెద్ద కార్యమునకు యీభీమాకంపెనీలే ధనసహాయం చేయుచుండును. లోకంలో జరుగుతున్న, ప్రతివుద్యమమూ, ప్రతివ్యవహారమూ, పరోక్షంగా యీభీమాకంపెనీల డబ్బుతోనే అభివృద్ధినొందుచున్నవని తెలియుచున్నది. ఈవిధంగా భీమాపద్ధతి వ్యక్తులకు ప్రయోజనకరమే కాకుండా, దేశంలో సోదరభావాన్ని వికసింపజేసి. ప్రజాశక్తినికూడ గట్టిసమ్మోహనయంత్రంలా గున్నది. భద్రత,సోదరభావము, ఐకమత్యము ఈమూడును భీమాకంపెనీల ప్రధానధర్మములు.





## భీమాకంపెనీలచరిత్ర.

పూర్వము సుమారు 200 సంవత్సరాల క్రిందటనే యేదోరూపంగా యీ భీమావ్యాపారం ప్రారంభం అయిందికాని, యిటీవల 25 లేక 30సంవత్సరాలనుండి మాత్రం జీవితాల భీమావ్యాపారం అత్యధికంగా వ్యాపిస్తోంది. "రాయల్ యెక్స్ఛేంజి కార్పొరేషను" "లండను అష్యూరెన్సు" అనుపేర్లతో మొట్టమొదట భీమాకంపెనీలు రెండున్నూ 1721-వ సంవత్సరం యేప్రిల్ 29-వ తేదీని కొత్త పట్టాలు సంపాదించి యింగ్లాండులో లైఫ్ యిన్స్యూరెన్సు వ్యాపారం మొదలు పెట్టెను. మొదటి 40 సంవత్సరాల్లోను రాయల్ యెక్స్ఛేంజి కంపెనీవారు మొత్తంమీదచేసిన లైఫ్ యిన్స్యూరెన్సు వ్యాపారం 10 వేలపౌనులు అనగా సుమారు సగటున సంవత్సరానికి 250 పౌనులు భీమావ్యాపారం చేశారన్నమాట. అప్పటికి భీమాచేసినవారికి డాక్టరుపరీక్షలు చేయించడంగాని, వయఃపరిమితి తేడాలుగాని నానావిధములైన భీమాపద్ధతులుగాని యేమీలేవు. ఈవ్యాపారానికి యింగ్లాండే పుట్టినిల్లయినప్పటికి,వారిని చూచి మొదలుపెట్టిన అమెరికావారు (కనడా సంయుక్తరాష్ట్రములు) అనేకరెట్లు వారినితలదన్ని విపరీతంగా అభివృద్ధిపొందుతున్నారు. ఇప్పుడు లెక్కవేస్తే ఒక్కఅమెరికాలోనే యీ జీవితాల భీమావ్యాపారం సంవత్సరానికి 4500 కోట్ల రూపాయలచొప్పున జరుగుతోంది. ఇంకా రెండు సంవత్సరాల్లో ప్రపంచంమొత్తంమీద లైఫ్ యిన్స్యూరెన్సు వ్యాపారం అంతటిలోను నూటికి 95 పాళ్లు ఒక్కఅమెరికావారిదే అయివుంటుంది.

ఇంగ్లాండులో 1824-వ సంవత్సరంలో బయలుదేరిన "యెలయెన్సు ఇన్స్యూరెన్సు కార్పొరేషను" వారు, అగ్నిభీమా సముద్రంభీమాలతోపాటు జీవితాల భీమానుకూడా యెక్కువగా చేయటానికి పూనుకొనిరి. జీవితాల భీమాకంటె వర్తక వ్యాపారాభివృద్ధికి తోడ్పడే అగ్నిభీమా, సముద్రంభీమాలే యెక్కువ ముఖ్యమని నమ్మి యింగ్లాండులో మొట్టమొదట వానికోసమే యెక్కువగా ప్రయత్నించారు. ఒక్కఅగ్నిభీమావిషయంలో లెక్కవేస్తే నేడు లండను మహానగరములో నున్న యావత్తు స్థిరాస్తిలోను మూడవవంతు యీపై ఒక్కకంపెనీలోనే భీమా చేయబడివున్నది. తరువాత లైఫ్ యిన్స్యూరెన్సు వ్యాపారంలో కూడా యింగ్లాండుదేశము క్రమక్రమంగా యెక్కువ అభివృద్ధిచేయ నారంభించెను. లండనులో బయలుదేరిన "ప్రూడెన్షల్" కంపెనీ లైఫ్వ్యాపారంలో మొన్నమొన్నటి వరకు ప్రపంచంలోకెల్లా అగ్రస్థానము వహించి ఉండెను. కాని యిటీవల అమెరికాదేశములోని న్యూయార్కు పట్టణమునందు స్థాపించబడిన ఒక్క మెట్రిపాలిటన్ కంపెనీమాత్రము దానితో పోటీచేసి యీప్రూడెన్షల్ కంపెనీని వెనకకు ద్రొక్కి ప్రపంచములో నేడు తానగ్రస్థానము సంపాదించుకొన్నది. ఈరోజున లెక్కజూస్తే మెట్రపాలిటన్ కంపెనీయొక్క నిల్వ ఆస్తికిమ్మతు 600 కోట్ల రూపాయలు. దీనిలో మొత్తము 4800 కోట్ల రూపాయల లైఫ్ వ్యాపారం అమలులో వున్నది. ఈ కంపెనీయొక్క సంవత్సరాదాయము 150 కోట్ల రూపాయలు, (మన యిండియా గవర్నమెంటువారి సంవత్సరాదాయం 130 కోట్ల రూపాయలు మాత్రమే అని జ్ఞాపకం వుంచుకోండి.)

## క న డా.

కనడా 1846-వ సంవత్సరములో కళ్లుతెరచి స్వంత లైఫ్ యిన్స్యూరెన్సు కంపెనీలు పెట్టుకోవడం మొదలుపెట్టింది. అంతవరకు వారిభీమావ్యాపారం అంతా దాదాపుగా యింగ్లాండుకే సంక్రమిస్తూవుండేది. ఆసంవత్సరములోనే కనడియన్ లైఫ్ యిన్స్యూరెన్సుకంపెనీపుట్టింది. తరువాత క్రమంగా సన్ లైఫ్కంపెనీ బయలుదేరింది. ఈ కంపెనీలు పుట్టినప్పుడు కనడాదేశంలోని జనసంఖ్య యిపుడున్న జనసంఖ్యలో మూడోవంతుకూడా లేదు. ఇప్పుడుకూడా కనడాదేశపు జనసంఖ్య 90 లక్షలకంటె యెక్కువలేదు. వీరిప్పుడు తమదేశంలోనేగాక ప్రపంచమందంతటనూ, తమ భీమావ్యాపారాన్ని వ్యాపింపజేస్తున్నారు. నేడే కనడాదేశపు కంపెనీలు మొత్తమున 13000 కోట్లరూపాయల లైఫ్వ్యాపారము చేయుచున్నవి. ఈ ధనం అంతా తిరిగి అనేకవిధాలుగా ఆదేశక్షేమానికే వినియోగపడుతోంది. కనడాలోని రైల్వేలలో సుమారు సగముభాగం యీ భీమాకంపెనీలవే. వేయేల, ఆదేశంలోని ప్రజాలాభంకోసం జరిగే సకలవుద్యమాల్లోను భీమాకంపెనీల పెట్టుబడి లేనివి లేవనే చెప్పవచ్చును.

## అమెరికా.

సర్వవిధాల అమెరికా యిప్పుడు ప్రపంచంలో అగ్రస్థానం వహిస్తోంది. అంతటి భాగ్యవంతమైనదేశం యింకొకటి లేదు. ఒకదేశభాగ్యం నిర్ణయించడానికి

ఆదేశంలోని భీమాకంపెనీలుకూడా ముఖ్యాధారం. ఈభీమావ్యాపారంలోకూడా అమెరికా అన్ని దేశాలను తలదన్నుతోంది. 1906-వ సంవత్సరములో అమెరికాదేశీయుల లైఫ్ యిన్స్యూరెన్సు వ్యాపారము మొత్తము 1300 కోట్ల రూపాయలు మాత్రమే. ఇప్పుడు మళ్లా లెక్కచూస్తే 24 వేల కోట్లరూపాయల లైఫ్ భీమా వ్యాపారం యీదేశం ఒక్కటే చేస్తూన్నది. ప్రపంచంలో లైఫ్ వ్యాపారంలో నూటికి 75 పాళ్లు వీరిచేతుల్లో వుంది. ఈదేశంలోని లైఫ్ కంపెనీల మొత్తం ఆస్తిఖరీదు 4500 కోట్ల రూపాయలు. ఈపెద్దమొత్తములో నూటికి 35 వంతులు ఇతర రైల్వేల మీదను, 30 వంతులు స్థిరాస్తులమీదను, 16 వంతులు భూమితనఖామీద చౌకరేటు వడ్డీలకు రైతుల ఋణముగాను, 9 వంతులు గవర్నమెంటు అప్పు పత్రములలోను, 10 వంతులు ప్రజోపయోగమైన మహత్కార్యములకు పెట్టుబడిగాను వినియోగపడు చున్నది. ఈ భీమాకంపెనీల డబ్బుతోనే అమెరికాలో అనేకవేల కుటుంబాలకు స్వగృహము లేర్పడినవి. ఈడబ్బుతోనే అనేకవేలమంది రైతులు ఋణవిముక్తులగుటయే గాక అనేక నూతనమార్గము లవలంబించి వ్యవసాయము నెంతో అభివృద్ధి చేయుచున్నారు. ఈడబ్బుతో బయలుదేరిన యెలెక్ట్రిసిటీ, గ్యాసుకంపెనీలు లెక్కలేదు. 1906 సంవత్సరములో అమెరికా జనసంఖ్యలో నూటికి 17 మంది చొప్పున అనగా మొత్తమున 150 లక్షలమంది జీవితాలను భీమాజేసిరి. 1926-వ సంవత్సరములో నూటికి 49 మంది చొప్పున అనగా మొత్తమున 580 లక్షలమంది అమెరికనులు లైఫ్‌యిన్స్యూర్ చేసివున్నారు. అమెరికాలో లైఫ్‌వ్యాపారం చేసే భీమాకంపెనీల మొత్తం 300 ఇవన్నీ దాదాపుగా తమదేశంలోనే పనిజేయుచున్నవి. ఈవ్యాపారం అమెరికాలో ప్రారంభమై యిప్పటికి 83 సంవత్సరాలయినది. 14 సంవత్సరాల క్రిందటివరకు వారి భీమామొత్తము 1800 కోట్ల రూపాయలు మాత్రమే. అమెరికాలో లైఫ్‌భీమావ్యాపార మింత అభివృద్ధి పొందటానికి ముఖ్యకారణాలు రెండు. యుద్ధములలో ప్రజలు నిర్బంధముగా మృత్యుముఖములోనికి దూకుటయు, 1918-వ సంవత్సరంలో దేశాన్నిసంక్షోభపెట్టిన యిన్‌ఫ్లూయంజా జ్వరమున్నూ! ప్రజల నెక్కువగా యిటీవల భీమావ్యాపారమునకు పురికొల్పెను.

## జపాను.

1881-వ సంవత్సరమువరకు లైఫ్ యిన్స్యూరెన్సు అంటే యేమో జపానునకు తెలియనేతెలియదు. ఆసంవత్సరంలోనే అచట మొదటి భీమాకంపెనీ స్థాపించారు. 1924-వ సం॥రంలో లెక్కచూస్తే 600 కోట్ల రూపాయలు మొత్తం భీమావ్యాపారాన్ని వారు చేయగలిగిరి. ఇపుడు వారు సంవత్సరానికి 150 కోట్ల రూపాయల చొప్పున భీమావ్యాపారం చేస్తున్నారు. జపాను గవర్నమెంటువారు విదేశపు భీమాకంపెనీలు తమ దేశంలో వ్యాపారంచేసుకోడానికి వీలులేకుండా అనేక కఠిన విఘాతాలు కల్పించి తరిమివేయుచు తమ కంపెనీల అభివృద్ధికెంతో తోడ్పడుతున్నారు. ఇపుడు జపానులో 50 అగ్నిభీమాకంపెనీ లున్నవి. వాని ఆదాయము 23,000,000 పౌనులు. సముద్రంభీమాకంపెనీలు 42. వాని ఆదాయము 10,288,875 పౌనులు. లైఫ్ భీమాకంపెనీలు 42 గడచిన 4 ఏండ్లలోను జపానువారు రెట్టింపు లయిఫ్ వ్యాపారం చేశారు. సంవత్సరానికి 75కోట్ల రూపాయలచొప్పున జపానువారి లైఫ్ వ్యాపారం వృద్ధి అవుచున్నది. 1925 సం॥ లో యీకంపెనీ లన్నింటి ఆదాయం మొత్తం 23,620,723 పౌనులు. వారి వ్యాపారం మొత్తం 40,023,460 పౌనులు. ఇదిగాక పోస్టాఫీసు యిన్స్యూరెన్సు డిపార్టుమెంటు ఒకటి 1916సం॥లో ప్రారంభించారు. వారు చేసిన భీమావ్యాపారం మొత్తం 105,000,000 పౌనులు.

ఈదేశంలో పూర్వము 1834 వ సం॥ మునకును, 1845-వ సం॥కును మధ్య రెండు భీమాకంపెనీలు కేవలము క్రైస్తవులకు మాత్రమే బయలుదేరెను. 1829-వ సం॥ లో మద్రాసునందు "మద్రాసు యీక్విటబుల్" అనే కంపెనీ పుట్టి సుమారు నూరు సంవత్సరా లవిచ్ఛిన్నంగా పనిచేసి, 1906 సం॥లో ఆర్బతునాటు కంపెనీవారి దివాలాలో కలిసి నశించిపోయెను. తర్వాత 1871 సంవత్సరములో బొంబాయి "మ్యుచువల్" అనేకంపెనీ స్థాపించబడినది. ఇప్పటికి పనిచేసే కంపెనీలలోకెల్ల యిదే అత్యంత పురాతనమైనది. దీనితర్వాత 1874 సం॥ లో ఓరియంటల్ కంపెనీ పుట్టి అత్యంత శ్లాఘనీయంగా పనిజేస్తూన్నది. ఇప్పుడీ దేశంలోని భీమాకంపెనీలలోకెల్ల యిది సర్వవిధాల రాజని చెప్పవచ్చును. మనదేశములో యిప్పుడు సుమారుగా సంవత్సరానికి 10 కోట్ల రూపాయల భీమావ్యాపారము జరుగుతోంది. ఇందులో సగభాగమీవొక్క కంపెనీకే సంక్రమిస్తోంది. ఇప్పుడీ దేశంలో లయిఫ్ భీమావ్యాపారం జేసే స్వదేశీకంపెనీలు 57 గలవు. ఇవి అన్నీ కలిసి మొత్తం సుమారు 60 కోట్ల రూపాయలకు తక్కువగానే భీమావ్యాపారమును చేయుచున్నవి. ఇవి గాక మన దేశంలో సన్ లయిఫ్ మొదలగు 23 విదేశి భీమాకంపెనీలు పనిజేస్తున్నవి, ఈవిదేశి కంపెనీలు ప్రీమియముల రూపముగా సంవత్సరానికి సుమారు 10 కోట్ల రూపాయలు యేటేట దోచుకొనిపోవుచున్నవి. ఈ కంపెనీలలో భీమాచేయుటకంటె దేశద్రోహకరమైనపని యింకొకటి లేదు. మనదేశధనాన్ని కోట్లకొలది నిరంతరము దోచుకొనిపోవుచున్నను యీ సన్ లైఫ్ కంపెనీ పుట్టినిల్లయిన కనడాదేశములో భారతీయు లెవరును తక్కినదేశాల్లోవలె అడుగుపెట్టడానికైనా వీలులేదు. మనల నంత అవమానకరంగా చూచే యీకనడాదేశపు కంపెనీలలో భీమాచేయుట మిక్కిలి లజ్జాకరమైనపని. శాస్త్రానికైనా ఒక్క కనడాదేశస్థుడు మనదేశంలోని పుత్రమైన కంపెనీలో కూడ ఒక్క వేయిరూపాయలకైనా భీమాచేసివుండడు. కాబట్టి యీసన్ లయిఫ్‌వగైరాకంపెనీలలో భీమాచేయడంగాని లేక వీనికిఏజెంటుగా పనిచేయుటగాని, భారతజాతియొక్క గౌరవానికి చాలాహానికరమైనదని మనవిచేస్తూ ఆత్మగౌరవము గలదేశీయు లెవ్వరును ఎంతలాభకరంగా వున్నా, అట్టి పాపానికి వొడిగట్టకుందురుగాక యని ప్రార్థిస్తున్నాను.

ఇండియా దేశంలోని 57 భీమాకంపెనీల ఆస్తిని మొత్తంలెక్కవేస్తే 1925 సంవత్సరాంతానికి సుమారు 17 న్నర కోట్ల రూపాయ లుండెను. ఈదేశములో ఒకమనిషి సగటు ఆయుర్దాయపరిమాణం 29 సంవత్సరములు మాత్రమే ఇంగ్లాండు మొదలైన పాశ్చాత్యదేశాల్లో యీసగటు ఆయుర్దాయపరిమాణం 43 సం॥ మొదలు 78 సం॥ లవరకు వుండును. ఈదేశంలో వున్నన్ని అంటువ్యాధులు అకాలమరణాలు యింకెక్కడా లేవు. అయినప్పటికీ యీదేశంలో జరుగవలసినంత భీమావ్యాపారం జరగటంలేదు.

## నీగ్రోలు.

మనదేశంలోని మాలమాదిగలు, ఎరుకల యేనాదులవంటి నిమ్నజాతులవారు అమెరికా ఆఫ్రికాదేశాల లోకూడావున్నారు. వీరికి నీగ్రోలనిపేరు. వీరు నల్లగావుందురు. వీరిని అనాగరికులని తెల్లవారు,మనం నిమ్నజాతులను చూచినట్లే హీనంగా చూస్తున్నారు. వీరిలో యిటీవల వివేకోదయం గలిగి వారియభివృద్ధికై అనేక ప్రయత్నాలు చేసుకొంటున్నారు. అట్టి యీ నీగ్రోజాతివారు అమెరికాలో ప్రత్యేకంగా తమపేరుతో 420కోట్ల రూపాయల మొత్తాన్ని భీమాచేసివున్నారు.

ఇందులో 57 కోట్ల రూపాయలు భీమావ్యాపారం నీగ్రోజాతివారు, తాము ప్రత్యేకంగా తమకొరకు స్థాపించి నిర్వహించుకొనుచున్న నీగ్రో భీమాకంపెనీలలో వున్నది. తక్కినదంతా తెల్లవారి కంపెనీలలో వున్నది. నీగ్రోలకంటె అధికుల మనుకొనే భారతీయులీవిషయంలో యెంత వెనుకబడియున్నారో చూడండి. మన దేశం తక్కినదేశాలతో పోల్చిచూచినప్పుడు భీమావ్యాపారంలో యెంత వెనుకబడివున్నదో యీక్రింది అంకెలవలన తెలియగలదు. ఇటీవల లెక్కవేయగా:—

| దేశం పేరు. | అమలులోవున్న భీమావ్యాపార మొత్తం. | పదిసంవత్సరముల క్రిందటి జనసంఖ్య. |
|---|---|---|
| యునైటెడ్ స్టేట్సు | 27000 కోట్లు | 920 లక్షలు |
| గ్రేటుబ్రిటను రాజ్యము | 3300 | 450 |
| కనడా | 1500 | 72 |
| జపాను | 1000 | 568 |
| జర్మనీ (యుద్ధానంతరం) | 700 | 650 |
| ఆస్ట్రేలియా | 600 | 49 |
| హాలెండు | 400 | 62 |
| స్వీడను | 400 | 58 |
| ఫ్రాన్సు | 400 | 396 |
| స్విడ్జర్లాండు | 200 | 38 |
| ఇటలీ | 150 | 361 |
| నార్వే | 150 | |
| డెన్మార్కు | 150 | 29 |
| బ్రేజిల్ | | 265 |
| అర్జంటైన్ | | 85 |
| పెరూ | 150 | 46 |
| చిలీ | | 38 |
| పెరాగ్వే | | 8 |
| ఇండియా | | 3100లక్షలు |

ఆబాలగోపాలం దేశంలోవున్న జనసంఖ్యమీద దామాషా లెక్కవేస్తే తేలిన వివరం.

| | |
|---|---|
| అమెరికాలో తల 1-కి | భీమామొత్తము రూ 2400 |
| కనడాలో | 1300 |
| న్యూజిలెండులో | 900 |
| గ్రేటుబ్రిటనులో | 600 |
| ఆస్ట్రేలియాలో | 600 |
| నార్వేలో | 450 |
| స్వీడనులో | 420 |
| హాలెండులో | 390 |
| డెన్మార్కులో | 330 |
| ఇండియాలో | 2 |

న్యూయార్కు పట్టణములోని ఒక మెపాలిటన్ లైఫ్ యిన్స్యూరెన్సు కంపెనీవారి వ్యాపారం యెంతవిపరీతంగా పెరిగినదో యీక్రింది అంకెలవలన తెలియగలదు.

1927 సం॥లో యీ కంపెనీవారు 18,938,639 డాలర్ల ధనము పెట్టుబడి పెట్టి. 19,341 గృహములను నిర్మించి, 20,645 కుటుంబములకు సంపూర్ణగృహ సౌకర్యములను, 451 యిండ్లు గదులుగా కట్టించి 6894 కుటుంబములకు అసంపూర్ణ గృహసౌకర్యములను కలిగించిరి.

ఈ కంపెనీవారు 1920 సం॥ మొదలు 1927 సం॥రం ఆఖరువరకు మొత్తమున 590,861,450 డాలర్లు ఖర్చుపెట్టి 92,207 గృహవసతులను నిర్మించి 1,54,516 కుటుంబాలకు గృహసౌకర్యములు కలిగించిరి. మరియు వీరు 1927 సం॥లో వ్యవసాయాభివృద్ధికై రైతులకు 197,115,095 డాలర్ల (డాలర్లంటే సుమారు మూడురూపాయల ఖరీదుండును) ధనమును చౌకవడ్డీలకు భూమితనఖామీద అప్పు పెట్టిరి. ఈవిధంగా అమెరికామొదలైన దేశాలలో యీ భీమాకంపెనీలే అపారమైన తమధనంతో అనేకమైన మహత్కార్యాలు సాధించుచున్నవి. దీనినిబట్టి భీమావ్యాపారం మనదేశాభివృద్ధికిన్నీ రైతుజనక్షేమానికిన్నీ యెంత ఆవశ్యకమైనదో గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమంలో యిది యెంతముఖ్యమైనదో పాఠకులే యూహించుకొందురుగాక,

---



# "మురళీధ్వని" విమర్శనము.

సబ్నవీసు సత్య కేశవ రావు గారు, కవితాసమితి.

హృదయకుహరంబున నిబిడీకృతంబైన సద్భావంబులఁ బ్రకృతితో మేళవించి రసవంతముగ సలక్షణముగ వ్రాయునతఁడు కవి; ప్రకృతిగీతిజ్ఞుఁడు కవి; నవభావసృష్టికర్త కవి; అపర బ్రహ్మ కవి; కవిజన్మము దుర్లభము; కవిజన్మము సార్థకము.

చుక్కలలోఁ జంద్రునివలె, పర్వతములలో మేరువుపర్వతమువలె, రత్నములలో వజ్రమువలె, సరోవరంబునఁ బద్మమువలె, గోపకులలోఁ గృష్ణునివలె, దేవతలలో నింద్రునివలె, మానవలోకంబునఁ గవి, షోడశకళాప్రపూర్ణుండై సంపూర్ణశరచ్చంద్రునిబోలె దేదీప్యమానంబుగఁ బ్రకాశించును. కవికిఁ జొరరాని తావు లేదు. రారాజసభామంటపంబులు కవికిఁ గేళీస్థానంబులు, సమస్త మానవ హృత్కమలంబులు కవికి నాటపట్లు. సమస్తలోకానభిషిక్త సార్వభౌముఁడు గవి. సృష్టియంతయుఁ గవికిఁ గీలుబొమ్మ. కవి, యొకతఱిఁ, గోపారుణనేత్రంబులతో, నాభీలాగ్నిజ్వాలాశిఖావళితో రాజసభాస్తంభమును బెళపెళధ్వానంబులతో వ్రయ్యలుసేసి ప్రత్యక్షంబైన నృసింహమూర్తియై, సాంద్ర నీల నీరదగంభీర పటపటార్భాట నిస్వనంబున లోకంబును గంపింపఁజేయును. ఒకతఱి, సంతత హరిచింతనాలాలసుండై హస్తవిన్యస్తమస్తకుండై భక్తాగ్రేసరుండై యలరారు ప్రహ్లాదుండై, లోకంబున భక్తిరసంబును ముంచియెత్తును. ఇంకొకతఱి మన్మథశరసమాన సుందర గోపికా పరివేష్టితుండైన శ్రీకృష్ణుండై, సరససల్లాపంబులచే, మురళీగాననినాదంబుచే, విశ్వమునంతటిని నానందతరంగడోలికల నూఁగులాడించును; పారవశ్యమున ముంచివేయును:—

పై నుదాహరింపఁబడిన లక్షణంబులను, నట్టియితరలక్షణంబులను నాదర్శముగ నుంచుకొని రసవంతముగఁ బద్యగద్యగేయములను వ్రాయుటకు సహజముగ వాఙ్మయోపాసకులు కృషిసల్పుదురు. ఇట్టివారిలో శ్రీయుత పురిపండా అప్పలస్వామిగా రొకరు; సాలూరు వీరి జన్మస్థానము; 1904–వ సంవత్సరమున వీరు జన్మించిరి. ఇప్పు డించుమించుగ వీరికి ఇరువదియైదు సంవత్సరముల ప్రాయముండును. బాల్యమునుండియు స్వామిగారికిఁ గవితాభిలాష మెండు. వ్యాకరణఛందశ్శాస్త్రంబులఁ బఠింపకపూర్వమే యీయనవచనమునే పద్యరూపంబున వ్రాయుచుండిరఁట. బాలురభాగ్యములు బొమ్మలాటలలోనే తెలియుఁగదా! లక్షణజ్ఞులైనపిమ్మట స్వామిగారు ప్రమదాపరిణయ మనునాటకంబును వ్రాసిరి. వీరికి నుత్కల, హిందీ, వంగభాషలలోఁగూడఁ దగుప్రవేశము గలదు. ప్రస్తుతము విమర్శనీయాంశ మీ కవిచే వ్రాయఁబడిన "మురళీధ్వని."

ఈఖండకావ్య మాహ్వానముతోఁ బ్రారంభ మగును. ఇందు "కటికిఱాలనుసైతముఁ గరఁగికరఁగి తత సముద్వేల వాహినీతతులు గాఁగఁ......నఖిల విశ్వంభరామనోహరముగాఁగ, లీలఁ దనరార బాలగోపాలమూర్తి యెలమి మోహనమురళి వాయించు నదిగో! రారె! యాలింప గోపికారమణులార!" యని కలదు. ప్రారంభమాహ్లాదకరముగ నున్నది. దీనిచేఁ గవి, తనప్రజ్ఞావిశేషములఁ గూర్చి సంపూర్ణవిశ్వాసముఁ గలవాఁ డని తోఁచుచున్నది. కాని, యిం దాహ్వానము చేయుచున్న "బాలగోపాలమూర్తి" యెవరు? శ్రీకృష్ణుఁడా? కవియా? లేక యింకొకఁడా? ఇందలి "బాలగోపాలమూర్తి" శ్రీకృష్ణుఁడుకాఁడు. ఎన్నఁడో యవతారంబును జాలించిన శ్రీకృష్ణుం డిప్పు డెక్కడనుండివచ్చును? కృష్ణుఁడుగానిచో మఱియెవ్వరు? ఈ "మురళీధ్వని" జగద్వ్యాప్తిం జెందకపూర్వ మిద్దాన్ని వ్రాయఁగలవా రెవ్వరు? చదువఁగలవా రెవ్వరు? కవి యొక్కఁడే తదితరులు గారు. కాఁబట్టి "మురళీధ్వని" యందు "బాలగోపాలమూర్తి" పాత్రను ధరించినవాఁ డేతత్ ఖండకావ్య కారకుఁడే. ఈ సందర్భమునఁ బాఠకులదృష్టిని "మురళీధ్వని" ముఖపత్రంబువైపు త్రిప్పుటయనుచితముగాదు. అందు మురళిని వాయించుచున్నట్లు నిలిచిన శ్రీకృష్ణుని ప్రతిమ కలదు; దానిక్రింద గ్రంథకర్తనామము గలదు విమర్శకదృష్టితో నీముఖపత్రంబును జూచువారికి "బాలగోపాలమూర్తి" కవియే యని తోఁచకపోదు.

ఇఁక "గోపికారమణు" లెవరు? శ్రీకృష్ణుఁ డిక్కాలంబున దృగ్గోచరుండు గానిచోఁ దత్ప్రియ లగు "గోపికారమణు" లెక్కడి నుండి వచ్చెదరు? కవియభిప్రాయ మేమి? ఒకవేళఁ గవి శ్రీకృష్ణుని సంస్మరించినప్పుడు తన్మనః ప్రపంచమున సర్వాలంకృతలైన గోపికలు ప్రత్యక్షమై యుందురు. ఇక్కారణంబునఁ గవి, గోపికలను మాత్రమే తన "మురళీధ్వని" నాలకింప నాహ్వానము చేసె నని తలంపరాదు. గోపికాహ్వాన మను నెపంబునఁ గవి, లోకులనందఱను నాహ్వానము చేయుచున్నాఁడు. కవులు శృంగారరసప్రియులు గదా! వారి యాహ్వానముగూడ శృంగారరససమ్మిళితమై యుండును.

ఈ కావ్యంబునఁ బ్రేమరసము పొంగి పొరలుచున్నది. కవి, "హృదయ వేదన" మునఁ బ్రియురాలి నుద్దేశించి "నాప్రేమవల్లి, నాదుప్రణయసామ్రాజ్యలక్ష్మి, నాభాగ్యరాశి, నావలపుపేటి, నా రతనాలదొంతి, సరసమృదుగాత్రి, చారువిశాలనేత్రి, నన్ను నెడఁబాసిపోయిన నాఁటినుండి నామనోబ్జమ్ము ముకుళించి నవసిపోయె...నా జీవితంబు తుచ్ఛమై దుర్భరంబునై తోఁచు......ఈ నిశివేళలందు గగనపథమునఁ దారకాగణము రాల్చు నశ్రుకణముల నానయనాశ్రుధారఁ గలిపివైతు" నని విలపించును. ఇచ్చట యథార్థముగాఁ దారకాగణము జలబిందువులను రాల్చుట ప్రకృతివిరుద్ధము. జలమును వర్షించునది మేఘము; హిమముజలరూపంబున భూమిపైఁ బడును. అయినను కవి విషాదప్రపూరితహృదయుం డగుటచే లోకమంతయును దుఃఖావృతమైన ట్లతనికి దృగ్గోచరమైనది. మనస్సుయొక్క స్థితి యెట్లుండునో యట్లే సర్వమును మాఱును. మానసము సంతోషపూరితమైనచో సృష్టియంతయును గలకలలాడుచున్నట్లు కనిపించును. మానసము దుఃఖవివశమై యున్నయెడ విశ్వమంతయు దుఃఖమయమై యున్నట్లగపడును. ఇది మానవులకు సహజ



యస్. అన్నామలై శెట్టిగారు.



రాజకుమార ముత్తయ్యశెట్టిగారు.



[illegible] సర్. యస్. ఆర్. యమ్. అణ్ణామలై శెట్టిగారు.



పామలపాటి వేంకట కృష్ణయ్య చౌదరి గారు.



కా॥ బ॥ అబ్దుల్ రజాక్ సాహెబ్ బహదూర్ గారు.



శ్రీ దావులూరు. మునిరత్నంనాయుడు గారు.



శ్రీయుతులు డి. వి. ఆదినారాయణయ్య

డాక్టర్ డి. యస్. పుట్టన్న, యమ్. డి. చిన్నబసన్న గారు.



పి. వి. రాజమన్నారు నాయుడు గారు.



కొడాలి శివరామకృష్ణ రావు గారు.



పూరిపండ అప్పలస్వామి గారు.

లక్షణము కాన, గగనమునుండి గాలుజలబిందువులు తారక రాల్చు
వస్త్రధారలని, కవి యుత్ప్రేక్షించినాఁడు. మఱియొకచోటఁ (విషా
దము) బ్రియురాలి నెడఁబాసినది మొదలు "కోకిలపాటకన్న, చిల్క
పలుకకన్న, తుమ్మెదల నినాదమ్ముకన్న, పారావత ధ్వనులకన్న,
భారతవిహగపు రాణి సుస్వనముకన్న,.........యీ విషాదగీత
మ్ములే నాకు మోద మొసఁగు" నని కవి యనుచున్నాఁడు.
"ఆర్తి"యందుఁ గవి, స్త్రీపాత్రను దాల్చి నాథునుద్దేశించి "గాఢాం
ధకారసంకుచితదుర్గమభూమి నను డించిపోయె దేల?...ఆత్మసంజనిత
ఘోరార్తవ్రణాదంబు నాలింప రావేలనో" యని విలపించును.
యథార్థముగ హృదయము విషాదపూరితమైనచో నీదీర్ఘసమాసము
లను, నీమంజులశబ్దసౌష్ఠవమును బ్రదర్శించుట కెట్లు సాధ్యమగును?
హృదయము శోకావృతమైనపుడు కవిత్వమునకుఁ దావులేదు. "హృ
దయవేదన, విషాదము, ఆర్తి" యను గీతగేయములను జదువు
నప్పుడుకాని, పాడునప్పుడుకాని, శోకము గాక శోకరసప్రపూరిత
మైన సావేరి రాగాలాపనము వీనుల సోఁకినఁ గల్గుసంతోషము కలు
గును. మనస్సు విచారపూరిత మైనచో నన్యవిషయములఁగూర్చి
యోచించుటకు సాధ్యముకాదు. మాటాడుటకు నోరురాదు. విషా
దము తగ్గవలెను. మాట పైకి రావలయును. విషాదమును శమిం
పఁజేయునది కాలము. కాలము కడచుచున్నకొలఁది విషాదము
క్రమక్రమముగా నుపశమించును. అప్పుడు మనోభావంబులు మాట
లలోనికి మాఱును. మాటలు క్రియారూపంబులఁ దాల్చును.
ఇప్పటికి విషాదము ముప్పాతికమువ్వీసము తగ్గియేయుండును. ఇఁక
శబ్దాలంకారములఁ గూర్చియు, నర్థాలంకారములఁ గూర్చియు,
దీర్ఘసమాసములఁగూర్చియు నాలోచించి, యాలోచించి, యేది
యైన నొకవిషయముగూర్చి వ్రాయునప్పుడు విచారము పూజ్యము.
కవిత్వమునకు రసమే ప్రధానము; రసప్రదర్శనార్థ మేకాగ్రచిత్తుఁ
డైనకవిమానసంబున విషాదమునకుఁ దా వెచ్చట నున్నది? కవిత్వ
విషయములలోఁ గవి ప్రదర్శించు విషాదము మృష. "Where
there is leisure for fiction there is no grief" అని జాన్సన్ మహాకవి
నుడివినాఁడు. "చిత్రపటము"నఁ గవి స్త్రీపాత్రమును దాల్చి,
ప్రియుని చిత్రపటంబును వ్రాసి, దానిని గన్నారఁగాంచి, వియో
గతాపంబున నొక్క వేఁడినిట్టూర్పువిడుచును. మఱియొక్కచోట
(నేను నీవు) "ప్రేమ దిలకించు పద్మినీభామ వీవు, జగము నలరించు
బాలభాస్కరుఁడ నేను...ప్రవిమలానంద పూర్ణకైరవి వీవు, ప్ర
మదలోకేశుఁడైన చంద్రుఁడను నే" నని కవి, తనకును దన ప్రియు
రాలికిని గల యవినాభావమునే నత్యంతప్రేమమును దెలియఁబఱ
చుచున్నాఁడు. ఇంకొకతఱి (సందేశము) "నీవు రావేని యీ య
జాండమందు రవ్వంతయేని సౌఖ్యంబు లేదు. జన్మమెత్తిన ఫలము
లేశంబు లేదు...నీవు నాకంటఁబడనియట్టి పాడుజీవనమేల? దుర్భ
రము"చుఁ బ్రియురాలికిఁ దెలియఁజేయ మధుపంబును రాయబా
రిగాఁబంపును. ఈవిధముగాఁ బ్రేమ "మురళీధ్వని"యందనేకరీతులఁ
బ్రదర్శింపఁబడినది. ఈప్రేమ నిష్కళంక మైనది.

కవి, ప్రకృతిప్రవాహినీజలంబున మగ్నుఁడై తత్తరంగ
డోలికల నూఁగులాడును. తన యాత్మను ప్రకృతిబ్రహ్మముతో
నైక్యము చేయును; ప్రియావియోగంబునఁ గలిగిన తనయశ్రుధార
లను బ్రకృతి వర్షించుహిమజలబిందువుల మేళవించును. "పారా
వతధ్వనుల కన్న, భారతవిహగపు రాణిసుస్వనముకన్న" తన
విషాదపుఁగేకయె మేలని సంతుష్టి జెందును. "మల్లెలారా! మొల్ల
లారా! మహితచూతకుజంబులారా! కామజనకునిఁ దోడితేరే"
యని ప్రకృతిని సంబోధించును. ఇవి కవియొక్క ప్రకృతిప్రేమను
జాటుచున్నవి. ఈప్రేమ "అన్వేషణము" నందు, "నాజీవనౌక"
యందుఁగూడఁ గలదు.

ప్రేమ మాత్రమేకాక దేశభక్తిగూడఁ, గవిహృదయం
బున నలరారుచున్నది. సస్యశ్యామలమై యశేషధనకనకవా
హనవిరాజిత మై, నానారాజమౌళికిరీటమణిరంజిత పాదపీఠ మై
యొకప్పుడు దేదీప్యమానంబుగఁ బ్రకాశించుచునుండి, నేఁడన్యా
క్రాంతమై, దరిద్రదేవతా దంష్ట్రాలంకార నిస్వనంబుచే బెదరి
తద్దృగ్వహ్నిశిఖలచేఁ దపించి నిర్వర్ణమైయున్న భారతమాతను
జూచి "తల్లీ!" యని కవి సంబోధించినాఁడు. ఏమి యీ మాతృ
ప్రేమ! హృదయము నీరగుచున్నదే! కవి యీమెయొక్క పూ
ర్వోన్నతస్థితిని స్మరించును; ప్రస్తుతదారిద్ర్యావస్థను గాంచును;
పాంచాలికా పరాభవంబును జ్ఞప్తికిఁ దెచ్చికొనును; ఒక్కసారి
భోరున నేడ్చును; "కండకావరమునఁ గన్నుఁగానకుండ......నిన్నింత
పఱిచినట్టి కుటిల సంఘదోర్గర్వమ్ము కూలిపోదె" యని తల్లి నోదా
ర్చును. శోకక్రోధప్రపూరితహృదయుండై రక్తవర్ణాంచితోరునేత్ర
ద్వయమునుండి యశ్రుబిందువులఁజోటచోటరాల్చును. నొక్కసారి
దేశమువంకకుఁ దిరిగి "నిండుసభలోన మీయన్నునెలఁత నిట్లు భంగ
పఱచుటఁ గాంచియుఁ బలుక రేల? కాలెనొక్కొ మీ పౌరుష
గర్వ పటిమ. పేరుమాసెనే, మీభుజవిక్రమంబు నమసెనే,శత్రు
భీకరక్షాత్ర తేజ" మని యనేకవిధముల భారతపుత్రులనుగార్యరంగ
మునకు నుఱుకఁ బ్రోత్సహించును. "పరిత్రాణాయసాధూనాం వినా
శాయ చ దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే
యుగే" యని వాగ్దానము నొసంగిన శ్రీకృష్ణుని "చరణయుగళి
భక్తిధ్యానింపు"మని భారతమాత నూఱడించును. "తల్లి కారవ
సభలోని పాంచాలి" యను పద్యమువలనఁ గవి, తీవ్రనిష్క
ల్మష భారతదేశభక్తిప్రపూరిత హృదయుండని చెప్పవచ్చును.
దేశసేవకై యీకవి చేసినత్యాగ మిందులకుఁ దార్కాణము; వీరు
సహాయనిరాకరణోద్యమమున నిర్వేతనులైకష్టమనక గ్రామగ్రామము
లం దిరిగి ప్రచారము నలిపిరి; తత్సందర్భమున శ్రీగంధిమహాత్మునికి
నత్యంతప్రియ మగురాట్నమును బ్రజలచే స్వీకరింపఁజేయుటకు వీరు
"రాట్నపతాక" మను నొక చిన్నపుస్తకమును వ్రాసిరి.

"విషాదగీతము" "పేదఱికము"—ఈగీతమాలికలు గవి
యొక్క సంతుష్టిని దెలియఁజేయును. ప్రియురాలింగూర్చి తనకుఁ
గలిగిన విషాదము "జంటితేనియలను గ్రోలి సొక్కి సోలి జుమ్మ
నెడు తుమ్మెదల నినాదమ్ము కన్న, పారావతధ్వనులకన్న నధిక
మగు మోదము నొసంగును. అనఁగాఁ దనప్రియురాలింగూర్చి
కల్గిన విచారపుఁదలఁపులు ప్రకృతివైభవముకంటె మేలని కవితాత్ప
ర్యము. "పేదఱికము"గూడ నిట్టిద. "ఇతరసద్బుద్ధి మది జనియింప
నీక, హృదయశాంతి నొక్కింతయు నొదవనీక, దీనజనదుఃఖము
నీక, దైవభక్తిమానససీమఁ దనరనీక బాధపఱచెడు ధన
దెలియనీక, దైవభక్తిమానససీమఁ దనరనీక బాధపఱచెడు ధన
వైభవము కంటె......సిగ్గువీడి యెట్లోధనమును సేకరించి హర్మ్య
తలమున వసియించు నళినికంటె,...తోడివారల కూటిలో ధూళిఁ
జల్లి షడ్రసోపేతముల మెక్కుజడునికంటె" లేమియే మేలని కవి
నిష్కల్మష మగుపేదఱికమును మెచ్చుకొను
సంతుష్టిఁజెందును; నిష్కల్మష మగుపేదఱికమును మెచ్చుకొను

చున్నాఁడు. ఇదిసత్యము. అన్యులహింసించి ధనమునార్జించువానికన్నఁ బేదయే మేలు. పేదఱికము దైవభక్తిపరాయణులగు సత్పురుషులు మోక్షసామ్రాజ్యలక్ష్మిని బొందఁజేయును; దుర్మార్గుల నతల, వితల, సుతల, రసాతల, మహాతల, తలాతల, పాతాళలోకంబులకు నణఁగఁద్రొక్కును. పేదఱిక మగ్నివంటిది; అందు సువర్ణమువడిన నన్నెఁగాంచును; దారువువడిన దగ్ధమై భస్మమగును. కాని యీ సందర్భమునఁ గవి, ధనవైభవముకంటెఁ బేదఱిక మెట్లు మేలుచేయునో, యెందుచే మంచిదియో వ్రాయకపోవుట యొక లోపము. అయిన నీపద్యములు రెండును నీతిని బోధించుచున్నవి.

కవిత్వముఁగూర్చి కవిహృదయమును తెలుపు పద్యములు రెండు కలవు. అందు "నత్కవి" యనునది యొకటి. (ఈ పద్యమువలనఁ గవి, కవిత్వస్వాతంత్ర్యప్రియుఁ డని) తోఁచుచున్నది. తాను, నియమవిరహితంబుగఁ బాడుకొను కోయిలవలెఁ బాడుకొనువఁట. ఈకవి స్వేచ్ఛగాఁబాడుకొనవచ్చును; అడ్డువా రెవ్వరును లేరు. కాని కోయిలపాటయందుగూడ నొక యనిర్వచనీయమైన నియమము గలదు. ఈ నియమమును గవి గమనించియేయుండును. ఇందుచేతనే కాఁబోలు, కవి స్వాతంత్ర్యజయభేరుల నెంత మోగించినను, వానివ్రాఁతలుమాత్రము చాలవఱకు లక్షణయుక్తముగనే యున్నవి. ఒకవేళ, ఛందోవ్యాకరణశాస్త్రంబుల నుల్లంఘింపక స్వతంత్రముగా వ్రాయుటయే కవిస్వాతంత్ర్య మని కవియొక్క యభిప్రాయమై యుండును. ఇది నత్యమైనచో సంతోషము. కాని "నాజీవనౌక", "హృదయవేదన" యనుపద్యములం జూచినచో సమయము ననుసరించి, యీకవి శాస్త్రము నుల్లంఘించునేమో యని తోఁచుచున్నది. ఏలయనఁగాఁ బై జెప్పఁబడినపద్యములలోఁ బాదము లసంపూర్తిగ విడువఁబడినవి. ఇట్లు పద్యముల నసంపూర్తిగ విడుచుట లాక్షణిక విరుద్ధము. కవిత్రయమువారు కాని, తదితర లాక్షణికులుగాని యిట్లు వ్రాసియుండిన ట్లగపడదు. వ్యాకరణ ఛందశ్శాస్త్రము లంగీకరింపవు. ఇతఁడు పద్యముల నసంపూర్తిగ వ్రాసివిడుచుటకుఁ గారణ మిప్పటి భావకవిత్వ సంపర్కమై యుండనోపు. కవిస్వాతంత్ర్యమును దెలియఁజేయునది "మనకు వియోగము లేద" నుపద్యము. ఇది రెండవది. ఇందు వివాదాంశములు లేవు. "కల్పనాప్రపంచమునఁ" గవి "స్వేచ్ఛావిహంగ" మై, విహరించునఁట; విహరింపవచ్చును. కాని, యీవిహంగవిహారమునఁగూడ నొక నియమము గలదు; సూక్ష్మదృష్టితోఁ జూచిన నది కాన్పించును. కొన్ని స్థలములందుఁ బాదపూరణమునకుఁ గొన్ని శబ్దములు వాడఁబడినవి. "కలరొ కల్లరొ" యను పద్యమునందుఁ "గనులపండువు గాఁగను గాన నయ్యొ" యనియు "కౌరవసభలోనిపాంచాలి" యను పద్యమునందు "మానరక్షణం బొనర్పఁగలేని బలం బదేల" యని యునుగలవు. వీనిలో గీటుగీయఁబడిన యక్షరములు పాదపూరణములకై వాడఁబడినవి. ఈ పద్యపాదములలో మొదటిదానిని "కనులపండుగ యగునట్లుకానన య్యొ" యనియు, రెండవపాదమును "మానరక్షణం బొనర్పఁగలేని బలంబు రిత్త" యనియు మార్చియుండిన బాగుండును.

సాంఘికవిషయములలో నీకవియొక్క యభిప్రాయము శ్లాఘనీయము. "కలరొ కల్లరొ" యను పద్యమునందు వృద్ధవివాహమసమంజసమనియు, నందుచేఁ బ్రాణహాని వాటిల్లుననియుఁ గవి జెప్పినాఁడు. వివాహస్వాతంత్ర్యమును బ్రతిపాదించినాఁడు.

మొత్తముమీఁద నీ "మురళీధ్వని" యందలి భాష సరళముగ నున్నది. కవిత్వము చాలవఱకు సలక్షణముగనే యున్నది; ధార యనర్గళము; భావము లుదారములై, నీతిదాయకములై దేశభక్తి ప్రపూరితములై యలరారు చున్నవి. ఇందు సాంఘికవిషయములకంటెఁ గవిత్వస్వతంత్రత యెందు; కవిత్వస్వతంత్రతకంటె దేశభక్తి యధికము; దేశభక్తికంటెఁ బ్రేమ యత్యధికము. ప్రేమయే యీఖండకావ్యమునఁ బ్రధానరసము. ఇది యాహ్లాదకరముగనున్నది.

---

# పద్యాలు

గడ్డిపువ్వులార!
గడ్డిపోచలార!

తూర్పు కన్నులలోన
తెలివి కదిలినవేళ
ముగ్ధ జీవాలతో
మూగ హృదయాలతో
చల్లని ఆనంద
సౌరభ మిళిత మౌ
ఆహ్వానను లు పంపి,

"రమ్మ నూతన దినమ!
రమ్ము నవజీవమా!
రా రమ్ము అమృతమ!
కలలు క్రమ్మిన కనులు
నులువు మని రా ఉషా!

అరుణారుణ ప్రభలు
తరుణ లావణ్యాలు
తనువు ధగధగలాడ
తరలిరా రా రవీ!
ఓ ఉషా!
ఓ రవీ!

పచ్చని ఆనంద మిచ్చు ఆటలనాడ
హిమకణము మాచెల్లి హ్రీవీడ
మునుగు చెరగులు లాగి
ముద్దుగొన రా రవీ!"

అని ఉషః కీర్తనము
ఆలపింతురు మీరు
గడ్డిపువ్వులార!
గడ్డి పోచలార!

తల్లి భూదేవికే
తనువు పులకలు దేర.

జాహ్నవీ కాళింది చలనాల గల
జీవకళ సోయగమ్మె నీ
నిలువునా పులకించు

స్వర్ణస్వప్నపు హాయి
సోగ నీ కనుదోయి
భ్రూకుటీ నిటలమ్ము
నాకలోకము దరికి
ప్రాక వెరచును చెలీ!
చలియించి లజ్జించి
కలవరించెడి చూపు,

మలయానిలుని ఊర్పుటలసోకి
చలియించి నిలువు నామెలి తిరుగు

## ముద్దుకృష్ణ

కళవంపుల ధూమలతవు నీవు
నీ నీలిసోయగము
నీడ దరిచేరుటకె
నివ్వెరపడి యేలో
నిశ్వసించును జాలి
జాలిగా నాకోర్కె!

ఈ దీను హృదయమ్ము
ఎటులో నీ
సిగసీడ సుమ మయి
వాడి రాలిన చాలు
ప్రేయసీ, నను నేనె ప్రేమించి బ్రతుకుదును

నీ బ్రతుకు బాటలో
ఒక చిన్ని
రేణువయి ఈజీవి
నలిగి తొలిగిన చాలు
ప్రేయసీ, నను నేనె ప్రేమించి బ్రతుకుదును

నీ భ్రూలతామధ్యమున
నిర్మలత
తిలకమై తళుకునని
నా ఆత్మ మెరసినను
ప్రేయసీ, నను నేనె ప్రేమించి బ్రతుకుదును

ఉరులలో ఇరులలో
దొరగు స్వప్నాల
మర్మర ధ్వనులకే
కరిగినది నామెడద,
తులలేని వెలలేని
కలగ్రమ్ము నీ తళుకు
తార నీలాలలో
కోరి తారెను మనసు
భగ్నహృదయములోన
పలవరింతలలోన
ప్రణయ లీలారాగ
ప్రతిశ్రుతుల్ వినగాను.

ఈ జీవితపు కొనల
ఏ చీకటుల కొననో
పడి నడిచినట్టి ఆ
పద చిహ్నములె నాకు!
కన్నెత్తిచూడు, ఆ
కలి తొందరలు వీడు
భావిజీవిత మొక్క
పాటగా ఆటగా!



# తప్తాశ్రుకణము

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావునాయుడుగారు బి. ఏ., ఎం. ఆర్. ఏ. ఎస్.

[అభాగ్యకోదండమునుండి యొకరంగము]

(స్థలము : జీర్ణ కుటీర వితర్దిక)

ఉమాంబ.

మాకై యెంత చింత నందుచున్నారలు! మీ ముఖమునఁ గనులుమాత్రముగదా మిగిలి యున్నవి!

కోదండరాయలు.

(తల యూఁచుచు)

దుర్భర వ్యథను ద్రావి యీ యగాధహృదయకూపమును నించుటకు—ఘోర ప్రభంజనమునకు దాఁగినిజూపి శుద్ధాంతచిత్రపటములఁ జిందఱ గొనరించుటకు...కన్నులు—మిగిలినవి. కన్నులు! ఆహా! ఈ కన్నులే నశించియుండిన—

ఉమాంబ

నాథా—.

కోదండరాయలు

క్షణ మూరకుండుము, ఉమా, ఒక్కక్షణము—"సర్వేంద్రియాణాం నయనం ప్రధాన" మ్మనుట కింతయర్థ మున్నది గదా!

ఉమాంబ

ఊహల కుద్రేక మెన్నఁడును దగదు. నాథా, నామాట వినుఁడు—

కోదండరాయలు.

దేని కుద్రేకము తగును ?—ఊహలకేనా ?...సంపదలకు తగునా ?...భగవంతునకు తగునా ?—లేక పరంపరములయివచ్చు నీ విపత్తులకు తగునా ? తగదు, నిజమే, మన మాటలను వినువాఁ డెవఁడు ?

ఉమాంబ

అక్కటా! కడుపుమంటకన్న, కన్నబిడ్డల గాసికన్న, ఇతరుల యనాదరణము కన్న...అన్నింటికన్న, సజ్జనుల మనోవ్యథ హృదయభేదనము నొనరించును గదా! (చెవి యొగ్గి యాలించి) ఆ! ఇదే వచ్చుచున్నాను. నాథా, చిఱుతలు వచ్చినట్లున్నది.

(పోవును)

కోదండరాయలు.

(ఉలికిపడి)

చిఱుతలు! చిఱుతలా ?—శతవర్షములనయిన నెఱుఁగరాని కష్టముల నీ నాలుగుదినములలోనే యనుభవించుచున్న యీ మానంతానము చిఱుతలా?...కాలము వక్రించిపోయినది. ఝంఝానిలసంక్షుభితము గానిదినము సుదినమైనది... అరుణోదయము మొదలు చంద్రాస్తమయమువఱకును లేని సుదిన మింకెప్పుడుగలుగును? జగము లంధకారమున లీనమైతారలు తమ్ముఁ జూచి తామే నవ్వుకొను నీరవ నిశీథమున నా సుదినోదయము!...అవునవును. మాతృగర్భమునఁగాక, మరణావస్థయందుఁ గదా భూతము లుదయించుట. సుఖములకును మాకష్టములకు నిట్టిసంబంధ మేమయిన నుండునా ? భ్రాంతి.—సత్య మేమో ?—వ్యాకులితవిశ్వాసంబున రూపములు చెదిరి సంచలితము లయి ప్రతిఫలించుచున్నవి. కష్టశిలోచ్చయంబులు సుస్థిరములై కదలకున్నవి.—

(ప్రవేశము, దూరమున, ఒక న్యాయవాది, ఒక ధనికుఁడు.)

న్యాయవాది

వ్యయమునకు వెనుదీయరాదు. తెంపరితనమే మోక్షమను కొనుచున్నాఁడు, దుర్మార్గుఁడు.

ధనికుఁడు

పదివేలు వ్యయమయినను లక్ష్య ముంచువాఁడను గాను. నన్ను ప్రతిఘటించుట దుస్తరమని యాతుంటరికి బోధపడవలయును.

న్యాయవాది

అట్టి యుపాయ చాతుర్యములకు మే మున్నారము. తమకా చింత వలదు.

ధనికుఁడు

అంతియే చాలును. వాని గర్వము నణఁపవలెను. వ్యయమునకు సంకోచింపనలదు. అణఁపవలెను.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

కోదండరాయలు

ఎంత యణఁచికొనినను పైకుబికికొని వచ్చుచున్న దీ విషాదము! (అటుచూచి) పాపము, ఉమ యెంత యూఱడించుచున్నది యాచిఱుతలను! దుస్సహము! నేఁబోయి కంటఁబడితినో: కట్టతెగి బాష్పపూరము వెల్లువమై ప్రవహించును. అనివార్యము! శోక, హృదయభస్త్రి నెంత పవనకుంభితముగఁ జేసి యుంచఁగలను? లోకములు మాఱుమోఁగునట్లు ప్రేలదా ? ప్రేలును. ప్రేలి, యంధకార ధూమము భూనభోంతరములు నిండికొనును. నిశ్చయము.

[ప్రవేశము మధురకుమారుఁడు]

ఏమి! మధురకుమారా, కన్నీ రేటికి ? (చేరఁదీసి తనుకల్యములఁ దడవుచుఁ జూచు చుండును.)

మధురకుమారుఁడు

జనకా, మన్నింపవలయును. చెల్లెలి కారొట్టెముక్క చాల దని యేడ్చుచున్నది. నాముక్క నిచ్చెద నంటిని, అమ్మ వలదనుచున్నది. (కన్నులఁదుడిచికొనుచు) అమ్మ కన్నీ రిదిగో! ఇచ్చట పడినది. ఇంకను మండుచున్నది.

కోదండరాయలు

అట్లయిన నమ్మ చెప్పినయట్లు నీవే తినుము.

మధురకుమారుఁడు

తినుటకే యత్నించితిని. గొంతుదగ్గఱ నేదియో యడ్డుచు, నన్ను మ్రింగనీయకున్నది.

(వెక్కి, కన్నుల నీరు గార్చుచుండును.)

కోదండరాయలు

కుమారా, అట్లయిన నిందులో నొక్క ముక్కను చెల్లెలి కిమ్ము—ఉమా, వాణి నిటుఁ బంపు మొక్కసారి.

వా ణీ కు మా రి

(పరుగున వచ్చి)

నాయనా, పిలిచితి రేల? మీ ముఖ మిట్లున్న దేమి ? (అని ముఖమును దడవుచుండును)...అన్నా, యేమి?

మధురకుమారుడు

ఈ ముక్క తీసికొనుము, రమ్ము.

వా ణీ కు మా రి

అబ్బా! మఱి తినఁజాలను. నాకడుపు నిండిపోయినది.

కోదండరాయలు

అమ్మ నీకు మఱియొక తునుక నిచ్చెనా వాణీ?

వా ణీ కు మా రి

ఇంక లేనిదే......ఆముక్కయే, అమ్మచేతులతో విఱిచి విఱిచి పెట్టినది. చిన్నముక్కే యనుకొంటిని, కాని, కడుపు నిండిపోయినది. అన్నా, నీవుగూడ అమ్మచేతితో తినిపించుకొనుము. మూడుదినములకయిన నాఁకలి వేయదు పొమ్ము.

(మధురకుమారుడు పోవును.)

జనకా, ఏమి?...ఏదీ ఒక్క ముద్దు—ఇంకె నట్లున్నా రేమి? "వాణీ, అమ్మదగ్గఱకు పొమ్ము" అనుడు, పోయెదను.

కోదండరాయలు

వాణీ, అమ్మదగ్గఱకు పొమ్ము. (వాణి పోవును.) ఆ-మెల్లగ-తూలిపోఁగలవు......తనువులు తపిపంచ మన్నకొలఁదిని, శల్యములతోపాటు గుణములు బయటఁ బడునుగదా!—అమ్మచేతులతో తినిపించిన, మూఁడునాళ్లకయిన నాఁకలివేయదఁట! నిజము సరస్వతీమాత కిట్టి గుణ మున్నదా? అట్టి రొట్టెముక్కయయినఁ దనకుఁ జిక్కకున్నదా?

[ప్రవేశము – ఇద్దఱుపౌరులు]

ప్ర థ ముఁ డు

మఱికొంచెము వేగముగఁ బోయియుండిన, మనకు తావు దొరకి యుండును.

ద్వి తీ యుఁ డు

రెండురూపాయాల చోటయిననుసరే అని రూకలుచూపితిని.

ప్ర థ ముఁ డు

లేదులేదు, నాటకశాలయంతయు గ్రిక్కిఱిసిపోయినది. రెండేసి రూక లిచ్చి క్రిందను గూర్చుండుటకు సమ్మతించి పోవుచున్నారు.

ద్వి తీ యుఁ డు

నాటకము చాల బాగుగనుండు ననుకొనెదను.

ప్ర థ ముఁ డు

గొప్ప నటశేఖరు లెవ్వరు లేరుగాని, ఆమెఱుకలసాని "పచ్చబొట్టుపాట" వినుటకే యింత ఆత్రము. ఆ మెఱుకలసాని వలననే యీ సమాజమునకు వేనవేలు పైకము వచ్చుచున్నది.

ద్వి తీ యుఁ డు

అయ్యో! నే నెప్పుడును వినలేదు. అంత చక్కఁగనుండునా?

ప్ర థ ముఁ డు

పాటలో నేమున్నది? ఇదిగో.

పా ట

పచ్చా వేసెద సామి – పచ్చా వేసెదను
పచ్చాని హారుమంజి – పసిడి సూదులతోను పచ్చా॥
చంద్రికా సుధయు ర – తీంద్రుని బూదియు
సాంద్రముగాగ ఋషీంద్రులు గూర్చిన॥ పచ్చా॥
కలనైనా గనలేని-కల్కిచిల్కలకొల్కి
కలకల నవ్వి నిన్- పిలుచునట్టుల జేయు॥ పచ్చా॥
మొగము చందురు మచ్చ - జిగిమీఱు నీవచ్చ।
వగలాడి జూచి బల్-సొగసి నిన్ గోరంగ॥ పచ్చా॥
ఎన్ని జన్మములెత్తి-యున్నా నీ ప్రేయసి
మన్నన జూచి చే-సన్నవచ్చేడి వలపు॥ పచ్చా॥

ద్వి తీ యుఁ డు

పాట బాగుగనే యున్నది. ప్రాప్తము లేకపోయినది. పోనిమ్ము నాలుగురూక లీ దినమున మిగిలినవి.

ఐచ్ఛికభటుఁడు

[ఒక డబ్బా నాడించుచు ప్రవేశించి]

అయ్యా! దిక్కుమాలిన పక్షులకు సాహాయ్యము! గాలివాన భిక్ష! దేశనాయకుల ప్రార్థన! కాసో వీసమో, తమ చిత్తము, వారి యదృష్టము.

ఇ ద్ద ఱు ను

ఇప్పు డేమియు లేదండి (అనుచు నిష్క్రమింతురు.)

ఐ చ్ఛి క భ టుఁ డు

చిత్తము. నిర్భాగ్యసహస్రము......

(కోదండరాయలయరఁగును సమీపించి)

అయ్యా! మీ రేమందురు?

కోదండరాయలు

(ఉలికిపడి)

ఏమందును! సహనాతీతం బగువిషాదంబున కొక్క విఱుగుడుండవలెనని. ఉండవలెను. మానవకరణమో – దైవప్రేరితమో - ఏదియో ఒక్కటి – ఉండవలెను. సిద్ధాంతము.

ఐ చ్ఛి క భ టుఁ డు

అన్నన్నా! పొరపడి యీతని యూహాగభీరకాసారంబున నొక బండను వైచి యల్లకల్లోల మొనర్చితినిఁ గాఁబోలును, పాపము ఎంత తప్పు!

(నడచుకొని పోవుచుండును)

కోదండరాయలు

[భటునిఁ బిలుచుచు నెదురుగఁ బోవుచు]

అయ్యా, క్షమింపుఁడు. అన్యాయత్తచిత్తము నవజ్ఞాసహితం బని యెంచకుఁడు.

ఐ చ్ఛి క భ టుఁ డు.

(తిరిగివచ్చుచు)

అయ్యా, నేనే క్షంతవ్యుఁడను. అనాలోచన యన్నివిధముల ననర్థదాయకము గదా! వేగిరపాటున వివేక ముడిగి మీయూహల కడ్డువచ్చితిని.

కోదండరాయలు

(నవ్వుచు)

నాయూహల కడ్డువచ్చునదంతయు సుఖప్రదం బగుననుగ్రహమే యగును. మీరడిగిన దేమి?

ఐ చ్ఛి క భ టుఁ డు

గాలివాన భిక్షకై నేను బయలువెడలితిని. మొన్నటి గాలివాన యొనర్చిన మహోపద్రవమును మీ రెఱుంగుదురా? పత్రికలలో—

కోదండరాయలు

పత్రికలఁ జూచుభాగ్య మిటీవల లేకున్నను, మిత్రులవలనఁ గొంత విని విషాదము నందితిని.

ఐచ్ఛికభటుఁడు

నిరాధారులగు నాజనసహస్రముల నాదరింప దేశనాయకు లీ భిక్ష నుద్దేశించిరి.

కోదండరాయలు

ఆహా! అమోఘోద్దేశము: ఆర్తజనసహస్రముల దుఃఖముల నివారించు నీ మహాపుణ్యకార్యము నా భిక్షయనుట! భిక్ష—మనో వైకల్యము! అధర్మ సంపాదన మార్జనమా?—హుఁ—భిక్ష-కాల వైపరీత్యమా? లేక, మన నామకరణపాండిత్యమా?—ఒక్కక్షణము—ఉమా, (అని లోనికిఁ బోవును.)

ఉమాంబ

ఇదిగో, వచ్చుచున్నాను. [వచ్చును.]

ఐచ్ఛికభటుఁడు

ఆహా! మహాధనికుల గృహద్వారములఁ గలిగిన నిరుత్సాహమునెల్ల యీతని వాక్కులు నిర్మూలము చేయుచున్నవి. ఆహా! ఏమి సానుభూతి! [చేతిడబ్బా నెత్తుచు] ఈతని వచనంబుల ప్రోత్సాహంబున నిది స్వర్ణభరిత మైనట్టుల నెంతబరువుగఁ దోఁచు చున్నది! ఆహా!—

ఉమాంబ

అయ్యో! ఎంత మహాపాపాత్మురాలను. ఇప్పుడే రెండణాల నిచ్చి యంగడి కంపితిని; నాకడ నీరెండుకానులుమాత్రము—చినిఁగిన చెఱఁగునుండి విప్పి యిచ్చుచు, కలవు-మన నగలు కొదవయుంచినవారును గ్రామాంతరమున కేగిరి. ఏమిసేయుదుము!—రెండు కానులే యిచ్చిన నవమానకరంబుగ నుండుననియా యోచించుచున్నారు?

కోదండరాయలు

అవమానంబున కేమియున్నది? ఉమా, నిజముగ నిప్పుడు గదా లేమికయి చింతిల్లవలయును. ఆ నిర్భాగ్యులకన్న నిప్పుడు గదా మన మభాగ్యుల మైతిమి! ... సరియే, ఈ రెండుకానులే యిచ్చెదము.

ఉమాంబ

లోకుల కిది స్వల్పముగఁ గానవచ్చినను,భగవంతుఁ డెఱుఁగఁడా మన కిప్పుడున్న సర్వస్వము నిదియే యని!—ఆహా! సర్వస్వము (కన్నులఁ దుడిచికొనును)

కోదండరాయలు

ఇచ్చెదను—లేమి కిదియే మహదైశ్వర్యము.

(తిరిగివచ్చి)

అయ్యా, చంద్రున కొక నూలుపోఁగనునట్లు దీనిని బరిగ్రహింపుఁడు. (ఆ రెండుకానులును వేయును. డబ్బా మీఁద కన్నీటి చుక్క పడును.)

ఐచ్ఛికభటుఁడు

అదియే పదివేలు. క్షమింపుఁడు. (వంగి నమస్కారముచేసి) అయ్యా సెలవిండు.

కోదండరాయలు

చింతానిమగ్నుఁడై ఊరకుండును.

ఐచ్ఛికభటుఁడు

అమృత వచనోత్సాహంబునఁ బూర్తిగనిండి పోయినట్లు తోఁచిన యీపేటిక నింకను రెండుకానులకు సందున్నదా? ఆహా! ధనాశ యిట్టిదే కదా!...ఓహో! ఆపావనానురాగపూరితచేతస్కుని కన్నీటిచుక్క యిక్కడ పడెను. కన్నీరా? కలుమనివారకంబగు గంగాపయోధారయా? అహో! యీ యశ్రు వెంతపావనము! ఈ తప్తాశ్రుసేచనంబున నీ పేటికపూతమైనది. నేను పవిత్రుండనయితిని. ఇంక నా నిర్భాగ్యజనసహస్రమో! ఈ తప్తాశ్రుకణప్రభావంబునఁ దమయార్తిని దొలఁగి సుఖింపకుందురా? ఎట్టి కనకాభిషేకమయిన నీ బాష్పంబునకుఁ దులయగునా?......అదేమి! ఆ వర్షార్తు లెల్లరును నా కంటికిఁ గానవచ్చుచున్నారు. ఏ మది? పుష్పవర్షమా - పొందళుకుల వానయా? కాదు కాదు- బహుసహస్రగుణీకృత మగునీమహాత్మునియశ్రుకణము. పావనాతిపావనము. నిష్కల్మషోదారసానుభూతిపూతము. ఆహా—చిత్రము. ఆచినుకులఁ దడిసి యా నిర్భాగ్యులెట్లు సుఖించు చున్నారు! గభీరకూపంబులనుండి వారలకన్నులు సమతలంబులకు లేచు చున్నవి. అల్లదే పంజరాకారవ్యక్తంబు లగువారల శల్యంబులు మాఁతపడు చున్నవి. ఆసన్నమృత్యులక్షణంబులు ముఖంబులనుండి యదృశ్యము లగుచున్నవి. సంతోషకళలు నిటలంబులఁ దాండవించు చున్నవి. ఆహా! ధన్యులు, ధన్యులు.

"సంతి సంతః కియంతః"

లేకున్న నీజనంబులును, జగంబులును, మహాకంపంబుల సంతరింపవా? అగ్నిపర్వతజ్వాలల కాహుతి కాకుండునా?

తంతితెచ్చు సేవకుఁడు

[ప్రవేశించుచు]

అయ్యా, తమకీ తంత్రీవార్తవచ్చినది, వెదకికొనుచు నిటకు వచ్చితిని.

ఐచ్ఛికభటుఁడు

ఏమిది? [విప్పిచూచి] "సంతోషము. ఆర్తజనరక్షణమునకొక్క ధనాధికుఁడు పూనుకొనెను. భిక్ష మానునది" ఆహా! మేనేల గగుర్పొడుచుచున్నది! సర్వోత్కృష్టమగు నిట్టి సానుభూతికి సద్యః ఫలమును గూర్పకున్న, నాసర్వేశ్వరుఁడు సర్వేశ్వరుఁడు కాఁజాలునా? ఏమి యీమహానుభావుని చరితము!

ఓ మహాత్మా, నమస్కారసహస్రంబులనందుఁడు. [సాఁగిలఁబడి మ్రొక్కును.

కోదండరాయలు

[నివ్వెఱపాటున నాతని నెత్తుచు తంతినిచూచి]

ధన్యోస్మి

ఔమా, మన రెండుకానులతోడనే భిక్ష సమాప్తినందినది. అదృష్టవంతులమే.

ఐచ్ఛికభటుఁడు

కానులు కాదు: కనకము కాదు:

ఆతప్తాశ్రుకణము

అవును

మహాపవిత్రము.

# సా వి త్రి

శ్రీయుత పి. వి. రాజమన్నారుగారు బి. ఏ., బి. ఎల్.

"అయితే ఎన్నిదినా లీదొంగచాటు?"

"అబ్బ! దొరికిన కొంతసేపు నీప్రశ్నలతోనే గడుపుతా మనుకున్నావా?"

"మీకేమిమరి. మగవారు, అంతగా బయలుపడినా, చాగంటివారి అబ్బాయి దుడుకువాడని కొందఱు, మతిలేనివాడని కొందఱు, ఏదో కొద్దిగా గొప్పగా విమర్శించి సర్దుకుంటారు. ఇక నా దౌర్భాగ్యపు జన్మకేమంటారు? వెధవముండ తిని కూర్చుండక దిక్కుమాలినపనులు చేయడానికి మొదలుపెట్టిందని దూషిస్తారు; అవమానిస్తారు. వెలివేస్తారు."

"ఉపన్యాసా లివ్వడంకూడా నేర్చుకొన్నావే. కాని, నీమాటలు నేను పూర్తిగా వినుటలేదుసుమా. ఈగుడ్డి ఆముదపు సెమ్మె వెలుతురు చీకట్లో సగము కోపముతో అదరుచున్న నీపెదవిని, ఒక్కమారు తళుక్కుమని మెరసి మరల అంధకారములో లీనమైపోవు నీచూపులను, చూచి ఆనందించుచున్నానే గాని,"

"మీకవిత్వంతోనే నాబుద్ధిన్నీ, హృదయాన్నీ అన్నిటినీ మీవశం చేసుకున్నారు. నా సర్వం మీకర్పించేసినానుకదా. ఇక నెందుకీ యర్ధరాత్రి సంకేతాలు. ఈ అభిసారికాజీవనము ఎన్నాళ్లు? ఈ మాలవాని కొంపలో చీమచిటుక్కుమనిన గుండెలు దడదడ కొట్టుకొనుచు గడుపు కొంతకాలములో నిజముగ ఎట్టి ఆనందం అనుభవిస్తున్నాము."

"సావిత్రీ! నేనువచ్చునప్పుడే అనుకున్నాను ఏదో యాగ్రహం సంభవిస్తుందని, పురోహితుడికొడుకు చుట్టకాలుస్తూ ఎదురైనాడు. కాని, నీవు చదువుకున్న దానవు గదా. ఈ కుగ్రామములో పూర్వ సంప్రదాయములు, సంఘమును ఎట్లు పిశాచాలవలె చుట్టుకొని ఉన్నవో ఎఱుగుదువుగదా. ఎఱిగియు నీ విట్లు పిచ్చిదానివలె దొంగచాటు, అభిసారికత్వము అని దెప్పిపొడిచిన సబబుగా ఉన్నదా? రేపటినుంచీ మీయింటికే వచ్చి పండుకో మన్నావా?"

"ఆఁ ఆఁ ఎంతమాటన్నారు. ఏమి! ఏమి! ఇంతమోసముకూడ ఉండునా, ఈ అభాగ్యపు పర్యవసానముకొఱకా నా సర్వస్వమును గోలుపోతిని. నా మానము, నాదేహము, నా ఆత్మ, నాప్రేమ అంతయు మీకు దారపోసితినే. నన్ను అర్ధాంగలక్ష్మిగ చేపట్టెదనని పలికినపలుకులన్నియు నాటకములోని నటుల వాక్యములవంటివే యయినవా."

"సావిత్రీ! ఏమి యీప్రవాహము, నే నేమోగాని, నీవుమాత్రము ఏసంశీవరావో, ఏ మైలవరం స్త్రీ పాత్రధారుడులాగో ఏకగ్రీవంగా మాట్లాడుతున్నావు."

అని రామమోహనరావు మొగము చిట్లించుకొని జేబీనుండి సిగరెట్టుతీసి, ముట్టించెను. సావిత్రి విశాలనేత్రములు అశ్రుపూరితములాయెను. పెదవులు అదరుచుండెను. వ్రేళ్లచే చీరచెరగు కొసను మెలివెట్టుచు తనప్రియునివంక చూచెను. ఆచూపులో నిందాక్షేపమున్నది, ధైర్యమున్నది. రామమోహనరావు ఒక్కమారు ఆచూపు గ్రహించినంతనే మనసు చలించెను. మరల నావంక చూడలేదు. సిగరెట్టు వడివడిగా కాల్చివేయుచుండెను. కర్తవ్యము సుగమ్యము గానప్పుడు అట్లొనర్చుట యతనికి వాడుక.

ఎప్పటికో యొకనాటికి ఈయనర్థము వాటిల్లునని యత డెఱుగును. ఈ సమస్యను సాధింపవలసిన కాలము వచ్చునని తెలుసును. కాని ఇంతత్వరగా వచ్చునని ఊహింపలేదు. కొంతలెక్క పొరబాటైపోయినది. ఎంత గడుసువారికైనను అనుమానించనప్పుడు కష్టస్థితి తటస్థమైన ఎదుర్కొని సాధించుట సులభము గాదు. అందున రామమోహను డంత గడుసువాడు గాడు.

రామమోహనరావు అన్నదేవరపేట కరణము చాగంటి రామశేషయ్యగారి యేకపుత్రుడు. చాగంటివారికి కరణీకము భూములేగాక జిరాయితీభూములు సైతము ఆగ్రామములో ఉన్నవి. పలుకుబడి ఎక్కువగా గలవారు. రామమోహనుడు ఏకపుత్రు డగుటచే తలిదండ్రుల చనువునకు పాత్రుడైనను, చెడ్డవాడని పేరింకయు బడయలేదు, బి. ఏ., జూనియరులో రాజమహేంద్రవరము కాలేజీలో చదువుకొనుచుండెను. నాతి స్థూలకాయుడు. ప్రత్యేకముగ వర్ణించుటకు వాలక పోయినను, మొత్తముమీద సుందరుఁ డనియే చెప్పవచ్చును. సిగరెట్లు, కాఫీహోటలు మొదలైన నాగరీకపు దురాచారములు రాజమహేంద్రవరములో అభ్యసించినాడుగాని ఇతరమార్గములలో నింకను ప్రవేశింపలేదు. తండ్రియనిన కొంత భయము. తల్లియనిన చనువుతోజేరిన యలక్ష్యభావము. నవీన యౌవనులవలె సంఘసంస్కారకౌతూహలప్రదర్శన కొంతగలదు. వీరేశలింగముగారి గ్రంథములు చదివినట్లు నటించుటయు గలదు.

వేసవికాలపు సెలవుల కాసంవత్సరము తలిదండ్రులపోరు పడలేక గ్రామవాసమున కంగీకరించెను. మొదటి నాలుగురోజులు కాలము గడుపుటయే దుస్సాధ్యముగ నుండెను. కాని అయిదవనాటినుండియు కొత్తయాసక్తి జనించుటకు కారణముగలిగెను. ఆనాడు సావిత్రిని గాంచెను.

సావిత్రి కీర్తిశేషులైన రంగాచార్యులవారి పుత్రిక, బాలవితంతువు. తల్లి అచ్చమ్మతో రామశేషయ్యగారి యెదిరింట నివసించుచుండెను. వారికి కొంత భూస్థితిగలదు. అన్నవస్త్రాదులకు వారిద్దరికి సరిపోవు నాదాయము. ఎంతకాలమైననేమి, సంఖ్యమీరుటకు అవకాశము లేదు. వ్యయము హెచ్చునను భీతిలేదు.

సావిత్రి చక్కదనమును వర్ణించుటకు మాకు పూర్వప్రబంధకవులకువలె నోపికలేదు. పొట్టిగనుండిన చూచి యానందించువారు కొంత పొడగరి యని చెప్పినను, స్థూలకాయప్రియులు 'కొంతపీల' యని పెదవి విరచినను, అందఱును చక్కనిదనియే అంగీకరించుచుండిరి. ఒక్కక్షణమైనను నిలకడలేని చూడ్కులు ప్రసరించు కనుగవయు, నవ్వినపుడు వెన్నెలకాంతిని వెదజల్లుభావము స్ఫురింపజేయు పలువరసయు, నామె సౌందర్యసీమయని చెప్పవచ్చును.

సావిత్రిని రామమోహనుడు గాంచినపుడామెకు పదునెనిమిదవ వత్సరము. నవయౌవన సామ్రాజ్యమునకు పట్టమహిషివలె నుండెను. ఆనాఁడు రామమోహనుడు ఏమియుతోచక సిగరెట్టువెంబడి సిగరెట్టు కాల్చి పారవేయుచుండగా చేత రెండునవలలు బుచ్చుకొని సావిత్రి అచ్చమ్మగారివద్దకు వచ్చెను. రామశేషయ్యగారు ఆంధ్రప్రచారిణి, సరస్వతి, మొదలగు గ్రంథమాలలకు జందాదారుఁడు. గాన క్రొత్తక్రొత్త నవలలు చదువుట కవకాశముండెను. సావిత్రికి నవల లన్న నిష్టము. అప్పుడప్పుడువచ్చి రెండుమూడు గొనిపోయి చదివి మరల నొసగివేయుచుండెను. సావిత్రికి తండ్రిప్రోత్సాహమునను శిక్షచేతను అలవడిన ఆంధ్రభాషాజ్ఞానమును, గానసంపదయు ఆమె స్వయంకృషిచే వృద్ధిచేసుకొనెను. వైధవ్యము సంభవించినసంగతి తత్కాలమున కామె యెఱుగదు. గ్రహించినవెనుక లోలోన దుఃఖించెనుగాని, క్రమముగ నాదుఃఖము ప్రజ్వరిల్లుటకు నింధనములు లేమి ఉపశమించెను. అయినను నవలలందు ప్రేమస్వరూప వర్ణనలను చదివినప్పుడు చెప్పరానికోరిక వీచిక లెత్తుచుండెనుగాని ఆకోరికలు ఈడేరుటకుగాని, తీక్ష్ణములగుటకుగాని పరిసర సందర్భవిశేషములు లేమి ఆకోమలి హృదయాంతరముననే సమసిపోవుచుండెను.

సావిత్రి ప్రవేశించినంతనే రామమోహనుడు నవనాగరిక సాంప్రదాయమునను సరించి చటుక్కునలేచి బల్లనానుకొని చూచుచుండెను. సావిత్రి క్రీగంటితో చూచియు చూడక లోపలికివెళ్లి అచ్చమ్మగారిని కలుసుకొనెను. కొంతసేపటికి మరలిపోవుచు, తలవనితలంపుగ, అనాలోచితముగ వెనుకదిరిగి, రామమోహనునివంక నొక్కచూపు—ఒక్కటేచూపు, హఠాత్సంభవము, చంచలము, ప్రసరించి వెళ్లిపోయెను. రామమోహనునకు చేతిసిగరెట్టుచే తొడ కాలువరకు జాగ్రత్ప్రపంచమున నుండినసంగతి విదితము కాలేదు.

సావిత్రీ రామమోహనుల ప్రణయాభివృద్ధి వృత్తాంతము సవిస్తరముగ వక్కాణించుట ప్రస్తుతమున కనవసరము. చూపులనుండి మాటలకు దిగెను. మొట్టమొదట అచ్చమ్మ కొడుకును మందలింపవలెనని ప్రయత్నించెనుగాని 'ఇందు తప్పేమున్నది. కుఱ్ఱవాళ్లు మాట్లాడుకుంటారు' అను అభిప్రాయముతో మానుకొనెను. సావిత్రి రామశేషయ్యగారు లేనప్పుడే వచ్చుచుండుటచే యతని కీవిషయము తెలియదు. అనతికాలమున శుక్లపక్షచంద్రుడు ప్రథమనుండి, దశమిదాటిని పౌర్ణిమకు దారి వెతకుచుండెను.

ఒకనాటిరాత్రి పదిఘంటలకు, (తండ్రిగారు ప్రక్కగ్రామమునకు కార్యావసరమున వెళ్లియుండెను.) ఉత్తరీయము వైచికొని షికారు వెళ్లివచ్చెదనని తల్లితో జెప్పి బయలుదేరెను. వీధిలో ప్రవేశించినంతనే అనతిదూరమున నున్న రంగాచార్యులవారి గృహము అతని నాకర్షించెను. అందఱును (అనగా సావిత్రియని

వ్యాఖ్యానము) సుఖముగ నిద్రించుచుందురుకదా యని తలంచుచు ఇంటియరుగు ప్రక్క చేరెను- గుండె కొట్టుకొనెను. వీధివైపుగదిలో దీపపువెలుతురున సావిత్రి పొడగట్టెను. చెక్కిట చేయిజేర్చుకొని ఏదియో నవల చదువుచున్నట్లుండెను. మధ్యమధ్య చుసురుమని నిట్టూర్పు విడుచుచుండెను. రామమోహనుడు మెల్లన గవాక్షమును సమీపించి సావిత్రీ! యని హీనస్వరమున పిలచెను. ఉలికిపడి లేచి సావిత్రి, మరునిముసమున వచ్చినవాని నెవనో గ్రహించి 'దొడ్డితలుపు తెరచుకొని రండి'. యనెను 'మీయమ్మ' యని రామమోహనుడు ప్రారంభించుచుండ సావిత్రి "మీయమ్మకు కొంతనల్లమందలవా" టని చెప్పి మా యమయ్యెను. ఆరాత్రి రామమోహనుడు పన్నెండుఘంటలకు వచ్చి వెడలుదునప్పటికి అచ్చమ్మగారు గుర కలుపెట్టుచుండెను. కొంతకాలమునకుసావిత్రీ రామమోహనులకు పధైర్యము హెచ్చెను. రామమోహనుడు పొలముకాపరి మాలడు పుల్లిగానితో వాని గుడిసె (ప్రియులుదానిని కుటీరమని ఉత్ప్రేక్షించుచుండిరి) ఏర్పాటుచేసెను. రామమోహనుని రాత్రి షికార్లు ప్రబలము కాజొచ్చెను.

సావిత్రి తెలివి మోహ ఝంఝామారుతమున ప్రప్రథమమున కొట్టుకొని పోయినను, శీఘ్రముననే చేరుకొనెను. ఈ ప్రారంభమునకు ముగింపు ఒక్కటినే ఆమె కోరుచుండెను. సంఘ నియమానుసారమైన వివాహము. ఈ యంశము రెండవ సమాగమముననే రామమోహనునకు విదిత మొనర్చెను. అతడును తారల తోడుగ (చంద్రుడు లేడు) ఎన్నిటికిని ద్రోహ మొనర్పననెను. ఎందఱు నిరోధించినను తప్పక వివాహమాడెదనని బాసలాడెను. ఇంకయు సంఘ దురాచారములను తెగ నరికి భారతమాతకు వన్నె దెచ్చుటకు కంకణము గట్టుకొన్నవాడనని వివిధవిషయములు నైతము ప్రసంగించెను. నిర్మల ప్రేమ వృక్షమునకు వివాహము ఫలమని కవిత్వము నైతము చెప్పెను. సావిత్రి కా పలుకులు తలచుకొనుచున్నప్పుడు మేను పులకరించుచుండెను.

అయినను, ప్రయత్నశూన్యముగ దినములు గడచుకొలది సావిత్రికి సందేహము లంకురింప జొచ్చెను. రామమోహనుడు ఈ ప్రస్తావన ప్రారంభించినంతనే ఏ ముద్దులతోనో కౌగిలింపులతోనో విషయము మార్చివేయుచుండెను. తుదకు అతనికి తలిదండ్రులు వివాహ సన్నాహము లొనర్చుచున్నట్లు చూచాయగా తల్లి చెప్పగా వినెను. హృదయాందోళనము ఎక్కుడయ్యెను. కట్టకడకు తన మానము, తన సౌందర్యము, తన సిగ్గు, తన మర్యాద, తన సర్వస్వము దోచుకొని ప్రియుడు అధోగతిపాలు చేసి బహిష్కారకూపమున బడవేసి పోవునేమో యనుభీతి పైకొనెను. అందుచేతనే కొన్నిదినములనుండియు సమాగమములు అంత సంతోషప్రదముగ లేకుండెను. గోరుచుట్టుపై రోకటిపోటుగ గ్రామవాసులు నైతము గుసగుస లాడుకొనుటకు ప్రారంభించిరి. సావిత్రికి ఏమియును దోచలేదు.

రామమోహనునకు ఈ మహాసమస్య మొట్టమొదట గోచరమే కాలేదు. కాంక్షితవస్తుపరిగ్రహణాభిలాష తదితర పరిస్థితులను మబ్బుమాటు చేసెను. సూక్ష్మముగ గోచరించినంతనే కొంత జంకెను. కాని యాజంకు అతిత్వరితముగ అలక్ష్యభావమున మాయమయ్యెను. సావిత్రిని పరిణయమాడుట కలలోని వార్తయని నిశ్చయించుకొనెను. అట్టి విపరీతచర్యలు స్వతంత్రులైన యే కొందఱికో గాని తలిదండ్రుల యాజ్ఞకులోబడి వర్తించు తనబోటి వారికి గాదని సిద్ధాంత మొనర్చెను. అటులైన సావిత్రితో సంబంధ మంతటితో విరమించుట ఒప్పుగదా యని చింతింపకొకగెను కాని,తనకు దానే సమాధాన మొసగికొనెను. ఆ సంబంధమువలన సావిత్రికి ఆనందానుభవమే గదా. అది లేకున్న నామె జీవితము శుష్కమై, నిరర్థకమై, నిర్వికాస మైయుండును. కనుక వివాహాభిప్రాయము ఉన్నను, లేకున్నను సమాగమ సౌఖ్య ప్రదమగుటచే సమంజసము, అని రామమోహనుడు తర్కశాస్త్రమును ఉపయోగించెను.

సావిత్రి మనోవేదన నానాటికభివృద్ధి గాజొచ్చెను. ఇంట తల్లి నైతము కొంత సందేహించినట్లు దోచెను. కథాప్రారంభమునందలి సంభాషణ జరిగిన నాటి మధ్యాహ్నము ఆమె !" ఒసే! సావిత్రీ, నిన్నరాత్రి మంచినీళ్లు దెమ్మని పిలిస్తే పలకనే లేదేమే ? బద్ధకంచే లేచలేక అలాగే పండుకొన్నాను. నీకెప్పుడూ ఇంత మొద్దునిద్ర ఉండేదిగాదే" యని పల్కినప్పుడు సావిత్రి పెదవులు తెల్లవడెను. గుండెలు కొట్టుకొనెను. చిరుచెమ్మటలు పోసెను. మారు పల్కలేదు. తా నింట లేనిది అమ్మకు తెలిసెనేమో యనుభీతి ఉదయించెను. ఆ రాత్రి ప్రియునికడకు పోకూడ దనుకొనెను. కాని, ఆలోచించి కలిసిమాట్లాడి ఈ యగచాట్లనుండి తొలగింప బ్రార్థించెదనని ధైర్యము చిక్కబట్టి తల్లి నైక ముతో కన్నుమూసినంతనే పరుగిడి వచ్చెను.

రామమోహనుని వైఖరి గాంచినంతనె సావిత్రికి నిరాశ జనించెను. ఆతడాడిన కపటనాటకము అసహ్యముగ ఘోరముగ కన్నులకు గన్పట్టెను. తన జీవితము ఈ యథఃపతనముతో బూర్తియగునని తోచెను. నేత్రములు ప్రస్రవితములయ్యెను. గద్గదస్వరమున "అబ్బ! ఎంత మోసగించినారండి" యనిమాత్రము పలికి ఏడ్వ దొడంగెను. రామమోహనుడు అతిత్వరితముగ సిగరెట్టు కాల్చివేయుచుండెను. కనుబొమలు ముడివైచెను. క్షతి మూడుచున్నదని గ్రహించి త్వరపడెను. వాత్సల్యము అభినయించుచు, భుజముపై చేయివైచి "సావిత్రీ! పిచ్చిదానవు సుమా! నిన్ను జూచిన నాకు జాలివేయుచున్నది. ఈ గ్రామమున విధవా వివాహమా! ఆకాశము విరిగి పడదా? నా తల్లి దండ్రులు అనుమతిస్తారా? నీ తల్లి అంగీకరించునా? అన్నానే గాని నీకు మాత్రము అంత ధైర్యమెక్కడిది?......" అని చెప్పబోవుచుండ, సావిత్రి చటుక్కునలేచి, కండ్లనీళ్లు చీరకొంగుతో దుడుచుకొని, రోషపూరితమైన యొక్కచూపుతో రామమోహనుని కుహనా వాత్సల్యమును భస్మముచేసి పండ్లు గరచుకొని "దొంగా" యను వాక్యము మోమున విసరి, వడివడిగ గుడిసెవీడి అడుగులు తడబడ వెడలిపోయెను. రామమోహనుడును ఇంకొక సిగరెట్టు ఇటునటు పచారుచేయుచు కాల్చి మెల్లగ నిలుసేరెను.

సావిత్రి తనకు తెలియకనే యిల్లుచేరెను. దొడ్డితలుపు తీసి తన గదికి వెళ్లుచుండగా ఎదుట మేల్కొని సంపూర్ణ జాగ్రదవస్థలో నిలుచుకొనియున్న తల్లిని గాంచెను. దడదడ మని కొట్టుకొనుచుండిన గుండె తటుక్కున నాగిపోయెను. "అమ్మా" యని వెఱ్ఱి కేకవేసెను. "దొంగముండ సరసుడి దగ్గరనుండి వస్తావుంది గాబోలు. ఇంటి పేరు చెరపను పుట్టింది. పో. పోయి పండుకో. నీ మొఖము చూడడానికి అసహ్య మేస్తావుంది" అను తల్లి మాటలు ములుకులవలె బాధపెట్టి తన దురవస్థను విశదపరచెను. తల్లి తిట్లు వినినతోడనే ఆశ్చర్యము! దైన్యమంతయు పటాపంచ లైపోయి గుండె నిబ్బరముగ నుండెను. మారుపల్కక తన గదిచేరి తలుపు మూసుకొని చాపవైచుకొని బోరగిల పరుండెను.

మరునాడు సావిత్రి కన్పడలేదు. తల్లి దగ్గఱనున్న బావులన్నియు శోధింపజేసెను. నిష్ఫలమయ్యెను. రామమోహనుడు ఇల్లువదలి మూడురోజులు వెలుపలికి రాకుండుటచే కొందఱు పలువిధముల మాట్లాడుకొన జొచ్చిరి గాని, కట్టకడకు తానే ఎచ్చటికో వెళ్లిపోయినదని తృప్తిపడిరి. రామమోహనుని మాత్రము తన ద్రోహముచే మతిచెడి ఏ చోటికో వెళ్లి ప్రాణహత్య యొనర్చుకొనినట్లు తోచెను. కొన్ని దినములకు ఎవ్వరో బెజవాడ స్టేషనులో సావిత్రిని జూచినట్లు చెప్పుకొనిరి. మొదలు మొదలు రామమోహనుడు మిగుల దుఃఖించెను. గాని సెలవులు ముగిసినంతనే రాజమహేంద్రవరము వెళ్లి కాలేజీ హాస్టల్ జీవనమున అంతయు మరచిపోయెను.

నాల్గు సంవత్సరములు గడచినవి. రామమోహనుని జీవితమున అనేక మార్పులు సంభవించినవి. తండ్రి గతించెను. చరస్థిరాస్తుల కన్నిటికిని అధికారియాయెను. తండ్రియున్న కొంతయైనను భయముండెను. అతడును లేని కారణమున రామమోహనుని స్వేచ్ఛావిహారము నిరాటంకమయ్యెను. బి. ఏ., పరీక్షయందు మూడు సంవత్సరములు విఫలుడయ్యెను. తుదకు ఎట్లో తనకును దెలియక కృతార్థుడయ్యెను. ఈ మూడు సంవత్సరములును రాజమహేంద్రవరమునందే గడపెను. తల్లి యుత్తరములు చదివి చింపివేయుచు వచ్చెను. సావిత్రినైతము లేని యాగ్రామమునకు బోవుట పిచ్చితనమని యతని వివేకము బోధించుచుండెను. అంతన, రాజమహేంద్రవర మంతటి రసికజన వైకుంఠమును వదలిపోవుటయా? రామమోహనునకు ఒక్కటొకటిగ దురభ్యాసము లలవడెను. అతడు మాత్రము 'ఆనందో బ్రహ్మ' యను సూక్తియే జీవితాధారమని సిద్ధాంత మొనర్చి తన చర్యలకు విపరీతవ్యాఖ్యానము లొనర్చుచుండెను.

రామమోహనునకు వివాహమైనది గాని ఆ విషయ మతడు మరచిపోయెను. పెండ్లి యైనపుడు పిల్లకు ఎనిమిదేండ్లు. పత్నీనామము సార్థక మొనర్పు వయస్సు వచ్చినప్పటి మాట గదా యని ఉదాసీన భావముతో కొన్నినాళ్లు, ఆవెనుక నదియు మాసిపోయెను.

రామమోహనుడు రాజమహేంద్రవరము వదలి మదరాసు చేరినాడు. లా కాలేజీ ప్రవేశించినాడు. యూనివర్సిటీ విద్యార్థుల క్లబ్బులో బస. వారమునకు రెండు దినములు సినిమా. అప్పుడప్పుడు గానసభలు, టీపార్టీలు, మూడునై కాలమంతయు రాజమహేంద్రవరమున ఎందులకు వ్యర్థ మొనరించితినని యతడు దుఃఖించెను. అయినను ఆ పట్టణమందువలె ఇచ్చట స్త్రీ సహవాసము

ఇంకను అబ్బలేదు. అబ్బుటకు మార్గదర్శకు లైనవారిస్నేహము మాత్రము అల వడుచుండెను.

నాడు ఆదివారము; సాయంత్రము నాల్గు ఘంటలు. గదిలో కూర్చుండి రామమోహనుడు సిగరెట్టు కాల్చుచుండెను. సినీమాకు వెళ్లుటకు ఇంకను సమయము గానందున ఏమియు దోచకుండెను. అట్టితఱి తన సహపాఠకుడు రామసామయ్యంగారు వచ్చెను. "ఏమి, ఊరికే కూర్చున్నావు, రా పోతాం, ఎవరో క్రొత్త ఆంధ్ర భాగవతురాలట, సావిత్రీదేవి అట. సీతాకళ్యాణం కాలక్షేపం" అనెను. అకారణముగ రామమోహనుడు ఉలికిపడెను.

"ఎవరు ?"

"ఎవరో, క్రొత్తపేరు. సావిత్రీదేవి. మీ ఆంధ్రులే"

"ఏవూరు ?"

"సరే, బాగానే ఉన్నది. ఎంత వయస్సు అని అడుగుతావు గాబోలు?"

"అవును. అడుగవలెననుకొంటిని" అని పెదవి గరచికొనెను.

"అంతఆసక్తి ఉన్నవాడవు; రామరి, మైలాపూరునకు బస్సులో వెళ్లితే సరిపోతుంది."

రామమోహనుడు బయలుదేరినాడు. ఎందులకోగాని ఎప్పటి చురుకు అతని వర్తనమున గాన్పింపలేదు. పరధ్యానముగ నిటునటు చూచుచు బస్సుక్రింద పడబోయెను. మాటిమాటికి బొమలు ముడివేయుచుండెను. సావిత్రీదేవి ఎవరు? 'తన' సావిత్రియా, ఛీ, పిచ్చియూహ ! ఇది నవలాప్రపంచము గాదే, యథార్థప్రపంచమే. అయినను శంకకు దారి, అర్థము ఉండునా.

రూపాయ టిక్కట్లు తీసుకొని ఇద్దరును సభాభవనము ప్రవేశించిరి. గద్దియకు చేరువగనే కూర్చుండిరి. అప్పటి కింకయు గాయకురాలు రాలేదు. రామమోహనుడు ప్రక్కగూర్చుండినవారిని సావిత్రిదేవిగుఱించి ప్రశ్నించెను గాని, "ఎవరో ఆంధ్రావాళ్లు" అను ఉత్తరముతప్ప వేరు బడయలేదు. ఇంతలో నామె, మార్దంగికుడు, ఫిడీలు, హార్మోనియం వాయించువారు వెంబడింప మంటపము ప్రవేశించెను. రామమోహనుడు ప్రసరించిన యొక్క చూపులో సర్వముగ్రహించెను. సావిత్రీదేవి తన పల్లెటూరి సావిత్రియే. కాని, ఎంతమార్పు !!

అప్పటికన్న కొంతబలసియుండెను. మోమున లేతదనమునకు మారుగ ఒకవిధమైన కొంటెతనముతోఁజేరిన మోటుతనము గన్పట్టెను. సహజరక్తాధరము తాంబూలరసముతో చిప్పిలుచుండెను. కండ్లకు కాటుక, పెద్దచాదుచుక్క, కనకాంబరములు దురిమిన కీల్జడ- జరీపువ్వులతో నిండిన పచ్చనిపట్టుచీర, గులాబీవర్ణపు రవిక, మెడనిండుగ రవలహారములు, చేతికి రకరకముల బంగరు గాజులు, అచ్చపుభోగముదానివలె నుండెను.

కాలక్షేపము ముగియువరకు రామమోహనుడు ప్రాణములు బిగబట్టుకొనెను. రెండుమూడు పర్యాయములు సావిత్రి తన్నుగాంచి ఆనవాలు బట్టినట్లుండెనుగాని, నిర్ధారణసేయుట కష్టము. సభనిలిపినంతనే మైలాపూరులో మానారియింటనే భుజించి పరుండెద నని అబద్ధముచెప్పి మిత్రుని సాగనంపి భవనము ద్వారముకడ వీధిలో నిలువబడియుండెను. సావిత్రి వెలుపలికివచ్చి తనకై సిద్ధముగనుండిన మోటారునెక్కి వెళ్లిపోయెను. సభ్యులందఱు నాపాటికే తమతమ గృహములకు జనిరి. ద్వారమువద్ద తములముసేయుచు మార్దంగికుడు నిలుచుండుట గాంచి, పైకొనివచ్చు జంకు నాపుకొని యితనిని సమీపించెను. పుణ్యవశమున తెలుగు తెలిసియుండుటచే సావిత్రినిగుఱించి కొన్నివిషయములు అడిగి గ్రహించెను. సావిత్రి ఆంధ్రబ్రాహ్మణ యువతియేగాని 'చెడిపోయినదట.' ఇప్పుడు సుబ్రహ్మణ్యాం శెట్టిగారి సంరక్షణయం దున్నదట. ఉనికి పీటర్సురోడ్డులో 'లక్ష్మీభవనము.' సుప్రసిద్ధగాయకురాలు బెంగుళూరు త్రిపురసుందరి చేరదీసి గానవిద్య గరపి సాహాయ్యమొనర్చెనట. ఇంకను యేమేమియో చెప్పుటకు మొదలుపెట్టెను గాని రామమోహనుడు సెలవు బుచ్చుకొనెను.

సావిత్రిని చూచి తీరవలెను. ఇప్పుడే. ఎట్లు? ఈరీతి నే వెళ్లిన లోనికి రానియ్యరేమో. మోటారులో వెళ్లిన లెస్సయని అద్దెమోటా రొకటి యెక్కి రాయపేట వెళ్లెను. లక్ష్మీభవనమువద్ద నాగెను. ప్రాయశః సెట్టిగారు ఇంటనుండిన ఎంతప్రమాదమగునో అలోచింపలేదు. తోటకాపరిని అమ్మగారు ఉన్నారా అని అడిగెను. "ఉన్నారయ్యా మీరెవరు" అని హెచ్చరించిన, వానికి వడివడిగ నొక కాగితముపై "కోరిక దయసేయవలెను, చూచిమాట్లాడుటకు. రామమోహనరావు" అని వ్రాసి యొసగెను. లోనికరిగి, రామమోహనునకు మూడు సంవత్సరములో, నిజముగ మూడునిముసములకాలములో తిరిగివచ్చి "రావచ్చును" అని చెప్పి దారి తీసెను. మేడగది మెట్లెక్కి ద్వారమువరకు వచ్చి సేవకుడు వెనుదిరిగెను. రామమోహనుడు ఆవేదనతో శిరమువలయములు చుట్టుచుండ తలుపుదీసి గదిలో ప్రవేశించెను.

సావిత్రి సోఫాపై కూర్చుండెను. బహుళదశమినాటి చంద్రునిధవళిమతో గలసిన యాకసపువన్నెల- లేత నీలవర్ణము —పట్టుచీర, సన్నటిది, కట్టుకొనియుండెను. సభయందు గన్పట్టిన మోటుతనము ఇప్పుడులేదు. కాని పల్లెటూరు అమాయకత్వముమాత్రము లేదు. సావధీరరత్నము. 'అనావిద్ధము'గాదు. రామమోహనుడు ప్రవేశించినంతనే లేచినిలువబడలేదు.కనుబొమలు మాత్రము ఎత్తిదించివైచెను. రామమోహనునకు విద్యుద్దీప కాంతిలో సావిత్రి అభినవమోహిని వలెనుండెను. పూర్వపు మోహము వెయ్యింతలుగ నతనితల ద్రిప్పివైచెను. వెకిలిచూపులతో నా సౌందర్యమును చూరగొను చుండెను.

"అయ్యా ! మీ రెవరు? ఏమిపని" సావిత్రి వాక్యములు స్పష్టముగ, నిశితముగ వినబడెను.

"సావిత్రీ! ఏమిది! నీప్రియుడు, నీపాదములకడ తనహృదయమును సమర్పింప వచ్చియున్నాడు" అని రామమోహనుడు తీవ్రముగ బదులిడెను.

"ప్రియుడా ! నా కెవ్వడును ప్రియుడులేడే, నాకు ప్రస్తుతము ఒకప్రభువుమాత్ర మున్నాడు. అతనిపేరు నీకుదెలిసియే యుండును. అతనిదాసిని నేను. ఈ గృహము, ఈ వస్తువులు, ఈ నాకట్టుకొన్నచీర, ధరించిన హారములు, ఆభరణములు, ఈ భాగ్యమంతయు అతనిదే. అతని సేవకురాలను, అతని మనస్సునకు సంతోషము నొసగుటయే నాధర్మము."

"తెలిసినది. నీవతనికి నీదేహమును అమ్మికొన్నావు"

"ఏమి ! సాహసము. అటులే అగుగాక. మీ ఆడపిల్లలందరినిమాత్రము మీరు అమ్మికొనుచుండుట లేదా! యావజ్జీవమును, ఇష్టముండినను, లేకున్నను, పోషించుటకు భర్త అంగీకరించుచున్నాడు. భార్య అమ్ముడు బోవుచున్నది. అంతేగదా. అదితప్పగానప్పుడు ఇదిమాత్ర మెట్లుతప్పు? అతడు నన్ను పోషించుట కంగీకరించినాడు. అతనికి సౌఖ్యము సమకూర్చుట నావంతు."

"సావిత్రీ ! వేశ్యావృత్తి తత్త్వమును నిరూపించుటకు కంకణము గట్టుకొన్నావా ? ఇట్టి భయంకరమైన మార్పు నీ కెట్లు సంభవించినది ?"

"అయ్యా ! ఇప్పటి స్థితి నాకంత భయంకరముగలేదు. నాలుగు వత్సరములకు మునుపటి స్థితియే తలచుకొనిన ఘోరముగ నున్నది. ఈ మార్పునకు కారణమడుగుచున్నావా? అమాయకురాలను, నన్నడుగుట వ్యర్థము. సంఘయంత్రముచే ఆడింపబడు కీలుబొమ్మను నేను ఆ సంఘమునే అడుగుడు. సంఘనాయకులనే ప్రశ్నింపుడు......"

"ఆగుము ఆగుము. నాతల బ్రద్దలై పోవుచున్నది. నీ హృదయము ఎంత కఠిన మైపోయినది, నీ పలుకు లెంత కఠోరము లై పోయినవి. సావిత్రీ! అయిన నీకు ప్రేమ యనునది లేదా? ప్రియ డనువాడు లేడా ?"

"అడిగితివి గాన చెప్పెదను" సావిత్రికంఠము కొంత రుద్ధమైనది. మరల సవరించుకొన్నది. "నాలుగేండ్లక్రిందట నా కొక ప్రియుడుండెను. అతనికి నాప్రేమ, నా హృదయము, నా దేహము, నా మానము, నా సౌందర్యము, నా అభిమానము, నా సిగ్గు, నా సర్వస్వమును అర్పించితిని.........కొన్నాళ్లకు, ఒక్కనాడు నా ప్రియుడు భస్మమై పోయినాడు. నా హృదయము కరిగి, సుద్దగట్టి పాషాణ మైపోయినది. నా యభిమానము ప్రజ్వరిల్లి నా సిగ్గును కాల్చివేసినది......ఇంక—ప్రేమనా ?—ప్రేమయనునది కవిసమయము............"

"సావిత్రీ ! నీవేనా యిట్లు మాట్లాడుచుండుట. అవును. నీవే. ఈపాపియే ఆ భస్మమైపోయినవాడు. కాదు కాదు. ఆయధమాధముడు ఇప్పుడు లేడు, నీవు చెప్పినట్లు భస్మమైపోయినాడు. నీ యెదుట నిలుచున్నవాడు అంత దుర్మార్గుడు కాడు."

సావిత్రి నేత్రము లశ్రుపూరితము లయ్యెను. పైటకొంగుతో కండ్లు దుడుచుకొనెను. "అయ్యా ! ఏమేమియో మాట్లాడుచున్నారు. నాకర్థము కాలేదు. మీరువచ్చిన పని ఏమి ?" కొంతయాగి "ఓహో! మీరు అన్న దేవరపేట కరణంగారి కుమార్లుగదా, మీ తల్లిని బాగుగాఎరుగుదును. బహుశః ఒక్క గ్రామములో ఉన్నవారు గనుక క్షేమము విచారించుటకు వచ్చితిరి కాబోలు......"

"సావిత్రీ ! ఈ యెత్తిపొడుపుమాటలు నేను భరింపజాలను. వచ్చిన దారి వెళ్ళమంటె వెళ్తాను."

"వృథాశ్రమ ఎందులకు! పాపము. వచ్చినందులకు నా కథ వింటారా! ...వినండి. నాప్రియు డట్లు భస్మమై పోగానే, ఇల్లు చేరితిని. మాయమ్మ సర్వమును గ్రహించి నోటికి వచ్చినట్లు తిట్టినది. తల్లియే నాపై నంతగోసినప్పుడు నాకిం కెవ్వరు లే రనుకొంటిని. ఊరివారి మాటలు వడిభరింపజాల ననుకొంటిని

హత్యచేసికొన దలపోసితిని......ఘంట లెట్లు గడచినవో తెలియదు—అర్ధ రాత్రి దాటినవెనుక నాయింటిని, నాతల్లిని, గ్రామమును, వదలి పారిపోతిని?— రామ రామ! ఆ రాత్రి నా పాట్లు ఎట్టిపాపికిని వలదు. ఆ కాలము తలచు కొనినను భయముగా నున్నది. ఎట్లు బెజవాడ చేరితినో నాకే స్పష్టముగ తెలి యదు...ఇక కృష్ణా గోదావరి ప్రాంతములు నాకు దుస్సహములని తోచెను. దూర దేశమునకు వెళ్లి నా జీవితములో జూదమాడ బుద్ధి పుట్టెను. మద్రాసునకు టిక్కెట్టు పుచ్చుకొంటిని.

"మదరాసు మహాపట్టణము. నేనే కాకిని. ఎచట చూచినను క్రొత్త మొగము లే, ఇటునటు తిరిగి తిరిగి పార్థసారథి దేవాలయము చేరితిని. ఆసాయంత్ర మేదియో ఉత్సవముగాబోలు. అనేకులు వచ్చియుండిరి. వారిలో ఒక్కస్త్రీ నాకన్ను లను కట్టిన ట్లగపడెను, ఆమె నెరిగియుంటిని. నేను సందేహించినట్లే ఆమె వారవనితయైయుండెను. సుప్రసిద్ధ గాయకురాలు. బెంగుళూరు త్రిపురసుందరమ్మ యని చెప్పిరి. ఆమె వదనమున దయారసము ఒలుకుచుండెను... ఆక్షణముననే నా హృదయ మామెవంక కాకర్షింపబడెను. అర్చన మొదలగునవి ముగిసినంతనే ఆమె వెళ్లిపోవ నుంకించుసమయమున ఆమెను చేరితిని. ఆమె పాదములపై బడితిని. వెఱ్ఱిదానివలె నా వృత్తాంతము వినిపించితిని. ఆదయామయ నాకష్టము నకు జాలినొందెను. నాతల్లి నన్నుదూరెను. ఆయమ్మ లోకమును దూరెను.తనతో వచ్చియుండుటకు సమ్మతించినచో పోషించెదనని చెప్పినది. నా హృదయము పొంగి పొరలి పోవుచుండెను. కనులవెంబడి బాష్పములు దొరగుచుండెను... ఆమె యింటికి వెళ్లితిని. పావన బ్రాహ్మణకులమున బుట్టి భోగముదానింటనుండుట యా అని ఒక్కమారు, ఒక్క చిన్న నిమిషకాలము తోచెను. కాని, ఆ వెంటనే కులము, ఆచారము, సంఘముపైని అభిమానమంతయు భగ్గుమని మండిపోయెను.

"ఆదయామయ పోషణమున నాకష్టములన్నియు మరచిపోతిని. నాసహజ మగుగాత్ర సౌందర్యము ఆమె తెలిసికొని నాకు గానవిద్య గరపెను. సంస్కృతాంధ్రములు సైతము అభ్యసించితిని. విద్యనేర్చుట యంత ఆనంద ప్రదమని నేను కలయందు సైతము తలపలేదు...వెనుక ఉపాధ్యాయుని కడ హరికథ చెప్పుట నేర్చుకొంటిని. ఒకనాడు సుబ్రహ్మణ్యముశెట్టిగారింటనే యన్నప్రాశన మహోత్సవమునాడు హరికథ చెప్పితిని- కొన్నిదినములు గడచినవెనుక నాలో నెమ్మదిగ ఆమె కొన్నిసంగతులు ముచ్చటించెను...మొదట వెనుదీసితిని...,బాధపడితిని...కాని వెనుకటి వృత్తాంతము మనమునకు తెచ్చుకొనినంతనే, నాహృదయము శిలామయమై పోయెను. లోకమున సన్నివృత్తులు ఉదర పోషణమునకే గదా యని తర్కించుకొంటిని.ఇందు అన్యాయ మేమున్నదని పూర్వ పక్షమొనర్చితిని. తుదకు సమ్మతించితిని...చిన్ననా డెవ్వడో నా కంఠమున తాళి గట్టినాడట. అతని నే నెఱుగను. ఎవ్వడో నన్నుప్రేమించినానని చెప్పుచుండెను. అతడు మండిపోయెను. ఇప్పుడు నన్నుపోషించుచున్నాడు, గనుక యతడు నాప్రభువు; నేను దాసిని...నా కేలోపము లేదు.నన్ను గౌరవించువారేగాని అవమానించువారు లేరు...నావిద్య నాకు ఆనంద మొసగుచున్నది...అయ్యా! క్షమింపుడు. ఏమేమో మాట్లాడి మీకాలము వ్యర్థపుచ్చితిని."

సావిత్రి యలసిపోయెను. కనుగవనుండి రాలిన యశ్రుకణములు చెక్కులపై నెండిపోయినను కనులు ఇంకయు బాష్పపూరితములై యుండెను. ఒకపెద్ద నిట్టూర్పు విడచెను...

రామమోహనునకు ప్రపంచమంతయు వెఱ్ఱికలవలె తోచుచుండెను. విను చున్నమాటలు సావిత్రివే యని ఇంద్రియములు చాటించు చున్నను, చిత్తమునకు మాత్రము బోధపడుటలేదు. హృదయమున ఒకవిధమైన బాధ—తినివేయుచున్నట్లుండెను. కర్తవ్యముమాత్రము గోచరించలేదు.

ఆలోచింపకయే "అయిన సెలవా"అనెను. సావిత్రి చివాలున లేచెను. "చాల ఆలస్యమైనట్లున్నది. నాతప్పు. సెలవు," అని నమస్కరించెను.

రామమోహనుడు సావిత్రివదనమును చూడనేలేదు, లేచి, నడచి, గుమ్మము దాటెను. దాటి తనవెంట ద్వారము మూసెను...మూసి, మెట్లు...దిగలేదు. మొదటి మెట్టుపై నట్లే నిలువబడెను...ఒకటి, రెండు నిముషములు...

..ఏవ రది?...అవును. సావిత్రి వెక్కివెక్కి యేడ్చుచున్నట్లు స్పష్టముగ వినబడెను.

తిరిగి, లోనికి ప్రవేశింపబోయెను. మరల నాగెను. వడివడిగ మెట్లుదిగి పోయెను......

రామమోహనునకు సావిత్రి చర్య విపరీతముగ దోచెను......

---



దీ॥ బ॥ సి. వి. రంగారెడ్డిగారు.



సర్. ఎం. సి. టి. ముత్తయ్యశెట్టియారు.గారు.



కీ॥ శే॥ రావుసాహెబు బంక్ల బాపయ్య శెట్టిగారు.



శ్రీ మిర్జాపురము రాజాబహద్దరువారు.



శ్రీమాన్ ఎస్. శ్రీనివాసయ్యంగారు.



రా॥ బ॥ ఆర్. కే. భాన్స్లేగారు.



దీ॥ బ॥ మురుగప్ప శెట్టిగారు.



రా॥ సా॥ బడేటి వేంకటరామయ్య నాయుడుగారు.



కవికొండల వేంకట సత్యనారాయణమూర్తిగారు.



గౌ॥ సర్. బి. ఎల్. మిత్తరుగారు.



పి. వి. నటరాజ మొదలియారుగారు.



దీ॥ బ॥ బాలసుందరము నాయుడుగారు.



రా॥ బ॥ జి. వేంకటపతి నాయుడుగారు.



రా॥ బ॥ వి. షణ్ముఖ మొదలియారుగారు.



బండ్ల వేంకయ్యగారు.



గూడవల్లి రామబ్రహ్మము చౌదరిగారు.



గానాల రామమూర్తిగారు.

# ఆర్గళ రాణి

ఉభయభాషాప్రవీణ మిన్నికంటి గురునాథశర్మగారు.

## 1

### స్థలము: అంతఃపురము.

గౌతముఁడు (ఆర్గళదేశప్రభువు) సరోజిని (ఆర్గళరాణి) పూర్ణిమ (రాజసహోదరి)

గౌతముఁడు.

దేవీ ! నామాట వినుము. నీవు నడువలేవు.

సరోజిని.

దేవరవారి కెదురాడినందులకు క్షమింపవలయు. ప్రతివత్సరముఁ గార్తికమాసమున నొనరించు నీవ్రతము నీయేఁ డేల మానవలయు !

పూర్ణిమ.

అవు నన్నయ్యా ! ఆగంగమ్మతల్లిదయవలన నయోధ్యనవాబుసైన్యమును గూడ నీయేఁ డోడించితిమి. అందువలన నీయేఁడు మఱియుం గొప్పగా నుత్సవముఁ జేయవలయును. అదియును గాక భగవంతునియనుగ్రహమున మావదినెగారికి—

సరోజిని. (చిఱునగవు సిగ్గులతో)

చెల్లెలిగారిమాటనైనఁ ద్రోసిపుచ్చకుఁడు. ఆమెగారు సర్వజ్ఞురాలు.

గౌతముఁడు. (చిఱునగవుతోఁ దనలో)

తనగర్భవిషయము నుడువు నని మాట కడ్డము వచ్చినది. ఆహా! యేమి యా మొగమునందలి చిఱునగవుఁదేటలనిగనిగలు. సిబ్బితివలని గబ్బిచెయ్దములు. 'లజ్జైవ కులయోషితామ్" అనుమాట యనుభవైకవేద్యము సుమా.

పూర్ణిమ (నవ్వుచు)

నామాట కడ్డు వచ్చెద వేమి ?

సరోజిని. (నవ్వుచు)

నీ యభిప్రాయము తెలిసినదిగా. అందువలననైన నాయమ్మఁతుఁడు నా కోర్కిని రిత్తపుచ్చరాదు.

గౌతముఁడు

ప్రేయసీ ! నీవు క్రోసెఁడుదూరము నడిచిపోలే వనిన వినవుగదా ?

పూర్ణిమ.

అట్లైన మేనా లెక్కి పోవుదము. మీ రుభయులు నీవరకుమీఁద సంధి చేసికొనవచ్చును.

సరోజిని.

ఏ మంటివి? అందల మెక్కి పోవలయునా ? భగవత్సేవ ప్రయాసకరమా ? నడువలేమా ? మన మొనరించిన శరీరవ్యాయామము నేనిఁ దలంపవో ? అదియుం గాక నియమభంగ మగును జూఁడీ !

పూర్ణిమ.

ఎంతబేలవు ! నీ కిష్టము లేకున్నను బలవంతముగా మేనా యెక్కించెదము. అట్లైనచో నియమభంగము గాదు. చూడు. వసిష్ఠునకు నూర్గురుకొడుకులు పుట్టినను "సదాబ్రహ్మచారి"యే నఁట. లోపాముద్ర ప్రోత్సాహమువలన నిత్యము భుజించుచున్నను నగస్త్యుఁడు "సదోపవాసి"యే నఁట.

గౌతముఁడు.

వినను గంగాప్రాంతమున శత్రుసేన లున్నవఁట. నేను వెంట వచ్చుటకును వలనుపడదు. మీ కేగిన నపాయము రాఁగల దని నాయెడంద శంకించుచున్నది.

(ద్వారపాలకుఁడు ప్రవేశించి)

సకలరాజన్యశిరఃకిరీటరమణీయమణిగణనీరాజితపాదపీఠవిభ్రాజా ! మహారాజా ! బహుపరాకు: ఒకసైనికుఁడు వచ్చి దర్శనమునకు వేచియున్నాఁడు.

గౌతముఁడు.

త్వరగాఁ బ్రవేశపెట్టుము.

* శ్రీ శారదానికేతనము బాలికలకొఱకు వ్రాయఁబడినది.



ద్వారపాలకుఁడు.

చిత్తము. మహాప్రభూ! (అని నిష్క్రమించును.)

(మాధవ్యప్రవేశము)

[జయము జయము. మహారాజా ! గంగాప్రాంతభూములం గలశత్రుసేనలఁ జెల్లాచెదరగునట్లు పాఱఁద్రోలి విజయోత్సాహమున మనసైన్యము వచ్చుచున్నది. సేనాపతి ముందుగాఁ దమకు మనవిచేయుటకు నన్నంపెను.]

గౌతముఁడు.

మంచిది. శుభవార్తఁ దెచ్చితివి ప్రొద్దునె. బహుమతి నందుకొని పొమ్ము.

మాధవ్యుఁడు.

దేవరయాజ్ఞ. (అని నిష్క్రమించును.)

సరోజిని

[ఆయుష్మంతుని కభ్యుదయపరంపర లభివృద్ధి యగుఁగాక ! శాత్రవప్రతిబంధకము సమూలము దొలఁగినది. ఈశుభసమయమున నీ చీఁకురాలిమొఱల నాలకింపరా ? మాటిమాటికి నీయభీష్ట మేమి? యని తెలిసికొని నెఱవేర్చుచుండు మీ హృదయము నేఁ డేలొకో కఠినత్వము వహించినది. దేవబ్రాహ్మణగురుభక్తి గల మీ కెవ రేమి చెప్పవలయును ? భక్తిప్రేమమును జూఱగొంటిని గదా యని తలంచు నాగర్వము నిర్మూలము సేయనేల? "స్త్రీబుద్ధిః ప్రళయాంతకా" యని తలపోయుచుంటిరి గాఁబోలు (అని దీనాస్య యగును.)

పూర్ణిమ

అన్నయ్యా ! ఏల నీ కీ గట్టిపట్టు? చాలాలికోర్కి దీర్పకుంట పాడి గాదు. నిన్నేమి కొండమీఁదికోతిని దెచ్చి యిమ్మని యడిగినది ? గంగ కేగి స్నానము చేసి తెప్పలయుత్సవము జరపి వచ్చెద ననియే కదా ? ఇందువలన వచ్చుప్రమాద మేమి? శత్రులు నంయితము పరాజితు లయిరి. మీ రియ్యకొనకపోరని ముందుగనే పరిజనము నంపి గంగయొడ్డున డేరాల వేయించితిమి. ఇంతమాత్రపుఁ జనవును మీయర్ధాంగి కీయకుంట ధర్మము గాదు.

గౌతముఁడు (నవ్వుచు)

చెల్లా ! పూర్ణిమా! నీ వన్నమాట నిజమే కాని శత్రులు మనల నోడింప విశ్వప్రయత్నములు సలుపుచుండిరి. వచ్చినది బలవద్విరోధము. ఢిల్లీశ్వరుఁడగు నాసరుద్దీన్ సామాన్యుఁడు గాఁడు. అతఁడు మనతో మిత్రుఁడుగా నుండియుఁ దనగవర్నరగు నయోధ్యనవాబును మనమీఁది కేల పంపెనో ? తెలియకున్నది. ఢిల్లీ కేగినరాయబారి వసంతుఁ డింకను రాఁ డయ్యెను. మన మెన్నివిధముల గూఢచారుల నంపి శత్రువిషయముల నెఱుఁగుచున్నను వారును నట్లే చేయకపోరు. అంతఃపురజనము కోటను విడిచి పోయిన దన్నవార్త శత్రులకుఁ దెలిసిన నెంతయపాయము వచ్చునో యటు విచారింపుము. పో వలదన్న దేవికిఁ గష్టము. పోయిన శత్రులవలనికష్టము. కావున దూరాలోచన మవసర మయ్యెను.

పూర్ణిమ.

నిజము. నిజము. ప్రియవస్తువులఁగూర్చి యనర్థశంకయే కలుగుచుండును.

సరోజిని.

ఈగాచబిడ్డ కేవలము గాజులనే తొడుగలేదు. కవచమునుం దొడిగినది. పూలమాలనే చేతఁ బట్టలేదు. నిశితకరవాలమును జేతఁ బట్టినది. కుసుమవిసరమునే చిదుమలేదు. భీకరానేకశాత్రవానీకినీశిరఃపంక్తులనుగూడ జిదిమినది. మత్కరవాలధారాసారమున శరవైరిశస్త్రీకుల మర్మవిదారణములైనవ్రణములు మానకపూర్వమే నన్నుఁ జైక వత్తురా? దేవరవారి కాసందియము వలదు.

గౌతముఁడు. (దేవిని దగ్గఱకుం దీసికొని)

దేవీ ! రాజశ్రీ! నిజముగా నీ వట్టిదానవే. నీవలన రాజపుత్రవంశము పవిత్ర మైనది

సీ. అలసాముగరిడీల-యందు నీదేహ పరిశ్రమమ్ముఁ గని హర్షించినాఁడ
ఖడ్గచాలనకళా - కౌశలమ్మును బరీక్షించి యెంతయును హర్షించినాఁడ
పంచకల్యాణుల నేను-వాజిపై వాహ్యాళి, నేయ నిన్నుఁ గని హర్షించినాఁడ
కౌశలము నటపూ-త్కార శరసంక్రమణ, స్థితి మాఱు నిన్ను హర్షించినాఁడ
క్షత్రియాంగనా ! నీ శౌర్య-సాహసములు
చిన్నతనమునుండి కని హర్షించినాఁడ
గాని నేఁటి యీ నీస్థితి - కలను జేయ
వలను గాదు గర్వమును గా - పాడుకొమ్ము.

పూర్ణిమ.

వదినెగారు వీరమాత లయ్యెదరు.

[సరోజిని తల వంచికొని నవ్వుకొనును]

గౌతముఁడు. [దృష్టి సారించి]

ఎవఁడురా; అక్కడ ?

సేవకుఁడు (ప్రవేశించి) జయము జయము, మహారాజా ! ఏమి యాజ్ఞ ?

గౌతముఁడు.

మా ప్రియజనము గంగాస్నానమున కేగును. ఉచితపరివారము వీరివెంటఁ బోవుటకు నేర్పరించి శత్రువుల జయించి వచ్చుచున్న సైన్యము గూడ వీరికి రక్షగా గంగానదియొద్ద కేగునట్లు సేనానికి వార్తఁ బంపు మని యమాత్యునితోఁ జెప్పి రమ్ము.

సేవకుఁడు చిత్త మని నిష్క్రమించును.

గౌతముఁడు.

దేవీ! ప్రసన్నురాలవగుము. నేఁ డేలొకో నాహృదయము చెయివెట్టి కలఁచిన ట్లున్నది.

సరోజిని [లోనలో]

ఆయుష్మంతుఁడు నాక్షణకాలవియోగమును సయితము సహింపలేఁడు (ప్రకాశముగ) సాయంకాలమునకే తమ పాదసన్నిధి సేవ సలుప రాఁగలను. నాకోర్కె నెఱవేర్చినందులకై యాయుష్మంతునికి—

గౌతముఁడు (అర్ధోక్తిలో)

నామనోభీష్టము వినుము.

పూర్ణిమ.

అన్నయ్యా ! తమప్రయత్నమున నుండెదను. త్వరగాఁ బంపుము. (నిష్క్రమించును).

సరోజిని.

మాచెల్లెలు సమయజ్ఞురాలు.

గౌతముఁడు. (గడ్డము పట్టుకొని)

సీ॥ కమవేగమున నీవు- నడువను సుశ్రోణి! నిట్టూర్పుగాడ్పులు-నిగుడఁగలవు
లోఁబునీభుజలోన- నీవు చేయఁబ చీక్కు, కాల మాయాసంబు - గ్గఁగలదు
నుడిగుండములఁ గంటఁ-జూడ. నైనను జూడ,నుము భయోద్రేకమె-క్కఁగుఁ
వడివడిఁ బోవుప్ర-వాహంబునకు నెదు,రై పోక నీయూపి-రాకలేమ [గలుగు
క్రౌంచమిథునాల లేపంగఁ గడగఁబోకు
మెవ రెఱుంగనిచాసలో నేద్వఁగలవు
పరిజనుల నిమునం బైనఁ బాయఁబోకు
మేనిమున మెట్టిదో యెవ్వ రెఱుఁగఁ గలరు?
ప్రేయసీ ! ఇవియే నాకోర్కులు. వీనిని నెఱవేర్పుము.

సరోజిని

తమకు నాయందుఁ గల ప్రేమము నన్ను లజ్జావతిని జేసినది. తమ యను శాసనమును మల్లెపూలదండవలె నాదల నలంకరించుకొంటిని.

తెరలో

అమ్మా! పూలు, గంధాలు, పండ్లు,చేటలు, పసుపులు, గుంకాలు మొదలైన వన్నియు తయారుగా వున్నై. పూలతెప్పలుగూడ కట్టాము. మా ఆలస్యము లేదమ్మా. పురోహితులు గూడ వచ్చారు.

సరోజిని.

నాథా ! సర్వము సిద్ధమైనదఁట. ఉషఃకాలము నాసన్నమైనది. సెలవొసంగుఁడు.

గౌతముఁడు.

(కరస్పర్శ సుఖము ననుభవించి)

భద్రముగాఁ బోయి రమ్ము. ప్రొద్దుండఁగనే యంతిపురముఁ జేరవలయును మా.

సరోజిని.

(భర్తపాదములఁ గంట నద్దికొని)

కం॥ తొలిమినుసల తొయ్యలి యా। దలఁ గులికెడి నెన్నసఁగుఁ- దమ్ములవలె ని॥
చ్చలు నాయెడందపీఠం। జెలఁగుట కీ యడుగు దోయి- సేవ లొనర్తున్॥
అని పూలతోఁ బూజించి యాపూలఁగంట నద్దికొని యశ్రుపూర్ణలోచనయై తిరిగి చూచుచు నిష్క్రమించును.

గౌతముఁడు.

(లేచి నడచుచు)

ప్రియురాలు బయలుదేఱియే యుండును.

తే॥ గీ॥ భక్తిమై గంగఁ బూజింపవలయు నచట
భక్తిమై నన్నుఁ బూజింపవలయు నిచట
రెంట నుబ్బూఁత లూఁగెడి హృదయడోల
నెట్లు భరయించెనో కదా ? యింతసేపు.

ఈ ప్రణయ ప్రవాహము విప్రలంభసేతువువలన నుద్రిక్తమై దుర్భర మగుచున్నది.

తే॥ గీ॥ మాయురే ! ప్రేమమునఁ గల తీయఁదనము
పాలలో లేదు మీఁగడపరక లేదు
తేనెలో లేదు శర్కరలోన లేదు
అమృతమునఁగూడ లేదు శే దంతకంటె.

ఆహా ! ప్రియురాండ్ర చేష్టితములు ప్రవిమల ప్రణయమధుర వేష్టితములు.

చ॥ తనపతి యానతిం బడసి తాలిమిఁ బూని వనంబులం గనం
గొనఁ జనుజానకింబలె; ని గూఢతర ప్రియతావిశేషముల్
వనుపడఁ గన్నుఁగోవల జలం బురలం గొనగోట మీటుకొం
చును జనెడి న్ననుం దిరిగి చూచుచుఁ దొట్రుపడం బదంబులున్.

(తెరలో గంట మ్రోఁగును.) (పరికించి.)

ఆహా ! ఉషఃకాల మైనది. కాల్యముల నిర్వర్తించుకొనియెదంగాక.

(నిష్క్రమించును).

## 2

## దృశ్యము – గంగానది

(తెరలో)

పాట.

భావాలవీథిలో పరుగెత్తుతుంటావు। జీవాలకోవలో చిందు లేస్తుంటావు
మావాలె యీ భూమి నీది కాదా? లేక—। మాకు మీకూ భేదముండేదా?
చేతలే ఆనంద మూరించురా. నీ, గీతలేమో దాన్ని పూరించురా
మాతెర్వు నీతె ర్వొకటి గాదా। లేక—మాకు మీకూ భేద ముండేదా?
ఉన్నట్టె ఉంటావువిన్నట్టె వింటావు— కన్నట్టె కని రూపు కల్పించు తుంటావు
వన్నెచిన్నెలతోడ వాదాడుతుంటావు - మన్నించు యీసృష్టి నీది కాదా?
లేక- మాకు మీకూ భేద మున్నాదా.
కిన్నెరస్వరముతో శే ల్గల్పుతుంటావు-చిన్నాకుపై రూపు చిత్రించు తుంటావు
చిత్రంబులోగూడ జీవాన్ని పోస్తావు - జీవంలో ఆనంద మొలికించుతుంటావు
ఆనందమున మన స్సాగుతుం దంటావు-మనసు నిలిచిన మోక్షమఱచేతిదంటావు.
మాకు మీకూ భేద మున్నాదా? దేవ ! మాకు మీకూ భేదమున్నాదా.
(అని పాడుచు. సరోజిని, పూర్ణిమ, మురళి యనుచెలికత్తె ప్రవేశింతురు.)

సరోజిని.

పూర్ణిమా ! ఆహా ! ఏమి యీ ప్రకృతి రంగము. ఎంత చూచినను దనివి తీరుట లేదు.

పూర్ణిమ.

అవును, వదినెగారు ! మనకుఁ బ్రొద్దెక్కుచున్నదియుఁ గన్పించుట లేదు. (పరికించి) (చేతులు జోడించి) అమ్మా ! గంగమ్మతల్లీ !

కం॥ గంగా ! గంగా ! యని ని। న్నుం గొండాడిన జనంబు, నూతొమడ ను
న్నం గూడ దుష్కలుషరా। శిం గెడపి వికుంఠమునకుఁ జేర్తువట గదా.

సరోజిని (కనులు మూసికొని చేతులు జోడించి)

పరమ పావనీ! భాగీరథీ! దుర్మార్గులగు సగరతనయుల నఱువదివేల మందిని సముద్ధరించిన నీ కరుణావిశేషము బొగడ నెంతదానను. నీ వలననే కదా! వసువులు గృతార్థులైరి. నీ వలననే కదా? భగీరథుఁడు ప్రసిద్ధిఁ బొందె. నీ వలననే కదా? సమస్తభూతములు సజీవము లగుట. తల్లీ! విష్ణుపాదోద్భవీ! నీ నీలు వెల్ల జీవనమయము, నీ యునికి యెల్ల గంభీరము. నీ కృత్యము లెల్లఁ బవిత్రములు.

దండకము॥ సకలభువనసృష్టిహేతూజ్జ్వల ద్విష్ణుదివ్యాంఘ్రిపద్మంబునం దేనెచందంబునం బుట్టువుం బొంది, పశ్యల్లలాటోగ్ర జూటాటవీవాటికా నాటకం బాడి, యక్రీంద్ర నక్షత్రశృంగాగ్రమున్ దంష్ట్రి న్నిల్పి, స్వర్గాది లోకత్రయంబుం బవిత్రంబు గావించి చిత్రంబులై స్తోత్రపాత్రంబులై మీలు చారిత్రముల్ పూని దీపించు తల్లీ! శ్రితాళిం గటాక్షించు నో కల్పవల్లీ! భవానీ! నమస్తే నమస్తే పునస్తే నమః.

మురళి :—అమ్మా! చూడు వెండిమొలత్రాడువలె వుంది గంగమ్మ సొగసు. పరికించి ఓహో! మనపూలదెప్ప నీళ్లమీఁద హంసివలె కులుకుచు నెంత యొయ్యారముగా పోవుచున్నది!

పూర్ణిమ. (సరోజినిదిక్కు చూచి)

మీ భక్తిపరవశతకు సంతసమున నవ్వుచున్నదో యన్నట్లున్న యానురగుల మురువును బరికింపుము.

మురళి :—తరగతి నిరోధ మొనర్చినదరులను జెంపలు వాయించుమోఁతల వినండి. అమ్మగారు పాడేటప్పటి మద్దెలమోఁతవలె వుంది.

(సరోజిని కన్నులు తెఱచును.)

తెరలో

పాట

శివునితలపై రెక్కి చిందూలు దొక్కేటి చిన్నదానా! నీవు చే మొద్దును
బవుదయా వుంచాలె బంగారుతల్లి! నీ పాదాలు సేవింతును,
జోర్నాయ్ బాన్నాయ్
తల్లులు పిల్లలు చల్లంగ వుండాలె కల్ల కపటము లేనితల్లీ!
మల్లెవొచ్చే యేల మల్లెపూదండలు వొల్లోను యేతు నోతల్లీ!
జోర్నాయ్ బాన్నాయ్
నీలోన పుట్టాము నీలోన పెరిగాము నీలోనికే వచ్చినాము
యేలోపముల్ లేక యీబీదవాళ్లను యేలవే గంగమ్మతల్లీ!
జోర్నాయ్ బాన్నాయ్

సరోజిని :—ఓహో! పడవవాండ్రు పాడుచున్నారు. అమ్మా! నిన్ను పొగడనివారు వానకుఁ దడవనివారు లేరుగదా.

పూర్ణిమ :—అమ్మా! మాభూతధాత్రి సర్వసస్యాఢ్యయై రత్నగర్భ యైనది నీమూలముననే కదా?

(ఆశ్చర్యముతో వేఱొకవైపు చూచి)

మురళి:—అబ్బా! ఈయేఁడీతిరునాళ్ల కెంతజనము వొచ్చారు. ఇసుక వేస్తే రాలడం లేదు. ఎక్కడ చూచినా భజనలే. ఎక్కడ చూచినా స్నానాలే. ఎక్కడ చూచినా మంత్రాలె. ఎక్కడ చూచినా పూలతెప్పలే. గంగమ్మతల్లి వొంటినిండ పూలుపెట్టుకుంది. జనాన్ని చూచినకొద్దీ ఆమెకు వుల్లాసం గాబోలును అక్కడికక్కడికి వులుకుతున్నది.

అదిగో పూలతెప్పలు చూచితివా?

పూర్ణిమ :—

సీ. ఉరణించు తరఁగల యుయ్యేలలకు నల్లనడయాడుచున్న వయ్యేడలఁ గొన్ని
తెలినీటిపుల్గుల యులివుపెన్నబ్బిగిం, తల నూఁగులాడుచు న్న వటఁ గొన్ని
ఎడనెడఁ బఱతెంచు బుడిబుడిపరకల, నాఁగుచు నున్న వం దందుఁ గొన్ని
నడిపాయఁ గడలేని సుడిగుండములవడిఁ, జొచ్చుచు నున్న వచ్చోటఁ గొన్నిఁ
దరులు వట్టినఁ గొన్ని కొండ ఱదె చూడు। నెట్టుచున్నారు కేకిసల్ గొట్టుకొనుచు
వెండితెరలలోనిరతనాల పిందువోలె। నుండెఁ దెప్పలు కన్నుల పండువుగను.

సరోజిని :—మీ రీప్రాంతప్రదేశమును జూడలేదు.

తే॥గీ॥ ఏడుగుత్తాలతేరిపై నెక్కి యినుఁడు। తఱుముకొని వచ్చుచున్నాఁడు తమము నెల్ల
గంగలోఁ బ్రతిబింబించెఁ గనుము క్రోధ। దుర్నిరీక్ష్యాక్షిలోహిత ద్యుతిచయంబు।

పూర్ణిమ :—చూడు నల్లని దూరముగా నున్న తామరతోఁటను. కాలాతిపాతభీతిచే మనము త్వరగా స్నానము చేయునప్పుడు గమనింపలేదు.

సరోజిని :—

భర్త్రాజ్ఞోల్లంఘనభీతిచేత ననుము.

పూర్ణిమ :—నిశీథినీప్రోషితపతిక కాఁబోలు నీపద్మిని. ఇంతవఱకు భర్తృవియోగమున మోము వాల్చి యలంకారశూన్య యై యుండినది.

సరోజిని :—నా కొకటి తోఁచుచున్నది.

ఆ॥ సాటిగానివారి సాటియగుటకంటె। సిరులఁ బాసి యునికి కరము మేలు
కుముదవిభవసదృశ మమరునం చనిసుమీ। తమ్మి-రేయి సొగసుఁదనముఁ బాయు.

కవయిత్రివి గదా! నీ వెట్లయిన నుత్ప్రేక్షింతువు.

మురళి :—మనవేణువలె వుంది. తామరపూలు గోయుచున్నది. తుమ్మెదలు చుట్టుకొన్నవి. గాబరాపడుచున్నది.

సరోజిని :—సఖీ! మురళీ! ఇంక నాపూలఁ గోయవల దని చెప్పవే! వాని స్వేచ్ఛ నేల భంగము సేయవలయు?

(నడచుచు నాశ్చర్యముతో)

మురళి :—ఇంతప్రొద్దెక్కినను జన మింకను వచ్చుచున్నది. అమ్మగారు! చూడండి, ఆ పడవలలోనుండి ఎందఱు దిగుచున్నారో!

(నిపుణముగాఁ బరికించి)

సరోజిని :—ఆ దిగుచున్నవారిలో ఖరిం జూడ స్త్రీవేషములతో నున్న పురుషులని నా కూహ వొడముచున్న దేమి?

(పరికించి)

పూర్ణిమ:—నడకలలోను జూపులలోను చేష్టలలోనుగూడ పుంస్త్వమే ద్యోతన మగుచున్నది సుమా.

ఆగి

మురళి:—అమ్మా! పురుషులు కాకపోతే స్త్రీ లంతపొడుగుగా నుంటారండీ!

పూర్ణిమ :—భుజములు నున్నతములుగా నున్నవి. నిలుచున్నవైఖరియు ననుమానాస్పదముగా నున్నది.

సరోజిని :—ఏలాకో నాహృదయము నిముసములో మార్పు నెందినది. (వడఁకుచు) నానుడికన్ను, పిదప నెడమకన్ను గూడ నదరిన వేమి?

మురళి :—అమ్మగారూ! ఇంక మనము డేరాల్లోకి పోదాము. సంతర్పణలు పట్నానికి వెళ్లినతర్వాత చేయవచ్చును. డేరా లెత్తించువాము. అదుగో మనవాండ్లందఱు గట్టెక్కారు.

పూర్ణిమ :—అన్నగారియాజ్ఞ మనయమాత్యునికిఁ జేరలేదా యేమి? రక్షకసైన్యము రాదయ్యెను. ఈ ప్రాంతమున మ్లేచ్ఛులు చెదరిపోయి రనియు వింటిమి.

భయముతో

మురళి :—అమ్మగారూ! తమవొఱలో ఖడ్గ ముందిగదా?

సరోజిని :—భయము వలదు. పూర్ణిమా! పరభయమువలన స్త్రీలు పురుషవేషములు ధరింపవలయుఁ గాని, పురుషులు స్త్రీవేషము లేల ధరింపవలయునో?

పూర్ణిమ :—ప్రబలకారణము లుండకపోవు.

మురళి :—కారణా లేముంటవి? ఆఁడవాండ్లచేతిలో నోడిపోతే నామోషీ లేకుండుటకు?

పూర్ణిమ :—ఇదేదిమో మాయగా నున్నది. శత్రువులమాయచేష్టలు కాకపోవని తోఁచుచున్నవి.

సరోజిని :—కానిమ్ము, పూర్ణిమా ఖడ్గకౌశలము మఱొకసారి దర్శించెదరు.

పూర్ణిమ :— దానికేమి! కాని, సైన్య మేల రాదయ్యెను? మనకు జయమబ్బిన దని వచ్చి చెప్పిన యుద్ధభటుఁడు మనవాఁడు కాఁడా? యేమి? నాకు సందియ మగుచున్నది. ఏదో వ్యతిక్రమము జరిగినది. గూఢముగా నెవరినేనిఁ బంపి పడవ దిగినవా రెవరో నిజ మెఱుఁగవలయును.

మురళి :—అమ్మగారూ! మిమ్ము శిబిరముల కంపి నేనే యేరి నిజ మారసి వస్తాను. త్రోవ యిటు. పదండి.

సరోజిని :—సరియే. శిబిరములఁ జేరుదము. వస్త్రాంచలములు బిగించి సిద్ధముగా నుండుఁడు. మురళీ! సహజభీరుత్వమును వదలుము.

(నిష్క్రమింతురు.)

## 3
## గంగాతీరము

సైనికవేషమున అభయచంద్రుని ప్రవేశము.

అయోధ్యలో మున్న జరిగిన శస్త్రవిద్యాప్రదర్శనశాలలో నావిద్యానై పుణ్యముఁ దిలకించి నవాబుగారు మిక్కిలి గౌరవించి కొంతసైన్యమున కధిపతిం జేసి మిక్కిలిమైత్రిం గనఁబఱచిరి. వల దన్నను విడువరైరి. ఇట్టిపదవి నా కిచ్చుటచే రాజపుత్రులంగూడ మన్నించుచున్నాఁ డనుకీర్తి లనకు వచ్చు ననికాఁబోలు. ఐనచో సర్వసేనాధ్యక్షపదము నేల నా కీయరాదు? దాని నొకమ్లేచ్ఛున కంటఁ గట్టి రాజపుత్రసైన్యమునకు మాత్రము న న్నధిపతిం జేసె.

ఢిల్లీశ్వరుఁ డగునాసరుద్దీన్ భయమువల్లఁ గాని లేకున్న నితఁడు హైందవుల నిద్రపోనీయనట్లు తోఁచుచున్నది. దానికిఁ దోడు సర్వసేనాధ్యక్షుఁడుహస్సేన్ అనుమాయోపాయధురంధరుఁడుగూడ దొరకినాఁడు.

అర్గళ మనుచిన్నస్వతంత్రరాజ్య మొకటి మినుకుమినుకు మనుచు వెలుఁగు చుండ, దీని నార్పవలయు నని యాఱునెలలనుండి విశ్వప్రయత్నములు చేయుచున్నాఁడు. నిష్ఫలారంభుఁ డై చివరకు "అభయచందూ! అర్గళమును జయించి నచో నిన్నే దానికిం బ్రభునిఁ జేసెద నని నవాబుగారు నన్నుఁ బుఱికొల్పి యెట్టకేల కంపిరి." [ఆలోచించి] "ఇదియేకదా నాతొలుతటియుద్ధము. కానిమ్ము. చూచెద."

దూరముగా హస్సేన్ ప్రవేశించును.

ఇప్పట్కి హల్లాకటాచ్ఛం మాకీ వుంచీ తలుస్తాన్. యేసుక్కీతీసి షగోజీకి కోట దాటించింది మాక్వైభావం. (గుండె కొట్టుకొనుచు) అచ్చా. అచ్చా. హస్సేన్ వోడిపోయిందివాలెనాసేనాకీకుండా బెచ్చికలాలె పారిపొమ్మని హుకుం జారీచేసాను. మాకీ పాయ్యా మని విష్వాసం రాజాకీ వుంది. మారువేసాలతో మళ్లీ వచ్చింది కెల్దూ ఆయన్కి. వజీర్సాహేబ్ మాత్రం కన్ను గల్గిమమ్మా తర్మిసపాజాకి హుకుం పంపాడు రాణీకి కాప్లాగా గంగవొడ్డున వుండమని. ఐతేయేం ఫాయిదా? ఆజాబు తెచ్చేవాణ్ణి హంకూ ఇచ్చినఫకీర్ మగ్గయా చేసి మాప్ చేసాడు రూపుఁగూడా హగ్పడకుండా. కన్కనే ఆపాజువేరేదారిన కోటకీ వెళ్లింది. ఈలోగా మాకీపని మేంచేస్కోని వెళ్తాము. రాజైమిస్తే రాణీ నిస్తామంటామ్. ఈదెబ్బన రాజ్జెం గెల్చా నన్నమాటే. అన్నమాటప్రకారం నావాబ్ సాహెబ్‌గారు నాకార్గళ్ దేశాన్ని ఇచ్చా డన్నమాటే. చందూకీ కబడ్దార్ చెప్తా—కొంత నడిచి అభయుని సమీపించును.

అభయుఁడు:—ఓహో సేనాపతిగారా? సలామ్.

హస్సేన్:—షలాం షలాం.

అభయుఁడు:—కోటను ముట్టడించున దెప్పుడు?

హస్సేన్:—హహ్హాహా (అని తలయెత్తి నవ్వి) కోట్కీ నై. షగోజీకి ముట్టడి.

తనలో

అభయుఁడు:—ఏ మిది? ఈ తుచ్ఛుఁ డిట్లు పలుకుచున్నాఁడు. కానిమ్ము త్వరపడనేల? (ప్రకాశము) ఆఁడవారిజోలి మన కేల? అది పౌరుషము కాదు. ఆప్రయత్నమును మానుఁడు.

మీసము మెలివెట్టుచు

హస్సేన్:—నీవా మాకీ నీతంగనీతుల్ సెప్పేది? ఎన్నీవుపాయాల్ లేంచీ రాజ్జాల్ గెల్చేదెట్లాహమ్కన్నావ్. నీకీ హుపాయాల్ తెల్సా. హమ్భవఁ నీకీ తక్వా సామి.

ఆశ్చర్యముతో

అభయుఁడు:—ఇందులకా రాజపుత్రయోధుల స్త్రీవేషులం జేసి పడవలలో నెక్కించుకొని వచ్చినది?

తనలో

హస్సేన్:—వీడూమోషంచేస్తాడా? యేమి చెప్మా. (ప్రకాశము) షరే. హైతే మేం రాణీకి పట్టుకుంటాం. మీ కీ కోటా పట్టటాన్కి ఆగ్నా హిస్తాం.

తెరలో కలకలానంతరము

వెఱవకుఁడు. వెఱవకుఁడు రాజపుత్రులారా! వెఱవకుఁడు. కరవాలములం జెఱికి రిపులం జించి చెండాడుఁడు.

ఆశ్చర్యముతో

అభయుఁడు:—ఏ మిది? అప్పుడే కయ్యమున కాజ్ఞ యిచ్చితిరా యేమి?

హస్సేన్:—వారూ మీక్కీ వస్తే సెయ్యాసూపం దని మేఁదక్కె సెప్పేశా.

అభయుఁ డూరకుండును.

హస్సేన్:—హాలోచన్ క్యాజీ.

అభయుఁడు:—ఆలోచించుట లేదు. ఆశ్చర్య మొందుచున్నాఁడను. ఏమీ కిఁక! చిన్నసైన్య మైనను మనగొప్పసేనతోఁ దలపడినది?

గడ్డము సవరించుకొనుచు

హస్సేన్:—మీకీ కెల్దూ రాజులషౌర్యం షామాన్నేమా?

పరికించి

అభయుఁడు:—జను లందఱు గాలికి మబ్బులవలె విచ్చి భయభ్రాంతులై పాఱిపోవుచుండిరి. ఎంతలో నీప్రదేశము నిర్మానుష్య మైనది. చేత ఖడ్గము దాల్చినవారు గాక తదితరు లెవ్వరుఁ గన్పడుట లేదు. వీరు కర్తయగు రాణిగారా జనములోఁ బడి కోట కీవలకు జేరియుండు నని తలంచెద.

హస్సేన్:—నాకీ పిచ్చివాణ్ణి నేస్తావ్. రాణెమ్మ మొగయాసంలో వచ్చింది. ఆవిసయంలో కన్నువేసే జాగర్తగా వుండా నని తెల్సుకో.

తెరలో

పొండు. జనులారా! పొండు. మీనెలవులకు నిర్భయముగాఁ బొండు.

హస్సేన్:—మీకీ గుర్త సెప్తా నూస్కో. అల్లద్గో ఆకేక లేసేగయ్యాళీ రాణీ యని తెల్సుకో.

తెరలో

తూఁకలవలె ఆడవారిమీఁదికి వచ్చిన యీభీరులఁ బాఱిపోనీకుఁడు. ఇఁక నలుకుఁడు. నలుకుఁడు వెఱవకుఁడు. తురకలా? రాజకుమారకులపై నలుకునది.

హస్సేన్:—దేఖోజీ. దేఖో. వీడ్కీ తలుస్తా రాణీసాహే బని. ఈమె వుపాయం నూసావ్, జనాన్ని ఎందుకు పారిపొమ్మంటుందో తెల్సునా?—ఆఁ. అందుకుఁ దగినకట్టుబాటు నేసేవుండాన్ సుమా. అయినను దూరాన వున్నరాజుకీ తెల్వకముందే మన్మ పని పూర్తినేస్కోవాలె తలుస్తాన్.

అభయుఁడు:—నా కాశ్చర్యముగా నున్నది. ఇందు వీరు లెవరో? అంతఃపురకుమారకులు లెవరో? నిశ్చయింప వీలు లేకున్నది. చూచి అరరే! కొందఱు యువతులు పర్వెత్తుచున్నట్లె యుండి నిముసములోఁ గత్తులం జెఱికి మనసైన్యముతోఁ దలపడిరి.

హస్సేన్:—ఆఁడవారు గూడా యుద్ధం నేస్తారయ్యా. బల్లు పెట్టి నేర్పించింది రాణెమ్మ స్త్రీపురుషు లందర్కి. యీ అర్గళదేశంలో యుద్ధం నేర్వనిమనిషి లేఁడు. హిందువల్ల నీమ్కీ యిన్నితిప్పల్.

తనలో

అభయుఁడు:—ఆహా! అర్గళరాజ్య మెంతపవిత్ర మైనది. నైశాల్యమునఁ జిన్న దైనను స్వాతంత్ర్యవాయువులం గ్రోలుచు క్షత్రియులపవిత్రతను నిలిపినది.

పరికించి

హస్సేన్:—మనసేనా కీ పికికి తోచిందిగా వుంది. మన్మకూడా తోడు నూప్తాం. నిల్చిందిమేల్ నై. నూడు నూడు వెన్కకూ జాతాహైఁ.

ఇర్వురు కొంతదూరము నడతురు.

తెరలో

అహో మత్ప్రియభటులారా! పాఱిపోవువైరులఁ దఱుమఁడు. కాని చంపకుఁడు. సమరధర్మమును వదలరాదు.

కత్తి దూసి

హస్సేన్:—క్యాజీ మన్కీ యింకా నూస్తూవుండడం ఫాయిదా నై. రాణీ మాటల్కీ వింటివా?

అభయుఁడు:— పరికించి తనలో నాహృదయము చెయివెట్టి కలఁచిన ట్లున్న దేమి చెపుమా. ప్రకాశము చూడుఁడు చూడుఁడు. మఱలమనవారు గుమిగూడి యొక్కపెట్టునఁ బైఁబడుచున్నారు.

పరికించి

హస్సేన్:—ఖేష్ ఖేష్. హచ్ఛా హచ్ఛా. ఈతూరీ మన్కీ జయం తప్పద్. మన్వారూ పోయేచారు.

అభయుఁడు:—బాపురే! సమరతలము పీనుఁగులమయ మైనది. నెత్తుటేర్లు ప్రవహించుచున్నవి. అవురా! ఆఁడవారికిఁగూడ నెంతశక్తి గలదు! నిజము గా

రింపఁగా, నభ్యాసవశతఁ "పౌరుష" శబ్దము పుట్టినది గాని స్త్రీ లేవిషయమునను బురుషులకుఁ దీసిపోవువారు కారు. మీఁదు మిక్కిలి మిన్నలుఁగూడ నగుదురు.

మ. అరరే! పూర్వయుగంబునందుఁ గలసత్యారుక్మిణీగార్గులకా
సరిపోలంగలవారు పుట్టెదరు స్త్రీస్వాతంత్ర్యమే నేఁడునుం
బురఁగఁ; విందుమ కాదె? భీకర రణవ్యాపారసంయుక్త ని
ర్భరధీశక్తిని ఢిల్లి నేలు రజియా రాణిక; దలం పేటికిన్.

దూరముగ పూర్ణిమ ప్రవేశించి

క. ఓవీరక్షత్రియులా। రా! వీఁపులు చూపకుఁడు దు-రంబునఁ బ్రాణ
జీవములు నిల్పునే సత। మేవగనేఁ జావు రాదె?-యెటుఁగరె నీతిన్?

పుట్టువుందొట్టి తేనిచేఁ బోషింపఁబడిన యీశరీరముల నీదృశోనిపోయి యేమి చేసి ఋణవిముక్త లయ్యెదరు?

గీ. కటుసుఁదురకల శిరముల ఖరతరాసిఁ। బటపటం దెగ నఱకుఁడు బిరుదు లయ్యుఁ
బిఱికికండ లుండునె! రాచబిడ్డలకును। దొడ్డగోసాలు లేవె! మీయెద్దలోన.

అభయుఁడు:—ఔరా! ఏమి యీపౌరుషోక్తులు! ఈతాఁకునో మనధైర్యము నిర్మూల మగునట్లు తోఁచుచున్నది.

(నవ్వుచు)

హసేన్:—హహ్హహ్హా! నీ కీ తెల్దా భాయ్ యెన్కనుంచీ మన్కీ సేన వస్తావుంది.

(సంతసముతో)

పూర్ణిమ:—పొండు మ్లేచ్ఛులారా! భీరులారా! పొండు. రాజపుత్రులారా ఇక వెనుకకు రండు రండు. మనరాణిగారిని మధ్య నుంచికొని చుట్టు మనము మండలముగా నేర్పడి పోరాడుచుఁ బట్టణాభిముఖుల మై పోదము.

హసేన్:—బడా వుపాయంవుంది దీన్కి. హమైతే మన్మ దీన్కి పట్టి వేస్తాం. వొక హాడపులి సిక్కినా సిక్కినట్లే.

(ఆలోచించి)

అభయుఁడు:—వలదు వలదు. ఈ బెబ్బులిబారిఁ బడఁగూడదు. ఆదెసను బాడువెట్టివచ్చినది చూచుచుంటిని కాదా? ఇది కాదు సమయము. మిక్కిలియలసి నిర్విణ్ణురా లైనపుడు తలపడుము. ప్రస్తుతము మీ రాదెసను, నే నీదెసను దలపడి పోరుదము.

(అని నిష్క్రమించును)

హసేన్ :—హమైతే మరీబాగు. జాగర్తా భాయి.

అభయుఁడు :—ఈహసేనునకుఁ గుతంత్రములఁ బన్నుటయం దున్న నైపుణ్యము యుద్ధము లొనర్చుటయందు లేదు. నాతోఁ జెప్పిన దొకటియుఁ జేసిన దొకటియు. వీనియూహావ్యూహములు దుర్గ్రాహ్యములు. ప్రకృతము నాకుఁ గర్తవ్యము తోఁచుటలేదు. ఆఁడువారలఁ జెఱవట్టుటయా? దుర్గముల ముట్టడించి యాహవరంగమున నహితుల నసిధారకు నాహుతి నేయుటయా? ఏది పౌరుషము? ఏది సముచితము? (ఆలోచించి) ఎట్టి శత్రువు లైనను బరస్త్రీలకు జోహారు లొనర్తురే? ఇది యెట్టిధర్మము? అధర్మ మని నే నూరకుంటయు ధర్మమా? ప్రభ్వాజ్ఞ నెఱవేర్చుటయే ధర్మమా? ప్రభ్వాజ్ఞ యేమని? కోటను ముట్టడించి శత్రుల జయింపు మనియే కదా? (యోజించి) అట్లొనర్తునా? వలదు. ప్రస్తుతము వీలు లేదు. మఱి యుద్ధ మిపుడు మానుదునా? (యోజించి) వలదు. హసేన్ నావిముఖతను నవాబునకు గోరంతలు గొండంతలుగాఁ జెప్పకపోఁడు. చెప్పిన నేమియు లేదు కాని, భృత్యధర్మమును గాదుగదా? కనుక యుద్ధము కర్తవ్యమే. ఫలమును పిదపఁ బరికింతము. (అని కత్తిని బెఱుకఁ జూచును) ఏ మిది? అపశకునమా? లేక ఆఁడవారిమీఁది కరుగుట యధర్మ మనియా? కరవాలభైరవా జోహారు (అని యనుమానించుచుఁ గత్తిఁ బట్టి నిష్క్రమించును.)

(పూర్ణిమ ముందునకు వచ్చి)

నామాట లెవరికిని విన్పింపనట్లున్నవి. (పరికించి) ఏమి పోరాటము! ఏమి మావారి యారాటము! ఔరా! వెఱ్ఱి యెత్తినట్లు మావారు పోరుచున్నారు. (శత్రుల వైపు చూచి) ఈదృఢకాయుఁ డెవఁడో యెదురులేక క్రీడించుచున్నాఁడు. వీని నైపుణ్య మనుపమాతీతము. వీనిచే మాజయకాంక్ష నమసిపోవుచున్నది, కానిమ్ము ఇట్టియెడ నిరుత్సాహము కూడదు. మావారి కావేశము గల్గించిచూచెద.

(కొంతదూరము నడిచి)

పాట

వీరవర్యులారా - క్షత్రియ - శూరవర్యులారా!
మీశౌర్యాగ్నికి మిడుతలవడువున మీశస్త్రములకు మేఁకలపోలిక [లారా
తూలిపోవలయుఁ దుచ్ఛమ్లేచ్ఛులు పాఱిపోవలయు బడాయిఁతురకలు॥ వీరవర్య
తాఁచిన లేచెడి త్రాఁచులపోలిక ఏచిన లేచెడి యెలుఁగుబంట్లవలె
గుండ్రాల్ దొలిపెడికోఁడలపోలిక గాండ్రుగాండ్రు మని కవియుపులులవలెఁ
బంజాతో పైఁబడుసింగంబులచాడ్పునఁ బైఁబడి చంపుఁడు శత్రుల
వీరవర్యులారా - ఆర్గళ - శూరవర్యులారా!

(తెరలోఁ గలకలము)

(పరికించి)

పూర్ణిమ :—ఏ మది? ఆ హాహాకారము లేమి? ఆహుంకారము లేమి? మావీరులు కొంద ఱటు పర్వెత్తుచుండి రేమి? మావదినెగా రెక్కడ? ఈమెను బదిలముగాఁ గూర్చుండు మనిన వినదు. దైవము తప్పఁ జూడలేదుగదా?

(తెరలో)

హా! మనీచుఁడా! దొంగా! పిఱికిదొంగా! రమ్ము. నక్కియుండెద వేల? పాఱిపోకు రమ్ము, రమ్ము.

(పరికించి)

పూర్ణిమ :—అయ్యో! ఈమెగూడ యుద్ధరంగమున కుఱికినదే. శత్రుల నుఱుముసేయుచుఁ బ్రమాదవశమున నీమె కెడ మైతిని.

(తెరలో)

ఆఁగుఁడు ఆఁగుఁడు. ఒకనితోఁ బలువురు తలపడుట పాడిగాదు.

పూర్ణిమ :—ఏమి యీమె సమరధర్మము! అఖడ్గచాలనకె శలము నిరుపమానము. వీరి నిర్వీర యుద్ధముచేయనిచ్చుట యుచితముగాదు. ఆమెగర్జనలకు భయపడి భటులు వెనుకంజ వైచిరి. నే నేగెదఁగాక. (పోఁబోవుచుఁ బరికించి) అప్పుడే మిఱుమిట్లు గొలుపు నామెకరవాలకాంతులకే యీబడుగు పాఱిపోవుచున్నాఁడే, నే నిట నడ్డగించెద— (నడుచుచుండును.)

(హసేన్ ప్రవేశించి కుంటుచుఁ బాఱిపోవును)

తఱుముచు సరోజిని ఖడ్గహస్తయై ప్రవేశించును.

ఊరఁబందివలెఁ బాఱిపోయెద వేమిరా? తుచ్ఛుఁడా! నీచుఁడా! పందా! నీకీనే నాపతిపదము నిచ్చినయాతురకవానికి బుద్ధి లేదురా. నవాబుధనమువలనఁ బెరిగిన యీనీనెత్తురుకండల గ్రద్దలపాలు నేసియుందును. క్షణము నిలువకపో వేమిరా మూర్ఖుఁడా? ఆఁడుదానికి భయపడియెద వేమిరా? నీపౌరుషము కాలిపోను. నీతల్లి గొడ్రాలైనను బాగుండెడిదిరా. నరపశువా! పిఱికితురకా!

(దగ్గఱకు వచ్చి)

పూర్ణిమ:— వదినెగారూ! పరుగెత్తకుఁడు పరుగెత్తకుఁడు; ఆపిఱికి పాఱిపోయె; వెంటఁ జనకుఁడు; గోషావేశము నాఁగుఁడు.........అయ్యో! భద్రముగా నొకచో నుండక కత్తి పట్టి కదనమకు జిగితి రేమి?

[ఊఁపుచు]

సరోజిని:— అమ్మా! ఈయధముఁడు నాయెంటరిపాటును జూచి పట్టుకొనవచ్చెను. సమయమునకు లేనిచదువును దగులఁబెట్టనా? మానభంగముకంటెఁ బ్రాణములు రుచ్యములా? బొందిలో ననువులుండఁగా నన్నుఁ జెనకు వీనియబ్బతరమా? ఈయుసముండా నన్నుఁ జెఱఁగొనునది? ఏఁడీ వీఁడు - ఈయధముఁడు - ఈనీచుఁడు - ఈమాపి [అని ఆవేశమునఁ బోఁబోవును].

(పట్టుకొని)

పూర్ణిమ:— అమ్మా! శాంతింపుము. ఇచ్చట విశ్రమింపుము. హృదయావేగమును బదిలపఱచుకొనుము [అని కూర్చుండఁబెట్టును.]

(తెరలో)

దీన్-మాలా-దీన్-దీన్

సరోజిని:— ఏ మా సంరంభము? మనవీరులు పలుచవడిరి. శత్రుసైన్యము క్షణక్షణమునకుఁ బెరుఁగుచున్నది. ఆయమ్మంటులమాట వినక ముప్పుఁ దెచ్చుకొంటిమి. మనరక్షకసైన్యముగూడ రాదయ్యెను. గంగాతీరముఁ గాచుచున్న సైనికులు క్రమముగా హతు లగుచుండిరి. ఇఁకఁ గత్తిఁ బూనక చేయున దేమి? (అని కత్తిఁ బూని లేచుచు) ఓముష్కరతురుష్కాధములారా!

పూర్ణిమ:— ఆగు మాఁగుము. త్వరపడకుము. (అని చేయి పట్టి కూర్చుండఁ బెట్టుచు) అయ్యో! చేయిగాయమైనదే! అయ్యయ్యో! ఎంతరక్తము స్రవించినది! నాకన్నులు మూఁతపడుచున్నవి. అయ్యో! అయ్యో! ఎంతకష్టము! ఎంతకష్టము! కట్టా! యుద్ధమేలచేసితివి? అయ్యో! ఇఁక దిక్కెవరు?.

సేనాముఖి ప్రవేశించును:— అమ్మా! ఇంకేమున్నది? కొంప మునిగింది. సేనానాయకుఁడు నిర్భయచంద్రుఁడు అధర్మంగా చంపఁబడ్డాఁడు. మనవాండ్లలో నిరుత్సాహంగా వుంది.

(కత్తి నేల వైచి)

సరోజిని:—హా, నిర్భయుఁడా! నిర్భయుఁడా! ఋణము తీర్చుకొంటివా? రాజుగారికిఁ గుడిభుజముగా నుంటివే. దేవుఁ డోర్వఁడాయెను. హా హతవిధీ!

పూర్ణిమ:— అయ్యో! నిర్భయా! మాకు దూరమైతివా? కట్టా! యెట్టియి క్కట్టు మూడెను! కటకటా! నీ వుంటివిగదా నచ్చినబంటు వని యెంతో ధైర్యము గా నుంటిని.

సరోజిని:— నిర్భయా! నిర్భయా! నన్ను అప్పజెప్పక కాచుకొనియే యుంటివే. "అమ్మగారూ! యుద్ధము చేయకుఁడు. నేనుంటిం గదా సేవకుఁడను-అని వేఁడుకొంటివే! అయ్యో స్వర్గమున కేగితివా?.

పూర్ణిమ:— అమ్మా! వగవకుము. ధైర్యము వహింపుము; యుద్ధము చావునకేకదా వచ్చినది. కర్తవ్యము విచారింపుఁడు. గతజలసేతుబంధన మేల? నేన కభయ మిమ్మ; నీవే ఇట్లయిన మా కిఁక ధైర్య మెక్కడిది? ఊఱడిలుము.

సరోజిని:— నిర్భయా! నీసాహసౌదార్యములు నీయుద్ధకౌశలమును జూచి రాజుగారు పెట్టుకొనిన "నిర్భయ" అను బిరుదనామమును సార్థకము చేయఁ దురుష్కులలోని కుతికితివా? కటకటా!

మురళి:— కాదమ్మా! మీరొకని తఱుముకొంటూ వచ్చుచుంటిరి; మిమ్ము కాచుకొంటూ వెనుకనే నిర్భయచంద్రుఁడు వచ్చుచుండెను; ఇంతలో పీనుఁగుల క్రింది నుండి చప్పున ఒకఁడు లేచి వెంటనే వెనుకనుండి కత్తి విసరెను. అదేఘుతో నే క్రింద పడెను; సూటిగా గొంతుకు తగిలింది.

పూర్ణిమ:— హా! దైవమా! ఇది శత్రులపన్నుగడ; భగవదనుగ్రహము వలన వదినెగారు రక్షింపఁబడిరి.

(కన్నులనీరు తుడుచుకొనుచు)

సరోజిని:—కట్టా! నాప్రాణమునకు నీప్రాణ మిచ్చితివా? అభయా! విశ్వాసపాత్రుఁడ వని మానాయనగారు నాయొద్ద కంపినందులకుఁ బ్రభుఋణముం దీర్చుకొంటివోయి. ధన్యము; ధన్యము నీజన్మము ధన్యము. అయ్యో పూర్ణిమా! మీయన్నగారిమాట వినక యెట్టిముప్పుఁ దెచ్చుకొంటిమి!

పూర్ణిమ:—అమ్మా! కర్తవ్యమును విచారింపక తలపోసిన నేమిలాభము?

సరోజిని:—కర్తవ్యమా? అయ్యో! ఈయపారసేనాసముద్రమును నిస్సహాయల మగుమన మెట్లీఁదఁగలము?

ఈమెం బుకికోల్పవలయు.

(తనలో)

పూర్ణిమ:—వదినెగారూ! వినచోఁ జేతుల జోడించి లోఁబడుదమా ఈమువ్కరతురుష్కాధములకు?

(లేచి)

సరోజిని:—ఎంతమాట! ఎంతమాట! చేతులు జోడించుటా? లోఁబడుటా? ఏమీ! ఆర్గళరాణియే? రాజపుత్రియే? పూర్ణిమా! మనకళే బరములు—కాదు కాదు. కాలినబూడిదనుమా లోఁబడవలసినది. తెమ్ము. రెండు చేతులకు రెండుకత్తులం దెమ్ము. పూర్ణిమా! నీవు భద్రముగా నెట్టకేని కోట కేగుము. పవిత్రము లైన ప్రభువు నా పవిత్రచరణములకు నానమస్కారముల మనవి చేయుము. తమమాట విననిఫల మనుభవించితి ననుము. రాచపాడి నవలంబించితి ననుము. ఆర్గళదేశముఁ-బవిత్రనుక్షత్రియులయార్గళదేశమున స్వాతంత్ర్యవాయువుల విచ్చలవిడిఁ దిరుగనిమ్మనుము. పగలకుఁ జేయుొప్పట మాత్రము పాడి గాదనుము. వెళ్లుము వెళ్లుము. (కత్తి సారించుచు,)

గీ. ఇదియె క్షత్రియకులమున నొదవె నేని, ఇదియె క్షత్రియాంగనపాల నెరిగెనేని
ఇదియె క్షత్రియవస్యాని మునిశయేని, ఇదియె క్షత్రియకన్యయే యేని పూర్ణ
మా! వశము గాదు వశము గా దాత్మదేహ, మంచుఁ బ్రాణపంచక మున్న
యంతవఱకు
హస్తమునఁ గరవాల మున్నంతవఱకు, అంగమున స్మృతిజ్ఞాన మున్నంతవఱకు
నచ్చుమర్ మ్లేచ్ఛగళగళద్రుధిరఘోర, ధారధారుణీభాగంబు దడపకుండ.

పూర్ణిమ:—ఏమీ! నే నంతభీరురాలనా? సమరకర్మ మెఱుఁగనిదాననా? వదినెగారూ! నా ప్రాణములు నా కంతరుచ్యములు గావు. మీ యీ వేఁడికోలు నుల్లంఘించినందులకు మాత్రము మన్నింపుఁడు. కత్తి పట్టి కదనరంగమున ప్రతికి కలుకులుకలకంతరక్తమును కాల్వలు కట్టింపక కదలఁజాలను.

(తెరలోఁగలకలము)

మురళి:—అమ్మగారూ! మనసేననాథుఁడు లేనిరాజ్య మైంది. చూడండి పాఱిపోవుచున్నారు.

(పరిక్రమించి)

సరోజిని:—ఓక్షత్రియులారా! మీవంశములఁ గలుషితములఁ జేయకుఁడు. పాఱిపోయిన, మీ లేమొగములతో మీభార్యల రాకొమార్తెలఁ జూచెదరు? దేశస్వాతంత్ర్యమునకుఁ బోరాడి కీర్తికాయు లైనమీతండ్రుల స్మరింపరేల? పులుల కడుపునఁ జలిచీమలు పుట్టునా యేమి? లేళ్లకు సింగంబులు భయంపడుట యెందును వినము, కనము. ఎన్నియోధండనముల రిపుతండముల ఖండఖండములుగ ఖండించిన మీకు పిఱికికండలు మెయినిండ నెట్లుండినవి? ముక్కుపచ్చలాఱనిమీచెల్లెండ్రు కూఁతులే చూడుఁ డెట్లు రిపుల నెదిరించుచుండిరో? వారల వదలిపోవుటకు మీ మనస్సు లెట్లొప్పెను? మఱలుఁడు మఱలుఁడు. ఇదే నేను మీకుఁ దోడ్పడుచున్నాను.

(నడచుచు)

(తెరలోఁ గలకలము)

మురళి:—అమ్మా! ఆపక్కన పట్నానికి వెళ్లువారిని శత్రులడ్డుకట్టఁగా వృద్ధులుతప్ప మిగిలినవా రందరు పౌరుషాలు తెచ్చుకొని శత్రువులతో కలియఁబడి కత్తుల లాగుకొని యుద్ధముచేయుచున్నారు.

సరోజిని:—

బళీ! బళీ! అట్లుండవలయు.

ద్విపద. పిల్లి యైనను దన్ను చిట్టరికట్ట। పెల్లునఁ బైఁబడి పెఱుకఁ గన్ గ్రుడ్ల
యుద్ధవిశారదు లూరకుండెదరె? సిద్ధాహవమ్మునఁ జేద్పడియెదరె?
రండోయి!రండోయి ప్రజలార! మీరు। లెండోయిలెండోయి! మ్లేచ్ఛులందఱును
పాండోయి! పాండోయి బాలికలనికిని। కండోయి కండోయి కడఁకసాయమ్ము.
ఆర్గళశూరులారా! ఘనులారా! । భర్గుఁ డైనను మిమ్ముఁ బట్టఁగాఁగలఁడె?
దుర్గాప్రసాదంబు దోడగు మీకు । దుర్గర్వయుతుల శత్రులఁ దున్ముఁడయ్య!
(అని కోపావేశమునఁ బోవుచుండును.)

మురళి:—అమ్మగారూ! ఆఁగండి. ఆలోచించండి. మళ్లి కొత్తసేన వచ్చింది. అందులో రాజపుత్రులే అందఱు. వాండ్లతో పోరుట సులభం కాదు.

పూర్ణిమ:—ఏమీ! రాజపుత్రులారా! రాజపుత్రులలో నింతనీచులు గలరా! ఆర్గళదేశమందలియువతులే స్వాతంత్ర్యమునకై ప్రాణము లర్పించుచుండ వీరి కేల సిగ్గులేదు? ఛీ! ఛీ! వీరు రాజపుత్రులు గారు. సంకరవర్ణులు. లేనిచో సోదర దేశీయులతో, నందును యువతులతోఁ బోరుదురా? ఛీ! ఛీ! స్వదేశాభిమానము లేని యీమూఢుల నఱికివేయవలసినదే. కాళిక మనకు సాయపడఁగలదు.

(వినుట నభినయించి)

మురళి:—అమ్మగారూ! మనసేన "మిమ్ము వదలి దూరముగాఁ బోవుట కూడదు" అని తలంచి వచ్చుచున్నా మని చెప్పుచున్నది. వింటిరా?

(ఆలోచించి)

పూర్ణిమ:—అవును. వదినెగారూ! మనవారు తమచుట్టు నిలువంబడి పోరాడుచుండ పట్టణాభిముఖుల మై పోవుట ప్రధానకర్తవ్య మని నాకుఁగూడఁ దోఁచుచున్నది.

సరోజిని:—మంచిది. (అని కొంతదూరము నడిచి)ఓసుక్షత్రియులారా! మాకుఁ గొంతదూరమునఁ జుట్టును మండలాకారముననుండి పైకివచ్చినవారిని ఖండింపుఁడు. వ్యూహము చొలఁగుకుఁడు.

ఉగ్గుఁబాలతోఁగూడ శౌర్యరసమును ద్రావినమీకు, స్వదేశాభిమానము గల మీకు, రాచపుట్టువు నొందినమీకు, ప్రభుభక్తివిశ్వాసములు గలమీకు, వీరపురుషులారా! చెప్పవలసిన దే మున్నది? ఓ సోదరీమణులారా! యథాశక్తి మాతృదేశసేవ సలుపుదము. ఒక్కసారియే వీరస్వర్గమును జూఱగొందము. శాశ్వత యశస్సు నార్గళదేశమున స్థాపింతము. మనతోఁ బోరుక్షత్రియపురుషులహృదయముల నించుక సేపులో నీఱు గావింతము. వారి దృష్టులతోడనే వారిహృదయములం జీల్చి వైచెదము. నిరాశఁ జెందకుఁడు, నిరుత్సాహముపడకుఁడు, నిలిచి పోరుఁడు, నియతిం బూనుఁడు.

యతిప్రవేశము (అందఱు నమస్కరింతురు)

యతి:— అమ్మా! సరోజినీ! నీకు మేలు గలుగును. ఉత్సాహమును వీడకుము. మీ సైన్యముగూడ త్వరలో మీకుఁ దోడ్పడును.

అమాత్యుఁ డంపినవార్తావహుని రహస్యముగా శత్రులు బంధించిరి. అనుమాత్యుని లేఖను వివేకి యనునతఁడు త్రోవలో నన్నుఁ జూచి విడుచుటచే నే దానిని గ్రహించి మాశిష్యునిచే సేనాపతి కంపి యిటు వచ్చుచున్నాను.మత్రియ

వాని గోటసుంగూడ నంపితిని. భయపడకుము. ఇటు రమ్ము (అని చెవిలో నేదియో చెప్పును.) [పూర్ణిమను జూచి తనలో] ఈమె పోల్కె లట్లేయున్నవి. ఏమో మనుష్యు నిబోలిన మనుష్యు లుండరా? అయినను నాహృదయము కొట్టుకొనుచున్న దేమి చెప్పుమా?

సరోజిని (ఉత్సాహముతో) యతులకు వందనములు-అని కాళ్లఁ బడి లేచును. మీరు పరమేశ్వరునివలెఁ బ్రత్యక్షమాటచే ధన్యుల మైతిమి.

యతి:— కృతార్థురాల వగుదువు; జయము గొందువు. మీవ్యూహము ప్రకారము నడువుఁడు.

అందఱు:— చిత్తము.

(అని నిష్క్రమింతురు)

(పరిక్రమించి)

యతి:—బళిరే! అర్గళవీరులు నలువంకల బైఁబడినరిపులఁ దామ నూర్గురైన ను జ.కక పోరాడుచున్నారు. ఆహాహా! ఆ యువతు లెంతనైపుణ్యముగాఁ బోరుచుండిరి.

(దూరముగా సరోజిని ప్రవేశించి)

ఓ శాత్రవపక్షక్షత్రియులారా!

సీ॥ అయ్యో! ప్రీత్యభిమానదేశాభిమాన। శూన్యులైన యోక్షత్రియమ్మన్యులార!
కటకటా! రాజకాంతల కడుపులు చెడఁబుట్టి భూమికి భారమైపోయినారు.

సీ॥ పరరాజులం గొల్చి బ్రదుకుటకా? మీరు, ప్రభవించినది రాజ వంశమందు
పరకాంతలను జెఱపట్టుటకా? మీరు, పూరుషాకృతులతోఁ బొల్చియుంట
ఆత్మజాతిస్వేచ్ఛ నరికట్టనా? మీరు ధరియించినది ఖడ్గతతులఁ గేల
ఆత్మదేశస్వేచ్ఛ నడఁచుటకా? మీర లాజి విద్యలను గృతార్థులగుట
కలదె? యుచితానుచితవివేకంబు మీకు। మీకుఁ దోఁబుట్టువులు లేరె?
మిమ్ముఁ గన్న
తల్లులు పతివ్రతలు గారె? ధర్మ మేది। జన్యమం దహో క్షత్రియమ్మన్యులార!

శా॥ చేతంబందుఁ దలంపనైతిరె ఖరాసిస్ఫారధారన్ రిపు
వ్రాతంబుం దునుమాడి మీపితలు నిల్వంబెట్ట రాత్మక్షితి
స్వాతంత్ర్యంబును వారిసంతతికి నీపాపంపుఁగార్యంబులా?
నీతుల్ నేమము లుండవా? యెడఁదఁ జింతింపుం డహో క్షత్రియుల్.

యతి:—అబ్బా! యెంతదెబ్బ యిది? ఏ మీయుపన్యాసధోరణి! ఈదేవి స్త్రీరూపము దాల్చిన పౌరుషదేవత. ఈవాగ్బాణములచే క్షత్రియులు నీతిమంతులే యైనచోఁ దప్పక యుద్ధము మానవలసినదే.

ఓ శత్రులారా! రాజపుత్రులారా!

సరోజిని:—

శా॥ మీ తోఁబుట్టుల మైనమ మ్మకట యీ మ్లేచ్ఛాళి కర్పింపనా?
జాతీయాశయపూరితాత్మకుల నుక్షత్రాళినిం జంపుటల్;
చేతం బింతయినం గ్రహింపరో కో? యిస్సీ! యింతయజ్ఞానమా?
మీతీరుం గని నవ్వి పోయెదరు సుమ్మీ యన్యదేశప్రజల్.

శా॥ స్నానంబుల్ వొనరింపవచ్చిన పయోజాతాస్యలం గ్రూరమా
యానైపుణ్యమునన్ వధించుటకొ? సైన్యం బింత యేతెంచుటల్
ఛీ! నీచుండు నవాబు చెప్పినను మీచిత్తంబు లెట్లొగ్గెనో
కో? నిస్త్రీఁశశితోరధారలను దళ్కుంబూల ఖండింపఁగన్.

తెరలో:—

ఆ॥ గోవుమానికముల గొంతులఁ బరపరఁ, గోయు తురకవాండ్ర గొలువు లేల?
తిరిగి రారె యాత్మదేశంబు నుద్ధరిం, చుటకు నుత్తమకుల శూరులార!

యతి:—ఈమె పూర్ణిమవలె నున్నదే. సేనానాయకునితోఁ దలపడి పోరుచున్నది. బళిబళీ! ఈకాంత బాలిక యైనను జక్కఁగా హితబోధఁ జేసినది.

సరోజిని:—

శా॥ కంపం బొందవె మీశరీరములు? జంకంబోవె మీభావపా
రంపర్యంబులు నాత్మలుం దెలుపవే ప్రాంచత్స్వధర్మచ్యుతిన్
ఇంపై యుండెనొకో? యధర్మపథ; మింకేలా? విశంకింపఁగాఁ
జంపం బూనుఁడు వెన్కకుం దిరిగి తుచ్ఛమ్లేచ్ఛసైన్యంబులన్.

(మఱొకవైపున బూర్ణిమ ప్రవేశించి దూరముగా)

కం॥ రాజకుమారులు పరకాం। తాజన మేజాతి దైనఁ-దగుచందమునం
బూజింత్రు గాని మీవలె। నాజి సలిపి చెఱలువెట్టు-టారయ నెందున్.

అయ్యయో! భారతమాతృభాగ్యవశమునఁ బవిత్రక్షత్రియవంశములఁ బ్రభవించిన పరమశూరులారా!

శా॥ పున్నెంబా? పురుషార్థమా? యకట! పూవుంబోండ్లు స్వీయాన్వయో
త్పన్నల్ నిష్కవచల్ సహాయరహితల్ బంధింపరా దంచు మీ
రెన్నంజాలక మమ్ము మ్లేచ్ఛునికి నర్పింపం దొరంకొంటి రీ
తెన్నుల్ మీ రెట నేర్చుకొంటి రయయో! దేశంబుఁ గాపాడరే?

సరోజిని:— పూర్ణిమ ఖడ్గవాదినియే గాక కార్యవాదినియు నగును. (పరికించి) కొందఱు రాకొమరు లలసి కాఁబోలు నిలువంబడిరి. లేక పూర్ణిమబోధామృతమును జవిచూచుటకా? (పెద్దగా) ఓశత్రుపక్షరాజపుత్రులారా!

తే-గీ॥ నిఖిలజనులును మిమ్ము నిందించుచుండఁ
బితరులే మిమ్ముఁ జూచి శపించుచుండ
గూటికొఱకు నీచాత్ములఁ గొలువనేల?
దుష్కృతము లేల? వేఱొండు త్రోవ లేదె?

మ॥ యవనోర్వీశులకై క్షుధాతురతఁ గాయం బమ్మి యీనీతి దు
ర్వ్యవసాయంబున నాత్మదేశమును నన్యాధీనమున్ జేయ నె
క్కువసంతోసముఁ జెందుచుంటి రిది మీకున్ లగ్గ గా దావలన్
మిపులన్ స్వేచ్ఛయుడంగ నేడ్చెదరు సుమ్మీ భావికాలంబునన్.

పూర్ణిమ:— అహో! అస్మదాప్తదేశీయరాజకుమారులారా!

శా॥ మీజాతిం బొలియించి మీవిభవమున్ మీదేశమున్ సర్వమున్
రాజన్యోత్తములార! యన్యులకుఁ జేరం జేయఁగాఁ బూనినా
రీజాడల్ పరికింప యుక్తములె? మీహృచ్ఛోకశమ్ముం జీల్చి వే
యోజింపుండు స్వదేశమున్ బొలియఁజేయం దంచు బోధించునో?

సరోజిని:— పూర్ణిమా! చక్కనిహితబోధ వారల కెక్కునా? కానిమ్ము చెప్పిచూతము (దైవముపై భారమువైచి) ఓ సోదరరాజకుమారులారా!

తే-గీ॥ చేతులారంగ నిపు డొనర్చి తలదగిలి
నప్పు డేడ్చిన మరల రాదయ్య స్వేచ్ఛ
తగదు తగదు దేశద్రోహ మగు పథంబు,
చూడుఁడా యింత తలఁపోసి శూరులార!

పూర్ణిమ:— (చే యెత్తి) ఓనాసోదరవిపక్షరాజకుమారులారా! నా హితవాక్యము సావధానముగా నాలింపుఁడు.

ఉ॥ గౌతమరాజవర్యునిఁ బ్రకాశితతేజుని క్షత్రియాన్వయం
బూతచరిత్రునిం గొలువ బోదము రం డిదె రాణి? యాక్ష వి
ఖ్యాతచరిత్రులార! తమ కార్గళరాజ్యము స్వాగతం బిడుం
బ్రీతిగ మి మ్మెదుర్కొని సుమంబులఁ బౌరులు చల్లుచుండఁగన్.

యతి:— భళిరే! పూర్ణిమా! వీరపత్ని వగుము.

(సంతోషముతో)

సరోజిని:—ఏ మిది? యుద్ధము నాఁపుపతాక నెత్తినారు శత్రువులు!

(తెరలో)

ఓయోధులారా! యుద్ధము నాఁపుఁడు. ఇంతవఱకే జాతిద్వేషుల మైతిమి. పవిత్రక్షత్రియులకుం జనించినవారందఱు నార్గళరాణిగారిపాదముల పైఁబడి క్షమాపణము వేఁడికొందురు గాక. ఇదే నే నగ్రేసరుఁడ నగుచున్నాఁడను (అని ప్రవేశించును.)

(సంతోషముతో)

యతి:—భళీ! అభయచంద్రా! ఉచిత మగు కార్య మాచరించితివి. ఇది నీకు శాశ్వతయశస్సంపాదక మగును.

అభయుఁడు:—అమ్మా! క్షమింపుము. కృపాభిక్ష పెట్టుము. మీయాశీర్వచనములచే మమ్ముఁ బవిత్రులం జేయుఁడు. మాయజ్ఞానాంధకారము వాసిన తమకు విధేయులము. భృత్యులము. (అని నమస్కరించును.)

(సంతోషముతో)

సరోజిని: —వత్సా! లెమ్ము, చిరంజీవివిగమ్ము. నీవలన రాజవంశము నేఁడు పూతమైనది.

యతి:—(తనలో) నాపోల్కె లున్నవేమి చెపుమా! కానిమ్ము, సావకాశముగా విచారించెదను. (ప్రకాశము) ఆహాహా! ఒక్కపెట్టున రెండువేలమంది

రాజపుత్ర సైనికులు తిరిగిపోయినా. కేనా మంత్రబీజము సుక్షేత్రమునం బడుటచే నంకురించి ఫలించినది.

సరోజిని:— ఓ నా రాజపుత్ర సైనికులారా! మీకు నిజముగాఁ బశ్చాత్తాపమే కల్గినచో, మాయందు విశ్వాసమే యున్నచో, మాకొలువు సమ్మతమైనచో వెనుకకుం దిరిగి నడువుఁడు. తురుష్కాధముల నడువుఁడు.

యతి:—అ ట్లుండవలయు ప్రభావము. మిత్రభేదతంత్రమునఁ గూలం కవ్యష్ణ గల దీసరోజినికి. ఇం కేమి సేయుదురు తురకలు? తమ సైన్యమే తమ కెదురుదిరుగుటచే హతశేషు లగు మ్లేచ్ఛసైనికులు పాఱిపోవుచున్నారు. పొండు. నీచులారా! పొండు.

(వేఱొకవైపు చూచి)

సరోజిని:—అది యేమి? మఱొకగొప్పసైన్యము వచ్చుచున్నది! తురకల దండు గాదుగదా? (నిపుణముగాఁ బరికించి) కాదు కాదు. అశ్వికదళమును బ్రభువుగారు వెంటఁ దీసికొని సాహాయ్యము వచ్చుచున్నారు. వాఁడుగో సేనాపతి ముందు త్వరగా వచ్చుచున్నాఁడు.

(సమీపించి)

పూర్ణిమ:—వదినెగారూ! ఇఁక మనపని తీరినది. ప్రభువు గారి నెదుర్కొందము. నడువుము.

(తెర వ్రాలును)

---



# అనాదృత వాఙ్మయము

శ్రీయుత మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు.

తెలుగున ఛందోబద్ధ మైన చారిత్రకవాఙ్మయము చాల తక్కువ. ఆయున్నకొలది వాఙ్మయమును రెండుతరగతులుగ విడదీయవచ్చును: (౧) కొంచెమో గొప్పో చదువుకొన్నవారు మాత్రమే చదివి తెలిసికొని ఆనందించు వాఙ్మయము [-౨] వ్రాయను, చదువను నేర్వనివారుకూడ విని ఆనందించు వాఙ్మయము. మొదటి తరగతి వాఙ్మయమే అసలు వాఙ్మయముగా ఇంతవఱకు పరిగణింపబడుచున్నది. రెండవదానిని మనవారు వాఙ్మయమే అనరు.

మొదటి తరగతిది కావ్యమున జేరినది. ఇందు పద్యప్రబంధములు, ద్విపదప్రబంధములు కలవు. ద్విపద కేవలము దేశిజాతికి సంబంధించిన ఛంద మగుట మన యాంధ్ర విద్వాంసుల నిరాదరణమునకు పాత్ర మైనది. సంస్కృతచ్ఛందమునందలి వృత్తములతో గూడిననే కాని కావ్యమునకు గణన రాలేదు. పద్యప్రబంధములే రంగస్థలము నాక్రమించి ద్విపదకావ్యములను వెడలనడచినవి ; అయినప్పటికి ద్విపద మేమూలనో నక్కి యెట్లో తన ప్రాణమును దాను పోసికొని తన బ్రదుకుతెరువు తాను చూచుకొనుచునే వచ్చినది. పౌరాణికేతివృత్తములు గల ద్విపదకావ్యములమాటే యిటులుండ చారిత్రకేతివృత్తము గల ద్విపదకావ్యములమాట వ్రాయవలెనా? చరిత్రమన్న, మనపూర్వుల కంతప్రీతి లేదు. చరిత్ర మిహపరసాధక మైనది కాదు. అసలు వాఙ్మయ మంతయు మతవిషయక మైన ప్రయోజనముతో చతుర్విధ పురుషార్థములలో ప్రధానముగ ప్రథమాంతిమ పురుషార్థములను సాధించుటకే పుట్టినది. మన ప్రబంధములందలి యితివృత్తము లన్నియు ధర్మ, మోక్ష ప్రతిపాదకములే; తద్బోధకములే. అందువలననే ప్రజలలో అవి యట్టిగౌరవస్థానమును కల్పించుకొన్నవి. ధర్మ, మోక్ష ప్రతిపాదన నిమిత్తమే గ్రంథములు పుట్టినపుడు అవి తదనుగుణముగనే పాఠకుల యభిరుచిని సరిదిద్దెనన్న వింత యేమి కలదు? మతాచారపరాయణు లైనప్రజలు అట్టి యితివృత్తము గలగ్రంథములనే యాదరించుచు, తద్విరుద్ధములైన గ్రంథముల ననాదరించుటంజేసి వేఱువిధములైన గ్రంథములు పుట్టుట కవకాశము లేకపోయెను. సంస్కృతచ్ఛందోబద్ధ మైన పద్యగ్రంథమున చారిత్రకేతివృత్తము స్థానము కల్పించుకొనునప్పటికి చాలకాలము పట్టెను. ఇది విజయనగరసామ్రాజ్య అంతిమకాలమునకుగాని సాధ్యము కాలేదు. కేవలము నశ్వరమును, ఐహికమును,పురుషార్థసాధనానుపయుక్తమును; విశేషించి ఐహికబంధప్రోద్దీపకమునగు స్వ(దేశీయ - జాతీయ-ఆత్మా) అభిమానమును ప్రమాణమును ప్రజ్వలింపజేయు చారిత్రకేతివృత్తమునకు పద్యప్రబంధపు తొడుగు తొడుగుట ఎంతటి యపవిత్రకార్యము! సంస్కృతసంబంధము గల 'పద్య'మును చారిత్రకేతివృత్తమును దెలుపుటకు వినియోగించుట దోషమే. ఈవిధమైన యభిప్రాయములు ఆంధ్రవిద్వాంసులలో వ్యాపించుటజేసియే చరిత్రసంబంధమైన పద్యకావ్యములు విజయనగరసామ్రాజ్యాంతిమ భాగమునకు పూర్వము మనకు గానరావు. చరిత్రగ్రంథము ప్రబంధరూపమున గాన్పించునప్పటికి అప్పటికే దేశము తెలుగు మీరిపోయెను. తుంగభద్రాతీరస్థమైన విజయనగరమున తెలుగుదొరలు దొరతనము చేయుచుండిరి. తెలుగునాయకులు, తెలుగురాజులు ఆ దొరలకు ప్రతినిధులై, దణ్నాయకులై, దుర్గాధిపతులై మంత్రులై ఒక్క తెలుగుదేశముననే కాక 'దక్షిణాది' నంతట వ్యాపించి తెలంగాణము మొదలు కన్యాకుమారివఱకు, సహ్యాద్రి మొదలు పూర్వాద్రివఱకు గల దక్షిణదేశ మంతయు తెలుగును జేసివేసిరి. రాజభాష తెలుగు; రాజులు తెలుగువారు; రాచఠీకము తెలుగువారిది. ఏ మాత్రము 'తాహతు' గలవాడునుకూడ తెలుగుకవుల నాదరించుటయు, వారికృతుల నంకితము గైకొనుటయు, లేక వారిచే కృతుల రచియింపించుటయు నొక విలాస మయ్యెను. మగటిమిగల మహమ్మదీయులకుగూడ తెలుగుదొరలప్రాపు మేలుపుకోవు అయినది. నాడు దొరలందఱిలో తీర్పులు దిద్దగలిగినదొరలు తెలుగుదొరలే. విజయనగరమున అరవీటిదొరల ప్రాజ్యసామ్రాజ్యమున నాడు తెలుగుబిడ్డలై పుట్టిన దొరతనమే; తెలుగుకత్తినిపట్టిన విజయమే. తెలుగునాటి ముమ్మదమైన యా పూతకారున తెలుగుదొరల శౌర్యధనము పద్యప్రబంధమునుగూడ కైవసము చేసికొని విజయాంకిత మైనది. నాటినుండియే కృష్ణరాయవిజయము, నరపతివిజయ మను రామరాజీయము, సోమదేవరాజీయము, రంగరాట్చరిత్రము, పద్మనాభయుద్ధము మొదలైన చారిత్రకేతివృత్తముల గ్రంథములు పద్యప్రబంధరూపమున వెలసినవి.

పద్యప్రబంధరూపమున నున్న పైగ్రంథములే కాక మఱి కొన్ని చరిత్రగ్రంథములుకూడ గలవు. కాటమరాజు కథ (దీనికి సంబంధించిన ఎఱగడ్డపాటి పోట్లాట, భట్టురాయ బారము), బాల చంద్రుని యుద్ధము; అలరాజురాయబారము మొదలైన పల్నాటి వీరుల చరిత్రలు, వల్లురాజుయుద్ధము, సిద్ధేశ్వరచరిత్రము-ఇవియన్నియు చరిత్రగ్రంథములే: ద్విపదకావ్యములు. ద్విపదకావ్య మున్న గణ్యత లేనిదినములలో ద్విపదరూపమున వెలయింపబడిన వగుటచేత వీటిని రచియించినవారి పేరుప్రతిష్ఠలు పైకిరాలేదు. వీటి రచనాకాలముకూడ మనకు సరిగ తెలియదు కాని పైనుడివినపద్య చరిత్రగ్రంథములకుమాత్రము పూర్వవులై యుండవచ్చును. ఇట్లనుటకు గట్టియాధారము లేవియు లేవు కాని, నాటిస్వభావమును బట్టియు, అందలిఛందమును బట్టియు అట్లూహింపవచ్చును. చారిత్రకేతివృత్తముగల ద్విపదప్రబంధములు ప్రధానముగ వీరరసపరిప్లుతము లైనవే. ఇట్టి ప్రబంధములలోని ప్రధానపాత్రలు అందఱును మానవమాత్రులే: మనవలెనే పుట్టినవారు: మనవలెనే పెరిగినవారు: మనవలెనే అంతర్వికారములకు లోనగువారు. వారికి మనకు ప్రవృత్తియందు గాని, స్వభావమునందుగాని భేదములేదు. పద్యప్రబంధములోని నాయకులవలె దేవతలతో గాని, మహర్షులతో గాని, దేవలోక, గంధర్వలోకములతోగాని సంబంధ మున్నవారు కారు. పద్యప్రబంధములలోని నాయకులకువలె వారికి మానవాతీత

ములైన, మానవా ననుభూతము లైనశక్తులు లేవు. కేవలము వారును మనమును ఒకటే ; ఇక భేదమేమన, వారి జీవితకథాప్రవృత్తి మానవసామాన్యానుభవమునకు ఇంచుక పైమెట్టుననుండి లోకుల యమాయకహృదయముల శృంగార, వీర, కరుణ, అద్భుతరసముల నెలయించుచు వారిని తన్మయులం జేయుచుండెను. ఈరసోద్దీపనమే మానవహృదయమున పొంగి, పొరలి పద, ద్విపదరూపమున జాలు వారి నురుగులు కట్టును. అట్టిరచనలు రసోద్వృత్తి వేడివేడిగనుండి పొంగులు తేరునపుడే కాని చల్లగ చల్లారినపిదప రావు. ఈకారణముచేతను, పైనుడివిన ద్విపదకావ్యములలోని యితివృత్తములు చిరవీటి విజయనగరాధీశులకు బహుకాలమునకు పూర్వము నడచినవగుటచేతను పద్యకావ్యములకంటె ద్విపదకావ్యములు పూర్వవులై యుండవలెను. అదియునుం గాక పద్యమునకంటె దేశిజాతి ద్విపదయే పూర్వపుదిగ గన్పట్టును: అతిప్రాచీనకాలమునుండియు ఆంధ్రహృదయమున స్థానము కల్పించుకొన్నవి అసలు దేశిజాతులే. ప్రాచీనశాసనములను జూచినను ఈవిషయమే స్పష్టపడును.

పైనుడివినయీ రెండువిధములైన చారిత్రికకావ్యములలో ప్రధానముగ ప్రబంధమే ఆంధ్రభాషాభిమానులదృష్టి నాకర్షించినది. దానం జేసియే చారిత్రకేతివృత్తము గల ప్రబంధములు ఇప్పటికే చాలవఱకు ముద్రితములై యున్నవి. కృష్ణరాయవిజయము, నరపతివిజయ మను రామరాజీయము, రంగరాయచరిత్ర, సోమదేవరాజీయము, పద్మనాభయుద్ధము- ఈపద్యప్రబంధము లన్నియు ఆంధ్రపాఠకలోకమునకు సుపరిచితములే.

కాని ద్విపదకావ్యములపై ఆంధ్రభాషాభిమానులదృష్టి ప్రసరించి యుండలేదు. వీటిలో తప్పి జారి ౧౯౧౨-వ సంవత్సరప్రాంతమున కాబోలు పల్నాటివీరచరిత్ర మచ్చుపడునది. కేవల మది చరిత్రగ్రంథమైనందువలననే కాదు, శ్రీనాథమహాకవికృత మనునానుడి కూడ దానిసత్వరముద్రణమునకు కొంత తోడ్పడినది. కాని 'పల్నాటి వీరచరిత్ర' మని ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున నున్న గ్రంథమంతటిలో ముద్రితమైనది స్వల్పభాగము మాత్రమే. అయినను దానిని ప్రకటించి చారిత్రకవాఙ్మయముయొక్క యునికిని, మనికిని దెలిపినందులకు శ్రీయుత విద్యాశేఖర అక్కిరాజు ఉమాకాంతము పంతులుగారు వంద్యులు.

పల్నాటి వీరచరిత్రమున ముద్రితము కావలసినగ్రంథ మింకను చాలగలదు. కాటమరాజుకథలు, సిద్ధేశ్వరచరిత్ర ఈ మొదలైన వాటి జోలికి పోయినవారే లేరు. తెలుగున చారిత్రక వాఙ్మయమే అసలు తక్కువగను, అందు ద్విపదకావ్యములు మఱియు తక్కువగను ఉన్నను అవి యింకను ఆంధ్రుల యనాదృతికి పాలగుచునే యున్నవి. ఈ ద్విపదకావ్యములు బహులోపభూయిష్టములు: తప్పులు కుప్పలుగ నున్నవి. కొన్ని కొన్ని పట్టుల సరియైన పాఠమే కుదురదు. వాటి ప్రతులు ఎంత ఎక్కువగ సంపాదించిన అంత మంచిది. ప్రతులు సంపాదించి సరిచూచి సరియైన పాఠ మేర్పఱిచి, వాటిని ముద్రించుట బహుప్రయాససాధ్యమే కావచ్చును ; అయినను చరిత్రగ్రంథము లగుటచేతనే వాటిని త్వరితముగ అచ్చొత్తించి ప్రకటింప వలసిన భారము చరిత్రాభిమానులైన యాంధ్రులపై నున్నది. ఉన్న కొంచెము వాఙ్మయమును బోగొట్టుకొని, మనకు చరిత్రవాఙ్మయము లేదని వాపోయిన గార్యము లేదు.

చరిత్రగ్రంథములుగనే కాక కావ్యములుగ చూచినను, పైనుడివిన గ్రంథములు చాల చక్కగ నున్నవి. వాటిలో మనోరంజకమైన శైలియు, సరసమైన కూర్పును, రక్తమును తీవరింపజేయు ఉద్వేగమును. లేకపోలేదు. ఉదాహరణమునకు కాటమరాజుకథలను గైకొనుడు: ఈ కథలకు సంబంధించిన ద్విపదలు కొన్ని కొన్నిపట్టుల జాతీయములతో నిండి చాల ముచ్చటగ నుండును. ఇవి అముద్రితములుగ నున్నకారణమున వాటిరుచి ఆంధ్రలోకమున కింకను దెలియరాకున్నది. తెలుగు నుడికారమును, తెలుగు పలుకుబడియు ఇందు మూర్తివంతమై యలరారుచున్నది. ఆంధ్రపాఠకలోకమునకు రుచిచూపుటకై ఆ కథలలోని అచ్చటచ్చటి కొన్నికొన్ని చరణముల నేటి వాటి నిట పొందుపఱుచుచున్నాను :

పదుమూడు లక్షల పశువులు గలవు.
కొమర తొమ్మిదికోట్లగోవులు
కలవు. ఏ మడిగిన పుల్ల రిచ్చేము మేము.

* *

పొట్లాట కడుముల పోట్లాటకాదు
వేదని కోపంబు పెదవులచేటు
కావళ్ళ మోయంగ గడలేక పెరిగి
బొజ్జలు పెంచుక బోగులాగుండు
నజ్జమానిను లెల్ల నని సేయగలరె ?

* *

పొడవుగా వారిని పొగిడేవు సారె
ఏఘిటికి పొడవు లెంచిచూచినను
బూరుగ తా నెంత పొడవుపెరిగిన
చందన కుజముతో సరితూగగలదె ?

* *

చేతప్పు వాతప్పు చెదరని గుండె
పితికి కండయలేని బిరుదురాహుతుడు.

* *

పాకనాడు చెదరె పలనాడు వడకె
గౌడదేశంబెల్ల కళవళంబందె
ములికి నాడంతయు నులికిపడి పోయె
కాకినాడంతయు కాకిపారాయె
కంచిభయంబందె కటకంబు జడిసె
సుత్తిరాజులకెల్ల గుండె దిగులలాయె
కాటమరాజును కదుచెప్పి నపుడె
కమపులో పిండాలు గడగడవడకె.

* *

కావడెత్తిన యట్లు కాదు కయ్యంబు
బాసపత్రా లిచ్చి పండిన చేలెల్ల
గాసిపుచ్చినయట్లు కాదు కయ్యంబు

* *

వ్రాయగోయనె కాని పగలతో రణము
సేయంగ నది తన చేత నేమౌను ?
సమరభూములు యజ్ఞశాలలు కావు
అడరెంచు శస్త్రాలు అక్షతల్గావు
ఘనమైన బాణాలు గాదెలు కావు
చెదరెంచు చక్రాలు చక్కిలాల్గావు
కమ్మెటి రక్తమ్ము కావు దోవతులు
కమ్మని పాయసము కాదు కయ్యంబు
వండిన భక్ష్యాల బంహార్పగాక
బంటు లెవరేవూరు ? బ్రాహ్మలేవూరు ?

* *

తప్పు లనేకము లున్నను గ్రంథమంతయు సరసమైన శైలిని ఉద్వేగముతో నడచుచుండును. పాఠకుల దృష్టిని ఇట్టి గ్రంథములపై ద్రిప్పుటకే పైచరణము లుదాహరింపబడినవి. ముఖ్యముగ చరిత్రకు గావలసిన ఈ విధమైన వాఙ్మయమును అచ్చటచ్చట మాఱుమూలపల్లెలలో చెదరియున్నది సేకరించుటయు, సేకరించినదానిని సరిచూచి సరియైనపద్ధతిని బ్రకటించుటయు జరుగ వలసియున్నది.

౨

ఇక రెండవ తరగతి వాఙ్మయము - వ్రాయను, చదువను నేర్వనివారుకూడ విని యానందించు వాఙ్మయమును గుఱించి విచారింతము. పాటలు, పదములు, జంగంకథలు, బుఱ్ఱకథలు-ఇవి యన్నియు నిందు జేరును. వీటిని మన చారిత్రక పదములు (Historical ballads) గ పరిగణింపవచ్చును. చిన్నపరెడ్డికథ, ఆరె మరాటీలకథ, చిన్నమ్మకథ, బంగారు తిమ్మరాజుకథ, కమ్మవారి పడతికథ, లక్షుమమ్మకథ, కామమ్మకథ, పెద్దాపురపు కోడిపుంజుల కథ, బొబ్బిలి మహారాజుకథ, బాలనాగమ్మకథ, దేసింగరాజుకథ, —ఇవి యన్నియు చారిత్రకపద వాఙ్మయములోనివే. ప్రజాహృదయమును రసతరంగితము గావించి, యుఱ్ఱూతలూచి, చూఱలాడిన చారిత్రక విషయమే యిందలి కథానకము: వీరమో, కరుణమో ప్రధాన మైన రసము. నాయకుడు సామాన్యమానవుడు: కాని యాతని జీవితమున నెప్పుడో యొకమెఱుపు మెఱసి దానికంతకు నొక్క కాంతి పరివేషమును గలిగించెను: ఆ పరివేషమండలమున ప్రజలను రిచ్చవడజేయు వీరరసప్రజ్వలితము లగు శౌర్యసాహస గీతికలో, లేక ప్రజల కన్నీటిధారల నివాళి గైకొను కరుణా రసార్ద్రము లగు కథానకములో పులకరించినవి. రసోద్దీపకములైన యట్టి పులకలకు స్థాయి కల్పించినవారు ప్రజలు. పై నుడివిన కథ లన్నియు నిట్టివే: 'విద్యరానివా' రనబడు ప్రజల యాదర, పోషణముల జీవించుచున్నవే. 'విద్యాధికుల' హృదయములను ప్రబంధ మెంత వశపఱుచుకొనెనో ఈ కథాపదములు 'విద్య రాని వారి' చిత్తముల నంత సమ్మోహితములం జేసెను. వీటికి వారి ప్రాపే లేకపోయిన అవి యీపాటికే అంతరించియుండును. ఇతివృత్తముయొక్క స్వభావము ననుసరించి ఈ రచనల తీరు ఒక్కొక్కదానిలో ఒక్కొక్కవిధముగ వికసించినది: ఒక దానిలో నున్న 'లయకట్టు' ఇంకొకదానిలో లేదు: ఒక దానిలో నున్న పాటతీరు ఇంకొకదానిలో లేదు. దేశికవిత పండినపంటపొలము ఈ 'పద' వాఙ్మయము. వీటికి పునాది యొక్కటే: కాని రీతులు వేఱు: నడకలువేఱు (చందమామపాటలు, ఊడ్పుపాటలు, తుమ్మెదపదములు - ఇవి యన్నియు ఈ కోవలోనివే.) ఈ కథ లన్నియు వీధిభిక్షుకుని భైసికసంకీర్తన గ్రంథ సముదాయమున జేరి యాతని ప్రాతజోలెలో తల దాచుకొని యున్నవి. వీటి నన్నిటిని బైకితీసి, తగిన యాదరణ మొసంగి, తగు రీతిని వాటిని ప్రకటించిననే కాని యవి యాంధ్ర పాఠకలోకముయొక్క గౌరవాదరములకుం బాత్రములు కావు. ఇవికూడ సుస్వరూపమున వెలయనంతవఱకు మన యాంధ్రవాఙ్మయమునకు ఆశ్వాసాంతగద్యము వ్రాయలేము.

ఇట్టి వాఙ్మయమును ఆంధ్ర భాషాభిమానులు అనాదృతిపాలు చేయుచున్నందువలన మన చారిత్రమున కెట్టి నష్టము వాటిల్లు చున్నదో యొక్క యుదాహరణమును గైకొని తెలిపి అంతటితో నీ వ్యాసమును ముగించెదను.

ఈ విధమైన వాఙ్మయమును గుఱించియు, దాని ప్రాముఖ్యమును గుఱించియు ఇంచుకంత వ్రాయు తలంపుతో అప్పుడప్పు డిట్టి గ్రంథములను కొనుచురాగా "సర్వాయిపాపడుకథ" అను చిన్ని పుస్తకముకూడ నాకు లభించెను. ఇది నాలుగైదుపుటలగ్రంథము. ఇది చెన్నపురి సావుకారుపేటలోని వుప్పల గవరయ్యశెట్టిగారిచే ౧౯౦౬-వ సంవత్సరమున ముద్రింపబడినది. మొదట దీనిని చదివినప్పుడు దీనివిలువ నాకు తెలియలేదు. కాని, దక్షిణహిందూదేశ మహమ్మదీయచారిత్రమును బఠించుచున్నపుడు ఇది చాల ముఖ్యమైన దని తెలిసెను.

మొదట కథ తెలిపెదను. ఇందలి కథానాయకుడు సర్వాయి పాపడు.

పుట్టినాది తెలగాము
పెరిగినాది తాటికొండా
కులమందు గవండ్లవాడు
ఇంటిపేరు నాశమోళ్లు
పేరు సర్దారిపాపన్న - ఆరాయడూ॥

కథలో పై రీతి నీతని పుట్టు పూర్వోత్తరములు తెలుపబడినవి. కథప్రకారము ఈతడు మొదట ఆవులను మేపుకొనుచు, కల్లు గీసికొనుచు జీవితము గడపువాడు. అతని యీ గోపాలకజీవనమిట్లు వర్ణితమైనది.

ఆవులనొడ్డికాడి కొచ్చి
దొడ్డితడికె వాదు తీసెరా - ఆరాయడూ॥
పిల్లంగ్రోవి వూదు తున్నడూ - ఆరాయడూ॥
యెనకా యేనూరు ఆవు
ముందరామున్నూరు ఆవు
ఈని కావు పేరు పడ్డాది
శనగచేలే పరగమేపెనురా - ఆముందను
జొన్నచేలే పరగ మేపెనురా- ఆరాయడూ.
సకినలమ్మ గుంటకాడ
ఆవులాకు నీళ్లుపెట్టి
చెట్టునీడ నిద్ర బోతాడూ-ఆరాయడూ॥

చెట్టునీడ నిద్రపోవుచుండిన పాపని మీదికి ఎండపొడ రాగా అప్పుడు పండ్రెండుపడగల నాగుబాము వచ్చి ఆతనికి ఎండ తగులకుండ తన పడగ లెత్తి గొడుగుపట్టెనట. కాశినుండి రామేశ్వరము తీర్థయాత్రలు సేవింప బోవు బ్రాహ్మణు లీ వింత చూచి అతనికి రాజయోగ మున్న దని ఆతనిని లేపి చెప్పిరట. బ్రాహ్మణులు చెప్పిన యీజ్యోతిషము పాపని జీవితవృత్తము నంతను మార్చివేసెను. ఇంటికి వెళ్లి తల్లియైన సర్వమ్మతో తన కింక అట్టి నీచపు పనులు చెప్పవద్దనియు, భవిష్యత్కాలమున తనకు పట్టగల మహాదశకు తగిన పనులే చెప్పవలసినదనియు కోరెను. తల్లి కొడుకుల సంభాషణము ఇచట చక్కగ నున్నది: చూడుడు.

వినరా సర్దారిపాప !
పరవిద్య లెన్నియైనా
కులవిద్యకు సాటిరావు - సర్దారిపాప;
ఇంటి ఆవుల మేపు మంటాది - సర్వమ్మతల్లి
ఈతచెట్టు గీయమంటాది - సర్వమ్మతల్లి
నాటికల్లె కట్టమంటాది - సర్వమ్మతల్లి

ఈతకాలే కట్టమంటాది - సర్వమ్మతల్లి
ఈత బెల్లం వండమంటాది - సర్వమ్మతల్లి

తల్లిమాటలు పాపనికి రుచింపవు: పాపనిదృష్టి రాజ మోగ మువిూద నున్నది. మొనగాడు కావలెనను దాహము ఆతనికి అతిశయించెను. బస్తీలు కొట్టి డబ్బు సంపాదించి మాన్యత, మగటిమి గలమన్నీడు కావలెనని యాతని కోరిక పీకిక లెత్తుచున్నవి:తల్లితో చెప్పుచున్నాడు.

ఈడులుగీస్తే ఈంద్రవాడు
కల్లుకట్టితే గవండ్లవాడు
కత్తపట్టితే మేదరవాడు
కుండపట్టితే కుమ్మరవాడు
మొనగాడి చట్టమెచ్చునా—సర్వమ్మతల్లి
పాళెగాడి చట్టమెచ్చునా—సర్వమ్మతల్లి

ఆతని వన్నియు నిపుణ పెద్దయూహలు: తన సంకల్పముల ను కార్యరూపమున సఫలముచేసికొనుటకు ధనము కావలెను. తల పోసినా డతడు.

ఊరు కొడితే యేమిఫలము
పల్లె కొడితే యేమిఫలము
కొడితే గోల్కొండ కొట్టాలె - సర్వమ్మతల్లీ
నెల్లూరు బస్తీలు కొట్టాలె - సర్వమ్మతల్లీ
కందనోలు మహల్లు కొట్టాలె - సర్వమ్మతల్లీ
మైసూరుదేశ కొట్టాలె - సర్వమ్మతల్లీ
మీసము గిరిగిర త్రిప్పె - సరదారి పాపడు.

సర్దారిపాపని పరాక్రమము సామాన్యమైనది కాదు. ఆతడు విక్రమించినచో నెదు రెవ్వరు నుండరు. అతని పరాక్రమక్రమ మెంత భయావహమో కనుగొనుడు:

అబ్బా! అబ్బా! పాప నొక్క-పేరు చెపితే
పూరపిచ్చుక పాలము బారదు
పొట్టిపిచ్చుక పూరు చేరదు
కొంజాలూ కారాడు ఉండు
నక్కలు నాట్యమూ ద్రొక్కు
పందికొక్కు డోలుకొడతాడో - వాడేటంటే
దొంతికుండలూ గంతులేస్తవీ - వాడేటంటే
పసిబిడ్డలు పాలుతాగరుగా - వాడిపేరంటే
గుజ్జాలు గుగ్గిళ్లుతినవూ - వాడిపేరంటే
తల్లీదర్పం వొణుకు
గోల్కొండ బస్తీ లొణుకు
నెల్లూరు బస్తీ లొణుకు
బందరు బస్తీ లొణుకు
కడపటిజిల్లా లొణుకు - వాడిపేరంటే

తరువాత పాపన్న కొంతమందిని గూర్చుకొనెను. కార్యమందు దీక్ష ఒంట్లో ' హుషారు ' కలుగుటకై కల్లు సేవించుటకై వెళ్లుచున్నా డతడు: దారిలో అపశకునము లైనవి: లెక్క-చేయలేదు వాటిని బాగుగాపట్టించినాడు కల్లు. కల్లుత్రాగి వెళ్లుచుండగా అతనికి ఎరుకలనాంచారు ఎదురుపడినది: 'గెద్దబుట్ట' దింపి తనకెరుక చెప్పుమని నిర్బంధించినాడు. ప్రాణభయముచేత తుదకు అంగీకరించి గెద్దబుట్టదింపి' ఏడు ఘడియలు గోలుకొండ ఏలుటకు పంతమున్నది నీ ' కని ఆ నాంచారు ఎరుక చెప్పినది. అదివఱకే సెగలు పొగలైన ఆతని సంకల్పబలము అంతటితో రాజిమండినది. ఉద్ధతితో ఇంటికి వెళ్లి గోలుకొండ దర్బారుకొట్టవలె పైక మెక్కడ నున్నదో చెప్పవలసినదని పాపడు తల్లిని నిర్బంధపెట్టును. ధనమున్న స్థలము తల్లి ఎంతకు చెప్పక పోవుటచేత నేస్తగాండ్రచేత సిద్దెలతో నూనె తెప్పించి కోకలు చుట్టి దివిటీలు తయారుచేసి నూనెలో ముంచి వెలిగించి పైకమున్నస్థలము చెప్పినదాక సర్వమ్మను కాల్చి బాధించెను. తుదకా బాధలకు సహింపలేక తల్లి ధనమున్నస్థలము చెప్పెను. అప్పుడు పాపడు ఏడుకొప్పెర్ల ధనము లేవదీసి

పన్నెండువేలకే దండు రాణువను వెంబడి తోడ్కొని
గోలకొండకే యుద్ధానికే ప్రయాణ మైనాడు
ఈటె చువ్వలబారు ముందుగ తర్లుతు వున్నాది
కత్తులయొక్క- బారు వెనుకనె తర్లుతు వున్నాది
పన్నెండు కొప్పెర్లధనము గనుకనె దండుకు పంచెనురా
దండుదళమునే తీసుకొనిగా ప్రయాణమైనాడు
గోలకొండకే వర్తిజాబులే తాను బంపినాడు

గోలకొండపై యుద్ధమునకు వెడలిన పాపని దండుకు, నవాబుదండుకు ఘోరయుద్ధము జరిగెను. పాపనియుద్ధ మిట్లు వర్ణితమైనది:

రెండుగా తలపట్టాలు తొడిగె సర్దారిపాపడు
కయ్యానికైతే దూకినాడుగా దండుమీదికేమీ
పొడుపొడు పొడుపొడు పొడుమంటాడు సర్దారిపాపడు
గిరగిర గిరగిర గిరమంటా పట్టాలు తిరగినావీ
కొట్టితేసుగా పడివున్నావీ క్రొవ్విన దేహాలు
నరికితేసు మరిపడివున్నావి శిరసులు పేగులు
అప్పుడు తిన్నా పప్పుఅన్నమే తెప్పలుపడుతుంది
ఎగిరే వక్కా- శిరస్సులాకు ఎడాసందు లేదు
వ్రాలేటి వోశిరస్సులాకు ఎడాసందు లేదు
ఏడుగడియలు యుద్ధమాయెనూ గోల్కొండమీద

తుదకు యుద్ధమున సర్దారిపాపడు గెలిచెను: నవాబు ఓడిపోయెను. ఏడుఘడియలు గోలకొండ 'తఖ్తు' ఎక్కి- పరిపాలించెను సర్దారిపాపడు. ఆ యేడుఘడియలకాలము అయినపిదప నవాబు తిరిగి సేనలను కూర్చుకొని పాపనిపై ఎత్తి వెళ్లినాడు.యుద్ధముచేసి అందు 'నిభాయించకలేక' పాపడు ఇంత పౌరుషమైన బ్రదుకు బ్రదికి,

ఇకను నేను వకరిచేతులో చావనేటికండీ
బాకేపైకి ఎగరవేసిగా రొమ్ముయొగ్గినాడు
గరగర గరగర గరమంటూను బాకువచ్చినాది
రామారామా రామా అంటూ ప్రాణం విడిచాడు

ఇంతటితో పాపనికథ సమాప్తమైనది. పశువులను గాచుకొనుచు, కల్లు గీసికొను సామాన్యుడు పాపడు అసాధారణవిక్రమమును నెఱపి, తురకదండు నోడించి, గోలకొండపట్టణము వశముచేసికొని గద్దెయెక్కి- పరిపాలనముచేసినాడు! ఆ యేలుబడి ఏడుగడియకాలమే యగు గాక! ఎట్టి పౌరుషవంతుడు!—తుదకు ఓటమి సంభవించి చావవలసివచ్చినది. చావు ఎప్పటికైన పుట్టినవారి కెల్లరికినున్నదే. సమయము వచ్చినప్పుడు చచ్చుటకైన వెనుదీయ లేదు. ఇట్టి పౌరుష విక్రమములు నెఱపినాడు: గమల్లకుల మైనను చచ్చుట కూడ ఎట్లో తెలిసినవాడు: పుట్టి యింత బ్రదుకు బ్రదికినందుకు చావుకూడ గౌరవమైన చావు చావవలెను: గౌరవప్రదమైన చావు చచ్చుట ఎట్లో తెలిసినవాడు గనుకనే సంకల్పములను సఫలము చేసుకో గలిగినాడు. దానంజేసియే అతడన్న ప్రజలకు భక్తిగౌరవములు. ఆతడు పొందిన పదమును, చచ్చిన చావును గమనింప ప్రజాహృదయము ద్రవించినది. అందువలననే కథకుడనుచున్నాడు.

వీరస్వర్గము పోయినాడుగా సర్దారిపాపడు
పాపడియొక్క- వీరస్వర్గం పాడించీ విన్న
పాడినవారికి విన్నవారికి తొలగును దోషంబు

అని.

సర్వాయిపాపడికథ యిది: తల్లి సర్వాయి కొడుకు గనుక సర్వాయిపాపడని పేరు వచ్చియుండును. ఇది యీరీతినేకాక మఱియొకరీతినికూడ గన్పట్టుచున్నది. ఈ పదము బళ్లారిలో ఒక 'భోయి' పాడుచుండగా విని ౧౮౭౪-వ సంవత్సరమున జే. యే. బోయిల్ దొరగారుకూడ ఆనందించి ఆంధ్రదేశములోని 'ఫోక్ సాంగ్స్' (కార్మిక గీతములు) అనుపేరుతో ఒక చిన్న వ్యాసమును 'ఇండియన్ ఆంటిక్వెరీ' పత్రికకు వ్రాసియున్నారు. ఆవ్యాసమునందు వారు ఈ పాటకు సంబంధించిన మూడుపట్టులు మాత్రమే పొందుపఱచి యున్నారు. అందు మొదటిది తల్లిదగ్గఱ నుండి పాపడు శెలవు తీసికొను సందర్భము:

తల్లికొలువుకు వడిగ వెళ్లెను
తల్లికి దండం [పెట్టి] నిలిచెను
ఏరుకట్టి వ్యవసాయము, అమ్మ
ఎంగిలి ముంత ఎత్తలేను
కొడతాను గోలకొండ పట్టనము
ఢిల్లికి మోజూర్ నవుతాను నేను
మూడుగడియల్లో బందరు కొడ్తాను
మూలకోట కందనోలు చూచి
బంగరుకడియాల్ పెట్టుదును
మన కంత బంట్రోతుతన మేల ?

రెండవది పాపనిపేరన్న గల భయమును వర్ణించుపట్టు:

అడుగో ! పాపడు వస్తాడంటే
కుందేళ్లు కూలబడెను
లేడిపిల్లలు లేవలేవు
పసిబిడ్డలు పాలుత్రాగవు
నక్కలు సింహాలు తొక్కుకళ్లాడును

మూడవది పాపడు తాగినకల్లు వర్ణించు సందర్భము:

పాపడు తాగెడి కల్లూ
ఏతాటి ఏతాటి కల్లు?
వ్రేలుపెట్టితే వ్రేలుతెగును
దివిటీపెట్టితే భగ్గుమండును
త్రాగేటప్పుడు తీయగవుండును
త్రాగినవాణ్ని లేవనివ్వదు
లేచినవాణ్నీ పోవనివ్వదు
పాపడు తాగెడికల్లూ
ఏతాటి ఏతాటి కల్లు

ఆ దొరగారి కీపాట సంపూర్తిగ దొరకలేదట. పైపట్టులు చూచిన ఇది దత్తమండలములందంతట వ్యాపించియుండినట్లు కనబడును. కొన్నికొన్నిచోట్ల నడక సరిగ నడవకపోవుటవలన పదములు తప్పులుగనున్నట్లు తోచును. దీనికి వేఱువేఱు పాటకులనుండి సరియైన ప్రతులు వ్రాయించి, వాటిని సరిచూచి సరియైన పాఠ మేర్పఱచి చక్కగ ముద్రించి ప్రకటింపవలసిన బాధ్యత ఆంధ్రులపై గలదు.

ఇంతవఱకు సర్వాయిపాపని కథనుగుఱించియే వ్రాసితిని గాని దాని ప్రాముఖ్యము గాని, చారిత్రకముగ దాని విలువ కాని తెలిపియుండలేదు. ఇక దానిని వివరించెదను.

సర్వాయిపాపడు ఔరంగజేబు ఫాదుషా యంత్యకాలమున నున్నవాడు. ఇతడు ఫాదుషా యవసానకాలమున ఆతని రాజ్యములోని హైదరాబాదు- వరంగల్లు ప్రాంతదేశముపై దాడివెడలి కోటలను ముట్టడించుచు, నగరములను కొల్లగొట్టుచు వచ్చినందున ఔరంగజేబు-ఫాదుషాచరిత్రమును వ్రాయునపుడు మహమ్మదీయచరిత్రకారు లీతనిచరిత్రమునుకూడ వ్రాయక తప్పినదికాదు.

సర్వాయిపాపనికథలోని సత్య మరయుటకు మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియుంచిన చరిత్రములే కాని మన కితరాధారములు లేవు. మనకు సర్వాయిపాపని గుఱించి పాడబడు పాటలు సంపూర్తిగ అయిదాఱయినను దొరకుచో వీటిని మహమ్మదీయ చరిత్రములను బరిశీలించి సత్యమును తేల్చుటకు అవకాశమెక్కువ యుండును. మహమ్మదీయుల కోటలను ముట్టడించి వారి నగరములను దోచుకొని, వారి రాజ్యమున కలజడి గలిగించినవానిని గుఱించి మహమ్మదీయులు ఆతడు బందిపోటుదొంగ యనియు, ప్రజలను హింసించువాడనియు ఏమేమొ వ్రాసినారన్న అందు వింత యేమియులేదు. వారు వ్రాసినట్లు నిజముగా ఆతడు దొంగయేనా యని మనము విచారింపవలసి యున్నది. కాని హిందూదేశముయొక్క మధ్యయుగచారిత్రమును బరిశీలించినచో అప్పుడు నీతియు రీతియు గలిగి మెలకువతో ఎవ్వడు పదిమందిని కూరదీసి పదియూళ్లను జయింప గలిగెడువాడో వాడే దొరయని తెలియును. ఇట్లు కోటలను ముట్టడించియు, పట్టణములను దోచుకొనియు, కేవలము ప్రజోపద్రవము కలిగించుటయే పరమావధిగా బెట్టుకొనక ఎవ్వడు కోటలను గట్టి పాళెగాడై, సంస్థానసంస్థాపకుడై రాజధర్మమును వెలయించుచువచ్చెనో వాడే రాజు. ఆదినములలో బలమున్నవానిది రాజ్యముగ నుండెను. ఆకాల మట్టిది. దొంగలే దొరలు: దొరలే దొంగలు. కాని వారిరువురను వేఱుపఱచు ముఖ్యలక్షణము లివి: ఒకరు తమ కణకువమైన దేశమున ధర్మమును పాటించి ప్రజాహితము సేయువారు: వీరు దొరలు; ఇక రెండవవారు తమ కణకువమైన దేశమునగూడ పైవిధులను బాటింపక స్వలాభపరాయణులై దోచుకొనుచు ప్రజలను హింసించువారు. సర్వాయిపాపడు దొంగయో దొరయో మనము నిర్ణయించి చెప్పుటకు తగిన యాధారములు లేవు. అతడు నిజాంరాజ్యమందలి 'భోనగిరి' పరగణాలో "షాహాపుర" దుర్గమును కట్టించి, దానిని తనకు ప్రధానస్థలము చేసికొన్నవాడు: పిదప అతడు తాడికొండ దుర్గమునుకూడ నిర్మించెను. ఈదుర్గములకు తా నధిపతియై మహమ్మదీయరాజ్యముపై దాడివెడలి వారి కుపద్రవము కలిగించుచు వచ్చెను. దుర్గములను నిర్మించి, దుర్గములను సాధించి రాజ్యమును విస్తరింపజేసికొన బ్రయత్నించినవాడు దొర కాక దొంగ యెట్లగును? అయితే అతనిప్రజాపాలన మెట్లుండెడిదో మనకు తెలియదు. సర్వాయిపాపని కథలను (పాటలు - పదములు) మన మెంత ఎక్కువగను, సంపూర్తిగను సంపాదింపగలిగిన ఈతని చారిత్ర మంతస్పష్టముగ దెలియుట కవకాశము కలుగును. ప్రజాదరణ లేక క్రమక్రమముగ వీధిభిక్షుకుల నోళ్లలో హరించిపోవుచున్న యీపాటలను చరిత్రాభిమానులు మేల్కొని ఎంతత్వరితముగ సంరక్షించిన దేశచరిత్రమున కంతలాభము లేనిచో చరిత్రమునకు నష్టము వాటిల్లు నని వేఱ చెప్ప నక్కఱలేదు.

సర్వాయిపాపని గుఱించి మహమ్మదీయ చరిత్రకారులు చెప్పు సంగతులకును మనకు దొరకిన పాటలోని సంగతులకును కొన్నికొన్ని వ్యత్యాసము లగుపడుచున్నవి. పాటప్రకారము ఇతడు పుట్టినది బెలగాము. కాని మహమ్మదీయచరిత్రములు చూచిన

నీతని జీవిత కథలో బెలగాముప్రసక్తియే రాదు. పాటలో ఇతడు పెరిగినది తాటికొండ యనియు, ఇతనికులము గమళ్లవాడనియు, తల్లి సర్వమ్మ అనియు గలదు. చరిత్రమున (చరిత్ర మనగా ఇచట మహమ్మదీయులు వ్రాసినచరిత్రమని యర్థము చేసికొనునది.) తాటికొండలో ఈతనికి గావలసినవారు చాలమంది యుండినట్లును ఆదుర్గము నీతనిక్రిందనే యుండినట్లును తెలియును. చరిత్రకూడ ఈతడు గమళ్లవాడే యని చెప్పుచున్నది; కాని యది తల్లిపేరు చెప్పుటలేదు. పైపెచ్చు అది సర్వాయి, పాపరా('పాపరా' అని యే మహమ్మదీయచరిత్ర లీతనిం బేర్కొనుచున్నవి) అను పేరు గలవా రిరువురు మనుష్యు లున్నట్లు చెప్పును. ఇది పొరపాటని నా యూహ. కథలో పాపనితల్లిపేరు సర్వమ్మ యని స్పష్టముగ జెప్పబడినది, సర్వమ్మనే సర్వాయి అనియు అనవచ్చును. ఇట్టి రూపాంతరములు తెలుగుదేశపు స్త్రీలపేర్లలో మనము చాల గమనింపవచ్చును. 'సర్వాయి' కొడుకు గనుక పాపనికి సర్వాయిపాపడని పేరు వచ్చియుండునే కాని మహమ్మదీయ చరిత్రకారులు చెప్పినట్లు సర్వాయి, పాపడు అనువార లిరువురు లేరని నాయూహ. చరిత్రకూడ ఇతడు మొదట కల్లుగీసికొనువా డనియు, తరువాత కొంతమంది నేస్తకాండ్రను జేర్చి ఇట్టిదుండగములు సాగించె ననియు చెప్పుచున్నవి. ఇతని ధనలాభమును గుఱించికూడ చరిత్రమున గలదు. ఇందునుగురించి చరిత్ర యిట్లు నుడువుచున్నది. పాపనికి వితంతువైన యొకసోదరి యుండెనట, అమె చాల ధనవంతురాలట. ఎప్పుడో యొకప్పు డామె ధనముపై పాపనికన్నుపడుట తటస్థించెనట: ఆధనమును తనకిమ్మని పాప డామెను వేధించెనట. ఎంతకు ఆమె ధనమియ్యకపోగా పాప డామెను అత్యంతదారుణముగను, క్రూరముగను హింసించి, ఒడలంతయు కాల్చి తుదకు ఆధనమును గైకొనెనట; దానితో సైన్యములనుజేర్చి తాను నాయకత్వమునువహించి మహమ్మదీయ రాజ్యముపై దండయాత్రలు సాగించెనట; కాని పాపడు తల్లినే హింసించి ధనము గైకొన్నట్లు పాటలో కలదు. పాటలో ఇతడు గోలకొండను ముట్టడించి, దానిని పరిపాలించుచుండిన నవాబును జయించి, ఏడు ఘడియలకాలము గోలకొండగద్దెపై నెక్కి రాజ్యముచేసె నని కలదు. చరిత్రమున ఇతడు గోలకొండ రాజ్యమును జయించి యేలుటకాదుగదా, తుదకు గోలకొండ ప్రసక్తియైన లేదు. అందీతడు వరంగల్లు ముట్టడించి జయించెనని కలదు ఒకవేళ మనము పాటలో 'గోలకొండ'కు బదులుగ 'వరంగల్లు' ను చేర్చుకొనవలసియుండునేమో. పాటలోని 'ఏడుఘడియలు' అనునది మనము నిజముగా ఏడుఘడియలేయని విశ్వసింప నక్కఱలేదు. ఏడుఘడియలకాలము మాత్రమే రాజ్యముచేసె ననుసంగతి ఎప్పటికిని విశ్వసనీయ మైనది కాదు. ఏడుఘడియ లనుదానిని అత్యంతస్వల్పకాలము అనుటకు గుర్తుగనే మనము గైకొనవలసి యుండును. పాటకు చరిత్రకు ఇంకొక్కవిషయమున మాత్రము వ్యత్యాసము కలదు. మహమ్మదీయసైన్యములు పాపని ఓడించి ఆతనిని చెఱబట్టెననియు, తుద కాతనిని తురకప్రభువులు ముక్కలు ముక్కలుగ చెండి, హైదరాబాదు కోట గుమ్మమునకు వ్రేలగట్టిరనియు చరిత్ర చెప్పుచుండ, మహమ్మదీయులచే ఆత డోడిపోయె ననియు, ఓటమి గలిగినపిదప నింత పౌరుషముగ బ్రదికినవాడను జీవముతో శత్రుహస్తముల బడరాదని పాపడు తనకుతానే బాకుతో పొడుచుకొని మరణించె ననియు పాట చెప్పుచున్నది. ఇందేది నిజమో దైవమునకెఱుక: ఈరెంటిని పరస్పరవిరుద్ధములు గాకుండ సమన్వయము చేయదలచినచో నిట్లు చేయవచ్చును. పాపడు మహమ్మదీయులచే పరాజితుడై చెఱబెట్టబడిన పిదప బాకుతో పొడుచుకొని మరణించియుండవచ్చును. కాని మహమ్మదీయులు, తమ్మాతడు పలువిధముల పలుమాఱులు వేధించియుండుటచేత, కసితీఱక ఆచచ్చినవానినే తుండెతుండెములుగ నఱికి ఆతనిని హైదరాబాదు కోటగుమ్మమునకు వ్రేలగట్టి యుండవచ్చును. మహమ్మదీయులు చచ్చినవారినిగూడ ఇట్లు చేసిన సందర్భములు చరిత్రమున లేకపోలేదు. మహమ్మదీయ చరిత్రకును, మన పాటకును గల వ్యత్యాసములను దెలిపితిని. ఇంక మహమ్మదీయ చరిత్రముల ననుసరించి తెలియనగు పాపని జీవితమును సంగ్రహముగ నిందు పొందుపఱిచి యింతటితో నీ వ్యాసమును ముగించెదను.

పాపరాయడు కల్లుగీయు గమళ్లవాడు. అతనికి చాలధనము, ఆస్తిగల ఒక వితంతుసోదరి యుండెను. ఇత డొకనా డామెను చూచుటకు వెళ్లెను. నాలుగైదుదినము లామెయింట నున్నతరువాత అతనికళ్లు ఆమెధనముమీద ఆస్తిమీద పడెను. కొంతమంది స్నేహితులను జేర్చుకొని అత డామెను అత్యంతక్రూరముగాను, దారుణముగాను హింసించి, యొడలు కాల్చి ఆమెదగ్గరనుండి ధనము, నగలు అన్నియు దీసికొని, దానితో కొంతమంది కాలిబంటులను జేర్చి, దారులుకొట్టి ప్రయాణికులను దోచుకొని చుట్టుపట్ల దేశమును కొల్లగొట్టజొచ్చెను.

ఫౌజుదారులు, జమీందారులు ఆతనిదుండగములను జూచి యాతనిని చెఱబట్ట నిశ్చయించిరి. ఏవిధముననో వారినిశ్చయ మీతనికి తెలిసి అతడు "కొలాస్" జమీందారు వెంకటరావుయొద్దకు పాఱిపోయి అతని కొలువులో కుదిరెను. కొంతకాల మైనపిదప ఇతడు ఆ జమీందారు కొలువులోనే యున్నమఱియొకనితో చేరి జమీందారుని యనుమతిగాని, యాజ్ఞగాని లేకయే తనంత దానే దోపిడి మొదలిడెను. వెంకటరా విది తెలిసికొని వారిని పట్టి బంధించి కారాగారమున నుంచెను. కాని వెంకటరావు కుమారు నొకప్పుడు జబ్బుచేయగా, ఆయనభార్య కుమారుని యారోగ్యము కుదురుపడినచో ఖైదీలను విడిపించెదనని, తుదకు వారినందఱిని విడిపించెను.

పాపరాయడు నల్గొండపరగణా భోనగిరి సర్కారులోని 'షాహాపురము'నకు వెళ్లి అక్కడ "సర్వా" అను మఱియొక దుండగీనితో గలిసి, మఱల కొంతమందిని జేర్చి షాహాపురమునొద్ద గుట్టమీద నొక మట్టికోట కట్టెను. ఆదుర్గమును, అది యున్నతావును చాల దిట్టమైనవి. అంతటినుండి యాతడు చుట్టుపట్ల దేశమును దోచుకొన మఱల ప్రారంభించెను. షాహాపురమునకు ఏడెనిమిది క్రోశముల దూరముననున్న కుల్పాల్ పరగణాఫౌజుదారు కొంతసైన్యమిచ్చి కాసింఖాన్ ఆఫ్ఘన్ అనువానిని అతనిపై బంపెను. ఈ సైన్యమునకును, పాపనికిని అప్పుడప్పుడు పోరాటము సంభవించుచుండెడిది. ఇదేతరుణమున కుల్పాల్ పరగణాకు సంబంధించిన యొక గ్రామమును పాపడుపట్టుకొనెను. ఈతడవ కాసింఖాన్ పాపనిసైన్యములపై బడి చాలమందిని హతముగావించి, పాపని తఱుమగొట్టెను. కాసింఖాన్ ఇంకను అతనిని వెంబడించుచుపోగా ఒకగుండుదెబ్బ

తగిలి యాతడు ప్రాణములు విడిచెను. నాయకుడు నేలనొరగిపిదప తురకదళము గచ్చువిచ్చై చెదరిపోయెను. మహమ్మదీయులింతటితో నిస్పృహులై యూరకుండలేదు. మఱియొక తడవ వారుదండెత్తి వచ్చి పాపని, 'సర్వా'ను షాహాపురదుర్గమున రెండునెలలవఱకు ముట్టడించిరి; కాని పాపరాయడు తప్పించుకొని పోయెను. అప్పుడు తురక లామట్టికోటను నాశముచేసిరి.

తురకదళములు వెళ్లిపోయినపిదప పాపరాయడు 'సర్వా' యు తిరిగివచ్చి షాహాపురములోనే ఈతడవ మట్టికోటకు బదులుగ రాతితోను, సున్నముతోను ఒకక్రొత్తకోట కట్టి, ఫిరంగులు మొద లైన యుద్ధసామగ్రి నందు నెక్కొలిపిరి. పాపరాయడు తిరిగి దోపిడి యారంభించెను. ఈతడవ అతడు షాహాపురమునకు పదునైదు,ఇరు వది క్రోశములదూరమున నున్న దేశమునంతను దోచుకొనెను. ఈ దేశములోని ప్రజలు పాపరాయని పట్టి శిక్షించుటకు దగుసాధనముల నరయవలసిన దని ఔరంగజేబు ఫాదుషాను ప్రార్థించిరి. ఫాదుషా రుస్తుందిల్ ఖాన్ అనునతనిని హైదరాబాదు సుబేదారుగానియమించి, పాపరాయని పట్టుకొనవలసినదని యతని నాజ్ఞాపించెను. రుస్తుం దిల్ ఖాన్ (ఈతనిపేరు కొన్ని చరిత్రములలో పుర్ దిల్ ఖాన్) అని కలదు. తన సైన్యములను గొన్నిటిని పాపరాయనిపై బంపెను. కాని యవి యోడిపోయిన పిదప సుబేదారే స్వయముగ నాయకత్వము వహించి షాహాపురదుర్గముపై నెత్తివెళ్లి దానిని రెండు మూడు నెలలు ముట్టడించెను కాని కోట పడలేదు. రుస్తుం దిల్ ఖాన్ పాపనినుండి బహుమతివడసి వెడలిపోయెననియు, దానిని లంచమన్నను, కప్ప మన్నను పాపడు మఱల నెప్పుడు అట్టి దానివి సుబేదారు కిచ్చియుండలేదనియు, రుస్తుందిల్ ఖాన్ వెడలిపోయిన పిమ్మట కూడ పాపడు తన యాటలను సాగించుచునే యుండెననియు కొన్నిచరిత్రలు చెప్పుచున్నవి. పుర్ దిల్ ఖాన్ సైన్యములతో వచ్చి షాహాపురదుర్గమును ముట్టడించి 'సర్వని' ప్రాణోపద్రవకరముగ గాయపఱచెను కాని తుదకు ఆసేనాధిపతియే హతుడయ్యెనని మఱి కొన్నిచరిత్రలు తెలుపుచున్నవి.

అటుతరువాత పాపరాయడు యుద్ధసామగ్రిని, సైన్యములను అభివృద్ధిచేసికొని కోటలు సాధించుటకు బూనుకొనెను. ఔరంగజేబు ఫాదుషా మరణానంతరము (క్రీ. శ. ౧౭౦౭) అతని కుమారుడు 'శాంబక్ష్' విజాపుర, హైదరాబాదు రాజ్యములకు పాల కుడయ్యెను. అతడుకూడ పాపరాయని అణచుట కంత గొప్ప ప్రయత్నములు చేయలేదు. అయినను ఎవరో యొకరి సైన్యాధిపత్యమున 'తురకదళములు' అడపా, తడపా, పాపనిమీదికి వచ్చు చునే యుండెను. ఇట్టి 'తల్ల'లో తురక లొకసారి 'షాహాపుర' దుర్గమును కూడ ముట్టడించిరి. కాని ప్రయోజనము లేకపోయెను. ఇట్టి యుద్ధములలో సాధారణముగ తానే జయించు చుండుటవల నను, శాంబక్ష్ కూడ తన్నెదుర్కొనుటకైతగినన్ని గట్టి ప్రయత్న ములు చేయకపోవుటవలనను పాపరాయనికి మఱింత ప్రోత్సాహము కలిగి, అతడు షాహాపురమునకు ముప్పదిమైళ్లదూరమున నున్న వరంగల్లుపై నెత్తివెళ్లెను.

క్రీస్తుశకము ౧౭౦౮వ మొహరం పండుగలలో పదవనాడు పాలకులైన మహమ్మదీయులును, పాలితులైన హిందువులును గూడ వేడుకలలోను వినోదములలోను తన్మయులై కాలము బుచ్చు చుండగా, రెండుమూడువేల కాల్బలముతోను, నాలుగయిదు వందల గుఱ్ఱపు దళముతోను పాపరాయడు ఓరుగల్లు కోటయొద్ద ప్రత్యక్షమై తన రాక పట్టణములో తెలియకుండుటకై పట్ట ణములోనికి వెళ్లు దారు లన్నియు మూసివేయించెను. తెల్ల వారక పూర్వమే గుఱ్ఱపు దళము పట్టణమును ముట్టడించు కార్యమున నుండ, కాల్బలము కోటగోడల నెక్కి దానిని సాధింపజొచ్చెను. అనతికాలముననే కోట పాపరాయని స్వాధీన మయ్యెను. లక్షలకొలది రూపాయల ఆస్తియు, నగదును, సుప్రసిద్ధములైన ఓరుగల్లు తివాసులును దోపిడికాండ్ర వశ మయ్యెను. స్త్రీలును, పురుషులును, పిల్లలును కలసి ౧౨,౦౦౦ ల మంది చెఱబెట్టబడిరి. ఈఖైదీలలో వరంగల్లు కాజీ మహమ్మదు సయ్యదు భార్యయు, కూతురును గూడ నుండిరి. మహమ్మదు సయ్యదు భార్యను తన కుంచుకొని, పాపరాయడు ఎనిమిది తొమ్మిది సంవత్సరముల వయస్సుగల యాతనికూతురిని ఆట పాటలునేర్పి వారి వృత్తి నవలంబించుటకై వేశ్యల కొసంగెను.

తరువాత పాపరాయడు హైదరాబాదునకు పదునాఱు క్రోశములదూరమున నున్న భువనగిరి (భోనగిరి)పై వెళ్లెను. అక్క డ పట్టణమును, పేటనుగూడ దోచుకొని అతడు అటనుండి రెండు మూడువేలమంది స్త్రీపురుషులను ఖైదీలుగా గొనిపోయెను. పిదప నితడు షాహాపురమునకు నాలుగుక్రోశములదూరమున నున్న తరి కొండ (తాడికొండ) దగ్గఱ మఱియొకకోట కట్టెను. ఆకోటలో గూడ ఆతడు గొప్పసైన్యము నుంచి, చాల యుద్ధసామగ్రిని జాగ్ర తపఱచెను.

నిరాటంకముగను, యథేచ్ఛముగను తనదోపిడులు సాగించు నీ పాపరాయని యుద్ధతికి తాళలేక వరంగల్లు ప్రాంతములవారు స్వ యముగ సైన్యములతోవచ్చి ఆతని నణచవలసినదని ప్రార్థించుచు ఢిల్లీ చక్రవర్తి యైన బహదూర్ షాకు మహజరు పంపుకొనిరి. సామ్రాజ్యసైన్యమును దీసికొని స్వయముగ నాయకత్వము వహించి, యొక కల్లుగీసికొనువానిపై దండెత్తివెళ్లుట తనవంటివాని కది గౌరవప్రదముకాదనియు, తన ప్రతిష్ఠ కది భంగకర మనియు జెప్పి బహదూర్ షా చక్రవర్తి యుక్తిపరుడును, చుఱుకైనవాడు నగు యూసఫ్ ఖాన్ 'రుజ్ బిహాని' అనువానిని పాపరాయని అణచు టకై పంపెను. యూసఫ్ ఖాన్ సైన్యములతో దనపై కింకను రాక పూర్వమే పాపడు షాహాపురదుర్గమునకు ఎనిమిదిక్రోశముల దూర ముననున్న 'కుల్పాల్' నగరమును ముట్టడించెను. ఇంతలో తురక దండొకటివచ్చి యాతని కపారనష్టము కలిగించి యాతనిని షాహా పురమునకు తఱుమగొట్టెను.

షాహాపురమున నొకప్పు డాతడు లేనిసమయమున కోట లోని ఖైదీలు కొందఱు చెఱనుండి విడివడి కోట స్వాధీనముచేసి కొనిరట. గ్రామాంతరమునుండివచ్చిపాపరాయడు మరల తనకోటను స్వాధీనపఱచుకొనుటకై దానిని ముట్టడింపవలసివచ్చెను; ఈసమయ మునసే కుల్పాల్ ప్రాంతములనుండి యూసఫ్ ఖాన్ సైన్యములుకూడ ఆతనిపై నెత్తివచ్చెను. పాపడు ఇవతల ఈదళములతోపోరాడవలసివ చ్చినకారణమున షాహాపురదుర్గమును వశపఱచుకొనజాలక పోయె ను.షాహాపురము శత్రువులకు వశమయ్యెను. షాహాపురదుర్గమున ఖై దీల'విహారీ'రేగి కోట వారిస్వాధీనమగుటకును, నరిగా పాపడు తన

కోటను తాను స్వాధీనపఱుచుకొనుసందర్భమున నుండగనే తురకల దండు ఆతనిపై నెత్తివచ్చుటకును యూసఫ్‌ఖాఁ తంత్రమే కారణమై యుండును. పాపరాయడు ఎట్లో ఆయుద్ధమున శత్రువులబారి బడకుండ తప్పించుకొని తరికొండ (తాడికొండ) కు పాఱిపోయి యాదుర్గమున దాగొనెను. శత్రుసైన్యము లాతని నచ్చటికి కూడ వెంబడించి తరికొండ కోటను ముట్టడించెను. ఇచ్చటకూడ పాపరాయని ధైర్యకంచుకము సడలలేదు. ఆతడు కోటను సంరక్షించుచు తొమ్మిదిమాసములు హోరాహోరి శత్రువులతో బోరాడెను. నిశ్చలదీక్షతో ఈ తొమ్మిదినెలలు శత్రువు లాకోటను ముట్టడించి దానిని స్వాధీనపఱుచుకొన బ్రయత్నించుచునే యుండిరి. ఎంతకు కోట వశము కానందున శత్రువులు భేదోపాయమును బ్రయోగించిరి. ఈ తంత్రమువలన పాపరాయనికి నమ్మిన బంటులుగ నుండిన ఆతని స్వజనమే ఆతనినివిడిచి వెళ్లిపోయిరి. అటు పిదప శత్రువులు మఱలమఱల కోటపైగవిసి దానిని క్రమముగా స్వాధీనముచేసికొనజొచ్చిరి. పాపడు ఎవ్వరికిని దెలియకుండ ఒంటరిగ తాడికొండకు రెండుమకాములదూరమున నున్న హసనాబాదుగ్రామమునకు పాఱిపోయెను. తాడికొండకోటలో అతడున్నదియు లేనిదియుకూడ రెండుదినములవరకు ఎవ్వరికి దెలియనేలేదు. హసనాబాదులోగూడ అందఱు స్వామిద్రోహము చేసి యాతని యునికిని తురకలకు దెలిపిరి.

తరువాత శత్రువులు వచ్చి హసనాబాదునుగూడ ముట్టడించి, పోరాటమున పాపని గాయపఱచి ఖైదీగ గొనిపోయి యూసఫ్ ఖాఁ ముందుంచిరి. తానుకొల్లగొట్టినధన మెచ్చటెచ్చట దాచియుంచెనో సంపూర్తిగ దెలుపువఱకు వారాతనిని బ్రదికియుండనిచ్చి పిదప వధించిరి. ఆతని శిరస్సును చక్రవర్తికి పంపిరి. చిత్రవధచేసి యాతని మొండెమును హైదరాబాదు పట్టణద్వారమునొద్ద వ్రేలాడ దీసిరి.

---

# అమరావతీ స్తూప చిత్రములు

నెం. 1 రు.



నాగకన్య బోధివృక్షము నారాధించుట.



శుద్ధోధన మహారాజు దర్బారు.



శుద్ధోధన మహారాజును ఆయన ధర్మపత్ని మాయాదేవి మహారాజ్ఞియు

శిల్పి: టి. రామనారాయణగారు.

# అమరావతీ స్తూప చిత్రములు

నెం. 2 రు.



పాదపూజ.

[మదరాసు మ్యూజియము సూపరింటెండెంటువారి అనుమతిని]

శిల్పి. టి. రామనారాయణగారు.

# రెడ్డి రంగమ్మ

గుడిపాటి వేంకటాచలము పంతులుగారు, బి. ఏ., ఎల్. టి.,

ఆయేడు చేలు విపరీతంగా పండడంచాత వీరారెడ్డికి యీడువే అమితంగా లాభ మొచ్చింది; యింటిల్లిపాదీ సంతోషంతో అమ్మవారికి వుత్సవాలు జరిపారు. వీరారెడ్డి మజాకికిమాత్రమే యాభైరూపాయలిచ్చి, చెన్నపట్నం కొత్తరకంది, అడ్డిగ చేయించాడు తనభార్యరంగమ్మకి ; చెల్లెలు జానకమ్మకి పట్టంచుచీరె పెట్టాడు; పాడికి యెర్రమచ్చల ఆవుని కొని మందలోచేర్చాడు. ప్రతిమాఘమాసం లోనూ తిరనాళ్లకు నెల్లూరువెళ్లడం మామూలు వీరారెడ్డికి. యీతడు రంగమ్మని కూడా రమ్మన్నాడు. యిదివరకూ చాలసార్లు అడిగాడు కాని అతనికల్లీ రంగమ్మ యిద్దరిదగ్గిర్నించీ వొచ్చాయి అభ్యంతరాలు. పల్లె కదిలి ఆడకూతురు బస్తీకి పోవడమంటే యేదో భయమూ, కొత్తదనమూ, అమర్యాదా. తాను పుట్టినవూరూ, అత్తవారివూరూ, మధ్యనున్న రెండుచిన్న పల్లెలూ, యీ నాలుగే రంగమ్మ భూగోళం. పట్టణాల్లో జరిగే దొంగతనాలూ, నాటకాలూ, మోసాలూ, మోటార్లూ, తాగుళ్లూ, బయస్కోపులూ, సోడాలూ, పోడాలూ, అన్నీ వినికిడిగా తెలియవొస్తోవుంటాయి ఆవూరు.

భార్యాభర్తా పదిమైళ్లునడిచి, మోటారుబస్సుకోసం రోడ్డుపక్కన నుంచున్నారు. రెడ్డికీ ప్రయాణాలూ, అనుభవాలూ మామూలే ; కాని ముందేమి జరుగుతుందో, యేమితమాషాలు చూస్తామో ననే ఆశతో, రంగమ్మమనసు గంతులేస్తోంది. బొయ్యిమని వూత్తో, పెనురాక్షసుడివలె, వెనక పొగలురేపుకుంటో, వొచ్చి నిలిచింది మోటారుబస్సు. బండీ నిండివుంది. ఆడదని డ్రైవరు పక్కన కాళీచేసి, కూచోమన్నాడు. రంగమ్మ వీరారెడ్డివంక చూసింది రమ్మని. అతనూ యెక్కపోతోంటే,

"యెక్కడెక్కతావు? వెనక్కిపో. నీపెళ్లాన్నెవరూ యెత్తికెళ్లరు." అని యెదురుత్తంగా అన్నాడు డబ్బులసంచీవాడు. రంగమ్మనాళాల్లోని రెడ్డిరక్తం ఒక్కదూకుదూకింది. కొంచెం అమర్యాదగా గొంతెత్తితే ఒక్కగుద్దులో యెద్దువంటి పాలెగాణ్ణి కిందకూల్చే వీరారెడ్డి- మోటారువాణ్ణి తనకళ్లముందు చీల్చేస్తాడనుకుని వెనక్కి తిరిగింది. యేమనకండా మాట బుజానేసుకుని, తోకమడిచిన కుక్కవలె వెనక్కి వెడుతున్నాడు. రెడ్డి యెర్ర మెరుపుతో నిండిన నల్లమబ్బులవంటి చంపలతో, వెనక సూర్యులు ప్రకాశిస్తున్నారా అనిపించే కనుగుడ్ల తళుకులతో, మెడ మైకెత్తి, మొహంమీది జుట్టుపు పొడుగాటివేళ్లలో మైకెత్తి, శత్రువులమధ్య చిక్కిన వీరవనితవలె నుంచుంది. తిరస్కార సుందరమైన ఆదృశ్యము డ్రైవరు హృదయాన్ని దూసుకుపోయింది. "మొగుడుతేంది యెక్కడుటయ్యా- రావయ్యా, బాబూ,. కూచో" అని చోటుచేసి యిద్దర్నీ కూచోపెట్టాడు



రెడ్డి వెనక్కి వెళ్లాడు యెక్కడానికి



చోటుచేసి యిద్దర్నీ కూచోపెట్టాడు.

డ్రైవరు యెన్నడూలేనిది వణుకులో భర్తబుజానికి బుజానాన్చించా వనేసిగ్గుతో
కలవరపడుతో, కళ్లువాల్చి, రెండుచేతుల్నీ తొడలమధ్య జోడించికూచుంది.
బుర్రమని బండికదిలింది. కాళ్లకింద యేదో జరుగుతోంది. అదిరిపడి రంగమ్మ
చూసింది. ఆచప్పుడెక్కడ ? యెట్లాకదిలింది ? భర్త నడిగింది; మరలున్నా
యన్నాడు. అంతకంటె అతనికేమీ తెలీలేదు. భర్తనించి ఆడ్రైవరు చేసే
పనులవేపు మనసు తిప్పింది. వేగ మెక్కువవుతోంది. యేంచేస్తున్నాడు?
అద్భుతశక్తులు కలిగిన ఐంద్రజాలికుడివలె కనపడ్డాడు ఆమోటారు నూరి
వాడు...బండి, బండి, పెద్ద మోటుబండి యెదట మోటారు సూటిగా
దానిమీదికి వెడతోంది. ఈ వేగంతో, ఒక్కక్షణంలో ఆబండీమీద పడు
తుంది. యింకేముంది? చప్పున డ్రైవరు బుజంమీద చెయ్యేసి, "ఆ, ఆ, ఆపు,
ఆపు" అని కేకేసింది. అందరూనవ్వారు, అందరికన్నా నవ్వాడు ఆకుర్రాడు. మా
టిగా పొయ్యేమోటారు తప్పుకుని పక్కగా వెళ్లింది. యెట్లా తప్పించాడు? వెన
క్కి తిరిగిచూసింది. దుమ్ములో దూరంగా బండీ కనపడుతోంది. రంగమ్మ మనసు
ఆశ్చర్యమయమయింది.అందరూ నవ్వినందుకు సిగ్గూకలుగుతోంది.తనవ్యక్తిత్వాన్ని,
రెడ్డిసల ప్రధానుడు లక్ష్మయ్యరెడ్డి యింటి ఆడపడుచును, తనమాటలు, నగలు, అంద
రికీ కావలసినవిషయం, తన నిష్కల్మషజీవితం అందరినుంచీ మర్యాదను పొందు
తుం ధనేభావం అన్నీ మాయ మైపోయినాయి. తనూ, తన భర్తా యిక్కడ
యెవరికీ లక్ష్యంలేదు. యిద్దరిప్రాణాలూ తన పక్కనున్న కుర్రవాడిచేతులో
వున్నాయి......మోటా రాగుతోంది. పెద్దతలగుడ్డా, నల్లకోటూ వేసుకుని ఒక
మీసాలాయన అడ్డంగా నుంచున్నాడు. "నా మామూలుస్తల మున్నదా?"

"లేదయ్యా. యింక దిగు." అన్నాడు మోటారువాడు వీరారెడ్డిని.
అతను భయంతో దిగుతున్నాడు. తనూ దిగింది వెనకనే.

"ఏవమ్మోయ్. నీకు వెనక చోటు లేదు. అక్కడే కూచో."

కదలలేదు రంగమ్మ. అందరికళ్లూ తన మీదవున్న జ్ఞానంలో, తలొంచు కుని, సిగ్గులో కుంచించుకుపోతూ, బొటనవేలితో భూదేవిని ప్రశ్నలడుగుతో నుంచుంది. నిమిషాలు గడిచిపోతున్నాయి. మోటారు నిలిచివుంది.

"యెక్కు" అన్నాడు రెడ్డి. భర్త ఆజ్ఞానుసారంగా యెక్కింది రంగమ్మ, రెడ్డి వెనక్కి వెళ్లాడు యెక్కడానికి.

"యీ పాడుమాటా, కర్రానూ. యెవడయ్యానువ్వు."

"యేదో జంతువు."

అందరూ నవ్వారు.

రంగమ్మ తలతిరిగింది, రక్తప్రవాహం మాగింది. నుంచుని, వెనక్కి తిరిగి, "యెవడురా ఆ నాలిక కొవ్వి కూసేది? యెవ రనుకున్నావు? దవడ పళ్లు రాల్తాయి, చూసుకో" అనాలనిపించింది. తరతరాలనించి యెన్నడు మాట కెదురు సహించని రాణులరక్తం యెంత అణిచినా లొంగక తిరగబడింది. భర్త వంక చూసి, న్యాయంగానైనా గుర్తించని అతని నిర్లక్ష్యానికి సిగ్గుపడి, కౌరవుల జూదపుసభలో ద్రౌపదివలె సిగ్గులో కోపంలో తలవాల్చుకుంది. మోటారు సాగింది. ప్రపంచం దుఃఖమయమయింది రంగమ్మకి. గారాబంగా పెంచుకునే తరిసిదూడను, అమాంతం క్రూరమృగాలతో నిండిన మహారణ్యంలోకి తోలినట్లయింది. కళ్లు తెరవడమంటే భయమేసింది.

యెంత సేపయిందో, మోటారు ఆగినప్పుడు నెల్లూరు వొచ్చిందనే ఆశతో కళ్లు తెరిచింది. కాదు. విశ్రాంతికై మనుషులు దిగుతున్నారు. తనూ దిగుతో వుంటే చెరుగు మేకుకి పట్టుకుని చిరిగింది. పక్కనున్నవాడు తప్పించి చిన్నగా నవ్వాడు. కిందకి దూకింది. యింకోడు నవ్వాడు. కోపంతో వెనక్కి తిరిగి చూసింది. యింక నలుగురు నవ్వినట్లయింది. సిగ్గులో, కోపంలో, కాళ్లు వొణికి కదలలేక పోయింది. జ్వరపు కలలో అర్థంలేని మాయలోకంలో పడే అంతంలేని శ్రమలాగుంది ఆమెగతి. అందరూ వికృతంగా తనవంక చూస్తున్నట్టే, తనని వెక్కిరిస్తున్నట్టే తనని హీనతచేస్తున్నట్టే! పురుషశ్వాస సోకని గోషాలలో నివసించిన పూర్వవంశ స్త్రీలముగ్ధత్వం, యితరుల పరియాచకానైనా భరించని సౌశీల్యం గాఢంగా గాయమైనాయి. తొరగా నడిచి చింతచెట్టుచాటుకి వెళ్లింది. వెనకనే మూటా, కర్రా, వీరారెడ్డి వొచ్చారు. యెర్రజీరలున్న పెద్ద కళ్లలో గాలికి మొహంమీద యెగుర్తున్న జుట్టు పైకిలోసి పట్టుకుని, తన్నుపళ్ల నొక్కులతో యెర్రపడ్డపెదిమ వొణుకులతో, అతనిముందు నుంచుని, యెన్నడూ లేని దీనత్వాన్ని కోపిస్తూ,

"యింటి కెడదాము" అంది అధైర్యంలో హీనమైన స్వరం వినపడేట్టు వీరారెడ్డి మామూలుగానే కనపడ్డాడు. యెన్నిసార్లో ప్రయాణాలు చేసిన అతను యిట్లాంటి 'సీను' లెన్ని చూశాడో!

"యెందుకు?"

"నాకు బావుండలేదు.

"నెల్లూర్లో బావుంటుంది."

"వొద్దు."

"యెట్లా వెడతా విప్పుడు?"

"నడిచి."

"నలభై మైళ్లు."

"సరే."

"రాత్రవుతుంది."

"పోనీ,"

"దొంగలు"

"భయంలేదు."

"అంతకాటికి యెందుకొచ్చావు? కారణం లేకుండా వెనక్కి పోదామంటావు. యీ ఆడవాళ్లని తీసికొస్తే యిదేతంటా!"

వీరారెడ్డి చాలా విసుకులో మాట్లాడాడు. యేమన్నా వొదులుకుంటాడు గాని, తిరణాల మానలేడు రెడ్డి. యిదంతా కష్టపడ్డదానికి ఫలితం ఆ వొక్క రాత్రే అతనికి. భర్తమనసు కష్టపడ్డట్టు కనిపించగానే, రంగమ్మ తన స్వభయాలని, బాధల్నీ అణగతొక్కి, మాట్లాడకుండా తల తిప్పేసి అంగీకారాన్ని సూచించింది. భరించలేనిదాన్నికూడా కర్మమనో, ధర్మమనో, సంతుష్టిచెంది నోరెత్తక శాంతంగా అనుభవించడం తరతరాలనుంచి అలవాటు.

మోటారు సాగింది. ఆమె లేతహృదయం యెంతకాలం ముడుచుకుంటుంది? ఆ చలికాలపు యెండలో, రంగుమబ్బులతో నీలపాకాశం, కింద పచ్చని చేలమధ్య! చుట్టూ చెట్లు, పిట్టలు, గడ్డి తనయింటివేపు పరిగెత్తుతున్నాయి. మోటారుకింద రోడ్డు గిరగిర తిరిగిపోతూంది. చల్లనిగాలి చంపలనించి, పమిటలోనుంచి, రాసుకుంటూ పోతూంది. ఆమె కష్టభావాని కణగక, రంగమ్మ మనసొక్క గంతువేసింది. రెండు పెద్దకళ్లూ తెరిచి, జుట్టునీ పచ్చెళ్లనీ, యెగరకండా రెండుచేతులతో పట్టుకుని, నవ్వుపెదిమలతో చుట్టూ చూస్తోంది. మోటారు వూపడం, మనుషులు మూటలతో కావిళ్లతో పక్కకు పరిగెత్తడం, వంతెనలు, రోడ్ల మలుపులు అన్నీ ఆమె దృష్టి నాకర్షించాయి. ఆమె డ్రైవరు కుర్రాడిదృష్టి నాకర్షించింది.

"యేవూరు? రెడ్లా?" అని వాడూ,

"మర్లీమోగించు, యెక్కడ మోగుతుంది?" అని యీమాటఅడగడంతో చనువయింది, అతనికి కులాసా పుట్టింది.

"తొరగా పోనీనా?"

"యేం చేస్తే పోతుంది బండి?"

"మంత్రం"

"అబద్ధం"

"మెల్లిగాపోనీనా?...యిదిగో కాలవలో పడుతున్నావు...బండీ...పడేస్తా...యిదివర కెప్పుడూ యెక్కలా?" అని అతనూ,

"యెహీ, అబండీ కనపడకండాపోనీ, యింకా కనపడతోంది లే...యింకా, యింకా తొరగా. చాలు, చాలు."

"భయమే!"

"..ఆ. చాలు. దీంటో యేంపోస్తారు? నిప్పా! అవాసనేమిటి?...ఆ అబద్ధం, నూనెపోస్తే నడుస్తుందా యేం? నీ కెట్లా చాతయింది? రైలుకూడా నడపగలవూ? తొక్కుడు బండెక్కగలవా? నీ కేమిస్తారు? నువ్వుగొప్పా, ప్లీడరు గొప్పా?"

చుట్టూవున్న వాళ్లందర్నీ మరిచి, చిన్నప్పటి బళ్లఆటలు ఆడేప్పటి స్నేహితులతోవలెనే, యీ కుర్రవాడితో సరదాగా మాట్లాడింది. యిట్లా, తన హోదా మరిచి ముచ్చట లాడతావని యెవరన్నా ముందటిరోజున అంటే నమ్మివుండేది కాదు. యింటికి వెళ్లింతరవాత తనేనా యిట్లా పరాయివాడితో మాట్లా



డ్రైవరువొంకా భర్తవొంకా చూసింది.

డింది అని ఆశ్చర్యపడుతుంది. ఆ సరదాలో వెనకనించి బుజంమీద రెండు వేళ్లెవరో వేసింది తెలీదు. ఆహృదయంలో తన మాటలు, నవ్వు, జుట్టుముడి కలగచేసిన ఆందోళనా స్మరగదు; నెల్లూరులో ప్రవేశించగానే యెదురుగా రివ్వున

వొచ్చినమోటారునీ, దానిలోవున్న అందమైన దంపతుల్ని చూచినప్పుడు కళ్లెత్తింది. మేడలూ, బంగాళాలూ, ముందున్న పువ్వులతోటలూ, నున్నటిరోడ్లూ, దుకాణాలూ, ఆడవాళ్లు కట్టుకున్న చీరెలూ, అజాట్లషోకులూ యెన్నో చూడాలి, యెన్నో అడగాలి. ఆమెకళ్లు యిటూఅటూ ఆశ్చర్యంతో ఆనందంతో దూకులాడాయి.

మోటారాగింది. వీరారెడ్డి పక్కకివొచ్చి దిగమంటే అతనులతో రానట్టూ అప్పుడేఅకస్మాత్తుగా నెల్లూరులో తనకికనపడ్డట్టూ,ఆశ్చర్యంలోకళ్లుతెరచిచూసింది.

"రా"

డ్రైవరువొంకా భర్తవొంకా చూసింది. అతనిక్రాపూ, గ్లాస్గోచొక్కా, నాజూకైన వోళ్లూ,చిన్నమీసమూ, దిగి మరసర్దుకున్న అతనినేర్పూ, యితనిసీమకెగినజుట్టూ, ముతకబట్టలూ, నోరుతెరుచుకుని భయంతో చూసే పొరలుకమ్మినకళ్లూ. యీపట్టణంలో యీఅద్భుతాల్లోచేరి సహజంగా స్థైర్యంగా నిర్లక్ష్యంగా తిరిగేవాడా డ్రైవరు. తనభర్తకి నాగలిపట్టడం తప్ప యేమీచేతకాదు. మోటుతనమూ, వ్యర్థత్వమూ, అసహాయత్వమూ వ్యక్తమైనాయి ఆమెకి. మోటారా భర్తచేసికిస్తే ఒక్కనిట్టూర్పు విడిచి, దిగి వీరారెడ్డివెనక బైలుదేరింది.

## 2

యేంబళ్లు, యేంగోల, యేంబజార్లు, యేంచీరెలు, శాలువలు, బొమ్మలు ఆమనుషు లెంత అందంగావున్నారు. ప్రతిమనిషీ,షాపువాడూ,పోలీసువాడూ, పకీరూ, బండివాడూ అందరూ గొప్పవారే! శుభ్రంగా నాజూకు యింగ్లీషు తురకం అరవం మాట్లాడుతో, తెలివిగావున్నారు. ప్రతివాడూ తనకన్న తనభర్తకన్న గొప్పవారే, ఆనందవంతులే. విచారమూ బీదతనమూ లేనిస్వర్గానికి వొచ్చినట్లుంది. బాండువాయిద్యం వెనక మోటారెక్కి, కళ్లు మిరుమిట్లు గొలిపే చీరలు కట్టుకొని పూరేగింపు వొస్తోంది.

"మన నీవూళ్లో వుణ్ణిస్తారా"

"వుణ్ణియ్యాకేం"

"యెప్పుడూ"

"యెట్లావుంటాం"

"యేం"

"మనవాళ్లూ, పొలమూ"

"వుండా లనుకుంటే వుణ్ణిస్తారా"

"పిచ్చిదానా యెందుకు వుణ్ణియ్యరు, యింతమంది మనుషులుండగా!"

"యిక్కడే వుందాం"

వుందామనే మాటలోనే యీ దీపాలలో యీఅంగళ్లు చూస్తో పూరికే గుమ్మంలో కూచుని వీధికేసి చూస్తోవుంటే చాలదూ- ఆమెమనసు సంతోషంతో వూగింది.

"యిక్కడా? యెట్లా? జీవనమో"

"అక్కడామల్లేనే"

"పొలా లెవడు చూస్తాడు"

"వీళ్లందరునో"

వాళ్లు వాళ్ల పనులు చేసుకుని సంపాయించుకుంటారు"

"మీరూ"

"నాకేం చాతనౌతుంది"

అవును, యేమీ చాతకాదు ఆ పాడువ్యవసాయం తప్ప. రంగమ్మమనసులో ఒక అభిప్రాయం నాటుకోడం ప్రారంభించింది. యెవర్ని తనదైవమనీ, ధైర్యవంతుడనీ , పురుషశ్రేష్ఠుడని, తనపల్లెలోని మనుషులందరూ గౌరవిస్తారో, నౌకర్లందరూ భయంతో చూస్తారో, ఆవీరారెడ్డి, యీవూళ్లో, యీసంపుల్లో, యీరోడ్లమీద, మోటార్లమధ్య యెందుకూ కొరగానివాడూ నిస్సహాయుడు, అనామకుడైనాడు. నిశ్చలంగా, నిర్భయంగా మోటార్ల పక్కన అందరూనడుస్తోవుంటే, తన దైవం తన కొంగు పట్టుకొని పదిగజాలదూరం పరిగెత్తడం చూసింది. గజం రూపాయి చెప్పిన పట్టుగుడ్డ, యితను నాలుగణాలకడిగితే, యెన్నడన్నా పట్టుబట్ట చూసిన మొహమేనా అని, రెడ్డినులసార్వభౌముణ్ణి, తృణీకారంగా, పొమ్మనడం చూసింది. కాఫీహోటల్లో అందరూ కుర్చీలమీదకూచుంటే,. తననీ ప్రాణనాయకుణ్ణి, ఒకమూల కూచోపెట్టి పలహారంపెట్టడం గమనించింది. యీవ్యక్తిని పెళ్లిలో అందల మెక్కించి, తనవాళ్లూ, నంపూరివాళ్లూ అతని గుణాల్ని పొగిడి, తనని మోసంచేసినట్లుగా తోచిందింది.

గిమ్మ ఆనిమిషాన్ని వీరారెడ్డి నలబై అంగుళాలఛాతీ, బలిసినకండమూ, పచ్చగావున్నా నూన్యత మొలికే కళ్లూ, పైకి మర్యాద కనపరచకపోయినా హృదయంలోని స్త్రీగౌరవమూ, ఆవూళ్లోవాళ్ల నెవళ్లనయినాసరే పదిమందిని కొట్టగల సామర్థ్యమూ, జీవులంటెడల దయా, బంధుప్రేమా, నీచత్వాన్నెరగని శీలమూ, అన్నీ కనపడలేదు రంగమ్మకి. సన్నగా- దగ్గలో, పట్టుకండువా, చెయ్యిమీదనించి జార్చి, సిగరెట్టు తాగులో, తాంబూలమేసుకుని- కులుకులో, తనవంకవోరగా చూసే నాయుడిభార్య యెంత అదృష్టవంతురాలా అనుకుంది.

నడుస్తోంది ఆభర్త వెనక.

రంగమ్మకి తన పాతవ్యక్తిత్వం చప్పున నశించింది. తనవూళ్లో పెద్దవారు తనపైని చూపే వాత్సల్యమూ పిన్నలు చూపేభక్తి మొత్తానికి తను అందరికీ కావలసి రావడమూ- వాటి భావమే నశించినది. యిక్కడ తనెవరో తెలీదు, తన సంబంధాలు, తన సుగుణాలు, తన అత్తమామలమీదిభక్తి, వ్రతాలపైనిశ్రద్ధ, బ్రాహ్మణపూజ, తనకి రెండువందలయెకరాల పొలమున్నసంగతి యెవరికీ తెలీదు;యెవరికీ అఖర్లేదు.కాని తన శరీరసౌందర్యం కళ్లనాకర్షించడం,దానివల్లనే అందరూ, తనకి కొంచెం ప్రాముఖ్యమివ్వడమూ కనిపెట్టింది. స్త్రీకి సహజమైన ఆసక్తి, తన సౌందర్యప్రతిఫలాభాన్ని పొందాలనే కోర్కి, ఆమెలో మొదటిసారి మేల్కొంది. ఒకటిరెండుసార్లు చూపులకు చూపు లిచ్చింది. రెండుమూడు చిరునవ్వులతో,నాలుగైదు హృదయాల్ని మండించింది. యీనూతనశక్తిభావంతో ఆమెకొక నూతనానందం జనించింది. ఆపట్టణ నూతనత్వమూ, సౌందర్యమూ, తాగినకాఫీ, పువ్వుల వాసనా, సన్నాయిమేళమూ, ఆమెవుత్సాహాన్ని, రసికత్వాన్ని, బలికివుండడమే ఆనందమయమయ్యేస్థితిని తెపాయి. నవ్వుతున్న పెదిమలతో, వూగుతున్న నడుముతో, పొంగుతున్న వక్షముతో, యెండలో గాలిలో కేవలంగా పెరిగినమెరుపుతో నడుస్తోంది అభర్తవెనక, గౌతముడి వెనకనడిచే అహల్యలాగు.

## 3

చప్పున దీపాలు వెలిగాయి. యింపీరియల్ బయస్కోపు మొదటిఆట. రెండుగంటలసేపు తదేకదీక్షగా,కథానాయికలో ఐక్యమై, ఆమె అయిపోయింది. సుఖదుఃఖాలను లోనవుతున్నరంగమ్మ అదృష్టదురదృష్టాలను తనవిగా భావించి, మొదట్లో, ఆ దీపా లెట్లా వెలుగుతున్నాయి కళ్లనలుమడిచి, పెద్దనిట్టూర్పువిడిచింది. యా అనీ, బొమ్మ లెట్లా వొస్తున్నాయా అనీ ఆశ్చర్యపడ్డా, లోపలేమి నేర్చుకున్నాయా అనీ, బొమ్మలెట్లా వొస్తున్నాయా అనీ ఆశ్చర్యపడ్డా, లోపలేమి ఆసక్తిలోమైమరచింది.బొమ్మల్లోకనపడేసౌధాలూ,కాలవలూ,ఉద్యానవనాలూ, మోటార్లూ, నృత్తాలూ అందమైన ఆడవాళ్లూ,మగవాళ్లూఅన్నీచూసి ఆలోకానికివెళ్లింది కాని, అదంతా కూడా నెల్లూరులో భాగంగానేవుంది రంగమ్మమనస్సులో. ఆకథా

నాయకి బాధపడ్డప్పుడల్లా మాల్గింది.ఒకసారి దొంగ లామెనిపట్టుకపోతోవుంటే, "కత్తిలాక్కో, పాడు" అని అరచింది. ధీరుడు వొచ్చి అద్భుత కార్యాలు చేసి నప్పుడల్లా రంగమ్మ తనహృదయా న్నాతనికినిద త్తంచేసింది. కథానాయకి తనేఅను




వెనక్కి తిరిగి అతనితో వేగంగా నడుస్తోంది.

కుంది. పర్యవసానంలో అతను కథానాయకిని కావిలించుకున్నప్పుడు రంగమ్మ వొళ్లు పులకరించింది. తనని కావిలించుకున్నట్టే సంతోషించింది.అంతావినా,యింకా, యెదో జరుగుతుందనికూచుని వుంది, అందరూ వెడలుతున్నా,వీరారెడ్డి వొచ్చి రమ్మంటే, తనకీ అతనికీ యేమీసంబంధం లేనట్టు చూసింది. తరవాత, కొంచెం జ్ఞాపకంరాగా,

"వెళ్లాలా! అయిపోయిందా!" అంది తన సుందర స్వప్నాన్ని విచ్ఛిన్నం చేసి, గంధర్వలోకంలో దాన్ని, తనని కిందికీడ్చి, తన అపరిమేయానందాన్ని ధ్వంసంచేసిన మహాపాతకిలాగు కనపడ్డాడు. పెద్ద టుపాకీలను కాల్చి, మంటలలో దూకి, మోటార్లనుంచి యెగిరి, రైళ్లాపి, శత్రుసంహారం చేసి లోకోద్ధరణ మొన ర్చిన మహాయోధుల్నందర్నీ వొదిలి, యీపల్లెటూరి మొద్దురెడ్డివెనక, వీధుల్లో నడ వాలా? తనకి కనపడకుండా యెక్కడన్నా తప్పిపోనన్నా పోయినాడు కాదు! కాళ్లీడ్చుకుంటో లేచింది.

"యెక్కడికి?"

"రైటికి"

"తరవాత?"

"నాటకానికి"

"నాటకమా"

## 4

రాత్రి వొంటిగం టయింది. నాటకం పాకనించి భర్తా రంగమ్మా నడిచి పోతున్నారు. ఆరోజు అయిపోయింది. యిరవైయేళ్లకు తనకు లభించిన ఒక్కదిన ము అంతమయింది. మళ్లీ యింకెన్నాళ్లకో,యీపాపాలూ, యీగోడ్లూ,యీఅత్తరు వాసనలూ,యీబాండూ-యెన్నాళ్లకో! యే అరుగుమీదో యీచలిలో ముడుచుకు పడుకోడమూ,తెల్లారగానే లేచి మోటారెక్కి-వూరికిపోవడమూ,మళ్లీ పాలు పితకడ మూ, వెన్న తియ్యడమూ, వంటా, పశువులదాణా, రోగిష్టిమామకి సేవా , నిద్రా-యింతే. యీపూరుష, యీఅందాన్ని, యీఎక్సైట్ మెంటును, యీనాటకాల్ని వొదిలి—నాటకంలోని కృష్ణున్నివొదిలి- అవిగ్రహమూ, ఆకీపీ, ఆచాతుర్యమూ, ప్రణయదృష్టులూ, సంగీతమాధుర్యమూఅన్నీ జ్ఞాపకంవొచ్చి గుండె బరువెక్కింది. నడవలేక కాళ్లుతొట్రుపడ్డాయిచిన్నప్పట్నించిరంగమ్మకి కృష్ణుడుయిష్టదైవం;ఆదేవు

డితో యేన్నో ఆటలాడుకుంది, చిన్నప్పుడు ఆయన్ని తనభర్త అనుకుంది, సిగ్గులు పడ్డది, రహస్యంగా పడుకుని మాట లెన్నో మాట్లాడింది. అతనిపైన కల లనేకం కన్నది; భాగోతంలో పద్యాలూ, క్షేత్రయపదాలూ నేర్చుకుంది, తన బాధలు భా వాలు అన్నీ నివేదించుకుంది. యీనాటి కతడు సాక్షాత్కరించాడు. యీనాటకం లోని వేషధారిలక్షణాలు తనఆశయపు కృష్ణుడిగుణాలూ ఏకమయినాయి ఆమెమన సులో. తనమనోనాథుడు మానవనచోరు డీకృష్ణుడే.అప్పుడప్పుడు భర్త రాత్రులు తనదగ్గిర చేరినప్పుడు,కళ్లుమూసుకుని కృష్ణుడే అని మోసగించుకొని తృప్తిపడుతుంది. రసికులలో రసికుడు, వీరాతివీరుడు, అతని కళ్లలోని దయ. సత్యభామయందలి విధేయత, ఉన్నతసౌమ్యప్రణయం, ఆమాటల నేర్పరితనం, చూపుల నాజూకు, ఆ దొంగనవ్వులు, ఆవాత్సల్యం, అతనితో వుండగలిగితే, అందరు స్త్రీలలో తానొ కతె, తన్ను నిరాకరిస్తాడా? కరుణాకరుడు,వాత్సల్యజలధి, ప్రేమనిధి.! గోపీలోచన చాతకాంబుదమణి ! తన సౌందర్యం యితరుల నాకర్షించిన జ్ఞాపకం స్ఫురించింది. తనని చూడగానే, కృష్ణుడికళ్లల్లో మమత కనపడదా? ఆచీకిరికళ్ల కొంగమెడ సత్య భామనే అంతిరోక్కాలో చూసి, అంత బలిమాలి, తిట్లు భరించాడే! తన సౌంద ర్యాన్ని మోహించడా? యీకృష్ణుడు వేష మనేవిషయం తెలుసు. కాని తెలుసు కోడం యిష్టం లేదు. అమాయవిడిపోతే, యీమాధుర్యం,యీపవిత్రత విచ్చిపో తుంది. కృష్ణుడే, తనుచూసింది కృష్ణుడే...నమస్కరించింది. ఎన్నో భావాలు కల్పిం చుకుంది. తన వంకనే చూసి చదివాడు, తనను గురించే పాడాడు, తనకోసమే ఆచివరికి వొచ్చినుంచున్నాడు, తనవైపే ఆచిరునవ్వు. తనభక్తురాలినినీ దాసురాలిని ఆస్త్రీసమూహంలో గుర్తించాడు.

"శిష్టజనులను బ్రోచె, దుష్టుల ఖండించె"

అనేపద్యం నోట్లో ఆడింది రంగమ్మకు. తనను పిలుస్తున్నాడు; తనకికూడా స్థల ముంది, ఆగోపికావల్లభుడిహృదయంలో- అదుగో, దూరంగా, సలలితముర ళీనినాదమే యది, సందేహ మేలా వెడితే? వెడితేనేం? యీలోకంలో తనపల్లె టూరి ప్రజలతో తన కేం సంబంధం? తనకృష్ణు డిక్కడ వుండగా ఆయనపాద పద్మాలలో తనహృదయాన్ని వొదిలి యెట్లా ఆపల్లెటూరు పోవడం?

రంగమ్మ యోచనలన్ని ఆరోజున తారుమారైనాయి, ప్రపంచాలే మారిపో యినాయి ఆమె మనోకాశంలో. ఆమె పూజించే పద్ధతులు, వ్యక్తులు, ఒక్క సారి కూలిపోయినారు. ఆమె పురాతనాహంభావం అడుగంటింది. నూతనానంద వాతావరణ ద్వారాలు తెరుచుకున్నాయి. ఇదివరకు తా నెరగని సుఖాలు, ఆనందాలు, అద్భుతాలు దృష్టిపథానవికసించాయి. తానుచూచికూడా అనుభవింప లేని, కొంచెంగాతోచి మాయమయ్యె. గూఢ దూరఆకర్షణలు ఆమెని తొంద




మీా రెంతో బాగాపాడారు.

రచేశాయి. "నీవు మాదానివి. వొదలను వెళ్లకు. యీకాంతిలోంచి, యీఆనందం లోంచి యీ నూతన వికాసత్వంలోంచి అంధకారంలోకి మాపోలులోకి మృత్యులోకి పడకు, వెళ్లకు." అంటున్నాయి తనచుట్టువున్న పట్టణపు స్థితులు. చిన్నగూట్లో యింతకాలమూ రెక్కలు ముడుచుకుని కూచున్న రంగమ్మ ఆత్మ ఒక సారిగా రెక్కలు కట్టుకొని విశాలాకాశంలో యెగర చూసింది.

యీ నవీనావేశమంతా యీరాత్రి కృష్ణుడిలో మూర్తీభవించింది. యీ వుత్సాహమూ, రసనా, ఉద్రేకమూ కృష్ణుడి లావణ్యామృతంవల్లనే కలిగాయి. కృష్ణుడే యిన్ని రూపాలతో తన హృదయపద్మంమీద నాట్యం చేస్తున్నాడు. అదుగో పిలుస్తున్నాడు. "సలలిత మురళీనినాదమే యది" అదుగో వినవొస్తోంది సమీపంగా! వెళ్లి పోతే ?సందేహమేల? వెడితేనేం? యీ తుచ్ఛలోకంలో, వడ్ల దంపుడుతో, పాడితో, తన కేంపని? తనెవరు, యీభర్త ఎవరు? కృష్ణుడు, పరమాత్ముడు, సకలభక్తవత్సలుడు, అతనికంటె పరమాప్తులెవరు? వెళ్లాలి. యీమైనాసరే వెళ్లాలి. యెక్కడికి? కృష్ణుడు రంగస్థలాన లేనిసమయాన, యెవరున్నా లక్ష్యంచెయ్యక అతనియందే మనసు లగ్నంచేసి, అతన్నే వెతుకులో సైడ్‌కర్టన్ల వెనుక కళ్లుపెట్టుకునికూచుంది. లోపలయేంచేస్తున్నాడు? లోపల యెంతబావుంటుం దో? "అలవైకుంఠపురంబులో నగరిలో ఆమూలసౌధంబులోపల మందార వనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలోత్పలపర్యంక రమావినోది" అని చిన్నప్పుడు అర్థంతోసహా చదువుకున్న పద్యం స్ఫురణకువొచ్చింది. ఆలోపల, 'పర్యంకరమావినోదు' తనే! తనతోనే. లోపల ఆతెరలవెనుక గదులు అద్దాలు కుర్చీలు దాటి మధ్యదాసీజనము కొలుస్తోవుండగా, పర్యంకంమీద, కృష్ణుడిపక్కన వొళ్లుపులకరించింది... అవును అక్కడికివెళ్లి పోవొచ్చు. కృష్ణుడినిలయమే అది నగరిలో ఆమూలసౌధంబులో, వెళ్లాలి. అంతఅప్రమేయానందంముందు సందేహించడం నీచం. ప్రాణాలకి తెగించే సాహసాని కలవాటుపడ్డ పూర్వులరక్తం ఆమెనాళాలలో విజృంభించింది. "కృష్ణుడు నీకోసమే యమునా సికతాతలాల విరహిణీగీతాలు పాడుతున్నాడు. వెళ్లు" "మళ్లీ ఆపాతగోడలమధ్య వంటకట్టెల్లో పాతుకోకు" అంటోంది హృదయం. కాని తలొంచుకుని ముందునడిచే ఆభర్త నేమిటి చెయ్యడం. యీసంగతులేవీ అర్థం కాలే? యేమి టీ వాయిద్యం? వేణువాదమా? నుంచుంది. వీరారెడ్డి వెనక్కితిరిగి చూశాడు. పిలిచాడు. ఆమె పలకలేదు. చప్పున అతను పెద్దకేకేశాడు. దోవన పొయ్యేవాళ్లందరూ ఆగి చూశారు.

"నీ పట్టె డేదీ"

రంగమ్మ మెల్లిగా కళ్లు పైకెత్తింది.

"నీపట్టెడ!"

పట్టెడ! పట్టెడంటే పట్టెడేమిటి? యెందుకీగోల చెవికింద? స్వప్నాలతో తూగుతున్న కళ్లతో, ప్రశ్నపూర్వకంగా చూసింది.

"అట్లాచూస్తావేమిటి? నీపట్టెడ పోయింది" పోయిందా? యింతేకదా? పోతేనేం? యింత గోలేమిటి? యీవుత్సవంలో, యీచల్లనిరాత్రి, యీవేణుగానం లో, యీరథంముందు, యీబాణసంచావేళ పట్టెడ, అపాడుపట్టెడేమైతే నేం?

"మాట్లాడవేం? పట్టెడేదీ?"

"లేదా"

వీరారెడ్డి కాశ్చర్యం వేసింది.

"మెల్లిగా లేదా అంటావేం? లేదూ."

"పడిపోయిందేమో!"

"ఐదువందలరూపాయలపట్టెడ! యెక్కడపోయింది?"

"యేమో!"

"యేమో! వొళ్లు తెలీటంలా? రా, పోదాం. దౌర్భాగ్యురాలా! పద"

రంగమ్మ వినటం లేదు. వెనక్కితిరిగి అతనితో వేగంగా నడుస్తోంది, కలలో వలె, యిళ్లూ, బళ్లూ, మనుషులూ, దీపాలు, సుడిగాలిలోవలె కొట్టుకుపోతున్నాయి. ఆ వసంతోత్సవప్రవాహంలో ఆమెచుట్టూ కాళ్లు భూమిని తాకక, తనతో యేదో తెలియరాని దానికోసం, అనంత, అదృశ్య, అనిర్వచనీయ ఆదర్శఅనుభవం కోసం పెనుగులాడే హృదయమొక్కటే వాస్తవంగాతోస్తోవెళ్లింది. నాటకంపాక పక్కకి వెళ్లాడు. దీపాలన్నీ ఆరివుండడంచాత రంగమ్మ గుర్తించలేదు.

"యెక్కడనుంచో చూశి వొస్తాను."

"పట్టెడట! పిచ్చి!"

"యెవరికోసం?"

మెల్లిగా తిరిగి చూసింది. యెవరో మాట్లాడిస్తున్నారు. నాటకంపాకదగ్గర వుంది తను! ఆలోపలే తన కృష్ణు డున్నది. తనక్కడే నుంచుని వుంది. శైటికొస్తే వొకవేళ కృష్ణుడు! తన నీ చీకట్లో చూస్తే గుండెలు కొట్టుకున్నాయి.

"యెవరికోసం?" అంటున్నారు యెవరో!

నిశ్చయించుకుంది. తన నిశ్చయాన్ని చూసి తనకే భయమేసింది.

"కృష్ణుడికోసం"

"కృష్ణుడు! యే కృష్ణుడు?"

యెంతమూర్ఖం! యేకృష్ణుడుట! యేకృష్ణు డేమిటి? ఆలోచించింది. అతని పేరు కృష్ణుడు కాదేమో!

"యిందాక కృష్ణుడివేషం వెయ్యాలా?"

వేషం ఆనడం తనకే అభిమానంగా వుంది.

"నారాయణా?"

వూరుకుంది.

"యెరుగుదువా?"

త నెరక్కపోవడ మేమిటి?

"యిట్లా రా"

కాళ్లువొణికాయి. నిజంగా దర్శనమౌతుందా? నిజమే? యిప్పుడే.

"యిక్కడవుండు." అని గుమ్మంలో నుంచోపెట్టి లోపలికి వెళ్లాడు. చుట్టూ చూసింది రంగమ్మ. చీకటి, కాళ్ల దుమ్ము, ఎట్లావుం దేం? కృష్ణుడుండే చోటు యిదా? కాదు. యిక్కడ వుండడు. తప్పుచోటికి వొచ్చాననుకుంది. వొస్తే! యెవరంటే? యేం చెప్పతుంది? పాదాలపైనపడి కన్నీళ్లతో తడిపి, తన జన్మపావనమయిందని చెప్పి, తరవాత—ఆయనముఖకమలంవంక చూసి- యింకా యేమి టాకొక్క!—తరవాత- ఒక్కసారి.

"నీకోసం యెవరో వొచ్చారురా"

"యెవర్రా! ఆవెధవవెంకట్రాముడు కాదుకద! తన కీవలిసిన పావలా కోసం చంపుకుతింటున్నాడు!"

"కాదురా యెవరో గోపిక!"

"ఛా!"

"నిజం. పోయి చూడు"

వొస్తున్నాడు. చప్పున సిగ్గుపడి మొహం తిప్పేసి తూలకివొదిగి వొణుకుతో చూస్తోంది. పీతాంబరాలువిప్పి గిరజాలవిగ్గు తీసేసి రంగుమాత్రం కడుక్కోక యెర్ర రంగుపెదిమలమధ్య బీడీపెట్టి ప్రత్యక్షమైనాడు, నటరాజమార్తాండ తేజ బిరుదాంకితుడు, సోంపల్లి నారాయణరావు.

"యెవరు?... యెందుకు... మాట్లాడ వేం?"

యేమిటిది? యెవ రితను? మెల్లిగా కలవిచ్చి పోతోంది. సత్యం బోధ పడుతోంది.

పలకరిస్తున్నాడు. మాట్లాడాలి. తీరా వొచ్చి ఏంచెయ్యాలి! యేదోవొకటి అనాలి: త నెందు కొచ్చింది?

"మీరెంతో బాగా పాడారు."

యింకేమనాలి? తన నెగాదిగా చూస్తున్నాడు.

"యేవూరు? యెవరు మీరు?"

మాట్లాడలేదు. త నెందుకొచ్చిన ట్లిక్కడికి? అలవైకుంఠపురంబులో- పర్యంకరమావినోది ఆపన్నప్రసన్నుండు" యిదా? యిదేనా? యింకా లోపలికి వెళ్లిచూస్తే? కాని యితనేనా కృష్ణుడు! కౌస్తుభాలంకారుడు, కమనీయగాత్రుడు, త్రైలోక్యసుందరుడు, రుక్మిణీలోలుడు, యితనా? మనసు ఆమెవాంఛల కెదురు తిరిగింది బలవంతంమీద.

"మిమ్మల్ని చూడాలని" అంది.

"యిట్లా రా, కూచో"

వెళ్లిపోవాలి. యెట్లా? వెళ్లడమే వీలైతే.

"నే నింక వెడతాను."

"అప్పుడే."

"కాచుకొని వున్నారు."

"యెవరు?... యెక్కడ?...వుండనీ...యిప్పుడే వెడుదువుగాని"

లోపలి దీపపు వెలుతురు ప్రతిఫలించి పక్కను నిస్తతో వొంగివచ్చుచూ, తనకు కనపడే ఆమెచంపమునుపూ, దానిమీద తీగలాడే జుట్టు పాయ్యూ, "తనకళ్లె నాకర్షించాయి. "రా" అని, దగ్గరకి వొచ్చాడు. వొస్తున్నాడు. ఎట్లా? యింకా వెనక్కి తగ్గింది. వెళ్లిపోవాలి. భుజంమీద చేతులేసి లాగుతున్నాడు, నవ్వుతో. అబ్బా! అసహ్యం? యిదేమిటి? యిదేంకృష్ణుడు? యిట్టా పట్టుకుంటాడేమి యేమిటా కసక్తి?

"వుండండి? వినండి"

"నాకోసం వొచ్చావా? రా! వెనుకగాని లే. తొందరేం?"

"పొరబడుతున్నారు. నన్ను వొదలండి"

ముక్కలు బ్రాందికంపుతో బద్దలవుతున్నాయి. దగ్గిరా లాగాడు. ఆచమట! చీదర! అసహ్యం! ఆకోటు పొగకంపు! యిదేమిటి? ఆకోటు వీడీకంపు! ఆవెకిలినవ్వు! అచీదరకళ్లు. వొదులై; లావెక్కి? వేళ్లాడే వొళ్లు కఠినంగా పట్టుకుని సార్వభౌముడివలె తనని రెండు నిమిషాల్లో రంజింపజేయగల భర్త, పట్టెడకోసం చీకటి మూలల వెతికేభర్త జ్ఞాపకం వొచ్చాడు, చప్పున అతనిమీద దయవొచ్చింది. తను కనపడక, యేమయిందో అని ఆదయగలకళ్లు, పట్టెడపోయినా పల్లెత్తుకష్టమైన మాట మాట్లాడని ఔదార్యం, జ్ఞాపక మొచ్చాయి. వీడు చీకట్లోక్కి లాక్కెడుతున్నాడు.

"రెడ్డిగారూ! రెడ్డిగారూ"

యెన్నడూ లేనిది ఆపేకెత్తి పిలిచింది.

కాళ్ల చప్పుడు:

"యేం లేదురా, మరెవరూ రాకండి......"

"యెందుకొచ్చావు! నాకోసమేగా! వొచ్చి యీ బెట్టెందుకు? వినపడితే మాత్రం వొచ్చి యేం చేస్తాడు? నువ్వేగా నాకై వొచ్చింది?"

కాస్తఆశా ఆరిపోయింది. అవును, ఆయన కేమని చెపుతుంది? విచారం, తిట్లు, వెలీ, వొద్దు కాని వీడు—"అయ్యో! అసహ్యం, పాపం! యెట్లా యిది వోర్చుకోడం! వెనుగులాడింది. తన్నింది, కాని—

యెన్నోసార్లు ఆరంగస్థలంమీదనే ద్రౌపది మానరక్షణం చేసిన కృష్ణుడు, హరిశ్చంద్రుడి సత్యవ్రతం నిలపెట్టిన శ్రీమన్నారాయణుడు, ప్రహ్లాదు ణ్ణాదరించిన నరసింహామూర్తి, అందరూ చెవుల్లూ మూసుకున్నారు. తనని నమ్మి, తన ప్రతిరూప వేషధారిచేతికి చిక్కిన ఆర్తనాదం ఆయనకు వినపళ్లేదు. యేలక్ష్మి నర్మభాషలకు చెవివొగ్గాడో, యేతుంబురుడి గుర్రపుసంగీతం విని కళ్లుమూశాడో, యేదేవేంద్రుడి స్వార్థస్తోత్రాలతో వుచ్చి పోతువున్నాడో?

"అయ్యో! వొద్దు. నమస్కారం పెడతాను. బుద్ధిలేనిదాన్ని. మూర్ఖురాల్ని. నన్ను వొదలండి. నమస్కారం పెడతాను. యిందుకు కాదు నేను వొచ్చింది. అయ్యో! యెవరూ లేరా?"

దిక్కుమాలిన మొరాలింపన్ ప్రపుణ్యాత్మకుల్, లేనే లే రక్కడ. అక్కడ సైడ్ కర్టన్, మీది సరస్వతీ, వాళ్లప్పుడే పూజించిన పార్వతీదేవి విగ్రహం, రెప్పలన్నా వాల్చక, యీఅన్యాయాన్ని నిబ్బరంగా చూస్తోనించున్నారు-రంగమ్మ నోచిననోములు, కొలిచినదేవతలు యెవరూ అడ్డం రాలేదు.

పల్లెటూరి రంగమ్మ శీలం శ్రీనాగరికతాలక్ష్మికి బలిఅయ్యింది.

———

## దాత

బుక్కపట్టణము రామానుజయ్యగారు

సరసవర్ణన

ఆ. జలద ముండునెడకుఁ జాతకపక్షులు
సంతసంబుతోడఁ జనువిధమున
దాత యుండునెడకుఁ దగ నర్థిజనములు
చనుచునుంద్రు కార్యసఫలతకును

విరసవర్ణన

ఆ. బెల్ల ముండుచోటఁ బెల్లుగాఁ జీమలు
ముసరుచుండునట్లు; ముదముతోడ
దాత యుండునెడకుఁ దగ నర్థిజనులును
జనుచునుంద్రు కార్యసఫలతకును.

———



చంద్రికా సుధాకరము

శిల్పి: సిద్ధేశ్వర మిత్ర.

# రామాయణసందేహములు

శ్రీయుత కవికొండల వేంకట సత్యనారాయణమూర్తి గారు, "భారతీ తీర్థోపాధ్యాయ" (ఆంధ్ర రీసెర్చి యూనివర్సిటీ)

రామాయణకథ కల్పితమా - చరిత్రాత్మకమా - యని యీవఱకు పెక్కండ్రు తలచియున్నారు. ఇంకను నావిషయము విమర్శింపఁబడుచునే యున్నది. రామాయణము చరిత్రాత్మక మగుకథకాదనియును, ఇది వాల్మీకిచే కల్పింపఁబడిన గాయత్రీమహామంత్రాత్మక మగు నొక కల్పితకథ యనియును నభిప్రాయపడుచున్న వారిలో నే నొకఁడను. రామాయణము కల్పితకథ యని నా కప్పటికి లభించిన ఆధారములతో రుజువుచేయుచు గత జూలై మాసమున భారతియం దొకవ్యాసమును వ్రాసితిని. ఇప్పుడా మహాకావ్యమునందుఁ గల మఱికొన్ని సందేహములను వ్రాయుచున్నాను. నే నీవ్యాసమును వ్రాయుట రామునియందుఁగాని, రామాయణమునందుఁగాని తద్గ్రంథకర్త యగువాల్మీకియందుఁగాని గలభక్తిగౌరవలోపముల చేత కాదు. ప్రాజ్ఞు లగుపాఠకమహాశయులు చిరకాలమునుండి నన్ను బాధించుచుండిన యీ సందేహములను బాపుదు రను విశ్వాసముతో నీ వ్యాసమును వ్రాయుచున్నాను. మహనీయులు బాగుగా యోచించి సందేహములను బాప, ప్రార్థితులు.

## I
## వాలివధ.

రాముఁడు వాలిని వధించుట న్యాయసమ్మతమా యనునది మొదటి సందేహము. ఈ వధవిషయమున రామునిచే వాలికి వాల్మీకి చెప్పించిన సమాధానము నే యాధారములుగాఁ జేసికొని విచారింతము. రాముఁ డేమి చెప్పె ననః

శ్లో॥ శ్రూయతే మనునాగీతౌ
శ్లోకౌ చారిత్రవత్సలౌ
గృహీతౌ ధర్మకుశలైః
తత్తథాచరితం హరే
*   *   *
పదలం పరితాపేన
ధర్మతత్పరికల్పితః
వధో వానరశార్దూల
నవయం స్వవశే స్థితాః

అని తనకు మనుధర్మశాస్త్రములోని సూక్తులే ప్రమాణములనియును, తాను ధర్మశాస్త్రబద్ధుఁ డగుటచే తనకు స్వతంత్రత లేదనియును, శాస్త్రములఁ జెప్పినట్లు తాను ప్రవర్తింపవలెననియును చెప్పెను. రాముఁడు (లేక వాల్మీకి) మనుస్మృతిని ప్రమాణగ్రంథముగా తీసికొనుటచే మనముకూడ మనుస్మృతి ననుసరించియే ధర్మాధర్మములను విచారించుట యుక్తము.

### వాలియందుఁ గలనేరము.

ముఁదుగా వాలియందు రాముఁడు మోపిన నేర మేమియో చూతుఁడు:

శ్లో॥ త దేతత్కారణం పశ్య
య దర్థం త్వం మయాహతః
భ్రాతు ర్వర్తసి భార్యాయాం
త్యక్త్వా ధర్మం సనాతనం—
అస్య త్వం ధరమాణస్య
సుగ్రీవస్య మహాత్మనః
రుమాయాం వర్తసే కామాత్
స్నుషాయాం పాపకర్తకృత్—
త ద్వ్యతీతస్య తే ధర్మాత్
కామవృత్తస్యవానర
భ్రాతుర్భార్యా వమర్శేస్మిన్
దండోయం ప్రతిపాదితః

—కిష్కింధాకాండము, 18-వ సర్గ.

పై శ్లోకములనుబట్టి వాలియందుఁ గలనేరము తమ్మునిసతి నపహరించుటయై యున్నది. అందుచే వాలి వధకు పాత్రుఁడు. ఇట్టి నేరమునకు దండము వధయే యని స్మృతియందుఁ గల దని రాముఁ డిట్లు చెప్పెను:

* ఔరసీం భగినీం వాపి
భార్యాం వా ప్యనుజస్య యః
ప్రచరేత నరః కామాత్
తస్య దండో వధ స్మృతః

ఇట్టిశిక్ష మనుస్మృతిలో నున్నదనుకొనినను వాలిని దండించుటకు రామునియందుఁ గల అధికార మేమి?—

### రామునకుఁ గల దండనాధికారము.

ఇప్పుడు వాలియం దొకనేరము నిరూపింపఁబడినది. ఇఁక దండింప నెంచిన రామునకుఁ గల దండనాధికార మెంతవఱకుఁ గలదో యోజింపుదము.

రాజునకు తనదేశములోని ప్రజలనే దండించుట కధికార ముండును గాని, యితరదేశములలోని ప్రజలను శిక్షించుట కట్టి యధికార ముఁడును? రాముఁడుత్తరదేశమునం గల యయోధ్యకు రాజు. వాలి దక్షిణమునం గల కిష్కింధకు ప్రభువు. రావణాదిమహావీరుల ననేకులను నిర్జించిన బలశాలి వాలి. అందుచే కిష్కింధాధీశ్వరుఁ డగువాలిని దండించుటకు రామున కట్టియధికారము కలదో తెలియకున్నది. ఈసందర్భమున రాముఁడు చెప్పిన సమాధాన మేమన

శ్లో॥ ఇక్ష్వాకూనాం ఇయం భూమిః
సశైల వన కాననా
మృగ పక్షి మనుష్యానాం
నిగ్రహా ప్రగ్రహా నపి. (కిష్కిం.)

వాలి పరిపాలించుచుండిన భూమియంతయు నైక్ష్వాకులదఁట. అదెట్లో తెలియకున్నది. రాముని పూర్వీకు లగునైక్ష్వాకు లెవ్వరును దక్షిణాపథమునకు వచ్చి జయించినట్లు ఏ పురాణములయందును, ధర్మశాస్త్రములయందును గానరాదు. అంతియకాక రామునకు ప్రమాణకర్తయగు మనువు బ్రహ్మావర్తము, కురుక్షేత్రము - మత్స్యదేశము - పాంచాలము - శూరసేనము - మధ్యదేశము - ఆర్యావర్తము మాత్రమే ద్విజాలకు వసింపఁ దగినకర్మభూమి యనియు, మిగిలిన దక్షిణాపథము మున్నగు దేశము లన్నియు మ్లేచ్ఛదేశములనియు వ్రాసియున్నాఁడు. ఇట్టి నిషేధింపఁబడిన మ్లేచ్ఛభూమిని రాముని పూర్వు లెప్పుడు పరిపాలించిరో తెలియదు. తమవా రెన్నఁడును పరిపాలింపని కిష్కింధ తమవారి దని రామునిచే చెప్పించుటయందు వాల్మీకి యుద్దేశమేమో తెలియకున్నది. ప్రాయశః యీ యధర్మమును వాలిమెడకు చుట్టుటకు చెప్పఁబడిన యుక్తివలె కాన నగుచున్నది. రామునకు నిజముగా కిష్కింధపై నధికారమే యున్నచో సుగ్రీవునియొక్కగాని, వాలియొక్కగాని, సహాయమును తాను అధికారపూర్వకముగా కోరియుండునే గాని సుగ్రీవునితో సఖ్యము చేసికొని, యా సఖ్యమువలన కలిగిన ప్రతిఫలముగా తనకు సీతను వెదకుటయందు సహాయము చేయుమని కోరియుండఁడు. ఇక్కడ కిష్కింధ రామునిపూర్వీకులదని వాల్మీకి రుజువు చేయలేకపోయెను.

### రాముఁడురాజా?

వాదసౌకర్యముకొఱకు కిష్కింధ యైక్ష్వాకుల దని యొప్పుకొనినను రాముఁడు దండనాధికారి యగురా జెట్లు కాఁగలఁడు? తండ్రి మరణానంతరము రాముఁడు అయోధ్యకు పట్టాభిషిక్తుఁ డయ్యెనా? రాముఁ డరణ్యావాసమున నుండఁగనే దశరథుఁడు కాలధర్మము నొందెను. రాజ్యము భరతుఁ డేలుచుండెను. రామున కింకను పట్టాభిషేకము కాలేదు. ఇట్టి పరిస్థితులలో భరతుఁడు రా జనిపించుకొనునుగాని, రాముఁ డెట్లు రాజనిపించుకొనును? తాను రాజు కానట్లును, భరతుఁడు రాజైనట్లును రాముఁడే యొప్పుకొనిన ట్లీ క్రింది శ్లోకము చెప్పుచున్నది.

శ్లో॥ తాంపాల యతి ధర్మాత్మా
భరత స్సత్యవాగ్ ఋజుః
ధర్మకామార్థ తత్వజ్ఞో
నిగ్రహా నుగ్రహే రతాః
*   *   *

---

* తమ్మునిభార్య నపహరించినవానికి వధ దండముగా విధించిన శ్లోకము మనుస్మృతిలోఁ గానరాకున్నది.

తస్య ధర్మ కృతా దేశా
వయ మన్యేచ పార్థివాః
చ రామో వసుధాం కృత్స్నం
ధర్మ సంతాన మిచ్ఛవః

పైశ్లోకములవలన భరతుఁడే రాజైనట్లు రాముఁ డొప్పుకొని యుండుటచే రాజు రాముఁడా? భరతుఁడా? యను ప్రశ్నకే తావులేదు. ఇప్పుడు రాముఁడు చెప్పిన దేమన భరతుని యాజ్ఞను తానును, మఱికొందఱు రాజులును ధర్మహానిని చేయు పురుషులను దండించుటకు బయలుదేరిరఁట. అయోధ్యాకాండమున రామ భరతుల సంభాషణమునం దెక్కడను భరతుఁడు రామున కిట్టి యధికారము నిచ్చి నట్లు కనఁబడదు. నిజముగా రాముఁ డరణ్యమునకు ధర్మరక్షణము చేయుటకే బయలువెడలెనా? రాము నరణ్యమునకుఁ బంపుటలో కైక యుద్దేశము తన కుమారుఁడగుభరతుఁడు రాజ్యపరిపాలనము చేయుచున్నదినములలో రాముని ముఖ ము ప్రజలకు కానరాకూడ దనియును, రాముఁడు సర్వరాజచిహ్నములను విడిచి పెట్టవలె ననియును, రాముఁడు ప్రజలలో నెట్టి పలుకుబడియును లేకుండ నరణ్య ములో పదునాలుగేండ్లుండిన నింతలో రామునివిషయమున ప్రజలు మఱచి భర తునియం దనురాగము కలిగియుండవలె ననియు గాని, అరణ్యమునకు వెళ్లినను రాముఁ డధికారమును చలాయింపవలెనని కాదు. తానేకాక తనతోఁబాటు ధర్మ రక్షణమునకై మఱికొందఱు రాజులుకూడ బయలువెడలిరఁట. ఆమఱికొందఱు రాజు లెవరో- వారు చేసిన పను లేవియో వాల్మీకి వ్రాయలేదు.

### రాముని ధర్మవిచారణ చట్టసమ్మతమా?

ఒకప్పుడు రాముఁడు ధర్మపరిపాలనమునకు వచ్చిన దండనాధికారియగు రాజే యనుకొనినను రామునివిచారణ చట్టసమ్మత మైనదా యను వేఱొక ప్రశ్న కలుగును. మనుధర్మశాస్త్రమున:

శ్లో॥ తం దేశకాలౌ శక్తించ
విద్యాం చావేక్ష్య తత్త్వతః
యథార్హత స్సంప్రణయే
న్నరేష్వ న్యాయవర్తిషు (మను 7-16.)

అనఁగా తప్పుచేయు మనుష్యులను దండనచేయునప్పుడు దేశము- కాలము-సా మర్థ్యము-విద్య, వీని నన్నిటిని రాజు యోజించిచూచి తగినట్లు శిక్ష చేయ వలయు నని యర్థము. వాలిని దండించునప్పుడు పై నుదాహరింపఁబడిన దేశకాలాదుల నేనినైనను రాముఁడు యోజించినట్లు వాల్మీకి వ్రాయలేదు.

అంతియకాక—

శ్లో॥ తస్యాంహు స్సంప్రణేతారం
రాజానం సత్యవాదినం
సమీక్ష్యకారిణం ప్రాజ్ఞం
ధర్మకామార్థకోవిదమ్. (మ)

అనఁగా పట్టాభిషేకాదిక్రియలు పొందినవాఁడుగను, సత్యము పలుకువాఁడుగను, సత్యాసత్యములను బాగుగా నెఱింగి తీర్పుచేయుటయందు దక్షుఁడుగను, నీతిశాస్త్ర మునందు జ్ఞానము కలవాఁడుగను, ధర్మార్థకామముల నెఱింగినవాఁడుగను నుండె డు రాజు దండనాధికారమును ధరింపవలె నని భావము. ఈ శ్లోకమున చెప్పినట్లు రాముఁడు పట్టాభిషిక్తుఁడా కాఁడు. వాదిప్రతివాదుల నుభయులను నెదుట పెట్టుకొని సత్యాసత్యవిచారమా చేయలేదు. ధర్మశాస్త్రసమ్మత మగుసాక్ష్యమా తీసికొనలేదు. వాలిని నీవు నేరస్థుఁడ వగుదువా? కావా? యని ప్రశ్నింపనైన లేదు. వాది చెప్పినవాక్యములనే ప్రమాణ మని నమ్మి రాముఁడు వాలిని వధింపఁ బూనెను. ఇది మనుధర్మశాస్త్రసమ్మత మగునా? ఒకప్పుడు తనకు బలమగు నమ్మకము తోఁచినను,

శ్లో॥ తేభ్యోధిగచ్ఛే ద్వినయం
వినీతాత్మాపి నిత్యశః
వినీతాత్మాహి నృపతి
ర్నవినశ్యతి కర్హిచిత్ (మ.)

అనఁగా "తాను న్యాయ మెఱింగియుండినను పెద్దలవలన న్యాయమువి నయముగ నడుగవలయును. (నేరస్థుఁడు) పెద్దలచే శిక్షింపఁబడిన పక్షమున రాజు నశింపఁడు," అని మనువు చెప్పెను. ఈ మనుధర్మ మార్గము ననుసరించియే పెద్దలతో రాముఁడు అరణ్యమున యోజించి ధర్మనిర్ణయము చేసెను.—అంతియ కాక రాముఁడు కార్యార్థియై సుగ్రీవు నొద్దకు వచ్చెను. సుగ్రీవుని సహాయము రామునకు కావలెను. సుగ్రీవునితో అగ్నిసాక్షిగ ప్రమాణము చేసి రాముఁడు స్నేహము చేసికొనెను. వాలి సుగ్రీవునకు బద్ధవైరి. తన మిత్రుని వైరి తనకును వైరియే కద.—అందుచే వాది తనకు పరమ స్నేహితుఁడును, ప్రతివాది తనకు శత్రువును నగుటచే నట్టి తగవులు విచారించుటకు రాముఁడు న్యాయశాస్త్ర ప్రకార మర్హుఁ డగునా? కావున నెన్నివిధములఁ జూచినను ధర్మశాస్త్ర ప్రకారము రాముఁడు వాలిని సంహరించె నని రామునితో చెప్పించుట సమంజస ముగా కనఁబడదు.

రాముఁడు వాలితో యుద్ధముచేసి ధర్మయుద్ధమున రాముఁడు వాలిని సంహరించె నని చెప్పుద మనిన రాముని యుద్ధమును ధర్మసమ్మతముగా కనఁ బడదు. ఏఁలయన యుద్ధధర్మములలో మను విట్లు చెప్పెను:

శ్లో॥ ససుప్తం నవిసన్నాహం
ననగ్నం న నిరాయుధమ్
నాయుధ్యమానం పశ్యంతం
నపరేణ సమాగతమ్ (మ.)

అనఁగా- నిదురఁబోవువానిని, ఉత్సాహము లేనివానిని, దిగంబరుని, ఆయుధము లేనివానిని, యుద్ధభూమియం దెదిరింపనివానిని, (యుద్ధమును) చూచుటకు వచ్చినవానిని చంపరా దని యర్థము.— ఇప్పుడు రాముఁ డెట్టి వాలిని చంపెనో చూడుఁడు. తన తమ్ముఁ డగుసుగ్రీవునితో పోరుచున్న వాలిని చెట్టుచాటునుండి కొట్టెను. ఇది యేయంతధర్మసమ్మతమో యూహింపుఁడు.

ఇఁక నీపొంచికొట్టుటకు వాల్మీకి రామునిచే చెప్పించిన సమాధానమును చూడుఁడు.

శ్లో॥ శృణుచాప్యపరం భూయః
కారణం హరిపుంగవ
యత్ శ్రుత్వా హేతుమద్వీర
న మన్యుం కర్తుమర్హసి
నమే తత్ర మనస్తాపో
నమన్యుర్హరి యూథప
నాగురాభిశ్చ పాశైశ్చ
కూటైశ్చ వివిధై ర్నరాః
ప్రతిచ్ఛన్నాశ్చ దృశ్యాశ్చ
గృహ్ణంతి సుబహూన్ మృగాన్
ప్రధావితాన్వా విత్రస్తాన్
విస్రబ్ధాం శ్చాపినిష్ఠితాన్
ప్రమత్తాన ప్రమత్తాన్వా
నరా మాంసార్థినో భృశం
విధ్యంతి విము ఖాం శ్చాపి
న చ దోషోత్ర విద్యతే
యాంతిరాజర్షయ శ్చాత్ర
మృగయాం ధర్మకోవిదాః
తస్మా త్త్వం నిహతో యుద్ధే
మయా బాణేన వానర
అయుధ్యన్ ప్రతియుధ్యన్ వా
యస్మా చ్ఛాఖామృగో హ్యసి.

వాల్మీకి రామునిచే చూపించిన యీ మహాత్తరహేతువును తిలకింపుఁడు. వాలి క్రోఁతి యఁట. జంతువులను మాంసాభిలాషు లగురాజు లేవిధమున వేఁటాడి నను వేఁటాడవచ్చునఁట. పరమధర్మకోవిదు లిట్లు చేయుచుండిరఁట—ఇంతలో రాముని వాద మెంత బలహీనముగా మాఱెనో చూడఁడు. ఇంతవఱకును వాలిని మానవునిగా భావించి యాతఁడు తమ్ముని భార్య నపహరించె నని చెప్పి యాతని శిక్షించుటకు మనుధర్మశాస్త్రమును ప్రమాణముగాఁ జూపినవాఁడు ఇప్పు డింత వేగ ముగా వాలిని జంతువుగా మార్చుట వింతను గొలుపుచున్నది. ఇంతే కాక రాముని వెనుకటివాద మంతయు వాలిని జంతువును చేయుటలో తుడుచుకొని పోవుచున్నది. ఎట్లన, వాలిని జంతువుగనే భావించిన జంతు వగువాలిపట్ల మనుధర్మశాస్త్రమే వర్తింపదు. మనుధర్మశాస్త్రము మానవులకొఱకు వ్రాయఁబడెనుగాని, మృగముల కొఱకు వ్రాయఁబడలేదు. జంతువులు విచ్చలవిడి సంచరించునప్పుడు వావివరుసలు చూచుకొని సంచరించునా? అవునై దానిమీద పడినప్పుడు మనుధర్మశాస్త్ర

ప్రీకారము రాజు లదూడను దండించునా? ఈవాదము మఱియు పరిహాసమున కాస్పద మగుచున్నది.

నిజముగా రాముడు వాలిని మృగముగా భావించి వేటాడినను ధర్మకో విదులగు మాంసాభిలాషులు కోతులను వేటాడరు. ఏలయన క్రోతిమాంసము మాన వు లెవ్వరును భక్షింపరు. దీనిచర్మమును పనికిరాదు. దీని వెంద్రుకలుగాని, యెము కలుగాని యేపనికిని పనికిరావు. ఈ సమాధానమును వాల్మీకి వాలితో నీక్రిందివిధ మున జెప్పించియు మరల ని క్లేల తొట్రుపడియెనో తెలియదు.

శ్లో॥ అధార్యం చర్మ మే నష్భి
రోమా ణ్యస్థి చ వర్జితం
అభక్ష్యాని చ మాంసాని
త్వద్విధై ర్ధర్మచారిభిః—(కిష్కిం)
పంచపంచనఖా భక్ష్యాః
బ్రహ్మక్షత్రేణ రాఘవ
శల్యక శ్శ్వావిడో గోధా
శశః కూర్మశ్చ పంచమః
చర్మచాస్థిచ మే రాజన్
న స్ప్రృశంతి మనీషిణః
అభక్ష్యాణి చ మాంసాని
సోహం పంచనఖో హతః

వాలితో నిట్టి తెలి వైన ప్రశ్న వేయించియు రామునిచేమాత్రము సంతృప్తి కర మగుసమాధానమును చెప్పింపలేక వాల్మీకి తొట్రుపడినట్లు కనబడుచున్నది. రామునిచే పరస్పరవిరోధములగు నిన్నిసమాధానములు చెప్పించుటకంటె 'సుగ్రీవు నితో నేను మైత్రి యొనరించుకొంటిని గావున మిత్రకార్య మొనరించుట నా విధి యని యొక సమాధానము చెప్పి యూరకుండిన బాగుండెడిదేమో? యీవాలికిని రామునకును గలసంభాషణఘట్టమును వ్రాయకపోయిన నంతకంటెను బాగుండెడి దని తోచుచున్నది.

ఇవి యిట్లుండ పుత్రవతి యగుతారను, (వితంతువును,) వాలిమరణానంత రము రాముడు సుగ్రీవున కెట్లుకట్టబెట్టెనో తెలియదు. ఇది దేశాచారమేమో?

## II

## కిష్కింధ యెక్కడది?

ఇక సందేహ మేమన, కిష్కింధ యెక్క డది? దీనికి నాలుగు దిక్కులం గల నదులును, పర్వతములును, దేశములును నెవ్వి?

రాముం డరణ్యావాసమునకుం బోవునప్పుడు దక్షిణముఖముగా బయలుదేఱి సరయూనదిని దాటి మొదట చిత్రకూటమును చేరెను. అక్కడనే భరతుడు రాముని కలసికొనెను. పిమ్మట రాముడు కొన్ని ఋష్యాశ్రమములు చూచు కొనుచు, గోదావరీతీరమునం గల పంచవటియొద్ద కొంతకాలము నివసించి యక్కడ సీతను గోల్పోయెను. అటుపిమ్మట సీతను వెదకుచు దక్షిణముఖముగాం బోయి ఋష్యమూకాద్రిపై నున్న సుగ్రీవునితో స్నేహముచేసి వాలిని చంపి సుగ్రీవునకు కిష్కింధారాజ్యము నొసంగెను. దీనినిబట్టి కిష్కింధ మైసూరుప్రాంతమున నున్నదని చరిత్రకారులు కొందఱు నిర్ణయించిరి. కాని సుగ్రీవుడు సీతను వెదకుటకు వానరులను నాలుగ దిక్కులకును పంపు సందర్భమున కిష్కింధకు నాలుగుదిక్కు లం గలనదులను, దేశములను నెట్లు వర్ణించెనో చూడుడు..'

తూర్పు - శ్లో॥ అధిగచ్ఛ దిశం పూర్వాం। సశైల వన కాననామ్
తత్ర సీతాం చ వైదేహీం। నిలయం రావణస్య చ
మార్గధ్వం గిరి శృంగేషు। వనేషుచ నదీషుచ
నదీ భాగీరథీం రమ్యాం। సరయూన్ కౌశికీ తథా
కాళిందీం యమునాం రమ్యాం। యామునంచ మహాగిరిం
సరస్వతీం చ సింధుంచ। శోణం మణి నిభోదకం
మహీం కాలమహీం చైవ। శైల కానన శోభితాం
బ్రహ్మమాలాన్ విదేహాం శ్చ। మాలవాన్ కాశికోసలాన్
మాగధాం శ్చ మహాగ్రామాన్। పుండ్ర వంగాం స్తథైవచ.
(కిష్కింధాకాండ)

దక్షిణము - శ్లో॥ సహస్రశిరసం వింధ్యం। నానాద్రుమలతాయుతం 8
నర్మదాం చ నదీం దుర్గాం। మహోరగనిషేవితమ్
తతో గోదావరీం రమ్యాం। కృష్ణవేణీం మహానదీమ్ 9
వరదాంచ మహా భాగాం। మహోరగ నిషేవితమ్
మేఖలా ముత్కలం చైవ। దశార్ణ నగరా ణ్యపి
అశ్వవంతీ మవంతీం చ। సర్వ మేవానుపశ్యత 10
విదర్భాన్ ఋషికాం శ్చైవ। రమ్యాన్ మాహిషకా నపి
తథా వంగాన్ కళింగాంశ్చ। కౌశికాం శ్చ సమంతతః 11
అన్వీక్ష్య దండకారణ్యం। సపర్వత నదీ గుహం
నదీం గోదావరీం చైవ। సర్వ మేవా నుపశ్యత 12
తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ। చోళాన్ పాండ్యాన్ సకేరళాన్

పశ్చిమము- శ్లో॥ సురాష్ట్రాన్ సహబాహ్లీకాన్। శూరాన్ భీమాం స్తథైవచ
స్ఫీతాం చ న పదాన్ రమ్యాన్। విపులాని పురాణి చ
* * * *
మురచీ పత్తనం చైవ। రమ్యం చైవ జటీపురం
అవంతీ మంగ లోపాంచ। తథా చాలక్షితం వనమ్.
రాష్ట్రాణిచ విశాలాని। పత్తనాని తత స్తతః 13
సింధు సాగరయో శ్చైవ। సంగమే తత్ర పర్వతః 14
(సర్గ 42.)

ఉత్తరము- శ్లో॥ దిశం హ్యుదీచీం విక్రాంతాం। హిమశైలావతంసకాం
సర్వతః పరిమార్గధ్వం। రామపత్నీ మనిందితాం 5
తత్ర మ్లేచ్ఛాన్ పుళిందాం శ్చ। శూరసేనాం స్తథైవచ
ప్రస్థలాన్ భరతాం శ్చైవ। కురూంశ్చసహమద్రకైః
కాంభోజాన్య వనాం శ్చైవ। శకా నారట్టకా నపి
బాహ్లీకాం ఋషికాం శ్చైవ। పౌరవా నథ టంకణాన్
(సర్గ 43.)

అనగా:—

తూర్పున— 1 భాగీరథి, 2 సరయు, 3 కౌశికి, 4 కాళింది, 5 యమున, 6 సరస్వతి, 7 సింధు మొదలగు నదులును, బ్రహ్మమాల. విదేహ, మాళవ, కాశి, కోసల, మగధ, పుండ్ర, వంగ మున్నగు దేశములును కలవు.

దక్షిణమున—1 వింధ్య, 2 నర్మద, 3 గోదావరి, 4 కృష్ణవేణి, 5 మహా నది, 6 వరద మున్నగు కొండలు నదులును, 6 ఉత్కళ, 7 దశార్ణ, 8 అశ్వవంతి 9 అవంతి, 10 విదర్భ, 11 వంగ, 12 కళింగ, 13 కౌశికి, 14 దండకారణ్యము, 15 ఆంధ్ర, 16 పుండ్ర, 17 చోళ, 18, పాండ్య, 19 కేరళ.

పశ్చిమమున:— 1 సురాష్ట్రము, 2 బాహ్లికము, 3.శూరము, 4 భీమము, 5 అంగ, 6 అవంతి, 7 సింధుసాగరసంగమము మున్నగునవి.

ఉత్తరమున:—1 హిమవంతము, 2 మ్లేచ్ఛ, 3 పుళింద, 4 శూరసేన, 5 మద్ర, 6 కాంభోజ, 7 యవన, 8 శక, 9 బాహ్లిక మున్నగునవి.

పాఠక మహాశయులారా! సుగ్రీవుడు చెప్పిననాలుగుదిక్కులంగలనదులను, దేశ ములను, కొండలను మీరు చదివితిరిగదా? ఇక నీనాలుగుదిక్కులం గలదేశముల కును నడుమను గలప్రదేశ మేదో మీరే నిర్ణయింపుడు. ఇం దుదాహరింపబడిన నదులును, దేశములును గలపట మొకటి యిక్కడ చూపితిని. దీనినిబట్టిచూడపూర్వ

1. ఉత్తరదేశమున గుర్తింపబడిన కిష్కింధ వాల్మీకి చెప్పిన సరిహద్దుల మధ్యమున గలది,
2. దక్షిణమున గుర్తింపబడిన కిష్కింధ చరిత్రకారులు గుర్తించినది.

మార్యులు నివసించిన సప్తసింధుప్రదేశమునకు కొంచెముప్రక్కగా కిష్కింధ కల దని చెప్పవలసివచ్చును. తూర్పున యమున,సురక్షేత్రము,దక్షిణమున నర్మద,వింధ్య పశ్చిమమున సురాష్ట్రము సింధుసాగర సంగమము, ఉత్తరమున హిమాలయముగల ప్రదేశమును కొంచెము హెచ్చుతగ్గులలో నీపటమున గుర్తుపెట్టితిని. చరిత్ర కారులు చెప్పిన దక్షిణమునందలికిష్కింధయు, పటమున గుర్తుపెట్టితిని. ఇం దేది నిజమైన కిష్కింధ యని యిప్పుడు చదువరులు నిర్ధారణచేయవలసి యున్నది. మొదట వాల్మీకి వ్రాయుటలో రాముఁడు గోదావరీతీరము నకు వచ్చినట్లు వ్రాసెను. పిమ్మట గోదావరి తరించి యెంతో దక్షిణమునకు వచ్చి కిష్కింధను చేరెను. అట్టి కిష్కింధకు దక్షిణమున వింధ్యయు, నర్మదయు నెట్లుండు టకు వీలుండును? దక్షిణాపథమునకు తూర్పున గంగ, యమున, నదు లెట్లుండును? పశ్చిమమున సింధు-సురాష్ట్రము లెట్లుండును? ఈసరిహద్దులు చెప్పుటలో వాల్మీకి యుద్దేశమేమి?—వాల్మీకియాశ్రమము గంగానదిని దాటి కొంతదూరముపోయిన పిమ్మట నెక్కడనో యున్నట్లు సీతను లక్ష్మణుఁ డరణ్యమున దిగఁబెట్టుసందర్భ మున వాల్మీకి వ్రాసెను.ఆయాశ్రమ మీసరిహద్దుల మధ్యస్థమైయుండునేమోపాఠ కులను యోజింపఁ గోరెదను. కిష్కింధకు నాలుగుదిక్కులం గల ప్రదేశములను చెప్పుటకు మాఱుగ పొరపాటున తన యాశ్రమమునకు నాలుగుదిక్కులం గల భూములను పేర్కొనె నేమో?

## III

## రాముఁడు సీతను పరిత్యజించుట న్యాయమా?

రాముఁడు సీతను విడిచిపెట్టి నిండుచూలాలిని నరణ్యమునకు పంపివేయుట యెంతవఱకు న్యాయమో, తా నామెకు విధించిన శిక్ష యెంతవఱకు చట్టసమ్మతమో యనునది నా మూఁడవశంక. రాముఁడు రావణుని సంహరించినపిమ్మట సీతను రావించి యామెయందు తన కనుమానమున్నదనియును, అన్యపురుషునింట కొంతకాలము నివసించియున్న స్త్రీని మరల తానుగ్రహించుట ధర్మవిరోధమనియును, అందుచే సీతను తన యిచ్చవచ్చినచోటికిపోయి తన యిచ్చ వచ్చిన పురుషుని స్వీకరింపవచ్చుననియును రాముఁడు చెప్పెను. ఇదు కామె యొక్క నైర్మల్యమును పరిశోధించుటకై యామె నగ్నిప్రవేశము చేయించెను. అప్పు డామెను నగ్నిహోత్రుఁడు కనుగందకుండ, తలపూవైన వాడకుండ భద్ర ముగాఁ దీసికొనివచ్చి రామున కప్పఁజెప్పి యిట్లు చెప్పెను.

శ్లో॥ అక్లిష్ట మాల్యాభరణాః। తథారూపాం మనస్వినీం
దదౌ రామాయ వైదేహీం। అంకే కృత్వావిభావసుః
అబ్రవీచ్చ తదా రామం। సాక్షీలోకస్యపావకః
ఏషతే రామ వైదేహీ। పాప మస్యాం న విద్యతే
నైవ వాచా, నమనసా। నానుధ్యానాన్న చక్షుషా
సువృత్తావృత్తశౌండీర। నత్వామపిచ చారహ॥

అనఁగా—ఓరామా! "ఈమెయందు పాపము లేదు. ఈమె మనస్సు చేతఁగాని, వాక్కుచేతఁగాని, ధ్యానముచేతఁగాని, చూపుచేతఁగాని వ్యభిచరించి యెఱుఁగదు." అని అగ్నిదేవుఁడు సాక్ష్యమిచ్చెను. బ్రహ్మేంద్రాదులును పొగ డిరి. పిమ్మట రాముఁడు సీతను గైకొని అయోధ్యానగరము ప్రవేశించి పట్టాభిషి క్తుఁడై రాజ్యపరిపాలనము చేయుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు చారుఁడు రామునియొద్దకువచ్చి "అయ్యా! పౌరులు కొందఱు తమరు రావణునింట చిరకాల ముండిన సీతను మరల తీసికొనివచ్చిరనియును, నది నింద్యమనియును, రాజ్యమును పరిపాలించుచుండిన రాముఁడే యిట్లు చేయ ప్రజలుకూడ నట్లే ప్రవర్తించెదరనియు ననుకొనుచున్నారు," అని చెప్పెను. ఆ మాటలపై రాముఁడు తమ్ములను పిలిచి తమ్ములారా! రాజ్యములోని ప్రజలు నన్నుగూర్చియు, సీతనుగూర్చియు నే మను కొనుచున్నారో విన్నారా? ఎవని యపకీర్తి లోకమున నెంతకాల ముండునో యంతకాలమును వాఁడు నరకమున నుండును. నే నీ దుష్కీర్తిని భరింపఁజాలను. అందుచే "లక్ష్మణా! నీవు రేపు సీతను తీసికొనివెళ్లి యరణ్యమున దిగవిడిచి రమ్ము" అని చెప్పెను. తదాజ్ఞానుసారము లక్ష్మణుఁడు నిరపరాధియు, నిండు చూలాలును నగు సీతను నరణ్యమున విడనాడి వచ్చెను.

రామాయణకథ నిజముగా జరిగిన చరిత్రమే యనుకొనినచో రాముని పరిపాలనమున కిది యొకగొప్పకళంకము కాదా? ఏల యన నగ్నిసాక్షిగాఁ దాను వివాహము చేసికొనిన ధర్మపత్నిని, నిర్దోషి యని అగ్నిహోత్రునిచే నిర్ధారణ చేయఁబడిన ధర్మపత్నిని, దేవతలందఱిచే నిర్దోషి యని చెప్పఁబడిన ధర్మపత్నిని, అజ్ఞాను లనుకొను నిరాధారము లగుపలుకులను నాధారముగా తీసికొని తన యంత రాత్మకు విరోధముగా సత్యమునకు విరుద్ధముగా, వివేక విహీనులను సంతృప్తి పఱచుకొనుటకు విడిచిపెట్టునా?— దేవతలవలన కీర్తి పొగడఁబడు ననియును, దుష్కీర్తి నిందింపఁబడు ననియును రాముఁడు చెప్పెనుగదా? సీతయొక్క సహజ పాతివ్రత్యము దేవతలకు తెలియదా? అగ్నిహోత్రుని సాక్ష్యము దేవతలకు చాలదా? ఇవియన్నియు కలిగియుండియు, దేవతలుకూడ ప్రాకృతజనములచే నను కొనుచున్న మాటలను పాటించి నిష్కళంక మగు సహజసత్కీర్తిని కీర్తింపక కృత్రిమ కీర్తినే కీర్తించెదరా? సీతను విడిచిపెట్టుటవలన శ్రీరామునకు కలుగునది సత్య మైనకీర్తియా? కృత్రిమమైనకీర్తియా? రాముఁడు కృత్రిమకీర్తికై యాశపడి నిర పరాధినియనితెలిసియు ధర్మపత్నిని వీడుట న్యాయమా? ఇది కల్పిత కథయేనైన నచో వాల్మీకి యీకథపట్టున నేల యింత రసాభాస మొనరించెను? రాముఁడు శాస్త్రబద్ధుఁడ ననియును,మనుధర్మశాస్త్రము ననుసరించెదనని యును చెప్పెనుగదా? మను వెట్టిభార్యను విడిచిపెట్టుమని తనధర్మశాస్త్రమునఁ జెప్పెను. సీతవంటి నిరప రాధి యగుభార్యను విడిచిపెట్టు మని తానెక్కడను చెప్పలేదే? ఈ విషయమున ధర్మశాస్త్ర చర్చయైనను రాముఁడు చేసినట్లు కనఁబడదే? నిరపరాధ లగు స్త్రీలపై నిందలు మోపినవారిని రాజు శిక్షింపవలెనని ధర్మశాస్త్రము చెప్పుచుండఁగా నాపనిమాని నిరపరాధులను శిక్షించు టేటిన్యాయము? సీతయొక్క పాతివ్రత్యము మరల శోధింపవలె నని వాల్మీకికి బుద్ధిపుట్టినయెడల అయోధ్యలో మఱియొకసారి ప్రజలయెదుట సీతను నగ్నిప్రవేశము చేయింపరాదా?

## IV

## అహల్యాశాపవిమోచనము

ఇఁక నాల్గవ విషయ మేమనఁగా— రాముని త్రేతాయుగ పురుషునిగా వాల్మీకి వ్రాసెను. అహల్య గౌతమునిచే శపింపఁబడి శిలయై పడియుండి యీ కృతయుగపురుషుఁ డగు రామునిపాదధూళిని శాపవిముక్తి పొందినట్టును, గౌతముఁ డు రాముని పూజించినట్లును, అహల్యపుత్రు డగు శతానందుని రాముఁడు జనకు నింటఁ జూచినట్లును, రామాయణమునఁ గలదు. శతానందుఁడు కృపాచార్యునకు పితామహుఁడు. ఈకృపాచారి భారతయుద్ధకాలమునాఁటివాఁడు. పాండవుల గురువు. వీరి వంశవృక్షమును తిలకింపుఁడు.

శ్లో॥ ముద్గలస్యాపి మౌద్గల్యాః। క్షత్రోపేత ద్విజాతయః
ఏతో హ్యాంగిరసః పక్షే। సంస్థితాః కాణ్వ ముద్గలాః
ముద్గలస్య సుతో జ్యేష్ఠః। బ్రహ్మిష్ఠ స్సుమహాయశాః
ఇంద్రసేనాయతోగర్భం। వధ్యశ్వం ప్రత్యపద్యత
వధ్యశ్వా న్మిథునం జజ్ఞే। మేనకాయా మితి శ్రుతిః
దివోదస శ్చ రాజర్షి। రహల్యా సమ నూయత
శతానందం ఋషిశ్రేష్ఠం। తస్యా సుమహాయశాః
పుత్రస్య ధృతిర్నామ। ధనుర్వేదస్య పారగః
తస్య సత్య ధృతే శ్శుక్రం। దృష్ట్వాప్సరస మగ్రతః
ప్రచస్కందే శరస్తంబే। మిథునం సముపద్యత
కృపయా యచ్చ జగ్రాహ। శంతను ర్మృగయాంగతః।
కృపస్మృత స్సవై తస్మాత్। గౌతమీచ కృపీ తథా।
ఏతే శారద్వతాః ప్రోక్తాః। ఔచథ్యా గౌతమాన్వయాః




భారతయుద్ధకాలమునాఁటి కృపాచార్యుని పితామహుఁ డగు శతానం దుఁడు త్రేతాయుగమునాఁటి శ్రీరాముని కాలమున నుండుటకు లెక్కలు సరి పోవునా? వాల్మీకి యీకథ నిక్కడ ముడిపెట్టుట కేమి హేతువో? ప్రాయశః శ్రీరాముని పాదరజముయొక్క మాహాత్మ్యమును చూపుట కీకథ నిక్కడచొప్పించె నేమో?—లేక—కథ చరిత్రాత్మకము కానప్పుడును, లోకమునకు రాముని పవిత్ర తయే చూపుట ప్రధాన మైనప్పుడును నేకథ యెక్కడ పెట్టిన నేమిప్రమాదమని వాల్మీకి భావించె నేమో?

# చిత్రపటముల వివరణము

గాంధీ మహాత్ముడు:—"జగమెఱిగిన బ్రాహ్మణునికి జంధ్యమేల" యనునట్లు మహాత్మా గాంధిగారినిగూర్చి ప్రత్యేకముగా మేము వాచకులకు పరిచయము గలిగింపవలసిన పనిలేదు. ఖద్దరు నిధికిని, లజపతిరాయిగారి స్మారక నిధికిని విరాళముల బ్రోగుచేయుటకు మహాత్ముడిపు డాంధ్రమండలముల సంచార మొనర్చుచున్నారు. ప్రజలు వారికి నిండు భక్తిస్వాగత మొసంగుచు తెలుగువారి యాతిథేయ సత్కారమును క్రియాపూర్వకముగ ఋజువుపరచుచున్నారు.

కీ॥ శే॥ దేశబంధు లాలా లజపతిరాయిగారు:— మన దేశ నాయక ప్రథమ గణములయం దొకరుగ బ్రఖ్యాతి వహించిన దేశబంధు లాలా లజపతిరాయిగారి నామము 1907 సం॥రమునుండియు భారతవర్షమునందంతటను బ్రసిద్ధికివచ్చినది. పూర్వ పశ్చిమార్ధగోళములం దంతటను సంచార మొనర్చి జాతీయ అంతర్జాతీయ సమస్యల గూలంకషముగ నెఱిగిన యీ భారత రాజ్యాంగ శాస్త్రపండితుడు కలకత్తాయందు జరగిన ప్రత్యేక దేశీయ మహాజనసభ కధ్యక్షునిగ నెన్నుకొనబడి గౌరవింపబడినాడు. ఇటీవల చాల సంవత్సరములు అసంబ్లీ సభ్యత్వమును వహించి ప్రభుత్వమును తీవ్రముగ విమర్శించుచు వచ్చినారు. గొప్పవక్తయు, పత్రికా రచయితయు నైన లాలాజీ గారికి సైమనుకమీషను వారు లాహోరులో దిగినప్పు డేర్పడిన కల్లోలములో కొన్ని బలమైన గాయములు తగిలి అటుతరువాత ప్రాణములు బోయినవి. వీరి మరణమువలన భారతమాత యొకపుత్రరత్నమును గోలుపోయినది.

పండిత మోతీలాలు నెహ్రూగారు :—మొన్న కలకత్తాలో జరగిన దేశీయ మహాజనసభకును, ఆన 1919 సం॥రములో లాహోరునందు జరగిన దేశీయ మహాజనసభకు నధ్యక్షతను వహించిన పండిత మోతీలాలు నెహ్రూగారు స్వరాజ్య పక్ష నిర్మాణమునకు కీ॥ శే॥ దేశబంధు దాసుగారికి కుడిచేయిగ బనిచేసి 1923 సం॥రమునుండియు లెజస్లేటివ్ అసంబ్లీలో ప్రభుత్వ ప్రతిఘటన పక్షనాయకులుగ బనిచేయుచు దాసుగారి యనంతరమునుండియు స్వరాజ్యపక్షమునకు నాయకులుగ నెన్నుకొనబడి తమ కార్యక్రమము ననుసరించి దేశసేవ యొనర్చుచున్నారు. ఈ ధీరుని నాయకత్వముక్రింద నేర్పడిన యుపసంఘమువారు తయారుచేసిన భారత రాజ్యాంగ స్వరూపమును గూర్చిన చిత్తు ముసాయిదా అఖిలపక్షసభవారిచేతను దేశీయ మహాజనసభవారిచేత నంగీకరింపబడియున్నది.

పండిత మదనమోహన మాళవ్యగారు :—భారత రాజకీయ నాయకులందు పండిత మదనమోహన మాళవ్యగారు శాంతిదూతగ విఖ్యాతి నార్జించుచున్నారు. ప్రభుత్వమువారును బ్రజలును మెచ్చుకొనునట్లు చాల నిలుకడ గలయభిప్రాయములతో మాటల తూచి యుపన్యసించు స్వభావముగల యీ పూర్వాచార బ్రాహ్మణనాయకుడు వారణాశియందలి హిందూ విశ్వవిద్యాలయమును స్థాపించి శాశ్వతయశశ్చంద్రికల వెలయించుకొనినాడు. అస్పృశ్యతా నివారణమున కీయన యొనర్చుచున్న ప్రబోధము సంఘసంస్కరణపరాయణులకు గూడ నాశ్చర్యమును గల్పించుచున్నది.

శ్రీ సుభాష్‌చంద్రబోసుగారు :—ఐ. సి. ఎస్. పరీక్షయందు కృతార్థులయ్యు దేశసేవార్థము దొరతనోద్యోగమునకు రాజీనామాను దాఖలుచేసిన సుభాషచంద్రబోసుగారు స్వరాజ్యపక్షమువారి యాజమాన్యముక్రింద కలకత్తా కార్పొరేషన్ పరిపాలింపబడిన దినములయందు దానికి కమీషనరుగ బనిచేసినారు. ప్రభుత్వమువారిచే వీరు నిర్బంధింపబడి బందె ద్రోయబడియున్నను వంగదేశజులు వీరిని గండుమాగలు ప్రాంతిక చట్టనిర్మాణసభకు ప్రతినిధిగ నెన్నుకొనినారు. మొన్న జరగిన దేశీయమహాజనసభయందు వీ రైచ్ఛికభటాధ్యక్షునిగ నుండి బ్రశంసార్హముగ తమ ధర్మమును నిర్వర్తించినారు. వంగ యువజనులందు బాబూ సుభాషచంద్రబోసుగారిని నాయకులని చేర్కొనవచ్చును.

పండిత జవ్హారులాలు నెహ్రూగారు :—పండిత మోతీలాలు గారి యేకపుత్రులగు జవ్హారులాలు నెహ్రూగారు సహాయ నిరాకరణ ప్రారంభమున బ్యారిష్టరుపనికి రాజీనామా దాఖలుచేసి తదాగభ్యా దేశసేవయందు నిమగ్నులై బనిచేయుచున్నారు. యూరపుఖండమునం దనేకమారులు సంచారమొనర్చి అక్కడి రాజకీయపరిస్థితుల బ్రత్యక్షప్రమాణమున బరీక్ష సల్పినారు. ప్రకృతమున దేశీయమహాజనసభకు కార్యదర్శిగ నెన్నుకొనబడిన సమిష్టి వాదకోటికి జెందిన భారతీయ యువజన నాయకులు.

సర్. అబ్దుల్ రహీము సాహెబు బహద్దరువారు :—మదరాసు ప్రధాన న్యాయమూర్తిగ బనిచేసిన వీరికి వంగరాష్ట్ర ప్రభుత్వమువారి కార్యనిర్వాహకసభయందు న్యాయశాఖాపదవి యొసగబడినది. ఆయుద్యోగమును నిర్వహించినతరువాత సర్ అబ్దుల్ రహీము సాహెబు బహద్దరువారు మహమ్మదీయవాదము నవలంబించి హిందువుల యాగ్రహమునకు గురియైరి. మంత్రుల నియామకము వీరికి స్వాధీనపరచబడినను శాసనసభయందు వీరు బలమును సంపాదింపజాలియుండలేదు. సైమనుకమీషను వ్యవహారములందు ప్రభుత్వమునకు వ్యతిరేకముగ బనిచేసిరి. రానున్న చట్టసభా యెన్నికలందు బోటీ చేయ దలపెట్టక విరమించినామని వీరు ప్రచురించుచున్నారు.

తిరువాన్కూరు మహారాణీగారు (జూనియరు) :—ప్రకృతపు మైనరు రాజావారి జనని. సంఘ సంస్కరణాభిమానమున బ్రసిద్ధిని బడయుచున్న యీయమ నీ మధ్య జరిగిన భారత మహిళాసంస్కరణసభ కధ్యక్షురాలిగ నెన్నుకొని భారత స్త్రీసంఘమువా రెంతయు గౌరవించినారు.

శ్రీమతి శారదాబాయి నాయుడుగారు :—పూనా సేవాసదనమువారిచే [illegible] చేయబడిన వైద్యోపచారిణి. ఉన్నతవిద్యను బడయుట కింగ్లాండునకు వెడలిన యీమె జన్మస్థానము హైదరాబాదు.

శ్రీ అరండేలు సతిగారు :—రుక్మిణీ అమ్మాళు అను నీమె బ్రాహ్మణవనితయయ్యు దివ్యజ్ఞాన సమాజనియమముల ననుసరించి జార్జి అరండేలు అను శ్వేతముఖుని బెండ్లియాడి అంతర్జాతీయ వివాహములు మదరాసు రాష్ట్రమునందును తలయెత్తుటకు దారి చూపినది.

శ్రీమతి పద్మావతి కనకరత్నము సతిగారు :—భారతీయ విశ్వవిద్యాలయములందును, ఆంగ్లేయ విశ్వవిద్యాపీఠములందును నుత్తమ పరీక్షలయందుత్తీర్ణతనుగాంచిన యీమె కాశీయందలి స్త్రీల కళాశాల పరిశీలకురాలుగ నియమింపబడినది.

చదలవాడ ఆదెమ్మగారు :—గుంటూరు మండలాంతర్గత పేరకలపూడి నివాసులును, కమ్మ సాంఘికులు నైన కీ॥ శే॥ చదలవాడ సుబ్బయ్యగారి ధర్మపత్ని. స్వగ్రామమందలి పఠనాలయ నిర్మాణమున కైదువందల రూప్యములును, గుంటూరు కమ్మవిద్యార్థి వసతిగృహనిర్మాణమున కైదువందల రూప్యములును విరాళ మొసగి తనకు విద్యయందు గల ఆదరభావమును బ్రకటించియుండుటయగాక తనయొద్ద కరుదెంచు బీదలగు విద్యార్థుల కనేకవిధముల సాయ మొనర్చుచున్న ధర్మాత్మురాలు.

శ్రీమతి శారదాబాయిగారు :—మహారాష్ట్ర సంఘవనితలయందు పట్టభద్రతను బడసినవారిలో ప్రథమ గణనీయ మగు నీమె యిటీవల జరగిన మదరాసు విశ్వవిద్యాలయ స్నాతకసభయందు పట్టమును గ్రహించియుండెను.

శేవి కమలాక్షి పాండలేగారు :—మేజరు పాండలేగారి సతీమణి. బ్రాహ్మణేతరోద్యమాభిమానిని. ఇటీవల జరగిన ఆత్మగౌరవ యువజన సభా ధ్వజారోహణోత్సవమును జరపి గౌరవము నార్జించినది.

శ్రీమతి కమలా మీననుగారు :—శ్రీ. గోపాల మీనన్ ఎం. ఎల్. సి. గారి తనయ. చేతిబంతియాటయందు చాల ప్రవీణతను బడసి అనేక జయపత్రముల నందుకొనినది.

గౌ॥ సర్. నార్మన్ మార్జిబ్యాంక్సుగారు :—మదరాసు ప్రభుత్వమువారి కార్యనిర్వాహకసభా ప్రథమసభ్యులు. ప్రకృతపు గవర్నరుగారి యుద్యోగానంతరమున ఆక్టింగు గవర్నరుగ బనిచేయునట్లు శ్రీ సార్వభౌము లంగీకరించినారు.

శ్రీ ఘోషను ప్రభువుగారు :— ఘనతవహించిన ఘోషను ప్రభువుగారి మదరాసు గవర్నరు యుద్యోగకాలము ముగియవచ్చినది. రాజప్రతినిధి యిర్విను ప్రభువుగారు సెలవుమీద నింగ్లాండునకు బోనుండుటచే నాపదవిని వీరు తాత్కాలికముగ నిర్వహించునట్లు శ్రీ సార్వభౌము లంగీకరించినారు. చాల యుదారులనియు, సౌమ్యులనియు యీ ప్రభువు ఖ్యాతి నార్జించినారు.

గా॥ టి॥ ఇ. మాయరుగారు :— మదరాసు దొరతనమువారి కార్యనిర్వాహక సభయం దాధికసభ్యులుగ నున్నారు. నిమ్నజాత్యుద్ధారణయందు వీరి కభిమానము మెండు.

సైమనుసంఘ సంయుక్త సమావేశము :— ఇండు యిండియన్ స్టాట్యుటరీ కమిషను సభ్యులును, సెంట్రలుకమిటీసభ్యులును, మదరాసు కమిటీ సభ్యులు నున్నారు. సర్. శంకరన్నాయరు గారును, సర్. ఏ. పి. పాత్రోగారును సర్. జాన్ సైమనుగారును, మధ్య నాసీనులై యున్నారు.

గా॥ సర్. మహమ్మదు ఉస్మాన్ సాహెబు బహద్దరు వారు :— మదరాసు ప్రభుత్వమువారి కార్యనిర్వాహక సభాసభ్యులు. ఇతః పూర్వము శాసనసభాప్రతినిధిగను, మదరాసు కార్పొరేషను అధ్యక్షునిగను బని చేసి కీర్తిని బడసిన గొప్ప బ్రాహ్మణేతరోద్యమాభిమాని.

ఏ. వై. జి. క్యాంబెల్ గారు :— మదరాసు దొరతనమువారి ప్రధానకార్యదర్శియైన వీరు యిండియన్ సివిల్ సర్వీసులోనివారు.

గా॥ దీ॥ బ॥ కృష్ణమనాయరుగారు :— మదరాసు దొరతనము వారి కార్యనిర్వాహకసభయందు న్యాయశాఖాసభ్యులుగనున్న వీరు బ్రాహ్మ ణేతరపక్షనాయకులలో నొకరు. గొప్ప ధారాళాంతఃకరణము గలవారు.

విన్ సైడ్లుగారు :— మదరాసునందలి గొప్ప వగలవ్యాపారులగు పి. ఆర్. అండు సన్సువం దొకభాగస్వామి. కార్పొరేషన్ సభ్యులు.

సర్. గార్డన్ ఫ్రేజరుగారు :— బెస్టు అండుకంపెనీ యజమానులు అసంబ్లీయందును, స్థానిక శాసనసభయందును యూరపియనులపక్షముక ప్రతినిధిగ పనిచేసియుండెను.

డబ్లియు. హెచ్. లూకరుగారు :— ఆడిసను కంపెనీ యజమానులు.

సర్. జేమ్సు సింసను :— గార్డన్ వుడ్రాఫ్ కంపెనీ యజమానులు. మదరాసు యూరపియను ఛేంబరు ఆఫ్ కామర్సునకు చాలకాల మధిపతిగ బనిచేసియుండెను. ఇపు డసంబ్లీయందు సభ్యులుగనున్నారు.

సర్. అలగ్జాండర్ మార్డగల్ :— సింసను అండుకంపెనీ యజమానులు. మదరాసు రాష్ట్రీయ యూరపియను సంఘాధ్యక్షులుగను బనిచేసి యుండిరి.

సి. ఇ. వుడ్డుగారు :— స్పాక్ అండు కంపెనీ యజమానులు. మరిపు గను లెజిస్లేటివు కౌన్సిలు మెంబరుగను బనిచేసియుండిరి.

ఇ. సి. స్మిత్ గారు :— లోగడ గవర్నరుగారి అంతరంగిక కార్యదర్శిగ బనిచేసిన వీరిపుడు మదరాసు కార్పొరేషన్ కమిషనరుగ నున్నారు.

ఎఫ్. బి. వాతేన్ గారు :— దక్షిణ యిండియా యినుపదారి ఏజెంటు.

ఆరమ్ స్ట్రాంగుగారు :— హార్బరుపోర్టు ట్రస్టు సభాపతి.

శ్రీ చెన్నప్పగారు :— మైసూరు రాష్ట్రీయ లింగాయతు వర్తకులు. అక్కడి కౌన్సిలు, అసంబ్లీ సభ్యులు. బ్రాహ్మణేతరోద్యమాభిమాని.

శ్రీ నీలగిరి సంజీవయ్యగారు :— అఖిలభారత కురుభసంఘ నాయకులు. జమీందారు. వర్తకము, ఇండూరు సంస్థానమందలి మొదటితరగతి సర్దారు, స్వసంఘీయులగు ఇండూరు మహారాజావారు శర్మిష్టతో గావించిన వివాహమందు శ్రీవారికి వీరు శాసుగా దోడ్పడియున్నారు. మైసూరు అసంబ్లీయందును కౌన్సిలు నందు సభ్యులుగ నున్నారు. అక్కడి బ్రాహ్మణేతరోద్యమనాయకులు.

డి. ఎస్. మల్లప్పగారు :— మైసూరు రాష్ట్రమందలి టిప్తూరు నివాసులగు వర్తకులు. అక్కడి బ్యాంకు డైరక్టరు. లింగాయతు సంఘనాయకులు. అక్కడి అసంబ్లీ, కౌన్సిలుయొక్కయు, రిప్రజెంటు బోర్డుయొక్కయు సభ్యులు. బ్రాహ్మణేతరోద్యమమందు ఆ ప్రదేశమున ప్రాముఖ్యనాయకులలో నొకరు. అక్కడి పరిశ్రమోద్ధరణమును చాల కృషి సల్పుచున్నారు.

కొంతి రామమూర్తిగారు :— మదరాసు సైమనుసంఘ కార్యదర్శిగ బనిచేసిన వీరిపుడు మదరాసు దొరతనమువారి అభివృద్ధిశాఖా కార్యదర్శిగా బని చూచుచున్నారు. ఐ. సి. ఎస్. శాఖకు జెందిన ఆంధ్రప్రముఖులు.

సర్. పాత్రోగారు :— మదరాసు సైమను సభోపసంఘాధ్యక్షులుగ బనిచేసి ప్రశంసార్హముగ తమధర్మమును నిర్వహించినారు. బ్రాహ్మణేతరోద్యమ నాయకులలో నొకరు.

రాజసభా భూషణ చాండీగారు :— దేశీయక్రైస్తవసంఘమునకు జెందిన వీ రనేకఉద్యోగముల నిర్వహించి చివరకు మైసూరు కార్యనిర్వాహక సభా ప్రథమసభ్యులుగ నుద్యోగమునుండి విశ్రాంతిని బొందినారు. ఆ విశ్వవిద్యాలయముయొక్క ఉపాధ్యక్షులు. గొప్ప బ్రాహ్మణేతరోద్యమాభిమాని.

వి. వేంకప్పగారు :— మైసూరు రెడ్డి సంఘ ముఖ్యులైనవారు. వర్తకులు. యువజనోద్యమాభిమాని. ఇటీవల జరిగిన యువజన సభాధిపత్యమును వహించి యుండెను.

ఘనతవహించిన శ్రీ కొల్హాపురము ఛత్రపతిమహారాజు :— మహారాష్ట్రములందలి స్వదేశసంస్థానాధిపతులలో ప్రఖ్యాతివహించిన వీరిజనకుల వలెగొప్ప బ్రాహ్మణేతరోద్యమాభిమానులు.

శ్రీ పెద్దపవని రాజకుమార సాహెబుగారు :— పెద్దపవని జమీందారీకి చెందిన వీరు వెంకటగిరి మహారాజావారి జామాత.

శ్రీ మునగాలరాజావారు :— తమసంస్థాన వ్యాజ్యమునందు ప్రీవీ కౌన్సిలులో నీ మధ్య విజయమునందినారు. ఇంగ్లాండు మొదలగు పడమటి దేశము లందు సంచార మొనర్చిన గొప్పభాషాభిమాని.

శ్రీ రాజా వేంకటరామారావుగారు :— గొప్ప గ్రంథపురాతు, వేటయం దమితప్రజ్ఞగలవారు.

శ్రీ లాల్ దాసుగారు :— దీ॥ బ॥ గోవిందదాసు చతుర్భుజదాసుగారి తనయులు. గొప్పవర్తకులు.

శ్రీ బొబ్బిలి రాజావారు :— ప్రాచీన చరిత్రప్రసిద్ధిని బడసిన బొబ్బిలి సంస్థానాధిపతులు గొప్పభాషాభిమాని. సుశాంతః కరణులు. ధర్మదాత.

కీ॥ శే॥ ఆచంట సుబ్బారాయడు నాయడుగారు :— గోదావరిజిల్లా కాకినాడనివాసులు. చట్టనిర్మాణసభ్యతబడసిన బ్రాహ్మణేతరసంఘమునుచరులు. గొప్పభూస్వామి. మదరాసు బ్రాడ్వే నెం. 9 వ గృహమందు యింగ్లీషు సైకిలు అండు మోటారు యింపోర్టింగు కంపెనీని నెలకొల్పి గొప్పవర్తకమును సాగించి దీ 27-5-1924 సంవత్సరమున కాలధర్మము నొందియుండిరి.

శ్రీ చల్లపల్లి రాజాగారు :— కీ॥ శే॥ శ్రీరాజా యార్లగడ్డ అంకినీడు ప్రసాదు బహద్దరు బి. ఏ., గారి జ్యేష్ఠపుత్రులు. బ్రాహ్మణేతరపక్షస్థాపకులలో నొకరైన వీ రతండ్రి గారివలెనె ప్రకృతపు రాజాగారు నీయుద్యమాభిమానులె. కమ్మ యువకులకు వీరివర్తన మాదర్శప్రాయముగ నున్నది. గొప్ప ఉత్సాహవంతులు.

శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావు పంతులుగారు :— పడమటి గోదావరిజిల్లా లక్కవరపుకోట జమీందారులు. గొప్పభాషాభిమాని. కవి. పండితులు ఆంధ్రమున బైబిలును పద్యమయ గ్రంథముగ రచించి ప్రచురించినారు. జీసను ధర్మబోధలయెడ విశ్వాసముగల నియోగి ప్రభువు.

గా॥ సర్. కుమారస్వామిశాస్త్రిగారు :— మదరాసు ఉన్నత న్యాయస్థాన న్యాయమూర్తి. కొంతకాలము ప్రధాన న్యాయమూర్తిగను బనిచూచి యుండెను. సర్. త్యాగరాయశెట్టిగారి మరణానంతరమున మదరాసు కాస్మపాలిటన్ క్లబ్బున కధ్యక్షులుగ నెన్నుకొనబడినారు

గా॥ సర్. సి. ఎమ్. కూట్సు ట్రాటరుగారు :— మదరాసు ఉన్నత న్యాయస్థాన ప్రధాన న్యాయమూర్తి.

సర్ రామేశము పంతులుగారు :— గౌరవనీయ న్యాయమూర్తులు. ఆంధ్రులు.

రా॥ బ॥ కే. పాండలేగారు :— ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటుగను, స్మాలు కాజుకోర్టు ప్రధాన న్యాయమూర్తిగను బనిచేసిన వీ రిటీవలనె ఉన్నత న్యాయస్థాన న్యాయమూర్తిగ నియమింపబడినారు.

రా॥ బ॥ బండి వేంకట శ్రీహరిరావునాయడుగారు బి. ఏ. బి. ఎల్ :— తూర్పుగోదావరిజిల్లా యేజెన్సీ రెడ్డిపోలవరములో జన్మించి రాజ

మండ్రియందు విద్యాభ్యాసమొనర్చి విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, నెల్లూరుజిల్లాలో డిప్యూటీ కలెక్టరుగ బనిచేసి గత సంవత్సరము యేప్రియలు నెలలో చెన్నపట్టణమునందు ప్రెసిడెన్సీ మూడవ మేజిస్ట్రేటుగా నియమింపబడియు మూడుసంవత్సరము లా యుద్యోగమందుండ నక్కరలేకుండ యిపుడు ప్రమోషనుమీద లాండు రెవిన్యూ అసిస్టాంటు సెక్రటరీగా నియమింపబడియున్నారు. ది॥ బ॥ రాఘవయ్యగారి తరువాత యీ పదవికివచ్చిన ఆంధ్రులు వీరే. గుడివాడ ఉద్యోగీయ తాలూకాబోర్డు ప్రెసిడెంటుగనున్నపుడు నిమ్నజాత్యుద్ధరణమునకును విద్యాభివృద్ధికిని ప్రజాసౌకర్యముల పెంపొందించుటకును చాల పాటుపడియుండిరి. విశాఖపట్టణము హార్బరు అసిస్టెంటు కలెక్టరుగా బనిచేయునప్పుడు దొరతనమువారు వీరికి 'రావుబహద్దరు' బిరుదము నొసగి సత్కరించినారు. వీరిపేరిట శ్రీ హరిపురమని అట నొకగ్రామమును కట్టించబడియున్నది. గుడివాడ మదినేపల్లిగ్రామములో శ్రీ హరి మిడిల్ స్కూలును, కపిలేశ్వరపురములో నొకమిడికల్ స్కూలును, వీరిగా రవార్థము నిర్మింపబడియుండుటయగాక ప్రజలయొద్ద సుమారు రు 40000 లు చందాలు ప్రోగుచేసి కట్టింపబడిన పెద్దసత్రమును వీరిచే తెరువబడినది. మొత్తముమీద పురోభివృద్ధికి వచ్చుచున్న ఆంధ్రులలో వీరి నొకరిని తలంచవచ్చును.

ది॥ బ॥ తణికాచలము శెట్టిగారు :—బ్రాహ్మణేతరోద్యమ నాయకులలో నొకరగు వీ రిటీవలనే దొరతనము వారిచే మదరాసు స్మాలుకాజుకోర్టు ప్రధాన న్యాయమూర్తిగ నియమింపబడియున్నారు.

డి. అప్పారావుగారు :—ది॥ బ॥ దురుశేటి శేషగిరి రావుపంతులుగారి తనయులు 'బారిష్టరు' మదరాసు హైకోర్టులో అసోసియేటింగు రిజిస్ట్రారుగానున్నారు.

రావుబహద్దరు మానెం చెంగల్వరాయలు నాయడుగారు :—నారాయణస్వామినాయడుగారి తనయులు మదరాసు క్రైస్తవకళాశాలయందు విద్యనభ్యసించి యింగ్లీషు తెలుగు భాషలను మెదటిబహుమానము నందుకొనినారు. స్కాటులండులోని అలక్ బ్రిడ్జియందు వారమురోజులు వీరు రెవరండు విలియముమిల్లరు ఎం.ఏ.ఎల్., ఎల్. డి. సి. ఐ. ఇ (మదరాసు క్రిస్టియన్ కాలేజి ప్రిన్సిపలు) గారి అతిథిగనుండిరి. ఎంట్రన్సు పి. డబ్లియు. డి. బ్రాంచి అకౌంటెంటు డివిజనులు అకౌంటు పరీక్షలందును విజయము నార్జించియుండిన వీరు బర్మా పి. డబ్లియు. డి. యందు అకౌంటెంటుగా నియమింపబడెను. డబ్లియు. ఎఫ్. బాగ్ గారు భారోపనగణా అకౌంటుల విషయమున వ్రాసిన నివేదికయందు వీరినిగూర్చి యిట్లు వ్రాయబడియున్నది. "ఈప్రాంతపు అకౌంట్లయందు చాలఅభివృద్ధిగాన వచ్చుచున్నది, ప్రకృతపు ఎమ్. సి. నాయడుగారి పరిశ్రమయే దానికిఫలము కార్యాలయమును చక్కగాను, పరిశుభ్రముగా నుంచుటయందును లెక్కలపుస్తకములను వరుసక్రమముగ నుంచుటయందును, నాత్యంత సమర్థులు" న్యాయశాస్త్రమును జదువ 1903 లో వారింగ్లాండునకు జనిరి. 1905 లో బ్యారిస్టరీయందు త్తీర్ణులై ఆసంవత్సరమే తిరిగివచ్చి 1906 లో మదరాసు హైకోర్టులో బ్రవేశించినారు. అటుతరువాత బర్మా ఛీఫ్ కోర్టులో (యిప్పుడున్నత న్యాయస్థానము) న బ్రవేశించినారు. రోమను న్యాయశాస్త్ర సంగ్రహమును రచించి అప్పటి ప్రధాన న్యాయమూర్తిగారికి దాని నంకితము నొసంగియుండిరి. రాజ కుటుంబములోని వేల్సుయువరాజుగారు దీనిని వీక్షించి యిదిలోకోత్తరమైనదని ప్రశంసించినారు. మదరాసునందొకప్పుడు ప్రధానన్యాయమూర్తిగనుండిన సర్. వ్వహాబుగారుకూడ "దీని యుద్దేశమును నెరవేర్చుచుండుయగాక రోమను లాయొక్క పఠనమునకును యీ గ్రంథము తోడ్పడుచున్నది." అంగూను హైకోర్టు జడ్జి డక్ వర్తుగారు రిట్లు ప్రశంసించినారు:— "రోమను లానుగూర్చి మీరు వ్రాసిన గ్రంథమును చూచినాను. విద్యార్థులకిది చాల యుపయోగకరము." మదరాసు విశ్వవిద్యాలయమువారి మెట్రిక్యులేషన్ పరీక్షా తెలుగు పాఠ్యగ్రంథములమీద వీరనేకమారులు వ్యాఖ్యానముల బ్రచురించియున్నారు. ఇందు అనేకమంది ఉన్నతోద్యోగులు అసంబ్లీ సభాసభ్యునిగ నెన్నుకొనబడినారు. అనేకమత సాంఘిక, సారస్వతోద్యమములతోడను వీరికి సంబంధము కలదు. వీరికి 1906 వం॥రములో దొరతనమువారు 'రావుబహద్దరు' బిరుదము ననుగ్రహించినారు.

బ్యారిష్టరు లింగము వీరభద్రయ్య చౌదరీగారు బి. ఏ. (ఆక్సుఫర్డు) :—కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా బొమ్మలూరు గ్రామవాస్తవ్యులు. కమ్మవారు ప్రకృతమునిక్ కంటాక్సు సర్వీసు లోనున్నారు.

రా॥ సా॥ బి. మహాబల హెగ్డెగారు :— వీరు మంగళూరుమ్యునిసిపల్ చేర్మనుగను, మదరాసు శాసననిర్మాణ సభాసభ్యులుగను బనిచేసి ప్రకృతము పబ్లికు ప్రాసిక్యూటరుగ నియమింపబడియున్నారు. ఆజిల్లాబోర్డునకు యెన్నికమూలమున అధ్యక్షపదవిని సంపాదించినారు.

పోకల గోవిందరావు నాయడుగారు బి. ఏ, బి. ఎల్ :— రాజమండ్రి తాలూకాబోర్డు అధ్యక్షునిగ కొంతకాలము పనిచూచినతరువాత వీ రిపుడు తూర్పుగోదావరి జిల్లాబోర్డుఅధ్యక్షులుగను, రాజమండ్రి మ్యునిసిపల్ చేర్మెన్ గను యెన్నుకొనబడినారు. మంచి సమర్థులు. గొప్ప బ్రాహ్మణేతరాభిమాని రాజనీతిపరులు.

శ్యామకుమారీ నెహ్రూకన్య :—పండిత మోతీలాలు నెహ్రూ గారి కుటుంబములోనిది. న్యాయశాస్త్ర పరీక్షయందు కృతార్థురాలై సర్. తేజబహద్దరు సప్రూగారియొద్ద తరిబియతు నొందుచున్న విదుషీమణి.

చంద్రాబాయి పంత్లకన్య :—కీ॥ శే॥ గోపాలకృష్ణ ఘోక్లేగారి మేనకోడలు. పుహాకోర్టులో న్యాయవాదవృత్తి నొనర్చుట కీమెకు బొంబాయి హైకోర్టువా రనుజ్ఞ నొసంగినారు.

పవిత్రము కన్య :—విద్యాసంఘ ప్రముఖురాలు. కొచ్చిను చట్టసభయందు ప్రతినిధిగ నియమింపబడియుండెను.

శ్రీ భాగీరథీ అమ్మాళు :—చెంగల్పట్టుజిల్లా విద్యాసంఘమునందు సభ్యురాలిగ నియమింపబడిన యీమె శ్రీమతి రుక్మిణీ అరండేలుగారి సోదరి.

కీ॥ శే॥ గోమేధికము ఓం శ్రీ శంకరస్వాములవారు :—దేవాంగ కులగురువులగు వీరు దత్తమండలముల 1865 సం॥ రమున ప్రముఖ దేవాంగకుటుంబమున జననమొంది, సంస్కృతాంధ్రములందును. జ్యోతిశ్శాస్త్రమునందును, వేదాంతమునందును ప్రజ్ఞనార్జించి, బాల్యమునుండియు దేవాంగ వంశోద్ధారణమునుగూర్చి సర్వదాపాటుపడుచు హంపి, హేమకూటమఠాధిపతులవలన గురుత్వాధికారమును బొంది ఆసేతుహిమాచలపర్యంతము ఏకచ్ఛత్రాధిపత్యముగ శిష్యసంచారమొనరించిరి. ఆ సంచారములో దేవాంగకులజులుగల ప్రతి స్థలమునకును శ్రమను పాటించకుండపోయి మతప్రబోధమొనర్చి కొంతకాలమునకు నెల్లూరుజిల్లా గంగవరము గ్రామమందలి వారిమఠమువద్ద స్థిరనివాసమేర్పచుకొని తమ కుమారుల విద్యాభ్యాసమునకై నెల్లూరునకు మకామును మార్పవలసినవారైరి. అక్కడి దేవాంగకుటుంబము వీరియొక్కరిదే యయ్యు సమస్తజనులు వీరిని గౌరవించుచుండెడివారు. స్వకులజులెవ్వరక్కడికివచ్చినను, వారి నుచితవిధమున సత్కరించుచు నిరంతర శివపూజలతోడను పరోపకారములతోడను శమదమాది సద్గుణములతోడను కాలక్షేప మొనర్చిరి. వీరికిరువురుపుత్రులు. అందు జ్యేష్ఠులు ఓం. శ్రీ. చంద్రమౌళీశ్వరస్వామిగారికి హంపీ హేమకూటమునందు దేవాంగగురు పట్టాభిషేక మొనర్పబడినది. శంకరస్వాములవారు క్రోధననామసంవత్సరమందు లింగైక్యమయినారు. వీరి భౌతిక దేహము గంగవరమునందలి వారి మఠమునందే స్థాపితమై నిత్యారాధనలు జరిపింపబడుచున్నవి.

వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు :— కీ॥ శే॥ రామస్వామిశాస్త్రిగారి తనయులు గ్రంథక్రయ ప్రకటన వ్యాపారము. 'త్రిలింగ' అను నాంధ్రవారపత్రికను 'ఫెడరేటెడు యిండియా' అను నాంగ్ల వారపత్రికను సంపాదించుచున్నారు. ఆనరరీ మేజిస్ట్రేటు. స్నేహపాత్రులు.

దంతనాల నాగేశ్వర శాస్త్రిగారు, పండిత:— వీరిజన్మస్థానము గుంటూరు మండలము. సంస్కృతాంధ్రభాషలందు సాహిత్యప్రజ్ఞను సంపాదించి కీ॥ శే॥ కాటమరెడ్డి ఆదినారాయణరెడ్డిగారి ప్రోత్సాహమున నెల్లూరు జిల్లా కోవూరులో సాగింపబడుచువచ్చిన గీర్వాణపాఠశాలయందు చాలకాలము ప్రధాన పండితులుగ బనిచేసినారు. గీర్వాణాంధ్ర భాషలలో నిర్దుష్టమైన శాస్త్రీయకవితాధోరణి ననేకగ్రంథములవ్రాసి ముద్రింపించినారు. ఆయుర్వేద వైద్యమునం దభిమానమునువహించి వైద్యభూషణ, వైద్యరత్న, కవిరాజపరీక్షలందుత్తీర్ణులైనట్లు అఖిలభారత వైద్యసమ్మేళనము వారియొద్ద జయపత్రికలనందుకొనినారు. శ్రౌత స్మార్తాదివిద్యలయందు ఘనపాండిత్యమును సంపాదించియు సంఘసంస్కరణమునం దాదరమును వహించి విశ్వబ్రాహ్మణయువకుల కాదర్శనులుగనున్నారు, మార్గ శైవమతాభిమాని. గొప్పవక్త. అఖిలభారతీయ విశ్వకర్మ బ్రాహ్మణ రక సంఘము (ది ఆల్ యిండియా విశ్వకర్మ లిబరల్ ఫెడరేషన్) వారు వర

పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లులో జరిగించిన 14 వ ఆంధ్రరాష్ట్రీయ విశ్వబ్రాహ్మణసభాధిపత్యమును వహించినారు కృష్ణాజిల్లా బెజవాడనుండి ప్రకృతము "విజ్ఞాన వల్లరి" యను పేరిట నొకపత్ర పత్రికను సంపాదించి ప్రకటించుచున్నారు. సక్రమశాస్త్రీయ బ్రాహ్మణోత్కర్షోద్యమాభిమాని.

కే. వి. మీనన్‌గారు :—'జస్టిస్' పత్రికయొక్క సంపాదకునిగ చాలకాలము పనిచేసిన వీరిప్పుడు దాని కార్యనిర్వాహకులుగనున్నారు. యువకులు ఆత్మగౌరవోద్యమాభిమాని.

రాజకుమార ముత్తయ్యశెట్టిగారు :—గౌ॥ శ్రీరాజా సర్ అణ్ణామలై శెట్టివారి తనయులు. నగరత్తారు సంఘమునందు బి.ఏ., పట్టమును సంపాదించినవారిలో ప్రథములు. మదరాసుకార్పొరేషను సభ్యులు. స్నేహపాత్రమైన యుత్సాహమును దయాంతఃకరణమును పురోభివృద్ధియు గల యువకులు.

సాములపాటి వేంకటకృష్ణయ్య చౌదరీగారు :—బాపట్లతాలూకాబోర్డు అధ్యక్షులు లక్ష్మీయిన్సూరెన్సు కంపెనీవారి ఆంధ్రయేజంటు. గొప్ప బ్రాహ్మణేతరోద్యమాభిమానముగల కమ్మయువకులు.

దావులూరు మునిరత్నమునాయడుగారు :—కమ్మవారు రా॥ బ॥ బి. మునుస్వామినాయడుగారి మేనల్లుడు, తిరుత్తని యూనియనుబోర్డు అధ్యక్షులు. కార్వేటినగరము తాలూకాబోర్డు ఉపాధ్యక్షులు.

శ్రీయుతులు డి ఏ. ఆదినారాయణయ్య, డాక్టరు డి. ఎస్. పుట్టన్న, ఎమ్. చన్నబసవయ్యగార్లు :— ఆదినారాయణయ్యగారు, గొప్పవ్యాపారులయిన డి. అడెప్పగారి జ్యేష్ఠకుమారుడు. ప్రస్తుతము బెంగుళూరులో నున్న దేవాంగ బ్యాంకికి కార్యదర్శిగనుండి తదభివృద్ధికై పాటుబడుచున్నారు. రెండవవారు దేవాంగులు భీష్మాచార్యులు, దొడ్డబళాపురము నివాసులునైన కొంగాడియప్పగారి సోదరుడగు డా॥ పుట్టన్నగారు. వీరు బెంగుళూరునందుండు విక్టోరియా హాస్పిటలునందు ఛీఫ్ సర్జనుగా నున్నారు. వీరిని నూతన వైద్యవిధానములను తెలిసికొనివచ్చుటకు యూరపునకు మైసూరు ప్రభుత్వమువారు రెండు మారులు పంపియున్నారు. మూడవవారు ఉరవకొండ నివాసులును, సుప్రసిద్ధ దానశీలురును, ప్రసిద్ధ వ్యాపారులును అగు రా॥ సా॥ మిడతల హంపయ్య ఎం. ఎల్. సి. గారి సోదరులగు చన్నబసవయ్యగారు. విద్యాభిమానము, కులాభిమానము వీరిస్వత్వములు.

రా॥ బ॥ జి. వేంకటపతి నాయడుగారు :—గొప్పస్నేహపాత్రులు. అనేక ధార్మికోద్యమములతో సంబంధము కలదు. ఇంగ్లండు మున్నగు పడమటిదేశములందును సంచారము నొనర్చియున్నారు.

అమరావతీ చిత్రములు :—కళ, ఆధ్యాత్మికానుభవాన్ని చిత్రరూపేణ ప్రదర్శిస్తుంది: ఇది హైందవసాంప్రదాయం. శిల్పిదృష్టి ఎక్కడ సౌందర్యలవం ఉంటే అక్కడ నాటుతుంది, అతని హృదయం ఏగంభీరమైన చోంపలాగినా జారుతుంది, అతడు కళాసౌభాగ్యం ఎక్కడలభిస్తే అక్కడ తన్మయుడైపోతాడు దానిలో విలీనమౌతాడు. అందుచేత శిల్పికి సీమతో పనిలేదు. కాని విమర్శకుడు దేశకాలపాత్రలను పరిశీలిస్తాడు. విమర్శకుని దృష్టి వేరు. ఇతని ఆశయం వేరు ఇప్పటి విమర్శకులు కళాసాంప్రదాయాలను మహారాష్ట్ర, వంగ, ఆంధ్ర, అనే విభజనలుచేసి మొత్తంగా హైందవకళ అని గణిస్తున్నారు. ప్రస్తుతం ఆంధ్రశిల్పంగురించిఅజంతాగుహాలలోదాగి ఒదిగిన కళాకౌశల్యం ఆంధ్రతేజస్సును వెల్లడిస్తుందా? అనే ప్రశ్నకు నూటియైనజవాబు లేకపోవచ్చును, కాని అమరావతీ శిల్పాలలో ప్రతిబింబించే కళాసంపత్తి ఆంధ్రులకళానైపుణ్యాన్నే చాటుతుంది అని నిర్ధారణచేయవొచ్చును. తార్కాణలు: అమరావతి ఆంధ్రదేశం హృదయంలో వుంది, బెజవాడపైన ఇరవై మైళ్లదూరంలో కృష్ణా దక్షిణ తీరాన్న వున్నది. హ్యూనట్సాంగ్ ఏడవశతాబ్దంలో ఆంధ్రదేశాని దర్శించేటప్పటి అమరావతి పాడుపడినది, పులుమాయిశాసనాన్ని బట్టి, నాగార్జునుని పేరువుండడాన్నిబట్టి చూస్తే అమరావతీ కట్టడం క్రీస్తుశకం రెండవశతాబ్దానికి పూర్తికావలె. కాని స్థూపనిర్మాణం నిస్సందేహంగా అంతకు పూర్వానిదే. ఆనాటి ఆంధ్రదేశము బౌద్ధ సాంప్రదాయాలను అనుసరిస్తున్నా ఆత్మతేజస్సుతో అపూర్వమైన అమరావతీ విద్యాపీఠాన్ని స్థాపించి మైళ్లవైశాల్యంగల ధాన్యకటక నగరాన్ని అమరావతీ ప్రక్కనేనిర్మించి విజ్ఞానానికి తావైనది- ఆనాటి ఆంధ్రతేజస్సు కళానైపుణ్యం ఆ అధ్యాత్మిక వింత అనుభవాలు అమరావతీ శిల్పాలలో నేటికికూడా జీవిస్తూ వున్నవి. అమరావతీ శిల్పాలలో సజీవంగా నిల్చిపోయిన అవయవశోభా, విన్నాణమూ, వొంపులూ, ఆ ఊర్ధ్వశరీరాల ఏపూ పోలికలు ఈనాటి పల్నాటి స్త్రీపురుషులలో కనిపిస్తూవున్నవి- ఈవాదాన్ని బలపరచే పాశ్చాత్యపరిశోధనల విమర్శనలు-

"బయటి కట్టడముమీది శిల్పము అశోకునికాలమునాటి శిల్పత్వాన్ని యనుసరించినా, అపొందిక పూర్తిగా నూతనంగా వున్నది"

"గుంపులుగా చేర్చడము సాంప్రదాయానుసరణం అయినా ప్రత్యేకంగా వున్న విగ్రహాల నిర్మాణంలో నూతన విధానాలు ప్రబలినవి." ఈవిమర్శన వాక్యాలు, ఇంకా విగ్రహాలలో వున్నా ప్రత్యేకతా పరిశీలిస్తే, 'ఆంధ్ర' యనే నామకరణం కళా ప్రపంచములో ప్రత్యేకంగా కాపాడవలెనంటే కళాపోషకులు ముందుగా దృష్టిని అమరావతీ శిల్పాలవైపు త్రిప్పవలసివుంటుంది.

# అచ్చు బైండింగు ఆఫీసులకు వలయు మంచి మిషనులు



ఇచ్చట చక్కని తెలుగు, అరవ, ఇంగ్లీషు అక్షరములు రకరకములు దొరకును.



2 ½ తిగతో కట్టు మిషను 1/3 అంగుళము దళసరికి యున్న చిన్న పుస్తకములు దీనితో కట్టవచ్చును.

## ముద్రాలయముల కావశ్యకములగు
## నన్ని తరగతుల మిషనులు మావద్ద లభించును.



“మోనోపోల్” ఫైన్ ఆఫ్ ప్లేటెన్ మాడల్ సిద్ధముగ నున్నది. క్రౌన్ ఫోలియో.

మీకు గావలసినవాని నన్నింటిని, సరసమైన ధరలకు మావద్దనే కొని, మీ డబ్బును దుర్వ్యయ మొనర్పక కాపాడుకొనుడు.

ఉత్తర ప్రత్యుత్తరములు సక్రమముగ జరుపబడును.

దైవవిగ్రహముల యెలక్ట్రో బ్లాకులు తయారుచేయుట మా ప్రత్యేక ఘనత.



“ఎ. బి. ఆర్” గిల్లోటిన్ పేపరుకట్టింగు మిషనులు 20, 24 అంగుళములు సైజు మిషనులు సిద్ధముగ నున్నవి.



లీవరుగలిగి చేతిలో పనిచేయుటకు వీలైన పర్ఫొరేటింగు మిషను దీనికి వలయు విధానముల అడ్జస్టు చేసికొనుట కవకాశము కలదు.



**12345**

నెంబరువేయు మిషను. “కమర్షియల్” డూప్లికేట్ అంకెలు మున్నగునవి వేయుటకును అనుకూలముగ నున్నది.

Tel. Add: NELSON MADRAS.

# NELSON & CO,

**Fine Art Type Foundery,**
**62, SWAMI PILLAI ST.,**
**Choolai, Madras.**

Telephone: No. 2722

# *Friends & Co.*

**BEZWADA**

## ఫ్రెండ్సు అండు కో.,

**బెజవాడ.**

**Watch Repairing a Speciality**

## *Wholesale and Retail Watch & Clock Merchants.*

ఉత్తర సర్కారులలో గొప్ప గడియారముల షాపు.

గడియారముల మరమ్మత్తు నమ్మకముగా చేయబడును.



**Suppliers to all Local Boards and Municipalities**

తాలూకాబోర్డులకు, జిల్లాబోర్డులకు, మునిసిపాలిటీలకు గడియారముల సప్లయిదారులు.



If you are satisfied tell your Friends. If you are not tell us. We will be highly obliged.
Friends & Co,
Bezwada.

మా ఖాతాదారులు అనేకులు మా గడియారముల నాణెమును వేనోళ్లపొగడుచున్నారు.

**IMPORTANT:** ముఖ్యగమనింపు :

With great pleasure we beg to inform you that we are in direct connections with most of the factories in Switzerland and Germany and that we are the authorised dealers in

**Westend Watches, Eberhard Watches, Workhard Watches, Galco, Electa, etc.**

వెస్టెండు గడియారములు, ఎబరుహార్డు గడియారములు, వర్కుహార్డు గడియారములు, గాల్కో, ఎలెక్ట్రా మొదలయిన గడియారములు ఎల్లప్పుడు అమ్మకమునకు సిద్ధముగా నుండును. టైంపీసులు, గోడ గడియారములు అన్ని రకములు మావద్ద దొరకును.

Do you wish to possess a First rate Watch? "Friends" Will Satisfy you.
Friends & Co.,
Bezwada.

నమ్మకమగు గడియారము మీకు కావలయునని వెంటనే ఫ్రెండ్సు అండు కో., బెజవాడకు ఒక కార్డు వ్రాయుడు.







## A Challenge

**Telephone No. 5 Bezwada.**

We are in a position to quote such competitive prices as you will not find elsewhere and we are sure you are likely to find what you want from our stock.

**Telegrams "Friends" Bezwada.**

*Write to day & judge the truth of our Statement.*

## FRIENDS & Co., *Bezwada.*



Never too young. Never too old.

TO DRINK

# POLSON'S FRENCH COFFEE.




ఒక లోటా పోల్సన్సు ఫ్రెంచి కాఫీ కన్నను మంచి ఆరోగ్యకరమగు హాయి నొసంగునది మరి యింకేదియు లేదు. ఇది అనుభవజ్ఞులచే ప్రపంచమున లభించగల మేలురకమును, జాగ్రతగ పరిశీలించి, వేపి, చేతితో తాకక, ప్రత్యేక యంత్రములతో పొడి చేసి, శాస్త్రీయముగ సువాసనను చెప్ప బంగీ చేయబడిన కాఫీ. అందువలన దాని రుచియు, పరిమళమును ఎల్లప్పుడు చక్కగ నుండును. ఇన్ని సుగుణములున్నను దాని క్రయము మాత్రము తక్కువరకములకన్నను మరేమియు హెచ్చుగ లేదు.

పోల్సన్సు ఫ్రెంచి కాఫీని మీ రింతదనుక పరీక్షించకుండిరయెడల, నొక్కమా రట్లు చేసిచూడుడు. అప్పుడు దాని సుగుణము నిఘంటువందుండు మాటలన్నిటి కన్నను తనంత దాని ఘనతను ప్రకటపరచును.

ప్రతి పౌను డబ్బాయందును విలువగల ఒక బహుమతి టిక్కెట్టు ఉండును. ఉచిత బహుమతుల జాబితాకు వ్రాయుడు.

**Messrs. THE POLSON MFG. CO., Dept: S. A. 29.**
**G. P. O. BOX NO. 179, MADRAS.**

